# శ్రీ నందననామ సంవత్సరం పుష్య మాసం, శుక్ల పక్షం

1952 జనవరి

| ఇం. తేది | సౌర తేది | తిథి | | గం. ని. | నక్షత్రం | | గం. ని. | వర్జ్యం | మొ. గం. | వ. గం. | గ్రం | విశేషములు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 18 | 4 గు | పా | ఉ | 7-46 | పూ.షా | తె | 3-15 | ప | 1-29 | 3-1 | సి | |
| | | వి | తె | 6-8 | | | | | | | | |
| 19 | 5 శు | త | తె | 4-9 | ఉ.షా | రా | 1-55 | ప | 10-48 | 12-18 | సి,మ | |
| | | | | | | | | తె | 5-39 | | | |
| 20 | 6 శ | చ | రా | 1-58 | శ్రవ | తె | 4-24 | శే. వ. ఉ | | 7-9 | సి | |
| | | | | | | | | తె | 4-8 | 5-38 | | |
| 21 | 7 ఆ | పం | రా | 11-25 | ధని | రా | 10-46 | తె | 5-27 | 6-56 | మ,సి | |
| 22 | 8 సో | ష | రా | 8-51 | శత | రా | 9-15 | తె | 3-0 | 4-30 | సి | |
| 23 | 9 మం | స | సా | 6-14 | పూ.భా | రా | 7-27 | తె | 4-28 | 5-58 | మ,అ | |
| 24 | 10 బు | అ | సా | 3-49 | ఉ.భా | సా | 5-57 | తె | 5-19 | 6-50 | సి,ఉ | తిథిద్వయం, |
| 25 | 11 గు | న | ప | 1-38 | రేవ | సా | 4-41 | — | | — | సి | |
| 26 | 12 శు | ద | ప | 11-47 | అశ్వి | వ | 3-40 | ప | 11-50 | 1-22 | అ | |
| | | | | | | | | రా | 1-2 | 2-35 | | సర్వవైకుంఠఏకాదశి |
| 27 | 13 శ | ఏ | ప | 10-26 | భర | వ | 3-1 | తె | 2-54 | 4-29 | సి | |
| 28 | 14 ఆ | ద్వా | ప | 9-32 | కృత్తి | ప | 2-46 | — | — | — | సి | |
| 29 | 15 సో | త్ర | ప | 9-0 | రోహి | ప | 2-59 | ఉ | 6-55 | 8-32 | అ | |
| | | | | | | | | రా | 8-46 | 10-25 | | |
| 30 | 16 మం | చశి | ప | 9-11 | మృగ | సా | 3-41 | రా | 8-31 | 10-12 | సి,మ | |
| 31 | 17 బు | పూ | ప | 9-46 | ఆర్ద్ర | సా | 4-59 | తె | 5-49 | — | సి | |
| | | | | | | | | శే వ.ఉ | | 7-32 | | |

1953 జనవరి

# శ్రీ నందననామ సంవత్సరపు పుష్య మాసం, కృష్ణపక్షం

| ఇం. తేది | సౌర తేది | తిథి | | గం. ని. | నక్షత్రం | | గం. ని. | వర్జ్యం | మొ. గం. | వ. గం. | | విశేషములు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 18 గు | పా | ప | 10-44 | పున | సా | 6-40 | తె | 3-22 | 5- 6 | అ | |
| 2 | 19 శు | వి | ప | 12- 2 | పుష్య | రా | 8-45 | | — | — | మ | |
| 3 | 20 శ | త | ప | 1-44 | ఆశ్లే | రా | 11-10 | ప | 10-50 | 12-36 | మ,అ | |
| 4 | 21 ఆ | చ | సా | 4-22 | మఖ | రా | 1-46 | ప | 12-28 | 2-14 | మ,సి | శూన్యతిథి |
| 5 | 22 సో | పం | సా | 5-54 | పుబ్బ | తె | 4-25 | ప | 10-39 | 12-25 | సి | |
| 6 | 23 మం | ష | రా | 7-33 | ఉత్త | పూర్తి | | ప | 12-21 | 2- 7 | అ | |
| 7 | 24 బు | స | రా | 9-27 | ఉత్త | ఉ | 6-52 | సా | 4- 2 | 5-46 | ఆ,మ | |
| 8 | 25 గు | అ | రా | 10-58 | హస్త | ప | 9- 2 | సా | 5-38 | 7-20 | సి | |
| 9 | 26 శు | న | రా | 12- 9 | చిత్త | ప | 10-48 | సా | 4-41 | 6-22 | సి | |
| 10 | 27 శ | ద | రా | 1- 7 | స్వాతి | ప | 12- 8 | సా | 5-55 | 7-34 | అ | |
| 11 | 28 ఆ | ఏ | రా | 1-29 | విశా | ప | 12-57 | సా | 5- 0 | 6-37 | మ | సర్వ ఏకాదశి |
| 12 | 29 సో | ద్వా | రా | 1-14 | అనూ | ప | 1-15 | సా | 6-50 | 8-25 | సి | |
| 13 | 30 మం | త్ర | రా | 12-25 | జ్యేష్ఠ | ప | 1- 6 | రా | 8-57 | 10-31 | మ,అ | |
| 14 | 1 బు | చశ | రా | 11- 7 | మూల | ప | 12-26 | ప | 10-53 | 12-27 | మ,అ | ఉత్తరాయణ పుణ్య |
| | | | | | | | | రా | 9-41 | 11-13 | | కాలము |
| 15 | 2 గు | అ | రా | 9-32 | పూ.షా | ప | 11-30 | రా | 7- 5 | 8-36 | సి | అమావాస్య. |

## శ్రీ నందననామ సంవత్సరం మాఘమాసం, శుక్లపక్షం

1953 జనవరి

| ఇం. తేది | సౌర తేది | తిథి | | గ. ని. | నక్షత్రం | | గ. ని. | | వర్జ్యం మొ. గ. | వ. గ. | | విశేషములు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | 7-38 | ఉ,షా | ప | 10-20 | ప | 2- 6 | 3-36 | సి,మ | మాఘస్నానారంభం |
| 16 | 3 శు | పా | రా | 5-30 | శ్రవ | ప | 8-52 | ప | 12-32 | 2- 2 | సి | |
| 17 | 4 శ | ది | సా | 3- 0 | ధని | ఉ | 7-18 | ప | 2- 0 | 3-29 | మ,సి | తిథిద్వయం (3-4) |
| 18 | 5 ఆ | త | ప | | శత | తె | 5-37 | | | | | |
| | | | | 12-32 | పూ,భా | తె | 3-57 | ప | 11-34 | 1- 4 | సి | |
| 19 | 6 సో | చ | ప | 10- 7 | ఉ,భా | రా | 2-22 | ప | 12-55 | 2-35 | అ | వసంతపంచమి |
| 20 | 7 మం | పం | ప | 7-48 | రేవ | రా | 1- 8 | ప | 1-45 | 3-15 | మ | |
| 21 ఫి | 8 బు | ష | ఉ | 5-34 | | | | | | | | |
| | | స | తె | 3-49 | అశ్వి | రా | 11-58 | రా | 8- 9 | 9-41 | అ | భీష్మాష్టమి |
| 22 | 9 గు | అ | రా | 2-12 | భర | రా | 11-14 | ప | 9-17 | 10-50 | సి | |
| 23 | 10 శు | న | రా | 1-17 | కృత్తి | రా | 10-54 | ప | 11- 4 | 12-38 | అ | |
| 24 | 11 శ | ద | రా | 12-48 | రోహి | రా | 11- 0 | ప | 2-58 | 4-34 | సి | సర్వభీష్మ ఏకాదశి. |
| 25 | 12 ఆ | ఏ | రా | | | | | తె | 4-44 | 5-42 | | |
| | | | | 12-51 | మృగ | రా | 11-35 | | — | — | అ | భీష్మద్వాదశి |
| 26 | 13 సో | ద్వా | తె | 1-25 | ఆర్ | రా | 12-40 | ఉ | 8-22 | 10- 2 | మ,సి | |
| 27 | 14 మం | త్ర | తె | 1-59 | పున | రా | 2-15 | ప | 1-25 | 3- 7 | సి | |
| 28 | 15 బు | చతు | రా | 3-56 | పుష్య | తె | 4-15 | ప | 10-55 | 12-39 | ఆ | |
| 29 | 16 గు ○ | పూ | తె | | | | | | | | | |

# శ్రీ నందననామ సంవత్సరం మాఘమాసం కృష్ణపక్షం

1953 ఫిబ్రవరి

| ఇం. తేది | సౌర తేది వారం | తిథి | | గం.ని. | నక్షత్రం | | గం.ని. | వర్జ్యం | మొ. గం.ని. | వ. గం.ని. | [illegible] | విశేషములు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 30 | 17 శు | పా | తే | 5-40 | ఆశ్లే | పూర్తి | | సా | 5-57 | 7-43 | మ | |
| 31 | 18 శ | వి | పూర్తి | | ఆశ్లే | ఉ | 6-44 | రా | 7-58 | 9-44 | మ,అ | |
| 1 | 19 ఆ | వి | ఉ | 7-31 | మఖ | ప | 9-16 | సా | 6- 8 | 7-54 | మ,సి | |
| 2 | 20 సో | త | ప | 9-23 | పుబ్బ | ప | 11-53 | రా | 7-50 | 9-36 | సి | |
| 3 | 21 మం | చ | ప | 11-17 | ఉత్త | ప | 2-24 | రా | 11-35 | 1-20 | అ | |
| 4 | 22 బు | పం | ప | 1- 0 | హస్త | సా | 4-39 | రా | 1-16 | 3- 0 | మ,సి | |
| 5 మకరకుం-ప్రా | 23 గు | ష | ప | 2-34 | చిత్త | సా | 6-31 | రా | 12-27 | 2- 9 | సి | |
| 6 | 24 శు | స | సా | 3-42 | స్వాతి | రా | 7-56 | రా | 1-45 | 3-25 | సి | శూన్యతిథి. |
| 7 | 25 శ | అ | సా | 4-28 | విశా | రా | 8-51 | రా | 12-55 | 2-33 | సి | |
| 8 | 26 ఆ | న | సా | 4-46 | అనూ | రా | 9-16 | రా | 2-52 | 4-28 | మ | |
| 9 | 27 సో | ద | సా | 4-32 | జ్యేష్ఠ | రా | 9-11 | తె | 3- 1 | 4-35 | సి | |
| 10 | 28 మం | ఏ | సా | 3-50 | మూల | రా | 8-41 | రా | 7- 7 | 8-41 | అ | సర్వ ఏకాదశి |
| | | | | | | | | తె | 5-58 | 7-30 | | |
| 11 | 29 బు | ద్వా | ప | 2-42 | పూషా | రా | 7-48 | తె | 3-25 | 4-56 | అ | సావిత్రీకల్పము |
| 12 | 1 గు | త్ర | ప | 1-11 | ఉ.షా | సా | 6-40 | రా | 10-22 | 11-52 | సి | మహాశివరాత్రి. |
| 13 | 2 శు | చశ | ప | 11-10 | శ్రవ | సా | 5-14 | రా | 8-58 | 10-28 | మ,సి | |
| 14 | 3 శ | అ | ప | 8-53 | ధని | సా | 3-39 | రా | 10-29 | 11-52 | సి | |
| | | పా | తే | 6-28 | | | | | | | | |

# శ్రీ నందననామ సంవత్సరం ఫాల్గుణ మాసం, శుక్లపక్షం

1953 ఫిబ్రవరి

కుంభం—మీనం

| ఇం. తేది | సౌర తేది | [illegible] | తిథి | | గం. ని. | నక్షత్రం | | గం. ని. | | వర్జ్యం మొ.గం. | వ.గం. | [illegible] | విశేషములు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 15 | 4 ఆ | | వి | తె | 3-25 | శత | ప | 1-55 | రా | 7-53 | 9-28 | సి | |
| 16 | 5 సో | | త | రా | 1-12 | పూ,భా | ప | 12-15 | రా | 9-14 | 10-44 | సి | |
| 17 | 6 మం | | చ | రా | 10-50 | ఉ,భా | ప | 10-42 | రా | 10- 1 | 11-31 | అ | |
| 18 | 7 బు | | ప | రా | 8-34 | రేవ | ప | 9-19 | తె | 4-22 | 5-53 | మ | |
| 19 | 8 గు | | ష | రా | 6-50 | అశ్వ | ప | 8-10 | సా | 5-26 | 6-59 | అ | |
| 20 | 9 శు | | స | సా | 5-27 | భర | ఉ | 7-21 | రా | 7- 7 | 8-41 | సి | |
| 21 | 10 శ | | అ | సా | 4-31 | కృత్తి | ఉ | 6-53 | రా | 10-54 | 12-30 | అ | |
| 22 | 11 ఆ | | న | సా | 3-57 | రోహి | ఉ | 6-54 | ప | 12-37 | 2-15 | సి | |
| 23 | 12 సో | | ద | సా | 4- 2 | మృగ | ఉ | 7-23 | సా | 4- 7 | 5-40 | అ | |
| 24 | 13 మం | | ఏ | సా | 4-58 | ఆర్ద | ఉ | 8-22 | రా | 9- 6 | 10-48 | మ,సి | సర్వ ఏకాదశి |
| 25 | 14 బు | | ద్వా | సా | 5-55 | పున | ప | 9-50 | రా | 6-33 | 8-17 | సి | |
| 26 | 15 గు | | త్ర | రా | 7- 7 | పుష్య | ప | 11-45 | రా | 1-46 | 3-31 | సి | |
| 27 | 16 శు | | చతు | రా | 8-51 | ఆశ్రే | ప | 2- 3 | తె | 3-22 | 5- 8 | మ | |
| 28 | 17 శ | ○ | పూ | రా | 10-49 | మఖ | సా | 4-39 | రా | 1-27 | 3-13 | అ | |

# శ్రీ నందననామ సంవత్సర ఫాల్గుణ మాసం, కృష్ణపక్షం,

1958 మార్చి — కుంభం మాసం—మీనం

| ఇం. తేది | సౌర తేది | | తిథి | గం. ని. | నక్షత్రం | | గం. ని. | | వర్జ్యం మొ.గం. | వ.గం. | యోగం | విశేషములు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 18 ఆ | పా | రా | 12-51 | పుబ్బ | రా | 7-12 | తే | 8-10 | 4-56 | సి | |
| 2 | 19 సో | వి | తె | 2-45 | ఉత్త | రా | 9-14 | — | | — | సి | వసంతోత్సవారంభ |
| 3 | 20 మం | త | తె | 4-36 | హస్త | రా | 2-14 | ఉ | 6-54 | 8-39 | సి | బ్రహ్మకల్పము |
| 4 | 21 బు | చ | తె | 6-16 | చిత్త | తె | 2-0 | ప | 8-41 | 10-25 | సి | |
| 5 | 22 గు | పం | పూర్తి | | స్వాతి | తె | 3-24 | ఉ | 7-58 | 9-40 | అ | |
| 6 | 23 శు | పం | ఉ | 7-54 | విశా | తె | 4-37 | ప | 9-24 | 11- 4 | సి | |
| 7 | 24 శ | ష | ప | 8-28 | అనూ | తె | 5-2 | ప | 8-46 | 10-24 | సి | |
| 8 | 25 ఆ | స | ఉ | 8-42 | జ్యేష్ఠ | తే | 5-12 | ప | 10-46 | 12-22 | మ,అ | |
| 9 | 26 సో | అ | ఉ | 8-32 | మూల | తే | 4-48 | ప | 2-16 | 3-50 | సి,మ | |
| | | | | | | | | తే | 3-14 | 4-48 | | |
| 10 | 27 మం | న | ఉ | 7-47 | పూ,షా | తే | 3-58 | ప | 2- 4 | 3-37 | సి,మ | |
| 11 | 28 బు | ద | ఉ | 6-40 | ఉ,షా | రా | 2-50 | ప | 11-35 | 1- 7 | అ | |
| | | ఏ | తె | 4-46 | | | | | | | | |
| 12 | 29 గు | ద్వా | రా | 2-35 | శ్రవ | రా | 1-20 | ఉ | 6-30 | 8- 0 | సి | వైష్ణవ 11 |
| | | | | | | | | తే | 5- 5 | 6-35 | | |
| 13 | 30 శు | త్ర | రా | 12-11 | ధని | రా | 11-46 | | — | — | సి | |
| 14 | 31 శ | చతు | రా | 9-39 | శత | రా | 9-48 | ఉ | 6-28 | 7-57 | అ,మ | మాసశివరాత్రి |
| | | | | | | | | తే | 4- 0 | 5-29 | | |
| 15 | 1 ఆ | అ | రా | 6-52 | పూ,భా | రా | 8-27 | తే | 5-24 | 6-54 | సి | అమావాస్య |

16 2 సో శ్రీ విజయచైత్ర శు, పా, ప 2-12, ఉ,భా సా6-4 సి

# ఆనందాదీ యోగములు

| ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని | యోగములు | ఫలము |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మృగ | ఆశ్రే | హ | అనూ | ఉషా | శ | ఆనందం | ద్రవ్యలాభం |
| భర | ఆ | మ | చి | జ్యే | అభి | పూభా | కాలదండం | విఘ్నము |
| కృ | పున | పూఫ | స్వా | మూ | శ్ర | ఉభా | ధూమ్రాక్షం | హాని |
| రో | పుష్య | ఉఫ | వి | పూషా | ధ | రే | ప్రజాపతిం | కార్యసిద్ధి |
| మృ | ఆ | హ | అ | ఉషా | శ్ర | అశ్వి | సౌమ్యం | కార్యసిద్ధి |
| ఆ | మ | చి | జ్యే | అభి | పూభా | భ | ధ్వాంక్షం | విఘ్నము |
| పున | పూఫ | స్వా | మూ | శ్ర | ఉభా | కృ | ధ్వజం | రాజ్యలాభం |
| పుష్య | ఉఫ | వి | పూషా | ధ | రే | రో | శ్రీవత్సం | లక్ష్మీలాభం |
| ఆశ్రే | హ | అనూ | ఉషా | శత | అశ్వి | మృ | వజ్రం | కలహం |
| మ | చి | జ్యే | అభి | పూభా | భ | ఆ | ముద్గరం | మరణము |
| పూఫ | స్వా | మూ | శ్ర | ఉభా | కృ | పున | ఛత్రం | రాజ్యలాభం |
| ఉఫ | వి | పూషా | ధ | రే | రో | పుష్య | మిత్రం | కార్యసిద్ధి |
| హ | అనూ | ఉషా | శ | అశ్వి | మృ | ఆశ్రే | మానసం | శ్రీలాభం |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| చి | జ్యే | అభి | పూ-భా | భ | ఆ | మ | పద్మం | ఐశ్వర్యం |
| స్వా | మూ | శ్ర | ఉ-భా | కృ | పున | పూ-ఫ | లంబం | భోజనలాభము |
| వి | పూ-షా | ధ | రే | రో | పు | ఉ-ఫ | ఉత్పాతం | ద్రవ్యనాశనం |
| అనూ | ఉ-షా | శత | అశ్వి | మృ | ఆశ్రే | హ | మృత్యు | హాని |
| జ్యే | అభి | పూ-భా | భ | ఆ | మ | చి | కాల | కార్యహాని |
| మూ | శ్ర | ఉ-భా | కృ | పున | పూ-ఫ | స్వా | సిద్ధ | కార్యసిద్ధి |
| పూ-షా | ధ | రే | రో | పు | ఉ-ఫ | వి | శుభం | శుభకార్యసిద్ధి |
| ఉ-షా | శ | అశ్వి | మృ | ఆశ్రే | హ | అనూ | అమృతం | స్త్రీసంతోషం |
| అభి | పూ | భ | ఆ | మ | చి | జ్యే | ముసలం | భోజనహాని |
| శ్ర | ఉ-భా | కృ | పున | పూ-ఫ | స్వా | మూ | గదా | అశుభము |
| ధ | రే | రో | పు | ఉ-ఫ | విశా | పూ | మాతంగ | స్వర్ణలాభము |
| శ | అశ్వి | మృ | ఆశ్రే | హ | అనూ | ఉ-షా | రాక్షస | క్లేశము [ణము |
| పూ-భా | భ | ఆ | మ | చి | జ్యే | అభి | చర | దుర్వార్తాశ్రవ |
| ఉ-భా | కృ | పున | పూ-ఫ | స్వా | మూ | శ్ర | స్థిర | కార్యసిద్ధి |
| రే | రో | పు | ఉ-ఫ | విశా | పూ | ధ | వర్ధమాన | అతిశయలాభం |

ధ్వాంక్ష, వజ్ర, ముద్గర యోగములలో ప్రథమ 5 ఘడియలున్నూ, పద్మ, లంబములలో ప్రథమ 4 ఘడియలున్నూ, గదా యోగమందు ప్రథమ 1 ఘడియయున్నూ, కాల, ముసలములందు ప్రథమ 2 ఘడియలున్నూ, వదలిన శుభము, రాక్షస, మృత్యు, ఉత్పాతములను సంపూర్ణముగా వదలవలెను.

## ప్రయాణమునకు

### తిథిశూల, వారశూల, నక్షత్రశూల, లగ్నశూలలు

| దిక్కులు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు |
|---|---|---|---|---|
| తూర్పు | 1, 9 | శని, సోమ | జ్యేష్ఠ<br>ధనిష్ఠ | తుల<br>కుంభము |
| ఆగ్నేయము | 3, 11 | శని, గురు | — | మకరము |
| దక్షిణము | 5, 13 | గురు | శ్రవణము<br>అశ్విని | మీనము<br>వృశ్చికము |
| నైరుతి | 4, 12 | సోమ, శుక్ర | — | కర్కాటకము |
| పడమర | 6, 14 | ఆది, శుక్ర | రోహిణి<br>పుష్య | ధనుస్సు<br>సింహము |
| వాయవ్యము | 7, 15 | మం, ఆది | — | మేషము |
| ఉత్తరము | 2, 10 | బుధ, మం | పుబ్బ<br>హస్త | వృషభము<br>కన్య |
| ఈశాన్యము | 8, 30 | బుధ | | మిథునము |

### రాహుకాల, గుళికకాలములు

(సూర్యోదయము 6 ఘంటలకు అయ్యే దినములకు)

| వారములు | రాహుకాలము | | యమగండము | | గుళికకాలము | |
|---|---|---|---|---|---|---|
| | మొదలు | వరకు | మొదలు | వరకు | మొదలు | వరకు |
| ఆదివారము | 4½ | 6 | 12 | 1½ | 3 | 4½ |
| సోమవారము | 7½ | 9 | 10½ | 12 | 1½ | 3 |
| మంగళవారము | 3 | 4½ | 9 | 10½ | 12 | 1½ |
| బుధవారము | 12 | 1½ | 7½ | 9 | 10½ | 12 |
| గురువారము | 1½ | 3 | 6 | 7½ | 9 | 10½ |
| శుక్రవారము | 10½ | 12 | 3 | 4½ | 7½ | 9 |
| శనివారము | 9 | 10½ | 1½ | 3 | 6 | 7½ |

## వాస్తుపురుషస్థితి

భాద్రపద ఆశ్వయుజ కార్తికమాసములయందు తూర్పు శిరస్సుగాను మార్గశిర పుష్య మాఘ మాసములయందు దక్షిణశిరస్సుగాను ఫాల్గుణ చైత్ర వైశాఖమాసములయందు పశ్చిమశిరస్సుగాను, జ్యేష్ఠాషాఢ శ్రావణమాసములయందు త్తరశిరస్సుగాను ఎడమప్రక్కను శయనించుచుండును. కాన అతనిదృష్టి ప్రసరించిన దిక్కునందును పాదములున్న దిక్కునందును గృహము కట్టకూడదు. ఇది మాసవాస్తు. దినవాస్తు: సూర్యోదయం మొదలు పగలు నాలుగుజాములయందున్ను ఉత్తరదిక్కు మొదలుకొని నాల్గుదిక్కులయందున్నూ ఎడమప్రక్కను పరుండును. రాత్రియందున్నూ ఈ ప్రకారమే పరుండును. అతని పాదములున్న దిక్కుయందున్నూ చూచుచున్న దిక్కులయందున్ను యిల్లు కట్టరాదు.

## వివాహమునకు ముందు చూడవలసిన కొన్ని పొంతనములు : నాడీకూటము

ప్రథమ నాడీనక్షత్రములు—జ్యేష్ఠ, మూల, ఉ-ఫ, హస్త, ఆర్ద్ర, పున, శత, పూభా, అశ్విని.

మధ్యనాడీ నక్షత్రములు—పుష్య, మృగ, చిత్త, అనూ, భరణి, ధనిష్ఠ, పూఫ, ఉ-భా.

## అంత్యనాడి నక్షత్రములు

స్వాతి, కృత్తిక, ఆశ్రే, ఉ-షా, విశా, రోహి, మఘ, శ్రవ, రేవతి. ఇందు వధూవరుల నక్షత్రములు రెండును ఒకేనాడియందున్నచో అనిష్టము. భిన్ననాడీగత నక్షత్రములైనచో శుభప్రదములు.

## గణకూటము

దేవగణనక్షత్రములు—అనూ, పున, మృగ, శ్రవ, రేవ, స్వాతి, అశ్వి, హస్త, పుష్య.

## రాక్షసగణ నక్షత్రములు

మఘ, ఆశ్లే, ధని, జ్యేష్ట, మూల, శత, కృత్తి, చిత్త, విశా.

## మనుష్యగణ నక్షత్రములు

పూ-ఫ, ఉఫ, పూషా, ఉషా, పూభా, ఉభా, రోహి, భర, ఆర్ద్రి. ఇందు వధూవరుల నక్షత్రములు రెండును ఒకేగణమైన మంచిది. ఒకటి దేవగణములోనిది రెండవది మనుష్యగణములోనిది అయిన సామాన్యము. ఒకటి రాక్షసగణములోనిదై, రెండవది మనుష్యగణములోనిదైనను దేవగణములోనిదైనను అశుభకరము.

## యోనికూటము

అశ్వి, శత-అశ్వము; స్వాతి, హస్త-మహిషము; ధని, పూభా-సింహము; భర, రేవ-గజము; కృ, పుష్య-మేక; శ్రవ, పూషా-కోతి; ఉషా, అభి-ముంగిస; రోహి, మృగ-సర్పము; జ్యే, అనూ-లేడి; మూ, ఆర్ద్రి-కుక్క; పున, ఆశ్లే-పిల్లి; మఘ, పూఫ-ఎలుక; చిత్త, విశా-వ్యాఘ్రము; ఉఫ, ఉభా-గోవు. ఇందు పరస్పరవైరముగల వేవనగా 1 అశ్వమహిషములు, 2 గజసింహములు, 3 కోతిమేకలు, 4 ముంగిసర్పములు, 5 లేడి, కుక్కలు, 6 పిల్లి, ఎలుకలు, 7 గోవ్యాఘ్రములు. వధూవరుల నక్షత్రములు రెండును పరస్పర వైరముగలవాటిలో చేరినయెడల వారల కనిష్టము. అనగా వధూనక్షత్రము గజమున్ను వరుని నక్షత్రము సింహమున్ను అయినచో వారలకు అశుభకరము. ఇట్లే అన్నిటికి తెలియవలెను. రెండును ఏకజాతీయములైనచో అత్యంత శుభప్రదము.

## గ్రామార్వణం

గ్రామనక్షత్రం మొదలు యజమాని నక్షత్రంవరకు లెక్కించగా, మొదటి 5 కు ఫలము ధనలాభం. తదాది 3 ధననాశనం. తదాది 5 ధనవృద్ధి. తదాది 6 దారిద్ర్యము. తదాది 1 ప్రాణహాని. తదాది 4 సంపత్తు. తదాది 2 ధనవ్యయము. తదాది 1 ధనలాభం. తదాది 1 ధననాశనం-అని ఈరీతిగా ఫలముల నెరుగవలెను.

## గృహప్రవేశ చక్రములు

(రెండు చక్రములకున్ను సూర్యుడున్న నక్షత్రం మొదలు)

| వృషభచక్రం | | కలశచక్రం | |
|---|---|---|---|
| 3 మృత్యు | 4 అర్థకృత్ | 1 శిరచ్ఛేదం | 4 నిర్ధనం |
| 4 దుర్దశా | 4 ధాన్యం | 4 ప్రవాసం | 4 గర్భస్రావం |
| 4 స్థైర్యం | 3 సంపద | 4 అభయం | 3 శ్రియం |
| 3 భ్రమణం | 3 పశువృద్ధి | 4 ధాన్యం | 3 శతాయుః |

## శుభశకునములు

కన్య, మండెడునిప్పు, గుఱ్ఱము, సింహాసనము, పుణ్యస్త్రీలు, గంధము, పుష్పములు, అక్షతలు, ఛత్ర చామరములు, పల్లకి, గజము, భక్ష్యములు, చెఱకు, అంకుశము, అన్నము, తేనె, నెయ్యి, పెరుగు ఎద్దు, చేప, మాంసము, మద్యము, చలవబట్టలు, శంఖధ్వని, మంగళ వాద్యములు, వేదఘోష, ఏడ్పులేనిశవము, రత్నములు, పూర్ణకుంభము, ధ్వజములు, వేశ్యలు, అదములు ఇవి కనబడిన ప్రయాణ కార్యసిద్ధి. తుమ్మెద, ఒంటె, ఆడకుక్క, చిలుక, పిచ్చుక ఎడమప్రక్కకు వెళ్లుట, భారద్వాజము, కృష్ణపక్షి, నెమలి, నక్క కనిపించుట శుభములు.

## అశుభశకునములు

మూలికలు, చెవిటివాడు, కుంటివాడు, జడదారి, పిచ్చివాడు, ఒక బ్రాహ్మణుడు, నూనెఅంటుకొన్నవాడు, కట్టెలు, ఎముకలు, చర్మములు, దీర్ఘరోగి, నూనె, ప్రత్తి, ఉప్పు, బెల్లము, మజ్జిగ, కసువు, పాము, బురద, దిగంబరుడు, తలవిరియబోసినవాడు, క్షౌరముచేసికొన్నవాడు, ఇవి కనుబడిన ప్రయాణకార్యహాని. ప్రవేశమున పీనుగబడిఏడ్చుచుండుట, కోతి గూబలకూత దర్శనములు, కుందేలు, పంది, ఉడుతకన్పడుట, భయ

వార్త, "వెళ్ళవద్దు ఎందుకు, ఎక్కడికి" అను పలుకులు ప్రయాణ కార్యమును చెరుపును.

## సుస్వప్న ఫలములు

మహారాజదర్శనం, మదగజదర్శనం, అశ్వదర్శనం, స్వర్ణదర్శనం, వృషభదర్శనం, గోదర్శనం అయినట్లు స్వప్నము గాంచినయెడల పుత్ర లాభమున్ను గజ, వృషభ, ధేను, ప్రాసాద, పర్వతవృక్షా రోహణములు చేసినట్లును, అమేధ్యానులేపనం, స్వరోదనం, స్వమృతి, అగమ్యాగమనం చేసినట్లు స్వప్నము గాంచెనేని ధనలాభమున్ను, పాలచెట్టు, పండ్లచెట్టు యెక్కినటుల స్వప్నమయ్యెనేని మేల్కొనుసరికి ధనలాభమున్ను, కుడి భాగమున తెల్లత్రాచు కరచినట్లయ్యెనేని 10 రోజులలో అధికమయిన ధనలాభమున్ను సర్పముకాని తేలుకాని కడుపుమీద కుట్టినట్లయిన కార్య సిద్ధియు పుత్రలాభము అగును. మేడలు, పర్వతములు యెక్కినటు సముద్రములు దాటినట్లు చెరువుమధ్యమున తామరాకున నేతితో కలిపిన పాయసాన్నము తినినటుల కలగాంచెనేని శుభము. బెగ్గురకోడి క్రౌంచము యీ పక్షులను గాంచెనేని స్త్రీ లాభము. బంధనమైనటుల గాంచెనేని ధనలాభము. తన శరీరముగాని పాన్పుగాని ధనముకాని దగ్ధమయినటుల గాంచెనేని ఐశ్వర్యవంతుడగును. సూర్యబింబముగాని స్వచ్ఛమైన చంద్ర బింబముగాని గాంచెనేని రోగవిముక్తుడగును, ధనప్రాప్తియగును. రక్తము త్రాగినటుల కల్లుత్రాగినటుల తెల్లనగు గంధపుష్ప వస్త్రములు ధరించు నటుల కలగాంచెనేని విద్యాప్రాప్తి స్వప్నాంతమందు మాంసభక్షణము (స్వప్నములో) చేసెనేని విశేషముగ ధనలాభము. చేతులు తినినటుల కల గాంచెనేని ధనలాభము. శిరోభక్షణమైనటుల కలగనిన రాజ్యలాభము. తనయిల్లు కాలినటుల కల గాంచెనేని గ్రామాధిపత్యముగాని భూలాభము కాని గలుగును. పాలు త్రాగినటుల, పాలు పిండినటుల, సోమపానము చేసినటుల కలగాంచెనేని అనేక విధముల సుఖముల పొందును. తమల పాకుల గంధము తెల్లని పువ్వులు గాంచెనేని ఐశ్వర్యవంతుడగును. నూతి నుండి నీళ్లు తోడినటుల గాంచెనేని శీఘ్రముగా ధనలాభము,

## దుస్స్వప్న ఫలములు

యూపస్తంభము, మోదుగచెట్టు, వేపచెట్టు, తుమ్మచెట్టు ఎక్కినట్లులను నూనె, దూది, యినుము, జూచెనేని విపత్తు సంభవించును. ఉద్యానవనమున తిరుగుట, ఎఱ్ఱని వస్త్రములు ధరించుట, ప్రవాహములో దిగుట పక్వమైన మాంసమును తినునట్లుల కలగాంచెనేని కార్యహాని. కళాహీనులగు సూర్యచంద్రులను నక్షత్రములు పడునట్లుల గాంచెనేని. దుఃఖప్రాప్తి. నావచేనదిని దాటినట్లుల గాంచెనేని భయము సంభవించును. చెవి ముక్కు చేతులు తెగినట్లులను బురదయందు దంతములు తలవెండ్రుకలు పడినట్లులను, ఒంటె గాడిద ఎనుములయొక్క దక్షిణ ప్రయాణములు చేసినట్లుల గాంచెనేని మృత్యుప్రదమగును. తలంటుకొనునట్లుల గోమయముచేనిండిన మడుగున దిగినట్లుల గాంచెనేని ధననాశము గాని మృత్యువుగాని సంభవించును.

## జనన విషయం

కృష్ణచతుర్దశి, అమావాస్య ఈ రెండున్నూ జననమునకు శుభము కాదు. ఈ తిథియొక్క ఆద్యంత గడియల ఆరుభాగములు చేసినప్పుడు చతుర్దశియొక్క మొదటిభాగమున్నూ అమావాస్యయొక్క చివరభాగమున్ను దోషప్రదములుకావు. మిగిలిన భాగములు దోషప్రదములే. త్యాజ్యకాలమున జననమైనా దోషమే. అశ్విని 1 వ పాదము శిశుగండము, భరణి 2 వ పాదమున పురుషుడు పుట్టితే తండ్రికిన్నీ స్త్రీ పుట్టితే తల్లికిన్నీ గండము. కృత్తిక 3 వ పాదమునూ అంతే. రోహిణి మేనమామకు గండము. పుష్యమి 2, 3 పాదములలో జననమైతే పితృగండము, స్త్రీ జననమైతే మాతృగండము, అశ్రేష 3 వ పాదము మాతృగండము, 4 వ పాదము పితృగండము. మఖ 1 వ పాదము శిశు గండము, 3 పాదమున పురుషుడైతే పితృగండము, స్త్రీ అయితే మాతృగండము. మఖ 2, 4 పాదములు, స్వల్పదోషము. ఉత్తర 1 వ పాదము పురుషజననమైతే తండ్రికి దోషము; స్త్రీ జననమైతే మాతృదోషం. 2, 3, 4 పాదములు సామాన్యదోషము చిత్త 1, 3 పాదములు పురుషజననమైతే పితృగండము స్త్రీ జననమైతే మాతృగండము, 2, 4 పాదములు సామాన్యదోషము. విశాఖ సామాన్య దోషము.

జ్యేష్ఠానక్షత్రాద్యంత గడియలను 11 భాగములు చేయగా జననము 1 వ భాగములో అయితే మాతామహునికి, 2 వ భాగమైతే మాతామహికి 3 వ భాగమైతే మేనమామకు, 4 వ భాగమైతే తల్లికి, 5 వ భాగమైతే శిశువుకు, 6 వ భాగమైతే వంశమునకు, 7 వ భాగమైతే మాతృపితృ వంశములకు, 8 వ భాగములైతే అన్నగారికి, 9 వ భాగమైతే మామగారికి, 11 వ భాగమైతే అందరికిన్నీ దోషము.

మూలనక్షత్రమును 15 భాగములు చేయగా 1 వభాగమున జననమైతే తండ్రికి, 2 వభాగమైతే పెదతండ్రికి, 3 వ భాగమైతే బావమరిదికి, 4 వ భాగమైతే పితామహునికి 5 వ భాగమైతే తల్లికి 6 వ భాగమైతే పినతల్లికి, 7 వ భాగమైతే మేనమామకు, 8 వ భాగమైతే పినతండ్రిభార్యకు, 9 వ భాగమైతే సర్వమునకు, 10 వ భాగమైతే పశువులకు, 11వ భాగమైతే భృత్యులకు, 12 వ భాగమైతే శిశువుకు, 13 వ భాగమైతే అన్నగారికి, 14 వ భాగమైతే చెల్లెలికి, 15 వ భాగమైతే మాతామహునికి దోషములే. దుష్టనక్షత్రాలకు యథావిధిగా శాంతిచేసుకొంటే శుభముకలుగును.

## మ ర ణ వి ష య ము

కృత్తిక, రోహిణి, మృగశిర, పునర్వసు, మఖ, ఉత్తర, చిత్త, విశాఖ, ఉత్తరాషాఢ, ధనిష్ట, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రములలో మృతిచెందితే దోషము. కనుక కృత్తిక, పునర్వసు ఉత్తర, విశాఖ ఉత్తరాషాఢ ఈ నక్షత్రములో మృతికలిగిన అయింటిని 4 మాసములున్నూ, మృగశిర, చిత్తలైన 3 మాసములున్నూ మిగత నక్షత్రములకు 6 మాసములున్నూ విడువవలెను, 1, 2, 6, 7, 11, 12, 13, 14, తిథులున్నూ, ఆది, మంగళ, శుక్ర శనివారములున్నూ దోషప్రదములు.

## బల్లి పా టు న కు ఫ ల ము లు

శిరస్సు-కలహము, ముఖము-బంధుదర్శనము, కనుబొమ్మల నడుమ రాజానుగ్రహము, పై పెదవి-ధనవ్యయము, క్రింది పెదవి-ధనలాభము,

ముక్కు-చివర-రోగము, కుడిచెవి-దీర్ఘాయువు. ఎడమచెవి-వర్తకలాభము, నేత్రము-ఖైదు, గడ్డము, రాజదండనము, నోరు-భయము, కంఠము-శత్రుహాని, కుడిభుజము-ఆరోగ్యము, ఎడమభుజము-స్త్రీసంగము, కుడి ముంజేయి-కీర్తి; ఎడమముంజేయి-రోగము, స్తనయుగ్మము-దోషము, ఉదరము-ధాన్యలాభము, రొమ్ము, నాభి-ధనలాభము, ప్రక్కలు-సుఖము, పాదము-ప్రయాణము, వీపు-శుభము, గోళ్లు-ధనవ్యయము, లింగము-దారిద్ర్యము, జుట్టుకొన మృత్యువు. ఈ ప్రదేశములయందు తొండ ప్రాకినను ఫలమిదేయని తెలియునది.

## గర్భాధాన అన్నప్రాశనాది 21 శుభకార్యములకు ఉత్తమ సమయములు

### గర్భాధానము :

స్త్రీ పురుషుల జన్మ నక్షత్రమునకు, 7-వతార నక్షత్రములును, 8,వ రాశిలో చంద్రుడుండే నక్షత్రములును, షష్టి, అష్టమి, చతుర్దశి, పున్నమ, అమావాస్య, ఏకాదశి తిథులును; అశ్విని, భరణి, కృత్తిక, ఆశ్లేష, మఖ, జ్యేష్ఠ, మూల, రేవతి, నక్షత్రములును, వ్యతీపాతము వైధృతియోగములును వృషభము, కటకము, కన్యా, వృశ్చికము, మకరము, మీనము-లేనికాలములు శుభము.

### సీమంతము :

సోమ, బుధ, గురు, శుక్రవారములును, ద్వితీయ, తృతీయ, పంచమి సప్తమి, శుద్ధదశమి, ద్వాదశి, త్రయోదశి, తిధులును, అశ్విని, భరణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ మూల, ఉత్తరాషాఢ, శ్రవణ, ధనిష్ఠ, శతభిష, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములును; సింహ, వృశ్చికము, తప్ప మిగత లగ్నములును-శుభము. లగ్నమునకు 5, 8, 12-వ యిండ్లలో, రవి, కుజ, శని, రాహు, కేతువులు లేక యుండవలయును.

### కర్ణవేధ :

1, 4, 8, 9, 15, 30 తప్ప తక్కిన తిధులును; శ్రవ-ధని-పున-పుష్య-చిత్త-అనూ-మృ-రే-అశ్వి-హ-ఉఫ-ఉభా-ఉషా నక్షత్రములును, లగ్నగురు బలము శ్రేష్ఠము.

### అన్నప్రాశనము :

మగబిడ్డలకు 6, 8, 10-వ నెలలోను, ఆడబిడ్డలకు 5, 7, 9-వ నెలలోను, సోమ-బుధ-గురు-శుక్రవారములలోను, ద్వితీయ, తృతీయ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి, చతుర్దశి తిధులలోను, అశ్విని రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణ, ధనిష్ట, శతభిష, ఉత్తరాభాద్ర, రేవతీ నక్షత్రములలోను, వృషభ, మిధున, కటక, ధనస్సు, మీన లగ్నములును-శుభము.

### చౌలము :

శు-3, 5-8-10-11-13 - కృ-3-5-7 - తిథులు, సో-బు-గు-శు-వారములు, అశ్వి - మృ - పుష్య - జ్యే - హస్త - చి-స్వా-శ్ర-ధని-శత-పున-నక్షత్రములును—శుభము, తారాబలము, ఉత్తరాయణము, పంచమవత్సరము చూచునది. గురు శుక్ర మౌఢ్య కాలము తగదు.

### అక్షరాభ్యాసము :

2-3-5-7-10-11-12-13 - తిథులు, హస్త - పు-స్వా-అనూ-ఆర్ద్ర-రే-అశ్వి-చి-శ్ర-నక్షత్రములు, సో-బు-గు-శు-వారములు, మేషకటక తులామకరములు తప్ప తక్కిన లగ్నములును ప్రశస్తములు.

### ఉపనయనము :

బుధ - గురు - శుక్రవారములును; అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తరత్రయము, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, శ్రవణ, ధనిష్ఠా, శతభిష, రేవతి నక్షత్రములును శుభము. లగ్నమునకు కేంద్రములో పాపగ్రహముండరాదు. ప్రథమతృతీయ దినమునకు అనధ్య యనతిథి తగదు.

వివాహము :

సోమ, బుధ, గురు, శుక్రవారములు, రెండు పక్షములలో, ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, సప్తమి, దశమి, శుక్లపక్షమందు-త్రయోదశి, చతుర్దశి, పున్నమ తిథులును, రోహిణి, మృగశిర, మఖ, ఉత్త, హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు, మేష, వృషభ, మిథున, కటక, సింహ, కన్యా, తులా, ధనుస్సు, మీనలగ్నంబులును, పూర్వాహ్ణకాలమును శుభము.

ఋతుకాలము :

సోమ, బుధ, గురు, శుక్రవారములును, ద్వితీయ, నవమి ద్వాదశి తిథులును, అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణ, ధనిష్ఠ, శతభిష, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములును, వృషభము, మిధునము, కటకము, కన్యా, తులా, ధనుస్సు, మీనలగ్నములును, ఉదయకాలమును, పూర్వరాత్రియును శుభము.

గృహప్రవేశము :

2-3-11-12-వ నెలలును, సోమ, బుధ, గురు, శుక్రవారములును, రోహిణి, మృగశిర, ఉత్తర, చిత్త, అనూరాధ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతభిష, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములును శుభకరములు. చతుర్థ ద్వాదశశుద్ధి-అష్టమపాపవర్జ్యము మేలు నిచ్చును.

ప్రయాణము :

సోమ, బుధ, గురు, శుక్రవారములును; ద్వితీయ, తృతీయ, పంచమి సప్తమి, అష్టమి, దశమి, ద్వాదశి, త్రయోదశి, తిథులును అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, అనూరాధ, శ్రవణం, ధనిష్ఠ, రేవతీనక్షత్రములను, ఉత్తమము. రోహిణి, ఉత్తర, ఉత్తరభాద్ర ఈ నక్షత్రములు మధ్యమము. విష్టికూడదు. వృషభ, మిథున, కటక, సింహ, తులా, ధనుస్సు, మకర, మీనములు శుభము. యాత్రకు ముఖ్యముగా పంచక, యోగినీ, వారశూలలను చూడవలయును.

రోగవిషయము :

వసిష్ఠులవారు ఆర్ద్ర-ఆశ్లే-పూఫ-పూషా-పూభా-భర-శత-స్వా-జ్యే-కృత్తికా నక్షత్రములలో, 4-9-11-14 తిథులలో, ఆ-శ-మం-వారములలో, జన్మ-4-8-12-చంద్ర-మృత్యు-లగ్నములలో రోగమువచ్చినమృత్యువనూ నిశ్చయింపబడెదరు. శాంత్యాదులచే దైవభక్తి సాధుసేవాదులచే ఆరోగ్యము పొందవచ్చును. పూఫ-పూషా-పూభా-స్వా-ఆర్ద్ర-జ్యే - ఆశ్లేషలలో రోగి బ్రతుకుట దుస్తరమనియు, అనూ-రే-లో కష్టముతో బ్రతుకుననియు, మృ-ఉషా-లలో నెలరోజులు పీడించుననియు, మఖలో 20 రోజులుండుననియు, హ-శా-ధనిలలో 15 రోజులనియు, మూ-కృత్తికా-అశ్వి-లలో 9 రోజులనియు భర-చి-శ్ర-శతభిషలో 11 రోజులనియు, పుష్య-పున-ఉఫ-ఉభా-రో-లలో 2 దినములనియు వ్రాసిచ్చెదరు.

వైద్యము :

2-3-5-7-10-13 తిథులును; చి-స్వా-రో-మృ-అనూ- జ్యే-శ్ర-శత-అశ్వి-పుష్య-హా-నక్షత్రములును; బు-గు-వారములును మంచివి. జన్మనక్షత్రము శుభముకాదు.

ఆరోగ్యస్నానము :

మఖ-స్వా-ఆశ్లే-రే-ఉఫ-ఉభా-ఉషా-రో-నక్షత్రములలోను, సో-శు-వారములలోను, 2-3-5-7-10-12-13-14-తిథులలోను రోగవిముక్తుడు స్నానము చేయునది.

శంఖుస్థాపన :

బు-గు-శు-వారములు, 3-5-7-11-13-తిథులు, మృ-హా-రే-రో-అనూ-పుష్య-ఉఫ-ఉభా-ఉషా-శ్ర-పున-అశ్వి-చి-నక్షత్రములును మంచివి.

జలాశయారంభము :

మృ-పూషా-హా-పుష్య-అనూ-మఖ-ధని-రే - ఉఫ-ఉభా-ఉషా-నక్షత్రములు సో-బు-గు-వారములు, నైఋతి-ఆగ్నేయ-దక్షిణదిక్కులు తప్ప తక్కినవి, 3-5-7-13-15, తిథులును ప్రశస్తములు.

**నవాభరణపాత్రాదులు చేయించుట :**

4-9-11-30-తప్ప తక్కిన తిథులు, అన్ని వారములును, త్రిపుష్కర యోగమును, శ్ర-ధని-శత-పున-స్వా-పుష్య-అశ్వి-హ-రో-ఉఫ-ఉభా ఉషా- నక్షత్రములును మంచివి.

**నూతన వస్త్రధారణము :**

2-3-7-10-13- తిథులు, బు-గు-శు-వారములు- రో-హ-చి-స్వా-విశా-అనూ-అశ్వి-ఉఫ-ఉభా-రే- పుష్య-పున - నక్షత్రములును మంచివి.

**క్రయవిక్రయము :**

అశ్వి-శ్ర-రే-చి-స్వా-శత (క్రయమునకు) భ-విశా-కృత్తి-ఆర్ద్రే-పూఫ-పూషా-పూభా (విక్రయమునకు), 4-9-14-తిథులు, మంగళవారము, కుంభలగ్నముతప్ప తక్కిన తిథి వార లగ్నములు రెంటికి మంచివి.

**శాంతిపౌష్టిక కర్మలు :**

మం-శ-తప్ప తక్కినవారములు, అశ్వి-హ-పుష్య-ఉఫ-ఉషా-ఉభా-రో-స్వా-శ్ర-ధని-రే-అనూ-మఖ-శత-నక్షత్రములు, 4-9-15 తప్ప తక్కిన తిథులు-మంచివి, శుక్లపక్షము ప్రశస్తము "పూర్ణచంద్రే వేశ్మగే స్వేంబరస్థే లగ్నే జీవే వాక్పతేర్వాసరేచ" (రత్నమాలా) శాంతికర్మాణి కుర్వీతరోగ నైమిత్తికేతథా, గురుశుక్రమౌఢ్యేపి దోషస్తత నవిద్యతే (దీపికా).

**దేవతాప్రతిష్ఠ :**

ఆ-సో-బు-శు-శ-వారములు, 2-3-11-12-మాసములు, శు-కృ10-11-13-14-15-తప్ప తక్కిన తిథులు- ప్రశస్తములు. ఉత్తరాయణము శ్రేష్ఠము. గురుశుక్ర మౌఢ్యకాలములో చేయరాదు. తారాచంద్రబల మావశ్యము. లగ్ననియమము తత్తద్దేశీయ దైవజ్ఞ శిష్టజన వ్యాఖ్యాను సారము తత్తద్దేవతోచిత నక్షత్రములాదరణీయము.లు. దక్షిణాయమున భైరవ, వరాహ, త్రివిక్రమ, నృసింహ, మహిషాసురమర్దనీ, గ్రామ దేవతా ప్రతిష్ఠాదులుచేయుట శాస్త్రసమ్మతము.

అన్ని శుభకార్యములకును పైనజెప్పిన ముహూర్త శుభాశుభ విచారము నెరింగి దోషరహితముగా కాలము నెఱుంగవలయును. గురుశుక్ర బలములు గొప్పవి. మఱియు, తారాబలము, చంద్రబలాదులను చూడవలయును- యోగాదులకన్నను తాత్కాలిక లగ్న శుభగ్రహయోగములు ప్రబలములు.

## ఆశౌచ విషయము

స్రావాశౌచము : 3 వ మాసమున గర్భస్రావమయితే తల్లికి 3 రోజులాశౌచము- 4-వ మాసములో అయితే తల్లికి 4 రోజులాశౌచము. తండ్రికి స్నానమాత్రము. 4 వ మాసములో మృదుస్రావమయితే తండ్రికి స్నానముతో శుద్ధిన్ని కఠినస్రావమయితే 3 రోజులాశౌచమున్నా కద్దు. 3 మాసములకు లోపల స్రావమయితే జ్ఞాతులకు ఆశౌచములేదు. 4-వ మాసమున స్నానమాత్రము.

పాతాశౌచము : 5 వ మాసములో గర్భపాతమున 5 రోజులున్నా 6 వ మాసములో అయితే 6 రోజులున్నా తల్లికి పాతాశౌచము. తండ్రికి అన్నదమ్ములకు, జ్ఞాతులకు 3 రోజులు జాతాశౌచము. పాతాశౌచము స్నానముతో నివృత్తి అవుతుంది. 7 వ మాసమునుంచి సంపూర్ణాశౌచమును పట్టవలెను-

జననమైన తర్వాత బొడ్డుకోయక ముందు శిశువు మరణించిన పిత్రాదిజ్ఞాతులకు 3 రోజులున్నూ తల్లికి 10 రోజులున్నూ జాతాశౌచము అందరికిన్ని మృతాశౌచము స్నానముతో పోతుంది. శిశువు గర్భములోనే మరణించి పుట్టినా, పుట్టినతర్వాత 10 రోజులలో మరణించినా జ్ఞాతులకు మృతాశౌచము స్నానముతో పోతుంది. జాతాశౌచము 14 రోజులు తప్పదు.

శిశువు 10 రోజులలోపల ఎప్పుడు మరణించినా తల్లిదండ్రులకు జాతాశౌచము పోయి మృతాశౌచము ప్రారంభమగును. ఈ ఆశౌచము జననాది దశాహముతో శుద్ధి. 10 వ రోజున శిశువు మరణించిన తల్లిదండ్రులకు ఆ రోజుగాక మరి రెండురోజులాశౌచము పట్టవలెను. 10 వ

రోజు 9 వ జామున శిశువు మరణించి 3 రోజులు మృతాశౌచము పట్టవలెను. అనగా 11, 12, 13 దినములని భావము. పది రోజులు దాటిన తర్వాత పళ్లు రాకమునుపు మరణించిన జ్ఞాతులకు స్నానమాత్రము: తల్లిదండ్రులకు 3 రోజులాశౌచము. దంతోత్పత్తి అయినతర్వాత మూడేండ్లు నిండువరకు జ్ఞాతులకు 1 రోజు. మాతాపితరులకు 3 రోజులు. 4 వ సంవత్సరము మొదలు ఉపనయనమయ్యేలోపలైతే అందరికీ 3 రోజులు. ఉపనయనానంతరం అందరికీ పూర్ణాశౌచం.

## కన్యా మరణాశౌచము

జననాది 11 వ రోజు మొదలు 3 సంవత్సరములు నిండువరకు జ్ఞాతులకు స్నానముతో శుద్ధి. 4 వ సంవత్సరము మొదలు వాగ్దానపర్యంతము, 1 దిన మాశౌచము. వాగ్దానము మొదలు వివాహపర్యంతము 3 దినములు, తల్లిదండ్రులకు 11 వ రోజు మొదలు వివాహపర్యంతము 3 రోజులు. తల్లిదండ్రులు మరణించిన, పుత్రులకును వివాహముకాని కుమార్తెలకున్నూ 10 రోజులాశౌచము పట్టపరెను.

సవతితల్లి చనిపోతే వివాహిత అయిన సవతికూతురు దగ్గరవుంటే 1 రోజు అశౌచము. అన్యత్ర ఉంటే స్నానమాత్రము. పితృవ్యులుకాని పితామహుడుకాని చనిపోతే వివాహస్త్రీకి స్నానమాత్రము.

వివాహిత భ్రాత భగినియింటిలో మరణించితే 3 రోజులున్నూ ఇతరుల యింటిలో అయితే పక్షిణి, గ్రామాంతరమందయితే 1 రోజున్నూ భగినికి అశౌచము. సాపత్న భగినికిన్నీ యిదేప్రకారము. ఉపనయనము కాని భ్రాత మరణించిన భగినికి అశౌచములేదు.

మేనమామ చనిపోయిన మేనల్లుడికి మేనకోడలికిన్నీ 1 పక్షిణి అశౌచము. మేనమామ తనయింటిలో పోతే 3 రోజులాశౌచము. మేనమామ గ్రామాంతరములో పోయినను ఆ మేనమామకు ఉపనయనము కాకపోయినను 1 రోజు అశౌచము. సాపత్ని మాతలుడికిన్నీ యింతే.

మేనమామభార్య మరణించిన దగ్గరవుంటే 3 రోజులున్నూ లేకపోతే 1 పక్షిణిన్నీ అశౌచము.

ఉపనీత భాగినేయుడు పోతే మేనమామకున్నూ పినతల్లి పెద తల్లులకున్నూ 3 రోజు లాశౌచము. అనుపనీతుడు పక్షిణి. సాపత్న భాగినేయుడు పోయినా యింతే. భాగినేయుడు పోతేపైవారికి స్నాన మాత్రము.

మాతామహుడు పోతే కూతురి కొడుకులున్నూ కూతురి కూతుళ్లున్నూ 3 రోజు లాశౌచము పెట్టవలెను. గ్రామాంతరములో అయితే పక్షిణి.

మాతామహిమరణించిన, సన్నిధిలో 3రోజులు. అసన్నిధిలోపక్షిణి. ఉపనీత దౌహిత్రుడు పోతే 3 రోజులు ఆశౌచము. అనుపనీతుడుపోతే పక్షిణి. మనుమరాలుపోతే ఆశౌచములేదు.

అత్తమామలు పోతే అల్లుడు దగ్గర ఉంటే 3 రోజు లాశౌచము. దగ్గరలేకపోతే పక్షిణి. భార్యమరణించిన తర్వాత అత్తమామలు పోతే 1 రోజాశౌచము. భార్యమరణించినా ఆ భార్యకు సంతానముంటే 3 రోజులాశౌచము.

అల్లుడు చనిపోతే సన్నిధిలో అయితే పక్షిణి. అసన్నిధిలో అయితే 1 రోజు, మామగారింట్లోనేపోతే మామకు 3 రోజులు.

శ్యాలకుడు ఉపనీతుడుపోతే భగినీభర్తకు 1 రోజాశౌచము. అనుపనీతుడు పోయినా గ్రామాంతరములో పోయినా స్నానమాత్రము. భార్య చనిపోయిన సంబంధముతీరిపోతే స్నానమని పక్షాంతరము. శ్యాలకసుతుండు పోయిన భగినీభర్తకు 1 రోజాశౌచము.

పినతల్లి పెదతల్లులుపోతే పక్షిణి. సాపత్న మాతృస్వసలు పోయినా యిదేప్రకారము తమ యింటిలోపోతే 3 రోజు లాశౌచము.

మేనత్తలుపోతే పక్షిణి. తండ్రికి సాపత్నభగిని అయితే స్నానము. మేనత్త మేనల్లుడికి 3 రోజులు.

మేనల్లుడుకాని మేనకోడలుగాని పోతే మేనత్తకు స్నాన మాత్రము. భగిని సోదరగృహములో పోతే సోదరులకు 3 రోజు లాశౌచము, అన్యగృహములో అయితే పక్షిణి. గ్రామాంతరమయితే ఒక రోజు.

# అనంత విశ్వం

అనంతమైన విశ్వప్రపంచసృష్టి ఎప్పుడారంభమైందో ఎలా ఆరంభమైందో ఎవరూ స్పష్టంగా చెప్పలేకుండా వున్నారు. కాని, ఊహకు మించిన వైశాల్యంలో కొన్ని కోట్లభూగోళాలు, ఒకదానికొకటి, లక్షల, కోట్ల, యింకా ఎక్కువమైళ్లదూరంలో వున్నాయనీ, ఇవన్నీ ఒకదానినొకటి ఆకర్షించుకుంటూ, ఆకాశంలో నిలబడివున్నాయనీ విజ్ఞానులు వెల్లడిచేశారు.

మనం నివసిస్తూవున్న భూమి, యిలాటి అనంతకోటి బ్రహ్మాండాలలో ఒకటి. దీనిని సూర్యకుటుంబంలోని గోళం అంటారు; అలా అనడానికి కారణం, సూర్యుడు ప్రధానంగా, ఒకదానినొకటి ఆకర్షించుకుంటూ, ఒకదానిచుట్టు మరొకటితిరిగే గోళాలలో భూమిఒకటి. ఐతే మనం భూమిమీద నివసిస్తున్నాముకనుక, మనం భూమిని ప్రధానగోళంగానూ, మిగతావాటిని గ్రహాలుగాను పరిగణిస్తున్నాము.

మనకు పెద్దవిగా కనపడేవాటిని, చలనం ఎక్కువగావున్నవాటిని గ్రహాలన్నాము. చిన్నవాటిని నక్షత్రాలన్నాము. ఈగ్రహాలు ముఖ్యంగా తొమ్మిది. సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, రాహువు, కేతువు. వీటిలో రాహుకేతువులనుతప్ప మిగతా గ్రహాలన్నిటినీ, మామూలుగా ఆకాశంమీద, సంవత్సరం మొత్తంమీద ఏదో ఒకకాలంలో చూడవచ్చును.

## సూర్యుడు

సూర్యగ్రహం, భూమికి 9,30,05,000 మైళ్ళ దూరంలో వున్నదనీ, యీగ్రహపు వ్యాసము 8,65,000 మైళ్ళు వుంటుందనీ శాస్త్రజ్ఞుల అంచనా. భూమి, సూర్యునికి ఉపగ్రహం.

## చంద్రుడు

ఇది భూమికి ఉపగ్రహం. భూమినుంచి 2,38,857 మైళ్ళ దూరంలో వున్నదనీ, దీని వ్యాసం 2,160 మైళ్ళుఅనీ అంచనా. ఇది భూమిచుట్టూ ఒక ప్రదక్షిణంచెయ్యడానికి 29 రోజుల 12 గంటల 44.04 నిమిషాలు పడుతుంది.

## కుజుడు

ఇది సూర్యునికి ఉపగ్రహం. సూర్యునినుంచి 14,15,00,000 మైళ్ళదూరంలో వున్నదనీ, దీని వ్యాసం 4,215 మైళ్ళుఅనీ అంచనా. సూర్యునిచుట్టూ ఇది ఒక ప్రదక్షిణం చెయ్యడానికి ఒకసంవత్సరం 322 రోజులు పడుతుంది. ఇది భూమికి 24,80,00,000 మైళ్ళ దూరంలో వుంది.

## బుధుడు

ఇదికూడా సూర్యుని ఉపగ్రహమే. ఇది సూర్యునికి ఇతరగ్రహాలన్నిటికన్న చాలాసమీపంలో, అంటే 3,60,00,000 మైళ్ళ దూరంలో వుంది. దీని వ్యాసం, 3,000 మైళ్ళు అని అంచనా. ఇది ఒకసారి సూర్యునిచుట్టూ ప్రదక్షిణ చెయ్యడానికి 88 రోజులు పడుతుంది. ఇది భూమినుంచి 13,60,00,000 మైళ్ళ దూరంలో వుంది.

## గురుడు

సూర్యకుటుంబానికి చెందిన గ్రహాలలో, సూర్యుని తరువాత చాలా పెద్దగ్రహం ఇదే. సూర్యునికి 48,30,00,000 మైళ్ళ దూరంలో వుందనీ, దీని వ్యాసం 88,700 మైళ్ళు అనీ అంచనా. దీనికి నాలుగు పెద్దఉపగ్రహాలూ, 7 చిన్న ఉపగ్రహాలూ వున్నాయి. ఇది ఒకసారి సూర్యునిచుట్టూ ప్రదక్షిణంచెయ్యడానికి 11 సంవత్సరాల 314 రోజులు పడుతుంది. భూమి పరిమాణంకన్న గురుని పరిమాణం 1300 రెట్లు ఎక్కువ. ఇది భూమినుంచి 60 కోట్లమైళ్ళ దూరంలోవుంది.

## శు క్ర డు

సూర్యునికి బుధునికంటె దూరంగానూ, ఇతరగ్రహాలకంటె దగ్గరగానూ, అంటే 6,72,00,000 మైళ్ళు దూరంలో వున్నగ్రహం. దీని వ్యాసం 7,600 మైళ్ళు. ఇది ఒకసారి సూర్యునిచుట్టూ ప్రదక్షిణంచెయ్యడానికి 225 రోజులు పడుతుంది. ఇది భూమినుంచి 16,10,00,000 మైళ్ళ దూరంలో వుంది.

## శ ని

ఇది సూర్యునికి 88,60,00,000 మైళ్ళదూరంలోవుంది. దీని వ్యాసం, 71,500 మైళ్ళు. దీనికి తొమ్మిది ఉపగ్రహాలు వున్నాయి. ఇది సూర్యునిచుట్టూ ఒక ప్రదక్షిణం చెయ్యడానికి 29 సంవత్సరాల 167 రోజులు పడుతుంది. ఇది భూమినుంచి 102,80,00,000 మైళ్ళ దూరంలో వుంది.

## రా హు వు

ఇది సూర్యునికి 178,28,00,000 మైళ్ళదూరంలోవుంది. దీని వ్యాసం, 30,900 మైళ్ళు అనీ అంచనా. ఇది సూర్యునిచుట్టూ ఒక ప్రదక్షిణం చెయ్యడానికి 84 సంవత్సరాల ఆరురోజులు పడుతుంది. దీనికి నాలుగు ఉపగ్రహాలు ఉన్నాయి.

## కే తు వు

ఇది సూర్యునికి 279,30,00,000 మైళ్ళదూరంలో వుందనీ, దీని వ్యాసం 33,000 మైళ్ళు అనిఅంచనా ఇది సూర్యునిచుట్టూ ఒక ప్రదక్షిణం చెయ్యడానికి 164 సంవత్సరాల 280 రోజులు పడుతుంది.

## న క్ష త్ర ము లు

భూమిచుట్టూవున్న ఆకాశంలో, ఆ గ్రహాలు సంచరించేమార్గం (భూమి తనచుట్టూ తాను తిరగడంలో ఆ గ్రహాలు సంచరిస్తున్నట్టు మనకు కనపడేమార్గం) భచక్రం అని వాడుకలోవుంది. ఈ భచక్రాన్ని జ్యోతిష్కులు పన్నెండు భాగాలుగా విభజించారు. అలా విభజించ

డంలో, యీ భచక్రభాగంలోవున్న నక్షత్రసముదాయాల స్థానాన్ని బట్టి, కొన్ని నక్షత్రముల రాశికి ఒక్కొక్కదానికి, ఒక్కొక్క పేరు పెట్టారు ఈనక్షత్రాలు 27: వాటిపేర్లు: అశ్విని, భరణి, కృత్తిక. రోహిణి. మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి.

ఈ నక్షత్రాలకు ప్రతిదానికీ నాలుగుభాగములు ఊహించి, అలాటి నక్షత్రభాగాలను తొమ్మిదిటిని ఒకరాశిగా నిర్ణయించి, ఆ రాసులకు, వాటి ఊహారూపాలనుబట్టి వేరే పేర్లు పెట్టారు. అంటే నూటఎనిమిది నక్షత్రాల భాగాలు (వీటికే పాదాలు అని వ్యవహారనామం) పన్నెండుగా విభజించి, రాశికి తొమ్మిదిభాగాలచొప్పున, పన్నెండు రాసులగా యున్నమాట. ఆ రాసుల పేర్లు: మేషం, వృషభం, మిథునం. కర్కాటకం, సింహం, కన్య, తుల, వృశ్చికం, ధనుస్సు, మకరం, కుంభం, మీనం.

చంద్రుడు భూమిచుట్టూ తిరిగే గ్రహం. ఇలాతిరగడంలో, సాధారణంగా రోజుకొక నక్షత్రమండలంనుంచి మనకు కనబడతాడు. అలా ఏ నక్షత్రమండలంలో చంద్రుడు మనకు కనబడతాడో, ఆ నక్షత్రాన్ని మనం పంచాంగపు లెఖలలో, ఆనాటినక్షత్రంగా పరిగణిస్తాము. పౌర్ణమి నాడు చంద్రుడు ఏ నక్షత్రంలో కనబడతాడో, ఆ నక్షత్రం పేరుమీద మాసాన్ని వాడుకలో పెట్టుకున్నాము. చిత్త-చైత్రము; విశాఖ-వైశాఖము; జ్యేష్ఠ-జ్యేష్ఠము, పూర్వాషాఢ-ఆషాఢము; శ్రవణం-శ్రావణం; ఉత్తరాభాద్ర-భాద్రపదము; అశ్విని-అశ్వియుజము; కృత్తిక-కార్తికము; మృగశిర-మార్గశీర్షము; పుష్యమి-పుష్యము; మఖ-మాఘము; ఉత్తర (ఉత్తరఫల్గుని)-ఫాల్గుణము.

రెండేసి మాసములను, ఆ రెండుమాసములలోను ప్రధానంగా ఉండే కాలధర్మాన్నిబట్టి ఒకఋతువుగా నిర్ణయించి, పన్నెండు మాసాలనూ ఆరు ఋతువులుగా వ్యవహరిస్తున్నాము; వసంతము. గ్రీష్మము, వర్షము, శరత్తు, హేమంతము, శిశిరము.

భూమి సూర్యుని చుట్టూ ఒక ప్రదక్షిణం చెయ్యడానికి పట్టేకాలం ఒకసంవత్సరం. భూమి తనచుట్టూ తానుతిరుగుతూ, (ఇలాతిరగడానికి పట్టేకాలం ఒక రోజు) సూర్యునిచుట్టూ తిరుగుతుంది. ఇలా తిరగడంలో సంవత్సరంలో సగంకాలం భూమి సూర్యునికి సమీపంలోనూ, తక్కిన సగంకాలంలో దూరంగానూ వుంటుంది. అలా వుండటంలో, సూర్యుడు మిట్టమధ్యాహ్నంవేళ, నడినెత్తిమీదకువచ్చే ప్రదేశం, భూమధ్యరేఖకు రెండువైపులా కొంతవరకే వుంటుంది, ఇదేమనకు సూర్యుడు ఉత్తరం నుంచి దక్షిణానికీ, దక్షిణంనుంచి ఉత్తరానికి ప్రయాణం చేస్తున్నట్టు కనపడు తుంది. సూర్యుడు ఉత్తరపుదిక్కునకు ప్రయాణం చేస్తున్నట్టు కనపడే కాలం ఉత్తరాయణం; దక్షిణపుదిక్కునకు ప్రయాణం చేస్తున్నట్టు కనపడే కాలం దక్షిణాయనం.

అనంతకోటి బ్రహ్మాండాలలో ఒకటైన భూమి, ఎప్పుడు సృష్టింపబడిందో చెప్పడంకష్టం. కాని భూతత్వశాస్త్రజ్ఞులువిశేషకాలం పరిశోధన చేసినమీద, భూమిసృష్టి జరిగి 150 కోట్ల సంవత్సరాలకు తక్కువ కాలేదనీ, సుమారు 300 కోట్ల సంవత్సరాలలోపు అయి వుండవచ్చుననీ అంచనా వేశారు. చాలామంది విజ్ఞానులు యీ అంచనాను అంగీకరించారు.

భూమిమీద మొట్టమొదట జీవరాసులు ఏమీలేవు. సూర్యరశ్మివల్ల, భూమిమీద క్రమంగా జలచరాలు, జల-భూచరాలు, భూచరాలు ఉత్పత్తిఅయాయి. ఈజంతువులు క్రమంగా రూపపరిణామంచెంది, మానవరూపం అవతరించి యిప్పటికి సుమారు ఒక లక్ష సంవత్సరాలు అవుతుందని పరిశోధకుల అంచనా. మానవుడు మృగప్రాయుడుగానే ఎంతోకాలం వుండిపోయాడు. క్రమేపీ రాళ్ళను ఆయుధాలుగానూ, పనిముట్లుగానూ ఉపయోగించే దశకువచ్చాడు. అది 20,000 సంవత్సరాలకు పూర్వం. సమూహాలుగా జీవించడం, పొలం దున్నుకోవడం మానవుడు నేర్చుకొని సుమారు వందవేలసంవత్సరాలు అయివుంటుందని అంచనా. ఇప్పుడు విశేషభేదాలతో కూడిన నాగరికతలతో, మానవులు భూమిఅంతటానివసిస్తున్నారు.

భూమి వైశాల్యం మొత్తం 19,65,50,000 చదరపు మైళ్ళని అంచనా. దీనిలో 14,10,50,000 చ.మైళ్ళు జలమయం; 5,55,00,000 చ.మైళ్ళు నేల. భూమిచుట్టుకొలత, 24,901 మైళ్ళు. భూమధ్యరేఖ పొడవు, 7,926½ మైళ్ళు.

భూగోళంమీద జలంలేకుండావున్న భాగంలో, ఉత్తరదక్షిణ ధృవప్రాంతాలు మొత్తం, సుమారు 50 లక్షల చదరపుమైళ్ళుపోగా, మిగతాభాగము ఆరు ఖండాలుగావుంది. అవి:

| | |
|---|---|
| ఆసియా | 1,70,00, వేల చ. మైళ్ళు |
| యూరపు | 37,50, వేల చ. మైళ్ళు |
| ఆఫ్రికా | 1,15,00, వేల చ. మైళ్ళు |
| ఉత్తర అమెరికా | 80,00, వేల చ. మైళ్ళు |
| దక్షిణ అమెరికా | 68,00, వేల చ. మైళ్ళు |

ఆస్ట్రేలియా (సమీపద్వీపాలతోసహా) 34,50, వేల చ. మైళ్ళు భూమిమీద నేలలో బ్రిటిషువారి అధీనంలో వున్నభాగం 1,40,00,000 చ. మైళ్ళు. రష్యా. 82,50,000 చ. మైళ్ళు. ఫ్రెంచివారి వలసలలో, 43,36,000 చ. మైళ్ళు. యునైటెడ్ స్టేట్సు 37,50,000; బ్రెజిల్, 32,20,000; చైనా, 38,70,000; భరతఖండం 16,67,000 చ.మైళ్ళు

భూమిమీదఉన్న జలప్రాంతాలలో ముఖ్యమైనవి నాలుగు సముద్రాలు: అవేమిటంటే:

| | |
|---|---|
| పసిఫిక్ | 6,39,86,000 చ. మైళ్ళు |
| అట్లాంటిక్ | 3,15,30,000 ,, |
| ఇండియన్ | 2,83,50,000 ,, |
| ఆర్కిటిక్ | 55,41,600 ,, |

వీటిలో పసిఫిక్ సముద్రం ఒకచోట 35,410 అడుగులలోతు; అట్లాంటిక్, 27,962 అడుగులలోతు; ఇండియన్, 22,968 అడుగులలోతు ఆర్కిటిక్, 13,200 అడుగులలోతు కలిగివున్నవి.

## ప్రపంచపు జనాభా

1950 లో యునైటెడ్ నేషన్సు ప్రపంచ ఆరోగ్యసమితి ప్రచురించిన లెఖల ప్రకారం, ప్రపంచపు జనాభా 240 కోట్లు అని అంచనా వేయబడింది. ఒక్కొక్క ఖండం జనాభా యీ క్రింది లెఖలలో వున్నట్టు అంచనా:

| | |
|---|---|
| ఆఫ్రికా | 19,80,00,000 |
| ఆసియా (రష్యా మినహా) | 127,20,00,000 |
| యూరపు (రష్యా మినహా) | 39,63,00,000 |
| రష్యా | 20,00,00,000 |
| ఉత్తర అమెరికా | 21,63,00,000 |
| దక్షిణ అమెరికా | 11,14,00,000 |
| ఆస్ట్రేలియా (సమీపద్వీపాలతో) | 1,29,00,000 |

ప్రపంచపు జనాభా ప్రతిరోజుకీ 60,000 మంది చొప్పున పెరుగుతున్నదని ఆరోగ్యసమితి అధికారులు అంచనా వేశారు.

## ప్రపంచంలో అతి ఎత్తయిన పర్వతములు

| పర్వత శ్రేణి | ఖండము | శిఖరము పేరు | ఎత్తు (అడుగులు) |
|---|---|---|---|
| హిమాలయము | ఆసియా | ఎవరెస్టు | 29,141 |
| ఆండిస్ | దక్షిణ అమెరికా | ఇళాంపు | 25,248 |
| అలాస్కా | ఉత్తర అమెరికా | మెకిన్లే | 20,300 |
| టాంగనైకా | ఆఫ్రికా | కిలిమాంజరో | 19,720 |
| ఆల్ప్సు | యూరపు | మాంట్ బ్లాంక్ | 15,782 |
| మునియాంగ్ | ఆస్ట్రేలియా | కోసియుస్కో | 7,328 |

## పెద్ద నదులు

| నది | దేశం | పొడవు (మైళ్లు) |
|---|---|---|
| మిస్సోరి-మిసిసిపి | ఉత్తర అమెరికా | 4,502 |
| అమెజాన్ | దక్షిణ అమెరికా | 4,000 |
| నైల్ | ఈజిప్టు | 4,000 |
| యాంగ్సి | చైనా | 3,401 |
| కాంగో | ఆఫ్రికా | 3,000 |
| మెకాంగ్ | చైనా | 2,800 |
| నైగర్ | ఆఫ్రికా | 2,600 |
| హోయాంగ్ హో | చైనా | 2,600 |
| వోల్గా | రష్యా | 2,400 |
| డాన్యూబ్ | యూరపు | 1,725 |
| సింధు | పాకిస్తాన్ | 1,700 |
| గంగ | ఇండియా | 1,500 |

## పెద్ద సరస్సులు

| పేరు | దేశం | వైశాల్యం (చ. మైళ్లు) |
|---|---|---|
| సుపీరియర్ | ఉత్తర అమెరికా | 31,200 |
| విక్టోరియా న్యాంజా | ఆఫ్రికా | 26,200 |
| హ్యూరన్ | ఉత్తర అమెరికా | 23,800 |
| మిచిగన్ | ఉత్తర అమెరికా | 22,450 |
| ఛాడ్ | ఆఫ్రికా | 20,000 |
| న్యాసా | ఆఫ్రికా | 14,200 |
| టాంగనైకా | ఆఫ్రికా | 12,700 |
| బైకల్ | సైబీరియా | 11,580 |
| ఈరీ | ఉత్తర అమెరికా | 9,960 |

## పెద్ద ద్వీపాలు

| | చ. మైళ్లు |
|---|---|
| గ్రీన్‌లాండ్ | 8,27,300 |
| న్యూగినీ | 3,30,000 |
| బోర్నియో | 3,07,000 |
| మెడగాస్కర్ | 2,28,000 |
| సుమత్రా | 1,63,000 |
| బ్రిటన్ | 88,745 |
| జావా | 48,400 |
| ఐస్లెండ్ | 36,600 |
| సింహళం | 25,400 |
| సిసిలీ | 10.000 |

## ప్రపంచంలోని, పెద్దనగరాలు

| నగరం | జనాభా | లెక్కలుచూచిన సంవత్సరం |
|---|---|---|
| లండను | 83,46,137 | 1951 |
| న్యూయార్కు | 78,35,099 | 1950 |
| టోకియో | 53,85,000 | 1951 |
| బెర్లిను | 33,57,000 | 1951 |
| మాస్కో | 41.37,018 | 1939 |
| షాంఘై | 34,18,000 | 1936 |
| పారిస్ | 27,24,374 | 1947 |
| కలకత్తా | 45,50,000 | 1951 |
| బొంబాయి | 28,40,011 | 1951 |
| [illegible] | 15,88,400 | 1947 |
| ...ాసు | 14,29,374 | 1951 |
| ...దరాబాదు | 10,85,074 | 1951 |
| లాహోరు | 6,72,000 | 1941 |
| సింగపూర్ | 9,40,766 | 1947 |
| ఢిల్లీ | 5,33,000 | 1941 |

## ప్రపంచంలో ఎత్తయిన భవనాలలో ముఖ్యమైనవి

| | | | |
|---|---|---|---|
| సోవియట్ భవనము | మాస్కో | 1365 | అడుగులు |
| ఎంపైర్ స్టేట్ భవనము | న్యూయార్క్ | 1268 | ,, |
| క్రిస్లర్ భవనము | న్యూయార్క్ | 1046 | ,, |
| ఈఫిల్ గోపురము | పారిస్ | 985 | ,, |
| 60 వాల్ టవర్ | న్యూయార్క్ | 950 | ,, |
| మన్‌హటానుబ్యాంక్ భవనం | న్యూయార్క్ | 927 | ,, |
| రాక్ ఫెల్లర్ సెంటర్ | న్యూయార్క్ | 850 | ,, |
| వూల్‌వర్త్ భవనము | న్యూయార్క్ | 792 | ,, |

### పురాతనమైనవి

| | | | |
|---|---|---|---|
| చియాప్స్ పిరమిడ్ | ఈజిప్టు | 450 | ,, |
| శాలిస్‌బరి కెతిడ్రల్ | ఇంగ్లండు | 404 | ,, |
| సెంట్‌పాల్స్ కెతిడ్రల్ | ఇంగ్లండు | 365 | ,, |

### కనుచూపుమేర

సాధారణంగా మనం, కనుచూపుమేరలో ఎక్కడా ఏమీ కనపడ లేదంటాము. ఈ కనుచూపుమేర అంటే ఎంత ? పరిశోధకులు లెఖకట్టి, చూస్తే మనిషి కళ్లు భూమట్టానికి ఎంత ఎత్తున వుంటాయో, దానినిబట్టి వాని దృష్టి, మధ్యలో ఏమీ అడ్డంలేకపోతే యీ క్రింది లెఖ్ఖప్రకారం, వుంటుందని తేల్చారు.

| కళ్ళ ఎత్తు | చూపు ఆనే దూరం |
|---|---|
| 5 అడుగులు | 2.9 మైళ్లు |
| 20 అడుగులు | 5. 9 ,, |
| 50 అడుగులు | 9. 3 ,, |
| 100 అడుగులు | 13. 2 ,, |
| 1000 అడుగులు | 41. 6 ,, |

## ప్రపంచములో అత్యధిక సంఖ్యాకులు మాట్లాడే భాషలు (మాతృభాషగా)

| భాష | జనాభా |
|---|---|
| ఇంగ్లీషు | 20 కోట్లు |
| ఉత్తర చీనా భాష | 20 ,, |
| రష్యను | 12 ,, |
| జర్మను | 10 ,, |
| స్పానిష్ | 10 ,, |
| జపానీస్ | 8 ,, |
| ఫ్రెంచి | 7.5 ,, |
| హిందీ | 7.2 ,, |
| కాంటను చీనా భాష | 6 ,, |
| బెంగాలీ | 6 ,, |
| ఇటాలియను | 5 ,, |
| పోర్చుగీసు | 5 ,, |
| మలయా | 4 ,, |
| అరబ్బీ | 4 ,, |
| బీహారి | 2.8 ,, |
| తెలుగు | 2.6 ,, |
| మరాఠీ | 2.1 ,, |
| తమిళము | 2.1 ,, |
| టర్కీషు | 2 ,, |

## అక్షరజ్ఞానంలేని ప్రజలు

(పదిసంవత్సరాలకు పైబడిన వయస్సుగలవారు)

| దేశం | నిరక్షరాస్యులసంఖ్య | జనాభాలో శాతము | లెక్కలుతీసిన సంవత్సరం |
|---|---|---|---|
| భారతదేశం | 28,47,00,000 | 73 | 1941 |
| రష్యా | 1,70,00,000 | 10 | 1942 |
| ఈజిప్టు | 88,17,000 | 85.7 | 1927 |
| టర్కీ | 75,00,000 | 55.1 | 1934 |
| స్పెయిన్ | 78,43,000 | 31.1 | 1935 |
| ఇటలీ | 61,12,000 | 19 | 1935 |

రష్యాలో 1937 లో 20,800, 000 మంది, అంటే జనాభాలో నూటికి 19 వంతులు, నిరక్షరాస్యులు వుండేవారు. 1942 నాటికి ఈ సంఖ్య నూటికి 10 వంతులకు తగ్గింది. టర్కీలో 1927 లో 125,18,000 మంది నిరక్షరాస్యులు వుండేవారు. కాని 1934 నాటికి ఈ సంఖ్య 75 లక్షలుమాత్రమే. భారతదేశంలో 1931 నాటికి 26 కోట్ల 80 లక్షల మంది చదువురానివారు వుంటే, 1941 నాటికి, జనాభా పెరగడంతో పాటు చదువురానివారి సంఖ్యకూడా 28 కోట్ల 47 లక్షలకు పెరిగింది.

## ముఖ్యమైన అగ్నిపర్వతాలు

| పేరు | ఎత్తు | ఉన్న దేశం |
|---|---|---|
| కోటపాక్సి | 19,580 | దక్షిణ అమెరికా |
| శాన్ పెలిరాయ్ పాబ్లో | 19,423 | దక్షిణ అమెరికా |
| శాంగే | 17,464 | దక్షిణ అమెరికా |
| లూల్లైలాకో | 17,000 | దక్షిణ అమెరికా |
| మొనాలోవా | 12,675 | హోవాయి |
| ఫూజి | 12,044 | జపాన్ |
| ఎట్నా | 10,740 | సిసిలీ |
| వెసువియస్ | 4,700 | ఇటలీ |

## ముఖ్యమైన ఎడారులు

| | | వైశాల్యం (చ. మైళ్లు) |
|---|---|---|
| సహారా | (ఆఫ్రికా) | రెండుకోట్లు |
| గ్రేట్ అమెరికన్ | (అమెరికా) | 10,50 వేలు |
| గోబి | (ఆసియా) | మూడు లక్షలు |
| టిబెట్ | (ఆసియా) | 230 వేలు |

## పెద్ద కాలువలు

| | | పొడవు (మైళ్లు) | లోతు అడుగులు |
|---|---|---|---|
| సూయజ్ | (ఈజిప్టు) | 101½ | 39½ |
| కీల్ | (జర్మనీ) | 61 | 45 |
| హూస్టన్ | (అమెరికా) | 57 | 34 |
| పనామా | (అమెరికా) | 50.7 | 45 |
| వెల్లాండ్ | (కెనడా) | 27½ | 30 |
| ఆంస్టర్‌డాం | (హాలెండ్) | 16½ | 40 |

## జలపాతములు

| పేరు | | ఎంతఎత్తునుంచి పడేది (అడుగులు) |
|---|---|---|
| సదరులాండ్ | (న్యూజిలెండ్) | 1,904 |
| టుగేలా | (నేటాల్) | 1,800 |
| రిబ్బన్ | (కాలిఫోర్నియా) | 1,612 |
| గావర్ని | (ఫ్రాన్సు) | 1,385 |
| టక్కాకా | (కెనడా) | 1,200 |
| జెర్సొప్పా | (మైసూర్) | 960 |
| స్టాబ్బాచ్ | (స్విట్జెర్లెండ్) | 890 |
| మల్ట్‌నోమా | (ఓరిగాన్) | 850 |

## పెద్ద రైల్వేస్టేషన్ ప్లాట్‌ఫారములు

| పేరు | | పొడవు (అడుగులు) |
|---|---|---|
| సోనేపూర్ | (ఇండియా) | 2,415 |
| ఖరగ్‌పూర్ | (ఇండియా) | 2,350 |
| బులావాయో | (రొడీషియా) | 2,302 |
| న్యూలక్నో | (ఇండియా) | 2,250 |
| మాంచెస్టర్ | (ఇంగ్లండు) | 2,194 |
| విజయవాడ | (ఇండియా) | 2,100 |
| ఝాన్సీ | (ఇండియా) | 2,024 |
| కొత్రి | (ఇండియా) | 1,896 |
| మాండలే | (బర్మా) | 1,788 |
| పోర్ట్స్‌మత్ | (ఇంగ్లండ్) | 1,748 |
| ఎడింబరో | (స్కాట్లండ్) | 1,680 |
| ఎబర్డిన్ | (స్కాట్లండ్) | 1,596 |
| తిరుచిరాపల్లి | (ఇండియా) | 1,546 |

## పెద్ద రైల్వే వంతెనలు

| పేరు | | పొడవు (అడుగులు) |
|---|---|---|
| లోయర్ జాంబెజి బ్రిడ్జి | [తూర్పు ఆఫ్రికా] | 12,064 |
| టే | [స్కాట్లండ్] | 10,527 |
| సోన్ | [ఇండియా] | 10,052 |
| గోదావరి | [ఇండియా] | 9,096 |
| ఫోర్త్ | [స్కాట్లండ్] | 8,300 |
| మహానది | [ఇండియా] | 6,912 |
| రావ్ సాల్డో | [అర్జెంటైనా] | 6,703 |

## పార్లమెంటు సభ్యుల జీతాలు

ప్రపంచంలోని వివిధ దేశాలలోని పార్లమెంటు సభ్యులకు ఒక్కొక్కరికి ఏడాదికి ఎంత జీతం ఇచ్చేది యీ క్రింది పట్టీవలన తెలుసుకోవచ్చును.

| దేశం | ఏడాదికి జీతం |
|---|---|
| ఇంగ్లండు | రు. 15,000 |
| ఉత్తర ఐర్లెండు | రు. 2,800 |
| ఏరా | రు. 8,320 |
| కెనడా (ఫెడరల్) | రు. 10,670 |
| ఆస్ట్రేలియా | రు. 15,000 |
| దక్షిణాఫ్రికా | రు. 6,000 |
| యునైటుడ్ స్టేట్స్ (ఫెడరల్) | రు. 26,750 |
| ఇండియా (సమావేశం జరిగిన రోజులలో) రోజుకి | రు. 40 |
| సిలోన్ | రు. 7,200 |

## వైజ్ఞానిక విశేషాలు

| విశేషం | ఏ దేశస్థుడు కనుక్కొన్నది | సంవత్సరం |
|---|---|---|
| అచ్చుపని | చైనా | 593 |
| టైపురైటర్ | అమెరికా | 1868 |
| వైర్లెస్ | ఇటలీ | 1895 |
| ఆవిరి యంత్రం | ఇంగ్లండ్ | 1765 |
| టెలిఫోన్ | అమెరికా | 1876 |
| గ్రామఫోన్ | అమెరికా | 1876 |
| సినిమా మెషిన్ | అమెరికా | 1894 |
| విమానం | అమెరికా | 1903 |
| ఫోటోగ్రఫీ | ఫ్రాన్స్ | 1837 |
| ఎక్స్‌రే మెషిన్ | జర్మనీ | 1895 |

| | | |
|---|---|---|
| రైల్వే ఇంజన్ | ఇంగ్లండ్ | 1829 |
| మోటారు సైకిలు | ఇంగ్లండ్ | 1888 |
| ఫౌంటెన్ పెన్ | అమెరికా | 1864 |
| సైకిల్ | స్కాట్లండ్ | 1840 |
| మోటారుకారు | జర్మనీ | 1884 |
| కుట్టుపని యంత్రం | ఫ్రాన్సు | 1830 |
| బాంబు | స్వీడన్ | 1903 |
| అగ్గి పుల్ల | ఫ్రాన్సు | 1831 |
| ఏటం బాంబు | జర్మనీ | 1945 |
| క్షవరం బ్లేడు మర | అమెరికా | 1904 |
| రేడియం | ఫ్రాన్సు | 1898 |
| పెనిసిల్లిన్ | ఇంగ్లండ్ | 1944 |

## మానవ శరీరం

మానవ శరీరం చాలా చిత్రమైనది. శరీరంలో ధాతువులు ఏమిటో, శరీరం ఏమి పనిచేస్తుందో రసాయనికంగా పరిశోధన చేస్తే ఈ క్రింది అంశాలు తేలినవి.

ఒక మనిషి శరీరంలో, ఆ మనిషి తూకంలో నూటికి 59 వంతులు నీరు వుంటుంది. మనిషి శరీరంలో వున్న క్రొవ్వు ఏడు సబ్బు చెక్కలను చెయ్యడానికి సరిపోతుంది. మనిషి శరీరంలోని ఫాస్పరస్‌తో 2,200 అగ్గి పుల్లలను చెయ్యవచ్చును; సున్నంతో ఒక బాల్చీని నింపవచ్చును; ఇనుముతో రెండు అంగుళాల మేకును చెయ్యవచ్చును. మనిషి శరీరంలోని రక్తంలో నూటికి 90 పాళ్లు, ఎముకలలో నూటికి 50 పాళ్లు నీరు. ఎదిగిన మనిషి శరీరంలో 270 ఎముకలు వుంటాయి.

ఒక నిమిషంలో మనిషి 200 గజాలు నడువగలడు; 150 మాటలు పలుకగలడు. 30 లేక 40 మాటలు వ్రాయగలడు; 410 ఘనపు అంగుళాల గాలిని పీల్చగలడు.

మనిషి తన జీవితకాలంలో దాదాపు 1,80,000 గంటలసేపు నిద్ర పోతాడు. నిద్రలేకుండా మనిషి 90 గంటలసేపు మాత్రమే ఓర్చుకోగలడు. ఒక రాత్రి నిద్రలో, మనిషి 35 సార్లు ప్రక్కలకు ఒత్తిగిలుతాడు. 6,500 సార్లు ఊపిరి పీలుస్తాడు.

## జీవిత పరిమితి

సృష్టిలోని జీవ జంతువులలో, మనుష్యుడు దాదాపు 80 సంవత్సరముల వరకు జీవించగలడు. కదాచితుగా, సుమారు 120 ఏండ్లవరకు జీవించిన వ్యక్తులు అక్కడక్కడ వున్నారు. అరవైయేళ్ళపైబడి జీవించడం ఒక విశేషమే. అత్యధిక సంఖ్యాకులు 60 ఏళ్ల లోపుననే మరణిస్తున్నారు. ఏ కొద్దిమందో మాత్రం ఆపైన జీవిస్తున్నారు.

తక్కిన జంతువులలో కొన్ని, సాధారణంగా ఎన్ని సంవత్సరాలు బ్రతికేదీ ఈ క్రింది పట్టీని బట్టి తెలుసుకోవచ్చును.

| | |
|---|---|
| ఏనుగు : | 60 |
| ఎలుగు . | 35 |
| ఒంటె : | 30 |
| గుర్రం : | 20 |
| సింహం : | 20 |
| పులి : | 20 |
| ఆవు : | 18 |
| కోతి : | 18 |
| పిల్లి : | 15 |
| మేక : | 15 |
| గొర్రె : | 15 |
| ఎద్దు : | 15 |
| కుక్క : | 12 |

## మోటారుకార్లు

1950 లో యునైటెడ్ స్టేట్సునుంచి 2,75,000 మోటారుబండ్లు, బ్రిటన్ నుంచి 80,000 మోటారుబండ్లు, ఫ్రాన్సునుంచి 35,000 మోటారు బండ్లు ఎగుమతి చేయబడినవి.

# శకములు

కాలాన్ని లెక్క పెట్టుకోడానికి గంటలు, రోజులు, నెలలు, సంవత్సరాలు నిర్ణయించిన మానవులు, సంవత్సరాల సూచనను, శకములను నిర్దేశముగా పెట్టుకున్నారు. ప్రస్తుతం మన దేశంలో వాడుకలో వున్నవి నాలుగు శకాలు, శాలివాహనశకము, క్రైస్తుశకము, ఫసలి, హిజరా.

శాలివాహనశకము, ఆంధ్ర సామ్రాట్టు శాలివాహనుని పేరుతో ఏర్పడినది. ప్రస్తుతం జరుగుతున్న నందన సంవత్సరము, శాలివాహన శకంలో 1875 సంవత్సరం.

క్రీస్తుశకము, క్రైస్తవ మతప్రవక్త జీసస్ క్రైస్తు పేరుతో ఏర్పడింది. ఈ శకంలో 1952 సంవత్సరం ఇప్పుడు జరుగుతున్నది.

ఫసలిఅంటే పంట సంవత్సరం. ఇది మొగల్ చక్రవర్తుల కాలంలో మన దేశంలో వాడుకలోకి వచ్చింది. నందన సంవత్సర ఆషాఢశుద్ధ నవమి మంగళవారం 1952 జులై 1 తేదిన, ఫసలి 1362 ఆరంభమౌతుంది.

హిజరా అంటే ఇస్లాం మతప్రవక్త మహమ్మద్, మక్కానుంచి మదీనాకు రక్షణకోరకు వెళ్ళిన సంవత్సరంతో, అంటే క్రీ. శ. 622 తో ఆరంభమైంది. మహమ్మద్ ప్రవక్త మక్కానుంచి వెళ్ళిపోవడాన్ని హిజరత్ అంటారు. అంచేతనే, యీ శకానికి హిజరా అని పేరువచ్చింది. నందన సంవత్సర ఆశ్వీయుజ శుద్ధ విదియ ఆదివారం 1952 సెప్టెంబరు 21 తేదిన హిజరా 1372 ప్రారంభమౌతుంది.

భారత దేశానికి స్వాతంత్ర్యాన్ని సంపాదించిన గాంధి మహాత్ముని పేరుతో 'గాంధిశకం' వాడుకలో పెట్టవలసిందని చాలామంది కోరుతున్నారు. కొన్ని పంచాంగాలలో యీ శకం వాడుకలో వుందికూడా. 1869 అక్టోబరు 2 నుంచి 1952 అక్టోబరు 2 వరకు యీ శకంలో 83 ఏండ్లు గడిచినట్లు లెక్క.

కలియుగాదినుంచి 1952 మార్చి 26 తేదినాటికి 5053 సంవత్సరాలు గడిచినట్లు లెక్క. ఆ తేదినుంచి 5054 సంవత్సరం ప్రారంభమౌతుంది.

# టైము

భూమి తనచుట్టూ తాను ఒకసారి తిరగడాన్ని ఒక రోజు గాను చంద్రుడు భూమిచుట్టూ ఒక ప్రదక్షిణం చెయ్యడాన్ని ఒక నెల గాను, భూమి సూర్యునిచుట్టూ ఒక ప్రదక్షిణం చెయ్యడాన్ని ఒక ఏడాదిగాను లెక్కించడం అనాదినుంచీ ప్రపంచంలోని అన్నిదేశాల లోనూ వాడుకఅయింది.

భూమి వలయాకారంలో వున్నందుననూ, ఎల్లప్పుడూ తనచుట్టూ తాను తిరుగుతూ వున్నందువల్లనూ, భూమిమీద సూర్యరశ్మి ఎప్పుడూ ఒకే తీక్ష్ణతతో పడదు. సూర్యునికి సరిగా ఎదురుగా వచ్చిన భూభాగం మీద ఎక్కువ తీక్ష్ణతతోనూ, ఏటవాలుగావున్న భూభాగాలమీద తక్కువ తీక్ష్ణతతోనూ సూర్యరశ్మి పడుతుంది. సూర్యకిరణాలు భూమి మీద పడటం ఆరంభమైన సమయాన్ని, ఆయాప్రాంతాలవారు దినారంభంగా భావిస్తున్నారు. కనుక, ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో దినారంభం, వివిధకాలాలలోఅవుతుంది. ప్రతిప్రాంతంవారూ, సూర్యోదయాన్ని ఆధారంగా తమ వాడుకకు టైమును నిర్ణయించుకున్నారు. కాని, ఒక దేశపు టైముకూ మరొక దేశపు టైముకూ తేడాను చెప్పడానికి, కొలబద్దగా ఒక టైము వుండాలి. దానికి గ్రీన్‌విచ్ మీన్ టైము ఉపయోగింపబడుతున్నది.

భూమిని నిలువునా, అక్షాంశాలలో 60 భాగాలుగా, ప్రథమాంశం ఇంగ్లండులోని గ్రీన్‌విచ్ నగరంతో ప్రారంభించినట్లుగా ఊహతో, యీ లెక్కను నిర్ణయించారు. ఈ లెక్క ప్రకారం, గ్రీన్‌విచ్‌లో మధ్యాహ్నం 12 గంటలు అయితే, గ్రీన్‌విచ్‌కి తూర్పున రెండున్నర అక్షాంశములలోవున్న నగరంలో ఉదయం పదిన్నర అవుతుంది.

ఇదే గణనలో, ఇండియన్ స్టాండర్డ్ టైము గ్రీన్‌విచ్ టైము కన్న 5-30 గంటలు ముందు వుంటుంది.

1906 జనవరి 1 వ తేదీకి పూర్వం, భారతదేశంలోని వివిధ రాష్ట్రాలవారు, సూర్యోదయాన్నిబట్టి తమకు అనుకూలమైన పద్ధతిలో వేరు వేరు టైమును లెక్కకట్టుకుంటూ వుండేవారు. ఒక్క రైల్వే గడియారాలలోమాత్రం దేశమంతటా ఒకే టైము చూపబడుతూవుండేది. 1906 జనవరి 1 వ తేదీనుంచి, ఇండియా గవర్నమెంటువారి ప్రోద్బలంతో దేశమంతటా, బెంగాలు ఒరిస్సారాష్ట్రాలు, బొంబాయి నగరంలోనూ తప్ప, ఒకే టైము వాడుకలోకి వచ్చింది. దీనిని ఇండియన్ స్టాండర్డు టైము అంటారు.

బొంబాయినగరంలోని మ్యునిసిపల్ గడియారాలు, ఇండియన్ స్టాండర్డు టైముకు 39 నిమిషాలు తక్కువ చూపిస్తాయి. అంటే మద్రాసులో మధ్యాహ్నం 12 గంటలు అయితే, బొంబాయి మ్యునిసిపల్ గడియారం 11-21 నిమిషాలు చూపిస్తుంది.

గత యుద్ధకాలంలో, ప్రభుత్వంవారు ఇండియన్ స్టాండర్డు టైమును, 1942 సెప్టెంబరు 1 వ తేదీన ఒకగంట ముందుకు జరపారు. యుద్ధానంతరం, 1945 సెప్టెంబరు 15 వ తేదీనుండి యీ పద్ధతి నిరమింపబడింది. మళ్ళీ మామూలు టైము అమలులోకి వచ్చింది.

ప్రస్తుతం మద్రాసులో మధ్యాహ్నం 12 గంటలు అయితే:

| | | | |
|---|---|---|---|
| లండనులో | ఉదయం | $6\frac{1}{2}$ | గంటలు |
| మాస్కోలో | ఉదయం | $9\frac{1}{2}$ | ,, |
| టోకియోలో | సాయంత్రం | $3\frac{1}{2}$ | ,, |
| బెర్లిన్‌లో | ఉదయం | $5\frac{1}{2}$ | ,, |
| పారిస్‌లో | ఉదయం | $6\frac{1}{2}$ | ,, |
| న్యూయార్కులో | రాత్రి | $1\frac{1}{2}$ | ,, |
| రంగూన్‌లో | మధ్యాహ్నం | 1 | ,, |
| ఛుంకింగ్‌లో | మధ్యాహ్నం | $1\frac{1}{2}$ | ,, |

## మన దేశములో టైము

### మద్రాసులో మధ్యాహ్నం 12 గంటలకు

| | | | | | |
|---|---|---|---|---|---|
| అనంతపురం | — | 11-49 | గుత్తి | — | 11-49 |
| బెంగుళూరు | — | 11-49 | గుంటూరు | — | 12-0 |
| బళ్ళారి | — | 11-46 | కర్నూలు | — | 11-51 |
| కాశి | — | 12-11 | మధుర | — | 11-51 |
| బొంబాయి | — | 11-30 | మచిలీపట్టం | — | 12-3 |
| కలకత్తా | — | 12-32 | మైసూరు | — | 11-45 |
| చిత్తూరు | — | 11-55 | నెల్లూరు | — | 11-58 |
| కాకినాడ | — | 12-8 | రాజమండ్రి | — | 12-6 |
| కోయంబత్తూరు | — | 11-46 | విశాఖపట్టం | — | 12-17 |
| కడప | — | 11-54 | విజయనగరం | — | 12-12 |
| ఢిల్లీ | — | 11-47 | శ్రీకాకుళం | — | 12-15 |
| గంజాం | — | 12-19 | హైదరాబాదు | — | 11-52 |

### భూమినుంచి గ్రహాలదూరం

| | |
|---|---|
| సూర్యుడు | 9,30,05 వేల మైళ్ళు |
| చంద్రుడు | 2,33,857 ,, |
| కుజుడు | 24,80,00 వేల ,, |
| బుధుడు | 13,60,00 వేల ,, |
| గురుడు | 60,00,00 వేల ,, |
| శుక్రుడు | 16,10,00 వేల ,, |
| శని | 1,02,80,00 వేల ,, |

# సంవత్సరములు

| | | | |
|---|---|---|---|
| ప్రభవ | 1927-28 | హేవిళంబి | 1957-58 |
| విభవ | 1928-29 | విళంబి | 1958-59 |
| శుక్ల | 1929-30 | వికారి | 1959-60 |
| ప్రమోదూత | 1930-31 | శార్వరి | 1960-61 |
| ప్రజోత్పత్తి | 1931-32 | ప్లవ | 1961-62 |
| ఆంగీరస | 1932-33 | శుభకృతు | 1962-63 |
| శ్రీముఖ | 1933-34 | శోభకృతు | 1963-64 |
| భావ | 1934-35 | క్రోధి | 1964-65 |
| యువ | 1935-36 | విశ్వావసు | 1965-66 |
| ధాత | 1936-37 | పరాభవ | 1966-67 |
| ఈశ్వర | 1937-38 | ప్లవంగ | 1967-68 |
| బహుధాన్య | 1938-39 | కీలక | 1968-69 |
| ప్రమాది | 1939-40 | సౌమ్య | 1969-70 |
| విక్రమ | 1940-41 | సాధారణ | 1970-71 |
| వృష | 1941-42 | విరోధికృతు | 1971-72 |
| చిత్రభాను | 1942-43 | పరీధావి | 1972-73 |
| సుభాను | 1943-44 | ప్రమాదీచ | 1973-74 |
| తారణ | 1944-45 | ఆనంద | 1974-75 |
| పార్థివ | 1945-46 | రాక్షస | 1975-77 |
| వ్యయ | 1946-47 | నల | 1976-76 |
| సర్వజిత్తు | 1947-48 | పింగళ | 1977-78 |
| సర్వధారి | 1948-49 | కాళయుక్తి | 19780-1 |
| విరోధి | 1949-50 | సిద్ధార్థి | 1979782 |
| వికృతి | 1950-51 | రౌద్రి | 1980-83 |
| ఖర | 1951-52 | దుర్మతి | 1981-89 |
| నందన | 1952-53 | దుందుభి | 1982-8- |
| విజయ | 1953-54 | రుధిరోద్గారి | 1983-84 |
| జయ | 1954-55 | రక్తాక్షి | 1984-85 |
| మన్మథ | 1955-56 | క్రోధన | 1985-86 |
| దుర్ముఖి | 1956-57 | అక్షయ | 1986-87 |

# రెండు ప్రపంచ యుద్ధములు

ఈ శతాబ్దంలో ఒక్కతరంలో, రెండు ప్రపంచయుద్ధాలు సంఘటిల్లాయి. మొదటియుద్ధం 1914 నుంచి 1918 వరకు, రెండవ యుద్ధం 1939 నుంచి 1945 వరకు జరిగాయి. ఆ యుద్ధాల వివరాలివి:

## 1914—18 యుద్ధం

| | |
|---|---|
| యుద్ధ ప్రారంభం | 1914 ఆగస్టు 1 |
| యుద్ధవిరామపు ఒడంబడిక సంతకాలు జరిగినది | 1918 నవంబరు 11 |

యుద్ధంలో పాల్గొన్న దేశాలు...27

మిత్రులు — రష్యా, ఫ్రాన్సు, బ్రిటిషుసామ్రాజ్యం, ఇటలీ యునైటెడ్ స్టేట్సు. జపాను, రుమేనియా, సెర్బియా, బెల్జియం, గ్రీసు, పోర్చుగల్, మాంటినీగ్రో.

ఈమిత్రులకు శత్రువులు: జర్మనీ, ఆస్ట్రియా-హంగరీ, టర్కీ, బల్గేరియా,

యుద్ధహతులు — ఫ్రాన్సు, 13,93,388; బెల్జియం, 38,172; ఇటలీ, 4,60,000 ; పోర్చుగల్, 7,722; రుమేనియా 3,35,706; సెర్బియా, 1,25,535; యునైటెడ్ స్టేట్సు, 1,15,660; జర్మనీ, 20,50,466;ఆస్ట్రియా-హంగరీ, 12,00,000,; బల్గేరియా, 1,01,224; టర్కీ, 3,00,000; బ్రిటిషు సామ్రాజ్యం, 10,89,919;(బ్రిటన్,ఐర్లెండు, 8,12,317; కెనడా, 61,817; ఆస్ట్రేలియా, 60,456; న్యూజీలెండ్, 18,212; దక్షిణాఫ్రికా, 9,032; న్యూఫౌండు లాండ్, 1,609; వలసదేశాలు, 52,044, ఇండియా, 73,432)

యుద్ధవ్యయం — అన్నిదేశాలకూ కలిపి మొదటి ప్రపంచయుద్ధంలో, 18,600 కోట్ల డాలర్లు, అంటే సుమారు 60,450 కోట్ల రూపాయలు ఖర్చు అయిందని అంచనా వేయబడింది.

## 1939—45 యుద్ధం

| | |
|---|---|
| యుద్ధప్రారంభం | 1939 సెప్టెంబర్ 1 |
| ముగింపు | 1945 ఆగస్టు 14 |

యుద్ధంలో పాల్గొన్న దేశాలు

యూరపులో, స్విట్జర్లెండ్, స్వీడన్, స్పెయిన్, పోర్చుగల్, టర్కీ దేశాలూ, దక్షిణఅమెరికాలోని రెండు మూడు దేశాలూ తప్ప, ప్రపంచంలోని ఇతర దేశాలన్నీ యీ యుద్ధంలో పాల్గొన్నవే.

యుద్ధ హతులు — ఈ యుద్ధంలో మొత్తం ఎంతమంది చనిపోయినదీ స్పష్టమైన లెక్కలు యింకా తేలలేదు. కాని, బ్రిటిషు ప్రధానమంత్రి అట్లీ, 1945 నవంబరు 29 తేదీన, పార్లమెంటులో చెప్పినదాన్నిబట్టి బ్రిటిషు సామ్రాజ్యదేశాలకు కలిగిన జననష్టం యీ క్రింది విధంగా తేలింది.

| దేశం | చచ్చినవారు | గాయపడినవారు |
|---|---|---|
| ఇంగ్లండు | 2,44,723 | 2,77,090 |
| కెనడా | 37,476 | 53,174 |
| ఆస్ట్రేలియా | 23,365 | 39,803 |
| న్యూజీలెండ్ | 10,033 | 19,314 |
| దక్షిణాఫ్రికా | 6,840 | 14,363 |
| ఇండియా | 24,338 | 64,354 |
| కాలనీలు | 6,877 | 6,972 |

జర్మను సైనికులు 26,65,000 మంది చనిపోయారనీ, పౌరులు 5,00,000 మంది చనిపోయారనీ అంచనా.

యునైటెడ్ స్టేట్సు సైనికులు 2,013,67 మంది హతులయ్యారనీ, 5,70,783 మంది గాయపడినారనీ లెక్కలు తేలాయి.

## రెండవ ప్రపంచయుద్ధములో ప్రధాన సంఘటనలు:

1939 సెప్టెంబరు 1: పోలెండుపై జర్మనీ దాడి.
3: జర్మనీపై ఇంగ్లండ్, ఫ్రాన్సుల యుద్ధప్రకటన.

1940 జూన్ 10: ఫ్రాన్సుపై ఇటలీ దాడి.
21: ఫ్రాన్సు లొంగుబాటు.

1941 డిసెంబరు 7: బ్రిటను అమెరికాలపై జపాను యుద్ధప్రకటన పెర్ల్‌హార్బరుపై ముట్టడి.
25: హాంకాంగ్ పతనం.

1942 ఫిబ్రవరి 15: సింగపూరు పతనం.
మార్చి 8: రంగూన్ పతనం.
ఏప్రిల్ 6: విశాఖపట్టణం, కాకినాడలపై జపాను విమాన దాడి.

డిసెంబరు 20: కలకత్తాపై జపాన్ విమానదాడి.

1945 మే 7: జర్మనీ లొంగుబాటు.
ఆగస్టు 10: జపాను లొంగుబాటు.

1952 ఏప్రిల్ 30: జపానుతో అమెరికా మొదలైన రాజ్యాల ఒడంబడిక. జపాను స్వపరిపాలన హక్కు. జపానుతో యుద్ధవిరమణ సంధిపై 1951 సెప్టెంబరు 8 తేదీన, శాన్‌ఫ్రాన్సిస్కోలో 48 దేశాలు సంతకం పెట్టినవి. వానిలో ఇండియా పాల్గొనలేదు. ఇండియా జపానుతో ప్రత్యేక ఒడంబడిక చేసుకుంటున్నది.

## కొరియా యుద్ధం

ఉత్తర కొరియా, దక్షిణకొరియామీద 1950 జూన్ 25 తేదీన దాడిచేసింది. ఉత్తరకొరియా కమ్యూనిస్టురాజ్యం.

కొరియాలో యుద్ధం ప్రారంభమైందని తెలియగానే జూన్ 25 న యునైటెడ్ నేషన్స్ సెక్యూరిటీకౌన్సిలు లేక్‌సక్సెస్‌లో సమావేశమై, పోట్లాట తక్షణమే ఆపివెయ్యాలనీ, దక్షిణకొరియానుంచి తన సైన్యాలను ఉత్తరకొరియా వెనకకు మళ్ళించాలనీ తీర్మానించింది.

కాని, అలాటిదేనీ జరుగలేదు. సెక్యూరిటీకౌన్సిలు మళ్ళీ జూన్ 25 తేదీన సమావేశమై దక్షిణకొరియాకు యునైటెడ్ నేషన్సు సభ్యులందరూ సహాయం చెయ్యాలని తీర్మానంచేసింది. ఈ తీర్మానాన్ని ఇండియాప్రభుత్వం, జూన్ 29 తేదీన అంగీకరించింది.

1950 నవంబరు అంతంలో చైనా సైన్యాలు దాదాపు మూడు లక్షలు, మంచూరియావైపునుంచి కొరియాలో ప్రవేశించాయి. ఈ సైన్యాల తాకిడికి తట్టుకోలేక అమెరికన్‌సైన్యాలు తిరోగమనం ప్రారంభించాయి. డిసెంబరు 8 తేదీనాటికి, చైనాసైన్యాలు ఉత్తర కొరియా రాజధాని పాంగ్‌యాంగ్‌ను చేసుకున్నాయి. క్రమేపీ దక్షిణ కొరియా రాజధాని సేవూల్‌నుకూడా ఆక్రమించాయి. తరువాత, అమెరికన్ సైన్యాలు మళ్ళీ తీవ్రయుద్ధం సాగించి, సేవూల్‌ను తిరిగి ఆక్రమించాయి.

1951 జూలై 10న కొరియాలో యుద్ధవిరమణకు రాయబారాలు ప్రారంభమయాయి. అప్పటినుంచీ, మధ్య మధ్య ఆటంకాలతో, ఆ రాయబారాలు ఇంకా సాగుతూనే వున్నాయి.

# యునైటెడ్ నేషన్స్

## సంయుక్తరాజ్య సమితి

1941 ఆగస్టు 14 తేదీన అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్టు, బ్రిటిషు ప్రధాని విన్స్టన్ చర్చిల్ 'అట్లాంటిక్ ప్రణాళిక' అనే పేరుతో ఒక ప్రకటనను చేశారు. ఆ ప్రణాళిక ముఖ్యోద్దేశాలు ఏమిటంటే: ప్రతిదేశపు ప్రజలకు, మరొకదేశంవల్ల దౌర్జన్యభయంలేకుండా చెయ్యడం; ప్రతిదేశంలోని ప్రజలు యిష్టంవచ్చిన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకునే స్వాతంత్ర్యాన్ని కలిగివుండటము; ప్రపంచం అంతటా కోరికేసంపత్తికీ ప్రపంచం అంతటా వ్యాపారంచేసుకోడానికీ ప్రతీ దేశానికీ హక్కువుండటము; సముద్రాలమీద ప్రయాణంచెయ్యడానికి ప్రతిదేశపు నౌకలకు సమానహక్కులు వుండటం; ప్రతిదేశంలోను కార్మికుల పరిస్థితులను చక్కబరచడం.

1945 జనవరి 1 తేదీన 26 మిత్రరాజ్యాలు యునైటెడ్ నేషన్స్ ప్రకటనపై సంతకంచేశాయి.

1942 అక్టోబరు 30 తేదీన, చైనా, రష్యా, బ్రిటన్, యునైటెడ్ స్టేట్సుదేశాలు 'మాస్కో ప్రకటన' అనేపేరుతో, తాము సంయుక్తంగా ప్రపంచ శాంతికొరకు కృషిచేస్తామని ప్రకటించాయి.

ఆతరువాత అంతర్జాతీయ శాంతిని భద్రతను కాపాడడానికి ఒక సంస్థను స్థాపించడానికి కృషి జరిగింది.

డంబర్టన్ ఓక్స్లో 1944లో జరిగిన బ్రిటిషు, అమెరికన్, రష్యన్, చైనా రాజ్యాల ప్రతినిధుల సమావేశం ఫలితంగా అంతర్జాతీయ శాంతిని, భద్రతను కాపాడటానికి అంతర్జాతీయ సమితిని ఒకదానిని స్థాపించడానికి నిర్ణయం జరిగింది. అప్పుడు, సంయుక్తరాజ్య సమితి స్థాపనకు ప్రణాళిక ఒకటి తయారు చేయబడింది.

తరువాత, 1945 ఏప్రిల్‌లో శాన్ ఫ్రాన్సిస్కోలో 50 రాజ్యాల ప్రతినిధులు సమావేశమై, డంబర్టన్ ఓక్స్ ప్రణాళికను ప్రాతిపదికగా పెట్టుకొని సంయుక్తరాజ్యసమితి (యునైటెడ్ నేషన్స్)కి నిబంధనలను తయారుచేశారు. నిబంధనలను ఆ 50 రాజ్యాల ప్రతినిధులు అంగీకరించి, ప్రణాళిక (ఛార్టర్)పై సంతకాలుచేశారు. తరువాత, నిబంధనలప్రకారం కనీసం ఎన్నిరాజ్యాలు ఈ ప్రణాళికను అంగీకరించాలో అన్నిరాజ్యాలూ తమ పార్లమెంటుల అంగీకారాన్నిపొంది, తమ ఒప్పందాన్ని తెలియపరచడంతో 1945 అక్టోబరు 24 వ తేదీన యునైటెడ్ నేషన్స్ అమలులోకి వచ్చింది.

యునైటెడ్ నేషన్స్ తరఫున ఒక ప్రిపరేటరీ కమిషను (సమితికి అవసరమైన ఏర్పాట్లుచేసే సంస్థ) నియమింపబడింది. ఈ కమిషను 1945 జూన్‌లోనూ, నవంబరులోనూ, లండన్‌లో సమావేశమై 1946 జనవరి 10 వ తేదీన లండన్‌లో జరిగిన యునైటెడ్ నేషన్స్ మహాసభ (జనరల్ అసెంబ్లీ)కు ఒక నివేదికను సమర్పించినది.

## సభ్యులు

శాన్ ఫ్రాన్సిస్కో సమావేశంనాటికి యునైటెడ్ నేషన్స్‌లో సభ్యత్వాన్ని పొందిన దేశాలు ఇవి:

అబిస్సీనియా, అర్జెంటైనా, ఆస్ట్రేలియా, బెల్జియం, బొలీవియా, బ్రెజిల్, బైలోరష్యా, కెనడా, చిలీ, చైనా, కొలంబియా, కోస్టారికా, క్యూబా, చెకోస్లోవేకియా, డెన్మార్క్, డొమినికన్ రిపబ్లిక్, ఈక్వెడార్, ఈజిప్టు, ఎల్ సాల్వెడార్, ఫ్రాన్స్, గ్రీసు, గోతెమాలా, హైటి, హొండురాస్, ఇండియా, ఇరాక్, ఇరాన్, లెబనాన్, లైబీరియా, లక్సెంబర్గ్, మెక్సికో, హాలెండ్, దక్షిణాఫ్రికా, న్యూజీలెండ్, నికరాగువా, నార్వే, పెనామా, పెరాగువే, పెరు, ఫిలిప్పైన్స్, పోలెండ్, సావుది అరేబియా, సిరియా, టర్కీ, యుక్రెయిన్, బ్రిటన్, యునైటెడ్ స్టేట్సు, ఉరూగువే, వెనిజులా, యుగోస్లావియా, రష్యా.

తరువాత చేరిన సభ్యులు: ఆఫ్ఘనిస్తాన్ (1946); ఐస్‌లెండ్ (1946); స్వీడెన్ (1946); సయాం (1946); పాకిస్తాన్ (1947); ఎమెన్ (1947); బర్మా (1948); ఇస్రాయేల్ (1949); ఇండోనేషియా (1950).

1952 జనవరి 1 నాటికి యునైటెడ్ నేషన్సులో సభ్యత్వంగల దేశాలసంఖ్య: 60.

## యునైటెడ్ నేషన్సు ప్రధాన సంస్థలు

### జనరల్ అసెంబ్లీ (మహాసభ)

యునైటెడ్ నేషన్సు సభ్యులందరూ కూడినసభ జనరల్ అసెంబ్లీ. ఈ అసెంబ్లీ, చార్టరులో పేర్కొనబడిన ఏ విషయాన్ని గురించిఅయినా చర్చలుజరిపి, యునైటెడ్ నేషన్సులో సభ్యతగల ఏ దేశానికైనాగాని, సెక్యూరిటీ కౌన్సిలుకుగాని సలహాలను యివ్వవచ్చును. అయితే, సెక్యూరిటీకౌన్సిలు పర్యవేక్షణలోవున్న సమస్యలను గురించిగాని, తగాదాలను గురించిగాని, జనరల్ అసెంబ్లీ ఏవిధమైన సలహాలను చెయ్యరాదు. ప్రపంచశాంతికి భంగంకలిగించే తగాదాలుగాని, సంఘటనలుగానీ, ఏవైనా జనరల్ అసెంబ్లీ దృష్టిలోకి వచ్చినట్లయితే, వాటవిషయమై తగిన చర్య తీసుకోవలసిందని సెక్యూరిటీ కౌన్సిలును జనరల్ అసెంబ్లీ కోరవచ్చును. అంతర్జాతీయ శాంతిరక్షణకు సెక్యూరిటీకౌన్సిలు అమలుజరిపిన చర్యలనుగురించీ, అమలు జరుపబోయే చర్యలనుగురించీ, సెక్యూరిటీకౌన్సిలు సమర్పించే రిపోర్టులను, జనరల్ అసెంబ్లీ పరిశీలించాలి.

రాజకీయంగా అంతర్జాతీయ సహకారాన్ని పెంపొందించడానికీ, అంతర్జాతీయ న్యాయశాసనాలను తయారుచెయ్యడానికీ, ఆర్థిక, వైజ్ఞానిక, విద్యా, ఆరోగ్యవిషయాలలో వివిధదేశాలమధ్య సహకారం పెంపొందించడానికీ, జాతి, మత, భాషాభేదంలేకుండా, ప్రపంచం

లోని వ్యక్తులందరూ తమ మానవాధికారాలను అనుభవించేటట్లు చెయ్యడంలో తోడ్పడడానికీ, కలహాలను యిత్వర్యడం, పరిష్కారాలు సూచపడం, యీ అసెంబ్లీ బాధ్యత.

అంతర్జాతీయ ధర్మకర్తృత్వం విషయంలోనూ, వ్యూహాత్మకస్థలాలకు అనుకూలరంగాలుగాని మిగతా ఏ ప్రదేశాలలైనా ధర్మకర్తృత్వ పరిపాలనలో వుంచాలంటే వీటికి సంబంధించిన ఒడంబడికలను ఆమోదించడంలోనూ యీ అసెంబ్లీకి బాధ్యతవుంది.

ఈ అసెంబ్లీలో సభ్యులుగా వున్న వారందరికీ ఒక్కొక్క వోటు వుంటుంది. ఏదైనా ముఖ్యవిషయంలో, అసెంబ్లీలో మూడింట రెండు వంతుల సభ్యులు అంగీకరిస్తేనే ఆవిషయాన్ని అసెంబ్లీ అంగీకరించినట్లు, సామాన్యవిషయాలలో ఎక్కువమంది సభ్యులు అంగీకరించిన విషయం నెగ్గినట్టే లెఖ్ఖ.

జనరల్ అసెంబ్లీ ప్రధానకార్యస్థానం యునైటెడ్ స్టేట్సులోని న్యూయార్కు నగరంలోని మన్‌హాటన్ దీవిలో స్థాపించడానికి నిర్ణయించబడింది. దీని కార్యాలయ నిర్మాణానికి జాన్ డి. రాక్‌ఫెల్లర్ దాదాపు మూడుకోట్ల రూపాయల విరాళం ఇచ్చాడు.

ఈ అసెంబ్లీ ప్రతిసంవత్సరం వార్షికసభ జరుపుతుంది. అవసరాన్నిబట్టి ప్రత్యేకసమావేశాలుకూడా జరుపవచ్చు. సెక్యూరిటీ కౌన్సిలులో ప్రతిసంవత్సరం ఖాళీఅయే మూడుస్థానాలకూ, ఎకనమిక్ అండ్ సోషల్ కౌన్సిలులో ప్రతిసంవత్సరం ఖాళీఅయే ఆరుస్థానాలకూ ఎన్నికలు జనరల్ అసెంబ్లీ వార్షికసమావేశంలో జరుగుతాయి.

జనరల్ అసెంబ్లీ అధ్యక్షుడు 1951-52: డాక్టర్ పాడిల్లో నెర్వో (మెక్సికో)

ఈ అసెంబ్లీ కార్యభారం అంతా ఆరు ప్రధానమైన కమిటీల మధ్య పంచబడింది. ఈ కమిటీలలో సభ్యులుగా వుండడానికి, జనరల్ అసెంబ్లీ సభ్యులందరికీ హక్కువుంది. ఆ కమిటీలు యివి:

1. రాజకీయ భద్రత
2. ఆర్థిక వ్యవహారములు
3. సాంఘిక, మానవసేవ, వైజ్ఞానికవిషయములు
4. ధర్మకర్తృత్వము
5. పరిపాలనా వ్యవహారములు
6. న్యాయవిషయాములు

ఈ కమిటీలుకాక, 14 మంది సభ్యులుగల జనరల్ కమిటీ వుంది. అది కేవలం యునైటెడ్ నేషన్సు పరిపాలనా వ్యవహారాలకు సంబంధించినది.

సెక్యూరిటీ కౌన్సిలు:

సెక్యూరిటీ కౌన్సిలులో, జనరల్ అసెంబ్లీచే ఎన్నుకోబడిన 11 మంది సభ్యులు వుంటారు. వీరిలో అయిదుగురు, చైనా, ఫ్రాన్సు, రష్యా, బ్రిటన్, అమెరికాల తరఫున ఎన్నుకోబడినవారు. ఈ దేశాల ప్రతినిధుల ఎన్నిక శాశ్వతమైనది. మిగతా ఆరుమంది సభ్యులనూ ఏ దేశాలనుంచియినా ఎన్నుకోవచ్చును. ఈ ఆరుగురి సభ్యత్వపు పరిమితి రెండేసి సంవత్సరాలు. అయితే మొదటి సంవత్సరం, ముగ్గురే ఎన్నుకోబడినారు. 1947 జనవరిలో జరిగిన జనరల్ అసెంబ్లీ సమావేశంలో, సెక్యూరిటీ కౌన్సిలు సభ్యులుగా రెండు సంవత్సరాల పరిమితికి ఆస్ట్రేలియా, బ్రెజిల్, పోలెండు ప్రతినిధులూ, ఒక సంవత్సరం పరిమితికి, ఈజిప్టు, మెక్సికో, హాలెండు ప్రతినిధులూ, ఎన్నుకోబడినారు. ఈ ఏర్పాటునుబట్టి, ప్రతిసంవత్సరం ముగ్గురు ప్రతినిధులకు ఎన్నిక జరుగుతుంది.

అంతర్జాతీయ శాంతినీ భద్రతనూ కాపాడే ప్రధాన బాధ్యత యీ కౌన్సిలుది. యునైటెడ్ నేషన్సు సభ్యులందరూ, యీ కౌన్సిలు నిర్ణయాలను అమలు జరిపితీరాలి.

లోని వ్యక్తులందరూ తమ మానవహక్కులను అనుభవించేటట్లు చెయ్యడంలో తోడ్పడడానికీ, సలహాలను యివ్వడం, పరిశోధనలు జరుపడం, యీ అసెంబ్లీ బాధ్యత.

అంతర్జాతీయ ధర్మకర్తృత్వం విషయంలోనూ, యుద్ధసంధ్యలకు అనుకూలరంగాలుగాని మిగతా ఏప్రదేశాలనైనా ధర్మకర్తృత్వ పరిపాలనలో వుంచాలంటే వీటికి సంబంధించిన ఒడంబడికలను ఆమోదించడంలోనూ యీ అసెంబ్లీకి బాధ్యతవుంది.

ఈ అసెంబ్లీలో సభ్యులుగా వున్నవారందరికీ ఒక్కొక్క వోటు వుంటుంది. ఏదైనా ముఖ్యవిషయంలో, అసెంబ్లీలో హాజరైంట రెండు వంతుల సభ్యులు అంగీకరిస్తేనే ఆవిషయాన్ని అసెంబ్లీ అంగీకరించినట్లు, సామాన్యవిషయాలలో ఎక్కువమంది సభ్యులు అంగీకరించిన విషయం నెగ్గినట్టే లెఖ్ఖ.

జనరల్ అసెంబ్లీ ప్రధానకార్యస్థానం యున్నైటెడ్ స్టేట్సులోని న్యూయార్కు నగరంలోని మన్‌హాటన్ దీవిలో స్థాపించడానికి నిర్ణయించబడింది. దీని కార్యాలయ నిర్మాణానికి జాన్ డి. రాక్‌ఫెల్లర్ జూనియర్ మూడుకోట్ల రూపాయల విరాళం ఇచ్చాడు.

ఈ అసెంబ్లీ ప్రతిసంవత్సరం వార్షికసభ జరుపుతుంది. అవసరాన్నిబట్టి ప్రత్యేకసమావేశాలుకూడా జరుపవచ్చు. సెక్యూరిటీ కౌన్సిలులో ప్రతిసంవత్సరం ఖాళీఅయే మూడుస్థానాలకూ, ఎకనమిక్ అండ్ సోషల్ కౌన్సిలులో ప్రతిసంవత్సరం ఖాళీఅయే ఆరుస్థానాలకూ ఎన్నికలు జనరల్ అసెంబ్లీ వార్షికసమావేశంలో జరుగుతాయి.

జనరల్ అసెంబ్లీ అధ్యక్షుడు 1951-52: డాక్టర్ పాడిల్లో నెర్వో (మెక్సికో)

ఈ అసెంబ్లీ కార్యభారం అంతా ఆరుప్రధానమైన కమిటీల మధ్య పంచబడింది. ఈ కమిటీలలో సభ్యులుగా వుండడానికి, జనరల్ అసెంబ్లీ సభ్యులందరికీ హక్కువుంది. ఆ కమిటీలు యివి:

1. రాజకీయ భద్రత
2. ఆర్థిక వ్యవహారములు
3. సాంఘిక, మానవసేవ, వైజ్ఞానిక విషయములు
4. ధర్మకర్తృత్వము
5. పరిపాలనా వ్యవహారములు
6. న్యాయవిషయములు

ఈ కమిటీలుకాక, 14 మంది సభ్యులుగల జనరల్ కమిటీ వుంది. అది కేవలం యునైటెడ్ నేషన్సు పరిపాలనా వ్యవహారాలకు సంబంధించినది.

## సెక్యూరిటీ కౌన్సిలు:

సెక్యూరిటీ కౌన్సిలులో, జనరల్ అసెంబ్లీచే ఎన్నుకోబడిన 11 మంది సభ్యులు వుంటారు. వీరిలో అయిదుగురు, చైనా, ఫ్రాన్సు, రష్యా, బ్రిటన్, అమెరికాల తరఫున ఎన్నుకోబడినవారు. ఈ దేశాల ప్రతినిధుల ఎన్నిక శాశ్వతమైనది. మిగతా ఆరుమంది సభ్యులనూ ఏ దేశాలనుంచీఅయినా ఎన్నుకోవచ్చును. ఈ ఆరుగురి సభ్యత్వపు పరిమితి రెండేసి సంవత్సరాలు. అయితే మొదటి సంవత్సరం, ముగ్గురే ఎన్నుకోబడినారు. 1947 జనవరిలో జరిగిన జనరల్ అసెంబ్లీ సమావేశంలో, సెక్యూరిటి కౌన్సిలు సభ్యులుగా రెండు సంవత్సరాల పరిమితికి ఆస్ట్రేలియా, బ్రెజిల్, పోలెండు ప్రతినిధులూ, ఒక సంవత్సరం పరిమితికి, ఈజిప్టు, మెక్సికో, హాలెండు ప్రతినిధులూ, ఎన్నుకోబడినారు. ఈ ఏర్పాటునుబట్టి, ప్రతిసంవత్సరం ముగ్గురు ప్రతినిధులకు ఎన్నిక జరుగుతుంది.

అంతర్జాతీయ శాంతినీ భద్రతనూ కాపాడే ప్రధాన బాధ్యత యీ కౌన్సిలుది. యునైటెడ్ నేషన్సు సభ్యులందరూ, యీ కౌన్సిలు నిర్ణయాలను అమలు జరిపితీరాలి.

1952 జనవరినాటికి సెక్యూరిటీ కౌన్సిలులో సభ్యతగల దేశాలు ఇవి: శాశ్వత సభ్యులు; అమెరికా, ఇంగ్లండు, రష్యా, ఫ్రాన్సు, చైనా, 1952 అంతంవరకు: బ్రెజిల్, హాలెండ్, టర్కీ. 1953 అంతంవరకు: చిలి, పాకిస్తాన్, గ్రీస్.

కౌన్సిలులో ప్రతిసభ్యుడికీ ఒక ఓటువుంది. కార్యక్రమానికి సంబంధించిన వ్యవహారాలలో ఏడుగురు సభ్యుల అంగీకారం కావాలి. ఇతరవిషయాలలో ఏడుగురు సభ్యుల అంగీకారంతో, శాశ్వతసభ్యుల అంగీకారంకూడా కావాలి. తగాదాలలో ప్రతికక్షిత్వంగల సభ్యుడు ఓటు చెయ్యకూడదు.

యునైటెడ్ నేషన్సు ప్రధాన కార్యాలయస్థానంలో, సెక్యూరిటీ కౌన్సిలు ఎప్పుడూ సమావేశం అవుతూనేవుంటుంది.

ఈ కౌన్సిలు అధ్యక్షత, సభ్యులందరూ వంతులప్రకారం ఒకొక నెల నిర్వహిస్తారు. ఈ వంతును నిర్ణయించడంలో, సభ్యుల పేర్లను యింగ్లీషులో వ్రాస్తే ఏ. బి. సి. డి. ల వరుసలో, క్రమముగా ముందు తనపేరు వచ్చిన సభ్యుడు ముందు, తరువాత వచ్చిన సభ్యుడు తరువాత అధ్యక్షుడవుతాడు.

అంతర్జాతీయ శాంతిని కాపాడడానికి యీకౌన్సిలు చేయవలసిన ఏర్పాట్లను గురించి దీనికి సలహా యివ్వడానికి మిలిటరీ సలహా కమిటీ వొకటి వుంది.

ఏటం శక్తి ఉపయోగాన్నిగురించీ, శాంతికి భంగం లేకుండా ఏటం శక్తిని వివిధ దేశాలలో ఉపయోగానికి తీసుకు రావడాన్ని గురించీ, ప్రమాదకరంగా యీ శక్తిని ఉపయోగించడాన్ని నిషేధించడానికి అమలు జరుపవలసిన చర్యలనుగురించీ యీ కౌన్సిలుకు సలహా యివ్వడానికి, ఎటామిక్ ఎనర్జీ కమిషను నెలకొల్పడానికి 1946 జనవరి 24 న నిర్ణయం జరిగింది. సెక్యూరిటీ కౌన్సిలులో సభ్యత్వంగల అన్ని దేశాల తరఫున ఒకొక్క ప్రతినిధి, కెనడా తరఫున ఒక ప్రతినిధి ఈ కమిషనులో సభ్యత్వం కలిగివున్నారు.

## ఎకనమిక్ అండ్ సోషల్ కౌన్సిలు

యునైటెడ్ నేషన్సులో చేరిన దేశాలలో ప్రజలు జీవిత ప్రమాణాలను అభివృద్ధిపరచడానికీ నిరుద్యోగత లేకుండా చూడడానికీ, ఆర్థిక పరిస్థితులను చక్కబరచడానికీ, సాంఘిక పరిమాణానికి దోహదమివ్వడానికీ, అంతర్జాతీయ ఆర్థిక, సాంఘిక ఆరోగ్యవిషయాలకు సంబంధించిన సమస్యల పరిష్కారానికి తోడ్పడడానికీ, అంతర్జాతీయ వైజ్ఞానిక, విద్యాసహకారానికి కృషిచెయ్యడానికి, మానవ హక్కులపట్ల గౌరవం కలిగించడానికి, జాతి, మత, భాషా భేదంలేకుండా అందరి వ్యక్తి స్వాతంత్ర్యాలపట్ల గౌరవం వుండేటట్లు చూడడానికీ ఈసంస్థ వుద్దేశింపబడింది. ఈ కౌన్సిలు అంతర్జాయ ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక, విద్యా, ఆరోగ్యాది విషయములనుగురించి పరిశీలనలు జరుపవచ్చు. ఆయా విషయాలనుగురించి జనరల్ అసెంబ్లీకిగాని, యునైటెడ్ నేషన్సులో సభ్యత్వంగల రాజ్యాలకుగాని సలహాలు యివ్వవచ్చు. ఈరాజ్యాలలో అమలు జరుపదలచుకున్న నిబంధనలను తయారుచెయ్యవచ్చు. అంతర్జాతీయ సమావేశాలను జరుపవచ్చు.

ఈ కౌన్సిలు పర్యవేక్షణలోవున్న విషయాలనుగురించి చర్యతీసుకోడానికి ఆరు కమిషనులు ఏర్పాటుచేయబడినవి.

ఈ కౌన్సిలు సభ్యుల సంఖ్య 18. ఈ సభ్యులందరూ జనరల్ అసెంబ్లీ ఎన్నుకోవలసిందే. సభ్యుల కాలపరిమితి మూడుసంవత్సరాలు, కాని మొదటిసారి ఎన్నికలలో, మూడుసంవత్సరాలకు ఆరుగురు, రెండు సంవత్సరాలకు ఆరుగురు, ఒక సంవత్సరానికి ఆరుగురు ఎన్నుకోబడినారు. ఈ యేర్పాటునుబట్టి ప్రతిసంవత్సరం, ఆరుగురు సభ్యుల ఎన్నిక జరుగుతుంది.

ఈ సంస్థకు అధ్యక్షుడు:—డాక్టర్ హెర్నన్ శాంటాక్రూజ్.

## ట్రస్టీషిప్ కౌన్సిలు :

స్వపరిపాలన చేసుకోలేని దేశాలలో, ఆ దేశ ప్రజలు స్వపరిపాలన చేసుకునే సమర్థతను పొందేటంతవరకూ, ఆదేశపరిపాలనలో ధర్మకర్తల మాదిరిగా, దేశీయుల క్షేమాన్నే ప్రధాన కర్తవ్యంగా పరిపాలన జరిపే ఏర్పాట్లను చెయ్యడానికి, యునైటెడ్ నేషన్స్ స్థాపించిన సంస్థ.

ఇలా ట్రస్టీషిప్ పరిపాలనలోవుంటే దేశాలలో ఏవైనా, యుద్ధ చర్యలకు చాలాప్రాముఖ్యతగల ప్రదేశాలలో వున్నట్లయితే, వాటిలో పరిపాలన పర్యవేక్షణను, యీ కౌన్సిలు చూస్తుంది. ఏదేశంలోనైనా ధర్మకర్తృత్వపు పరిపాలనచేసే, మరొకదేశం, తమ పరిపాలన ఎలా చేస్తున్నదీ యీ కౌన్సిలుకు రిపోర్టు పంపుతూవుండాలి. ఆ దేశాల ప్రజలు, పరిపాలనచేస్తున్న దేశపు అధికారుల చర్యలనుసరించి అర్జీలు పంపుకుంటే, యీ కౌన్సిలు వాటిని విచారిస్తుంది. ఆ దేశాలలో పరిస్థితులను పరిశీలించడానికి కొంతమందిని పంపిస్తుంది. ఆ దేశాలలోని ప్రజల రాజకీయ, ఆర్థిక, సాంఘిక, విద్యావిషయాలనుగురించి, ఎప్పటికప్పుడు ఏమాత్రం అభివృద్ధి జరిగిందో, అడిగి తెలుసుకుంటూ వుంటుంది.

ఈ కౌన్సిలులో సభ్యత్వం ఎలాగంటే:

ట్రస్టీషిప్ పరిపాలన సాగించేదేశాల ప్రతినిధులు, ఆ దేశాల ప్రతినిధులుకాక సెక్యూరిటీ కౌన్సిలులోని మిగతా సభ్యులు, శాశ్వతమైన స్థానంలో వుంటారు. వీరుగాక, ట్రస్టీషిప్ సాగించే దేశాల సభ్యులూ, అలాసాగించని దేశాలతరఫున వున్న సభ్యులూ సమానసంఖ్యలో వుండేటట్టుగా జనరల్ అసెంబ్లీచే ఎన్నుకోబడినవారు, మూడుసంవత్సరాల పరిమితిలో సభ్యులుగా వుంటారు. ట్రస్టీషిప్ కౌన్సిలు 1947 జనవరి 25 వ తేదీన స్థాపించబడింది. ఈ కౌన్సిలులో 1952 జనవరినాటికి యీ క్రింది దేశాలు సభ్యత్వం కలిగివున్నాయి: బ్రిటన్, యునైటెడ్ స్టేట్సు, ఫ్రాన్సు, ఆస్ట్రేలియా, బెల్జియం, న్యూజీలెండ్, సోవియట్ రష్యా, చైనా, డొమినికన్ రిపబ్లిక్, అర్జెంటైనా, ఇరాక్, థాయ్ లాండ్.

## అంతర్జాతీయ న్యాయసభ (ఇంటర్‌నేషనల్ కోర్ట్ ఆఫ్ జస్టిస్)

ఈ న్యాయసభ, యునైటెడ్ నేషన్స్ సభ్యులలో ఎవరికైనా తగాదాలువస్తే, వాటిని విచారించి తీర్పుచెప్పే ప్రధానన్యాయస్థానము. యునైటెడ్ నేషన్స్ దేశాలన్నీ యీ న్యాయసభకు పార్టీలన్నమాట. ప్రతి దేశముకూడా, ఈ న్యాయస్థానపు తీర్పులకు బద్ధులమై వుంటామని ఒప్పుకుంటుంది. ఈ కోర్టులో చెప్పిన తీర్పును ఏ పార్టీ అయినా ఉల్లంఘించినట్లయితే, ఆ పార్టీమీద తగినచర్య తీసుకోవలసిందని, ఎదురుపార్టీ సెక్యూరిటీ కౌన్సిలును కోరవచ్చును. ఈ కోర్టులో విచారించే తగాదాలన్నీ, ఒక దేశానికీ యింకొక దేశానికీ సంబంధించినవే అయివుంటాయి. ఈ కోర్టుస్థాపనకూడా, యునైటెడ్ నేషన్స్ చార్టర్‌ను అనుసరించే జరిగింది. ఈ కోర్టు వుండే స్థలం, హాలెండులోని ది హేగ్ నగరం.

ఈ కోర్టుకి పదిహేనుమంది జడ్జీలు వున్నారు. వీరందరూ జనరల్ అసెంబ్లీచేతనూ, సెక్యూరిటీ కౌన్సిలుచేతనూ 1946 ఫిబ్రవరి 6-వ తేదీన ఎన్నుకోబడినారు. కోర్టుప్రారంభం 1940 ఏప్రిల్ 18వ తేదీన జరిగింది. వారిలో అయిదుగురు తొమ్మిదేళ్ళకూ, అయిదుగురు మూడేళ్ళకూ ఎన్నుకోబడినారు. అంటే, ప్రతిమూడుసంవత్సరాలకూ ఒకసారి, యీ కోర్టుకు అయిదుగురు జడ్జీలు ఎన్నుకోబడతారన్నమాట. కోర్టు ప్రెసిడెంట్ : సర్ ఆర్నాల్డు మెక్‌నైర్ (ఇంగ్లండు). రిజస్ట్రార్ : ఎడ్వర్డు హాంబ్రో (నార్వే).

ఈ కోర్టు జడ్జిల జీతం ఒక్కొక్కరికి ఏడాదికి 54,000 డచ్చి గిల్డర్స్, అంటే దాదాపు 67,000 రూపాయలన్నమాట. ప్రెసిడెంటుకు అదనంగా సుమారు 15,000 రూపాయలూ, వైస్ ప్రెసిడెంటుకు దాదాపు 12 వేల రూపాయలూ ప్రత్యేకపు అలవెన్సు ఇవ్వబడుతుంది.

కోర్టు ప్రెసిడెంటును, డిప్యూటీ ప్రెసిడెంటును, జడ్జీలే ఎన్నుకుంటారు. వీరిపదవి పరిమితి మూడుసంవత్సరాలు. మిగతా జడ్జీలకు యిష్టమైతే వీరినే మళ్ళీ ఎన్నుకోవచ్చును.

ఈ కోర్టుస్థాపన 1946 ఫిబ్రవరిలో జరిగినందున, మూడు సంవత్సరాలకు యెన్నుకోబడిన జడ్జిల పదవీపరిమితి 1949 ఫిబ్రవరితో అంత

## ట్రస్టీషిప్ కౌన్సిలు :

స్వపరిపాలన చేసుకోలేని దేశాలలో, ఆ దేశప్రజలు స్వపరిపాలన చేసుకునే సమర్థతను పొందేటంతవరకూ, ఆదేశపరిపాలనలో ధర్మకర్తల మాదిరిగా, దేశీయుల క్షేమాన్నే ప్రధాన కర్తవ్యంగా పరిపాలన జరిపే ఏర్పాట్లను చెయ్యడానికి, యునైటెడ్ నేషన్సు స్థాపించిన సంస్థ.

ఇలా ట్రస్టిషిప్ పరిపాలనలోవుండే దేశాలలో ఏవైనా, యుద్ధ చర్యలకు చాలా ప్రాముఖ్యతగల ప్రదేశాలలో వున్నట్లయితే, వాటిలో పరిపాలన పర్యవేక్షణను, యీ కౌన్సిలు చూస్తుంది. ఏదేశంలోనైనా ధర్మకర్తృత్వపు పరిపాలనచేసే, మరొకదేశం, తమ పరిపాలన ఎలా చేస్తున్నదీ యీ కౌన్సిలుకు రిపోర్టు పంపుతూ వుండాలి. ఆ దేశాల ప్రజలు, పరిపాలనచేస్తున్న దేశపు అధికారుల చర్యలనుగురించి అర్జీలు పంపుతుంటే, యీ కౌన్సిలు వాటిని విచారిస్తుంది. ఆ దేశాలలో పరిస్థితులను పరిశీలించడానికి కొంతమందిని పంపిస్తుంది. ఆ దేశాలలోని ప్రజల రాజకీయ, ఆర్థిక, సాంఘిక, విద్యావిషయాలనుగురించి, ఎప్పటికప్పుడు ఏమాత్రం అభివృద్ధి జరిగిందో, అడిగి తెలుసుకుంటూ వుంటుంది.

ఈ కౌన్సిలులో సభ్యత్వం ఎలాగంటే:

ట్రస్టీషిప్ పరిపాలన సాగించేదేశాల ప్రతినిధులు, ఈదేశాల ప్రతినిధులుకాక సెక్యూరిటీ కౌన్సిలులోని మిగతాసభ్యులు, శాశ్వతమైన స్థానంలో వుంటారు. వీరుగాక, ట్రస్టీషిప్ సాగించే దేశాల సభ్యులూ, అలాసాగించని దేశాలతరఫున వున్న సభ్యులూ సమానసంఖ్యలో వుండేటట్టుగా జనరల్ అసెంబ్లీచే ఎన్నుకోబడినవారు, మూడుసంవత్సరాల పరిమితిలో సభ్యులుగావుంటారు. ట్రస్టీషిప్ కౌన్సిలు 1947 జనవరి 25 వ తేదీన స్థాపించబడింది. ఈ కౌన్సిలులో 1952 జనవరినాటికి యీ క్రింది దేశాలు సభ్యత్వం కలిగివున్నాయి: బ్రిటన్, యునైటెడ్ స్టేట్సు, ఫ్రాన్సు, ఆస్ట్రేలియా, బెల్జియం, న్యూజీలెండ్, సోవియట్ రష్యా, చైనా, డొమినికన్ రిపబ్లిక్, అర్జెంటైనా, ఇరాక్, తాయ్ లాండ్.

## అంతర్జాతీయ న్యాయసభ (ఇంటర్‌నేషనల్ కోర్ట్ ఆఫ్ జస్టిస్)

ఈ న్యాయసభ, యునైటెడ్ నేషన్సు సభ్యులలో ఎవరికైనా తగాదాలువస్తే, వాటిని విచారించి తీర్పు చెప్పే ప్రధాన న్యాయస్థానము. యునైటెడ్ నేషన్సు దేశాలన్నీ యీ న్యాయసభకు పార్టీలన్నమాట. ప్రతి దేశముకూడా, ఈ న్యాయస్థానపు తీర్పులకు బద్ధులమై వుంటామని ఒప్పుకుంటుంది. ఈ కోర్టులో చెప్పిన తీర్పును ఏ పార్టీ అయినా ఉల్లంఘించినట్లయితే, ఆ పార్టీమీద తగినచర్య తీసుకోవలసిందని, ఎదురుపార్టీ సెక్యూరిటీ కౌన్సిలును కోరవచ్చును. ఈ కోర్టులో విచారించే తగాదాలన్నీ, ఒక దేశానికి యింకొక దేశానికీ సంబంధించినవే అయివుంటాయి. ఈ కోర్టుస్థాపనకూడా, యునైటెడ్ నేషన్సు చార్టరును అనుసరించే జరిగింది. ఈ కోర్టు వుండే స్థలం, హాలెండులోని ది హేగ్ నగరం.

ఈ కోర్టుకి పదిహేనుమంది జడ్జీలు వున్నారు. వీరందరూ జనరల్ అసెంబ్లీచేతనూ, సెక్యూరిటీ కౌన్సిలుచేతనూ 1946 ఫిబ్రవరి 6-వ తేదీన ఎన్నుకోబడినారు. కోర్టుప్రారంభం 1940 ఏప్రిల్ 18వ తేదీన జరిగింది. వారిలో అయిదుగురు తొమ్మిదేళ్ళకూ, అయిదుగురు మూడేళ్ళకూ ఎన్నుకోబడినారు. అంటే, ప్రతిమూడుసంవత్సరాలకూ ఒకసారి, యీ కోర్టుకు అయిదుగురు జడ్జీలు ఎన్నుకోబడతారన్నమాట. కోర్టు ప్రెసిడెంట్ : సర్ ఆర్నాల్డు మెక్‌నైర్ (ఇంగ్లండు). రిజస్ట్రార్ : ఎడ్వర్డు హాంబ్రో (నార్వే).

ఈ కోర్టు జడ్జీల జీతం ఒక్కొక్కరికి ఏడాదికి 54,000 డచ్చి గిల్డర్స్, అంటే దాదాపు 67,000 రూపాయలన్నమాట. ప్రెసిడెంటుకు అదనంగా సుమారు 15,000 రూపాయలూ, వైస్ ప్రెసిడెంటుకు దాదాపు 12 వేల రూపాయలూ ప్రత్యేకపు అలవెన్సు ఇవ్వబడుతుంది.

కోర్టు ప్రెసిడెంటును, డిప్యూటీ ప్రెసిడెంటును, జడ్జీలే ఎన్నుకుంటారు. వీరిపదవి పరిమితి మూడుసంవత్సరాలు. మిగతా జడ్జీలకు యిష్టమైతే వీరినే మళ్ళీ ఎన్నుకోవచ్చును.

ఈ కోర్టుస్థాపన 1946 ఫిబ్రవరిలో జరిగినందున, మూడు సంవత్సరాలకు యెన్నుకోబడిన జడ్జీల పదవీపరిమితి 1949 ఫిబ్రవరితో అంత

మయింది. మళ్ళీకూడా తొమ్మిదేళ్ళకు వారే తిరిగి, 1948 అక్టోబరు 22వ తేదీన యెన్నుకోబడినారు.

ఆరు సంవత్సరాలకు యెన్నుకోబడినవారి పదవి 1952 తో అంత మయింది. వారిస్థానే తొమ్మిది సంవత్సరాలకు యీ క్రిందివారు, 1951 డిసెంబరు 6 న యెన్నుకోబడినారు: బి. యస్. రావు (ఇండియా); సెనార్ యెన్రిక్ ఆర్మండ్ ఉగాన్ (ఉరూగువే); సెర్గీ ఓలుస్కీ (రష్యా); గ్రీన్ హాకీవుడ్ హాలీవర్తు (యునైటెడ్ స్టేట్సు); హెల్గి క్లాస్టెడ్ (నార్వే). వీరంతా 1961 వరకు పదవిలో వుంటారు.

1955 వరకు పదవిలో వుండేవారు: ప్రొఫెసర్ జె. బాస్‌డవాన్ (ఫ్రాన్సు); డాక్టర్ జె. జి. గోరెరో (యెల్ శాల్వెడార్); డాక్టర్ ఆర్నాల్డు మెక్‌నైర్ (ఇంగ్లండు); డాక్టర్ యె. ఆల్వారెజ్ (చిలి); లెవిఫెర్నాండెజ్ కార్నీరో (బ్రెజిల్).

1958 వరకు పదవిలోవుండేవారు: డాక్టర్ యం. జోరిసిచ్ (యుగోస్లావియా); జాన్ రీడ్ (కెనడా); డాక్టర్ బోదాన్ వినియార్‌స్కీ (పోలెండ్); డాక్టర్ షు మో (చైనా); అబ్దుల్ హమీద్ బదావీపాషా (ఈజిప్టు).

సెక్రటేరియట్ :

యునైటెడ్ నేషన్సు ప్రధాన కార్యాలయాన్ని సెక్రటేరియట్ అంటారు. ఈ కార్యాలయానికి సంపూర్ణాధికారిని సెక్రటరీ-జనరల్ అంటారు. ఈయన ప్రతిసంవత్సరమూ, యునైటెడ్ నేషన్స్ చేసినపనిని గురించి ఒక రిపోర్టును జనరల్ అసెంబ్లీకి సమర్పించాలి. ప్రపంచశాంతికి భంగంకలిగించే సంఘటనగాని, ఉద్యమంగాని, పరిస్థితిగాని ఏమైనా ఆయనకు తెలిస్తే దానిని సెక్యూరిటీ కౌన్సిలుకు చెప్పాలి.

సెక్రటరీజనరల్ జీతం ఏడాదికి 20,000 డాలర్లు (రు. 90,000) ఇదికాక, ఉచితవసతి, ఇతర ఖర్చులకుగాను వేరే 20,000 డాలర్లు ఇవ్వబడుతవి. సెక్రటరీ జనరల్‌గా పనిచేసినవ్యక్తి రిటైరయితే, అతనికి యావజ్జీవమూ ఏడాదికి 10,000 డాలర్లు పింఛను ఇవ్వబడుతుంది.

ఈ సెక్రటేరియట్‌లో, యెనిమిది శాఖలు ఉన్నాయి. ఒక్కొక్క శాఖకు అధిపతిగా ఒక అసిస్టెంటు సెక్రటరీ-జనరల్ వుంటాడు.

సెక్రటరీ జనరల్ : ట్రిగ్వి లీ (నార్వే)

బడ్జెటు :

యునైటెడ్ నేషన్సుకు అయ్యేఖర్చులను సభ్యత్వప్రదేశాలన్నీ, తమ శక్తినిబట్టి యెంత ఇవ్వగలరో చూసి, యీ ఖర్చుకోసం అవి చెల్లించుకోవలసినవంతులు నిర్ణయిస్తారు. యునైటెడ్ నేషన్సు సంస్థలన్నిటికీ అయ్యే ఖర్చులలో 1946 లో రు. 26.03,300; 1947 లో రు. 35,89,900; 1948 లో రు. 45,34,600; 1949 లో రు. 43,55,500, 1950 లో రు. 50,45,500, 1951 లో రు. 51,03, 166 రూపాయలు ఇండియా భరించింది.

## యునైటెడ్ నేషన్స్ ప్రత్యేకసంస్థలు :

ప్రత్యేకసంస్థలు, యునైటెడ్ నేషన్సు ఛార్టరులో ఉదహరించబడిన ప్రకారం, వివిధదేశాల ప్రభుత్వాల అంగీకారంతో, ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక, ఆరోగ్య, విద్యావిషయాలలో అంతర్జాతీయ బాధ్యతతో పని చేయడానికి ఏర్పాటయిన సంస్థలు. ఇవి యునైటెడ్ నేషన్సులో ఒక భాగంకావు. కాని, దానితో సహకారంచేస్తూ పనిచేస్తాయి. ఈ సంస్థలలో కొన్ని యునైటెడ్ నేషన్సు ఏర్పడకపూర్వమే వున్నాయి. కొన్ని, యునైటెడ్ నేషన్సు ప్రోత్సాహంవల్ల ఏర్పడ్డాయి.

## అంతర్జాతీయ ఆరోగ్యసంస్థ (W. H O)

## (The World Health Organisation)

ఈ సంస్థ, దేశాలప్రతినిధులు, దీని స్థాపనకు సంబంధించిన నియమావళిపై సంతకం పెట్టడంతో, 1946 జూలై 22 తేదిన ప్రారంభమైంది. 1950 డిసెంబరు అంతానికి యీ సంస్థలో 59 దేశాలు సభ్యత్వం కలిగి వున్నాయి. ఈ సంస్థ ప్రథమసమావేశం 1948 లో జరిగింది.

ప్రపంచంలో ప్రతివ్యక్తీ, జాతి, మత భేదంలేకుండా, తన ఆర్థిక స్థితి ఎలాంటిదైనప్పటికీ సంపూర్ణమైన ఆరోగ్యాన్ని అనుభవించడానికి

హక్కు కలిగివున్నాడనే అంశాన్ని అంగీకరిస్తూ, అలా జరిగేటట్టు కృషి చెయ్యడం యీ సంస్థ ఆశయం.

ప్రపంచంలోని ఏదేశమైనా, యునైటెడ్ నేషన్సులో సభ్యత్వం లేకపోయినప్పటికీ, యీ సంస్థలో సభ్యత్వాన్ని పొందవచ్చు. ఈ సంస్థ కార్యవర్గాలు మూడు: ప్రపంచ ఆరోగ్యసమితి, కార్యనిర్వాహకసంస్థ, పరిపాలనా స్థానం. ఈ సంస్థ ప్రధానకార్యాలయం జెనీవాలో వుంది.

ఆరోగ్యవిషయాలను గురించి విస్తారం జ్ఞానం, అనుభవంగలవారే సమితికి ప్రతినిధులుగా ఎన్నుకోబడతారు.

ఈ సమితి ప్రతిసంవత్సరం సమావేశమౌతుంది. అవసరమైతే, ప్రత్యేక సమావేశాలనుకూడా జరుపుతుంది. దీనికి అధ్యక్షుడు, ప్రతి వార్షిక సమావేశ ప్రారంభంలోనూ ఎన్నుకోబడతాడు. 1952 లో ఈ సంస్థకు అధ్యక్షుడుగా ఫిలిప్పీన్స ఆరోగ్యశాఖామంత్రి డాక్టర్ జువాన్ శాల్సిడో యెన్నుకోబడినారు. దీని కార్యక్రమాలను సాగించడానికి డైరక్టరు జనరల్‌ను, యితర అధికారులను యీ సమితి నియమిస్తుంది. దీని కార్యవర్గంలో 18 మంది సభ్యులు వుంటారు. ఈ కార్యవర్గం, సంవత్సరానికి అధమం రెండుసారులైనా సమావేశమౌతుంది. డైరక్టర్ జనరల్ : డాక్టర్ బ్రాక్ చిషోమ్.

1950 లో యీ సంస్థకు ఖర్చు 6,00,00,000 డాలర్లు వ్యయం అవుతుందని అంచనా వేయబడింది. దీనిలో ఇండియావంతు 2,28,963 డాలర్లు, అంటే రు. 10,90,000 ఈ మొత్తాన్ని ఇండియా చెల్లించింది. 1952 లో యీ సంస్థకు 76,77.782 డాలర్లు ఖర్చు అవుతుందని అంచనా వేయబడింది.

1949 లో ఈసంస్థకు మూడు ప్రాంతీయ కార్యస్థానాలు ఏర్పాటు చేయబడినవి. ఒకటి ఆగ్నేయ ఆసియా దేశాలన్నిటిలోనూ, యీసంస్థ కార్యక్రమాలను నడపించడానికి ఉద్దేశింపబడింది. ఈ కార్యస్థానపు ప్రధానకార్యాలయం, న్యూఢిల్లీలో స్థాపింపబడింది.

1952 లో ఆగ్నేయ ఆసియాలో మొత్తం 44,07.000 డాలర్లు

ఖర్చు పెట్టడానికి యీసంస్థ నిర్ణయించింది. దీనిలో 6,90,000 డాలర్లు ఇండియాలో ఆరోగ్య కార్యక్రమాలకు ఖర్చు పెట్టబడుతవి.

మరొక కార్యస్థానం, తూర్పు మెడిటరేనియన్ దేశాలన్నిటి కోసూ, యీసంస్థ కార్యక్రమాలను నడిపించుటానికి ఉద్దేశింపబడింది. యీ కార్యస్థానపు ప్రధాన కార్యాలయం. ఈజిప్టులోని అలెగ్జాండ్రియా పట్టణంలో స్థాపింపబడింది.

మూడవ కార్యస్థానం, అమెరికా ఖండములలో యీసంస్థ కార్యక్రమాలను నడిపించడానికి ఏర్పాటు చేయబడింది. ఈ కార్యస్థానపు ప్రధాన కార్యాలయం, యునైటెడ్ స్టేట్సులోని వాషింగ్టన్ పట్టణంలో స్థాపింపబడింది.

యూరపులోఒకటి, ఆఫ్రికాలోఒకటి, పశ్చిమ పసిఫిక్ ప్రాంతంలో ఒకటి, ప్రాంతీయ కార్యస్థానాలను ఏర్పాటు చెయ్యడానికి యీ సంస్థ నిశ్చయించింది.

## ఇంటర్ నేషనల్ లా కమిషన్

అంతర్జాతీయ న్యాయచట్టాలస్థితి, వాటి అభివృద్ధి, అంతర్జాతీయ శాసనాలను అమలుజరుపుట మొదలైన విషయాలలో జరిగిన కృషిని పరిశీలించడానికి, యీ కమిషనును జనరల్ అసెంబ్లీ నియమించింది.

1948 నవంబరు 3 తేదిన యీ కమిషన్‌కు యీ క్రిందిదేశాల ప్రతినిధులు యెన్నుకోబడినారు. 1 చైనా ; 2. బ్రెజిల్ ; 3. ఇండియా ; 4. ఇంగ్లండ్ ; 5. ఫ్రాన్సు ; 6. మెక్సికో ; 7. యునైటెడ్ స్టేట్సు ; 8. హాలెండ్ ; 9. రష్యా ; 10. గ్రీసు ; 11. పెనామా ; 12. కొలంబియా ; 13. సిరియా ; 14. స్వీడన్ ; 15. చెకొస్లావేకియా.

ఇండియా తరఫున యెన్నుకోబడిన ప్రతినిధి, బి. ఎన్. రావ్.

## ఆహార వ్యవసాయసమితి (F, A. O,):

యునైటెడ్ నేషన్సుకూ, యితరమిత్రదేశాలకూ, (మొత్తం 44 దేశాలకు) సంబంధించిన ప్రతినిధులను, ఆహారధాన్యాదులు, వ్యవసాయము మొదలైన విషయాలగురించి చర్చించే సమావేశంలో పాల్గొనడానికి,

వర్జీనియారాష్ట్రంలోని హాట్ స్ప్రింగ్స్‌కు రమ్మని 1941 లో యునైటెడ్ స్టేట్సు అధ్యక్షుడు (రూజ్వెల్టు) ఆహ్వానించాడు. ఈసమావేశ ఫలితంగా, ఆహారపదార్థాలు వ్యవసాయములను గురించిన సమస్యలను పరిష్కరించడానికి ఒక అంతర్జాతీయ సమితిని స్థాపించడానికి నిర్ణయం జరిగింది. ఈ సమితికి నిబంధనలను తయారుచెయ్యడానికి ఒక కమిటీ నియమింపబడింది. ఈ కమిటీ తయారుచేసిన నిబంధనలను, సూచనలను 1944 లో సమావేశమైన వివిధదేశాల ప్రతినిధులు ఆమోదించారు.

కరువు, కరువు వస్తుందేమో అనే భయం తమదేశాలలో లేకుండా చెయ్యడానికి, ప్రత్యేకంగా తాము ఒక్కొక్కరూ, సమిష్టిమీద అందరూ కూడా పని చేస్తామని, వివిధదేశాల ప్రతినిధులు ప్రమాణం చేశారు. ఆయాదేశాలలో వ్యవసాయోత్పత్తిని యెక్కువచేసేటట్లు చూడడానికీ, ప్రజలు ఏ ఆహారాన్నితింటే సత్తువను కలిగివుండగలరో సలహాలు యివ్వడానికీ, ఆహారపదార్థాలు సక్రమంగా వివిధదేశాలమధ్య పంపకం జరిగేటట్లు చూడడానికీ యీసంస్థ కృషిచేస్తుంది.

12 రాజ్యాలు, యీ సమితి నింబంధనలను అంగీకరించడంతో 1945 అక్టోబరులో యీ సమితిస్థాపన అమలులోకి వచ్చింది.

ఈ సమితి ఖర్చుమొత్తంలో నూటికి 4. 16 వంతులు అంటే రు. 4,16,000 ఇండియా ఇస్తుంది.

దీనికి డైరెక్టర్ జనరల్ : మోరిస్ ఇ. డాడ్.

## అంతర్జాతీయ విమానప్రయాణ సదుపాయసమితి I. C. A. O

విమానప్రయాణాలను చేసేవారికి తగిన సదుపాయాలనుకలిగించడానికీ, వారిక్షేమానికి భంగం కలుగకుండా ఏర్పాట్లు చెయ్యడానికీ, ప్రజల ప్రయాణాలకు అవసరమైనంతగా విమానాలను సర్వీసులో పెట్టడానికీ, విమానాలకంపెనీలమధ్య హానికరమైన పోటీలేకుండా చెయ్యడానికీ యీ సంస్థ ఏర్పడింది. ఈ సంస్థ నిర్మాణం 1947 ఏప్రిల్ లో జరిగింది. ఈసంస్థ ప్రధాన కార్యాలయం మాంట్రేల్ లో స్థాపింపబడింది. భారతదేశంకూడా యీసంస్థలో సభ్యత్వంకలిగివుంది. దీనికి ప్రధానకార్యదర్శి : డాక్టర్ ఆల్బర్ట్ రోపర్.

## విద్యా, వైజ్ఞానిక, సంస్కృతి సమితి (U. N. E. S. C. O)

1942 అక్టోబరు నెలలో, అనేక దేశాల విద్యాశాఖా మంత్రులు, బ్రిటిషు ప్రభుత్వ విద్యాశాఖామంత్రి అధ్యక్షతను లండనులో, యుద్ధానంతరం తమదేశాలలో విద్యాభివృద్ధికి అనుసరించవలసిన మార్గాలను పరిశీలించడానికి సమావేశమయారు. తరువాత, ఇలాటి సమావేశాలు క్రమేణ జరుగుతూ వచ్చాయి. తొమ్మిదో సమావేశం 1944 ఏప్రిల్‌లో జరిగింది. దానికి అమెరికా ప్రతినిధికూడా వచ్చాడు. ఆసమావేశంలో, యునైటెడ్ నేషన్సు తరఫున, విద్యా, వైజ్ఞానిక, సంస్కృతి సమితిన్ని స్థాపించడానికి నిర్ణయం జరిగింది. 1945 ఆగస్టు 1 వ తేదీన, ఈ సమితి నిబంధనల చిత్తుప్రతి తయారు చేయబడింది. ఈ నిబంధనలు, యునైటెడ్ నేషన్సుకు చెందిన రాజ్యాల ప్రభుత్వాల ఆమోదమునకు పంపబడ్డాయి. 1945 నవంబరులో, లండనులో జరిగిన సమావేశంలో, యీ ప్రతిపాదనలపై చర్చజరిగింది. ఆచర్చఫలితంగా ఆ నిబంధనలు ఆమోదింపబడ్డాయి. ఈ సంస్థ 1946 నవంబరు 4 వ తేదీన అమలులోకి వచ్చింది.

ఈ సమితిన్ని స్థాపించడంలో ప్రధానోద్దేశాలు ఏమిటంటే: వివిధ దేశాల ప్రజల సంస్కృతిపట్ల పరస్పర గౌరవాన్ని పెంపొందింప జెయ్యడము; వివిధ దేశాల కళలను, సంస్కృతిని, విజ్ఞానాన్ని పరస్పర సహకారంతో అభ్యుదయ పంథాలలో నడిపించడము; ప్రపంచంలోని అన్ని దేశాల ప్రజలూ తమ రాజకీయ భద్రతను, ఆర్థిక సౌష్టవాన్నీ కాపాడుకోడానికి తగిన సంస్కారమూ, విద్యా, అనుభవమూ కలిగేటట్టు చూడడం. ఈ సంస్థకు డైరెక్టరు జనరల్ జెమ్సు టారెస్ బాడే.

## ప్రపంచకార్మిక మహాసభ

ప్రపంచకార్మిక మహాసభల సమితి (World Federation of Trade Unions)లో కమ్యూనిస్టుల ప్రాబల్యం యెక్కువగావున్నదనే కారణంచేత, 1949 డిసెంబరు 7 వ తేదిన మరొక కార్మిక మహాసభల సమితి International Confederation of Free Trade Unions

స్థాపింప బడింది. ఇండియాలోని ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు యీ సంస్థలో సభ్యత్వం కలిగివుంది.

ఈసంస్థ కార్యనిర్వాహకవర్గంలో 20 మంది సభ్యులుంటారు. ప్రధాన కార్యదర్శి కాక, తక్కిన 19 మంది సభ్యులు, వివిధ ప్రాంతాల నుంచి యీ క్రింది సంఖ్యలో ఎన్నుకోబడుతారు : ఆఫ్రికా, 1 ; ఆసియా మధ్యప్రాచ్యదేశాలు, 3 ; ఆస్ట్రేలియా, న్యూజీలెండు, 1 ; యూరప్, 5 ; దక్షిణ అమెరికా దేశాలు. 2 ; ఉత్తర అమెరికా, 4; బ్రిటన్, 2 ; వెస్టిండీస్, 1 ;

ప్రధాన కార్యదర్శి . జె. హెచ్. ఓల్డెన్ బ్రూక్ (హాలెండ్)
ఇండియా తరఫున సభ్యుడు: దేవేన్ సేన్

## కౌన్సిల్ ఆఫ్ యూరప్

యూరపులో-ఒక రాజ్యంపై మరొకరాజ్యం దండయాత్ర చేస్తే ఒకదానికొకటి సహాయం చెయ్యడానికీ, తమలో తమకు యుద్ధము లేకుండా చేసుకోడానికి పన్నెండు రాజ్యాలు ఒడంబడిక చేసుకున్నాయి. అవేమిటంటే : బ్రిటన్, ఫ్రాన్సు, హాలెండ్, లక్సెంబర్గ్, ఇటలీ, ఏరా. నార్వే, డెన్మార్క్, స్వీడన్, బెల్జియం, టర్కీ, ఐస్ లెండ్. ఒడంబడిక ప్రణాళికపై బ్రిటన్, ఫ్రాన్సు, హాలెండ్, లక్సెంబర్గ్, ఇటలీ, ఏరా, నార్వే, డెన్మార్క్, స్వీడన్, బెల్జియందేశాలు లండనులో 1949 మే 5 వ తేదీన సంతకాలు పెట్టాయి.

ఈ పన్నెండు రాజ్యాలకూడలికి కౌన్సిల్ ఆఫ్ యూరప్ అని పేరు. ఈ పన్నెండు రాజ్యాలసమితి (పార్లమెంట్ ఆఫ్ యూరప్) 1949 ఆగస్టు 10 వ తేదీన ప్రథమ సమావేశం జరిపింది.

## అట్లాంటిక్ ఒడంబడిక

ఉత్తర అట్లాంటిక్ ప్రాంత దేశాలలో దేనిపైననైనా దౌర్జన్య చర్య జరిగితే, ఒకరికొకరు మిలిటరీ సహాయంచేసుకోడానికి, అన్యోన్యంగా ఒకరి క్షేమాన్ని మరొకరు గమనించడానికీ, ఆప్రాంతదేశాలు ఒక ఒడంబడిక చేసుకున్నాయి. దీనికి అట్లాంటిక్ ఒడంబడిక అని పేరు.

ఈ ఒడంబడికలో చేరిన దేశాలు: బ్రిటన్, బెల్జియం, హాలెండ్, లక్సెంబర్గ్, నార్వే, ఐస్‌లెండ్, యునైటెడ్ స్టేట్సు, ఫ్రాన్సు, డెన్మార్క్, ఇటలీ, పోర్చుగల్.

ఈ ఒడంబడిక 1949 ఆగష్టు 24 తేదీన అమలులోకి వచ్చింది.

## ప్రపంచ బ్యాంకి

ప్రపంచంలోని వివిధ దేశాలు సభ్యత్వం కలిగి, తమలో ఏ దేశానికైనా అప్పు కావలిస్తే యివ్వడానికి ఏర్పాటుచేయబడినబ్యాంకి. ఈబ్యాంకిలో సభ్యత్వంగల దేశాలన్నీ నిర్ణీతపు వంతుప్రకారం కొంతడబ్బును దీనికి చందా చెల్లిస్తాయి. ఏదేశంలోనైనా నిర్మాణకార్యక్రమానికి డబ్బు కావలసివస్తే, యీ బ్యాంకినుంచి అప్పుతీసుకోవచ్చును. కాని, అలా అప్పు ఇచ్చే ముందు యీ బ్యాంకి తరఫున కొంతమంది నిపుణులు ఆ దేశానికి వెళ్ళి అక్కడి పరిస్థితులనూ, అప్పుయిచ్చే డబ్బు సద్వినియోగం అవుతుందా లేదా అనే విషయాన్నీ పరిశీలించి, అప్పు యివ్వవచ్చునా, కూడదా అనే విషయమై బ్యాంకికి సలహాయిస్తారు.

ప్రెసిడెంటు: యూజిన్ బ్లాక్

ఇండియాలో వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాలకుగాను 1949 సెప్టెంబరు 29 న కోటి డాలర్లనూ(రు. 4,76,00,000) రైల్వేలను బాగు చేయించడానికిగాను 1949 ఆగష్టు 18 న మూడుకోట్ల 40 లక్షల డాలర్లనూ, (రు. 16,18,40,000), దామోదర నదీలోయ నిర్మాణ కార్యక్రమాలకు 1,85,00,000 డాలర్లను (రూ. 8, 80,60,000) యీబ్యాంకి ఇండియాకు అప్పు మంజూర్ చేసింది.

## అంతర్జాతీయ కార్మిక సమితి (I.L.O.):

"చాలామంది జనులకు, అన్యాయం, కష్టం, యిబ్బంది కలిగించే విధంగా పని (లేబరు) పరిస్థితులు వున్నా" యని ఒప్పుకొనే దేశాలతరఫు ప్రతినిధులతో ఏర్పడిన అధికారయుత సంస్థ, ఈ సమితి. ఈ సమితిలో సభ్యత్వంగల దేశాలు, అలాటి చెడ్డ పరిస్థితులను సవరించడానికి, సమష్టి ర్యద్వారా కృషిచేయడానికి ఒప్పందం చేసుకుంటాయి.

ఈ సమితి సభ్యులు ఏడాదికొకసారి మహాసభను (అంతర్జాతీయ కార్మికమహాసభను) జరుపుతారు. ఈ మహాసభకు, యీ సమితిలో సభ్యత్వంగల ప్రతిదేశంనుంచీ నలుగురు ప్రతినిధులు హాజరవుతారు. ఆ నలుగురిలోనూ, ఇద్దరు ఆ దేశపు ప్రభుత్వంచేత పంపబడి, ప్రభుత్వంవారి ఉత్తరువుల ప్రకారం నడుచుకొనేవారు. మిగతా యిద్దరిలోనూ ఒకడు, ఆ దేశంలోని పనివారి సంస్థలతరఫున పంపబడేవారు. మరొకడు పరిశ్రమల యజమానుల తరఫున పంపబడేవారు. ఈఇద్దరినికూడా, ఆ దేశపు ప్రభుత్వమే నియమిస్తుంది. కాని ఇలా నియమించడంలో, ఆ ప్రతినిధులు ఉభయులూ, దేశంలోని అత్యధిక సంఖ్యాకులైన పనివారికీ, యజమానులకూకూడా, తమ ప్రతినిధులుగా వెళ్ళడానికి యిష్టమైనవారుగానే వుండేటట్లు ఆ ప్రభుత్వం శ్రద్ధతీసుకోవాలి. ఈ ప్రతినిధుల నియామకం సక్రమంగా జరిగిందోలేదో పరిశీలించడానికే గాక, అనుమానాస్పదమైన పద్ధతిలో యీ నియామకం జరిగిందని తోచినట్లయితే, ఆ ప్రతినిధుల మహాసభకు రానివ్వకపోవడానికికూడా, ఆ మహాసభకు అధికారంవుంది.

ఈ మహాసభలో జరుగవలసిన కార్యక్రమమంతా, సమితి కార్య నిర్వాహకవర్గం (గవర్నింగ్ బాడీ) వారు నియమిస్తారు. ఈ గవర్నింగ్ బాడీలో 32 మంది సభ్యులువుంటారు. వారిలో 16 మంది, వివిధ దేశాల ప్రభుత్వాలతరఫునా, ఎనిమిదిమంది పనివారితరఫునా, ఎనిమిదిమంది పరిశ్రమల యజమానుల తరఫునా ఎన్నుకోబడినవారు. ప్రభుత్వాలతరఫున ఎన్నుకోబడిన 16 మంది సభ్యులలోనూ, ఎనిమిదిమంది, పారిశ్రామికంగా ప్రాధాన్యత వహించిన దేశాలతరఫున ఎన్నుకోబడినవారు. మిగతా ఎనిమిదిమంది, తక్కినదేశాల ప్రభుత్వాల తరఫున, మూడుసంవత్సరాలకొకసారి, ఎన్నుకోబడినవారు. పనివారితరఫున వుండే ఎనిమిదిమందీ, యజమానుల తరఫునవుండే ఎనిమిదిమందీ, మూడేసి సంవత్సరాలకొకసారి, మహాసభకు వచ్చిన ఆయావర్గాల ప్రతినిధులచేత ఎన్నుకోబడినవారు.

ఏదైనా ఒక ప్రతిపాదన, యీ మహాసభ కార్యక్రమంలో జరిగినప్పుడు, దానిని మహాసభ ఒక సలహాగా గాని, ఒక నియమంగా గాని

అంగీకరించవచ్చును. నియమం (డ్రాఫ్ట్ కన్వెన్షన్)గా అంగీకరింపబడిన ప్రతివిషయానికీ, యీ మహాసభలో సభ్యత్వంగల దేశాల ప్రభుత్వాలు తమ ఆమోదం తెలిపినవెంటనే, ఆ దేశాలలో ఆచరణలో పెట్టాలి. సలహాగా అంగీకరించబడిన విషయంపట్ల ఆ దేశాలు ఆమోదం తెలియపరచవలసిన నిర్బంధమూ లేదు: ఆచరణలో పెట్టవలసిన నిర్బంధమూ లేదు.

ఈ మహాసభలో ఒక సలహాగాని, నియమంగాని ఆమోదించబడిందంటే, సభకు హాజరైన ప్రతినిధులలో మూడింట రెండువంతుల మంది సభ్యుల అంగీకారాన్ని పొందినదన్నమాట. ఇలా ఆమోదించబడిన నియమాన్ని, ఈ మహాసభలో సభ్యత్వంగల ప్రతిదేశ ప్రభుత్వముకూడా ఆదేశపు శాసనసభలో ప్రవేశపెట్టాలి. సలహా విషయంలో ఆ అవసరం లేదు. ఆ సలహాను పాటించడం ఎంతవరకు అవసరమని ఆ దేశపు ప్రభుత్వానికితోస్తే, అంతవరకే దానిని ఆచరణలోకి తీసుకురావచ్చును. నియమాన్ని అంగీకరించిన ప్రతిదేశముకూడా, ఆ నియమాన్ని పాటించడానికి ఆ దేశంలో అవలంబించబడిన చర్యనుగురించి సంవత్సరానికి ఒకసారి ఒక నివేదికను యీ మహాసభకు పంపాలి. ఆ నియమాన్ని పాటించని దేశాల పట్ల చర్యతీసుకోడానికికూడా మహాసభకు అధికారం వుంది.

ఈ సమితి, యునైటెడ్ నేషన్సువారి ఆమోదాన్ని కూడా పొందింది. ఇది ఒక స్వతంత్ర సంస్థగా వ్యవహరిస్తూ; యునైటెడ్ నేషన్సుకి చెందిన ఇతరసంస్థలతో సహకారంచేస్తూ పనిచేస్తుంది.

ఈ సమితి మహాసభకు కార్యక్రమాన్ని తయారు చెయ్యడాని, పరిశ్రమల పరిస్థితులనుగురించీ, కార్మికుల పరిస్థితులనుగురించీ పరిశోధనలు జరుపడానికీ యీ సమితి ప్రధానకార్యాలయం (ఇంటర్నేషనల్ లేబర్ ఆఫీసు) జినీవాలో వుంది.

ఈ సమితికి డైరెక్టర్ జనరల్‌గా మిస్టర్ డేవిడ్ ఎ. మోర్సె 1948 జూన్ 18 తేదీన ఎన్నుకోబడినాడు.

## అరబ్ లీగ్ :

స్వతంత్ర అరబ్బీ రాజ్యాలమధ్య స్నేహాన్ని పెంపొందించడానికీ, రాజకీయ, ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక సంబంధాలను దృఢపరచడానికీ, అరబ్ లీగ్ 1943 లో, అలెగ్జాండ్రియాలో జరిగిన అరబ్బీ రాజ్యాల ప్రతినిధుల సమావేశ ఫలితంగా ఏర్పడింది.

ఈ లీగ్ లో ఈజిప్టు, ఇరాక్, లెబనాన్, సిరియా, సౌదీ అరేబియా, ట్రాన్స్‌జోర్డాన్, ఎమన్ రాజ్యాలతరఫున, ఆ ప్రభుత్వాలు నియమించిన ప్రతినిధులూ, పాలస్తీనాతరఫున యీ లీగ్ ఎన్నుకొనే ప్రతినిధి సభ్యులుగావుంటారు. స్వతంత్రంగావున్న ఏ అరబ్బీ రాజ్యమైనా, యీ లీగ్ లో సభ్యత్వాన్ని పొందవచ్చును.

లీగ్ కు శాశ్వతమైన అధ్యక్షుడులేడు. సెక్రెటరీ-జనరల్ : అబ్దుల్ రహమాన్ అజ్జంపాషా. లీగ్ కార్యస్థానం కెయిరోలో వుంటుంది.

అరబ్బీదేశాలు, వాటి జనాభా, వైశాల్యం వివరాలు.

| దేశం | వైశాల్యం (చ. మైళ్ళు) | జనాభా |
|---|---|---|
| సౌదీ అరేబియా | 9,27,000 | 60,00,000 |
| మిగతా అరేబియా | 1,66,000 | 42,50,000 |
| ఈజిప్టు | 3,63,000 | 130,00,000 |
| అల్జీరియా | 2,22,000 | 60,00,000 |
| లిబియా | 8,10,000 | 10,00,000 |
| మొరాకో | 2,18,150 | 67,80,000 |
| ట్యూనీషియా | 45,000 | 20,00,000 |
| పాలస్తీనా | 10,400 | 10,00,000 |
| ట్రాన్స్‌జోర్డన్ | · 30,000 | 2,60,000 |
| సిరియా - లెబనాన్ | 60,000 | 22,00,00 |
| ఇరాక్ | 1,16,000 | 32,00,000 |

## కొలంబో ప్లాను

ఆగ్నేయ ఆసియా ఆర్థిక సౌష్టవాన్ని పెంపొందించడానికి కొలంబో ప్రణాళిక అనే పేరుతో ఒక స్కీము తయారుచేయబడింది. ఈ ప్రణాళిక 1951 జులై 1 న అమలులోకి వచ్చింది. బ్రిటను, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలెండ్ దేశాలు సమష్టిగా, ఇండియా, పాకిస్తాన్, సిలోన్, మలయా, సింగపూర్, ఉత్తరబోర్నియో, శారవాకు దేశాలలో ఆర్థిక సౌష్టవాన్ని పెంపొందించడానికి కృషిచేస్తాయి. ఈ ప్రణాళిక ప్రకారం ఇండియాలో కొన్ని నదీప్రాజెక్టులను నిర్మించడానికీ, ఎరువులు మొదలైన వాటిని ఉత్పత్తి చెయ్యడానికి, రవాణా సౌకర్యములను అభివృద్ధి చెయ్యడానికీ, గ్రామీణ పరిశ్రమలకు ప్రోత్సాహం ఇవ్వడానికీ నిర్ణీత కార్యక్రమములను అమలుజరుపడానికి ఆదేశాలు సహాయం చేస్తాయి.

# ప్రపంచ రాజ్యములు

ప్రపంచంలోని వివిధదేశాల, ప్రజలు, పంటలు, ప్రభుత్వం మొదలైన వివరాలన్నీ యీ క్రింద స్పష్టంగా ప్రకటించబడినవి.

## అబిసీనియా

ఆఫ్రికాఖండంలో, ఈశాన్యప్రాంతంలో వున్న స్వతంత్రరాజ్యం. వైశాల్యం దాదాపు, 3,50,000 చ. మైళ్లు. జనాభా సుమారు 1,21,00,000. దేశం చాలావరకు కొండలమయం. 1934 లో ఈదేశం మీాద ఇటలీ దండయాత్రచేసి, క్రమేపి దేశాన్నంతటినీ ఆక్రమించుకొన్నది. కాని, 1939-45 యుద్ధఫలితంగా ఇటలీ ఓటమితో, యీదేశం మళ్లీ స్వాతంత్రాన్ని పొందింది. ఇంగ్లండులో తలదాచుకున్న చక్రవర్తి 1941 ఏప్రిల్ లో మళ్లీ స్వదేశానికి వెళ్ళి పరిపాలన సాగించుకుంటున్నాడు. చక్రవర్తి : హెయిలిసెలాసీ. రాజధాని, అడ్డిస్ అబాబా.

## అర్జెంటైనా

దక్షిణ అమెరికాలోని స్వతంత్ర ప్రజారాజ్యం. వైశాల్యం, 11,12,743 చ. మైళ్లు. జనాభా, 161,07,876. ఈదేశపు పరిపాలనా విధానం. యునైటెడ్ స్టేట్సు పరిపాలనా విధానాన్ని పోలివుంటుంది. దేశంలోని మొత్తం భూమిలో మూడవవంతు మాత్రమే వ్యవసాయానికీ, పశువులను మేపడానికీ పనికివస్తుంది. ఈ దేశంనుంచి పశువులు, పశువుల మాంసమూ విస్తారంగా విదేశాలకు ఎగుమతి అవుతవి. ఇక్కడ పండే ముఖ్యపంటలు: గోధుమ, మొక్కజొన్న, ఓట్లు, చెరకు, ద్రాక్షసారాయి, వున్ని, మొదలైనవి. ప్రెసిడెంట్: జువాన్ డామింగో పెరాన్; రాజధాని: బోనస్ ఏర్సు.

## అండోరా

ఫ్రాన్సు, స్పెయినుదేశాల రెండింటిమధ్య, యీ రెండిటి నాయకత్వానికీ లోబడిన, చిన్న ప్రజారాజ్యం. వైశాల్యం, 175 చ. మైళ్లు జనాభా, 5,500. ప్రజలలో కొంతమందిచేత ఎన్నుకోబడిన 24 సభ్యులుగల కౌన్సిలు, దేశపరిపాలనను సాగిస్తుంది. రాజధాని: అండోరా.

## ఆఫ్ఘనిస్తాన్

ఆసియాలో, భరతఖండానికి పశ్చిమోత్తరాన, పాకిస్తానును ఆనుకొనివున్న దేశం. రాజుగలరాజ్యం. పార్లమెంటువుంది. ప్రభుత్వ మతం ఇస్లాం. దేశంలోవున్న హిందువులకు, యూదులకు మతవిషయాలలో సంపూర్ణమైన స్వేచ్ఛవుంది. వైశాల్యం: 2,45,000 చ. మైళ్లు. జనాభా, 1,50,00,000, ఈదేశాన్నుంచి ఇండియాకు పండ్లు, వున్ని, తివాసీలు, సుగంధ ద్రవ్యములు ఎగుమతి అవుతవి. ఇండియానుంచి యీ దేశం నూలు, తోలు, టీ, పంచదార, సిమెంటు, కాగితము, బట్టలు మొదలైన వాటిని దిగుమతి చేసుకుంటుంది. రాజు: మహమ్మద్ జహీర్ షా. ప్రధానమంత్రి: సాదార్ షా మహమ్మద్ ఖాన్; రాజధాని: కాబూల్.

## ఆల్బేనియా

గత ప్రపంచయుద్ధకారణంగాం ప్రజారాజ్యమైనది. యూరపులో అడ్రియాటిక్ సముద్రతీరానవున్న దేశం. వైశాల్యం, 10,629 చ. మైళ్లు జనాభా. 11,06,086, యుద్ధానికిపూర్వం ఇది రాజుపాలనలో వుడేది: ఇటలీదాడివల్ల, రాజు ఇంగ్లండుకు పారిపోయాడు. యుద్ధానంతరం,1946 జనవరి 11 న దేశీయులు రాజరికానికి స్వస్తిచెప్పి, ప్రజారాజ్యాన్ని నెల కొల్పుకున్నారు. దేశపరిపాలనను కమ్యూనిస్టుపార్టీ సాగిస్తున్నది. వ్యవసాయము, గొర్రెల పెంపకము ప్రజల ప్రధాన వృత్తులు ; ప్రెసిడెంట్. మెహిది ప్రాషెరి. ప్రధానమంత్రి : రెక్సెప్ మిట్రోవికా. రాజధాని : తిరానా.

## ఆస్ట్రియా

గత ప్రపంచయుద్ధానికి కొంతముందుగా, జర్మనీచేత ఆక్రమింపబడిన స్వతంత్రప్రజారాజ్యం. యుద్ధంలో జర్మనీ ఓటమిఫలితంగా, మళ్లీ స్వతంత్రప్రజారాజ్యంగా ఏర్పడింది. పరిపాలనను కమ్యూనిస్టుపార్టీ సాగిస్తున్నది. దేశం వైశాల్యం 34,064 చ. మైళ్లు. జనాభా, 1947 లో 69,35,000. జర్మనుల ఆక్రమణవల్లనూ, తరువాత రష్యను సైన్యాల దాడివల్లనూ విస్తారంగా జన, ధననష్టాలను పొందింది. ప్రెసిడెంట్ : డాక్టర్ తియొడోర్ క్రోనర్; ప్రధానమంత్రి : డాక్టర్. లియోపాల్ ఫిగిల్ ; రాజధాని : వియన్నా.

## ఆస్ట్రేలియా

పసిఫిక్ మహాసముద్రంలో, బ్రిటిషురాణి అధికారానికి లోబడివున్న, స్వపరిపాలనగల ఖండం. వైశాల్యం, 29,74,581 చ. మైళ్లు. జనాభా, 74,79,358. దేశంలో స్వపరిపాలనగల రాష్ట్రాలు ఎనిమిది ఉన్నాయి. ఈ ఖండమంతటినీ కామన్‌వెల్తు ఆఫ్ ఆస్ట్రేలియా అంటారు. ఈదేశం. నంచి పూలు, మాంసము, పాలు, వెన్న, గోధుమలు, బంగా

రం, తోట్లు, పళ్లు విస్తారంగా ఎగుమతి అవుతాయి. ఇటీవల ఆస్ట్రేలియాకూ భారతదేశానికీ మధ్య వ్యాపారం చాలా ఎక్కువగా జరుగుతున్నది. స్వపరిపాలన బ్రిటిషు ప్రభుత్వం నియమించిన గవర్నర్-జనరల్, ప్రజలచే ఎన్నుకోబడిన శాసనసభ్యులలో అధికసభ్యులసాన్నిహించి మంత్రులను నియమించుకొని, వారి సలహాప్రకారం సాగిస్తాడు. 1947 లో మొట్ట మొదటిసారి ఆస్ట్రేలియా దేశీయుడే గవర్నర్ - జనరల్ గా నియమింపబడ్డాడు, గవర్నర్-జనరల్ : డబ్ల్యు. జె. మెక్కెల్ ; ప్రధానమంత్రి : రాబర్టు మెంజీస్ ; రాజధాని, కాంబెరా.

ఇండో-చైనా (వియత్నాం)

ఫ్రెంచివారి ఆధీనంలోవున్న, చైనా భూఖండపు ఆగ్నేయ భాగం. వైశాల్యం, 2,81,174 చ. మైళ్లు జనాభా, 2,44,6,1251. దీనిలో కొచ్చిన్ చైనా అను 26,476 చ. మైళ్లదేశం ఫ్రెంచివారి వలసరాజ్యంగా వుంది. కంబోడియా (67,550 చ. మైళ్లు.) అన్నాం (56,973 చ. మైళ్లు) అను రాజ్యాలు ఫ్రెంచివారి రక్షణలో, వారికి లోబడినరాజ్యాలుగా వున్నాయి. గత ప్రపంచ యుద్ధానంతరం, స్వాతంత్ర్య వాంఛతో యీ దేశంలోని ప్రజలు ఫ్రెంచివారితో పోరాటం సాగించారు. వీరితో ఒక ఒడంబడికకువచ్చి, యీదేశమంతటినీ తమ అధికారానికి కొంతవరకైనా లోబడి వుండేటట్టు చేసుకోడానికి ఫ్రెంచివారు చేసిన ప్రయత్నాలు కొనసాగలేదు. పూర్వం అన్నాం రాజ్య చక్రవర్తిగావున్న బావోదాయ్ ఆధిపత్యంలో ఇండో-చైనాలో ఫ్రెంచి వారితో సంబంధంగల ప్రభుత్వం 1949 లో స్థాపింపబడింది. కాని, యీ ప్రభుత్వాన్ని ఎదిరిస్తూ, దేశం సంపూర్ణ స్వాతంత్ర్యం కలిగివుండాలనే వుద్యమం డాక్టర్ హోచిమిన్ నాయకత్వాన ఇంకా సాగుతూనేవుంది.

ఫ్రెంచి యూనియనుకు లోబడిన ఒక ప్రత్యేక కేంద్రంగా స్వపరిపాలన హక్కును యీ దేశానికి ఇవ్వడానికి ఫ్రెంచి ప్రభుత్వం

అంగీకరించింది. బావోదాయ్ ఆధిపత్యంలోవున్న ప్రభుత్వానికి యీదేశపు పరిపాలన 1949 డిసెంబరు 30 తేదీన అప్పగించబడింది. ఈ దేశానికి ప్రస్తుత వ్యవహారనామం వియత్ నామ్. రాజధాని, సైగాన్; ప్రభుత్వాధిపతి, బావోదాయ్; ప్రధాని, ట్రాన్ దాన్ హు.

హోషిమిన్ అనే కమ్యూనిస్టునాయకుని అధ్వర్యంక్రింద విప్లవం జరుగుతూవుంది. కొంతదేశంకూడా యితని పాలనలోవుంది. ఇతని ప్రభుత్వాన్ని 1950 ఫిబ్రవరి 2 తేదిన రష్యన్ ప్రభుత్వం గుర్తించింది.

ఇండోనేషియా :

యుద్ధానికిపూర్వం డచ్చి వలసరాజ్యంగావున్న జావా, మధుర సుమత్ర మొదలైన ద్వీపాలు. ఇవి చిన్నవీ పెద్దవీ కలిసి సుమారు 2,50కి యుద్ధకాలంలో జపానువారి ఆక్రమణలో వున్నాయికాని, యుద్ధం అంతంకాగానే స్వాతంత్ర్యాన్ని ప్రకటించాయి. ఫ్రెంచివారు దానిం అంగీకరించక, వీటిని, తమ పరిపాలనలోనే వుంచుకోవాలని ప్రయత్నిం, చారు. చాలాకాలం డచ్చి సైన్యాలకూ, ఇండోనేషియా స్వాతంత్రం వీరులకు పోరాటంజరిగింది. ఇండోనేషియా నాయకులకూ డచ్చి ప్రభుత్వానికీ మధ్య రౌండ్ టేబిల్ సమావేశం 1949 సెప్టెంబర్‌లో ప్రారంభమైంది. ఈ సమావేశఫలితంగా ఇండోనేషియాకు స్వపరిపాలనను ఇవ్వడానికి డచ్చిప్రభుత్వం అంగీకరించడం హాలెండు రాణికి లోబడిన రిపబ్లిక్‌గా తమదేశం డచ్చివారితో సంబంధం కలిగివుండేటట్లు ఇండోనేషియనులు అంగీకరించడం జరిగింది. ఈ అంగీకార ప్రకారం, 1949 డిసెంబరు 27 తేదిన ఇండోనేషియా రిపబ్లికణ్‌రాజ్యగా ఏర్పడింది. ఈ దీవులన్నిటి వైశాల్యం, 7,30,000 చ. మైళ్ళు. జనాభా సుమారు, 7,20,00,000 చెరకు, బియ్యం, పొగాకు, టీ, కాఫీ, రబ్బరు మొదలైనవి యిక్కడ పండే ముఖ్యపంటలు. చాలాభాగం ఎగుమతి అవుతవి. భారతదేశానికీ, ఇండోనేషియాకు మధ్యవ్యాపారం ఇటీవల బాగా జరుగుతున్నది. రిపబ్లిక్ ప్రెసిడెంటు : డాక్టర్ ఐ. ఆర్. సుకర్నో; ప్రధానమంత్రి, డాక్టర్ సుకీమన్, రాజధాని : జకర్తా.

రం, తోళ్లు, పళ్లు విస్తారంగా ఎగుమతి అవుతాయి. ఇటీవల ఆస్ట్రేలియాకూ భారతదేశానికీ మధ్య వ్యాపారం చాలా ఎక్కువగా జరుగుతున్నది. దేశ పరిపాలన బ్రిటిషు ప్రభుత్వం నియమించిన గవర్నర్-జనరల్, ప్రజలచే ఎన్నుకోబడిన శాసనసభ్యులలో అధికసభ్యులపార్టీనుంచి మంత్రులను నియమించుకొని, వారి సలహాప్రకారం సాగిస్తాడు. 1947 లో మొట్ట మొదటిసారి ఆస్ట్రేలియా దేశీయుడే గవర్నర్ - జనరల్ గా నియమింప బడ్డాడు, గవర్నర్-జనరల్ : డబ్ల్యు. జె. మెక్కెల్ ; ప్రధానమంత్రి : రాజర్టు మెంజీస్ ; రాజధాని, కాంబెరా.

ఇండో—చైనా (వియత్నాం)

ఫ్రెంచివారి ఆధీనంలోవున్న, చైనా భూఖండపు ఆగ్నేయభాగం. వైశాల్యం, 2,81,174 చ. మైళ్లు జనాభా, 2,44,6,1251. దీనిలో కొచ్చిన్ చైనా అను 26,476 చ. మైళ్లదేశం ఫ్రెంచివారి వలసరాజ్యంగా వుంది. కంబోడియా (67,550 చ. మైళ్లు.) అన్నాం (56,973 చ. మైళ్లు) అను రాజ్యాలు ఫ్రెంచివారి సంరక్షణలో, వారికి లోబడినరాజ్యాలుగా వున్నాయి. గత ప్రపంచ యుద్ధానంతరం, స్వాతంత్ర్య వాంఛతో యీ దేశంలోని ప్రజలు ఫ్రెంచివారితో పోరాటం సాగించారు. వీరితో ఒక ఒడంబడికకువచ్చి, యీదేశమంతటినీ తమ అధికారానికి కొంతవరకైనా లోబడి వుండేటట్లు చేసుకోడానికి ఫ్రెంచివారు చేసిన ప్రయత్నాలు కొనసాగలేదు. పూర్వం అన్నాం రాజ్య చక్రవర్తిగావున్న బావోదాయ్ ఆధిపత్యంలో ఇండో-చైనాలో ఫ్రెంచివారుతో సంబంధంగల ప్రభుత్వం 1949 లో స్థాపింపబడింది. కాని, యీ ప్రభుత్వాన్ని ఎదిరిస్తూ, దేశం సంపూర్ణ స్వాతంత్ర్యం కలిగివుండాలనే వుద్యమం డాక్టర్ హోహిమిన్ నాయకత్వాన ఇంకా సాగుతూనేవుంది.

ఫ్రెంచి యూనియనుకు లోబడిన ఒక ప్రత్యేక కేంద్రంగా స్వపరిపాలన హక్కును యీ దేశానికి ఇవ్వడానికి ఫ్రెంచి ప్రభుత్వం

అంగీకరించింది. బావోదాయ్ ఆధిపత్యంలోవున్న ప్రభుత్వానికి యీదేశపు పరిపాలన 1949 డిసెంబరు 30 తేదీన అప్పగించబడింది. ఈ దేశానికి ప్రస్తుత వ్యవహారనామం వియత్ నామ్. రాజధాని, సైగాన్; ప్రభుత్వాధిపతి, బావోదాయ్; ప్రధాని, ట్రాన్ దాన్ హు.

హోషిమిన్ అనే కమ్యూనిస్టునాయకుని అధ్వర్యంక్రింద విప్లవం జరుగుతూవుంది. కొంతదేశంకూడా యితని పాలనలోవుంది. ఇతని ప్రభుత్వాన్ని 1950 ఫిబ్రవరి 2 తేదిన రష్యన్ ప్రభుత్వం గుర్తించింది.

ఇండోనేషియా :

యుద్ధానికిపూర్వం డచ్చి వలసరాజ్యంగావున్న జావా, మధుర సుమత్ర మొదలైన ద్వీపాలు. ఇవి చిన్నవీ పెద్దవీ కలిసి సుమారు 2,50కి యుద్ధకాలంలో జపానువారి ఆక్రమణలో వున్నాయికాని, యుద్ధం అంతంకాగానే స్వాతంత్ర్యాన్ని ప్రకటించాయి. ఫ్రెంచివారు దానిం అంగీకరించక, వీటిని, తమ పరిపాలనలోనే వుంచుకోవాలని ప్రయత్నిం చారు. చాలాకాలం డచ్చి సైన్యాలకూ, ఇండోనేషియా స్వాతంత్రం వీరులకు పోరాటంజరిగింది. ఇండోనేషియా నాయకులకూ డచ్చి ప్రభుత్వానికీ మధ్య రౌండ్ టేబిల్ సమావేశం 1949 సెప్టెంబర్‌లో ప్రారంభమైంది. ఈ సమావేశఫలితంగా ఇండోనేషియాకు స్వపరిపాలనను ఇవ్వడానికి డచ్చిప్రభుత్వం అంగీకరించడం హాలెండు రాణికి లోబడిన రిపబ్లిక్‌గా తమదేశం డచ్చివారితో సంబంధం కలిగివుండేటట్లు ఇండోనేషియనులు అంగీకరించడం జరిగింది. ఈ అంగీకార ప్రకారం, 1949 డిసెంబరు 27 తేదిన ఇండోనేషియా రిపబ్లికన్‌రాజ్యగా ఏర్పడింది. ఈ దీవులన్నిటి వైశాల్యం, 7,30,000 చ. మైళ్ళు. జనాభా సుమారు, 7,20,00,000 చెరకు, బియ్యం, పొగాకు, టీ, కాఫీ, రబ్బరు మొదలైనవి యిక్కడ పండే ముఖ్యపంటలు. చాలాభాగం ఎగుమతి అవుతవి. భారతదేశానికీ, ఇండోనేషియాకు మధ్యవ్యాపారం ఇటీవల బాగా జరుగుతున్నది. రిపబ్లిక్ ప్రెసిడెంటు : డాక్టర్ ఐ. ఆర్. సుకర్నో; ప్రధానమంత్రి, డాక్టర్ సుకీమన్, రాజధాని : జకర్తా.

ఇటలీ :

యూరప్‌లో ఒక స్వతంత్ర ప్రజారాజ్యం. ఇటీవలవరకు రాజు వుండేవాడు. కాని 1946 జూన్‌లో జరిగిన ఎన్నికలలో ప్రజలు ప్రజారాజ్యంపట్ల అత్యధిక సంఖ్యాకంగా ఓటుచేసినందున, రాజు దేశాన్ని వదలి వెళ్ళిపోయాడు. వైశాల్యం: 1,93,000 చ. మైళ్ళు. జనాభా: (1946 అంచనా) 4,56,45,000. దేశంలో ప్రజలలో అధిక సంఖ్యాకులు వ్యవసాయంమీద జీవించేవారు. పరిశ్రమలుకూడా చాలావరకు అభివృద్ధిపొందాయి. ప్రెసిడెంట్ : లూయి జి యేనోది; ప్రధానమంత్రి, అల్సిడి డి జాస్పెరి; రాజధాని, రోం.

ఇరాక్ :

ఆసియాలో ఒక స్వతంత్ర ముస్లిందేశం; రాజుగల రాజ్యం. పార్లమెంటువుంది. ప్రధానమంత్రినీ, ప్రధానమంత్రి సలహామీద తక్కిన మంత్రుల్నీ రాజు నియమిస్తాడు. ప్రస్తుతం రాజు మైనర్. రాజు పేరిట, రాచకార్యములను రాజు మేనమామ నిర్వహిస్తున్నాడు. (ఆయన్ను రీజెంటు అంటారు). వైశాల్యం: 1,16,000 చ. మైళ్ళు. జనాభా 47,99,500. దేశంలో పెట్రోలు విస్తారంగా లభిస్తుంది. రాజు: ఫైజల్ 11 (జననం: మే 2, 1935. రాజరికం: ఏప్రెల్ 4, 1939); రీజెంటు॥ అమీర్ అబ్దుల్ ఇలాహి; ప్రధానమంత్రి నూరి పాషా. రాజధాని, బాగ్దాద్.

ఇశ్రాయేలు :

పాలస్తీనా విభజన ఫలితంగా ఏర్పడిన స్వతంత్ర యూదురాజ్యం. 1948 మే 15 తేదీన బ్రిటను, పాలస్తీనాలో తనపరిపాలనను వదలుకోవడంతో, ఇశ్రాయేల్ స్థాపన జరిగింది. దేశంలో కన్స్టిట్యూయెంట్ అసెంబ్లి స్థాపనతో 2,000 సంవత్సరాల అనంతరం, మళ్ళీ 1949 ఫిబ్రవరి 14 తేదీన ఒక స్వతంత్ర యూదురాజ్యస్థాపన జరిగింది. దేశం వైశాల్యం, 10,429 చ. మైళ్ళు. జనాభా, 1948 లెఖల ప్రకారం, 8,00,000. అధ్యక్షుడు: చియం వైజ్‌మన్; ప్రధానమంత్రి డేవిడ్ బెన్‌గూరియన్ ; రాజధాని, టెలవీవ్.

ఈక్వెడార్ :

దక్షిణ అమెరికాలోని ఒక స్వతంత్ర ప్రజారాజ్యము. వైశాల్యం 2,26,000 చ. మైళ్ళు. జనాభా, 33,40,000. ఈదేశంలో కోకో విస్తారంగా పండుతుంది. కాఫీ, రబ్బరు, చెరకు, పొగాకు, పంచదార, సుగంధ పాలచెక్క, గోధుమ మొదలైనవి ముఖ్యపంటలు. ఈ పంటలలో చాలాభాగం ఎగుమతి అవుతవి. ఇవికాక, పెట్రోలు, టోపీలు, పచ్చలు, గంధకము, దంతము, బంగారముకూడ ఎగుమతి అవుతవి. ప్రెసిడెంట్ గాలో ప్లాజా; రాజధాని, క్విటో.

ఈజిప్టు :

ఆఫ్రికాలోవున్న స్వతంత్ర ముస్లిందేశము. రాజుగల రాజ్యం. పార్లమెంటువుంది. మంత్రులను నియమించే అధికారమూ, బర్తరఫ్ చేసే అధికారమూ, రాజుదే. వైశాల్యం 3,86,110 చ. మైళ్ళు. దీనిలో ప్రజలు నివసించేభాగం, 13,578 చ. మైళ్ళు. 1943 అంచనా ప్రకారం జనాభా. 1,90,90,000 రాజు : ఫరూక్ (ఏప్రెల్ 28. 1936), ప్రధానమంత్రి. మెహర్ పాషా. రాజధాని, కెయిరో.

ఉత్తర ఐర్లండ్ (ఆల్‌స్టర్) :

ఐర్లండు దీవిలో, ఇంగ్లండురాజు పరిపాలనకు లోబడివున్న ఉత్తర భాగం. వైశాల్యం. 5,227 చ. మైళ్లు. జనాభా 1,35.823, దేశంలో ప్రత్యేకం పార్లమెంటుకు బాధ్యులైన మంత్రుల సలహాతో దేశపరిపాలనను సాగిస్తాడు. గవర్నరు : గ్రాన్ విల్ ప్రభువు, ప్రధానమంత్రి, సర్ బెసిల్ బ్రూక్. రాజధాని, బెల్‌ఫాస్టు.

ఉత్తర రోడీషియా :

బ్రిటిషు పరిపాలనలోఉన్న ఆఫ్రికన్ భూభాగం. పరిపాలనాధికారం గవర్నరు చేతిలోవుంది. వైశాల్యం : 2,90,323, చ. మైళ్లు. జనాభా . ఆఫ్రికనులు, 16,34,980 , యూరోపియనులు, 21,919. గవర్నరు, సర్ గిల్బర్ట్ మెక్కాల్ రెన్ని; రాజధాని, లుసాకా.

ఉరూగ్వే:

దక్షిణ అమెరికాలోని చిన్న ప్రజారాజ్యం. వైశాల్యం. 72,180 చ. మైళ్లు. జనాభా, 25,40,466. నాలుగు సంవత్సరాల కొకసారి శాసనసభచే ఎన్నుకోబడే ప్రెసిడెంట్, పరిపాలనను నిర్వహిస్తాడు. దేశంలో పచ్చికబయళ్లు విస్తారంగా వుండడంచేత, పశువుల పెంపకం ఎక్కువగా జరుగుతుంది. మాంసం ఎక్కువగా విదేశాలకు ఎగుమతి అవుతుంది. గోధుమ, మొక్కజొన్న, బార్లీ, యీ దేశంలోని ప్రధాన పంటలు. ప్రెసిడెంట్: సినాడాన్ లూయీ బాటిల్ బెరెస్; రాజధాని, మాంటివిడో.

ఏరా:

ఐర్లెండులో దక్షిణభాగము; స్వతంత్ర ప్రజారాజ్యము; పార్లమెంటుకు బాధ్యులైన మంత్రులద్వారా పరిపాలన జరుగుతుంది. వైశాల్యం: 27,137 చ. మైళ్లు. దీనిలో 20,86,978 ఎకరాలభూమి వ్యవసాయంలోవుంది. జనాభా: 29,52,856. ప్రెసిడెంట్: జాన్ టి. ఓ. కెల్లీ; ప్రధానమంత్రి: ఈమన్ డివెలరా; రాజధాని, డబ్లిన్.

ఉత్తర అట్లాంటిక్ సముద్రంలో ఒక పెద్దదీవి. పూర్వం డెన్మార్కుకు లోబడివుండేది. కాని, 1946లో స్వతంత్ర ప్రజారాజ్యంఅయింది. వైశాల్యం, 40,497 చ. మైళ్లు. జనాభా, 1,32,750. ఈదీవినుంచి ఎగుమతి అయే సరకులు: చేపలు, చేపనూనె, మాంసము, వున్ని, ఆహారధాన్యములు, పంచదార, కాఫీ, ఉప్పు, బొగ్గు, మొదలైననిత్యావసరాలన్నిటినీకూడా, యీ ద్వీపవాసులు దిగుమతి చేసుకోవలసిందే. ప్రధాన మంత్రి, స్టిఫెన్ జొహాన్ స్టిఫెన్సన్; రాజధాని, రేక్‌జావిక్.

క్యూబా:

అమెరికాఖండం సమీపంలోవున్న ఒక చిన్నదీవి. ప్రజారాజ్యం. వైశాల్యం. 44,178 చ. మైళ్లు. జనాభా 51,96,000. దేశంలోని ఎక్కువ భాగంలో చెరకు, పొగాకు, చిరగడదుంపలు, అరటిపండ్లు పండిస్తారు. ప్రెసిడెంట్: కార్లోస్ ప్రయో సాక్రాస్. రాజధాని, హవానా.

కెనడా :

బ్రిటిషుసామ్రాజ్యంలో, స్వపరిపాలనగలదేశం. ఉత్తరఅమెరికా ఖండములోవుంది. వైశాల్యం, 38,45,144 చ. మైళ్లు. జనాభా 1,32,18,000. బ్రిటిషురాజు తరఫున, గవర్నరు—జనరల్ నియామకం జరిగినప్పటికీ, దేశపరిపాలన పూర్తిగా దేశీయ మంత్రులచేతిలోనే వుంటుంది. మంత్రులు, పార్లమెంటుకు బాధ్యులు. జనాభాలో అధిక సంఖ్యాకులు యూరపియను జాతులవారే. లక్షకుపైగా భారతీయులూ, సుమారు 20 వేలమంది నీగ్రోలువున్నారు. దేశంలో పండేపంటల లోగోధుమలు, ఓట్లు,బార్లీ, ముఖ్యమైనవి. దేశంఅంతా 12రాష్ట్రాలుగావిభజింపబడి వుంది. ఒక్కొక్కరాష్ట్రానికి ఒక్కొక్క లెఫ్టినెంట్ గవర్నరూ, మంత్రిమండలీ, శాసనసభా వున్నాయి. కెనడా గవర్నర్ : విన్సెంట్ మాస్సే; ప్రధానమంత్రి : లూయీ సెంట్ లోరాన్; రాజధాని, అట్టావా.

కొరియా :

వైశాల్యం, 85,225 చ. మైళ్లు. జనాభాసుమారు 1,93,69,000. రష్యాకు దక్షిణంగా, జపానుకు ఉత్తరంగావున్నద్వీపం. దీని తీరప్రాంతం అంతా అనేకచిన్నద్వీపాలమయం. 1910లో, దీనిని జపాను తనసామ్రాజ్యంలో కలిపివేసుకున్నది. రెండవ ప్రపంచయుద్ధంలో కొరియాను అమెరికన్ సైన్యాలు, రష్యన్ సైన్యాలు చెరిసగంఆక్రమించుకున్నవి. అమెరికన్ ఆక్రమణలోవున్న దక్షిణకొరియాలో 1948 మేలో ఎన్నికలుజరిగినవి. తత్ఫలితంగా అసెంబ్లీఏర్పడి, కొరియాను రిపబ్లిక్ గా ప్రకటించింది. జూలై 20 తేదీన, డాక్టర్ సింగ్మన్ రీ అధ్యక్షుడుగా ఎన్నుకోబడినాడు. 1948 ఆగస్టు 15 న రిపబ్లికు అవతరణ జరిగింది. అమెరికన్ మిలిటరీప్రభుత్వం అంతరించింది. 1949 జూలై నాటికి, దక్షిణకొరియాలోని అమెరికన్ సైన్యాలు తరలిపోయినాయి. దక్షిణకొరియాకు రాజధాని . సేవూల్.

ఉత్తరకొరియాలో ప్రజాప్రభుత్వం పేరుతో కమ్యూనిస్టుప్రభుత్వం ఏర్పాటు చేయబడింది. దీనికి రాజధాని : ప్యాంగ్ యాంగ్. ప్రధానమంత్రి : కిం ఇర్ సెన్.

1950 జూన్ 25, తేదిన ఉత్తరకొరియా సైన్యాలు దక్షిణకొరియా పైన దాడిచేశాయి. అప్పటినుంచీ యుద్ధం జరుగుతోంది. ప్రస్తుతం యుద్ధ విరామసంధికి సంప్రతింపులు జరుగుతున్నాయి. దక్షిణకొరియాపక్షాన యునైటెడ్ నేషన్సు సైన్యాలు, ఉత్తరకొరియాపక్షాన చైనా సైన్యాలు యుద్ధంలో పాల్గొన్నాయి.

కొలంబియా :

దక్షిణఅమెరికా పశ్చిమోత్తరకోణమునున్న స్వతంత్రప్రజారాజ్యం. వైశాల్యం 4,61,606 చ. మైళ్లు. జనాభా, 1,11,80,000. ఈదేశంలో అడవులుఎక్కువ. బంగారము, వెండి, రాగి, సీసము, గంధ్గ్గు, పచ్చలు ముఖ్యమైన ఖనిజములు. పెట్రోలుకూడా చాలా ఎక్కువగా దొరుకు తుంది. వ్యవసాయపు పంటలు: కాఫీ, ప్రత్తి, అరటిపండ్లు, పొగాకు ముఖ్యమైనవి. ప్రెసిడెంట్ : డాక్టర్ లారియానోగోమెజ్. రాజధాని బొగోట్టా.

కోస్టారికా :

మధ్యఅమెరికాలోని స్వతంత్ర ప్రజారాజ్యం. వైశాల్యం. 23,000 చ. మైళ్లు. జనాభా 7,71,503. నాలుగు సంవత్సరాల కొకసారి ఎన్నుకోబడే ప్రెసిడెంటు దేశ పరిపాలన సాగిస్తాడు. దేశం చాలా సార వంతమైనది. కాఫీ, బియ్యం, మొక్కజొన్న, చెరకు, బంగాళాదుంపలు, కోకో మొదలైనవి ముఖ్యపంటలు; ప్రెసిడెంట్, జోటిలియోఉలేట్; రాజధాని, శాన్ జోస్.

గ్రీస్ :

యూరపులో రాజుగల్ల రాజ్యం. పార్లమెంటువుంది. మంత్రులు చట్టప్రకారం, పార్లమెంటుకు బాధ్యులుగా వుండాలి. ప్రస్తుతం దేశంలో, కమ్యూనిస్టుల తిరుగుబాటువల్ల కల్లోలం ఎక్కువగావుంది. వైశాల్యం: 51,182 చ. మైళ్లు. జనాభా (1947 అంచనా)

77,80,000. ప్రజలలో సగానికి పైగా వ్యవసాయంమీద ఆధారపడి జీవించేవారే. దేశంలో ప్రధానపుపంట పొగాకు. పండినదానిలో సగం ఎగుమతి చేయబడుతుంది. రాజు: పాల్. ప్రధానమంత్రి: జనరల్ నికోలస్ ప్లాస్టిరాస్. రాజధాని, ఏథెన్సు.

ప్రేట్ బ్రిటన్:

ఇంగ్లండు, స్కాట్లండు, వేల్సు అనే మూడు ప్రధానభాగాలుంగల దీవి. వాడుకలో ఇంగ్లండ్ అనీ, గ్రేట్ బ్రిటన్ అనీ, యునైటెడ్ కింగ్‌డం అనీఅంటారు. వైశాల్యం 87,815 చ. మైళ్లు. జనాభా 4,86,84,000. ప్రపంచంలో,యీదేశానికి వున్నంతసామ్రాజ్యం మరేదేశానికీలేదు. ఆస్ట్రేలియా, కెనడా, దక్షిణాఫ్రికా, న్యూజీలెండ్, పాకిస్తాన్ సిలోన్ అనే అధీనరాజ్యాలు, విస్తారంగా వలస రాజ్యాలు.వున్నాయి.

బ్రిటిషువారి పరిపాలనలో, ప్రపంచంలోని అన్ని ఖండాలలోను, ఎక్కడెక్కడ ఎంత భూభాగం వున్నదీ ఈక్రింది పట్టివలన తెలుసుకో వచ్చును.

| | | |
|---|---|---|
| యూరప్‌లో | 1,25,340 | చ. మైళ్లు |
| ఆసియాలో | 15,62,900 | ,, |
| ఆఫ్రికాలో | 46,52,000 | ,, |
| ఉత్తర అమెరికాలో | 38,93,000 | ,, |
| మధ్యఅమెరికాలో | 8,600 | ,, |
| వెస్టుఇండీస్‌లో | 12,000 | ,, |
| దక్షిణ అమెరికాలో | 97,800 | ,, |
| ఆస్ట్రేలియాలో | 33,00,000 | ,, |

అంటే, ప్రపంచపుమొత్తపు భూవైశాల్యం, సుమారు5,55,00,000 చ. మైళ్లలోను. బ్రిటిషువారి పరిపాలనకు లోబడివున్న భూభాగం 1,36,57,640 చ. మైళ్లు.

ఈ దేశం విస్తారంగా పరిశ్రమలు పెంపొందిన దేశం. యంత్రముల వల్ల ఉత్పత్తిఅయిన సరకులను సామ్రాజ్యదేశాలకు పంపి, సామ్రాజ్యదేశాల నుంచి ముడిసరకులను తెప్పించుకొని విశేషలాభాలను పొంది భాగ్యవంతమైన దేశం.

దేశంలో పరిపాలన అంతా రాణి పేరుమీద జరుగుతుంది. ప్రజలు ఎన్నుకున్న పార్లమెంటు సభ్యులలో అధిక సంఖ్యాకులు ఏ పక్షం వారయితే, ఆపక్షనాయకుణ్ణి, ప్రధానమంత్రిగా రాణి నియమిస్తుంది. ఆప్రధానమంత్రి రాణి అంగీకారంతో తన పార్టీ సభ్యులలో తనతో కలసి పని చెయ్యగలవారిని కొంతమందిని మంత్రులుగా నియమించుకొని పరిపాలన సాగిస్తాడు- 1951 ఏప్రిల్ నాటికి టోరీ పక్షంవారు పార్లమెంటులో అధిక సంఖ్యాకులుగా వున్నందున, ఆపక్షానికి చెందిన ప్రభుత్వం అమలులోవుంది.

రాణి : ఎలిజబత్ ; ప్రధానమంత్రి విన్‌స్టన్ చర్చిల్ ; రాజధాని లండన్.

గోతెమాలా :

మధ్య అమెరికాలోని ఒక స్వతంత్ర ప్రజారాజ్యం. వైశాల్యం 45,452 చ. మైళ్లు. జనాభా. 36,06,890. దేశంనుంచి ఎగుమతి అయే సరకులలో ముఖ్యమైనవి, కాఫీ, అరటిపళ్ళు, తోళ్లు, తేనె, బంగారము. ప్రెసిడెంటు : లెఫ్టినెంట్ కర్నల్ ఆర్బెంజ్ గజ్మన్. రాజధాని, గోతెమాలా.

చిలి :

దక్షిణ అమెరికాలోని ఒక స్వతంత్ర ప్రజారాజ్యం. వైశాల్యం, 2,96,717 చ. మైళ్ళు. జనాభా. 56,73,861. ప్రజలలో అధికసంఖ్యాకుల చేత ఎన్నుకోబడిన ప్రెసిడెంటు దేశపరిపాలన జరుపుతాడు. 21 సంవత్సరాల వయస్సుకు పైబడిన వారందరికీ ఓటు హక్కు వుంది. దేశంలో రెండు శాసనసభలు వున్నాయి. వ్యవసాయము, ఖనిజములను త్రవ్వటమూ, ప్రజల ప్రధాన వృత్తులు. ప్రధానపంటలు : గోధుమలు, మొక్కజొన్న, బార్లీ, ఓట్లు, పొగాకు, మిరపకాయలు మొదలైనవి. దేశంనుంచి పండ్లు-కూడా

విస్తారంగా యూరపుకు ఎగుమతి అవుతున్నవి. రాగి, ఇనుము, మెంగనీసు యీ దేశంలో విస్తారంగా దొరికే ఖనిజములు. మిరపకాయలు ఈ దేశం నుంచే, ఇండియాకు వచ్చాయి. అంతకుపూర్వం మనదేశంలో మిరపకాయ లేదు. ప్రెసిడెంటు: గేబ్రియల్ గోంజాలెజ్ విడెలా; రాజధాని, శాంటియాగో.

చెకోస్లోవాకియా :

యూరపు మధ్యభాగంలోని ఒక స్వతంత్ర ప్రజారాజ్యం. 1938 లో యీ దేశాన్నిముందు కొంతభాగాన్ని, తరువాత పూర్తిగాను జర్మనీ ఆక్రమించింది. యుద్ధంవల్ల విస్తారంగా జన, ధన నష్టాలను పొందిన దేశాలలో యిది ఒకటి. దేశపరిపాలన కమ్యూనిస్టు పార్టీ సాగిస్తున్నది. దీని వైశాల్యం, 49,358 చ మైళ్ళు. జనాభా. 1,44,47,000. దేశంలో ఖనిజ సంపద చాలా హెచ్చుగావుందని అంచనా. కాని, యిదంతా త్రవ్వి తియ్యడం యింకా పెద్దయెత్తుమీద జరగడంలేదు. వ్యవసాయం ఆధునిక పద్ధతులమీద బాగా జరుగుతోంది. ప్రెసిడెంట్: క్లిమెంట్ గాట్ వాల్డ్; ప్రధానమంత్రి: ఆంటోనిన్ జాపాట్కీ; రాజధాని, ప్రాహా.

చైనా :

ఆసియాఖండంలోని పెద్దప్రజారాజ్యం. 1937 లో జపాను ఆక్రమణ ఫలితంగా 1945 లో యుద్ధం ముగిసేవరకూ విస్తారంగా ధననష్టాన్నీ జననష్టాన్నీ పొందింది. వైశాల్యం, 43,00,000 చ. మైళ్ళు. జనాభా సుమారు 49 కోట్లు. కమ్యూనిస్టులు దేశాన్నంతటనీ తమ పరిపాలనలోకి తెచ్చుకున్నారు. కమ్యూనిస్టులు ప్రత్యేక ప్రభుత్వాన్ని 1949 అక్టోబర్ 1 తేదిన స్థాపించారు. ఈ ప్రభుత్వానికి అధ్యక్షుడు: మావో చి టుంగ్, ప్రధానమంత్రి: చౌ ఎన్ లే. రాజధాని: పెకింగ్.

జపాన్ :

1939-45 యుద్ధంలో పాల్గొని, ఓడిపోయిన కారణ చేత, మిత్రమండలి ఆక్రమణలోవున్న రాజ్యం. ఆసియాఖండంలో పారిశ్రామికంగా చాలాముందుకు వచ్చినరాజ్యం. ఈ దేశమంతాకూడా, 4,223 చిన్న

ద్వీపాలసమూహం. వైశాల్యం, 47,694 చ. మైళ్ళు. జనాభా 7,31,14,308. 1953 ఏప్రిల్ లో మిత్రమండలి రాజ్యాలు, యీ దేశానికి స్వపరిపాలనను ఇస్తు, ఒడంబడికపై సంతకాలు పెట్టాము. యుద్ధానికి పూర్వం తన ఆక్రమణలోవున్న విశేషసామ్రాజ్యాన్నిం యీదేశం యుద్ధ ఫలితంగా కోల్పోయింది. యుద్ధానంతరం, యీ దేశంలో ప్రజలస్వాతంత్ర్యం కొంత ఎక్కువ అయింది. బ్రిటన్ లోని పరిపాలనా విధానంలాంటి పరిపాలనావిధానం 1947 మే 3 తేదీన అమలులోకి వచ్చింది. చక్రవర్తి: హిరోహిటో; ప్రధానమంత్రి. షిగేరు యోషిదా; రాజధాని, టోకియో.

జర్మనీ :

యూరపులోని ప్రధాన రాజ్యాలలో ఒకటిగా వుండేది 1939-45 లో జరిగిన ప్రపంచయుద్ధానికి యీదేశాన్ని అప్పుడు పాలించిన హిట్లరే కారణ. 1945 మే 8 న జర్మన్ సైన్యాలు మిత్రమండలికి లొంగిపోయాయి. అప్పుడు జర్మనీని నాలుగు భాగాలుగా విభాగించి ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికా, రష్యాలు తమ పరిపాలనలోకి తీసుకున్నాయి. జర్మనీ పరిపాలన విషయంలో ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికాలకూ, రష్యాకూ మధ్య అభిప్రాయభేదాలు కలుగుతూవున్నాయి, మొదటి మూడు దేశాల పరిపాలనలో వున్న మూడు భాగాలనూ 1948 లో ఒకే ప్రాంతంగా కలిపివేసి, మూడురాజ్యాల ప్రతినిధుల పాలనలో వుంచడం జరిగింది. ఈ ప్రాంతానికి పశ్చిమ జర్మనీ అని ప్రస్తుతం వాడుక నామం. 1949 లో, యీ ప్రాంతంలో ప్రత్యేకంగా పార్లమెంటునూ, ప్రభుత్వమును నెలకొల్పడానికి ఎన్నికలు జరిగాయి.

పశ్చిమ జర్మనీ: పశ్చిమజర్మనీ వైశాల్యం 96,077 చ. మైళ్ళు; జనాభా, 4,54,17,033. ఎన్నికలు జరిగిన తరువాత, పార్లమెంటు స్థాపన జరిగింది. పశ్చిమ జర్మనీకి ప్రెసిడెంటుగా డాక్టర్ థియోడోర్ హూస్ 1949 సెప్టెంబరు 12 న ఎన్నుకోబడినారు. ఛాన్సెలర్ (ప్రధానమంత్రిగా డాక్టర్ కాన్రాడ్ అడెనోర్ ఎన్నుకోబడినారు. రాజధాని: బాన్.

తూర్పుజర్మనీ: వైశాల్యం 41,390 చ. మైళ్ళు. జనాభా 1,73,13,581. తూర్పుజర్మనీకి కమ్యూనిస్టు అధ్వర్యాన వేరేప్రభుత్వం 1949 అక్టోబరు 7 న ఏర్పాటు చేయబడింది. ఈ ప్రభుత్వానికి అధ్యక్షుడుగా విల్హెల్మ్ పీక్, ప్రధాన మంత్రిగా ఆటో గ్రోట్‌వోల్డ్ అక్టోబరు 11 న ఎన్నుకోబడినారు. రాజధాని: బెర్లిన్.

అవిభాజ్య జర్మనీకి రాజధానిగావున్న బెర్లిన్ నగరం, ప్రస్తుతం రెండుభాగాలుచేయబడింది. ఒకభాగం రష్యా, మరొకభాగం బ్రిటన్, ఫ్రాన్సు, యునైటెడ్‌స్టేట్సు దేశాల సంయుక్త పాలనలోనువుంది.

జిబ్రాల్టర్:

స్పెయినుదేశానికి దక్షిణంగా, మెడిటరేనియన్ సముద్రంలోవున్న ఒక పెద్దపర్వతం. బ్రిటిషువారి అధీనంలోవుంది. మెడిటరేనియన్ సముద్రంలో యూరపుకు వెళ్ళే ఓడలు యిక్కడ ఆగుతాయి. ఈ ఓడలు చెల్లించే సుంకం, యీ పర్వతప్రభుత్వానికి ఆదాయం. దీని పొడవు 2.¾ మైళ్ళు. వెడల్పు, ¾ మైలు. ఎత్తు 1,336 అడుగులు. జిబ్రాల్టర్ నుంచి స్పెయినుకు చిన్నభూసంధి వుంది. దీని పరిపాలన బ్రిటిషుప్రభుత్వం నియమించిన గవర్నరు సాగిస్తాడు. ఆయన ఆధీనంలో, ఇక్కడ ఎప్పుడూ ఒక సైన్యం వుంటుంది. గవర్నర్. సర్ కెన్నెత్ ఆర్థర్ నోయల్ ఆండర్సన్.

జోర్డన్:

ఆసియాలో ఒక స్వతంత్ర అరబ్బీరాజ్యం. పార్లమెంటువుంది. మంత్రులను పార్లమెంటు సభ్యులలోనుంచి రాజు నియమిస్తాడు. పూర్వం దీనిని ట్రాన్సుజోర్డన్ అనేవారు. పాలస్తీనా విభజనానంతరం, దానిలోని అరబ్బీప్రాంతాన్ని కూడా, యీ దేశం తనలో కలుపుకున్నది. వైశాల్యం: 34,740 చ. మైళ్లు. దీనిలో వ్యవసాయ యోగ్యమైనభూమి, 19,25,000. ఎకరాలు. బీడు 2,05,85,000 ఎకరాలు. జనాభా, 4,30,000. వీరిలో 3,00,000 మంది గృహస్థులు. తక్కినవారు దిమ్మరులు. ప్రజలలో 30,000 మంది అరబ్బీక్రైస్తవులు.

రాజు: తలాల్; ప్రధానమంత్రి; తూఫీక్ పాషా అబ్దుల్లా హూలా; రాజధాని, అమ్మన్.

టర్కీ:

కొంతభాగం యూరపులోనూ, కొంత ఆసియాలోను వున్న స్వతంత్ర ప్రజారాజ్యం. 1923 లో రాజును తొలగించి ప్రజారాజ్యంగా ఏర్పడింది. పార్లమెంటు (గ్రాండ్ నేషనల్ అసెంబ్లీ) వుంది. మంత్రులు అసెంబ్లీకి బాధ్యులు. వైశాల్యం, 294,502 చ. మైళ్ళు; జనాభా: 1,88,98,912. ప్రెసిడెంటు: సెలాల్ బేయార్; ప్రధాన మంత్రి: అద్నాన్ మెండెరిస్; రాజధాని, అంకారా.

టిబెట్:

ఆసియాలోని స్వతంత్ర పీఠాధిపత్య రాజ్యము. ప్రపంచములోని అన్ని దేశాలకన్న ఎత్తునవున్న పీఠభూమి. ఈ దేశంలోని ఏ భాగముకూడా, సముద్రమట్టానికి 10,000 అడుగులకు తక్కువ ఎత్తులోలేదు. వైశాల్యం, 4,63,206 చ. మైళ్ళు. జనాభా, దాదాపు 30 లక్షలు. దేశపరిపాలన అంతా దలైలామా అను పీఠాధిపతి చేస్తాడు. ఇతడే ప్రజలకు మతాధిపతికూడాను. ఒక దలైలామా మరణించితే, అదేసమయంలో, అదేశంలో ఎక్కడైనా పురుషశిశువు జన్మిస్తే, ఆ పురుషశిశువునే దలైలామాగా దేశీయులంతా అంగీకరిస్తారు. ఈ దలైలామాను వెతక కనుక్కోడానికి ఒకొకప్పుడు కొన్ని సంవత్సరాలు పడుతుంది. టిబెట్టునుంచి కస్తూరి, వున్ని మన దేశానికి దిగుమతి అవుతాయి. మనదేశంనుంచి, వస్త్రాలు, వున్ని వస్త్రాలు, ఆహారధాన్యాలు ఎగుమతి అవుతాయి: రాజధాని, లాసా.

1950 అక్టోబర్ 28 తేదీన చైనా, టిబెట్ పైన దండయాత్ర సాగించింది. నవంబరు 13 తేదీనాటికి చైనా సైన్యాలు లాసానగరానికి చేరుకున్నవి.

డామినికన్:

దక్షిణ అమెరికాలోని ఒక స్వతంత్ర ప్రజారాజ్యం. వైశాల్యం 19,322 చ. మైళ్లు; జనాభా, 2,151,000. చెరకు, కోకో, కాఫీ,

పొగాకు యిక్కడ పండే ముఖ్యపంటలు. ప్రెసిడెంట్ : రాఫేల్ ట్రూజిల్లో; రాజధాని, సియుడాడ్ ట్రూజిల్లో.

డెన్మార్క్ :

యూరపు ఉత్తరభాగంలో ఒక స్వతంత్రరాజ్యం. వైశాల్యం 16,576 చ. మైళ్లు; జనాభా, 41,90,000, రెండుశాసనసభలువున్నాయి. మంత్రులు శాసనసభలకు బాధ్యులై పనిచేస్తారు। ప్రజలలో సగంమంది వ్యాపారం, పరిశ్రమలమీద జీవిస్తారు; మూడోవంతుమంది వ్యవసాయం మీద జీవిస్తారు. ఈదేశంనుంచి పశువులు, పందులు, వెన్న ఎక్కువగా ఎగుమతి అవుతాయి ; రాజు : ఫ్రెడెరిక్ ; ప్రధానమంత్రి . హాన్స్ హెడ్‌టాఫ్ట్ ; రాజధాని . కోపెన్‌హాగెన్.

తాయిలాండు (సయాం)

ఆసియాఖండంలోని స్వతంత్రరాజ్యం. బర్మాకు చైనాకు మధ్య ఉన్నది. వైశాల్యం: 1,98,247 చ. మైల్లు. జనాభా, 1,72,56,825. ప్రజలలో అధికసంఖ్యాకులు బౌద్ధమతస్థులు. 1932 వరకూ ఈదేశపురాజు నిరంకుశాధికారిగా వుండేవాడు. కాని తరువాత మంత్రుల సలహా ప్రకారం రాజు పరిపాలన సాగించడానికీ, 150 మంది సభ్యులు గల శాసనసభను నెలకొల్పడానికీ ఏర్పాటు జరిగింది. దేశంలో ప్రధానపంట బియ్యం. చాలాభాగం ఎగుమతి అవుతుంది. బియ్యంకాక, తగరం, టేకు, కలప, రబ్బరుకూడావిస్తారంగా ఎగుమతి అవుతాయి. రాజు భూమిఫణ అతులిత : ప్రధానమంత్రి : మార్షల్ పిబుల్ సంగ్రాం : రాజధాని: బాంకాకు.

తూర్పు ఆఫ్రికా :

ఆఫ్రికా ఖండంలో బ్రిటిషువారి రక్షణలోవున్న కెన్యా. ఉగాండా, టాంగనైకా, జాంజిబారు అనే రాష్ట్రాలు. ప్రతిరాష్ట్రానికీ ఒకొక్క గవర్నరు ఉన్నాడు. ఆయనకు ఆ రాష్ట్రపరిపాలనలో సహాయం చెయ్యడానికి కార్యదర్శులు మొదలైనవారు ఉన్నారు. కెన్యావైశాల్యం: 2,24,960 చ. మైళ్లు ; ఉగాండా: 93,981 చ.

మైళ్లు; (దీనిలో 13,931 చ. మైళ్లు. విక్టోరియా సరస్సు); టాంగనీకా, 3,62,688 చ. మైళ్లు. (దీనిలో సరస్సులు, 20,000 చ. మైళ్లు.) జాంజిబార్, 1,020 చ. మైళ్లు. ఈనాలుగు రాష్ట్రాలలోను వున్న జనాభా (1948 లో) : ఆఫ్రికనులు, 1,43,85,000 ; ఆసియావాసులు, 2,21,550 ; యూరోపియనులు, 53,200 ; కెన్యాగవర్నర్ : మేజర్ జనరల్ సర్ ఫిలిప్ యువన్ మిచ్చెల్; టాంగనైకా గవర్నర్ : సర్ విలియం బాటర్ హిల్; ఉగాండా గవర్నర్, సర్ జాన్ హాతారన్ హాల్ ; జాంజిబార్ సుల్తాన్ : హిజ్ హైనెస్ సయ్యద్ సర్ ఖలీఫా బిన్ హారూబ్: బ్రిటిషు రెసిడెంట్ : సర్ విన్సెంట్ గ్లెంజే.

దక్షిణ రొడీషియా :

ఆఫ్రికాలోని స్వపరిపాలనగల బ్రిటిషు వలసదేశం. పరిపాలన గవర్నరు చేతిమీద జరుగుతుంది. అసెంబ్లీవుంది. వైశాల్యం 1,50,333 చ. మైళ్లు. జనాభా : ఆఫ్రికనులు, 16,30.000; యూరపియనులు, 1,10,000; ఆసియావాసులు, 3,289, ఇతర నల్లజాతులు, 4,880. గవర్నర్ మేజర్ - జనరల్ సర్ జే. ఏన్. కెన్నెడ్, ప్రధానమంత్రి : సర్ గాడ్ ఫ్రై ఎం. హుగిన్స్.

దక్షిణాఫ్రికా (యూనియన్) :

ఆఫ్రికాలో స్వపరిపాలనగల బ్రిటిషు డొమినియను, కేపు ఆఫ్ గుడ్ హోప్, నేటాల్, ట్రాన్సువాల్, అరెంజ్ ఫ్రీస్టేట్ అనే నాలుగు రాష్ట్రాల సమాఖ్య. ప్రతిరాష్ట్రానికీ, రాష్ట్రీయ వ్యవహారాలను చూసుకోడానికి ఒక శాసనసభ వుంటుంది. పరిపాలనా వ్యవహారాలను జరుపడానికి ప్రతిరాష్ట్రానికి ఒక ఎడ్మినిస్ట్రేటరు నియమింపబడుతాడు. యూనియను పరిపాలనకు అధిపతి, బ్రిటిషు ప్రభుత్వం నియమించిన గవర్నరు జనరల్. పరిపాలన నిర్వాహకుడు, యూనియన్ ప్రధానమంత్రి ; ప్రధానమంత్రి నియామకం, యూనియన్ పార్లమెంటులో పార్టీ బలం మీద ఆధారపడివుంటుంది. వైశాల్యం : 4,72,550 చ. మైళ్లు ; (కేప్

ఆఫ్ గుడ్ హోప్, 2,77,113 ; నేటాల్, 35,284 ; ట్రాన్సువాల్, 1,10,450 ; ఆరెంజి ఫ్రీస్టేటు, 49,647). జనాభా [1946]. 1,15,77,280 వీరిలో యూరపియనులు, 23,66,137. ఆఫ్రికనులు, 1,13,57,590 ఆసియావాసులు, [చాలవరకు భారతీయులు] 2,19,690; గవర్నర్-జనరల్: డాక్టర్ ఎర్నెస్టు జాన్సెన్; ప్రధానమంత్రి డాక్టర్ డి. ఎఫ్. మలాన్ రాజధాని, ప్రిటోరియా.

నార్వే :

యూరపులో ఉత్తరపుకొననువున్న స్వతంత్రరాజ్యము. వైశాల్యం 1,24,556 చ. మైళ్లు; జనాభా, 31,98,000. దేశంలో నాల్గవవంతు అడవులు; దేశంలో నలభయ్యోవంతు భూమి మాత్రమే వ్యవసాయానికి పనికివస్తుంది. వ్యవసాయంవల్లనూ, కలప కోతలమీదనూ, జనాభాలో మూడవవంతు మంది ఆధారపడివున్నారు. రెండు శాసనసభలువున్నాయి. మంత్రి మండలి శాసనసభకు బాధ్యులై పనిచేస్తారు. రాజు : హాకన్; ప్రధానమంత్రి : జెరార్డుసెన్ ; రాజధాని, ఆస్లో.

నికరాగువా :

మధ్యఅమెరికాలోని ప్రజారాజ్యం. వైశాల్యం. 51,660 చ. మైళ్లు. జనాభా, 11,36,000. ప్రజలచేత, నాలుగు సంవత్సరాలకొక సారి ఎన్నుకోబడే ప్రెసిడెంటు, పరిపాలన సాగిస్తాడు. కాఫీ, అరటి పళ్ళు, పంచదార, కలప, పొగాకు, మొక్కజొన్న, బియ్యం, కోకో మొదలైనవి, ఈదేశపు ముఖ్యపంటలు. ప్రెసిడెంటు : జనరల్ అనాస్టాసియో సొమోజా ; రాజధాని, మానాగువా.

నేపాల్ :

భారతదేశానికీ, టిబెట్టుకూమధ్య, హిమాలయపర్వత పాదంవద్ద వున్న స్వతంత్ర హిందూరాజ్యం. వైశాల్యం, 54,000 చ, మైళ్లు; జనాభా, 70,00,000. బియ్యము, తోళ్ళు, తిలధాన్యములు, నెయ్యి, పశువులు, జనపనార, కలప, యీదేశంనుంచి ఎక్కువగా ఇండియాకు ఎగుమతి అవుతాయి. బట్టలు, పంచదార, ఉప్పు, లోహములు దిగుమతి

అవుతాయి. ఈ దేశస్థులను గూర్ఖాలు అంటారు. భారతదేశంలోని సైన్యంలో వీరు ఎక్కువగా వున్నారు. రాజు : త్రిభువన వీరవిక్రమ షాదేవ : రాజధాని; ఖాట్మండు.

1950 నవంబరు 7 తేదీన నేపాల్ రాజు త్రిభువన వీరవిక్రమషా దేవ, తన ఇరువురు రాణులతోను, ముగ్గురు కుమారులతోను, ఇద్దరు కుమార్తెలు, ఇద్దరు కోడళ్ళు, పెద్దమనుమనితో, ఖాట్మండులోని భారత రాయబారీ కార్యాలయంలోకి వచ్చి రక్షణ కోరాడు. వెంటనే, నేపాల్ ప్రధాని మోహనషంషేర్‌జంగ్ బహదూర్ రాణా నేపాల్ పార్లమెంటును సమావేశపరచి, రాజు రెండవ మనుమడు మూడేళ్ళబాలుని (జ్ఞానేంద్ర షంషేర్ంగ్ బహదూర్) నేపాల్ రాజుగా ప్రకటించాడు.

ఇండియా ప్రభుత్వం, నేపాల్ ప్రధానితో జరిపిన రాయబారాల ఫలితంగా, రాజును, రాజకుటుంబాన్ని విమానాలలో నవంబరు 11 తేదీన ఢిల్లీకి తీసుకురావడం జరిగింది.

ఈ సంఘటన తెలిసినవెంటనే, నేపాల్ కాంగ్రెసువారు, నేపాల్ ప్రభుత్వాన్ని స్వాధీన పరచుకోడానికి తిరుగుబాటు లేవదీసి, ప్రభుత్వ కార్యాలయాలపై దండయాత్ర జరిపారు.

తరువాత, నేపాల్ ప్రధానమంత్రితరఫున రాయబారులు ఢిల్లీకి వచ్చి, ఇండియా ప్రభుత్వంతో జరిపిన రాయబారాల ఫలితంగా, ఇండియా ప్రభుత్వం చేసిన సలహాను నేపాల్ ప్రధానమంత్రి అంగీకరించి, ఇండియాకు వచ్చిన నేపాల్ రాజు పునరాగమనానికిన్ని, ఆయనకు నేపాల్‌కు తిరిగివెళ్లేలోపునఆయన తరఫున రాజ కార్యాలను చూడడానికి ఒక ప్రతినిధిని నియమిస్తే ఆయనకు రాజాధికారాలు వుండడానికన్ని, వీలైనంత త్వరలో నేపాల్‌లో సగంమంది ప్రజాప్రతినిధులలోకూడిన 14 మందిగలమంత్రి మండలిని ఏర్పాటు చెయ్యడానికీ, 1952 లోపల దేశంలో ప్రజాప్రతినిధులతో రాజ్యాంగ పరిషత్తును ఏర్పాటు చెయ్యడానికీ అంగీకరిస్తూ, ప్రధానమంత్రి 1951 జనవరి 8 తేదీన ఒక ప్రకటన చేశారు.

ప్రధానమంత్రి ప్రకటనకు అమోదం తెలుపుతూ నేపాల్ రాజు త్రిభువన్, జనవరి 10 తేదీన పత్రికా ప్రకటన చేశారు. తరువాత ప్రధాన మంత్రికి నేపాల్ కాంగ్రెసు ప్రతినిధులకూ మధ్య సంప్రతింపులు జరిగి నూతన మంత్రిమండలిని ఏర్పాటుచేసే విషయంలో ఒడంబడిక కుదిరింది. రాజు 1951 ఫిబ్రవరి 13 తేదీన తిరిగి తన రాజ్యానికి చేరుకున్నాడు. అయిదుగురు కాంగ్రెసు ప్రతినిధులు, ఐదుగురు ప్రధానమంత్రి ప్రతినిధులతో నూతన మంత్రిమండలి ఫిబ్రవరి 13 తేదీన ఏర్పాటుచేయబడింది. మంత్రివర్గంలో పొత్తుకుదరనందున, నేపాల్ కాంగ్రెసు ప్రతినిధులు 1951 నవంబరులో మంత్రిమండలినుంచి రాజీనామా ఇచ్చారు. నవంబరు 15 న ప్రధానమంత్రికూడా రాజీనామా ఇచ్చాడు. నవంబరు 16 న నేపాల్ కాంగ్రెసు ప్రతినిధులు ఏడుగురు, ఇతరులు ఐదుగురు గల మంత్రిమండలి ఏర్పాటుచేయబడింది. ప్రధానమంత్రి, మైత్రికా ప్రసాద కోయిరాల.

## న్యూజీలెండ్ :

బ్రిటిషురాజుకు లోబడిన అధీనదేశం. వైశాల్యం, 103,416 చ. మైళ్లు. జనాభా, 19,69,162. ఆస్ట్రేలియా ఖండానికి 1,200 మైళ్ళ దూరంలో దక్షిణ పసిఫిక్ మహాసముద్రంలోవున్న 15 దీవుల సమూహం. జనాభాలో ఇంగ్లండునుంచి వలసవెళ్లిన తెల్లవారు, ఆదీవి ఆదిమనివాసులైన మయోరీజాతివారు [1,12,669] అధిక సంఖ్యాకులు. బ్రిటనుకు యీ దీవినుంచి వెన్న, మాంసము అత్యధికంగా ఎగుమతి అవుతాయి. గవర్నరు జనరల్ : సర్ విల్లాబీ నోరీ; ప్రధానమంత్రి : సిడ్నీ హాలెండ్ ; రాజధాని, వెల్లింగ్టన్.

## పాలస్తీనా :

1922 లో అమలులోకివచ్చిన మాండేట్ ప్రకారం 1948జూలై 1 వరకు బ్రిటిషువారి పరిపాలనలో వున్నదేశం. స్వపాలన అంతా హైకమిషనరు చేతిలోవుండేది. దేశం మాది అని అరబ్బులూ, యూదులూ తగాదా లాడుకున్నారు, వీరుభయులకూ ఒడంబడిక

కుదర్చడానికి బ్రిటిష్ ప్రభుత్వము చేసిన ప్రయత్నములేవీ ఫలించలేదు. ఈ తగాదా పరిష్కారాన్ని సంయుక్తరాజ్యసమితికి వప్పగించడానికి బ్రిటిష్ ప్రభుత్వం నిశ్చయించుకున్నట్లు బ్రిటిష్ ప్రధానమంత్రి 1947 ఫిబ్రవరిలో ప్రకటించాడు. తరువాత సంయుక్తరాజ్యసమితివారు, పాలస్తీనా సమస్యనుగురించి చర్చించి, యీదేశాన్ని యూదులకూ, అరబ్బులకూ మధ్య విభజించడానికి నిశ్చయించారు. ఆ ప్రకారం విభజన గింది. యూదులకు యివ్వబడినభాగం 'ఇస్రాయిల్' అనే పేరుతో స్వతంత్రరాజ్యంగా ప్రకటింపబడింది. తక్కినదేశాన్ని ట్రాన్స్‌జోర్డన్ దేశం, తనలోకలిపివేసుకున్నది. అంచేత, పేరుకు పాలస్తీనా అనేదేశం నేడు లేదనే చెప్పాలి.

పెనామా :

ఉత్తర, దక్షిణఅమెరికాలను రెంటినీకలిపే చిన్నతోకలాంటి భూభాగం; ప్రజారాజ్యం. వైశాల్యం, 31,890 చ. మైళ్లు; జనాభా, 7,46,000, భూమి చాలా సారవంతమైనది. కాని, అధికభాగం వ్యవసాయంలో లేదు. ఇక్కడపండే ప్రధానపంటలు, అరటిపండ్లు, కొబ్బరికాయలు, కాఫీ, కోకో .ఈదేశం వెడల్పు 47 మైళ్లు. ప్రెసిడెంట్ : డాక్టర్ ఆర్నుల్ఫో ఆరియాస్; రాజధాని, పెనామా.

పెరాగువే :

దక్షిణఅమెరికాలోని ఒక స్వతంత్ర ప్రజారాజ్యం; వైశాల్యం: 62,000 చ. మైళ్లు. జనాభా 12,00,000. పొగాకు, నారింజ మొక్కజొన్న, బియ్యం, చెరకు, వేరుశెనగ, యీ దేశపు ప్రధానపంటలు. ప్రెసిడెంట్ : డాక్టర్ ఫ్రెడరికో చావెజ్; రాజధాని, ఎసన్షన్.

పెరు :

దక్షిణఅమెరికాలో ఒకప్రజారాజ్యం. దీనివైశాల్యం 5,32,616 చ. మైళ్లు; జనాభా, 79,91,777. పెట్రోలు, బంగారం, వెండి. రాగి తగరము మొదలైన ఖనిజాలు ఎక్కువగా దొరుకుతవి. ప్రెసిడెంట్ : జనరల్ మాన్యుయెల్ ఎ. ఓడ్రియా; రాజధాని, లిమా.

పెర్షియా :

ఆసియాలో ఒక స్వతంత్ర ముస్లిందేశము; చక్రవర్తిగలరాజ్యం; పార్లమెంటు (మజిలిస్) వుంది. ప్రధానమంత్రి, తక్కిన మంత్రులను నియమిస్తాడు. ఈ మంత్రుల నియామకానికి మజిలిస్ వొప్పుకోవాలి. వైశాల్యం సుమారు 6,28,000 చ. మైళ్లు, జనాభా సుమారు 150,00,000. చక్రవర్తి. మహమ్మద్ రిజాషా పహ్లవి; ప్రధానమంత్రి: హుసేన్ అలా; రాజధాని: టెహరాన్.

పోర్చుగల్ :

యూరప్‌లో ఒక ప్రజారాజ్యం. పార్లమెంటువుంది. మంత్రులు ప్రెసిడెంటుకు బాధ్యులుకాని, పార్లమెంటుకుకాదు. వైశాల్యం పోర్చుగల్: 34,500 చ. మైళ్లు. దీనికిలోబడి, చుట్టుప్రక్కలవున్న దీవులు 1,196 చ. మైళ్లు. వలససామ్రాజ్యం. 8,09,515 చ. మైళ్లు. జనాభా: పోర్చుగల్ 83,11,000. ప్రధానమంత్రి : డాక్టర్ ఆంటోనియో డి ఒలివీరా సాలాజార్; రాజధాని; లిస్బన్.

పోలెండ్ :

మొదటి ప్రపంచయుద్ధానికి పూర్వం, కొంతభాగం రష్యనుల అధీనంలోనూ, కొంతభాగం జర్మనుల అధీనంలోనూ వున్న పోలెండ్, స్వతంత్రరాజ్యంగా 1918 నవంబరులో ప్రకటింపబడింది. తరువాత, 1939 సెప్టెంబరు 1 వ తేదీన జర్మనీ; పోలెండ్‌పై దాడిచేసింది. కొంతభాగం జర్మనీ, కొంతభాగం రష్యా ఆక్రమించాయి. మళ్లీ 1944 అంతానికి పోలెండు చాలాభాగంనుంచి జర్మనులు తరిమివేయబడినారు. ప్రస్తుతం, పూర్వపు పోలెండులో కొంతభాగం రష్యా ఆక్రమించుకున్నా, మిగతా దేశం ప్రజారాజ్యంగావుంది. పరిపాలనను కమ్యూనిస్టుపార్టీ సాగిస్తున్నది. వైశాల్యం, 1,50,000 చ. మైళ్లు, జనాభా, 2,39,11,000. గుడ కొంలలో కొన్నిల లమంది ప్రజలను జర్మనులు హత్యచేశారు. ప్రెసిడెంట్: బోలెస్లా బైరట్; ప్రధానమంత్రి: సైరాంకీవిజ్; రాజధాని: వార్సా.

ఫ్రాన్సు :

యూరప్‌లో, ఉత్తరపుతీరంనుంచి మధ్యవరకు ఉన్న స్వతంత్ర ప్రజారాజ్యం. వైశాల్యం. 2,12,895 చ. మైళ్లు. జనాభా 4,24,00,000. రెండవ ప్రపంచయుద్ధంలో జర్మనీ ఆక్రమణలోవుండి చాలా దెబ్బతిన్న దేశం. పార్లమెంటుకు బాధ్యులైన మంత్రివర్గంవుంది. ఫ్రాన్సుకులోబడి వున్న సామ్రాజ్యం విస్తీర్ణం 37,50,000 చ. మైళ్లు. ఈ సామ్రాజ్యం లోనిజనాభా, 6,30,00,000. ప్రెసిడెంట్: విన్సెంట్ ఆరియోల్; ప్రధానమంత్రి: ఎడ్గార్ ఫార్; రాజధాని: పారిస్.

ఫిన్లెండ్ :

రష్యాకు పశ్చిమోత్తరంగా వున్నద్వీపం. స్వతంత్ర ప్రజారాజ్యం. గత ప్రపంచయుద్ధంవల్ల కొంతభూభాగాన్ని, జనాభానూ కోల్పోయిన దేశాలలో ఒకటి. వైశాల్యం, 1,30,162 చ. మైళ్లు. జనాభా, 40,52,000. రష్యాను మినహాయిస్తె దీనినిమించి కలప విస్తారముగాగల మరొకదేశం ఏదీ యూరప్‌లోలేదు. కలప, కాగితము, జనప యీ దేశం నుంచి ఎగుమతి అవుతవి. ప్రెసిడెంటు: డాక్టర్ జుహో పాసికివి; ప్రధానమంత్రి: కార్ల్ ఆగస్ట్ ఫాగర్‌హోం; రాజధాని, హెల్సింకి.

ఫిలిప్పైన్సు .

ఆసియాఖండానికి ఆగ్నేయంగా, 500 మైళ్ల దూరంలో పసిఫిక్ మహాసముద్రంలోవున్న 7090 ద్వీపాలసమూహం. వీటిలో పెద్దద్వీపాలు 11. వాటివైశాల్యం, 1,06,914 చ. మైళ్లు. మొత్తం దేశపు వైశాల్యం 1,14,834 చ. మైళ్లు. జనాభా, 1,92,34,182. గత ప్రపంచయుద్ధానికి పూర్వం, యీదేశం యునైటెడ్ స్టేట్సుకు లోబడి స్వపరిపాలన హక్కు కలిగివుండేది. గతయుద్ధంలో యీదేశాన్ని జపాను ఆక్రమించుకున్నది. యుద్ధంలో విశేషంగా జననష్టాన్నీ ధననష్టాన్నీ పొందిన దేశాలలో ఇది ఒకటి. యుద్ధానంతరం యునైటెడ్‌స్టేట్సు ప్రభుత్వం ఫిలిప్పైన్సుదీవుల స్వాతంత్ర్యాన్ని అంగీకరించింది. 1946 జులై 4 తేదీన ఈ దీవులు స్వతంత్ర ప్రజారాజ్యంగా ఏర్పడినవి. ప్రెసిడెంట్ : ఎల్పిడియో క్విరినో; రాజధాని, మనిలా.

బర్మా :

భారతదేశానికి తూర్పున, అస్సాం బెంగాల్ రాష్ట్రాలతో సరిహద్దు కలిగిన ప్రజారాజ్యం. 1937 ఏప్రిల్ 1 తేదివరకు, ఇండియా వైస్రాయి అధికారానికి లోబడిన ఒక రాష్ట్రంగావుండేది. కాని, ఆతరువాత వేరుగా బ్రిటనులోని బర్మా మంత్రికి (భారతదేశానికి, బర్మాకు ఒకేమంత్రివుండే వాడు) బాధ్యుడైన గవర్నరు పరిపాలనకు లోబడిన ప్రత్యేక దేశంగా, వేరుచేయబడినది. 1941 డిసెంబరులో జపానుయుద్ధంలో ప్రవేశించి, 1942 మధ్యలో యీ దేశాన్ని పూర్తిగా ఆక్రమించుకొన్నది. 1943 నుంచీ దేశంలో కొంతమంది జపాను పరిపాలనను ధిక్కరిస్తూవచ్చినా, 1945లో యుద్ధం పూర్తిఅయినతరువాతగాని దేశం సంపూర్ణంగా జపానువారి చేతి లోనుంచి విడిపింపబడలేదు. భారతీయులలాగనే, బర్మా ప్రజలుకూడా స్వాతంత్ర్యంకోసం ఆందోళన చేస్తూవచ్చారు. ఈ ఆందోళన ఫలితంగా, దేశంలో కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీని ఏర్పాటుచేసి, ఆ అసెంబ్లీ తయారు చేసిన పరిపాలనావిధానాన్ని దేశంలో అమలుజరిపి, దేశానికి స్వాతంత్ర్యం యివ్వడానికి బ్రిటిషు ప్రభుత్వంవారు అంగీకరించారు. కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ ఎన్నికలు 1947 ఏప్రిల్ నెలలో పూర్తి అయాయి. ఈ కన్‌స్టి ట్యుయెంట్ అసెంబ్లీ బర్మాను ప్రజారాజ్యంగా ప్రకటించింది- 1948 జనవరి 4 న బర్మా ప్రజారాజ్యమైంది. దేశం వైశాల్యం, 2,61,610 చ మైళ్లు. జనాభా, సుమారు 1,80,00,000. ఇక్కడ ముఖ్యమైనపంట బియ్యం. బియ్యము, టేకు, పెట్రోలు, వజ్రాలు ఈదేశనుంచి ఎక్కువగా ఎగుమతి అవుతాయి. ఎగుమతిఅయే బియ్యంలో చాలాభాగం మనదేశా నికే. ప్రెసిడెంట్ డాక్టర్ బా యు; ప్రధానమంత్రి : యు ను; రాజ ధాని : రంగూన్.

బల్గేరియా :

యూరప్ ఖండంలోని స్వతంత్ర ప్రజారాజ్యం. పరిపాలనను కమ్యూనిస్టుపార్టీ సాగిస్తున్నది. యుద్ధంవల్ల కొంత భూభాగాన్ని, జనాన్నీ కోల్పోయినదేశాలలో యిదిఒకటి. వైశాల్యం. 42,808చ. మైళ్ళు.జనాభా

70,22,206. జనాభాలో ముప్పాతిక వంతులు చిన్న చిన్న భూములలో సేద్యంమీద ఆధారపడి జీవించేవారు. గోధుమ, బార్లీ, ఓట్లు, మొక్క జొన్న, పొగాకు, చెరకు, పండ్లు, కూరగాయలు మొదలైనవి పండిస్తారు. బొగ్గు విస్తారంగా దొరుకుతుంది. రాగి, సీసము, ఇనుము, మెంగనీసు మొదలైన ఖనిజములుకూడా ఎక్కువగా వున్నాయి. గతయుద్ధానంతరం రాజరికానికి స్వస్తిచెప్పిన రాజ్యాలలో ఇదిఒకటి. ప్రెసిడెంట్ : డాక్టర్ మించో నీచెల్; ప్రధానమంత్రి : వాసిల్ కోలారావ్.

## బ్రజిలు :

దక్షిణ అమెరికాలోని ఒక ప్రజారాజ్యం. వైశాల్యం, 32,89,440 చ. మైళ్ళు. జనాభా 4,80,00,000. అమెజాన్, శావో ఫ్రాన్సిస్కో, పెరాగువే మొదలైన పెద్దనదులువుండడంవల్ల భూమి సారవంతమైనది. అడవులు జాస్తి. వ్యవసాయభూమి చాలాఎక్కువ. ఖనిజసంపద అధికం దేశం చాలా భాగ్యవంతమైనది. ఇక్కడపండే ముఖ్యమైన పంటలు, కాఫీ, మొక్కజొన్న, పంచదార, బియ్యం, ప్రత్తి మొదలైనవి. పశువుల పెంపకంకూడా ప్రజల ముఖ్యవృత్తులలో ఒకటి. బంగారం, వెండి, ఇనుము, వజ్రములు మొదలైన ఖనిజములు విస్తారంగా దొరుకుతవి. ప్రెసిడెంట్ : డాక్టర్ జెటూరియో వర్గాస్.; రాజధాని : రియోడిజనీరో.

## బెల్జియం :

గత ప్రపంచయుద్ధంలో జర్మనుల ఆక్రమణలోవుండి, విశేషంగా కష్టనష్టాలకు గురిఅయిన యూరపియను రాజ్యాలలో ఒకటి. దేశం శత్రువుల ఆక్రమణలో వుండగా, శత్రువులతో సహకారం చేసినట్లు రాజుపట్ల అనుమానం కలిగినందున, ఈదేశస్థులు రాజును మఱల సింహాసనం ఎక్కనియ్యలేదు. రాజుమీద ఆరోపణలు ఇదమిత్థం తేలేదాకా, రాజు తరఫున రాజుతమ్ముడు రాజ్యాధికారం సాగించాడు. 1950 జూలైలో రాజు తిరిగి దేశానికి వచ్చాడు. కాని తన అధికారాన్ని కుమారుడు బాడూయిన్‌కి అప్పగించవలసి వచ్చింది. దేశం వైశాల్యం 11,750 చ. మైళ్లు, జనాభా 3,86,553. ప్రజల ప్రధానవృత్తులు, వ్యవసాయము, అడవులలో కలప

కోత. పరిశ్రమలుకూడా విస్తారంగా అభివృద్ధికి వచ్చినదేశం. బట్టలు,అద్దములు, లేసు, పంచదార, పలక రాళ్ళు మొదలైనవి ఎక్కువగా ఎగుమతి అవుతవి. రాజు, లియోపాల్డ్; రీజెంట్ : ప్రిన్సుబాడూయిన్; ప్రధాన మంత్రి : జొసెఫ్ ఫొలియెను; రాజధాని : బ్రస్సెల్సు.

బొలీవియా :

దక్షిణ అమెరికాలోని స్వతంత్ర రాజ్యము. వైశాల్యం 4,15,000 చ. మైళ్లు. జనాభా. 37,87, 800. వ్యవసాయం, గనులను త్రవ్వడం, ఇక్కడిప్రజల ప్రధానవృత్తులు. బంగారము, తగరము, రాగి, గంధకము మొదలైన ఖనిజములు ఎక్కువగా త్రవ్వితీస్తారు. ఈదేశపు పంటలలో ముఖ్యమైనవి: ఓయ్యం, బార్లీ మొక్కజొన్న, ప్రత్తి, బంగాళాదుంపలు. కోకో, నీలిమందు మొదలైనవి. ప్రెసిడెంట్: మామెర్టో ఉరియో లాగోటియా; రాజధాని, లాపాజ్.

భూటాన్ :

భారతదేశానికి యీశాన్యదిక్కున, హిమాలయపర్వతాల పాదాల వద్దనున్న స్వతంత్రరాజ్యం. అయితే,1918 లో జరిగిన ఒడంబడికను అనుసరించి విదేశవ్యవహారాలవిషయంలో బ్రిటిష్ప్రభుత్వంవారి సలహా ప్రకారం నడచుకోవడానికి భూటాణ ప్రభుత్వం అంగీకరించింది. ఇండియాలో బ్రిటిషుపరిపాలన అంతరించినందున, ఇండియా ప్రభుత్వానికీ భూటాన్ ప్రభుత్వానికీ 1949 ఆగస్టులో ఒక ఒడంబడిక జరిగింది. ఈ ఒడంబడిక అమలులోవున్నంతకాలము, ఇండియాప్రభుత్వం భూటాన్ ప్రభుత్వానికి ఏడాదికి అయిదులక్షల రూపాయలు ఇస్తారు. భూటాన్ విదేశాలతో పెట్టుకొనే సంబంధాలు ఇండియాప్రభుత్వపు సలహాను అనుసరించి వుంటాయి. ఈదేశపు వ్యాపారమంతా, భారతదేశంతోనే జరుగుతుంది. వైశాల్యం, సుమారు 17,750 చ. మైళ్ళు. జనాభా సుమారు 4 లక్షలు. రాజు, జిగ్మెదొర్జీ వాంగ్ చుక్; రాధాని. పునఖ.

మలయా :

ఆసియాఖండములో, సయాంకు దక్షిణంగా హిందూ మహాసముద్రంలోవున్న ద్వీపకల్పం. దీనిలో కొంతభాగం, బ్రిటిషువారి పరిపాలనలోనేవుంది. కొంతభాగం బ్రిటిషువారి అధికారాన్ని ఒప్పుకొని, పరిపాలన సాగించుకొనే సుల్తానుల చేతిలోవుంది. ఈ మలయా అంతటి వైశాల్యం, 53,243 చ. మైళ్ళు. జనాభా 48,67,401. గత యుద్ధంలో మలయానంతటినీ జపానువారు ఆక్రమించుకున్నారు. వీరి దౌర్జన్యాల ఫలితంగా విశేష జననష్టాన్ని, ధననష్టాన్నీ పొందినదేశాలలో యిది ఒకటి. యుద్ధానంతరం, యీ దేశమంతా యూనియన్ ఆఫ్ మలయా అనే పేరుతో, ఒక కమిషనర్ జనరల్ పరిపాలనలోకి తీసుకొని రాబడింది. కమిషనర్ - జనరల్ : మాల్కొం మేక్డొనాల్డ్. మలయాలో రబ్బరు విశేషంగా ఉత్పత్తి అవుతుంది. మనదేశంనుంచి చాలామంది యీ రబ్బరుతోటలలో పని చెయ్యడానికి మలయావెళ్ళి, అక్కడవున్నారు; గవర్నర్ : సర్ హెన్రీగిర్నె. రాజధాని : కోలాలంపూర్.

మలయా దక్షిణాగ్రంలో సింగపూరు అనే దీవి వుంది. హిందూ మహాసముద్రంలో ఒక నౌకాకేంద్రంగా, సింగపూరు చాలా ప్రధాన స్థానాన్ని పొందింది. సింగపూరు ప్రత్యేకం ఒక గవర్నరు పరిపాలనలో వుంది. సింగపూరు గవర్నరు, సర్ ఫ్రాంక్లిన్ గింప్సన్.

మాల్టా :

మెడిటరేనియన్ సముద్రంలోని ఒక దీవి. బ్రిటిషువారి అధీనంలో వుంది. వైశాల్యం, 94.9 చ. మైళ్లు. జనాభా సుమారు రెండున్నర లక్షలు. గత యుద్ధంలో, యీ దీవిని ఆక్రమించుకోడానికి జర్మనులు విశ్వప్రయత్నం చేశారు. ఈ దీవిమీద చేసినన్ని విమాన దాడులు జర్మనులు మరెక్కడా చేయలేదు. గవర్నరు : సర్ జెరాల్డ్ క్రీసే. రాజధాని, వేలెట్టా.

మంగోలియా :

చైనాకు, రష్యాకు మధ్యనున్న దేశం. వైశాల్యం దాదాపు 20,00000 చ. మైళ్ళు. జనాభా సుమారు 50,00,000. దేశంలో కమ్యూనిస్టు ప్రభుత్వం పరిపాలన సాగిస్తున్నది.

మెక్సికో :

ఉత్తర అమెరికా దక్షిణాగ్రంలోవున్న ప్రజారాజ్యం. వైశాల్యం. 7,58,000 చ. మైళ్లు. జనాభా, 2,38,76,343. ఈ దేశంలో పెట్రోలు విస్తారంగా దొరుకుతుంది. బంగారము, వెండి, రాగి, సీసము, ఇనుము, బొగ్గు మొదలైన ఖనిజ సంపత్తికూడా చాలా హెచ్చు. మొక్కజొన్న, గోధుమ, పంచదార, కాఫీ, మొదలైనవి ముఖ్యపంటలు. దేశంలో అనేకమైన పురాతన కట్టడములు భూగర్భంలో వున్నాయి. ఇటీవల, వాటిని వెలువరించడంలో చాలా కృషి జరుగుతున్నది. ప్రెసిడెంట్ : డాన్ మైగల్ ఆలెమెన్ ; రాజధాని, మెక్సికో.

మెడగాస్కర్ :

ఆఫ్రికాకు ఆగ్నేయంగావున్న ఫ్రెంచివారి పరిపాలనలోవున్న దేశం. వైశాల్యం 2,28,000 చ. మైళ్ళు. జనాభా సుమారు 4 లక్షలమంది. వ్యవసాయము, పశువుల పెంపకము ప్రజల ముఖ్యవృత్తులు. బంగారము, వెండి, తోళ్ళు, బియ్యము, కలప, రబ్బరు హెచ్చుగా ఎగుమతి అవుతవి. గవర్నర్-జనరల్ : డి. సెంట్ మార్టు; రాజధాని: టననరివ్.

మొనాకో :

యూరప్ ఖండంలో మెడిటరేనియన్ తీరంలో, ఫ్రాన్సుదేశాన్ని ఆనుకునివున్న ఒక చిన్న రాజ్యం. ఇది మూడుమైళ్ళు పొడవు, $1\frac{1}{2}$ మైళ్ళు వెడల్పుగల భూభాగం. జనాభా. 19,242. ఈ చిన్నరాజ్యమంతా ఇరామయం అవడంచేత, ఎక్కడా వ్యవసాయం ఏమీ జరుగదు. సంవత్సరానికి దాదాపు 20 లక్షలమంది విదేశస్థులు ఇక్కడకువచ్చి కొంతకాలమ్లో వుండి పోతూవుంటారు. రాజు : గ్రైనియర్ III.

మొరాక్కో :

ఆఫ్రికా పశ్చిమోత్తర భాగంలో వున్న దేశం. వైశాల్యం. 1,73,150 చ. మైళ్ళు. జనాభా, సుమారు 88,30.000. ఈ దేశం ఫ్రెంచివారి పర్యవేక్షణ క్రిందివున్న భాగం కొంత, స్పెయిను పర్యవేక్షణ క్రిందవున్న భాగంకొంత. దేశానికంతకూ ఒక సుల్తాన్ వున్నాడు. ఆయన తరఫున ఫ్రెంచి ప్రభుత్వం అత్యధికంగా అధికారాల్ని చెలాయిస్తుంది విదేశ వ్యవహారాలన్నీ ఫ్రాన్సు చేతిమీదగానే పరిష్కారం అవాలి. సుల్తాన్: సిది మహమ్మద్.

యుగోస్లావియా :

1939-45 యుద్ధఫలితంగా 1946 లో ప్రజారాజ్యమైంది. కమ్యూనిస్టులు పరిపాలన సాగిస్తున్నారు. వైశాల్యం, 96,265 చ. మైల్లు. జనాభా 13,934,000. దేశంలోని ప్రజలలో నూటికి 75 వంతులమంది వ్యవసాయం మీద ఆధారపడి జీవించేవారు. ప్రెసిడెంట్ : డాక్టరు ఇవాన్ రిబార్; ప్రధానమంత్రి: మార్షల్ జోసిప్ టైటో; రాజధాని: బెల్‌గ్రేడ్.

యునైటెడ్ స్టేట్స్ :

ఉత్తర అమెరికాలోని స్వతంత్ర ప్రజారాజ్యం. విస్తారంగా పరిశ్రమలవల్లను, ఇతరదేశీయ సంపదవల్లను ప్రపంచంలోని గొప్పరాజ్యాలలో ఒకటిగా పరిగణింపబడుతున్నది. ప్రపంచంలోని అన్నిదేశాలలోకి భాగ్యవంతమైనదేశం ఇదే. వైశాల్యం, 30,22,387 చ. మైళ్ళు. జనాభా (1950)—15,06,97,361; దేశంమొత్తం 49 రాష్ట్రాల సామాఖ్య. ప్రతిరాష్ట్రమూ, ప్రజలచే ఎన్నుకోబడిన గవర్నరు పరిపాలనలోవుంది. దేశమంతటి పరిపాలనా, నాలుగేసి సంవత్సరాలకొకసారి ప్రజలచే ఎన్నుకోబడిన ప్రెసిడెంటు చేతిలోవుంది. తన మంత్రులను యీ ప్రెసిడెంటే నియమించుకుంటాడు. ఈ మంత్రుల నియామకం, శాసనసభ (సెనేట్) అంగీకారంమీదనే జరుగుతుంది. విదేశ వ్యవహారాలుకూడా, సెనేట్ అంగీకరించిన సూత్రాలమీదనే, ప్రెసిడెంట్ నిర్వహిస్తాడు. శాసనసభలు (సెనేట్, హౌస్ ఆఫ్ రిప్రజెంటేటివ్స్ కలిసి, కాంగ్రెసు),

ఆమోదించిన శాసనాలను ప్రెసిడెంట్ అంగీకరించక పోవచ్చును ఒకసారి ప్రెసిడెంట్ అంగీకరించని శాసనాన్ని రెండు సభలూ, మూడింట రెండువంతుల మెజార్టీతో ఆమోదించినట్లయితే, ప్రెసిడెంటు అంగీకారంలేకపోయినా ఆ శాసనం అమలులోకి వస్తుంది. ప్రెసిడెంటు: హారీ ఎస్. ట్రూమన్; ప్రధానమంత్రి: డీన్ ఏచిసన్; రాజధాని: వాషింగ్టన్.

**రష్యా :**

కొంతభాగం యూరప్ ఖండంలోనూ, కొంతభాగం ఆసియాలోనూ వున్న విస్తారమైన, ప్రజారాజ్యం. పరిపాలన కమ్యూనిస్టుపార్టీ సాగిస్తున్నది. వైశాల్యం 87,07,070 చ. మైళ్ళు. జనాభా, 19,43,87,000. యుద్ధం వల్ల విశేష జననష్టాన్ని పొందినప్పటికీ, భూభాగాన్ని ఎక్కువగా కలుపుకున్నది. దేశమంతా పది స్వపరిపాలనగల రాష్ట్రాలుగా విభజింపబడింది; ప్రెసిడెంట్ : నికొలాయ్ ష్వెర్నిక్ ; ప్రధానమంత్రి: జోసెఫ్ స్టాలిన్. రాజధాని, మాస్కో.

**రుమేనియా :**

యూరప్ ఆగ్నేయాభాగంలో వున్న స్వతంత్ర ప్రజారాజ్యం. రెండవ ప్రపంచయుద్ధంలో యీ దేశంలోని కొంతభాగాన్ని రష్యా కలుపుకున్నది. 1947 డిసంబరు 30 తేదిన, రాజు రాజరికపరిత్యాగం చేశాడు. దేశపరిపాలన కమ్యూనిస్టుపార్టీ సాగిస్తున్నది. వైశాల్యం 91,600 చ. మైళ్లు. జనాభా, 1,64,72,000. యుద్ధంవల్ల జనాన్నీ, భూమినీ ఎక్కువగా కోల్పోయిన దేశాలలో ఇదిఒకటి. ప్రెసిడెంట్ : డాక్టర్ కాన్‌స్టెన్‌టిన్ పార్హాన్ ; ప్రధానమంత్రి; పెట్రి గ్రోజియా; రాజధాని: బుఖారెస్టు.

**లక్సెంబర్గ్ :**

యూరప్‌లో, జర్మనీ, బెల్జియం, ఫ్రాన్సుదేశాల నడుమనున్న చిన్నరాజ్యం. వైశాల్యం, 999 చ. మైళ్లు. జనాభా, 2,91,000. రాజ్యాధికారం, గ్రాండ్ డచెస్ అనే బిరుదుగలరాణి చేతిలోవుంది. 54 సభ్యులు

గల శాసనసభవుంది. మంత్రుల సలహా ప్రకారం, గ్రాండ్ డచెస్ పరిపాలన సాగిస్తుంది. ఈదేశంలో, ఇనుము విస్తారంగా దొరుకుతుంది. గ్రాండ్ డచెస్: ఛార్లొట్; ప్రధానమంత్రి: పియర్ డుపాంగ్: రాజధాని: లక్సెంబర్గు.

లెబనన్:

మధ్యప్రాచ్య భూభాగంలోని ఒక ప్రజారాజ్యం. ప్రజలు అరబ్బులు, 1943 వరకు ఫ్రెంచివారి మాండేటులో వున్నది. తరువాత స్వతంత్ర రాజ్యంగా ప్రకటింపబడింది. వైశాల్యం, 4,300 చ. మైళ్ళు. జనాభా 12,50,000. ప్రెసిడెంట్: బెషారా అల్ ఖోరీ: రాజధాని: బేరుట్.

లైక్టెన్‌స్టైన్:

యూరప్‌లో, ఆస్ట్రియా, స్విట్జర్లెండ్ దేశాలకు మధ్యనున్న చిన్న రాజ్యం. వైశాల్యం, 59.6 చ. మైళ్ళు. జనాభా, 13, 200. రాజ్యాధికారం, ప్రిన్సు అనే బిరుదుగల రాజు చేతిలోవుంది. పాలకుడు: ప్రిన్సు ఫ్రాన్సిస్ జోసెఫ్.; రాజధాని: వాడుజ్.

లైబీరియా:

అమెరికాలోని స్వతంత్ర నీగ్రో ప్రజారాజ్యం; పార్లమెంటువుంది. పరిపాలనకు అధిపతి ప్రెసిడెంట్. వైశాల్యం, 43,000 చ. మైళ్ళు; జనాభా 25,00,000. ప్రెసిడెంటు, విలియం వకనారాట్ షాడ్రాక్ టబ్‌మన్; ప్రధానమంత్రి: గేబ్రియల్ ఎల్. డెనిస్; రాజధాని మన్రోవియా.

వాటికన్:

క్రైస్తవమత [రోమన్ కాథలిక్] పీఠాధిపతి పోప్ పరిపాలనలో వున్న ప్రాంతం. ఇదంతా రోం నగరంలోని 'వాటికన్' అనే పేరుగల ప్రత్యేకనగరం. వైశాల్యం, 108 ఎకరాలు. జనాభా 1,100. ఈ నగరంలో సర్వాధికారమూ పోప్‌దే. పోప్: పయస్ XII.

వెనిజులా :

దక్షిణ అమెరికాలోని ఉత్తరభాగంలో వున్న ప్రజారాజ్యం వైశాల్యం, 3,63,728 చ. మైళ్ళు, జనాభా, 38,50,771. ఏడుసంవత్సరాల కొకసారి శాసనసభచేత ఎన్నుకోబడే ప్రెసిడెంట్, పరిపాలన సాగిస్తాడు. పెట్రోలు, ఈ దేశంలో ఎక్కువగా దొరుకుతుంది. పెట్రోలు, బంగారము, వీటిని త్రవ్వి తియ్యడం తరువాత చెప్పదగిన పరిశ్రమ వ్యవసాయం. ప్రెసిడెంట్ : డాక్టర్ జి. సువారెజ్ ఫ్లామరిచ్ ; రాజధాని: కరకాస్.

శాన్ మారినో :

యూరపులో, ఇటలీ సమీపంలోవున్న ఒక చిన్న ప్రజారాజ్యం. దేశపరిపాలన 60 మంది కౌన్సిలు సభ్యులచేత ఎన్నుకోబడిన యిద్దరు రీజెంట్లు సాగిస్తారు, ఈ రీజెంట్ల ఎన్నిక ప్రతి ఆరు మాసాలకు ఒకసారి జరుగుతూవుంటుంది, ఒకసారి రీజెంట్లుగావున్నవారు, మళ్ళీమూడు సంవత్సరాలదాకా ఆ పదవికి రాకూడదు; దేశం వైశాల్యం, 38 చ. మైళ్ళు. జనాభా, 15,545.

శాల్వెడార్ :

మధ్య అమెరికాలోని స్వతంత్రక ప్రజారాజ్యం, వైశాల్యం,13,176 చ. మైళ్ళు, జనాభా,21,00,000 ప్రెసిడెంటును ప్రజలు ఎన్నుకుంటారు, ప్రెసిడెంటుకు బాధ్యులైన మంత్రులు పరిపాలనను నిర్వహిస్తారు. కాఫీ, చెరకు, మొక్కజొన్న యీ దేశపు ముఖ్యపంటలు. రాజధాని, శాన్ శాల్వెడార్,

సావుది ఆరేబియా :

ఆసియాలోని ఒక స్వతంత్ర ముస్లిందేశం. రాజుగల రాజ్యం : రాజు నిరంకుశాధికారి. ఆయనకు ఇష్టంవచ్చిన మంత్రులను నియమించుకొని పరిపాలన నిర్వహిస్తాడు. వైశాల్యం, 9,27,000 చ. మైళ్ళు ; జనాభా సుమారు 65,00,000, ముస్లిములకు అతి పవిత్రములైన మక్కా- మదీనా పట్టణాలు ఈ దేశంలోనే వున్నాయి, రాజు. అబ్దుల్

అజీజ్ ఇబిన్ ఇబ్దుల్ రహమన్ అల్ ఫైజల్ సావూద్. ప్రధాన మంత్రి, సర్వ సైన్యాధ్యక్షుడు: యువరాజు అమీర్ సావుద్.

సిరియా :

ఆసియాలో, ఫ్రెంచి మాండేట్‌లో వుండేదేశం. 1939-45 ప్రపంచ యుద్ధానంతరం స్వతంత్ర ప్రజారాజ్యం అయింది. వైశాల్యము, 55,700 చ. మైళ్లు. పార్లమెంటులో మెజారిటీపార్టీ వారే మంత్రి మండలిని ఏర్పాటుచేస్తారు. జనాభా: 20,00,000. సిరియాలోని రిపబ్లికన్ ప్రభుత్వాన్ని 1949 మార్చి 30వ తేదీన కూలద్రోసి కర్నల్ హసన్ జయం చేజిక్కించుకున్నాడు. కాని, 1949 ఆగస్టు 14 న ఇతడు హత్యచేయబడినాడు. తరువాత రెండు మూడు మంత్రి మండలులు ఏర్పాటు చేయబడినాయి. 1949 డిసెంబరు 28 న ఖలీద్ అజ నాయకత్వాన ఒక మంత్రిమండలి ఏర్పాటయింది. 1951 నవంబరు 29నం సైన్యాధికారులు, ప్రభుత్వాధ్యక్షుణ్ణీ, మంత్రిమండలినీ అరెస్టుచేసి, ప్రభుత్వాన్ని చేజిక్కించుకున్నారు. సైన్యనాయకుడు కర్నల్ అడిబ్ షిషాక్లి, ప్రభుత్వాధ్యక్షుడుగా డిసెంబరు 2 న పదవి స్వాధీనం చేసుకున్నాడు. రాజధాని: డమస్కస్.

సింహళము (సిలోన్).

సింహళద్వీపం ఇండియాకు దిగువను ఇండియన్ సముద్రంలో వున్నది. ఈ దీవి 1948 ఫిబ్రవరి 4 తేది వరకు బ్రిటిషు ప్రభుత్వపు అధీనంలో వలస దేశంగావుండేది. 1948 ఫిబ్రవరి 4 నుంచి డొమినియన్ రాజ్యప్రహోదాను పొందింది. ఈ దీవి వైశాల్యం 28,332 చ: మైళ్లు. జనాభా 74,23,000. దేశంలోని పంటలలో ముఖ్యమైనవి, బియ్యం, కోకో, తేయాకు, కొబ్బరి, రబ్బరు. ఈ దేశంనుంచి కోకో, దాల్చినచెక్క, కొబ్బరిపీచు, కొబ్బరికాయలు, తేయాకు, రబ్బరు, ఎక్కువగా ఎగుమతి అవుతవి. వస్త్రములు, బియ్యము, బొగ్గు, పంచదార, ఎరువు, మొదలైనవాటిని ఈ ద్వీపం దిగుమతి చేసుకుంటుంది. ఈ ద్వీపంలో, రబ్బరు తోటలలో పనిచేయడానికి తమిళదేశంనుంచి

వలసపోయిన జనాభా చాలా ఎక్కువమంది ఉన్నారు. గవర్ను జన రలు : సోల్ బరీప్రభువు; ప్రధానమంత్రి : డడ్లీ సేనానాయక; రాజధాని, కొలంబో.

స్విట్జర్లెండ్ :

యూరపు మధ్యభాగంలోని ఒక ప్రజారాజ్యం. వైశాల్యం 15,950 చ. మైళ్లు. జనాభా, 45,43,000. ప్రజలు జర్మన్, ఫ్రెంచి, ఇటాలియను జాతులకు చెందినవారు. యూరపులోని ఏదేశంలోను, స్విట్జర్లెండులో వున్నన్ని పర్వతాలులేవు. పరిపాలన శాసనసభచే ఎన్ను కోబడిన ఎకిక్యూటివ్ కౌన్సిలు చేతిలోవుంది. ఈ కౌన్సిలుకు అధ్య క్షుడు ప్రతి సంవత్సరమూ ఎన్నుకోబడతాడు 1951 డిసెంబరు 12 న కారల్ కోబెల్ట్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడినాడు. రాజధాని: బెర్న్.

స్వీడన్ :

యూరపు ఈశాన్యభాగానవున్న స్వతంత్రరాజ్యం. వైశాల్యం, 1,73,436 చ. మైళ్లు జనాభా, 69,24,888. మంత్రులు శాసనసభకు బాధ్యులు. ప్రజలలో నూటికి 35 వంతులు వ్యవసాయంమీద ఆధార పడి జీవిస్తున్నారు. ఈ దేశంనుంచి కలప' కాగితము, వెన్న, పందిమాం సము, అగ్గిపెట్టెలు విస్తారంగా ఎగుమతి అవుతాయి. రాజు: గుస్తావ్; ప్రధానమంత్రి: టేజ్ ఎర్లాండర్; రాజధాని: స్టాక్ హోం.

స్పెయిన్ :

యూరపులోని నియంతృత్వరాజ్యం. పరిపాలన కేవలం నియంత యిష్టప్రకారం ఫాసిస్టు సూత్రాలపై జరుగుతున్నది. వైశాల్యం, 1,96,607 చ. మైళ్లు. జనాభా, 2,82,86,518. నియంత: జనరలు ఫ్రాన్సిస్కో ఫ్రాంకో; రాజధాని: మాడ్రిడ్.

హంగరీ :

యూరప్ లోని ఒక స్వతంత్ర ప్రజారాజ్యం. యుద్ధానికి పూర్వం, సింహాసనంగల రాజ్యంగా వుండేది. రీజెంటు అనే బిరుదంతో రాజ్యాధి కారాలు పూర్తిగాగల పాలకుడు పరిపాలన చేసేవాడు. యుద్ధానంతరం

ప్రజారాజ్యమైంది. పరిపాలనను కమ్యూనిస్టు పార్టీ సాగిస్తున్నది. యుద్ధం వల్ల కొంత భూభాగాన్నీ, జనాభాను నష్టపడిన దేశాలలో యిది ఒకటి. వైశాల్యం, 35,875 చ. మైళ్లు. జనాభా, 92,07,286. దేశంలో ముఖ్యంగా లభించేవస్తువులు కలప, పెట్రోలు. ప్రెసిడెంటు: శాండార్ రోనాయ్; ప్రధానమంత్రి: ఇస్ట్వాన్ దోబి; రాజధాని: బుడాపెస్టు.

హాలెండు :

యూరప్‌లో ఒకదేశం. రాణిగలరాజ్యం. పార్లమెంటు వుంది. మంత్రులు పార్లమెంటుకు బాధ్యులుగా వుండాలి. వైశాల్యం, 13,514 చ. మైళ్లు; జనాభా 98,72,074. ఈ రాజ్యానికి ప్రాచ్యఖండంలో విస్తారమైన అధీనప్రాంతంవుంది. ఇలా, యీదేశపు పరిపాలనలోవున్న మహాచ్యభూభాగం విస్తీర్ణం సుమారు 7,30,000 చ. మైళ్లు వుంటుంది. ఇచ్చటి జనాభా దాదాపు 5,30,00,000. రాణి: జూలియానా; ప్రధానమంత్రి: డాక్టర్ విల్లెం డ్రీస్; రాజధాని: ది హేగ్.

హైతి :

అమెరికా ఖండానికి పశ్చిమంగా వున్న హిస్పానియోలా దీవిలోని పశ్చిమభాగం. ప్రజారాజ్యం. వైశాల్యం, 10,204 చ. మైళ్లు. జనాభా సుమారు 30 లక్షలు. కాఫీ, కోకో, ప్రత్తి, తోళ్లు, పంచదార, తేనె మొదలైన పదార్థములు ఎక్కువగా యిక్కడనుంచి ఎగుమతి అవుతాయి. బట్టలు, గోనెసంచులు, ఇనుపసామానులు, మొదలైన సరకు దిగుమతి అవుతుంది. దేశపరిపాలన ప్రెసిడెంటుచేతిలో వుంటుంది. ప్రెసిడెంట్: కర్నలు పాల్ మెగ్లోయిర్.

హోండురాస్ :

మధ్య అమెరికాలోని ఒక స్వతంత్ర ప్రజారాజ్యం. వైశాల్యం, 44,411 చ. మైళ్ళు. జనాభా, 12,00,542. అరటిపండ్లు ఇక్కడ విస్తారంగా పండుతవి. ఇవికాక, కాఫీ, కొబ్బరికాయలు, పొగాకు ముఖ్యమైన పంటలు. ఈదేశపు వ్యాపారం ముఖ్యంగా అమెరికా సంయుక్త రాష్ట్రాలతోనే జరుగుతుంది. దేశపరిపాలన ప్రెసిడెంటు చేతిలోవుంది. ప్రెసిడెంటు: డాక్టర్ జువాన్ మాన్యుయెల్ గాల్వెజ్.

# పాకిస్తాన్

పాకిస్తాన్ అంటే "పవిత్రభూమి" అని అర్థం.

అసలు యీపాకిస్తాన్ భావానికి పునాదివేసిన వ్యక్తి, సుప్రసిద్ధ ముస్లింకవి సర్ మహమ్మద్ ఇక్బల్. 1930 లో ఈయన ముస్లింలీగ్ అధ్యక్షుడు. అలహాబాద్ సమావేశంలో అధ్యక్షోపన్యాసంఇస్తూ, "పంజాబ్ సింధు, బలూచిస్తాన్, సరిహద్దురాష్ట్రాలు నాలుగూ ఒకేముస్లింరాజ్యంగా, ఏర్పడి, భారతదేశపు పశ్చిమోత్తర దేశంలోవున్న ముస్లిములకు ఒక స్వతంత్రదేశంగావుంటే చూడాలని నాఆశయం" అన్నాడు.

1940 వరకు, ముస్లింలీగు నాయకులు పాకిస్తాన్ వుద్యమానికి తమ అంగీకారాన్ని స్పష్టపరచలేదు. కాని, 1940 లో లాహోరుసమావేశంలో పాకిస్తాను నిర్మాణాన్ని కోరుతూ, ముస్లింలీగు తీర్మానం చేసింది. అప్పటి నుంచీ ముస్లింలీగు నాయకులు, దీనిని ఒక పెద్ద ఉద్యమంగా తయారు చేశారు.

1946 ఆగస్టు 16 తేదీన బెంగాలులో ప్రభుత్వంవారు పాకిస్తాన్ దినం అమలుజరిపారు. ఆనాడు కలకత్తాలో తీవ్రమైన మతకలహాలు ఆరంభమయాయి. తరువాత యీకొట్లాటలు, బొంబాయి, ఉత్తరప్రదేశ్ బీహారు పంజాబ్ రాష్ట్రాలలోకూడా ప్రారంభమయాయి.

1946 సంవత్సరంలో మతకలహాలలో 12,400 మంది చంపబడినట్లు పార్లమెంటులో ఇండియామంత్రి ప్రకటనవల్ల స్పష్టపడింది. ఆ తరువాత పంజాబులోజరిగిన అల్లరులవల్లనూ, సరిహద్దురాష్ట్రంలో జరిగిన అల్లరుల వల్లనూ, ఇంకా ఎన్నో వేలమంది చంపబడినారు.

ముస్లిములకు పాకిస్తాన్ ఇస్తేగాని, యీఅల్లరులు అణగవని నిశ్చయించి బ్రిటిషుప్రభుత్వంవారు తదనుకూలంగా 1947 జూన్ 3 వ తేదీన ప్రకటనచేశారు. (రాజ్యాంగ సంస్కరణలు చూడండి.) ఆ ప్రకటనను అనుసరించి భారతదేశం, ఇండియా పాకిస్తాన్ అనే రెండు రాజ్యాలుగా

విభజింపబడింది. విభజనతరువాత, రెండురాజ్యాలూ చేసుకున్న యధాత థపు ఒడంబడిక 1948 మార్చి 31 తో అంతమొందింది- 1948 ఏప్రిల్ 1 తేది నుంచి పాకిస్తాన్‌కు ఇండియా, ఇండియాకు పాకిస్తాన్ విదేశాలై పోయినాయి.

పాకిస్తాన్ వైశాల్యం 3,61,007 చ.మైళ్లు. దీనిలో 1,28,076 చ. మైళ్ళు స్వదేశసంస్థానాలు. పాకిస్తాన్ జనాభా 1951 లెక్కల ప్రకారం. 7,56,87,000. వీరిలో, 4,00,90,000 మంది పురుషులు, 3,55,97,000 మంది స్త్రీలు. జనాభాలో నూటికి 13.2 మంది చదువను, వ్రాయను నేర్చినవారు.

రాష్ట్రాలవారిగా పాకిస్తాను జనాభా వివరాలు ఇవి:

| | | |
|---|---|---|
| తూర్పు బెంగాల్ | ... | 4,21,19,000 |
| పంజాబ్ | ... | 2,06,34,000 |
| సరిహద్దు రాష్ట్రం | ... | 56,99,000 |
| సింధు, బలూచిస్తాన్ | ... | 11,78,000 |
| కరాచినగరం | ... | 11.18,000 |

## పాకిస్తాన్ ప్రభుత్వం

గవర్నర్-జనరల్ : ఘులాం మహమ్మద్

పదవీస్వీకారము : అక్టోబరు 17, 1951

### మంత్రిమండలి

| | |
|---|---|
| ప్రధానమంత్రి : | ఖ్వాజా నజీముద్దీన్ |
| విదేశ వ్యవహారాలు : | సర్. ఎం. జఫరుల్లాఖాన్ |
| ఆర్థికమంత్రి : | మహమ్మద్ అలి |
| ఆహారము వ్యవసాయము, న్యాయము | పీర్జాదా అబ్దుస్ సత్తార్ |
| సివిల్ సప్లయిలు, విద్య : | ఫజ్లూర్ రహమన్ |
| హోం : | ముస్తాక్ అహమద్ గుర్మాని |
| పరిశ్రమలు : | సర్దార్ అబ్దుర్ రబ్ నిష్తర్ |

| | |
|---|---|
| రవాణా సౌకర్యములు : | సర్దార్ బహాదూర్ ఖాన్ |
| ఆరోగ్యము : | డాక్టర్ ఏ. ఎం. మాలిక్ |
| కాశ్మీర్ వ్యవహారాలు : | డాక్టర్ మహమ్మద్ హుసేన్ |
| రక్షణశాఖ | సర్దార్ మహమ్మద్ నవాజ్ ఖాన్ |
| బ్రాడ్ కాస్టింగ్, ఇన్ఫర్మేషను : | డాక్టర్ ఐ. హెచ్. ఖురేషి |
| మంత్రుల జీతాలు : | నెలకు రు. 3,000. ఉచిత వసతి. |

1951 ఏప్రిల్ 23 తేదిన పాకిస్తాన్ మంత్రివర్గంలో కొత్తగా ఇద్దరు మంత్రులు చేర్చుకొనబడినారు. వారి పేర్లు: అజీజుద్దీను అహమద్; ఘ్యాసుద్దీను పఠాన్.

## పాకిస్తాన్ రాజ్యాంగసభ :

అధ్యక్షుడు : తమీజుద్దీఖాన్ [రు. 3,000]

తూర్పు బెంగాల్ : [31 మంది ముస్లిములు, 13 మంది హిందువులు; మొత్తం 44]

పశ్చిమ పంజాబ్ : [ముస్లిములు 12; హిందువులు, 3; శిక్కులు 2] సభ్యుల సంఖ్య : 17

సింధు : ముగ్గురు ముస్లిములు, ఒక హిందువు; మొత్తం సంఖ్య 4. బలూచిస్తాన్ : ఒక ముస్లిం.

## తూర్పు బెంగాల్

పాకిస్తాన్ నిర్మాణంతో, బెంగాల్ రాష్ట్రవిభజన జరిగింది. పశ్చిమ బెంగాల్ ఇండియాలోను, తూర్పుబెంగాల్ పాకిస్తానులోన్ భాగాలైనాయి. తూర్పు బెంగాల్ రాష్ట్రాన్ని వ్యవహారికంగా తూర్పు పాకిస్తాన్ అనికూడా అంటున్నారు.

తూర్పు బెంగాల్ వైశాల్యం 56,008 చ. మైళ్ళు. జనాభా దాదాపు 4,21,19,000, వీరిలో స్త్రీలు 2,00,62,000.

తూర్పు బెంగాల్‌కు రాజధాని ఢాకా. ప్రధాన రేవుపట్టణం చిటగాంగ్.

విభజనవల్ల పరిశ్రమలు విస్తారంగా పశ్చిమబెంగాల్‌కుపోతే, పంట ప్రదేశం అధికంగా తూర్పుబెంగాలుకు సంక్రమించింది.
గవర్నర్ : మాలిక్ మహమ్మద్ ఫిరోజ్ ఖాన్ నూన్.
ప్రధానమంత్రి : నూరుల్ అమీన్

## పంజాబ్

పాకిస్తాన్ నిర్మాణంతోపాటు, పంజాబ్ రాష్ట్రవిభజనకూడా జరిగింది. (వివరాలకు తూర్పు పంజాబ్ చూడండి.) పశ్చిమ పంజాబ్ వైశాల్యం 62,100 చ. మైళ్ళు. జనాభా 2,06,34,000. వీరిలో స్త్రీలు 96,05,000.

పశ్చిమ పంజాబ్‌కు రాజధాని లాహోర్.
గవర్నర్ : ఐ. ఐ. చంద్రిగర్
పదవిస్వీకారం : 1951 నవంబరు 6.
ప్రధానమంత్రి : మియాముంతాజ్ దౌలతానా

## సరిహద్దు రాష్ట్రం

పాకిస్తాన్‌కు పశ్చిమోత్తర సరిహద్దులోవున్న రాష్ట్రం ఇది. కొంత కాలం పంజాబ్‌రాష్ట్రంలో కలసివుండి, తరువాత చీఫ్ కమిషనర్ పరిపాలనలోవున్న ఈ రాష్ట్రం, 1932 లో స్వపరిపాలనతో ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటుచేయుబడింది. దీని వైశాల్యం 39,270 చదరపు మైళ్లు. జనాభా : 56,99,000. వీరిలో స్త్రీలు 26,99,000.

ఈ రాష్ట్రంలోని ప్రజలు తమ జీవితానికి కేవలం వ్యవసాయం మీదనే ఆధారపడివున్నారు. ఇక్కడ పరిశ్రమలనేవే ఏమీలేవని చెప్పవచ్చును. రాష్ట్రమంతటిలోని భూమిలోనూ, నాల్గవ వంతులో మాత్రమే వ్యవసాయం జరుగుతున్నది.

దీనికి రాజధాని పెషావర్.
గవర్నర్ : ఖ్వాజా షహాబుద్దీన్
ప్రధానమంత్రి : ఖాన్ అబ్దుల్ కయ్యూంఖాన్.

## సింధు

1936 లో కొత్తగా సృష్టింపబడిన రెండు రాష్ట్రాలలో, సింధు ఒకటి. అంతకుపూర్వం, ఇది బొంబాయి రాష్ట్రంలో చేరివుండేది. దీని వైశాల్యం, 48,136 చదరపు మైళ్ళు. జనాభా, 46,39,000. వీరిలో స్త్రీలు 22,30,000. ప్రజలు మాట్లాడే భాష అరబ్బీ, ఫారసీ, సంస్కృత భాషల మిశ్రమం.

సింధురాష్ట్రంలో పెద్ద పరిశ్రమలు ఏమీలేవు. ప్రజలలో అధిక సంఖ్యాకులు వ్యవసాయంమీద ఆధారపడినవారే. ఈరాష్ట్రపు నామానికి కారణమైన సింధునదివల్ల చాలా భూమికి నీటి సదుపాయం ఉంది.

దీనికి రాజధాని ఇదే రాష్ట్రంలోవున్న హైదరాబాదు నగరం.

గవర్నర్ : దీన మహమ్మద్

ప్రధానమంత్రి : ఎం. ఎ. ఖురో

## బలూచిస్థాన్

ఇండియాకు పశ్చిమోత్తరాన, పాకిస్థాన్‌కు నైరుతి మూలగావున్న ప్రాంతం. దీనిలో స్వదేశ సంస్థానాధిపతుల పాలనలోవున్న భాగంపోగా, పాకిస్థాన్ గవర్నరు-జనరల్ చే నియమింపబడే కమిషనరు అధికారంలో వున్న ప్రాంతం, 1,34,002 చ. మైళ్ళు. జనాభా, 11,78,000. వీరిలో స్త్రీలు, 5,32,000. రాష్ట్రంలో చాలాభాగం ఎడారి కొండలమయం. ఇటీవలనే, యీ రాష్ట్రంలో వ్యవసాయం కొంచెం ఎక్కువగా జరుగుతోంది. అరేబియన్ సముద్రంలో చేపలను పట్టడం యిక్కడి ప్రజల ప్రధానవృత్తులలో ఒకటి.

* * * *

మొట్టమొదట ఆకాశంలో విమానం నడిపినవ్యక్తి, అమెరికా దేశీయుడు ఆర్విల్ రైట్. ఇది 1903 డిసెంబరు 17 న జరిగింది.

* * * *

అమెరికా యునైటెడ్ స్టేట్సు అధ్యక్షుని జీతం ఏడాదికి రు. 2,50,000.

* * * *

ఆరోగ్యవంతుని శరీరంలో వేడి సాధారణంగా 98.4 ఫారన్ హీట్ డిగ్రీలు వుంటుంది. 98.4 డిగ్రీలకు ఎక్కువగాని, 97.3 డిగ్రీలకు తక్కువగాని చాలారోజులు వున్నట్లయితే - అది జబ్బుక్రిందనే పరిగణించాలి.

* * * *

21 సంవత్సరాల పైబడిన ఆరోగ్యవంతుని నాడి ఒక నిమిషానికి 75 మొదలు 79 సార్లు కొట్టుకుంటుంది.

* * * *

భారతదేశంలో వున్నన్ని రకరకాల జాతుల ప్రజలు, ఒక్క రష్యాలో తప్ప ప్రపంచంలో మరే దేశంలోనూ లేరు.

# భరతఖండ చరిత్రలో ప్రధాన ఘట్టములు

## క్రీస్తుపూర్వం :

3000 (సంవత్సరాలకు పూర్వం) ఆర్యుల ఆగమనానికి పూర్వపు మొహెంజొ దారో నాగరికత

1600—గంగాతీర ప్రాంతాలలో ఆర్యుల ప్రథమనివాసం

1000—500—వేదరచన (ఊహ)

800—500—ఉపనిషత్తుల రచన

569—527—జైనమతస్థాపకుడు, మహావీరుని జీవితం

543—బుద్ధుని మరణం

326—అలగ్జాండర్ దండయాత్ర

321—చంద్రగుప్తమౌర్యుని పాలన

269—అశోకుని పాలన

## క్రీస్తు తరువాత :

320—530—గుప్తరాజ్యపాలన

333—సముద్రగుప్త పరిపాలన

375 —చంద్రగుప్త విక్రమాదిత్యుడు
—కాళిదాసు.
820—శంకరాచార్య మృతి
1005—గజనీమహామద్ దండయాత్ర
1192—పృథ్వీరాజు ఓటమి; ఘోరీ విజయం
1206—ఢిల్లీలో సుల్తానుల పరిపాలన
1336—విజయనగర రాజ్యస్థాపన
1409—శిఖ్ మతస్థాపకుడు గురునానక్ జననం
1498—కాలికట్‌కు వాస్కో-డ-గామా ఆగమనం
1526—బాబర్ విజయం
1556—1605 అక్బర్ రాజ్యం
1565—విజయనగరరాజ్య పతనం
1600—ఈస్టిండియా కంపెనీ స్థాపన
1628—58 షాజహాన్ రాజ్యం
1630—శివాజీ జననం
1645—తాజమహల్ నిర్మాణం పూర్తి అయింది
1661—బొంబాయి ఇంగ్లీషువారికి చెందుట
1707—ఔరంగజీబ్ మరణం
1757—ప్లాసీ యుద్ధఫలితంగా బెంగాల్‌లో బ్రిటిషువారి పాలన ఆరంభం.
1774—మొట్టమొదటి గవర్నర్-జనరల్‌గా వారన్ హేస్టింగ్సు నియామకం
1780—మొట్టమొదటి ఇంగ్లీషుపత్రిక, హిక్కీస్ గెజెట్ స్థాపన
1828—బ్రహ్మసమాజ స్థాపన
1829—సహగమనం నిషేధింపబడింది
1836—శ్రీ రామకృష్ణ పరమహంస జననం, ఫిబ్రవరి 18
1854— టెలిగ్రాఫ్‌ల స్థాపన (మార్చి 23)
మొట్టమొదటి లెజిస్లేటివ్ కౌన్సిలు

1857—మొదటి స్వాతంత్ర్య యుద్ధం
1858—భారతదేశ పరిపాలన ఈస్టిండియాకంపెనీ చేతినుంచి, బ్రిటిషు పార్లమెంటుచేతిలోకి మార్చబడింది
1863—జనవరి 12: శ్రీ వివేకానందస్వామి జననం
1869—అక్టోబరు 2: గాంధీజీ జననం
1877—విక్టోరియారాణి భారతదేశానికి సామ్రాజ్ఞిగా ప్రకటింపబడింది
1885—డిశంబరు 28. కాంగ్రెసు మహాసభ స్థాపన
1912—భారతదేశపు రాజధాని కలకత్తానుంచి ఢిల్లీకిమార్చబడింది
1914—1వ ప్రపంచ యుద్ధం
1917—భారతదేశానికి స్వపరిపాలన ఇవ్వబడుతుందని ఇండియా మంత్రి ప్రకటన
1920— ఆగస్టు 1. సహాయనిరాకరణోద్యమ ప్రారంభం
1922—గాంధిమహాత్ముని అరెస్టు
1929—లాహోరు కాంగ్రెసులో సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానం
1930—ఏప్రిల్ 1. శాసనోల్లంఘనోద్యమము
—నవంబరు 12. మొదటి రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సు
1931—మార్చి 4. గాంధి ఇర్విన్ ఒడంబడిక; రెండవ రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సు
1932—కాంగ్రెసుపై నిషేధం. పూనా ఒడంబడిక
1935—గవర్నమెంట్ ఆఫ్ ఇండియా చట్టం ప్యాసయింది
1937—రాష్ట్రీయపరిపాలన అమలులోకి వచ్చింది; కాంగ్రెసు వారు మంత్రి పదవులను వహించారు.
1939— సెప్టెంబరు 2. రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభం
—కాంగ్రెసువారు పదవులకు రాజీనామా ఇచ్చారు
1942—క్రిప్సు రాయబారం
—ఆగస్టు 8. 'క్విట్ ఇండియా' తీర్మానం. కాంగ్రెసు నాయకుల అరెస్టు

విశాఖపట్టణం, కాకినాడలమీద (ఏప్రిల్ 6) జపాను విమానదాడి

1944—గాంధీజీ విడుదల; కస్తూరిబా గాంధి మరణం

1945—యుద్ధం ముగింపు; కాంగ్రెసు నాయకుల విడుదల; కేంద్ర శాసనసభకు ఎన్నికలు

1946—రాష్ట్రాలలో ఎన్నికలు; కాంగ్రెసు ప్రభుత్వాల స్థాపన బ్రిటిషు మంత్రుల రాయబారం; కన్స్టిట్యుయెంట్ అసెంబ్లీ స్థాపన (డిసెంబరు 10 సమావేశం;) కేంద్ర ప్రభుత్వంలో కాంగ్రెసు, లీగు నాయకుల ప్రవేశం

1947—జనవరి 20. భారతదేశంనుండి 1948 జూన్ లోపున వెళ్ళి పోతామని బ్రిటిషు ప్రధాని ప్రకటన

—రాజప్రతినిధిగా లార్డు మౌంట్‌బాటన్ నియామకం

—జూన్ 3. భారతదేశ విభజన ప్రణాళిక; కాంగ్రెసు, లీగ్ నాయకుల ఆమోదం

—జులై 15; భారతదేశ విభజన, డొమినియన్ స్టేటసు అమలులోకి తెచ్చే బిల్లు కామన్సుసభలో ప్యాసయింది

—ఆగస్టు 15. భారతదేశం ఇండియా, పాకిస్తాన్ అనే పేర్లతో, రెండు డొమినియను రాజ్యాలు అయింది

1948—జనవరి 30: గాంధిమహాత్ముని హత్య

జూన్ 21: మౌంట్‌బాటెన్ వీడ్కోలు

జూన్ 21: ప్రథమభారతీయ గవర్నర్ జనరలు శ్రీ సి. రాజగోపాలాచారి పదవి స్వీకరణ

సెప్టెంబరు 11: జిన్నా మరణం

1949—నవంబరు 26: ఇండియా క్రొత్తరాజ్యాంగ చట్టం కన్స్టిట్యుయెంట్ అసెంబ్లీలో ఆమోదింపబడింది.

1950—జనవరి 26: నూతన రాజ్యాంగ అమలులోకి వచ్చింది, ఇండియా ప్రజారాజ్యం అయింది.

ప్రెసిడెంటుగా రాజేంద్రప్రసాద్ పదవిస్వీకరణ

1950—డిసెంబరు 5 : అరవిందయోగి అస్తమయం ;
15; సర్దార్ పటేల్ అస్తమయం.

1951—డిసెంబరు : మొట్టమొదటిసారి, వయోజన ఓటింగు హక్కుతో ఎన్నికల ప్రారంభం

1952—మే 3 : రాజ్యాంగ ప్రకారం, అధ్యక్షుని ప్రథమ ఎన్నిక.

1952—మే 13 : అధ్యక్షుడుగా రాజేంద్రప్రసాద్ పదవీ స్వీకరణ.

# చూడవలసిన క్షేత్రములు

అజంతా :

హైదరాబాద్ సంస్థానంలో ఒక గ్రామం. క్రీస్తుపూర్వం రెండు వందల ఏండ్లకుపూర్వం, యిక్కడగుహలలో గోడలమీద వేసిన రంగు బొమ్మలు, ఆనాటి చిత్రలేఖకుల ప్రజ్ఞను ప్రపంచానికి యీ నాటికి చాటుతున్నాయి. బొమ్మలువేసిన గుహాలు 32 వున్నాయి.

అమరావతి :

ఒకప్పుడు ఆంధ్రసామ్రాజ్యానికి ప్రధానసగరం. గుంటూరు జిల్లాలో, గుంటూరికి సుమారు 20 మైళ్ళదూరంలో కృష్ణానదీ తీరాన వున్నది. పంచారామ క్షేత్రములలో ఇది ఒకటి. అమరేశ్వరుని దేవాలయంవుంది. ఒకప్పుడు గొప్ప బౌద్ధవిహారాలలో ఇది ఒకటి. ఇక్కడ వున్న గొప్పగొప్ప ప్రాచీన చెక్కడాలనన్నిటినీ, చాలావరకు యిక్కడ నుంచి తీసుకొనిపోయారు.

అమృతసర్ :

శిక్కుల అతి ప్రసిద్ధమైన బంగారు దేవాలయం ఇక్కడవుంది. పాకిస్తాన్‌లోని పశ్చిమ పంజాబ్‌రాష్ట్రంలో ఇది ఒక పెద్ద పట్టణం. శిక్కులకు ప్రధాననగరం ఇదే. ఇచ్చట శిక్కుదేవాలయానికి, 19 వ

శతాబ్దారంభంలో రంజిత్ సింగ్ మహారాజు, బంగారు మలామా చేసిన రాగిరేకులను కప్పించాడు.

అరసవిల్లి :

విశాఖపట్టణం జిల్లాలోని శ్రీకాకుళం పట్టణానికి రెండుమైళ్ళ దూరంలోవుంది. ఇచ్చటగల సూర్యనారాయణమూర్తి దేవాలయం చాలా ప్రసిద్ధమైనది. ప్రతిదినము సూర్యోదయమైనప్పుడు సూర్యుని కిరణములు, యీ దేవాలయములోని మూలవిరాట్ పాదములవద్ద పడు నని ప్రతీతి.

ఆగ్రా :

ఢిల్లీకి సమీపంలోని పురాతన నగరం. జగత్ప్రసిద్ధిపొందిన తాజ్ మహాల్ ఇక్కడేవుంది. దానితోపాటు, ఆగ్రాకోటకూడా చూడవల సిందే. మొగల్ చక్రవర్తులనాటి శిల్పలావణ్యాన్ని చూడాలంటే ఆగ్రా వెళ్ళితీరాలి.

ఎల్లోరా :

పురాతన రాతిచెక్కడపు గొప్పతనాన్ని చూడడానికి ఎల్లోరా గుహలను మించిన ప్రదేశం మరొకటి మనదేశంలోలేదు. ఈ గుహలు హైదరాబాద్ సంస్థానంలో వున్నాయి. ఈ గుహలలోని చెక్కడాలు హిందూ, బౌద్ధ, జైన శిల్పాలుగా మూడు తరగతులు. వీటిలో అత్యంత ప్రధానస్థానం, కైలాసాలయానికి చెందుతుంది.

కంచి :

చెన్నపట్నంనుంచి రైలుమీదనూ, బస్సులోను వెళ్ళడానికి వీలున్న క్షేత్రం. బస్సుమీద వెడితే ఇది చెన్నపట్టణానికి 49 మైళ్ళు. 'మోక్ష దాయక'ములని చెప్పబడే ఏడుపురములలోను ఇది ఒకటి. కాంచిపురం రెండు భాగాలుగా వుంటుంది. విష్ణుకంచి; శివకంచి; వీటిలో శివకంచి పురాతనమైనదనీ, విష్ణుకంచితరువాత ఏర్పడినదనీ అంటారు. శివకంచిలో శివుడిగుడీ, (పృథివి లింగము), కామాక్షిగుడీ చాలా ప్రసిద్ధమైనవి.

ఈ గుళ్ళకువెళ్ళే యాత్రికులు ఎవరూకూడా గుడిలో అతికించివుంచే బంగారపు బల్లిని ముట్టుకోకుండా వెళ్ళరు. అలా దానిని ముట్టుకున్నందువల్ల, మామూలుగా ఎప్పుడైనా బల్లి తమ శరీరంమీద పడిన దోషంతగలదని వారి నమ్మకం.

కాశీ :

కాశీలో చచ్చిపోతే, ముక్తి తథ్యమని కోట్లకొలది హిందువుల విశ్వాసము. అనాదినుంచీకూడా హిందువులు గంగను అతి పవిత్రమైన నదిగాను, గంగాతీరానవున్న కాశీని అతి పవిత్రమైన క్షేత్రంగాను భావిస్తున్నారు. ఇప్పటికీ, ప్రతిసంవత్సరం కొన్ని లక్షలమంది యాత్రికులు అనుదినమూ, దేశంలోని అన్ని ప్రాంతాలనుంచీ కాశీయాత్రచేస్తూ నేవున్నారు. కాశీలో ప్రధానదేవాలయం విశ్వనాథుని ఆలయమైనప్పటికీ, సుమారు 1,500 దేవాలయాలు అక్కడవున్నాయి. విశ్వనాథుని దేవాలయ గోపురము, ధ్వజస్తంభము బంగారు మలామాచేసిన రాగిరేకులతో కప్పబడివున్నవి.

కాళహస్తి :

శివక్షేత్రం. సువర్ణముఖి నదీతీరానవుంది. రైలుమీద మదరాసు నుంచి 95 మైళ్ళు. రోడ్డుమీద తిరుపతికి 18 మైళ్ళు. ఇచ్చటి కాళహస్తీశ్వర దేవాలయము చూచితీరవలసిందే.

కోటప్పకొండ :

గుంటూరుజిల్లాలో, నరసారావుపేటకు ఎనిమిది మైళ్ళ దూరంలో వున్నది. కొండమీద కోటీశ్వరాలయంవుంది. శివరాత్రికి ప్రతిఏటా గొప్ప ఉత్సవం జరుగుతుంది. కొన్ని లక్షలమంది ప్రజలువస్తారు. అధిక సంఖ్యాకులు బండ్లమీద ప్రభలు కట్టుకొనివచ్చి మొక్కుబళ్ళు చెల్లిస్తారు.

కోణార్క :

ఇది పూరీ-జగన్నాథ క్షేత్రానికి సుమారు 20 మైళ్ళదూరంలో, ఇసుక, పర్రలలోవున్న ఒకగొప్ప సూర్యదేవాలయం. ఆలయమంతా కూడా

బ్రహ్మాండమయిన నల్లరాయి చెక్కడముతో కట్టబడివుంది. ఈ దేవాలయ నిర్మాణం పదమూడవ శతాబ్దంలో జరిగిందని ప్రతీతి. కాని, యిప్పటికీ చెక్కుచెదరని యీ నిర్మాణం అందరికీ ఆశ్చర్యం గొలుపుతున్నది.

చిదంబరం :

మదరాసుకు 155 మైళ్ళ దూరంలోవుంది. ఇచ్చటి నటరాజ దేవాలయం తప్పక చూడవలసింది. పంచలింగాలలో ఒకటైన ఆకాశలింగంగల ఈ చిదంబరదేవాలయం పురాణ ప్రసిద్ధమైనది. ఈ దేవాలయంలో 108 నాట్యముద్రలనుచూపేవిగ్రహాలు చెక్కబడివున్నాయి. ఈనగర సమీపంలోనే అన్నామలై విశ్వకళాపరిషత్తు స్థాపింపబడింది.

చెంజిదుర్గం :

మదరాసునుంచి రోడ్డుప్రయాణంచేస్తే 105 మైళ్లు. రైలుమీదుగా వెడితే తిండివనంవెళ్ళి అక్కడినుంచి 17 మైళ్లు బస్సులో వెళ్లాలి. దేశింగురాజుకథ అనే బుర్రకథ, యీదుర్గమురాజుదే. ఇచ్చటికోట బురుజులు చూడదగినవి.

జంబుకేశ్వరం :

పంచలింగాలలో ఒకటైన ఆపోలింగంగల తీర్థం. ఈలింగం సంతత వాహినియైన జలధారవద్ద స్థాపింపబడినది. ఈనగరం, శ్రీరంగనగరానికి ఒకమైలు దూరంలోవుంది. మదరాసునుంచి శ్రీరంగానికి రైలులో వెళ్ళవచ్చును. 258 మైళ్లు. జంబుకేశ్వర దేవాలయంకూడా అతి పురాతనమైనది.

ఢిల్లీ :

ఇండియాకు రాజధాని. ఢిల్లీకోట, షాజహాన్‌మందిరము, ముత్యాలమసీదు, జుమ్మామసీదు, కుతుబ్‌మినార్, మొదలైన పురాతన కట్టడాలు చూచితీరవలసిందే. మొగల్ చక్రవర్తుల పరిపాలనానంతరం, చాలాకాలం భారతదేశానికి కలకత్తా రాజధానిగా వుండేది. కాని, 1912 లో, జార్జి రాజు ఢిల్లీలో దర్బారుజరిపి, అప్పటినుంచి రాజధాని మళ్లీ, ఢిల్లీలో

వుంటుందని ప్రకటించాడు. తరువాత, క్రొత్త ఢిల్లి అనే పేరుతో, పాత ఢిల్లి ప్రక్కన మరొక పెద్దపట్టణం కట్టబడింది. ప్రభుత్వకార్యాలయాన్నీ కూడా, క్రొత్తఢిల్లిలోనే వున్నాయి.

తంజావూరు :

మదరాసునుంచి 222 మైళ్ళు. ఇచ్చట రాజరాజచోళునిచే 13వ శతాబ్దంలో నిర్మించబడిన బృహదీశ్వరాలయం చూడదగినది. మహారాష్ట్ర రాజులు నిర్మించిన సరస్వతీ మహల్ తప్పక చూడవలసినది. దీనిలో సుమారు 20,000 పురాతన గ్రంథములు వున్నవి. కొంతకాలము ఆంధ్ర నాయకులుకూడా యీ పట్టణాన్ని పరిపాలించారు.

తిరుపతి :

భారతదేశంలోని దేవాలయములన్నిటిలోను అత్యంత భాగ్యవంతమైనది. శ్రీ వెంకటేశ్వరస్వామి దర్శనమునకును, మొక్కులు చెల్లించుకొనుటకును, ప్రతిరోజూ దేశంలోని అన్నిప్రాంతాలనుంచీ యాత్రికులు వస్తూనేవుంటారు. 1944 లో కొండపైకి బస్సులు వెళ్ళడానికి రోడ్డువేయబడింది. దేవస్థానంవారి బస్సులు కొండమీదికి వెడతాయి.

తిరువణ్ణామలై :

మదరాసునుంచి రైలుమీద 144 మైళ్లు. రోడ్డు ప్రయాణం 116 మైళ్ళు. పంచలింగాలలో ఒకటైన తేజోలింగం అరుణాచలేశ్వరుడనే పేరుతో ఇక్కడవుంది. ఈదేవాలయం చాలా పెద్దది. కార్తీకపౌర్ణమి నాడు ఇచ్చట పెద్ద ఉత్సవం జరుగుతుంది.

ప్రపంచ ప్రసిద్ధిపొందిన శ్రీ రమణమహర్షి తపస్సుచేసినది ఇచ్చటనే. శ్రీ రమణాశ్రమం, దేవాలయం ఒక మైలుదూరంలో అరుణగిరి కొండ క్రిందవున్నది.

నాగార్జునకొండ :

ఒకప్పుడు, గొప్ప బౌద్ధపీఠ స్థానములలోఒకటి. గుంటూరుజిల్లాలో, మాచర్లకు 14 మైళ్లదూరంలోవుంది. పూర్వం విజయపురి అనేగొప్పనగరం

ఇక్కడవుండేది. ఆంధ్రదేశాన్ని పాలించిన ఇక్ష్వాకులకు ఇది రాజధాని. ఇప్పుడిక్కడ చిన్న పలెటూరువుంది. దానిని పుల్లారెడ్డిగూడెం అంటారు. ప్రక్కనవున్న కొండనుమాత్రం నాగార్జునకొండ అంటారు. ఇటీవలఇక్కడ ఆర్కెలాజికల్ డిపార్టుమెంటువారు, దిబ్బలనుత్రవ్వి పురాతన కట్టడాలను పైకితీశారు. బౌద్ధమతంలో. 'మహాయాన' మతాన్ని స్థాపించిన సిద్ధనాగార్జునుడు యిక్కడ నివసించాడని చరిత్రకారుల నిర్ణయం. చాలా చక్కని బౌద్ధ శిల్పాలెన్నో యిక్కడ బయల్పడినవి.

నెల్లూరు :

మదరాసు - వాల్తేరురైలుమార్గంలో మదరాసుకు 110 మైళ్ల దూరంలోనూ, విజయవాడకు 158 మైళ్లదూరంలోను పెన్న (పినాకిని) నది ఒడ్డున వున్నది. ఇచ్చట గొప్ప రంగనాయకస్వామి ఆలయంవుంది. తిక్కన సోమయాజి తాను రచించిన మహాభారతమును హరిహరనాథునికి కృతియిచ్చినది యీ పట్టణముననే.

పక్షితీర్థము :

ఇది చెన్నపట్టణంనుంచి చెంగల్పట్టుమీదుగా 50 మైళ్లదూరంలో వుంది. ఇక్కడవిశేషం ఏమిటంటే, ప్రతిరోజూ, కొండమీది శివాలయం దగ్గరకు, సరిగా మధ్యాహ్నంవేళకు రెండు గ్రద్దలువచ్చి, అర్చకుడుపెట్టే ప్రసాదాన్ని ఆరగించి వెళ్లిపోతాయి. ఈ విధంగా కొన్నివందలసంవత్సరాలనుంచి ఆరెండుపక్షులూ కాశీనుంచివచ్చి ప్రసాదం తిని వెడుతున్నాయని ప్రతీతి. ఇక్కడ చెరువులో స్నానంచేసి, కొండచుట్టూ మూడు ప్రదక్షిణాలుచేస్తే, సమస్తరోగాలు పోతాయని భక్తుల విశ్వాసం.

పూరి–జగన్నాథం :

ప్రపంచ ప్రసిద్ధిచెందిన జగన్నాథక్షేత్రం. ఈ నగరాన్ని పూరి అంటారు. ఇది ఒరిస్సారాష్ట్రంలోవుంది. మదరాసునుంచి కలకత్తాకు వెళ్లే రైల్వేలైనులో, ఖుర్దారోడ్ జంక్షనువద్ద దిగి, పూరికి మరొకరైలు ఎక్కాలి. ఖుర్దారోడ్‌నుంచి పూరికి సుమారు గంటన్నర ప్రయాణం.

జగన్నాథక్షేత్రం, కాశీరామేశ్వరాలతో పాటు సమానమైన ప్రాధాన్యతనుపొందిన వైష్ణవక్షేత్రం. దేవాలయంలో, కృష్ణ, సుభద్ర, బలరాముల విగ్రహాలు ఒకదానిప్రక్కన మరొకటివుంటాయి. గర్భగుడికి ఎదురుగా నిలుచుంటే సుభద్రవిగ్రహం మాత్రమే కనిపిస్తుంది: కృష్ణబలరాముల విగ్రహాలను చూడడానికి, పూలవాటంగా చూడాలి. కులభేదం పాటించకుండా, అన్నికులాలవారూ సమానంగా ప్రసాదాన్ని స్వీకరించడం, ఒక్క యీ క్షేత్రంలోనే జరుగుతున్నది. ప్రతిసంవత్సరం ఆషాఢమాసంలో రథయాత్ర జరుగుతుంది. ఉత్సవానికి దేశంలోని అన్ని ప్రాంతాలనుంచీ కొన్ని లక్షలమంది యాత్రికులు వెడతారు.

భద్రాచలం :

'రామదాసు' అని ప్రసిద్ధిపొందిన కంచెర్ల గోపన్న కట్టించిన శ్రీ రామాలయంవుంది. దేశంలో ప్రసిద్ధిపొందిన రామాలయం ఇదే. ప్రతి సంవత్సరమూ, శ్రీరామనవమికి ఇక్కడ గొప్ప ఉత్సవం జరుగుతుంది. రాజమండ్రినుంచి పడవలో వెళ్లవచ్చును.

భువనేశ్వర్ :

కాశీ తరువాత, ఉత్తరదేశంలో ప్రధానమైన శివక్షేత్రం. ఇది పూరి, జగన్నాథక్షేత్రానికి వెళ్లేత్రోవలో, ఒరిస్సారాష్ట్రంలోవుంది. ఇక్కడ సుమారు అయిదువందల పురాతన శివాలయాలు వున్నాయి. వాటిలో ముఖ్యమైనది 'త్రిభువనేశ్వరు'ని ఆలయం. ఈ దేవుణ్ని 'లింగరాజమహాదేవు'డని కూడా అంటారు. ఈ దేవాలయపు గోపురం సుమారు 160 అడుగుల ఎత్తువుంటుంది. లోపల శివలింగం, నల్లరాతితో చేయబడినది. భూమిమీద, ఎనిమిది అంగుళాల ఎత్తుమాత్రమే వుంటుంది. కాని, యీ లింగపు వ్యాసము, ఎనిమిది అడుగులువుంటుంది. చుట్టుకొలత సుమారు 26 అడుగులు వుంటుంది. ఈ నగరంలోనే, ముక్తేశ్వర దేవాలయంవుంది. ఓఢ్రశిల్ప ప్రజ్ఞకు యిది ప్రధాన తార్కాణమని అంటారు. ఇక్కడి శిల్పవిన్యాసం చూసితీరవలసిందే.

**మధుర :**

ప్రసిద్ధిపొందిన మీనాక్షీదేవాలయం ఇక్కడేవుంది. ఇది మదరాసు రాష్ట్రంలోని ఒక జిల్లాకు ప్రధానస్థానం. మదరాసుకు 345 మైళ్ళ దూరంలోవుంది. 152 అడుగుల ఎత్తుగల ప్రధానగోపురముకాక యింకో ఎనిమిదిగోపురాలుగల, యీ దేవాలయం 847 అడుగుల వెడల్పు 729 అడుగుల పొడవు. అదిగాక, ఇచ్చట చూడవలసింది దేవాలయంలోని వెయ్యిస్తంభాల మండపము.

**మధురాంతకం :**

ఈ క్షేత్రం, చెన్నపట్టణానికి 50 మైళ్ళదూరంలోవుంది. ఇది శైవులకూ, వైష్ణవులకూ కూడా తీర్థం. ఇక్కడి దేవాలయాలలో శ్రీ కోదండరామస్వామి ఆలయం ప్రధానమైనది. రావణవధానంతరం, శ్రీరాముడు పుష్పకవిమానంమీద అయోధ్యకు వెడుతూవుండగా, ఇక్కడవున్న 'జ్ఞానగిరి' అనే కొండ, విమానమార్గాన్ని ఆటంకపరచేటంత ఎత్తుకు పెరిగిందనీ, అప్పుడు, ఇక్కడవుండే 'విభాండకు'డనే భక్తునికి తాను అయోధ్యకు వెళ్లేటప్పుడు తనదర్శనం యిచ్చి వెడతానన్న వాగ్దానం శ్రీరామునికి జ్ఞాపకంవచ్చి, ఆయన విమానం దిగి భక్తునికి దర్శనం యిచ్చి మరీ వెళ్లాడని స్థలపురాణం చెపుతుంది. ఆలయంలోని మూలవిరాట్ రూపంకూడా, విమానంలోనుంచి శ్రీరాముడు సీతా సమేతంగా క్రిందకు దిగుతూవున్నట్టు వుంటుంది.

ఇక్కడి దేవాలయంపేరు శ్వేతారణ్యస్వామి ఆలయం. ఇదిగాక, పురాతనమైన ఆంజనేయాలయంకూడా యిక్కడవుంది.

**మహాబలిపురము :**

ఇది మదరాసుకు దక్షిణంగా, 68 మైళ్లదూరంలో వుంది. మదరాసునుంచి కారులో సరాసరి వెళ్ళవచ్చును. ఇక్కడ కొండ రాతిలోనే చెక్కబడిన సుప్రసిద్ధ రథాలున్నాయి. కొండమీద చెక్కబడిన అనేక బొమ్మలున్నాయి. రాతిలో చెక్కబడిన అయిదు

రథాలను 'పంచపాండవులు' అంటారు. ప్రస్తుతం, ఇక్కడ ఒక 'లైట్ హౌసు' వుంది. ఒకప్పుడు, మనదేశంనుంచి యితరదేశాలతో జరిగిన సముద్రవ్యాపారానికి యిది ఒక కేంద్రంగా వుండేదని చెప్పడానికి, చరిత్రజ్ఞులు ఎన్నో నిదర్శనాలను పైకితీశారు.

మొహెంజెదారో:

క్రీస్తుకు సుమారు 3,300 సంవత్సరాలకు పూర్వం, అంటే యిప్పటికి సుమారు 5,000 ఏండ్లకు పూర్వం, గొప్ప నాగరికతతో విలసిల్లిన పట్టణపు శిథిలాలు బయల్పడినచోటు. ఇది సింధురాష్ట్రంలో, సింధు నదీతీరానవుంది. శిథిలాలువున్నస్థలం సుమారు 240 ఎకరాల వైశాల్యంవుంటుంది. ఈ శిథిలాలన్నీకూడా, విశాలమైనవీధులు, చక్కని ఇండ్లు, మంచినీటి సదుపాయం, అతి నవీన పద్ధతులలో సమానమైన మురుగునీటి కాల్వల సదుపాయము గలిగిన మంచి గొప్ప నగరాన్ని స్మరణకు తెస్తున్నాయి. అంతేగాక, ఇక్కడ త్రవ్వితీసిన వాటిలో అతి నైపుణ్యాన్ని ప్రదర్శించే మృత్తికాభాండములు, చాలా అందమైన నగలూ, రాగితోచేసిన విగ్రహాలుకూడా వున్నాయి.

రామేశ్వరం:

ఉత్తరదేశంలో కాశీ, దక్షిణదేశంలో రామేశ్వరం హిందువులకు ప్రధానమైన తీర్థాలు. శ్రీరామునిచే కట్టబడినదని ప్రఖ్యాతిపొందిన శివాలయం, 4000 అడుగుల పొడవుగల మండపంతో దర్శనీయమైనది. మదరాసునుంచి 410 మైళ్లు.

లేపాక్షి:

అనంతపురంజిల్లాలో, హిందూపూర్‌కు తొమ్మిది మైళ్ళలోవుంది. విరూపన్న, వీరన్ననాయకులు కట్టించిన ప్రసిద్ధమైన వీరభద్రాలయం వుంది. ఈ కొండమీద పాపనాశేశ్వరాలయం, రఘునాథాలయంకూడా వున్నాయి. ఏకశిలతో చెక్కబడిన పెద్ద వీరభద్రవిగ్రహము, ఆలయంలోని రంగుబొమ్మల పనితనము చూచి తీరవలసినవే.

శ్రావణబెలగొల :

మైసూరు రాజ్యంలోవుంది. ఇక్కడ జైనరుషి, గోమఠేశ్వరుని శిలావిగ్రహం, $56\frac{1}{2}$ అడుగుల ఎత్తుగలది ఉంది. ఆసియా ఖండంలో ఇంతగొప్ప శిలావిగ్రహములేదు. పన్నెండు సంవత్సరాలకొకసారి, యీ విగ్రహానికి మహామస్తకాభిషేకం జరుగుతుంది. ఆ ఉత్సవానికి దేశంలోని అన్నిప్రాంతాలనుంచీ జైనమతస్థులు వస్తారు.

శ్రీకూర్మం :

విశాఖపట్టణం జిల్లాలోని శ్రీకాకుళంపట్టణానికి ఎనిమిదిమైళ్ళ దూరంలో, సముద్రతీరానవుంది. కూర్మావతారానికి దేవాలయంగల ప్రదేశం. భారతదేశంలో మరెచ్చటను కూర్మావతారానికి దేవాలయం లేదు.

శ్రీపెరంబుదూరు :

శ్రీరామానుజాచార్యుల జన్మస్థలము. చెన్నపట్టణానికి 35 మైళ్ళ దూరంలోవుంది. ఇక్కడ మంచి శిల్పంతోకట్టిన రామానుజాలయంవుంది. ఇప్పటికీ, భారతదేశంలోని అన్ని ప్రాంతాలనుంచి, వైష్ణవ మతస్థులు యిక్కడికి యాత్ర వస్తూవుంటారు.

శ్రీరంగం :

భారతదేశంలోని దేవాలయాలన్నిటిలోకీ పెద్దది, శ్రీరంగంలో వుంది. కావేరినదిపాయలమధ్య, శ్రీరంగపట్టణం, తిరుచిరాపల్లికి రెండు మైళ్ళదూరంలోవుంది. ఇచ్చటి దేవుడు, శ్రీరంగనాథుడు. ఈ దేవాలయపు ప్రధాన గోపురపు ఎత్తు 152 అడుగులు. గోపురము లన్నిటిమీదా మంచి శిల్పనైపుణ్యం కనబడుతుంది.

శ్రీశైలం :

కర్నూలుజిల్లాలోని ప్రసిద్ధ శివక్షేత్రం. దేవుడు, మల్లికార్జునుడు. కర్నూలునుంచి మార్కాపురం (44 మైళ్లు) వెళ్లాలి. ఇక అక్కడనుంచి

కొండలెక్కాడనే. పెద్ద చెరువును పదిమైళ్లు. దారికష్టం. ప్రయాణం ప్రయాస. అయినా, శివరాత్రికి వేలకొలది భక్తులు వెడుతూనే వుంటారు.

హంపి :

జగత్ప్రసిద్ధిపొందిన ఆంధ్రరాజ్య రాజధాని విజయనగరపు శిథిలాలు గలచోటు. ఎం. ఎస్. ఎం. రైల్వేలో, గుంతకల్లు - హుబ్లి సెక్షనులో హాస్పేటదగ్గరదిగి, ఎనిమిదిమైళ్లు వెళ్లాలి. తుంగభద్రా నదీతీరాన, పది చదరపుమైళ్ళ వైశాల్యంగల స్థలంలో, విజయనగర శిథిలాలను చూడవచ్చును.

## జన్మదినోత్సవాలు

ఏప్రిల్, 16 : కందుకూరి వీరేశలింగం (1848)
మే, 1 : కాశీనాథుని నాగేశ్వరరావు (1867)
జూన్, 2 : దుగ్గిరాల గోపాలకృష్ణయ్య (1889)
ఆగష్టు, 15 : అరవిందయోగి (1872)
ఆగష్టు, 23 : టంగుటూరి ప్రకాశం (1869)
అక్టోబరు, 2 : గాంధజీ (1868)
అక్టోబర్, 31 : సర్దార్ పటేల్ (1875)
నవంబర్, 7 : ఆచార్య ఎన్. జి. రంగ (1899)
నవంబర్, 14 : జవహర్‌లాల్ నెహ్రూ (1889)
నవంబర్, 24 : డాక్టర్ పట్టాభి (1880)
నవంబర్, 30 : గురజాడ అప్పారావు (1861)
డిసెంబర్ 28 : కాంగ్రెసు మహాసభ స్థాపన (1885)

# జాతీయగీతం

భారతదేశానికి జాతీయగీతంగా ''జనగణమన''ను ఎంచుకోవాలా, ''వందేమాతరం''ను ఎంచుకోవాలా అనే విషయాన్ని గురించి రాజ్యాంగ పరిషత్తులోనూ, పత్రికలలోను చాలాచర్చ జరిగింది. చివరకు, 1950 జనవరి 24 తేదీన రాజ్యాంగ పరిషత్తులో అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ ఒక ప్రకటన చేశారు. ఆ ప్రకటనప్రకారం, భారతదేశానికి జాతీయ గీతంగా 'జనగణమన' నిర్ణయించబడింది. ఈ గీతంలోని పదాలలో ఏవైనా మార్పులు అవసరమని తోస్తే, అలాటిమార్పులను చెయ్యడానికి ప్రభుత్వం ఉత్తరువు చెయ్యవచ్చును. 'వందేమాతరం' గీతం, భారత జాతీయోద్యమంలో దేశభక్తు లందరూ భక్తితో పాడింది గనుకనూ, ఆగీతంపట్ల దేశంలోని ప్రజలందరికీ గౌరవం హెచ్చు గనుకనూ, ఆ గీతానికికూడా జనగణమన'తో సమానస్థానం ఇవ్వబడింది. అయితే, జాతీయగీతంగా 'జనగణమన' నిర్ణయింపబడింది గనుక, ప్రభుత్వం ఆధ్వర్యంలో జరిగే వుత్సవాలలోనూ, ప్రభుత్వ కార్యక్రమాల సందర్భంలోనూ జాతీయ గీతంగా 'జనగణమన' పాడబడుతుంది.

జాతీయగీతం అంటే ఒకజాతి ప్రజలు, తమదేశానికీ, తమకూ చెప్పుకొనే నమోవాకం అన్నమాట. దేశంపట్ల ప్రతివ్యక్తీ భక్తిని ఎలా కలిగివుండాలో, జాతీయగీతంపట్ల ప్రతివ్యక్తీ అలాటి గౌరవాన్ని చూపించాలి. ఒకవ్యక్తి తన మాతృభూమిపట్ల చూపే భక్తికి నిదర్శనము, తన జాతీయపతాకపట్లనూ, తన జాతీయగీతం పట్లనూ అతడు చూపే గౌరవమే. అంచేత జాతీయగీతాన్ని పాడేటప్పుడు ప్రతివ్యక్తీ తన మాతృదేశాన్ని తలచుకొంటూ, భక్తిభావం కనపరచాలి. అసభ్యంగా జాతియగీతాన్ని పాడకూడదు. సభలలోనూ, సినిమాలలోనూ జాతీయగీతాన్ని పాడేటప్పుడు, అక్కడ వున్నవారంతా లేచి నిలుచుని జాతీయగీతంపట్ల గౌరవాన్ని ప్రదర్శించాలి. సినిమాలలో, ప్రదర్శనం అయిన తరువాత ఆఖరున జాతీయగీతం పాటవాయిద్యం పెట్టినప్పుడు, ప్రతివ్యక్తీ కదలకుండా గౌరవభావంతో నిలబడాలి. కాని గబగబ బైటికి వెళ్ళకూడదు. అలా బైటికి వెళ్లడం, జాతీయగీతాన్ని అవమానం

చెయ్యడం అవుతుంది. విద్యావంతులు, నాగరికులు, తమ దేశంపట్ల తమ జాతిపట్ల గౌరవంగలవారిగా ఉండాలి కావాలని.

జాతీయగీతం పూర్తిపాఠమూ, 'వందే మాతరం' పూర్తిపాఠమూ ప్రక్క పేజీలలో ప్రకటించబడినవి.

## స్మారక దినములు

| | | |
|---|---|---|
| జనవరి, | 30. | గాంధీజీ హత్య: (1948) |
| ఫిబ్రవరి, | 22: | కస్తూరిబా గాంధీ మరణం: (1944) |
| ఫిబ్రవరి, | 28: | కమలా నెహ్రూ మరణం: (1934) |
| ఏప్రిల్, | 11: | కాశీనాథుని నాగేశ్వరరావు మరణం: (1938) |
| మే, | 6: | భూలాభాయ్ దేశాయ్ మరణం: (1946) |
| మే, | 27: | కందుకూరి వీరేశలింగం మరణం: (1919) |
| జూన్, | 10: | దుగ్గిరాల గోపాల కృష్ణయ్య మరణం (1928) |
| ఆగస్టు, | 1: | బాలగంగాధర తిలక్ మరణం: (1920) |
| ఆగస్టు, | 15: | కొండా వెంకటప్పయ్య మరణం: (1949) |
| ఆగస్టు, | 18: | సుభాసచంద్రబోస్ మరణం: (1945) |
| సెప్టెంబర్, | 11: | మహమ్మదాలీ జిన్నా మరణం: (1948) |
| నవంబర్, | 12: | మదనమోహనమాలవీయా మరణం (1946) |
| నవంబర్, | 17: | లాలాలజపతిరాయ్ మరణం: (1927) |
| నవంబర్, | 30: | గురజాడ అప్పారావు మరణం: (1915) |
| డిసెంబర్, | 5: | శ్రీ అరవిందయోగి సమాధి (1950) |
| డిసెంబర్, | 15: | సర్దార్ వల్లభాయ్ పటేల్ మరణం: (1950) |

* * * *

1941 నుంచి 1951 నాటికి, ఇండియా జనాభా నూటికి 13.4 వంతులు పెరిగింది. లక్షకుపైగా జనాభావున్న పట్టణాలు ఇండియాలో 75 వున్నాయి.

ప్రతి సంవత్సరమూ, ఇండియాలో జన్మించే శిశువులలో ప్రతి వెయ్యిమందికీ 160 మంది ఏడాదిలోపునే చనిపోతున్నారు.

# జాతీయ పతాకము

ప్రతిదేశానికీ ప్రధానచిహ్నము, ఆదేశపు పతాకము. ప్రతిదేశానికీ ప్రత్యేక రంగులలో, ప్రత్యేక చిహ్నములతో పతాకాలు వుంటాయి. భారతదేశపు జాతీయపతాకంలో మూడురంగులు వున్నాయి. కుంకుమవర్ణము, తెలుపు, ఆకుపచ్చ. కుంకుమవర్ణము పైన, తెలుపుమధ్య, ఆకుపచ్చ క్రిందన, వుండేటట్టుగా, యీరంగులను అమర్చాలి. పతాకం పొడవు ఎంత వుంటే, ఆ పొడవులో మూడింట రెండువంతులు వెడల్పు వుండాలి. అంటే పతాకం పొడవు మూడు అడుగులువుంటే, వెడల్పు రెండు అడుగులు వుండాలి. పతాకంలోని మూడురంగులకూ సమానమైన వెడల్పువుండాలి. పతాకం మధ్యలో అశోకుని ధర్మచక్ర చిహ్నం వుంటుంది. ఇదిమన జాతీయపతాకం.

ప్రతిజాతీ, తన గౌరవానికి జాతీయచిహ్నంగా పతాకను గౌరవించాలి. జాతీయ పతాకాన్ని అగౌరవంగా చూడడం జాతిని అగౌరవంగా చూచినట్లే. అంచేత, ఇతర దేశాల పతాకాలనుకూడా ప్రతిదేశీయుడూ గౌరవించాలి.

జాతీయ పతాకాన్ని కాళ్లతో తొక్కడం, ఎక్కడబడితే అక్కడ పడవెయ్యడం, పెళ్లిళ్ళు మొదలైన గృహోత్సవాల సందర్భంలో ఇంటిమీద ఎగురవెయ్యడం, నాగరికులైనవారూ, తమ దేశంపట్ల గౌరవం కలవారూ చెయ్యరు. జాతీయ ఉత్సవాలనాడు మాత్రమే జాతీయ పతాకాలను ఇళ్లమీద ఎగరెయ్యాలి.

భారత రాష్ట్రపతి, రాష్ట్రాల గవర్నర్లు, ఇండియా మంత్రులు, రాష్ట్రాల మంత్రులుమాత్రం జాతీయపతాకాన్ని తమ కార్లమీద ఎగురవేసుకోవచ్చును. తక్కిన వ్యక్తులెవరూ అలా చెయ్యకూడదు. జాతీయ ఉత్సవాలనాడు తప్ప ఇతరదినాలలో పతాకాన్ని ఎగురవెయ్యకూడదు. పతాకాన్ని ఎగురవేసినప్పుడు, సూర్యోదయకాలంలో పతాకాన్ని ఎగురవేసి, సూర్యాస్తమయ సమయంలో దింపాలి.

పతాకమును ఎగురవేయునప్పుడు, కుంకుమవర్ణం పైకివుండేటట్టుగాఎగురవేయాలి.

చెయ్యడం అవుతుంది. విద్యావంతులు, నాగరికులు, తమ దేశంపట్ల, తమ జాతిపట్ల గౌరవంగలవారూ అలా చెయ్యరు.

జాతీయగీతం పూర్తిపాఠమూ, 'వందే మాతరం' పూర్తిపాఠమూ ప్రక్క పేజీలలో ప్రకటించబడినవి.

# స్మారక దినములు

| | | |
|---|---|---|
| జనవరి, | 30. | గాంధీజీ హత్య: (1948) |
| ఫిబ్రవరి, | 22: | కస్తూరిబా గాంధీ మరణం: (1944) |
| ఫిబ్రవరి, | 28: | కమలా నెహ్రూ మరణం: (1934) |
| ఏప్రిల్, | 11: | కాశీనాధుని నాగేశ్వరరావు మరణం: (1938) |
| మే, | 6: | భూలాభాయ్ దేశాయ్ మరణం: (1946) |
| మే, | 27: | కందుకూరి వీరేశలింగం మరణం: (1919) |
| జూన్, | 10: | దుగ్గిరాల గోపాల కృష్ణయ్య మరణం (1928) |
| ఆగస్టు, | 1: | బాలగంగాధర తిలక్ మరణం: (1920) |
| ఆగస్టు, | 15: | కొండా వెంకటప్పయ్య మరణం: (1949) |
| ఆగస్టు, | 18: | సుభాసచంద్రబోస్ మరణం: (1945) |
| సెప్టెంబర్, | 11: | మహమ్మదాలీ జిన్నా మరణం: (1948) |
| నవంబర్, | 12: | మదనమోహనమాళవీయ మరణం (1946) |
| నవంబర్, | 17: | లాలాలజపతిరాయ్ మరణం: (1927) |
| నవంబర్, | 30: | గురజాడ అప్పారావు మరణం: (1915) |
| డిసెంబర్, | 5: | శ్రీ అరవిందయోగి సమాధి (1950) |
| డిసెంబర్, | 15: | సర్దార్ వల్లభాయ్‌పటేల్ మరణం: (1950) |

* * * *

1941 నుంచి 1951 నాటికి, ఇండియా జనాభా నూటికి 13.4 వంతులు పెరిగింది. లక్షకుపైగా జనాభావున్న పట్టణాలు ఇండియాలో 75 వున్నాయి.

ప్రతి సంవత్సరమూ, ఇండియాలో జన్మించే శిశువులలో ప్రతి వెయ్యిమందికీ 160 మంది ఏడాదిలోపుననే చనిపోతున్నారు.

# జాతీయ పతాకము

ప్రతిదేశానికీ ప్రధానచిహ్నము, ఆదేశపు పతాకము. ప్రతిదేశానికీ ప్రత్యేక రంగులలో, ప్రత్యేక చిహ్నములతో పతాకాలు వుంటాయి. భారతదేశపు జాతీయపతాకంలో మూడురంగులు వున్నాయి. కుంకుమవర్ణము, తెలుపు, ఆకుపచ్చ. కుంకుమవర్ణముపైన, తెలుపుమధ్య, ఆకుపచ్చ క్రిందన, వుండేటట్టుగా, యీరంగులను అమర్చాలి. పతాకం పొడవు ఎంత వుంటే, ఆ పొడవులో మూడింట రెండువంతులు వెడల్పు వుండాలి. అంటే పతాకం పొడవు మూడు అడుగులువుంటే, వెడల్పు రెండు అడుగులు వుండాలి. పతాకంలోని మూడురంగులకూ సమానమైన వెడల్పువుండాలి. పతాకం మధ్యలో అశోకుని ధర్మచక్ర చిహ్నం వుంటుంది. ఇదిమన జాతీయపతాకం.

ప్రతిజాతీ, తన గౌరవానికి జాతీయచిహ్నంగా పతాకను గౌరవించాలి. జాతీయ పతాకాన్ని అగౌరవంగా చూడడం జాతిని అగౌరవంగా చూచినట్లే. అంచేత, ఇతర దేశాల పతాకాలనుకూడా ప్రతి దేశీయుడూ గౌరవించాలి.

జాతీయ పతాకాన్ని కాళ్లతో తొక్కడం, ఎక్కడబడితే అక్కడ పడవెయ్యడం, పెళ్లిళ్ళు మొదలైన గృహోత్సవాల సందర్భంలో ఇంటిమీద ఎగురవెయ్యడం, నాగరికులైనవారూ, తమ దేశంపట్ల గౌరవం కలవారూ చెయ్యరు. జాతీయ ఉత్సవాలనాడు మాత్రమే జాతీయ పతాకాలను ఇళ్లమీద ఎగరెయ్యాలి.

భారత రాష్ట్రపతి, రాష్ట్రాల గవర్నర్లు, ఇండియా మంత్రులు, రాష్ట్రాల మంత్రులుమాత్రం జాతీయపతాకాన్ని తమ కార్లమీద ఎగురవేసుకోవచ్చును. తక్కిన వ్యక్తులెవరూ అలా చెయ్యకూడదు. జాతీయ ఉత్సవాలనాడు తప్ప ఇతరదినాలలో పతాకాన్ని ఎగురవెయ్యకూడదు. పతాకాన్ని ఎగురవేసినప్పుడు, సూర్యోదయకాలంలో పతాకాన్ని ఎగురవేసి, సూర్యాస్తమయ సమయంలో దింపాలి.

పతాకమును ఎగురవేయునప్పుడు, కుంకుమవర్ణం పైకివుండేటట్టుగాఎగురవేయాలి.

# భారతదేశం

ఆసియా భూఖండంలోని పెద్ద భాగాలలో ఒకటి భరతఖండం అని పిలువబడే భూభాగం. రష్యా మినహాగా యూరప్ ఖండపు అంతటి వైశాల్యమూ రెంటింటికి, భరతఖండపు వైశాల్యంకూడా దాదాపు అంతే.

1947 ఆగస్టు 15 తేదివరకు భరతఖండం అంతా ఏకదేశంగానే పరిగణింపబడేది. బ్రిటిషువారి పరిపాలనలో ఏక కేంద్ర ప్రభుత్వపుపరిపాలన లోనే వుంది. కాని, 1947 ఆగస్టు 15 న రాజకీయంగా స్వాతంత్ర్యం చేకూరడంతోపాటు, భరతఖండం ఇండియా, పాకిస్తాన్ అనే పేర్లతో రెండు దేశాలయింది. పాకిస్తాన్ బ్రిటిషురాజుకు లోబడిన డొమినియన్ రాజ్యంగావుండి, ఇండియా స్వతంత్ర ప్రజారాజ్యం అయింది. ఇండియాకు 'భారత్' అని దేశీయనామం. ఇకముందు భారతదేశం అంటే, పాకిస్తాన్ పోగా మిగిలిన భరతఖండంలోని భూభాగం అన్నమాట.

పాకిస్తాన్‌ను గురించిన వివరాలు తెలుసుకోదలచినవారు, ప్రపంచ దేశాలు అనే శీర్షికలో పాకిస్తాన్ అనే ఉపశీర్షిక క్రింద చూడాలి.

## భౌతికరూపం

ఇండియాను భౌతికస్వరూపంలో మూడు భాగాలుగా విభజించ వచ్చును, హిమాలయపర్వతభూమి, గంగానదీ ప్రాంతపల్లపు భూమి, దక్కన్ పీఠభూమి.

హిమాలయ పర్వతభూమి ప్రాంతాలలో పెద్ద అడవులు, ఖనిజ సంపదా వున్నాయి.

గంగాతీర పల్లపుభూమి సుమారు 3,00,000 చ. మైళ్ళ ప్రాంతం. చాలా సారవంతమైనది.

దక్కను పీఠభూమిలో గోదావరి, కృష్ణ, కావేరీ నదీ ప్రాంత భూములు సారవంతమైనవి.

ఉత్తరఇండియాలోని ప్రధానమైన నదులు: గంగ, సింధు, యమున, బ్రహ్మపుత్ర, మహానది, నర్మద, తపతి.

దక్షిణ ఇండియాలోని ప్రధానమైన నదులు: కృష్ణ, గోదావరి, కావేరి.

# భూకంపములు

ఇండియాలో గత రెండువందల సంవత్సరాలలోనూ నాలుగు దారుణమైన భూకంపములు జరిగినవి. వాటి వివరాలు ఇవి:

1737: కలకత్తా: సుమారు 3 లక్షలమంది ప్రజలు చనిపోయారు. (1737 అక్టోబరు 11)

1934: బీహార్: సుమారు 10,000 మంది చనిపోయారు. (1934 జనవరి 15)

1935: క్వెట్టా: సుమారు 60,000 మంది ప్రజలు చనిపోయారు. (1935 మే 31)

1950: అస్సాం: సుమారు 1,000 మంది చనిపోయారు. (1950 ఆగస్టు 15).

# వైశాల్యం

భారతదేశపు వైశాల్యం సుమారు 12,20,000 చ. మైళ్లు. తూర్పునుంచి పడమరకు గరిష్ఠదూరము 2000 మైళ్లు; ఉత్తరమునుంచి దక్షిణానికి గరిష్ఠదూరము 2000 మైళ్లు. భారతదేశపు సముద్రతీరం మొత్తం 2,700 మైళ్ల పొడవు వుంటుంది.

భారతదేశం, ఫ్రెంచి, పోర్చుగీసుదేశాల అధీనంలోవున్న కొద్దిపాటి భూభాగంతప్ప, ఒకే కేంద్రప్రభుత్వపు అధీనంలోవుంది.

భారతదేశం విస్తారంగా పల్లెటూళ్ళదేశం. గత 50 సంవత్సరాల నుంచీ పట్టణాలు కొంచెం కొంచెంగా పెరుగుతున్నాయి. అయితే, దేశంలోకల్లా మరీ పెద్ద పట్టణాలు నాలుగు: కలకత్తా, బొంబాయి, మదరాసు, ఢిల్లీ.

## జాతులు

పూర్వకాలంలో భారతదేశంలో ద్రావిడ, ఆర్యజాతులు ప్రత్యేకంగా ఉన్నప్పటికీ, క్రమేణా యీ రెండు జాతులూ కలియడం, ఆ తరువాత మంగోలియన్ జాతికూడా ఇండియాలో ప్రవేశించి, ఇండియాలోని తక్కిన జాతులతో కలియడమూ జరిగింది. జాతి సమ్మేళనం బాగా జరిగిపోయిన తరువాత వర్ణవ్యవస్థ ఏర్పడింది. అందువలననే ఆర్యసాంప్రదాయం ప్రధానంగా అవలంబించే బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రకులాలలో ద్రావిడజాతి చిహ్నములుగల వ్యక్తులూ, ప్రథమంలో ద్రావిడజాతికిచెందిన పంచములలో ఆర్యజాతి చిహ్నములు గల వ్యక్తులు, యీ వుభయులలోనూ, ముఖ్యంగా అస్సాం, బెంగాల్, ఒరిస్సాలో, మంగోలియన్ జాతి చిహ్నములుగల వ్యక్తులూస్పష్టంగా కనిపిస్తూవున్నారు. అంచేత, భారతదేశంలో యీనాడు ప్రత్యేకజాతుల ప్రజలు నివసిస్తున్నారని ఏ ప్రాంతాలలోని ప్రజలనూ వేరుగా నిర్దేశించడానికి వీలులేదు. నేడు భారతదేశంలో వున్న ప్రజలు, వివిధజాతుల సమ్మేళనంవల్ల ఏర్పడిన, భారతజాతి.

ఈ భారతజాతిలోనే, పురాణకాలంలో వర్ణవ్యవస్థ ఏర్పడి అయిదు ప్రధానకులాలు స్థిరపడిపోయినవి. ప్రస్తుతం, యీ కులభేదం క్రమంగా తొలగిపోతున్నది. ఏకజాతి, ఏకకులంగల భారత ప్రజావ్యవస్థ క్రమంగా పరిణామం పొందకపోదు.

# జనాభా

పదిసంవత్సరాల కొకసారి మన దేశంలో జనాభా లెక్కలను ప్రభుత్వం తయారుచేస్తుంది. ఆ ప్రకారం, 1951 లో జనాభా లెఖలు తయారుచేయబడినవి. 1951 ఫిబ్రవరి 9 తేదిన ప్రారంభమై, మార్చి 1 తేదితో యీ గణితీ పూర్తిఅయినది. దేశమంతటా ఒకే కాలంలో జరిగిన యీ గణితీ చెయ్యడానికి 6,00,000 మంది గణితీదార్లు పనిచేశారు.

ఇంతకు పూర్వపు జనాభా, 1941 లో గణితీచేయబడింది. కాని, ఆనాటికీ యీనాటికీ ఇండియాలో రాజకీయంగాను, భౌతికంగానూ గొప్ప మార్పులు కలిగాయి. 1947 ఆగస్టు 15 న ఇండియా స్వాతంత్ర్యాన్ని పొందడమూ, ఆనాడే దేశం విభజనకావడమూ జరిగింది. అందువలన 1941 లో తీసిన జనాభా లెఖలు 1947 ఆగస్టు 15 తో ఆధారపడడానికి వీలులేని మార్పులు పొందినవి. విభజనానంతరం ఇండియా జనాభాను గురించిన సరియైన లెఖలు 1951 జనాభా లెఖలవల్లనే లభించగలవు.

1951 జనాభావల్ల, కాశ్మీర్ తప్ప తక్కిన భారతదేశంలో మొత్తం 35,68,91,624 మంది ప్రజలున్నారనీ, వారిలో 18,33,84,807 మంది పురుషులూ, 17,35,06,817 మంది స్త్రీలూ వున్నారనీ తేలింది.

## 1951 జనాభా

ప్రపంచదర్శిని 1952-53 ముద్రణ ప్రారంభమయేటప్పటికి 1951 జనాభానుగురించి రాష్ట్రములవారిగా యీ క్రింది వివరములు మాత్రము తెలిసినవి.

| రాష్ట్రం | జనాభా | పురుషులు | స్త్రీలు |
|---|---|---|---|
| అస్సాం | 9129442 | 4869879 | 4255449 |
| బీహారు | 40218916 | 20172567 | 20046934 |
| బొంబాయి | 35943559 | 18631883 | 17311647 |
| మధ్యప్రదేశ్ | 21327898 | 10688811 | 10639087 |
| మద్రాసు | 56952332 | 28413661 | 28538671 |

| | | | |
|---|---|---|---|
| ఒరిస్సా | 14644293 | 7240008 | 7404842 |
| పంజాబు | 12638611 | 6780770 | 5857185 |
| ఉత్తరప్రదేశ్ | 63254118 | 33142457 | 30111661 |
| పశ్చిమ బెంగాలు | 24786683 | 1331994 | 11466749 |
| హైదరాబాదు | 18652964 | 9464495 | 9188469 |
| జమ్మూ, కాశ్మీర్ | 4370000 | | — |
| మధ్య భారత్ | 7941642 | 4128308 | 3813334 |
| మైసూరు | 9071678 | 4663858 | 4407820 |
| పంజాబ్ సంస్థానాలు | 3468731 | 1873205 | 1595426 |
| రాజస్తాన్ | 15297979 | 7966208 | 7331771 |
| సౌరాష్ట్ర | 4136005 | 2094968 | 2041037 |
| తిరువాన్కూర్ కొచ్చిన్ | 9265157 | 4615335 | 4649822 |
| అజ్మీర్ | 692506 | 359572 | 332934 |
| భోపాల్ | 838107 | 438778 | 399329 |
| బిలాస్‌పూర్ | 127566 | 65332 | 62234 |
| కూర్గ్ | 229255 | 125333 | 103922 |
| ఢిల్లీ | 1743992 | 990443 | 753549 |
| హిమాచల ప్రదేశ్ | 989437 | 516317 | 473120 |
| కచ్ | 567825 | 273363 | 294362 |
| మణిపూర్ | 579058 | 284747 | 294311 |
| త్రిపుర | 649930 | 339962 | 309968 |
| వింధ్య ప్రదేశ్ | 3577431 | 1834610 | 1742821 |
| అండమాన్ నికోబార్ దీవులు | 30963 | 19036 | 11927 |
| సిక్కిం | 135646 | 70961 | 64685 |

## నగరములవారీగా (1951)

| | |
|---|---|
| మైసూరు : | 2.44,334 |
| బెంగుళూరు : | 7,76,170 |
| మదరాసు : | 14,29,374 |

| | |
|---|---|
| బొంబాయి : | 28,40,011 |
| హైదరాబాదు సికిందరాబాదుతోసహా } : | 10,85,074 |
| వరంగల్ : | 1,30,080 |
| కలకత్తా : | 45,50,000 |
| త్రివేంద్రం : | 1,87,122 |
| అలెప్పి : | 1,15,930 |

## రాష్ట్రాలవారిగా స్త్రీ పురుషుల జనాభా (1941)

| రాష్ట్రం | పురుషులు | స్త్రీలు |
|---|---|---|
| అజ్మీర్ | 3,07,172 | 2,76,521 |
| అస్సాం | 53,82,795 | 48,21,938 |
| ఒరిస్సా | 42;18,121 | 45,10,423 |
| కూర్గ్ | 92,347 | 76,379 |
| ఢిల్లీ | 5,35,236 | 3,82,703 |
| బీహార్ | 1,82,24,428 | 1,81,15,723 |
| బొంబాయి | 1,08,17,333 | 100,32,507 |
| మదరాస్ | 2,45,57,143 | 2,47,84,667 |
| ఉత్తరప్రదేశ్ | 2,88,60,214 | 2,61,60,403 |
| మధ్యప్రదేశ్ | 84,30,282 | 83,83.322 |
| హైదరాబాద్ | 83,46,775 | 79,91,759 |
| మైసూరు | 37,63,318 | 35,65,822 |
| తిరువాంకూరు | 30,45,102 | 30,24,916 |
| కొచ్చిన్ | 6,96,889 | 7,25,986 |
| బరోడా | 14,72,909 | 613,82,101 |
| కాశ్మీరు | 21,29.872 | 18,91,744 |

## మతములవారీగా భారతదేశపు జనాభా (1941)

| మతము | సంఖ్య |
|---|---|
| హిందువులు | 20,00,00,000 |
| వీరిలో హరిజనులు | 4,40,00,000 |
| ముస్లిములు | 4,26,00,000 |
| క్రైస్తవులు | 55,00,000 |
| సిక్కులు | 80,00,000 |
| జైనులు | 14,30,000 |
| పార్శీలు | 1,14,900 |
| బౌద్ధులు | 2,32,003 |
| యూదులు | 22,408 |
| కొండజాతులు | 2,48,20,000 |

మొత్తపు జనాభాలో ప్రతినూటికీ 72 మంది హిందువులు, 16 మంది ముస్లిములు, అయిదుగురు కొండజాతులవారు; మిగతావారు తక్కిన అన్నిమతాలను చెందినవారు.

## సగటు ఆయుర్దాయం

భారతదేశంలో ప్రజల ఆయుర్దాయం సగటున చూస్తే పురుషుల ఆయుర్దాయం 24 సంవత్సరాలు, స్త్రీల ఆయుర్దాయం 22 సంవత్సరాలు వుంటుంది.

సాధారణంగా, ఆయుర్దాయం విషయంలో పురుషులు 27 సంవత్సరాలు, స్త్రీలు 26 సంవత్సరాలే పరిమితి పెట్టుకోవలసిన పరిస్థితి మనది. అంతకుమించి జీవించినవారు, సగటు ఆయుర్దాయాన్ని మించినవారే.

## పసిపిల్లల మరణాలు

ఇతర దేశాలతో పోల్చి చూస్తే, భారతదేశంలో పసిపిల్లలు మరణాలు చాలా ఎక్కువ. బిడ్డలపోషణ విషయంలో తల్లిదండ్రుల అజ్ఞానము, పుష్టిలేని ఆహారము, దారిద్ర్యము మొదలైన అనేక కారణాలవల్ల బిడ్డల మరణం ఈ ఖండంలో ఎక్కువ. అయినప్పటికీ గత 25 సంవత్సరాలలోనూ, యీ మరణాలు క్రమేపీ తగ్గుతూవచ్చాయి.

1947 లో పుట్టిన బిడ్డలలో ప్రతి వెయ్యిమందికీ 146 మంది చని పోయారనీ, 1948 లో పుట్టిన బిడ్డలలో ప్రతి వెయ్యిమందికీ 131 మంది చనిపోయారనీ లెక్కలవల్ల తెలుస్తుంది.

## సగటు ఆదాయం (1949)

1949 లో ఇండియాలోని ప్రజలసగటు ఆదాయం తలకు, ఏడాదికి 20 పౌనులు (రు. 272 అంచనా.)

ఇదే లెక్కలో, ఇతరదేశాల ప్రజలసగటు ఆదాయపు అంచనాలు ఇవి :

| | | | | | పౌనులు |
|---|---|---|---|---|---|
| యునైటెడ్ స్టేట్సు | ... | 519 | యుగోస్లావియా | ... | 52 |
| కెనడా | ... | 311 | టర్కీ | ... | 41 |
| ఇంగ్లండు | ... | 276 | ఈజిప్టు | ... | 93 |
| ఆస్ట్రేలియా | ... | 242 | పెర్షియా | ... | 30 |
| బెల్జియం | ... | 208 | జపాన్ | ... | 39 |
| ఫ్రాన్సు | ... | 172 | పాకిస్తాన్ | ... | 18 |
| ఇటలీ | ... | 84 | బర్మా | ... | 13 |
| చెకోస్లోవేకియా | ... | 132 | చైనా | ... | 10 |
| రష్యా | ... | 110 | ఇండోనేషియా | ... | 9 |
| పోలెండ్ | ... | 107 | హంగరీ | ... | 96 |

## విదేశాలలో భారతీయులు

విదేశాలలోవున్న భారతీయుల సంఖ్యనుగురించి, 1947 మార్చిలో, కేంద్రశాసనసభలో పండిట్ నెహ్రూ యీక్రింది ప్రకటనచేశారు.

**యూరప్ :**

జర్మనీ 44, ఇటలీ 23, ఫ్రాన్సు 10.

**ఉత్తర అమెరికా :**

యునైటెడ్ స్టేట్సు 5,000. పెనామా 1,000.

దక్షిణ అమెరికా :

బ్రెజిల్ 2,000, బ్రిటిష్‌గయానా 1,57,185, డచ్ గయానా 54.

ఆఫ్రికా :

బెల్జియన్ కాంగో 1,000; పోర్చుగీసు తూర్పుఆఫ్రికా 4,000; ఈజిప్టు, సుడాన్ 1,025; అబిసీనియా 2,000.

ఆసియా :

ఫ్రెంచి ఇండోచైనా 2,000; ఇండోనేషియా, 24,000; ఫిలిపైన్సు 800; సయాం 13,000; జపాన్ 50; పెర్షియా 500; ఇరాక్ 4,500, టర్కీ 37, పాలస్టైన్ 60, కాష్గరు 400, బర్మా 10,17,825.

బ్రిటిషు సామ్రాజ్యం :

ఆస్ట్రేలియా 4,544, కెనడా 1,500, న్యూజిలెండ్ 1,200, దక్షిణాఫ్రికా 2,66,016, దక్షిణరోడేషియా 2,547, సిలోన్ 7,50,000, బ్రిటిష్ మలయా 6,52,769, హాంగ్‌కాంగ్ 4,745, మారిషస్ 2,69,546, సెచిల్లిస్ 503, జిబ్రాల్టరు 80, నైగీరియా 32, కెన్యా 47,000, ఉగాండా 26,972, న్యాసాలాండ్ 1,851, జాంజిబారు 14,000, టాంగనైకా 3,559, జమైకా 26,507, ట్రినిడాడ్ 1,70,396, ఫిజి 1,32,941, ఉత్తర రోడీషియా 427, మాల్దీవ్స్ 550, బ్రిటిష్ ఉత్తర బోర్నియో 1,288, ఏడెన్ 5,594, మాల్టా 44, గ్రెనడా 5,000, సెంట్‌లూషియా 2,189, బ్రిటిష్ హోండురాస్ 477, సీరాలోన్ 444, బ్రిటన్ 7,128.

## కాందిశీకులు

1947 ఆగస్టు 15 న దేశవిభజన జరిగినతరువాత, పంజాబ్ సరిహద్దు సింధురాష్ట్రాలలో దారుణమైన మతకలహాలు, హత్యలు, దోపిడీలు జరిగాయి. అందుచేత ఆప్రాంతాలలోని హిందువులు ఇండియాకు తరలివచ్చేశారు. ఈ ప్రాంతాలనుంచి, 1949 జులై 14 తేదినాటికి 50,00,000 మందిహిందువులు పశ్చిమ పాకిస్తాన్‌నుంచి ఇండియాకు వచ్చేసినట్లు లెక్కలు తేలాయి. వీరిలో దాదాపు 20 లక్షలమందికి తూర్పుపంజాబ్ రాష్ట్రంలోను దాదాపు

మూడులక్షలమందికి సంస్థానాలలోనువసతులు ఏర్పాటుచేయబడినవి. మిగతావారు ఢిల్లీనగరంలోను, కాందిశీకులకు ఏర్పాటుచేయబడిన మకాముల లోను వున్నారు. వీరందరినీ వివిధరాష్ట్రాలకు పంపి, అక్కడ వసతులను ఏర్పాటుచెయ్యడానికి ఇండియా ప్రభుత్వంవారు నిశ్చయించారు.

1951 మార్చి 31 న, తీసిన జనాభా లెక్కల ప్రకారం, ఆనాడు ఇండియాలో 74,79,278 మంది కాందిశీకులు వున్నట్లు తేలింది. వీరిలో పంజాబులో 24,68,491 మంది, పశ్చిమబెంగాల్ లో 21,17,896 మంది ఉన్నారు. మదరాసురాష్ట్రంలో 9,926 మంది మాత్రమే ఉన్నారు.

## ఓ ట ర్లు

1950 నవంబరు 20 తేదీనాటికి గణితీ చేయబడ్డ ఓటర్ల సంఖ్య, భారతదేశం అంతటికీ, 17,44,64,772, వీరిలో గవర్నరుల రాష్ట్రాలలో 13,74,29,731 రాజుల రాష్ట్రాలు 3,23,60,5251; కమిషనర్ల రాష్ట్రాలలో 48,56,606. మదరాస్ రాష్ట్రంలో, 2,74,63,116.

# విద్య

భరతఖండపు ప్రజలలో, విద్యాజ్ఞానం గలవారు పార్సీలలోనూ, యూదులలోనూ అత్యధిక సంఖ్యాకులు వున్నారు. మిగతా జాతుల వారు, విద్యాజ్ఞానంలో చాలా వెనకపడివున్నారు.

| మతము | ప్రతి వెయ్యిమందిలోనూ అక్షరజ్ఞానంకలవారు | ప్రతి 10,000 మందిలోను ఇంగ్లీషు చదువగలవారు. |
|---|---|---|
| హిందువులు | 84 | 113 |
| శిక్కులు | 91 | 151 |
| జైనులు | 353 | 306 |
| పార్శీలు | 791 | 5,041 |
| ముస్లిములు | 64 | 92 |
| క్రైస్తవులు | 279 | 919 |
| యూదులు | 416 | 2,636 |

# విశ్వకళాపరిషత్తు

1952 ఏప్రిల్ నాటికి ఇండియాలో 28 విశ్వకళాపరిషత్తులు వున్నాయి. వాటిపేర్లు, వైస్‌చాన్స్‌లర పేర్లు యీ క్రిందయివ్వబడినవి.

| పేరు | ఉన్ననగరం | వైస్-ఛాన్స్‌లర్ |
|---|---|---|
| అన్నామలై | చిదంబరం | డాక్టర్. ఆర్. కె. షణ్ముఖం. చెట్టియార్ |
| అలహాబాద్ | అలహాబాద్ | డాక్టర్ డి. ఆర్. భట్టాచార్య |
| అలీఘర్ | అలీఘర్ | డాక్టర్ జకిర్ హుసేన్ |
| ఆగ్రా | ఆగ్రా | డాక్టర్ ఎన్. పి. అస్థానా |
| ఆంధ్ర | వాల్తేర్ | డాక్టర్ వి. ఎస్. కృష్ణ |
| ఉత్కళ్ | కటక్ | డాక్టర్ పరశురాం మిశ్ర |
| ఉస్మానియా | హైదరాబాద్ | |
| కలకత్తా | కలకత్తా | జస్టిస్ శంభునాథ్ బెనర్జి |
| కర్నాటక్ | ధార్వార్ | సి. సి. హాలొక్కటి |
| కాశ్మీర్ | కాశ్మీర్ | కాజి మసూద్ హసన్ |
| గుజరాత్ | అహమదాబాద్ | జి. వి. మావలంకర్ |
| గౌహతి | గౌహతి | కె. కె. హండిక్ |
| ఢిల్లి | ఢిల్లి | డాక్టర్ ఎస్. ఎన్. సేన్ |
| తిరువాన్కూర్ కొచ్చిన్ | త్రివేండ్రం | సర్. ఎ. రామస్వామి మొదలియార్ |
| పంజాబ్ | అంబాలా | దివాన్ ఆనంద్ కుమార్ |
| నాగపూర్ | నాగపూర్ | పండిత కుంజిలాల్ దుబే |
| థామసన్ ఇంజనీరింగ్ | రూర్కి | ఎ. సి. హార్ట్ |
| పాట్నా | పాట్నా | డాక్టర్ కె. ఎన్. బాల్ |
| బీహార్ | పాట్నా | శ్యామనందన సహాయ |
| పూనా | పూనా | డాక్టర్ ఎం. ఆర్. జయకర్ |
| బరోడా | బరోడా | శ్రీమతి హంస మెహతా |
| బొంబాయి | బొంబాయి | ఎన్. జె. వాడియా |
| మదరాస్ | మదరాస్ | ఎ. లక్ష్మణస్వామి మొదలియార్ |

| | | |
|---|---|---|
| మైసూర్ | మైసూర్ | డాక్టర్ బి. ఎల్. మంజునాథ్ |
| రాజస్థాన్ | జయపూర్ | డాక్టర్ జి. ఎస్. మహాజని |
| లక్నో | లక్నో | ఆచార్య జుగల్ కిశోర్ |
| సాగర్ | సాగర్ | డాక్టర్ ఆర్. ఎల్. త్రిపాఠి |
| హిందు | కాశీ | ఆచార్య నరేంద్రదేవ్ |

## ఉస్మానియా యూనివర్శిటీ

హైదరాబాదులోని ఉస్మానియా యూనివర్శిటీని తమ పరం చేసుకొని, దక్షిణదేశంలో హిందీ భాషను అభివృద్ధి చెయ్యడానికీ హిందీ విశ్వకళాపరిషత్తుగా తయారు చెయ్యడానికీ కేంద్ర ప్రభుత్వం నిశ్చయించింది. ఇచ్చటి, విద్యాబోధన అంతా ప్రధానంగా హిందీ భాషలోనే జరిపించాలని ప్రభుత్వ ఉద్దేశం. ఈ యూనివర్శిటీని కేంద్ర ప్రభుత్వానికి స్వాధీనం చెయ్యడానికి హైదరాబాదు ప్రభుత్వం అంగీకరించింది.

## గాయకులకు బహూకరణ

ప్రసిద్ధులైన గాయకులకు ప్రతి సంవత్సరము బహూకరణలు ఇవ్వడానికి ఇండియా ప్రభుత్వ విద్యామంత్రి కార్యాలయం నిశ్చయించింది.

1951-52 లో ఇలాంటి బహూకరణలు నాలుగు ఇవ్వబడినవి. ఒక్కొక్క బహూకరణ, రూ. 1,000 రొక్కం, రూ. 500 విలువ గల కాశ్మీరశాలువ. హిందుస్తానీ గాత్రం, హిందుస్తానీ వాయిద్యం, కర్ణాటక గాత్రం, కర్ణాటక వాద్యం—యీ నాలుగు శాఖలలోను ప్రసిద్ధులైన ఒక్కొకరికి యీ బహుమతులు ఇవ్వబడినవి. ఆ బహూకరణలు పొందినవారి పేర్లు ఇవి :

కర్ణాటక గాత్రం : అరియకుడి రామానుజయ్యంగార్
కర్ణాటక వాద్యం : (వీణ) కారైకుడి సాంబశివ అయ్యర్
హిందుస్తానీ గాత్రం : ఉస్తాద్ ముస్తాక్ హుస్సేన్
హిందుస్తానీ వాద్యం : (సరోద్) : ఉస్తాద్ అల్లావుద్దీన్ ఖాన్.

# ప్రజారోగ్యము

ప్రజారోగ్యము విషయంలో ప్రభుత్వమువారు శ్రద్ధతీసుకొని దీని కొరకు ఒక ప్రత్యేక డిపార్టుమెంటును స్థాపించడం జరిగి యిప్పటికి సుమారు 75 ఏండ్లు అయింది. నగరములు పరిశుద్ధముగా వుండేటట్లు చూడడంలోనూ-అంటు వ్యాధులు వ్యాపించకుండా చూడడంలోనూ, వ్యాధి చికిత్సకు ఉచితంగా సదుపాయాలు కలిగించడంలోనూ చాలా అభివృద్ధి జరిగింది కాని ఇప్పటివరకు మనదేశంలో జరిగిన కృషి అంతా కూడా, జరగవలసిన దానిలో పదవవంతుకూడా కాదన్నమాట వాస్తవం.

మనదేశం, ప్రజారోగ్యం విషయంలో ప్రపంచంలోని యితర దేశాలతో పోలిస్తే, చాలా వెనుకబడి వున్నది. ఇంగ్లండు, జర్మనీ దేశాలలో సగటున ఒకమనిషి ఆయుర్దాయం 63 సంవత్సరాలూ, ఆస్ట్రేలియాలో 66 సంవత్సరాలూ అయితే, మనదేశంలో ప్రజల సగటు ఆయుర్దాయం 31 సంవత్సరాలు మాత్రమే అని లెక్క తేలింది.

ఇండియాలో 1951 ఏప్రిల్ 7 తేది నాటికి 30 మెడికల్ కాలేజిలు- 4 మెడికల్ స్కూళ్లు ఉన్నాయి.

మనదేశంలో గవర్నమెంటు పరీక్షలు ప్యాసయిన వైద్యులు మొత్తం 42,000. అంటే సగటున ప్రతి 6,000 మంది ప్రజలకీ ఒక డాక్టరు ఉన్నాడన్నమాట, ఇదే లెక్కలో ఇంగ్లండులోచూ సే ప్రతి 700 మంది ప్రజలకీ ఒక డాక్టరువున్నాడు. మనదేశమంతటా సుమారు 5,000 మంది నర్సులు వున్నారు.

అయితే, డాక్టర్లలోనూ నర్సులలోనూ నూటికి 90 వంతుల మంది పట్టణాలలోనే వున్నారు. పట్టణాలలో వుండే ప్రజలు, దేశపు జనాభాలో పదవవంతుమాత్రమే. అంచేత, నేడు మన గ్రామస్థులకు బొత్తిగా సరియైన వైద్యసహాయమే లేదన్నమాట.

ఇక, మనదేశంలో అత్యధిక సంఖ్యాకులు పడే జబ్బులుఏమిటంటే,

మలేరియా, టైఫాయిడ్, రక్తగ్రహణి, కలరా, క్షయ, స్ఫోటకము; ఆహారలోపమువల్ల వచ్చే జబ్బులు.

అన్ని జబ్బులలోనూ, ఎక్కువమంది ప్రాణాలను హరిస్తున్నది మలేరియా. ఈ జబ్బు ఏడాదికి పదికోట్లమందికి వస్తోందనీ, ఏడాదికి 12½ లక్షల మంది చచ్చిపోతున్నారనీ తెలుస్తోంది.

రెండవ ప్రమాదకరమైన జబ్బు క్షయ. ఈ జబ్బువల్ల ఏడాదికి సుమారు అయిదు లక్షలమంది చనిపోతున్నారనీ, దాదాపు 35 లక్షల మంది యీ జబ్బుతో అవస్థపడుతున్నారనీ అంచనా.

ఇండియాలో క్షయరోగుల చికిత్సకు 194 ఆస్పత్రులు మాత్రమే వున్నాయి. మామూలు ఆస్పత్రుల లో 114 వార్డులు వున్నాయి. మొత్తం, 10,371 మంది రోగుల పడకకు వసతివుంది. ఈ రోగ చికిత్సకు సరియైన ప్రయత్నం జరగాలంటే అధమం 4,000 ఆస్పత్రులు, సుమారు అయిదులక్షల రోగులు వుండటానికి వసతితో, స్థాపించాలని అంచనా.

మనదేశంలో స్ఫోటకంవల్ల చనిపోయినవారిలో అత్యధిక సంఖ్యాకులు, పది సంవత్సరాలలోపు పిల్లలు.

మలేరియా జ్వరాలు, గత సంవత్సరాలకంటె ఎక్కువగా లేవు.

ఇండియాలో సుమారు పదిలక్షలమంది కుష్ఠురోగులున్నారు.

క్షయరోగం రాకుండా ముందు టీకాలు వేసే పద్ధతి ఇటీవల కనుగొన బడింది. ఈ టీకాలను బి. సి. జి. వాక్సిన్ అంటారు. యునైటెడ్ నేషన్సుకు చెందిన ప్రపంచ ఆరోగ్యసమితి అధ్వర్యాన అనేక దేశాలలో యీ టీకాలను వెయ్యడం మూడు సంవత్సరాలుగా జరుగుతున్నది. 1948 ఆగస్టులో ఇండియాలోకూడా యీ పద్ధతి ప్రవేశపెట్టబడింది. స్కాండినేవియానుంచి కొంతమంది నిపుణులు ఇండియాకువచ్చి, చిన్న చిన్న సమూహాలుగా ఏర్పడి ఇండియాలో పనిచేస్తున్నారు. 1949 సంవత్సరాంతానికి ఇండియాలో స్కాండినేవియన్ నిపుణుల సమూహాలు ఆరున్నూ, భారతీయ నిపుణుల సమూహాలు 21 పనిచేస్తున్నాయి. ఇలాటి పనిలో యింకా ఎక్కువమందికి శిక్షణ యివ్వడంకూడా జరుగు

తోంది. 1960 సంవత్సరాంతానికి యిలాటి సమూహాలు 200 తయారవు తాయని అంచనా.

ప్లేగు :

ప్లేగువ్యాధి కారణం ఎలుకలు. ఈ వ్యాధిగల ఎలుకలను కుట్టిన దోమలు, లేక యీగలు మనుష్యులకు యీ వ్యాధిని తగిలిస్తాయి. ఇంటిలో ఎలుకలు లేకుండా ప్రతివారూ జాగ్రత్తపడాలి. ఎలుకలు వృద్ధిపొందడానికి సహాయకరములైన చెత్త, కుళ్ళు పదార్థములు ఇంటి లోనూ, ఇంటి పరిసరములలోనూ వుండకుండాచూడాలి. ఆహార పదార్థములను ఎలుకలు ముట్టుకోకుండా, మూతలు వేసిన పాత్రలో వుంచాలి.

ప్లేగు రాకుండా ప్రతివ్యక్తి టీకాలు వేయించుకోవడం మంచిది. చచ్చిపడిన ఎలుకలు ఇంటిలోగాని, ఇంటిపరిసరములలోగాని కనపడితే, వెంటనే ఆరోగ్య శాఖాధికారులకు తెలియపరచాలి. ప్లేగు జ్వరపులక్షణాలు కనపడినట్లయితే, ప్రతివ్యక్తీ వెంటనే వైద్యుని దగ్గరకు వెళ్ళి చికిత్స పొందాలి.

# ఆరోగ్యము : ఆహారము

మనదేశంలోని ప్రజలకు పెద్దలోపం ఏమిటంటే, విద్యావిహీనత్వంతోపాటు, సరియైన ఆహారంకూడా లేకపోవడం ఇటీవల మన దేశంలోని ప్రజల ఆహారస్థితిని పరిశీలించిన ఒక కమిషనువారు, దేశంలోని జనాభాలో నూటికి ముఫ్ఫయివంతులమంది, శరీరాన్ని రోగాలపాలబడకుండా తగిన దార్ఢ్యత యివ్వవలసిన దానికంటె, చాలా తక్కువ ఆహారాన్ని తింటున్నారని తేల్చారు.

ఆహారం సరియైనది లేకపోవడంవల్ల మనిషికి అనేకజబ్బులు వస్తాయి. సరియైన ఆహారం తినగలిగిన శక్తిగలవారుకూడా, అనేకమంది దేహపుష్టికి కావలసిన ఆహారం ఏమిటో తెలియక కొన్ని పదార్థాలను ఎక్కువగానూ, కొన్నిపదార్థాలను తక్కువగానూ తినడం జరుగుతోంది. అందువల్ల, దేహానికి సమపుష్టి కలిగించవలసిన పద్ధతిలో ఆహారం సమపాళ్ళలో అందక అనేకమంది వ్యాధుల పాలబడుతున్నారు.

ప్రతిమనిషికి తనపని తాను చేసుకోడానికి శక్తికావాలికదా. ఈ శక్తికి తగినపుష్టిని యిచ్చే ఆహారాన్ని తినాలి. ఈ శక్తికి, శాస్త్రజ్ఞులు 'కేలరీ' అనే పేరుపెట్టారు. మనం తినే ఆహారపుకొలత, యీ కేలరీలలో సూచిస్తారు. వివిధవృత్తులలో వున్నవారికి, వివిధపరిమాణంలో కొన్ని కేలరీలశక్తిగల ఆహారం కావాలి. ఈవిషయంలో శాస్త్రజ్ఞులు, యీ క్రింది పట్టీప్రకారం ఆహారపు కేలరీల విలువ వుండాలని సూచించారు.

| వృత్తి | ఆహారపు కేలరీలు |
|---|---|
| గుమస్తా | 2,600 |
| డాక్టరు | 2,760 |
| టైపిస్టు | 2,800 |
| గృహిణి | 2,800 |
| సైనికుడు | 3,150 |
| వడ్రంగి | 3,190 |
| కూలిపనివాడు | 3,610 |
| కమ్మరి | 4,120 |
| కట్టెలు కొట్టేవాడు | 5,500 |

మామూలుగా పురుషుడుచేసేపనే చేసే స్త్రీ, పురుషుడు తినే ఆహారంలో అయిదింట నాలుగువంతులు తింటుందని అంచనా.

మనదేశంలో ప్రతివ్యక్తి రోజుకు 2,500 కేలరీలశక్తినియిచ్చే ఆహారాన్ని తినాలని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. అయితే, మనదేశంలో చాలామంది తినే ఆహారం, రోజుకు 1,200 కేలరీలలోపలే వుంటున్నది కాని అంతకు మించడంలేదని పరిశోధనలవల్ల తేలింది.

రోజుకి శరీరానికి 2,500 కేలరీలశక్తిని యివ్వడానికి యీ క్రింది లెక్కలో ఆహారం తినాలని శాస్త్రజ్ఞులు సూచించారు.

| | |
|---|---|
| ధాన్యములు | 16 ఔన్సులు |
| పప్పుదినుసులు | 3 ,, |
| చక్కెర | 2 ,, |
| కూరగాయలు | 6 ,, |

| | | |
|---|---|---|
| పండ్లు | 2 | ,, |
| నూనెలు | 2 | ,, |
| పాలు | 8 | ,, |

పైన చెప్పిన కొలతలలో ఆహారం తినేవారికి, ఆహారలోప సంబంధమైనజబ్బులేవీ రావడానికి అవకాశంలేదు. అయితే, యీ ఆహారం తీసుకోవడంలో- కూరగాయల విషయంలో ప్రత్యేక శ్రద్ధ కనపరచాలి. వివిధమైన విటమినులుగల కూరగాయలను, ప్రతిరోజూ మారుస్తూ తింటూవుండాలి. లేనట్లయితే- విటమిన్లలోపంవల్ల వచ్చే జబ్బులు వస్తాయి.

## విటమినులు

మనిషికి జీవశక్తినిఇచ్చే ఆహారపదార్థాలను విటమినులు అంటారు. ప్రతిమనిషీ, తన ఆహారంలో యీ విటమినులన్నీ వుండేటట్లు చూసుకోవాలి. ఈ విటమినలు ఏమిటో, అవి లోపిస్తే ఏమి జబ్బులువస్తాయో, అవి ఏ ఆహారంలో వున్నాయో మొదలైన వివరాలన్నీ యీ క్రింద యివ్వబడినవి.

విటమిన్ 'ఏ'—ఇది శరీరానికి దార్ఢ్యాన్ని యిచ్చి, రోగ క్రిములను ఎదుర్కొనేశక్తిని దేహానికి యిస్తుంది. విటమిను 'ఎ' లోపించిన వారికి నీరసము, శ్వాసావయవములను సంబంధించిన జబ్బులు, కంటి జబ్బులు, సరిగా యెదగకపోవడం, రేచీకటి, మొదలైనజబ్బులు కలుగుతాయి. ఈ విటమిన్ లోపించకుండా వుండాలంటే, ఆకుపచ్చని కూరగాయలు, చేపలు, చేపనూనె, పాలు, వెన్న, మీగడ, పెరుగు, నెయ్యి, గ్రుడ్లు, మొదలైనవి తినాలి.

విటమిన్ 'బి' 1—ఇది జీర్ణశక్తిని కాపాడే విటమిన్. ఇది ఆహారంలో లోపించినట్లయితే, మనిషికి అన్నంమీద ఏవగింపుపుట్టడం, తూకం తగ్గిపోవడం, జీర్ణశక్తి మందగించడం, గుండెజబ్బులు, అలసట, నరముల బలహీనత, నరముల కంపము, వంటికి నీరుపట్టడం మొదలైన జబ్బులు వస్తాయి. ఈ విటమిను ఎక్కువగా మజ్జిగలోనూ, మొక్కగట్టిన ధాన్యాలలోను, మేకకాలేయములోనూ, యీస్టులోను వుంది.

విటమిన్ 'బి' 2—ఇది శరీరపు ఎదుగుదలకు అవసరమైనది. ఇది ఆహారంలో లోపించినట్లయితే, చర్మరోగాలు, నాలుకపూత, నోటి

# ఆహార ధాన్యాల పంట

ప్రస్తుతం భారతదేశంలో 35 కోట్లకు పైగా జనాభావుంది. మనిషికి 18 ఔన్సుల లెక్కన, ఏడాదికి 4,80,00,000 టన్నుల ఆహారధాన్యాలు మనకు కావాలి.

1948 లో 3,84,35,000 టన్నుల ఆహారధాన్యాలూ, 1949 లో 3.53,40,000 టన్నుల ఆహారధాన్యాలూ, పండినట్టు అంచనా. 1948లో 29 లక్షల టన్నులూ, 1949లో 39 లక్షల టన్నులూ ఆహారధాన్యాలు ఇండియాకు దిగుమతి చేసుకోబడినవి. 1950 లో రు. 80,20,00,000 ఖర్చుపెట్టి, 21,24,700 టన్నుల ధాన్యాన్ని ఇండియా ప్రభుత్వం దిగుమతిచేసింది. దీనిలో 3,41,700 టన్నులు బియ్యం. దీనిలో 1,76,900 టన్నుల బియ్యం బర్మానుంచి, 1,11,100 టన్నులు సయాంనుంచి దిగుమతి చేయబడింది.

మామూలుగా ఇండియాలో పండే ధాన్యాలలో నూటికి 40 వంతులు మాత్రమే అమ్మకానికి బజారుకివచ్చేది. మిగతాది రైతులూ, భూస్వాములూ తమ సొంత వాడకానికి వుంచుకొనేది.

యుద్ధకాలంలో దిగుమతులులేక, ఇండియాలోని పంట ప్రజలకూ, సైనికులకూ చాలక ఇబ్బందిపడుతూవున్న సందర్భంలో కొందరు స్వలాభపరులు సరకును తమదగ్గర దాచిపెట్టుకొని ఎక్కువ ధరకు అమ్మడం జరిగింది. అందువల్ల రైతువద్ద పంటను ప్రభుత్వమే కొని, రేషనుపద్ధతిలో అందరికీ ప్రతిరోజూ ఒక నిర్ణీతపుకొలతలో ఆహారధాన్యం అమ్మేపద్ధతి అమలుజరిపారు. ఈ పద్ధతి 1943 లో అమలులోకి వచ్చింది. ఈ పనిని కేంద్రప్రభుత్వ ఆమోదంతో ఏరాష్ట్రంలో ఆ రాష్ట్రప్రభుత్వమే చేస్తువున్నది.

విదేశాలనుంచి ఆహారధాన్యాలను దిగుమతిచేసుకోవడంవల్ల డబ్బు చాలా వ్యయమైపోతున్నది. ఆ డబ్బును పరిశ్రమలను వృద్ధిపొందించడానికి కావలసిన యంత్రసామగ్రి కొనడానికి వుపయోగించవచ్చును

దేశంలోనే, ఆహారధాన్యాల వుత్పత్తిని ఎక్కువచేస్తే, ఇలా చెయ్యడానికి వీలవుతుంది అనే వుద్దేశంతో 1951 తరువాత విదేశాలనుంచి ఆహారధాన్యాలను దిగుమతి చెయ్యకుండా వుండాలని కేంద్ర ప్రభుత్వం నిశ్చయించింది.

ఇందుకోసం, దేశంలో ఏడాదికి అదనంగా 44 లక్షల టన్నుల ఆహారధాన్యాలను పండించడానికి సుమారు 8,00,000 ఎకరాల బంజరు భూములను వ్యవసాయంచెయ్యడానికీ, చెరకుపంట వేయబడుతున్న భూమిలో సుమారు 4,00,000 ఎకరాలను ఆహారధాన్యాల పంటకు వుపయోగించడానికీ ప్రభుత్వం నిశ్చయించింది.

1948 లో 4,97,000 టన్నులూ, 1949 లో 3,73,000 టన్నులూ, 1950 లో 1,78,000 టన్నులూ, 1951 లో 3,04,186 టన్నులూ బియ్యం బర్మానుంచి ఇండియాకు దిగుమతి చేయబడినవి.

1948-49 లో రు. 110,66 లక్షలు, 1949-50 లో రు. 92,54 లక్షలు, 1950-51 లో రు. 90,30 లక్షలు విలువగల ఆహారధాన్యాలను విదేశాలలో ఇండియా కొన్నది. ఆ ధాన్యాలను ఇండియాకు చేర్చడానికి అయిన ఖర్చులతో, ఆహార ధాన్యాలకుగాను 1948-49 లో 186,85 లక్షలు, 1949-50 లో 124,63 లక్షలు, 1950-51 లో 130,55 లక్షలు మొత్తం వ్యయమైంది.

1951 లో ఇండియా 47,23,729 టన్నుల ఆహారధాన్యాలను విదేశాలనుంచి దిగుమతి చేసుకున్నది. ఆ ధాన్యాల వివరాలు ఇవి: గోధుమలు, 29,69,017 టన్నులు; బియ్యం, 7,48,550 టన్నులు; జొన్నలు, 9,49,162 టన్నులు; పిండి, 45,299 టన్నులు; ఇతర ధాన్యాలు, 11,791 టన్నులు.

బియ్యపు దిగుమతులలో 3,04,186 టన్నులు బర్మానుంచీ, 2,16,172 టన్నులు సయాంనుంచీ, 65,779 టన్నులు చైనానుంచీ వచ్చినవి.

1950-51లో ఇండియాలో మొత్తం 2,02,38,000 టన్నుల బియ్యం పండింది. ఇది, 1949-50 లో పండిన పంటలో నూటికి 11.5 వంతులు తక్కువ.

# ఆహార ధాన్యాల పంట

ప్రస్తుతం భారతదేశంలో 35 కోట్లు పైగా జనాభావుంది. మనిషికి 18 ఔన్సుల లెక్కన, ఏడాదికి 4,80,00,000 టన్నుల ఆహారధాన్యాలు మనకు కావాలి.

1948 లో 3,84,35,000 టన్నుల ఆహారధాన్యాలూ, 1949 లో 3.53,40,000 టన్నుల ఆహారధాన్యాలూ, పండినట్టు అంచనా. 1948లో 29 లక్షల టన్నులూ, 1949లో 39 లక్షల టన్నులూ ఆహారధాన్యాలు ఇండియాకు దిగుమతి చేసుకోబడినవి. 1950 లో రు. 80,20,00,000 ఖర్చుపెట్టి, 21,24,700 టన్నుల ధాన్యాన్ని ఇండియా ప్రభుత్వం దిగుమతిచేసింది. దీనిలో 3,41,700 టన్నులు బియ్యం. దీనిలో 1,76,900 టన్నుల బియ్యం బర్మానుంచి, 1,11,100 టన్నులు సయాంనుంచి దిగుమతి చేయబడింది.

మామూలుగా ఇండియాలో పండే ధాన్యాలలో నూటికి 40 వంతులు మాత్రమే అమ్మకానికి బజారుకివచ్చేది. మిగతాది రైతులూ, భూస్వాములూ తమ సొంత వాడకానికి వుంచుకొనేది.

యుద్ధకాలంలో దిగుమతులులేక, ఇండియాలోని పంట ప్రజలకూ, సైనికులకూ చాలక ఇబ్బందిపడుతూవున్న సందర్భంలో కొందరు స్వలాభపరులు సరకును తమదగ్గర దాచిపెట్టుకొని ఎక్కువ ధరకు అమ్మడం జరిగింది. అందువల్ల రైతువద్ద పంటను ప్రభుత్వమే కొని, రేషనుపద్ధతిలో అందరికీ ప్రతిరోజూ ఒక నిర్ణీతపుకొలతలో ఆహారధాన్యం అమ్మేపద్ధతిని అమలుజరిపారు. ఈ పద్ధతి 1943 లో అమలులోకి వచ్చింది. ఈ పనిని, కేంద్రప్రభుత్వ ఆమోదంతో ఏరాష్ట్రంలో ఆ రాష్ట్రప్రభుత్వమే చేస్తూవున్నది.

విదేశాలనుంచి ఆహారధాన్యాలను దిగుమతిచేసుకోవడంవల్ల డబ్బు చాలా వ్యయమైపోతున్నది. ఆ డబ్బును పరిశ్రమలను వృద్ధిపొందించడానికి కావలసిన యంత్రసామగ్రి కొనడానికి వుపయోగించవచ్చును.

దేశంలోనే, ఆహారధాన్యాల వుత్పత్తిని ఎక్కువచేస్తే, ఇలా చెయ్యడానికి వీలవుతుంది అనే వుద్దేశంతో 1951 తరువాత విదేశాలనుంచి ఆహారధాన్యాలను దిగుమతి చెయ్యకుండా వుండాలని కేంద్ర ప్రభుత్వం నిశ్చయించింది.

ఇందుకోసం, దేశంలో ఏడాదికి అదనంగా 44 లక్షల టన్నుల ఆహారధాన్యాలను పండించడానికి సుమారు 8,00,000 ఎకరాల బంజరు భూములను వ్యవసాయం చెయ్యడానికీ, చెరకుపంట వేయబడుతున్న భూమిలో సుమారు 4,00,000 ఎకరాలను ఆహారధాన్యాల పంటకు వుపయోగించడానికీ ప్రభుత్వం నిశ్చయించింది.

1948 లో 4,97,000 టన్నులూ, 1949 లో 3,73,000 టన్నులూ, 1950 లో 1,78,000 టన్నులూ, 1951 లో 3,04,186 టన్నులూ బియ్యం బర్మానుంచి ఇండియాకు దిగుమతి చేయబడినవి.

1948-49 లో రు. 110,66 లక్షలు, 1949-50 లో రు. 92,54 లక్షలు, 1950-51 లో రు. 90,30 లక్షలు విలువగల ఆహారధాన్యాలను విదేశాలలో ఇండియా కొన్నది. ఆ ధాన్యాలను ఇండియాకు చేర్చడానికి అయిన ఖర్చులతో, ఆహార ధాన్యాలకుగాను 1948-49 లో 186,85 లక్షలు, 1949-50 లో 124,63 లక్షలు, 1950-51 లో 120,55 లక్షలు మొత్తం వ్యయమైంది.

1951 లో ఇండియా 47,23,729 టన్నుల ఆహారధాన్యాలను విదేశాలనుంచి దిగుమతి చేసుకున్నది. ఆ ధాన్యాల వివరాలు ఇవి: గోధుమలు, 29,69,017 టన్నులు; బియ్యం, 7,48,550 టన్నులు; జొన్నలు, 9,49,162 టన్నులు; పిండి, 45,299 టన్నులు; ఇతర ధాన్యాలు, 11,791 టన్నులు.

బియ్యపు దిగుమతులలో 3,04,186 టన్నులు బర్మానుంచీ, 2,16,172 టన్నులు సయాంనుంచీ, 65,779 టన్నులు చైనానుంచీ వచ్చినవి.

1950-51లో ఇండియాలో మొత్తం 2,02,38,000 టన్నుల బియ్యం పండింది. ఇది, 1949-50 లో పండిన పంటలో నూటికి 11.5 వంతులు తక్కువ.

1950-51 లో 52,23,000 టన్నుల జొన్నలు పండినవి. ఈ పంట, 1949-50 లో పండిన దానిలో నూటికి 10.5 వంతులు తక్కువ.

1950-51 లో 16,82,000 టన్నుల మొక్కజొన్నలు పండినవి. 1949-50 పంటలో ఇది నూటికి 16 వంతులు తక్కువ.

1950-51 లో 23,36,000 టన్నుల సజ్జలు పండినవి. ఇది, 1949-50 లో పండినదానిలో నూటికి 12 వంతులు తక్కువ.

1950-51 లో 64,96,000 టన్నుల గోధుమ పండింది. ఇది 1949-50 లో పండినదానికి నూటికి 7 వంతులు ఎక్కువ.

1950-51 లో మొత్తం 37,65,000 టన్నుల అపరదినుసులు పండినవి.

## వ్యవసాయ భూమి

ఇండియాలో వ్యవసాయములోవున్న భూమి, అడవి, వ్యవసాయానికి రాని భూమి, యెంతవున్నదీ ఈ క్రింది పట్టీనిబట్టి తెలుసుకోవచ్చును. (భూమి కొలత ఎకరాలలో యివ్వబడినది)

| భూమి వివరం | 1945—46 |
|---|---|
| సర్వేవల్ల తేలిన లెక్క | 40,36,48,000 |
| గ్రామ దస్తావేజులవల్ల తేలిన లెక్క | 40,30,44,000 |
| అడవి | 6,24,91,000 |
| వ్యవసాయానికి రానిది | 6,24,13,000 |
| వ్యవసాయం చెయ్యకుండావున్నది | 6,85,56,000 |
| వాగుల మధ్య చిక్కుపడి వ్యవసాయం లేకుండావున్నది | 3,79,37,000 |
| పంటవేసిన భూమి | 17,08,08,000 |
| పంట వేసినదానిలో, నీటి పారుదలవున్న భూమి | 3,92,28,000 |

## భూమి వివరము

1945—46 లో వేసిన లెక్కల ప్రకారం, ఇండియాలోని రాష్ట్రాల లోని భూమి వివరం ఇది.

| రాష్ట్రం | సర్వే ప్రకారం (వేల ఎకరాలలో) | గ్రామ దస్తావేజుల ప్రకారం (వేల ఎకరాలలో) |
|---|---|---|
| అజ్మీర్ | 15,61 | 1,561 |
| అస్సాం | 3,34,62 | 3,34,62 |
| ఉత్తర ప్రదేశ్ | 6,78,49 | 6,79,46 |
| ఒరిస్సా | 2,06,55 | 2,06,55 |
| కూర్గ్ | 1,012 | 1,012 |
| ఢిల్లీ | 3,68 | 3,68 |
| పంజాబ్ | 2,38,55 | 2,30,82 |
| పశ్చిమ బెంగాల్ | 1,88,97 | 1,88,97 |
| బీహార్ | 4,43,27 | 4,43,27 |
| బొంబాయి | 4,86,61 | 4,86,61 |
| మదరాసు | 7,99,14 | 7,99,30 |
| మధ్యప్రదేశ్ | 6,30,87 | 6,30,93 |

## పంట వేసినభూమి, పంటలు :

1947-48 లో ఇండియాలో ఏఏపంటక్రింద ఎంత భూమివున్నదీ. ఏపంట ఎంతపండినదీ వివరాలు ఇవి :

| ధాన్యం | భూమి (వేల ఎకరాలలో) | పంట (వేలటన్నులలో) |
|---|---|---|
| వరి | 5,96,56 | 1,87,65 |
| గోధుమ | 2,02,09 | 53,46 |
| జొన్న | 3,56,65 | 57,30 |
| సజ్జ | 1,96,26 | 25,25 |
| రాగులు | 51,08 | 13,91 |
| వేరుశనగ | 99,74 | 34,54 |

| | | |
|---|---|---|
| తేయాకు | 7,30 | 2,25 |
| చెరకు | 37,84 | బెల్లం 52,69 |
| జనపనార | 6,46 | 16,58 (బేళ్లు) |
| ప్రత్తి | 1,09,32 | 21,16 (బేళ్లు) |
| పప్పుదినుసులు | 1,84,98 | 43,10 |

1948—49 లో ఇండియాలో మొత్తం 5,88,27,000 ఎకరాలలో వరిపంట వెయ్యబడింది. 1949—50 లో 6,15,63,000 ఎకరాలలో వరిపంట వెయ్యబడింది.

## బియ్యం మిల్లులు

1942 నాటి లెక్కల ప్రకారం, విభజనానంతరం ఇండియాలో వున్న బియ్యంమిల్లుల సంఖ్య ఇది.

| రాష్ట్రం | మిల్లులు |
|---|---|
| మదరాసు | 444 |
| పశ్చిమ బెంగాల్ | 325 |
| బీహార్ | 76 |
| మధ్యప్రదేశ్ | 53 |
| ఒరిస్సా | 52 |
| తిరువాన్కూర్, కొచ్చిన్ | 23 |
| హైదరాబాద్ | 22 |
| అస్సాం | 22 |
| మైసూర్ | 12 |
| ఉత్తరప్రదేశ్ | 10 |
| బొంబాయి | 7 |
| పంజాబ్ | 2 |
| మొత్తం ఇండియాలో | 1048 |

ఇవన్నీ, ఫాక్టరీ చట్టంక్రింద రిజిస్టరు చేయబడినవి. ఇవికాక చాలా చిన్నమిల్లులున్నాయి. అన్నీకలిపి 1950 లో దాదాపు 20,000 మిల్లు లుంటాయని అంచనా. వీటిలో దాదాపు 6,000 మదరాసు రాష్ట్రంలోనే వున్నాయి.

# అడవులు

ఇండియావైశాల్యంలో నూటికి 22.6 వంతులు, అంటే సుమారు 1,71,000 చ. మైళ్లు అడవి.

సంస్థానాల యూనియనులు మినహాగా ఇండియాలోని రాష్ట్రాలన్నిటిలోనూ (1946-47 లెక్కల ప్రకారం) ఉన్న అడవుల విస్తీర్ణం మొత్తం 1,60,356 చ. మైళ్లు. ఈ అడవి వివరం, రాష్ట్రాలవారీగా ఇది: అంకెలు చదరపు మైళ్లు.

అస్సాం, 21,637; అజ్మీర్, 593, అండమాన్ దీవులు, 2,500; బీహార్, 9,947; బొంబాయి, 12,872; మధ్యప్రదేశ్, 47,057; కూర్గ్, 1,175; పంజాబ్, 4,761, మదరాసు, 33,666; ఒరిస్సా, 4,492; ఉత్తరప్రదేశ్, 17,372; పశ్చిమబెంగాల్, 4,284.

ఈ అడవి 1,60,356 చ. మైళ్ళలో 1,04,670 చ. మైళ్ళు ప్రభుత్వపాలనలోను, 55,282 చ. మైళ్లు ప్రత్యేక వ్యక్తుల అధీనంలోను, 404 చ. మైళ్లు సంస్థల అధీనంలోనువుంది.

రాష్ట్రాలన్నిటిలోను ప్రభుత్వ స్వాధీనంలోవున్న 1,04,670 చ. మైళ్లు అడవిలోనూ, 47,759 చ. మైళ్ళ అడవిలో కలప లభిస్తున్నది.

మొత్తం అడవిలో 29,578 చ. మైళ్ళ అడవిలో పశువులను సంవత్సరం పొడుగునా మేపడానికి ఉత్తరువులు ఇవ్వబడినవి.

అడవులవల్ల కేంద్రప్రభుత్వానికి ఏడాదికి రు. 10,48,00,000 ఆదాయం వస్తుందని అంచనా.

# పంట కాలువలు

భారతదేశంలో పొలాలకు నీటిని అందిచ్చే కాలువలపొడవు 60,000 మైళ్లు వుంటుంది. ఈ కాలువలవల్ల దాదాపు అయిదు కోట్ల ఎకరాలపొలం సాగుఅవుతుంది. అయినప్పటికీ, ఇంకా ఎక్కువ పంటకాలువలను త్రవ్వించి ఎంతో ఎక్కువభూమికి నీటిని అందచెయ్యవలసిన అవసరం ఎక్కువగావుంది. అలాచేసినట్లయితే, ఇంకా ఎంతో ఎక్కువపంట పండుతుంది. ప్రస్తుతం బీడుగావున్న భూమిలో చాలాభాగం నీటిపారుదలవుంటే వ్యవసాయానికి అక్కరకువస్తుంది.

1945-46 లో ఇండియా మొత్తంలో 24,02,22,742 ఎకరాల భూమిలో పంట వెయ్యబడింది. దీనిలో 4,81,97,340 ఎకరాల భూమికి నీటిసాగు లభించింది.

నీటిపారుదల సౌకర్యాలను ఇంకా ఎక్కువచెయ్యడమూ, నదులలోనినీరు వృధాగా సముద్రంలోకిపోకుండా ఆనకట్టలను, రిజర్వాయర్లను కట్టి ఆనీటిని కాలువలద్వారా బీడుభూములకునూ, మెట్టభూములకునూ సరఫరాచేసి పంటలను ఎక్కువచెయ్యడమూ ప్రభుత్వ కార్యక్రమాలలో ఒకటి. ఇండియాలోని నదులనీటిలో ప్రతిసంవత్సరమూ నూటికి ఆరేడు వంతులు మాత్రమే ఇలా ఉపయోగింపబడుతున్నదనీ, తక్కిన నీరంతా వృధాగా పోతున్నదనీ, పరిశోధనలవల్ల తేలింది.

# విద్యుచ్ఛక్తి

గత 10 సంవత్సరాలలోను ఇండియాలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చెయ్యడం బాగా ఎక్కువైంది. 1949 లో ఇండియాలో 15,40,000కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని వుత్పత్తిచేసేయంత్రాలు పనిచేసినవి. గ్రామీణప్రాంతాలకు విద్యుచ్ఛక్తిని సప్లయిచెయ్యడంలో చాలా అభివృద్ధి జరిగింది. అయితే, ఈ అభివృద్ధి ఎక్కువగా మదరాసు, మైసూరు, ఉత్తరప్రదేశ్, పంజాబ్ రాష్ట్రాలలోనే జరిగింది. విద్యుచ్ఛక్తి సప్లయి జరిగిన గ్రామాలు ఇండి

యాలో 1947 లో 1.295 అయితే, 1949 లో 2,118 వున్నాయి. అయితే ఇండియాలో 5,000 ప్రజలకులోపు జనాభాగల గ్రామాలు మొత్తంలో నాటికి 0.38 వంతులు మాత్రమే విద్యుచ్ఛక్తి సప్లయిని పొందినవి.

ఇండియాలోని పట్టణాలు, పల్లెలు (జనాభాప్రకారం)విద్యుచ్ఛక్తి సప్లయిని పొందినవి 1949 లో ఎన్ని ఉన్నది వివరాలు యీక్రింది పట్టీనిబట్టి తెలుసుకోవచ్చును.

| జనాభా | ఇండియాలోని అసలు ఊళ్లు | విద్యుచ్ఛక్తి సప్లయి పొందినవి, నూటికి ఎన్నివంతులు : |
|---|---|---|
| లక్షకు పైగా | 49 | 100 |
| 50,000 పైన లక్షకులోపు | 87 | 98.9 |
| 20,000 పైన 50,000 లోపు | 277 | 84.1 |
| 10,000 పైన 20,000 లోపు | 607 | 38.0 |
| 1,000 పైన 10,000 లోపు | 2,367 | 9.3 |
| 5,000 లోపు | 5,59,062 | 0.38 |

# వ్యాపారము - పరిశ్రమలు

భారతదేశపు వ్యాపారం ఎక్కువగా ముడిసరకులను విదేశాలకు ఎగుమతిచెయ్యడం, యంత్రాలలో తయారైన వస్తువులను విదేశాలనుంచి దిగుమతిచేసుకోవడంతో నిండివుంది. యుద్ధకాలంలో దిగుమతులు చాలా తగ్గిపోయినందున, కొన్ని పరిశ్రమలు భారతదేశంలో చాలా అభివృద్ధికి వచ్చాయి.

వ్యాపారం విషయంలో యీ క్రింది విషయాలు ముఖ్యంగా గమనించవలసినవి. ప్రత్తి, టీ, తోళ్లు ఈ ఖండంనుంచి ఎగుమతి అయే సరుకుల మొత్తంలో సగానికిపైగా ఉంటాయి. దిగుమతి అయేవాటిలో ముప్పాతికవంతులు, యంత్రాలలో తయారైన వస్తువులే. వీటిలో సుమారు సగభాగం ఇంగ్లండునుంచి దిగుమతి అవుతాయి.

భారతదేశపు పరిశ్రమలలో ప్రధానమైనవాటిని గురించిన వివరాలు యీ క్రింద తెలుపబడినవి.

## ప్రత్తి

1950-51 లో ప్రపంచంలోని వివిధదేశాలలో పండించిన ప్రత్తి మొత్తం, 2 కోట్ల 68 లక్షలబేళ్ళు ఉంటుందని అంచనా. 1950-51లో ఇండియాలో 29,26,000 బేళ్ల ప్రత్తి పండింది. (ఒకబేలు 392 పౌనులు)

ఇండియాలో 1947-48 లో 1,09,32,000 ఎకరాలలోను 1948-49 లో 1,10,55,000 ఎకరాలలోను 1949-50 లో 1,17,93,000 ఎకరాలలోను, 1950-51 లో 1,38,59,000 ఎకరాలలోను ప్రత్తి సాగు చెయ్యబడింది. 1952 జనవరి 1 నాటి లెక్కల ప్రకారం, ఇండియన్ యూనియన్‌లో ఉన్న బట్టల మిల్లుల సంఖ్య : 445.

1947 నుంచి ఇండియాలో మిల్లులలో వడుకబడిననూలు, నేయబడిన బట్టల వివరాలివి :

| సంవత్సరం : | నూలు (పౌనులు) | బట్ట (గజాలు) |
|---|---|---|
| 1947 : | 12,95,705 వేలు : | 37,61,974 వేలు |
| 1948 : | 14,47,616 ,, | 43,19,303 ,, |
| 1949 : | 13,59,119 ,, | 39,04,203 ,, |
| 1950 : | 11,73,036 ,, | 36,67,349 ,, |

మిల్లులు వడికిన నూలులో దాదాపు 40 కోట్ల పౌనుల నూలు చేనేత పరిశ్రమకు ఉపయోగపడుతున్నది. ఈనూలుతో చేనేత పారిశ్రామికులు దాదాపు 120 కోట్ల గజాల బట్టలను తయారుచేస్తున్నారు.

## ప్రత్తి దిగుమతి

1947-48 నుంచి 1949-50 వరకు ఇతర దేశాలనుంచి ఇండియాకు దిగుమతి అయిన ప్రత్తివివరాలు ఇవి.

| దేశం | 1947-48 | 1948-49 | 1949-50 |
|---|---|---|---|
| | | (దిగుమతి టన్నులలో) | |
| ఈజిప్టు | 59,589 | 51,262 | 76,246 |
| అమెరికా | 626 | 4,138 | 3,964 |

| | | | |
|---|---|---|---|
| కెన్యా | 31,252 | 21,782 | 35,647 |
| మొత్తం | 1,12,894 | 1,61,702 | 1,58,642 |
| | దిగుమతుల మొత్తం విలువ రూపాయలలో | | |
| రు. | 31,17,17,000 | 64,23,14,000 | 63,24,60,600 |

## ప్రత్తి ఎగుమతి

1947-48 నుంచి 1949-50 వరకు ఇండియానుంచి విదేశాలకు ఎగుమతి అయిన ప్రత్తి వివరాలివి:

| | 1947-48 | 1948-49 | 1949-50 |
|---|---|---|---|
| | (ఎగుమతి టన్నులలో) | | |
| ఇంగ్లండ్ : | 29,784 | 7,783 | 1,395 |
| జపాన్ : | — | 13,966 | 17,438 |

## బట్ట దిగుమతి — ఎగుమతులు

ఇండియాకు ఇంగ్లండునుంచి 1948-49 లో 37,062 వేల గజముల బట్ట, 1949-50 లో 40,026 వేల గజముల బట్ట దిగుమతిఅయింది. జపానునుంచి 1948-49 లో 1,388 వేల గజములబట్ట, 1949-50 లో 29,638 వేల గజముల బట్ట దిగుమతి అయింది.

1948-49 లో 34,08,65,000 గజముల బట్ట, 1949-50 లో 68,99,73,000 గజముల బట్ట ఇండియానుంచి విదేశాలకు ఎగుమతి చేయబడింది. ఎగుమతి చేయబడిన బట్ట విలువ : 1948-49 : రు. 36,23,88,000 1949-50 : రు. 57,58,83,000.

## మదరాసు రాష్ట్రంలో ప్రత్తి మిల్లులు

1951 జనవరినాటికి మదరాసురాష్ట్రంలో 73 ప్రత్తి మిల్లులు వున్నాయి. వీనిలో 49 నూలుమాత్రం వడికేవి; 24 నూలు, బట్టలు వడికేవి. రాష్ట్రంలోని 73 మిల్లులలోను, ఆంధ్రదేశంలో 5 మాత్రమే వున్నాయి. తక్కిన 68 తమిళజిల్లాలలో వున్నాయి.

కొత్తగా 1949 లో రాష్ట్రంలో 10 మిల్లుల నిర్మాణం ప్రారంభమైంది. వీటిలో రెండుమాత్ర ఆంధ్రదేశంలో. ఒకటి గుంటూరు జిల్లాలోని నంబూరువద్ద; మరొకటి బళ్ళారి జిల్లాలోని రాయనగర్‌వద్ద.

## చేనేత పరిశ్రమ

ఇండియాలో ఉత్పత్తి అయే బట్టలో నూటికి 26 వంతులు చేనేత పారిశ్రామికులు తయారుచేసేదే. దేశంలో మొత్తం 25 లక్షలమంది చేనేత పారిశ్రామికులున్నారనీ, వారి కుటుంబాలతో కలిపితే సుమారు కోటి మంది ప్రజలు చేనేత పరిశ్రమమీద ఆధారపడివున్నారనీ అంచనా.

ఇండియాలో మొత్తం 24 లక్షల చేనేత మగ్గములున్నవి. వీటిలో 22,000 మగ్గములు విద్యుచ్ఛక్తి సహాయంతో పనిచేసేవి. ఈ మగ్గములలో నేసేబట్ట, ఏడాదికి దాదాపు 130 కోట్ల గజాలువుంటుంది. దీనివిలువ సుమారు 100 కోట్ల రూపాయలు వుంటుంది. దేశంలోని చేనేతమగ్గములకు మొత్తం నెలకు 80,000 బేళ్ళ నూలు సప్లయికావాలి. అలా అయితేనే మగ్గములన్నీ సరిగ్గా పనిచెయ్యడానికి వీలు అవుతుంది.

## జనపనార

ఈ పైరుకూడా, ప్రధానంగా గంగా—బ్రహ్మపుత్రనదీ డెల్టాలలోనే వేయబడుతున్నది. జనపనార ఎక్కువగా బెంగాలు, బీహారు, అస్సాం రాష్ట్రాలలో పైరగుతున్నది.

ఇండియాలో 113 జనపనార మిల్లులు వున్నాయి. మనదేశంలో మొట్టమొదట జనపనార మిల్లు 1855 లో బెంగాల్‌లో రిష్రావద్ద స్థాపింపబడింది.

1947-48 లో ఇండియాలో 6,45,685 ఎకరాలలో జనపనార వెయ్యబడింది. 16,95,970 బేళ్లు పడింది, 1948-49 లో 28 లక్షల బేళ్ళు జనపనార ఇండియాలో పండింది. దేశం మొత్తంమీద అధమం 38 లక్షల బేళ్లు జనపనార ఉత్పత్తి అయేటట్లు చూడాలని ప్రభుత్వం సంకల్పం.

1950-51 లో 32,92,000 బేళ్లు (ఒక బేలు 400 పౌనులు) జనపనార పండింది. ఇది 1949-50 లో పండినదానికి నూటికి 6.6 వంతులు ఎక్కువ. 1950-51 లో జనపనార సాగుచేయబడిన భూమి మొత్తం 14,49,000 ఎకరాలు.

## పంచదార

పంచదార శరీరానికి శక్తునిచ్చే ఆహారపదార్థాలలో ముఖ్యమైన వాట్లలో ఒకటి. అంచేత ఇది ప్రతివారికీ కావలసిందే. కాని యుద్ధ కాలంలో దీని తయారు చాల తగ్గిపోయింది. యుద్ధానికిపూర్వం, ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ ఏడాదికి మూడు కోటటన్నుల పంచదార తయారయేది. 1946-46 లో 2,84,89,000 టన్నుల పంచదార మాత్రమే తయారయింది. 1947-48 లో 2,98,33,000 టన్నులు 1948-49 లో 3,29,12,000 టన్నులు, 1949-50 లో 3,13,91,000 టన్నులు, 1950-51 లో 3,40,25,000 టన్నులు- తయారయింది.

ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ తయారయే పంచదారలో నూటికి 70 వంతులు చెరుకునుంచి తయారుచేసేది, 30 వంతులు, బీట్ నుంచి తయారుచేసేది. ప్రపంచమంతటా చెరుకుపంట వేసే భూమిలో నూటికి 35 వంతులు ఇండియాలోనే.

ఇండియాలో 1947-48 లో 11,83,800 టన్నులూ, 1949-49లో 10,07,500 టన్నులూ, 1949-50 లో 11,54,400 టన్నులూ, పంచదార తయారుచేయబడింది. 1950-51 లో 2,66,019 టన్నులు, 1951-52 లో 3,02,796 టన్నులు పంచదార వుత్పత్తి చేయబడింది.

1949 లో ఇండియాలో 139 పంచదార ఫాక్టరీలు ఉన్నాయి. వివిధ రాష్ట్రాలలో వాటి సంఖ్య ఇది : ఉత్తరప్రదేశ్, 66; బీహార్, 30; పంజాబ్, 1; మదరాసు, 11; బొంబాయి, 14; పశ్చిమ బెంగాల్, అస్సాం, 1; ఒరిస్సా, 2; సంస్థానాలు, 14.

1951 జనవరి 1 తేదినాటికి దేశంలోని పంచదార ఫాక్టరీల సంఖ్య, 158.

1948-49 లో 10,00,000 టన్నులూ, 1949-50 లో 11,54,400 టన్నులూ పంచదార ; 1947-48 లో 36,02,000 టన్నులూ, 1948-49 లో 28,30,000 టన్నులూ 1949-50 లో 27,14,000 టన్నులూ బెల్లం,ఇండియాలో వాడుక అయినవి.

1950-51 లో 54,62,000 టన్నుల చెరకుపండింది. చెరకు వేసిన భూమి మొత్తం, 40,00,000 ఎకరాలు

ప్రపంచంలోని వివిధదేశాలలోని ప్రజలు, సగటున ఒక్కొక్కరు ఏడాదికి ఎన్నిపౌనులు పంచదారను తినేదీ, యీ పట్టికవలన తెలుసుకోవచ్చును.

| | | |
|---|---|---|
| ఇంగ్లండు | ... | 112 |
| ఆస్ట్రేలియా | ... | 114 |
| అమెరికా | ... | 103 |
| ఫ్రాన్సు | ... | 57 |
| హాలెండు | ... | 73 |
| జావా | ... | 11 |
| ఇండియా | ... | $7\frac{1}{2}$ |

ఇండియాలో సగటున $7\frac{1}{2}$ పౌనులు పంచదారకాక, సగటున ప్రతి మనిషి ఏడాదికి 31.6 పౌనుల బెల్లంకూడా తింటున్నట్టు లెక్కల వల్ల తేలింది.

కొబ్బరి :

ఇండియాలో ఏడాదికి మొత్తం రు. 78 కోట్ల రూపాయల విలువ గల కొబ్బరి కాయలు కొట్టబడుతున్నవి. దేశంలో మొత్తం 15,10,000 ఎకరాలభూమిలో కొబ్బరితోటలు వేయబడినవి. దీనిలో మూడింట రెండువంతులు కేరళదేశంలో వున్నాయి. తక్కినభాగం, మదరాసు రాష్ట్రంలోని దక్షిణ కన్నడ, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, తంజావూరుజిల్లాలలోనూ, మైసూరు, బొంబాయి, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలలోను వున్నాయి. ప్రపంచంలో కొబ్బరి తోటలు ఎక్కువగా వున్నదేశాలలో ఇండియాది మూడవ స్థానం. అయినా, ఇండియా, సిలోనునుంచి కొబ్బరికాయలను దిగుమతి చేసుకుంటున్నది.

## సైకిళ్లు

1948-49 లో 2,64,392 సైకిళ్ళు, 1949-50 లో 68,148 సైకిళ్లు, 1950-51 లో 65,461 సైకిళ్లు ఇండియాకు దిగుమతి అయినవి.

ఇండియాలో 1949 లో 64,425 సైకిళ్లు, 1950 లో 1,03,453 సైకిళ్లు తయారు చేయబడినవి.

ప్రస్తుతం ఇండియాలో సైకిళ్లు తయారుచేసే కంపెనీలు అయిదు వున్నాయి : అవి: హింద్ సైకిల్స్ లిమిటెడ్, బొంబాయి; హిందుస్తాన్ సైసికిల్స్ అండ్ ఇండస్ట్రియల్ కార్పొరేషన్; టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, మదరాసు; సెన్-రాలే ఇండస్ట్రీస్, కలకత్తా. అట్లాస్ సైకిల్స్ ఇండస్ట్రీస్ లిమిటెడ్, సోనెపట్.

## మోటారు కార్లు

1948 లో ఇండియాకు 1,94,366 మోటాకార్లు (టాక్సీ కార్లతో సహా) దిగుమతి చేయబడినవి. వీటి విలువ రూ. 8,81,20,000. ఇదే సంవత్సరంలో 43,20,000 రూపాయలు విలువచేసే 4,136 మోటారు సైకిళ్లు దిగుమతి చేయబడినవి.

1948 లో ఇండియాకు దిగుమతి అయిన మోటారు బస్సులు, వానులు, లారీలు మొత్తం : 19,654.

మోటారు కార్లు ఇండియాలో నే తయారుచెయ్యడానికి ప్రయత్నాలు జరుగుచున్నవి. ప్రస్తుతం, ఇంగ్లండు, అమెరికాలలో తయారైన మోటారుకారు భాగాలను విడిగా ఇండియాకు తెప్పించి, వాటిని కార్లుగా సమకూర్చే ఫ్యాక్టరీలు ఇండియాలో రెండువున్నాయి.

ప్రపంచంలోని వివిధ దేశాలలో సగటున జనాభాలో ఎంత మందిలో ఒకరికి కార్లున్నదీ ప్రక్క పేజీలోని పట్టీవలన తెలుసుకోవచ్చును:

| | |
|---|---|
| అమెరికా | ప్రతి నాల్గవవానికి ఒకకారు |
| కెనడా | ప్రతి 7 వ వానికి ,, |
| ఇంగ్లండు | ప్రతి 20 వ వానికి ,, |
| ఫ్రాన్సు | ప్రతి 25 వ వానికి ,, |
| రష్యా | ప్రతి 67 వ వానికి ,, |
| ఇండియా | ప్రతి 1500 వానికి ,, |
| పాకిస్తాన్ | ప్రతి 3200 వానికి ,, |

ఇండియాకు దిగుమతి అయిన కార్లు, ట్రక్కుల వివరాలు

| సంవత్సరం : | కార్లు : | ట్రక్కులు. |
|---|---|---|
| 1946-47 | 10,683 : | 8,654 |
| 1947-48 | 21,789 : | 13,685 |
| 1948-49 | 17,482 : | 21,239 |

ఇండియాకు భాగాలు తెప్పించి, కార్లుగా సమకూర్చిన కార్ల వివరాలు ఇవి.

| సంవత్సరం : | కార్లు : | ట్రక్కులు. |
|---|---|---|
| 1948 : | 12,522 : | 15,651 |
| 1949 : | 6,672 : | 15,137 |

## సింద్రి ఎరువుల ఫాక్టరీ

పొలాలకు ఎరువులను తయారుచెయ్యడానికి, ఇండియా ప్రభుత్వపు యాజమాన్యంలో, బీహారురాష్ట్రంలో, దామోదరనది ఒడ్డున సింద్రి అనే గ్రామసమీపంలో నిర్మింపబడిన ఫాక్టరీలో ఎరువుల పుత్పత్తి 1951 అక్టోబరు 30 న (దీపావళినాడు) ప్రారంభమైంది. ఈ ఫాక్టరీ నిర్మాణానికి దాదాపు 23 కోట్ల రూపాయలు ఖర్చుఅయింది. ఇంత పెద్ద ఎరువులఫాక్టరీ, ఆసియా ఖండంలో మరొకటి లేదట. దీనిలో రోజుకు 1,000 టన్నుల ఎరువు వుత్పత్తి చేయబడుతుంది. దీనివలన దాదాపు మనదేశానికి కావలసిన ఎరువు పూర్తిగా లభిస్తుందన్నమాట. అంటే, ప్రతిఏడూ మన ఎరువును విదేశాలనుంచి దిగుమతి చేసుకోడానికి ఖర్చుపెట్టే 12 కోట్ల రూపాయలు మిగులుతవి.

## పె న్సి ళ్లు

పెన్సిళ్లు తయారుచెయ్యడం ఇండియాలో 1905 లో ప్రారంభమైంది. అయితే, రెండవ ప్రపంచ యుద్ధకాలంలోనే యీ పరిశ్రమ బాగా వృద్ధిపొందింది. 1947-48లో 1,07,80,000 రూపాయల విలువగల పెన్సిళ్లు ఇండియాకు దిగుమతి అయినవి. తరవాత రెండు సంవత్సరాలలోను, యీ దిగుమతులు చాలవరకు తగ్గినవి. పెన్సిళ్లు ఎక్కువగా ఇండియాకు ఇంగ్లండు, యునైటెడ్ స్టేట్సునుంచి దిగుమతి అవుతున్నవి.

## — టీ —

ఇండియా పంటలలో వ్యాపారపు ప్రాధాన్యంగల సరకులలో టీ ఒకటి. ఇది ఎక్కువగా అస్సాంరాష్ట్రంలోను, బెంగాల్, మదరాసు రాష్ట్రాలలో కొంతవరకును, పంజాబ్, యు. పి. బీహారు, కూర్గు రాష్ట్రాలలో స్వల్పంగాను, పైరవుతున్నది.

పంట : 1948 : 53,20,00,000 పౌనులు.

1949 : 66,00,00,000 పౌనులు (అంచనా)

ఇండియాలో పండే టీ లో విశేషభాగం విదేశాలకు ఎగుమతి అవుతున్నది. 1948 లో 41,00,00,000 పౌనుల టీ ఎగుమతిచేయబడింది. దీనివల్ల ఇండియాకు 60 కోట్ల రూపాయల ఆదాయం వచ్చింది.

1948 లో ఇండియాలోని ప్రజలు మొత్తం 15 కోట్ల పౌనుల టీ ని వాడుకచేశారు.

1948-49 లో 40 కోట్ల 80 లక్షల పౌనులు, 1949-50 లో 43 కోట్ల 50 లక్షలపౌనులు, 1950-51 లో 45 కోట్ల పౌనులు తేయాకు ఇండియానుంచి విదేశాలకు ఎగుమతిచేయబడింది. 1951-52లో 47 కోట్ల పౌనుల తేయాకును ఎగుమతి చేయడానికి నిశ్చయింపబడింది. 1949లో 32 కోట్ల 70 లక్షల పౌనులూ, 1950 లో 24 కోట్ల 70 లక్షల పౌనులూ ఇంగ్లండుకు ఎగుమతి అయింది. ఈ రెండేళ్ళలోనూ ఏడాదికి 2 లక్షల 35 వేల పౌనుల చొప్పున కెనడాకు, మూడుకోట్ల 40 లక్షల పౌనుల చొప్పున అమెరికాకు తేయాకు ఎగుమతి చేయబడింది.

## గాజు పరిశ్రమ

ఇండియాలో ఏడాదికి దాదాపు తొమ్మిదికోట్ల రూపాయల విలువ గల గాజుసామాను కొనుబడి అవుతుంది. దీనిలో, ఇండియాలో తయారయేది, రు. 7,36,69,000 విలువగలది మాత్రమే. ఇండియాలో 1951 నాటికి 224 గాజుఫాక్టరీలు వున్నాయి. వానిలో మదరాసురాష్ట్రంలో 7 వున్నాయి.

## కాగితము

కాగితం చెయ్యడం దాదాపు రెండువేల సంవత్సరాలనాడు మొట్టమొదట కనిపెట్టినవారు, చైనాదేశీయులు. కాని, ఈ పరిశ్రమ చాలా కాలంవరకూ ప్రపంచంలోని ఇతరదేశాలలో ఏర్పడలేదు. యంత్రస్థాపన జరిగి విదేశాలలో కాగితపు ఉత్పత్తి జరుగుతూనేవున్నా, కాగితాల మిల్లులు ఇండియాలో 1867 సంవత్సరంవరకూ ఏర్పడలేదు. 1867 లో హుగ్లీనదీతీరాన, బెంగాల్‌లో సిరాంపూర్‌లో మొట్టమొదటి కాగితాల మిల్లు స్థాపించబడింది. ప్రస్తుతం ఇండియాలో 15 మిల్లులు వున్నాయి. ఈ మిల్లులన్నీకూడా తెల్లకాగితం తయారుచేస్తున్నాయి. పీచు అట్టలను తయారుచేసే మిల్లులు 17 వున్నాయి. వార్తాపత్రికలు అచ్చువేసే కాగితం ఇండియాలో తయారుకావడంలేదు. ఈ కాగితాన్ని మనం ప్రస్తుతం కెనడా, నార్వే, స్వీడను దేశాలనుంచి తెప్పించుకుంటున్నాము.

ఇండియాలో కాగితపు ఉత్పత్తి

| | | |
|---|---|---|
| 1948 | ... | 98,600 టన్నులు. |
| 1949 | ... | 1,03,204 టన్నులు. |
| 1950 | ... | 10,8,656 టన్నులు. |
| 1951 | ... | 1,28,000 టన్నులు. |

1956-57 నాటికి ఏడాదికి 4,71,000 టన్నులూ, కాగితం ఇండియాలో ఉత్పత్తిఅయేటట్టు చూడాలని ప్రభుత్వ ఆశయం.

## లక్క

లక్క, ఒకజాతి పురుగు విడిచే మలం. దీనిని శుద్ధిచేసి, కొన్ని వస్తువులను తయారు చెయ్యడానికి ఉపయోగిస్తారు. శుద్ధిచేసిన లక్కను షెల్లాక్ అంటారు. ఇండియాలో లక్క బీహారురాష్ట్రంలోని ఛోటానాగపూర్ డివిజన్‌లో విశేషంగా ఉత్పత్తి అవుతున్నది. గ్రామఫోను రికార్డులు, రంగులు, వార్నిషులు, ఎలక్ట్రిక్ సామానులు తయారుచెయ్యడానికి లక్క విశేషంగా ఉపయోగింపబడుతుంది. భారతదేశంలో తయారయే లక్కలో విశేషభాగం యునైటెడ్ స్టేట్సుకు ఎగుమతి చేయబడుతుంది. 1948-49 లో రు. 8,68,00,000 విలువగల షెల్లాక్ విదేశాలకు ఎగుమతి చేయబడింది.

ఇండియాలో ఏడాదికి దాదాపు 2,97,000 మణుగుల లక్క వుత్పత్తి అవుతుంది. 1951 లో 2,55,500 మణుగులు మాత్రమే ఉత్పత్తి అయింది.

## పోకచెక్కలు

ఇండియాలోని వ్యాపారపంటలలో ముఖ్యమైనవాటిలో పోకచెక్క (వక్క) ఒకటి. 1949 లో తీసిన లెక్కనుబట్టి, ఇండియాలో మొత్తం 2,88,400 ఎకరాలలో వక్కతోటలు వేయబడినవనీ, యీ తోటలలో ఏడాదికి 25 లక్షల టన్నుల వక్కలు పండుతవనీ అంచనా. దేశంలో వివిధ ప్రాంతాలలో ఎక్కడ ఎంతభూమిలో వక్కతోటలు వేయబడినదీ, యీ క్రింది పట్టీవలన తెలుస్తుంది.

| ప్రాంతం : | పంటవేసినభూమి ఎకరాలు | పంట (టన్నులు). |
|---|---|---|
| మలబార్ | 84,000 | 5,63,000 |
| తిరువాంకూర్ | 40,000 | |
| కొచ్చిన్ | 24,000 | |
| అస్సాం | 24,100 | |
| పశ్చిమ బెంగాల్ | 29,800 | |
| బొంబాయి | 19,400 | |
| మైసూర్ | 37,100 | |

| | |
|---|---|
| దక్షిణ కన్నడ | 19,000 |
| ఇతర ప్రాంతాలు | 10,600 |

దేశంలో పండినపంట ఉపయోగానికి చాలనందున, 1948-49లో విదేశాలనుంచి 10,67,000 మణుగుల వక్కలు ఇండియాకు దిగుమతి చేయబడినవి.

## వేరుశెనగ

ప్రపంచంలో వేరుశెనగ అత్యధికంగా పండే దేశాలలో ఇండియా ఒకటి. దీనిలో చాలాభాగం ఎగుమతి అవుతుంది. 1946-47 లో 1,02,97,000 ఎకరాలలోను, 1947-48 లో 99,74,000 ఎకరాలలోను వేరుశెనగ పంట వెయ్యబడింది.

1948 లో ఇండియాలో 34,42,000 టన్నుల వేరుశనగ పండింది. ఆ సంవత్సరంలో ప్రపంచంలో వేరుశనగ పంటపండే అన్ని దేశాలలోనూ ఇండియాదే ప్రథమస్థానం. ఆ సంవత్సరంలో ప్రపంచమంతటిలోనూ 1,10,65,000 టన్నుల వేరుశనగ పండింది.

1949 లో ఇండియాలో 30,73,000 టన్నులు, 1950 లో 33,79,000 టన్నులు, 1951 లో 33,31,000 టన్నులు వేరుశనగ పండింది.

## వనస్పతి నూనె

ఇండియాలో 1951 జూలై నాటికి, వనస్పతి నూనె తయారుచేసే ఫాక్టరీలు 47 వున్నాయి. ఇవి పూర్తిగా పనిచేస్తే, ఏడాదికి 3,30,228 టన్నుల వనస్పతి నూనెను తయారుచెయ్యగలవు. 1950 లో ఇండియాలో 1,71,600 టన్నుల వనస్పతి నూనె తయారుచేయడింది. దీని విలువ రు. 39,34,78,800. ఇండియాలో వనస్పతి ఫాక్టరీలలో పెట్టుబడిపెట్టిన డబ్బు దాదాపు రు. 22 కోట్లు.

## కాఫీ

కాఫీ మొట్టమొదట భరతఖండానికి మెక్కానుంచి 16 వ శతాబ్దంలో తీసుకురాబడిందని వదంతి. మొట్టమొదటి కాఫీతోట 1840 లో వెయ్యబడిందట. కాని, ఈ నూరు సంవత్సరాలలోనూ కాఫీ వాడుక, ముఖ్యంగా దక్షిణదేశంలో, విస్తారంగా ప్రబలింది. కాఫీ పంటకూడా

ఒరిస్సా రాష్ట్రంలో కొద్దిగాతప్ప, ముఖ్యంగా దక్షిణదేశంలోనే అవు తున్నది. ఇండియాలో పండే కాఫీలో నూటికి 40 వంతులు మైసూరు సంస్థానంలోనే పండుతున్నది.

1939-40 లో ఇండియాలో **1,82,938** ఎకరాలు కాఫీ పంటలో వుంటే, 1945-46 లో 2,14,824 ఎకరాలలో యీపంట వెయ్యబడింది, కాఫీ పంట వివరాలివి: 1945-17,720 టన్నులు; 1946: 20,527 టన్నులు; 1947: 18,150; 1948: 15,612; 1949: 15,584; 1950: 17,238 టన్నులు.

కాఫీ ఎగుమతుల వివరాలివి:

| సంవత్సరం | ఎగుమతి (టన్నులు) | విలువ |
|---|---|---|
| 1943-44 | 3000 | రు. 69 లక్షలు |
| 1944-45 | 1292 | రు. 25 లక్షలు |
| 1945-46 | 1937 | రు. 26 లక్షలు |

## పొగాకు

పొగాకు మొట్టమొదట ఇండియాకు పోర్చుగీసువారిచే తీసుకొని రాబడింది. ఇండియాకు ఎక్కువ ఆదాయంవచ్చే పంటలో యీనాడు అగ్రస్థానం పొగాకుదే.

పొగాకు ఉత్పత్తిలో, ప్రపంచంలోని అన్నిదేశాలలోను, యునైటెడ్ స్టేట్సు తరువాత అగ్రస్థానం ఇండియాదే. పొగాకు పెంపకం ఇండియాలో ప్రధానంగా అయిదుప్రాంతాలలో జరుగుతున్నది. ఉత్తర బెంగాల్, గుంటూరు—కృష్ణా, ఉత్తరబీహారు, గుజరాత్, బెల్గాం—సతారా ప్రాంతాలు.

ఉత్తమతరగతి పొగాకు ఇండియాలో ఏడాదికి 26,900 టన్నులు పండించబడుతున్నదని అంచనా.

1946-47 లో ఇండియాలో **5,15,269** ఎకరాలలో పొగాకు పంట వెయ్యబడింది. దీనిలో **2,74,744** ఎకరాలు మదరాసు రాష్ట్రం లోనే. దేశం మొత్తంలోపండిన 43,61,21,338 పౌనల పొగాకులో

21,43,27,086 పౌనులు మదరాసు రాష్ట్రంలోనే. మదరాసురాష్ట్రంలో అంటే, ప్రధానంగా గుంటూరు, కృష్ణా జిల్లాలలోనన్నమాట.

1950-51 లో మొత్తం దేశంలో 2,46,000 టన్నుల పొగాకు పండింది. పొగాకు పంటవేసిన భూమి 8,36,000 ఎకరాలు. 1951-52లో పొగాకు పంటవేసిన భూమి 7,43,000 ఎకరాలు.

## తోళ్లు

ప్రపంచంలోని అన్నిదేశాలకన్న ఎక్కువగా తోళు ఎగుమతి చేసేది, ఇండియా.

ఇండియాలో, ఏడాదికి సుమారు మూడుకోట్ల 92½ లక్షల తోళ్లు (మేకలవీ గొర్రెలవీ) దొరుకుతున్నాయనీ, వీటిలో దాదాపు రెండుకోట్ల 38 లక్షల తోళ్లు ఇండియాలోని ఫ్యాక్టరీలలో వూనబడుతున్నవనీ, సుమారు 160 లక్షల తోళ్లు వూనకుండానే విదేశాలకు ఎగుమతి చేయ బడుతున్నవనీ అంచనా.

తోళ్ళను వూనడానికి పెద్ద ఫాక్టరీలు కౌన్పూర్, ఆగ్రా, కలకత్తా, మదరాసు నగరాలలో వున్నాయి.

## తివాసీలు

తివ్వాసీలను నెయ్యడంలోను, తివాసీలు నేసేవున్ని నాణ్యము లోనూ ఇండియాకు ప్రపంచంలో అగ్రస్థానంవుంది. తివాసీల నేతకు ఉపయోగించే ఉన్ని ప్రపంచం అన్నిదేశాలలోను 1947-48 లో మొత్తం 18,50,00,000 పౌనులు లభించింది. దానిలో ఇండియాలో 5,50,00,000 పౌనులు లభించింది.

ఉన్ని నేతమీద ఆధారపడి జీవించేవారు ఇండియాలో దాదాపు 16,000 అని అంచనా.

## ర బ్బ రు

రబ్బరు ఉత్పత్తి పూర్తిగా దక్షిణదేశంలోనే జరుగుతున్నది. దీనిలో కూడా ముప్పాతికవంతులు, తిరువాంకూరు సంస్థానంలో జరుగుతున్నది. దీనిలో మొత్తం 1,22,251 ఎకరాల భూమిలో రబ్బరు తోటలు వేయబడినవి. మైసూరుసంస్థానంలో 639 ఎకరాలభూమిలో రబ్బరుతోటలు వేయబడినవి. తిరువాంకూరు కొచ్చిన్‌లోని రబ్బరు తోటలలో మొత్తం 50,000 మంది పనివారు పనిచేస్తున్నారు. మదరాసు రాష్ట్రంలో 27,777 ఎకరాలలో రబ్బరుతోటలు వున్నవి. కొచ్చిన్‌లో 13,749 ఎకరాలు.

ఇండియాలో 1949 లో 15,587 టన్నుల రబ్బరు ఉత్పత్తిఅయింది. (1944 లో 17,174 టన్నులు) ఇండియాలో ఉత్పత్తి అయే రబ్బరు, ప్రపంచంలో ఉత్పత్తి అయేదానిలో నూటికి ఒకవంతు మాత్రమే.

## స బ్బు ప రి శ్ర మ

ఇండియాలో ప్రస్తుతం 70 సబ్బుఫాక్టరీలు వున్నాయి. వీటిలో ఏడాదికి 1,90,000 టన్నుల సబ్బులు తయారుచేయబడుతున్నాయి. ఈ వుత్పత్తిని 2,44,000 టన్నుల వరకు పెంచాలని ప్రభుత్వ సంకల్పం. అయితే, సబ్బు ఫాక్టరీలను మాత్రం ఇంక ఎక్కువగా స్థాపించకూడదనీ, ప్రస్తుతం వున్నవాటిలోనే వుత్పత్తి ఎక్కువచెయ్యాలనీ ప్రభుత్వం నిశ్చయించారు.

## నౌ కా ని ర్మా ణ ం

రెండవ ప్రపంచయుద్ధానికి పూర్వం, ఇండియాలో నౌకానిర్మాణ పరిశ్రమ లేనేలేదు. యుద్ధకాలంలో ఇండియాలో నౌకానిర్మాణ పరిశ్రమ ప్రారంభించబడింది. అయిదేళ్ళలోపల, ఇండియాలో మొత్తం రెండులక్షల టన్నుల బరువు మొయ్యగల నావలు నిర్మింపబడినవి. కాని, అది భారతీయ పరిశ్రమగా పరిగణించడానికి వీలులేదు.

యుద్ధానంతరం, విశాఖపట్టణంలోని నౌకా నిర్మాణాశ్రయంలో భారతీయ యాజమాన్యాన నౌకానిర్మాణం ప్రారంభమైంది. సింధియా కంపెనీవారు 1947 లో ఇచ్చట నిర్మించిన 'జలఉష' అనే నౌకకు

ప్రథమ సముద్రయాన ఉత్సవం పండిట్ నెహ్రూ చేశారు. తరువాత నాలుగు నౌకలు నిర్మింపబడినవి. నౌకానిర్మాణంలో తమకు చాలా నష్టం వస్తుందని సింధియా కంపెనీ తెలియజేసినందున, గవర్నమెంటు యాజమాన్యంలో నౌకానిర్మాణం ప్రారంభమైంది. ఇలా నిర్మింపబడిన మొదటి నౌక 'జలపద్మ' కు ప్రారంభోత్సవం 1950 సెప్టెంబరు 14 న పరిశ్రమ శాఖామంత్రి హరకృష్ణ మెహతాబ్ జరిపారు. రెండవనౌక 'జలపుత్ర' కు ప్రారంభోత్సవాన్ని 1951 మార్చి 26 న రైల్వేమంత్రి ఎన్. గోపాలస్వామి అయ్యంగార్ జరిపారు.

నాల్గవ నౌక 'జలపుష్ప' కు ప్రారంభోత్సవాన్ని, నిర్మాణశాఖామంత్రి గాడ్గిల్ 1951 డిసెంబరు 15 న జరిపారు. సింధియా కంపెనీ వారు నౌకానిర్మాణాన్ని లాభసాటిగా నిర్వహించలేకపోయినందున, కొత్తగా రూ. 10 కోట్ల మూలధనంతో హిందుస్తాన్ షిప్‌యార్డ్ కంపెనీ స్థాపించబడింది. ఆ కంపెనీ, విశాఖపట్టణంలోని నౌకా-నిర్మాణాశ్రయాన్ని తన యాజమాన్యంలోకి 1952 మార్చి 1 న తీసుకుంది. ఆ కంపెనీ పెట్టుబడిలో రెండు వంతులు ఇండియా ప్రభుత్వానిది; ఒక వంతు సింధియా కంపెనీది.

1951 అంతానికి ఇండియాలోని కంపెనీల సొత్తుగా వున్న మొత్తం నౌకలు, 3,91,000 టన్నుల బరువు మొయ్యగలవి వున్నవి.

## పశుసంపద

ప్రపంచం అంతటాకలిసి మొత్తం 6,50,952 వేల గోపశువులు, 76,421 వేల మహిషపశువు వున్నాయని అంచనా. వీటిలో అత్యధిక సంఖ్య ఇండియాలో వున్నాయి. సరియైన లెఖ్ఖల ప్రకారం ఇండియాలో వున్నన్ని పశువులు, మరేదేశంలోనూ లేవు. అయినప్పటికీ, మనకు తగినంత పాలుగాని, తినేవారికి తగినంత మాంసంగాని లభించడంలేదు. దానికికారణం పశుపోషణ సరిగా లేకపోవడం.

ఇండియాలోని ఉత్తమజాతి ఆవులు, పంజాబ్, కథియవాడ్, మదరాసు (ఒంగోలు) రాష్ట్రాలలో వున్నాయి.

ముసలి పశువులూ, ఆహారం సరిగాలేక చిక్కి శల్యాలయిన పశువులూ ఎక్కువగా మనకు కనపడుతూ వుంటాయి. సరియైన ఆహారాన్ని వాటికిపెట్టి, కొత్తజాతి పశువులతో కలపడంవల్ల మిశ్రమజాతి పశువులు పుట్టేటట్లుచేసి పశుసంపదను సరిగా వుపయోగించుకుంటే, ప్రజలు ఎంతో ఆరోగ్యంగా వుండడానికి ఇండియాలో ఎంతో అవకాశం వున్నది.

1945 లో తీసిన లెక్కల ప్రకారం, ఇండియాలో పశుసంపద వివరాలివి.

| | | |
|---|---|---|
| గోపశువులు (ఆవులు, ఎద్దులు, పెయ్యలు) | | 13,63,73,000 |
| మహిషపశువులు (గేదెలు, దున్నలు, దూడలు) | | 40,61,80,000 |
| గొర్రెలు | — | 3,77,34,000 |
| మేకలు | — | 4,44,69,000 |

## పాడి

పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, వీటిని తియ్యడం, అమ్మడం, భరతఖండంలో యిప్పుడు గృహపరిశ్రమగానే వుంది. పశువులువున్న గ్రామీణ గృహస్థులు, పాడిని చాలావరకు అమ్ముకొనరు. కొంతమంది మాత్రమే అమ్ముతున్నారు. సరియైన పద్ధతిలో పాడిని వ్యాపారంలోకి తెచ్చినట్లయితే, గ్రామస్థులకు మంచి ఆదాయం రావడానికి అవకాశం వుంది. దీనికి, గ్రామాలనుంచి పట్టణాలకు మంచిరోడ్లు, బస్సు, లారీల సదుపాయం ఉండాలి. భరతఖండంలో ప్రజలు మామూలుగా మనిషికి అవసరమైనంతగా పాలు, పెరుగు, వెన్నలను తినడంలేదు. దానికి కారణం. పట్టణాలలో వీటి ఖరీదు ఎక్కువగా వుండటంలో పల్లెలలో బీదతరగతి వారికి వీటి ఉపయోగం తెలియకపోవడం; పశుపోషణ, రక్షణ సరియైన పద్ధతిలో జరిగిననాడు, ఎక్కువపాడి లభ్యమై ప్రజలందరూ వీటిని తినడానికి వీలుకలుగుతుంది.

# ఖనిజసంపద

ఖనిజసంపదలో ఇండియా ప్రపంచంలోని ఏ యితర దేశానికీ తీసిపోదు. అయితే, యీ సంపద భూగర్భంలో ఎక్కడెక్కడ వున్నదో పరిశోధన చెయ్యడంలోనూ, దానిని వెలువరించి ఉపయోగ లోకి తీసుకొనిరావడంలోనూ ఆధునిక పద్ధతులలో ఇటీవలివరకు తగినంత కృషి జరగలేదు. ఇప్పుడిప్పుడే యీ విషయములో కొంత కృషి జరుగుతోంది. ఖనిజసంపదను బాగా పైకితీసి, ఉపయోగంలోకి తేవడానికి ప్రభుత్వం వారు ఒక ప్రణాళికను తయారు చేశారు.

ఇండియాలో దొరికే ఖనిజాలలో ముఖ్యమైనవాటిని గురించిన వివరాలు యీ క్రింద యివ్వబడినవి.

## ఇనుము

ఇండియాలో దొరికినంత ఇనుము మరెదేశంలోను దొరకడం లేదనే చెప్పవచ్చును. భూమిలోనుంచి త్రవ్వితీసిన లోహాన్ని పనిముట్ల రూపంలోనూ, ఉక్కుగా తయారుచెయ్యడంలోనూ, ఇండియాలో పెద్ద పరిశ్రమ ఏర్పడింది.

ఇనుము యెక్కువగా బీహారు రాష్ట్రంలోనూ, ఒరిస్సా సంస్థానాలలోను దొరుకుతున్నది.

ఇండియాలో 1948 లో 8,54,000 టన్నులు, 1949 లో 9,33,000 టన్నులు, 1950 లో 9,83,000 టన్నులు, 1951 లో 10,40,000 టన్నులు ఉక్కు తయారుచేయబడింది. అయితే ఇది దేశీయ అవసరాలకు చాలలేదు. అంచేత విదేశాలనుంచి దిగుమతి చేసుకోవలసి వచ్చింది.

విదేశాలనుంచి ఉక్కు దిగుమతులు : 1948 : 2,18,000 టన్నులు; 1949 ; 3,87,000 టన్నులు, 1950 : 2,84,000 టన్నులు, 1951 : 1,60,000 టన్నులు.

1952 లో ఇండియాలో అన్ని అవసరాలకూ 50 లక్షల టన్నుల ఉక్కు కావలసి వుంటుందని అంచనా వెయ్యబడింది.

## రాక్షసి బొగ్గు

భూమిలోనుంచి త్రవ్వితీసే బొగ్గును, రాక్షసిబొగ్గు అనీ, నేలబొగ్గు అనీ అంటారు. ఈ బొగ్గును భారతఖండంలో ముఖ్యంగా, రైళ్లను నడప డానికీ, ఫాక్టరీలను పనిచేయించడానికి ఉపయోగిస్తున్నారు.

బొగ్గును నేలనుంచి త్రవ్వించడం, దానిని కావలసిన వారికి సప్లయిచేయడం, ఈదేశంలో పెద్దపరిశ్రమగా ఒకటిగా ఏర్పడింది.

ప్రస్తుతం ఇండియాలో 900 గనులనుంచి బొగుతీయబడుతున్నది. వీటిలో చాలావరకు బెంగాలు, బీహారు, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో వున్నాయి. ఈ పరిశ్రమలో సుమారు 3,20,000 మంది కార్మికులు పనిచేస్తున్నారు.

బొగ్గును అత్యధికంగా ఉత్పత్తిచేసే దేశాలవరుసలో ఇండియా యెనిమిదోస్థానాన్ని పొందుతుంది. ఈదేశపు ఖనిజసంపదలో ప్రధాన స్థానం బొగ్గుది.

దేశంలో ఉత్పత్తిఅయే బొగ్గులో నూటికి 72 పాళ్లు ఝరియా, రాణిగంజ్ బొగ్గుగనులలో దొరుకుతున్నది. వీటిలో మంచిరకపుబొగ్గు ఝరియా గనులలో దొరుకుతున్నది.

1948 లో ఇండియాలోని బొగుగనులలో మొత్తం 2,67,75,369 టన్నుల బొగ్గు త్రవ్వబడింది. 1949 లో 3,10,00,000 టన్నుల బొగ్గు త్రవ్వబడింది. 1951 లో 3,40,76,807 టన్నుల బొగ్గు త్రవ్వబడింది.

1948 లో 3,08,263 మందీ (55,971 స్త్రీలు) 1949 లో 3,18,354 (54,000 స్త్రీలు) మందీ కార్మికులు బొగుగనులలో పని చేశారు, వీరిలో గనులలోపల పనిచేసినవారు 1948 లో 1,38,523 మంది ; 1949 లో 1,49,542 మంది.

1949 లో బొగ్గుగనులలో మొత్తం 260 ప్రమాదాలు సంభవిం చాయి; వీటివల్ల మరణించిన వారి సంఖ్య, 238.

1950 లో 10,75,805 టన్నులు, 1951 లో 25,25,020 టన్నులుబొగ్గు విదేశాలకు ఎగుమతి చేయబడింది.

## సిమెంటు

సిమెంటును తయారుచెయ్యడానికి ఇండియాలో మొట్టమొదట 1904 లో మదరాసులో ఒక చిన్న ఫ్యాక్టరీ స్థాపింపబడింది. తరువాత క్రమంగా దేశంలో చాలా ఫ్యాక్టరీలు ఏర్పడి, ఉత్పత్తి చాలా ఎక్కువ అయి, ధరలు తగ్గిపోవడం జరిగింది. అప్పుడు సిమెంటు కంపెనీల యజమానులంతా, ఒక సంఘంగా ఏర్పడి, అందరూ నిర్ణీతపు వంతులలో సిమెంటును ఉత్పత్తిచేసి, ధరలు నిలబడేటట్టు చూడడానికి ప్రయత్నాలు చేశారు. సిమెంటు ఉపయోగాలను ప్రజలకు బోధించి, సిమెంటు అమ్మకం బాగా జరిగేటట్టు చూడడానికి సిమెంటు మార్కెటింగ్ కంపెనీ ఏర్పడింది. ప్రస్తుతం ఇండియాలో 22 సిమెంటు ఫ్యాక్టరీలు వున్నాయి. వీనిలో 5 మదరాసు రాష్ట్రంలో వున్నాయి.

1947 లో 14,41,335 టన్నులు, 1948 లో 15,52,907 టన్నులు, 1949 లో 21,02,425 టన్నులు, 1951 లో 31,30,000 టన్నులు సిమెంటు ఇండియాలో ఉత్పత్తి అయింది.

1951 ఏప్రిల్ 2 తేదీన గుజరాత్‌లో సేవాలియా అనే చోట, ఏడాదికి 2,00,000 టన్నుల సిమెంటు ఉత్పత్తిచేయగల ఫ్యాక్టరీ స్థాపింపబడింది.

## మెంగనీస్

ఇది ఉక్కును తయారుచెయ్యడానికీ, రసాయనద్రవ్యాలను, బ్యాటరీలను తయారు చెయ్యడానికి ఉపయోగించే ఖనిజం.

రష్యా తరువాత, ఇండియాలో దొరికినంతగా ఈ ఖనిజం ప్రస్తుతం మరేదేశంలోను దొరకడంలేదు. 1939 నుంచి 1943 వరకు సగటున ఏడాదికి 8,00,000 టన్నుల మెంగనీస్ ఇండియాలో త్రవ్వి తీశారు.

దీనిని మధ్యప్రదేశ్, బొంబాయి, బీహారు, మదరాసు, సాండూరు (సంస్థానం) మైసూరులలో ప్రస్తుతం యెక్కువగా త్రవ్వి తీస్తున్నారు. మొట్టమొదట యీ ఖనిజాన్ని ఈ దేశంలో విశాఖపట్టణం జిల్లాలో 1892 లో త్రవ్వడం ప్రారంభించారు. ఈ దేశంలో త్రవ్వేన మెంగనీసులో నూటికి 76 పాళ్లు మధ్యప్రదేశంలోనే దొరుకుతున్నది.

1948 లో 3½ లక్షల టన్నులూ, 1949 లో 6 లక్షల టన్నులూ మెంగనీసు విదేశాలకు ఎగుమతి చేయబడింది. 1950 లో ఏడులక్షల టన్నులు ఎగుమతి అయింది.

1949 లో ఎగుమతి అయిన మెంగనీసు మీద ఎగుమతి పన్ను రూపంలో ఇండియా ప్రభుత్వానికి రు. 70,75,097 ఆదాయం వచ్చింది.

## అభ్రకము

ఇండియాలో విస్తారంగా దొరికే ఖనిజములలో అభ్రకము ఒకటి ప్రపంచం మొత్తంలో దొరికే అభ్రకములో, ముప్పాతిక ఈ దేశంలో త్రవ్వితీసేదే. దీనిలో నూటికి 80 వంతులు బీహారులోనూ, 20 వంతులు మదరాసు రాష్ట్రంలోని నెల్లూరు జిల్లాలోను దొరుకుతున్నది. ఈ ఖనిజం, విద్యుచ్ఛక్తి పరిశ్రమకు చాలా ముఖ్యమైనది.

1946 లో యీ పరిశ్రమలో పనిచేసినవారి సంఖ్య : 32,527. 1948 లో 13,51,504 పౌనులు అభ్రకపు గడ్డలు, 2,24,25,872 పౌనులు అభ్రకపుతుంపులు, 1,46,47,808 పౌనులు అభ్రకపు చెత్త ఇండియానుంచి ఎగుమతి చేయబడినవి. ఎగుమతులు ఎక్కువగా, ఇంగ్లండు అమెరికాకు జరిగినవి. అమెరికాకు పంపబడిన అభ్రకపు విలువ 120, లక్షల డాలర్లు.

మదరాసు రాష్ట్రంలో మొత్తం 104 అభ్రకపు గనులు వున్నాయి, వీనిలో 1949-50 లో 3,443 టన్నుల అభ్రకను త్రవ్వబడింది.

దీనిలో 3,379 టన్నులు నెల్లూరుజిల్లాలోను, 64 టన్నులు నీలగిరి జిల్లాలోను త్రవ్వబడింది. అదే సంవత్సరంలో మదరాసు రాష్ట్రంనుంచి రు. 1,21,26,432 విలువగల అభ్రకపు తునకలు, రు. 25,88,496 విలువగల అభ్రకపు గడ్డలు ఎగుమతి చేయబడినవి. అభ్రకపు ఎగుమతులపై 1950 లో రాష్ట్రప్రభుత్వానికి వచ్చిన రాజభాగం రు. 82,000.

## బాక్సైట్

అల్యూమినియం తయారు చెయ్యడానికి కావలసిన ప్రధానలోహం బాక్సైట్. బాక్సైట్ను అల్యూమినియంగా తయారుచేసే యంత్రసామగ్రి

ఇండియాలో లేనందున, దానిని విదేశాలకు పంపి, అల్యూమినియంగా తయారుచేసిన తరువాత ఈ దేశానికి తెప్పించుకొని, దానిని పాత్రలుగా తయారు చెయ్యడం జరుగుతోంది. బాక్సైట్ ఈదేశంలో చాలా ఎక్కువగా దొరుకుతున్నది. ఇదిదొరికే ప్రదేశాలలో ముఖ్యమైనవి: బొంబాయి, మధ్యప్రదేశ్, బీహారు రాష్ట్రాలు.

1947 లో రు. 71,059 విలువగల 8,196 టన్నులు బాక్సైటు ఇండియాలో త్రవ్వబడింది. 1948 లో రు. 1,61,255 విలువగల 20,663 టన్నుల బాక్సైటు ఇండియాలో త్రవ్వబడింది.

ఇండియాలో ఏడాదికి 15,000 టన్నుల అల్యూమినియం కావాలి. ప్రస్తుతం ఉత్పత్తి, దాదాపు 3,700 టన్నులు మాత్రమే. మిగతాది కెనడానుంచి దిగుమతి చేయబడుతున్నది.

## రాగి

ఇండియాలో దొరికే రాగి ప్రపంచపు ఉత్పత్తిలో చాలాతక్కువ అని చెప్పవచ్చును. మదరాసు రాష్ట్రంలో, నెల్లూరుజిల్లాలో అతి స్వల్పంగా దొరుకుతున్నది.

1947 లో 3,23,035 టన్నుల రాగి త్రవ్వబడింది. దీనివిలువ రు. 60,35,118. ఈ పరిశ్రమలో పనిచేసినవారి సంఖ్య 3,961.

1948 లో 3,22,282 టన్నుల రాగి త్రవ్వబడింది. దీని విలువ రు. 80,44,332. ఈ పరిశ్రమలో పనిచేసినవారి సంఖ్య 3,636.

1951 లో 7083 టన్నుల రాగి త్రవ్వబడింది.

## బంగారం

ఇండియాలో దొరికే ఖనిజములలో మూడవ ప్రధానస్థానం బంగారానిది. ఎక్కువ విలువగల యీ ఖనిజం, దేశంలో దొరికే మొత్తంలో నూటికి 95 పాళ్లు మైసూరు సంస్థానంలోని కోలార్ గనులలో దొరుకుతున్నది.

1948 లో ఇండియాలో మొత్తం రు. 5,43,20,157 విలువగల 1,80,429 ఔన్సుల బంగారం త్రవ్వబడింది. దీనిలో 1,80,039 ఔన్సులు

మైసూరు రాష్ట్రంలోనూ, 384 ఔన్సులు హైదరాబాదులోనూ దొరికింది. 1948 లో యీ పరిశ్రమలో పనిచేసేవారి సంఖ్య, 23,981.

1950 లో 1,97,000 ఔన్సుల బంగారం దొరికింది.

## వెండి

1946 లో ఇండియాలో త్రవ్వితిసిన వెండివిలువ మొత్తం, 40,692 రూపాయలు. 1948 లో త్రవ్విన వెండి మొత్తం, 12,797 ఔన్సులు. దీని విలువ రు. 60,299.

## ఉప్పు

మానవశరీరానికి చాలా ముఖ్యమైన లవణము ఉప్పు. ఇది మూడు విధాలుగా దొరుకుతున్నది, సముద్రతీరములలో సముద్రపు నీరుకు కట్టలు కట్టి యెండబెట్టడంవల్లను, దేశ మధ్యభాగంలోవున్న ఉప్పునీటి సరస్సుల నీటిని ఎండబెట్టడంవల్లనూ, కొండలను త్రవ్వి తియ్యడంవల్లను. మామూలుగా ఉప్పువలె ఉపయోగించడానికేకాక, కొండఉప్పుకు ఔషధప్రయోజనాలుకూడా వున్నవి.

మదరాసురాష్ట్రంలో, ఉప్పు తయారుచేసే కొఠారులు మొత్తం 50 వున్నాయి. ఈ 50 కొఠారులలోను మొత్తం 65 ఉప్పు ఫ్యాక్టరీలు వున్నాయి. ఉప్పును తయారుచేసేటందుకు, సముద్రపునీరు పట్టేస్థలం మొత్తం 13,000 ఎకరాలు వుంటుంది, మదరాసురాష్ట్రంలో దాదాపు 130 లక్షల మణుగుల ఉప్పుతయారవుతోంది. దీనిలో నూటికి 15 వంతులు ఇతర రాష్ట్రాలకు పంపబడుతోంది. అయితే, రాష్ట్రంలో తయారయేఉప్పు రాష్ట్రంలోని వాడుకకు చాలనందున, ఏడాదికి దాదాపు 16 లక్షల మణుగుల ఉప్పును బొంబాయిరాష్ట్రంనుంచి మదరాసుకు దిగుమతి చేయవలసివస్తున్నది.

ఇండియాలో ఒక మనిషి, ఏడాదికి సగటున 18 పౌనులు ఉప్పు తింటాడని అంచనా. అమెరికాలో ఒకమనిషికి 205 పౌనుల ఉప్పు ఖర్చు అవుతుంది. ప్రపంచం అంతటిలోను సగటున, మనిషి 30 నుంచి 40పౌనులు తింటాడట.

1950 లో దేశంలో మొత్తం 7,13,00,000 మణుగులు ఉప్పు చెయ్యబడింది.

1951 లో ఇండియాలో 7,44,00,000 మణుగుల ఉప్పు తయారు చేయబడింది. ఇది దేశంలోని అన్ని అవసరాలకు సరిపోగా, కొంచెం మిగులుతుంది కూడా.

1952 లో ఉప్పు ఉత్పత్తి 76,00,00,000 టన్నులు వుంటుందని అంచనా.

దేశీయ అవసరాలకు 1950 లో ఇండియాకు 43,00,000 మణుగుల ఉప్పు దిగుమతి చెయ్యబడింది. 1951 లో దిగుమతి అవసరం లేక పోయింది.

## కిరసనాయిలు

కిరసనాయిలు కోసం మనము యెక్కువగా విదేశాలమీద ఆధారపడాలి. యుద్ధానికిపూర్వం, మనదేశంలో ఏడాదికి 7,00,000 టన్నుల కిరసనాయిలు వాడుక జరిగేది. యుద్ధకాలంలో మనదేశానికి దిగుమతులు చాలా తగ్గిపోయాయి. అందుచేత రేషనింగు చెయ్యవలసి వచ్చింది, 1950 లో ఈ రేషనింగు తీసివేయబడింది.

1948-49 లో ఇండియాకు 5,36,376 టన్నుల కిరసనాయిలు దిగుమతి చేయబడింది; 1949-50 లో 7,39,661 టన్నులు.

దిగుమతి కాక, మనదేశంలో 1948 లో 11,382 గాలనులు, 1949 లో 11,611 గాలనులు కిరసనాయిలు ఉత్పత్తి అయింది.

## పెట్రోలు

ఇది ఎక్కువగా అస్సాంరాష్ట్రంలోని దిగ్బాయ్‌వద్ద దొరుకుతోంది. మన దేశంలో దొరికే పెట్రోలు, ప్రపంచపు మొత్తపు ఉత్పత్తిలో నూటికి 0.6 వంతు మాత్రమే.

ఇండియాలో ఏడాదికి 6,59,69,000 గాలనుల పెట్రోలు లభిస్తుందని అంచనా. అయితే, దాదాపు 1,20,00,000 గాలనుల పెట్రోలు వాడకం అవుతుందని అంచనా.

1950 లో 19,37,50,000 గాలనుల పెట్రోలును ఇండియా దిగుమతి చేసుకున్నది.

# తూనిక కొలతలు

మనదేశంలో, వివిధ సాంప్రదాయాలుగల భాషా ప్రాంతాలు ఎక్కువగా వున్నందుననూ, మొదటినుంచీ దేశమంతటికీ ఒక కేంద్ర ప్రభుత్వం లేనందువల్లనూ, ఒక్కొక్క ప్రాంతం, ఒక్కొక్క పద్ధతిలో తూనిక కొలతలను వాడుకలోకి తెచ్చుకున్నది.

బ్రిటిషు ప్రభుత్వంవచ్చి, దేశానికి కేంద్ర ప్రభుత్వమంటూ ఒకటి ఏర్పడినతరువాత, దేశమంతటా వాడుకలోవుండే పద్ధతిలో, తూనిక రాళ్ళను, కొలమానికలను నిర్ణయించవలసిందని చాలా వర్గాలవారు కోరారు. ఒకేపద్ధతిలో తూనికలు, కొలతలు దేశమంతటా వాడుకలో లేనందువల్ల వ్యాపారస్తులకు చాలా యిబ్బందికలగడమే కాక, కొన్ని సందర్భాలలో పేచీలుకూడా వస్తూవుండేవి.

సరియైన తూనికలను, కొలతలను వాడుకలోకి తెచ్చే బాధ్యత ప్రభుత్వానిది. ఈవిషయంలో ఒక్క బొంబాయి ప్రభుత్వంవారు మాత్రం 1932 లో శాసనరూపంలో, రాష్ట్రమంతటా వాడుకలో వుండవలసిన తూనికలను, కొలమానికలను నిర్ణయించారు. మిగతా రాష్ట్రాల ప్రభుత్వాలు యీ విషయంలో శ్రద్ధచూపలేదు. కేంద్ర ప్రభుత్వంకూడా ఈ విషయంలో జోక్యం కలిగించుకోనలేదు.

అంచేత, దేశమంతటా వాడుకలోవున్న తూనికలు, కొలమానికలు యింకా ఏర్పడలేదు.

రైల్వేతూకం దేశమంతటా ఒకేపద్ధతిలో అమలులో వున్నప్పటికీ, ఏ ప్రాంతంలోవున్నవారు అనాదిగా ఆ ప్రాంతంలో వాడుకలోవున్న తూనికలనే యిప్పటికీ పాటిస్తున్నారు. దేశం అంతటాకూడా, కొలతకూ, తూకానికికూడా, శేరును అందరూ వాడుకచేస్తూ వున్నప్పటికీ ఆ శేరు బరువుగాని, కొలతగాని ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క విధంగా వుంది.

ఖరారుగా దేశమంతటా వాడుకలోకి తేవడానికి వీలుకలిగి, ప్రస్తుతం బొంబాయిరాష్ట్రంలో అమలులోవున్న తూకపుకొలతలు ఇవి:

| | |
|---|---|
| తులం | 180 గ్రైనులు |
| శేరు | 80 తులములు |
| మణుగు | 40 శేర్లు |

దేశమంతటా రైల్వేవారు వాడుకచేసే తూనిక:

| | |
|---|---|
| తులం | 180 గ్రైనులు |
| శేరు | 80 తులములు |
| మణుగు | 40 శేర్లు |

పొడవు, వెడల్పుల కొలతలలో, ఆంధ్రదేశంలో బెత్త, జాన, మూర అనేవి పల్లెటూళ్ళలో వాడుకలో కనపడుతూ వున్నప్పటికీ, ప్రధానంగా వీటిని ఎవరూ పాటించడంలేదు. ఈ విషయంలో దేశమంతటా వాడుకలోవున్న కొలతలు ఇవి.

| | |
|---|---|
| అంగుళం | సుమారు రెండువ్రేళ్ళ వెడల్పు |
| అడుగు | 12 అంగుళములు |
| గజం | 3 అడుగులు |
| ఫర్లాంగు | 220 గజములు |
| మైలు | 8 ఫర్లాంగులు |

తెలుగు జిల్లాలలో సాధారణంగా అర్ధగజాన్ని మూర అంటారు. రెండు బెత్తలు ఒక జాన; రెండు జానలు ఒక మూర. రెండు మైళ్ళ దూరాన్ని ఒక క్రోశెడు దూరం అనికూడా వాడుకచేస్తారు.

చదరపు కొలతలుకూడా ప్రస్తుతం దేశమంతటా అడుగులు. గజాలలోనే వాడుకలో వున్నాయి.

| | |
|---|---|
| 144 చదరపు అంగుళములు | ఒక చదరపు అడుగు |
| 9 చదరపు అడుగులు | ఒక చదరపు గజం |

అంటే ఒక గజము పొడవు, ఒక గజము వెడల్పుగల స్థలము ఒక చదరపు గజము అవుతుంది.

ఈ పద్ధతిలోనే, ఒక గజము పొడవు, ఒక గజము వెడల్పు, ఒక గజము ఎత్తుగల వస్తువుగాని, స్థలముగాని, ఘనపు గజము అని కొలత చేయబడుతుంది.

| | |
|---|---|
| ఘనపు గజము | 27 ఘనపు అడుగులు |
| ఘనపు అడుగు | 1728 ఘనపు అంగుళములు |
| ఘనపు అంగుళము | ఒక అంగుళము పొడవు, ఒక అంగుళము వెడల్పు, ఒక అంగుళము ఎత్తు |

ఎకరపు కొలత : దేశమంతటా, భూమికొలతను చదరంలో చెప్పేటప్పుడు ఎకరపు లెక్కలోనే చెపుతారు.

| | |
|---|---|
| 4,840 చదరపు గజములు | ఒక ఎకరం |
| 640 ఎకరములు | చదరపు మైలు. |

ఎకరంకన్న తక్కువవున్న పొలాన్ని సెంట్లలెక్కలో చెపుతారు. 100 సెంట్లు ఒక ఎకరం.

ప్రస్తుతం మన రాష్ట్రమంతటా చాలావరకు వాడుకలో వున్న తూనికలు.

| | |
|---|---|
| 24 తులములు | ఒక శేరు |
| 48 శేర్లు | ఒక మణుగు |

తెలుగు జిల్లాలలో ఎక్కువగా వాడుకలోవున్న తూనికలు:

| | |
|---|---|
| 3 తులములు | ఒక పలం |
| 8 పలములు | శేరు |
| 5 శేర్లు | వీశె |
| 8 వీశెలు | మణుగు |
| 20 మణుగులు | పుట్టి |

ధాన్యపు కొలతల విషయంలో, మన రాష్ట్రంలో వివిధ మానికలు వున్నాయి.

| | | | |
|---|---|---|---|
| గుంటూరు మానిక | దాదాపు | 42 | ఔన్సులు |
| కృష్ణాజిల్లా మానిక | ,, | 51 | ,, |
| నెల్లూరు మానిక | ,, | 72 | ,, |
| విశాఖపట్నం మానిక | ,, | 32 | ,, |

# వార్తాపత్రికలు

భరతఖండంలో మొట్టమొదటి వార్తాపత్రిక, కలకత్తాలో ఇంగ్లీషులో 1780 సంవత్సరములో స్థాపించబడినది. అప్పటినుంచి, యీ 172 సంవత్సరాలలోనూ, దేశంలో వార్తాపత్రికలు చాలా ఎక్కువగానే వెలువడ్డాయి. అన్ని రాష్ట్రాలలోనూ, అన్ని భాషలలోను దినపత్రికలు వున్నాయి. అంతేగాక, ప్రతిభాషారాష్ట్రానికి చెందిన పెట్టుబడిదారులూ, ఇంగ్లీషులోకూడా దినపత్రికలను చాలా ఎక్కువగా స్థాపించారు. మదరాసు రాష్ట్రంలోని కొన్ని ప్రధాన పత్రికలు ఇవి:

| ఇంగ్లీషు దినపత్రికలు : | సంపాదకులు |
|---|---|
| మెయిల్ | ఎ. ఎ. హేల్స్ |
| హిందు | కె. శ్రీనివాసన్ |
| ఇండియన్ ఎక్స్‌ప్రెస్ | రామనాథ గోయెంకా |

తెలుగు దినపత్రికలు :

| | |
|---|---|
| ఆంధ్రప్రభ | నార్ల వెంకటేశ్వరరావు |
| ఆంధ్రపత్రిక | శివలెంక శంభుప్రసాద్ |

తెలుగు వారపత్రికలు :

| | |
|---|---|
| ఆంధ్రపత్రిక | శివలెంక శంభుప్రసాద్ |
| ప్రజామిత్ర (బెజవాడ) | జి. రామకృష్ణశాస్త్రి |
| కృష్ణాపత్రిక | కాటూరి వెంకటేశ్వరరావు |
| జమీన్‌రైతు (నెల్లూరు) | ఎన్. వెంకటరామానాయుడు |
| చేనేత (నిడుబ్రోలు) | దామర్ల రమాకాంతరావు |
| తెలుగు స్వతంత్ర | ఖాసా సుబ్బారావు |
| జై భారత్ | న్యాయపతి రాఘవేంద్రరావు |
| కాంగ్రెస్ | వట్టికొండ రంగయ్య |

# కార్మికుల బలం

ఇండియాలోని వివిధ ఫాక్టరీలలో పనిచేసే కార్మికుల సంఖ్య ఇటీవల క్రమేపీ పెరుగుతూ వచ్చింది.

1948 లోను 1949 లోను ఇండియాలోని ఫాక్టరీలలోని కార్మికుల సంఖ్య ఎంత పెరిగినదీ, యీ క్రింది పట్టీవలన తెలుస్తుంది.

రోజుకు ఎంతమంది పనిచేసేదీ : సగటు లెఖ

| ఫాక్టరీ వివరము : | 1948 | 1949 |
|---|---|---|
| గవర్నమెంటు స్థానిక సంస్థల అధీనంలో వున్నవి | 23,60,201 | 24,33,988 |
| ఎప్పుడూ పనిచేసే ఇతర ఫాక్టరీలు | | |
| బట్టలమిల్లులు | 10,31,044 | 10,45,140 |
| ఇంజనీరింగ్ | 2,19,837 | 2,13,243 |
| లోహములు, ఖనిజములు | 1,01,013 | 1,08,505 |
| ఆహారము, సారాయి, పొగాకు | 3,16,039 | 3,44,828 |
| రంగులు, రసాయనిక ద్రవ్యములు | 1,12,7C0 | 1,19,851 |
| కాగితము, అచ్చు | 62,903 | 68,461 |
| కలప, రాయి, అద్దములు | 95,570 | 1,02,000 |
| గిన్నింగ్ మిల్లులు | 78,949 | 73,957 |
| తోళ్లు | 26,848 | 28,703 |
| ఇతర ఫాక్టరీలు | 35,724 | 41,545 |

ఫాక్టరీ చట్టం ప్రకారం ఇండియాలో రిజిష్టరు చేయబడిన ఫాక్టరీల సంఖ్య: 1947 లో 14,576; 1948 లో 15,906; 1949 లో 19,829

1949 లో పనిచేసిన ఫాక్టరీల మొత్తం 19,829లోను పనిచేసిన వారి సంఖ్య 24,33,988

మొత్తం ఫాక్టరీలలో, మదరాసు రాష్ట్రంలోనివి: 5,432. వీటిలో పనిచేసినవారి సంఖ్య 3,23,950.

## గనులలో పనిచేసే కార్మికులు

ఇండియాలోని వివిధ గనులలో 1947, 1948 సంవత్సరాలలో ఎంతమంది కార్మికులు పనిచేసినదీ యీ క్రింది పట్టినిబట్టి తెలుసుకోవచ్చును.

| గనులు | కార్మికుల సంఖ్య 1947 | 1948 |
|---|---|---|
| బొగ్గు | 3,21,537 | 3,08,263 |
| ఇనుము | 6,655 | 7,068 |
| రాగి | 3,961 | 3,628 |
| మెంగనీస్ | 15,092 | 16,068 |
| అభ్రకము | 31,656 | 31,490 |
| పెట్రోలు | 4,278 | 4,187 |
| ఇతరములు | 28,362 | 29,348 |
| మొత్తం | 4,11,541 | 4,00,052 |

ఇండియాలోని గనులసంఖ్య: 1947 లో 1976; 1948 లో 1897.

## ట్రేడ్ యూనియన్లు

ఇండియాలో 1948-49, 1949-50 లలో ఎన్ని కార్మికుల సంఘాలు వున్నదీ యీ క్రింది పట్టీవలన తెలుసుకోవచ్చును.

| సంవత్సరం | రిజిస్టరు చేయబడిన ట్రేడ్ యూనియన్ల సంఖ్య | లెఖలు చూపించిన ట్రేడ్ యూనియన్లు సంఖ్య | సభ్యులసంఖ్య |
|---|---|---|---|
| 1948-49 | 3,150 | 1,848 | 19,60,107 |
| 1949-50 | 3,865 | 1,920 | 18,21,132 |

## ప రి శ్ర మ ల వా రీ గా

1949-50 లో తమ యూనియనుకు లెఖలను చూపెట్టిన ట్రేడ్ యూనియనులు,--ఏ పరిశ్రమకు ఎన్నెన్ని వున్నదీ, వాటి సభ్యత్వము, యీ క్రింది పట్టీవలన తెలుస్తుంది.

| పరిశ్రమ | సంఖ్య | సభ్యులసంఖ్య |
|---|---|---|
| రైల్వేలు | 73 | 3,34,408 |
| ట్రాంవేలు | 5 | 10,857 |
| బట్టల మిల్లులు | 137 | 3,24,820 |
| అచ్చు ఆఫీసులు | 62 | 26,726 |
| నావికులు | 12 | 51,503 |
| రేవులలో పనివాళ్లు | 22 | 63,223 |
| వ్యవసాయము | 53 | 1,45,099 |
| మొత్తం | 1920 | 18,21,132 |

కార్మికులు సమ్మెకట్టినందున, ఒకొక సంవత్సరంలో ఒక కార్మికునకు ఒకరోజు చొప్పున, ఎన్నిరోజుల పని నష్టమైనదీ యీ క్రింది అంకెలవలన తెలుస్తుంది.

| | |
|---|---|
| 1947 | 1,65,62,666 |
| 1948 | 78,37,173 |
| 1949 | 66,00,594 |
| 1950 | 1,28,06,704 |

ఇండియాలోని కార్మికుల యూనియనులలో ప్రధానమైనవి నాలుగు. వాటి సభ్యత్వపు వివరాలు 1951 జనవరి 1 నాటికి యీ క్రింది విధంగా వున్నట్లు ప్రకటింపబడి వి. ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు: 15,14,082; దీనికి లోబడి పనిచేస్తున్న ట్రేడ్ యూనియన్ల సంఖ్య: 1,235. ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్: 7,06,194. దీనికి లోబడి పనిచేస్తున్న ట్రేడ్ యూనియన్లసంఖ్య: 729.

హింద్ మజ్దూర్ సభ : 6,88,650. యునైటెడ్ ట్రేడ్స్ యూనియన్ కాంగ్రెస్ : 3,72,631.

1949 లో పై నాలుగు యూనియనులకు ఉన్న సభ్యత్వము, గవర్నమెంటు తణిఖీ ప్రకారం తేలిన, వివరాలు ఇవి :

ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు : 9,18,237;
ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు : 3,02,538;
హింద్ మజ్దూర్ సభ : 3,70,304.
యునైటెడ్ ట్రేడ్స్ యూనియన్ కాంగ్రెసు : 1,20,623.

## మదరాసు రాష్ట్రంలో షాపు గుమాస్తాలు

1948-49 లో మదరాసు రాష్ట్రంలో, గుమాస్తాలను, పనివారిని పెట్టుకున్న షాపుల వివరాలు ఇవి :

| షాపులవివరం : | సంఖ్య : | పనివారి సంఖ్య |
|---|---|---|
| దుకాణాలు : | 1,83,717 | 1,82,529 |
| వ్యాపారపు ఆఫీసులు : | 7,652 | 40,181 |
| హోటళ్లు, సినీమాలు : | 20,335 | 70,847 |
| మొత్తం షాపులు | 2.11,704 | 2,93,557 |

ఫాక్టరీలలోను. షాపులలోను. పనిచేసేవారి సౌకర్యాలను గురించి, మదరాసురాష్ట్రంలో అమలులోవున్న చట్టాలనుబట్టి, యీ క్రింది ఏర్పాట్లు చేయబడినవి.

పనివారికి రోజుకు 8 గంటలకంటె పనివుండకూడదు. ఒక వారం చేసే పని 48 గంటలకు మించకూడదు.

నాలుగు గంటలు పనిచేసిన తరువాత, ఒకగంట విరామంవుండాలి.

ఓవర్ టైమ్ (అదనపుపని), ఏరోజైనా రెండుగంటలపైన చేయించడానికి వీలులేదు. ఒకవారంలో యీ ఓవర్ టైము ఆరుగంటలకు మించకూడదు.

ప్రతివారం, ఒకరోజు సెలవు ఇవ్వాలి.

సంవత్సరానికి 12 రోజులు సాధారణపు సెలవు;
12 రోజులు జబ్బు సెలవు:
12 రోజులు ప్రత్యేక సెలవు.

14 సంవత్సరాలకు లోబడిన బాలురకు పని ఇవ్వకూడదు. బాలురకు రోజుకు 7 గంటలకంటె ఎక్కువపని ఇవ్వకూడదు. వారిచేత ఉదయము 6 గంటలకు పూర్వంగాని, సాయంత్రం 7 గంటల తరువాత గాని పని చేయించకూడదు. బాలురచేత ఓవర్ టైమ్పని చేయించకూడదు.

# రిజర్వు బ్యాంక్

ఇండియా రిజర్వుబ్యాంక్, 1934 లో ప్యాసయిన రిజర్వుబ్యాంక్ ఆఫ్ ఇండియా ఆక్టుననుసరించి 1935 ఏప్రిల్ 1 తేదీన స్థాపించబడింది.

ఒకవాటా నూరేసి రూపాయలచొప్పున, మొత్తం అయిదుకోట్ల రూపాయల మూలధనంతో యీ బ్యాంకి స్థాపించబడింది. వాటాదార్లందరూకూడా, పూర్తిగా తమ వాటా మొత్తములను చెల్లించారు. ఈ వాటాలలో, 2,20,000 రూపాయల వాటాలను కేంద్రప్రభుత్వం కొన్నది. మిగతా వన్నీ ప్రత్యేక వ్యక్తులు కొన్నారు. ఈవాటాదార్లకు పంచిపెట్టే డివిడెండు నూటికి అయిదురూపాయలకు మించకూడదని నిబంధన చేయబడింది. అయితే బ్యాంకి ఖర్చులు మొదలైనవన్నీ పోగా డివిడెండ్ ఎంత యివ్వాలనేదీ కేంద్రప్రభుత్వం నిర్ణయిస్తారు. గత అయిదు సంవత్సరాలలోనూ, యీ బ్యాంకి వాటాదార్లకు, నూటికి 3½ రూపాయల డివిడెండు యివ్వబడినది.

ఈ బ్యాంకి పరిపాలనను సాగించడానికి, పరిశీలించడానికి ఒక సెంట్రల్ బోర్డు నియమింపబడుతుంది. దానిలో 16 మంది సభ్యులు. వీరిలో రిజర్వుబ్యాంక్ గవర్నరు ఒకరు, డిప్యూటి గవర్నరు ఒకరు, కేంద్రప్రభుత్వంచే నామినేట్ చేయబడిన డైరక్టర్లు నలుగురు, వాటాదార్ల తరఫున ఎన్నుకోబడిన డైరక్టర్లు ఎనిమిదిమంది, కేంద్రప్రభుత్వంచేత నామినేట్ చేయబడిన ప్రభుత్వోద్యోగి ఒకరు.

1935 ఏప్రిల్ 1 తేదిన, ఇది స్థాపించబడినప్పటినుంచీ, ఇండియాలో కరెన్సీనోట్లను జారీ చెయ్యడం, గవర్నమెంటు డబ్బునుదాచడం, మొదలైన పనులు యీ బ్యాంకికి అప్పగించబడినవి. 1935 జూలై 5 తేదిన, ఇండియాలోని షెడ్యూల్డు బ్యాంకులన్నీ తమ డిపాజిట్లను రిజర్వ్‌బ్యాంకిలోనే వెయ్యడం జరిగింది.

ఈ బ్యాంకికిగల ఇతర ఆఫీసులు రెండురకాలు. బ్యాంకింగుశాఖ; కరెన్సీ జారీచేసే శాఖ. బ్యాంకింగుశాఖ ఆఫీసులు ఢిల్లీ, బొంబాయి, కలకత్తా, మదరాసులలోను కరెన్సీ జారీచేసేశాఖ (ఇష్యూడిపార్టుమెంట్) ఆఫీసులు బొంబాయి, కలకత్తా, మదరాసు, కాన్పూరులలోను ఉన్నాయి. బ్యాంకింగుశాఖ బ్రాంచిఆఫీసు ఒకటి కాన్పూరులోకూడావుంది. రిజర్వ్ బ్యాంకి ఆఫీసులు లేనిస్థలాలలో; దీని పనినంతనూ ఇంపీరియల్ బ్యాంకి నిర్వహిస్తుంది.

ఇష్యూ డిపార్టుమెంట్ ద్వారా, ఇండియాలో చెలామణి అయే కరెన్సీనోట్లు అన్నీ యీ బ్యాంకి జారీచేస్తుంది. ఈ నోట్ల చెలామణికి కేంద్ర ప్రభుత్వం హామీ వుంటుంది. ప్రజలకు కావలసి నోట్లను, నాణెములను తగినంతగా చెలామణీలోకి తేవడానికి, యీ బ్యాంకి ఇష్యూ ఆఫీసులలో అన్ని విలువలలోను నోట్లున్నూ నాణెములున్నూ నిలువలో వుంచబడినవి.

ప్రధానంగా, రిజర్వ్‌బ్యాంకి ఇండియాకు కేంద్రబ్యాంకిఅని చెప్పవచ్చును. ఇది చేసేపనులు ఏమిటంటే: నోట్లను జారీచెయ్యడం; గవర్నమెంటుకు బ్యాంకరుగాను, డబ్బువిషయములలో ఏజెంటుగాను, సలహాదారుగాను పనిచెయ్యడం; ఇండియా తరఫున సంపాదించబడిన విదేశీయ కరెన్సీకి, విదేశాలల్లో ఇండియాకుగల డబ్బుకు ఒక కేంద్ర అవర్జాను తయారుచెయ్యడం; దేశంలోని అనేకబ్యాంకుల రిజర్వుధనాన్ని కాపాడడం, అవసరమైతే వాటికి అప్పు ఇవ్వడం.

రిజర్వ్‌బ్యాంకిని, ప్రైవేటు వ్యక్తుల ఖాతా ఆధిపత్యంలో నుంచి ప్రభుత్వ యాజమాన్యంలోకి తీసుకోవాలని (నేషనలైజ్ చెయ్యడం) ఇటీవల ప్రచారం చాలా ఎక్కువగా జరిగింది. ప్రజాభిప్రాయాన్ని అను

కరించి 1948 అంతంలో, యీ బ్యాంకిని నేషనలైజ్ చెయ్యడానికి చట్టాన్ని ప్యాసుచేశారు. 1949 జనవరి 1 నుంచి రిజర్వుబ్యాంకి, ప్రభుత్వ సంస్థగా, జాతీయమైపోయింది. దీనికి గవర్నర్: బి. రామారావు.

## ఇండియాలో బ్యాంకింగు వ్యాపారం

1949 లో ఇండియాలో జరిగిన బ్యాంకింగు వ్యాపారాన్నిగురించి రిజర్వుబ్యాంకి చేసిన నివేదికలోని వివరాలు ఇవి:

1949 అంతానికి ఇండియాలో 448 బ్యాంకీలు వున్నాయి. వీటిలో వాటాదార్లు పెట్టుబడిపెట్టిన మొత్తం రు. 89 కోట్లు. వీటిలో షెడ్యూల్డు బ్యాంకుల వాటాదార్ల పెట్టుబడి రు. 33 కోట్లు. షెడ్యూల్డు బ్యాంకుల రిజర్వు ఫండు మొత్తం రు. 24 కోట్లు; తక్కిన బ్యాంకుల రిజర్వుఫండు. రు. 2 కోట్లు.

యుద్ధకాలంలో బ్యాంకులలో ప్రజలు డబ్బు దాచుకోవడం బాగా పెరిగింది. ప్రజలు దాచుకున్న డబ్బు బ్యాంకులలో 1939 లో రు. 241 కోట్లువుంటే, 1948 జులై నాటికి రు. 1,117 కోట్లకు పెరిగింది. కాని, అప్పటినుంచీ బ్యాంకులలో దాచుకోబడిన డబ్బు క్రమేపీ తగ్గడం ఆరంభించింది. దానికి కారణాలు: 1. వ్యాపారం మందగించడం; 2. పన్నులు ఎక్కువకావడం; 3. దేశవిభజన; 4. విదేశీయులు తమ డబ్బును తమ దేశానికి మార్చుకోవడం; 5. సంస్థానాధీశుల ఆదాయాలు తగ్గడం. ఇవన్నిటివల్ల, 1949 డిసెంబరు 30 తేది నాటికి ఇండియాలోని బ్యాంకులలో ప్రజలు దాచుకొన్న డబ్బు రు. 844 కోట్లు మాత్రమేవుంది.

1949 అంతానికి దేశంలోని 448 బ్యాంకీలు, మొత్తం 3,490 బ్రాంచి ఆఫీసులను కలిగివున్నాయి.

## ఆంధ్ర బ్యాంకి

ఆంధ్రదేశంలో ఆంధ్రుల పెట్టుబడితో స్థాపింపబడిన మొట్టమొదటి బ్యాంకి ఇది. 1923 నవంబరు 28 నుంచీ ఈ బ్యాంకి పని చేస్తున్నది. 1952 ఏప్రిల్ నాటికి, ఈ బ్యాంకి డైరెక్టర్లు: శ్రీ రాజా యార్లగడ్డ శివరామ ప్రసాద్ బహాదూర్ (చైర్మన్); శ్రీ కె. సుబ్బారావునాయుడు; డిప్యూటీ చైర్మన్; శ్రీ తాడేపల్లి శ్రీరాములు, మేనేజింగ్

డైరెక్టర్; శ్రీ పి. పార్థసారథినాయుడు; శ్రీజె. మాణిక్యాలరావు; శ్రీ పి. శోభనాద్రి; శ్రీ డి. విశ్వేశ్వరరావు; శ్రీ కె. సుబ్రహ్మణ్య దత్; శ్రీ ఎం. సుదర్శనం; శ్రీ ఎం. శేషగిరిరావు; శ్రీ ఆర్. సత్యనారాయణమూర్తి; శ్రీ డి. సూర్యారావు, డైరెక్టర్లు.

ఈ బ్యాంకి 1951 సంవత్సరంలో రు. 4,46,294 నికర లాభం సంపాదించింది. జనరల్ మేనేజర్ : శ్రీ ఏలేశ్వరపు రామచంద్రమూర్తి.

## జాతీయ ఆదాయం

1948-49 లో ఇండియాలో జాతీయాదాయాన్ని గురించి ప్రత్యేక కమిటీవారు చేసిన పరిశోధన ఫలితంగా, ఇండియాలో ప్రజల సగటు ఆదాయం, 1948-49 లో తలకు రు. 255 అని తేలింది.

# నాణెములు : చెలామణి

మన దేశంలో కంపెని ప్రభుత్వం, టంకశాలను ఏర్పరచి నాణెములను తయారుచెయ్యడం 1757 లో జరిగింది. ఇలా తయారుచెయ్యబడిన మొట్టమొదటి రూపాయి 1757 ఆగస్టు 29 న పోతపొయ్యబడింది. అప్పటినుంచీ నాణెములపోత మన దేశంలో విరివిగా జరుగుతున్నది. అత్యంత ఆధునికమైన పరికరాలతో ఒక కొత్త టంకశాల కలకత్తావద్ద ఆలిపూర్ లో 1952 మార్చి 19 న ప్రారంభించబడింది. దీనిలో రోజుకు, 8 గంటలలో 12 లక్షల నాణెములు తయారవుతాయి.

ప్రస్తుతము ఇండియాలో డబ్బు వ్యవహారానికి ప్రధాన నాణెము రూపాయి. రూపాయి నాణెరూపములోను, నోటురూపములోనూ చెలామణీలో వున్నది. రూపాయిని మించిన విలువగల నాణెము ఏమీ చెలామణీలోలేదు.

ఇండియాలో వాడుకలోవున్న నాణెములు: రూపాయి; అర్థ రూపాయి; పావలా (రూపాయిలో నాల్గవవంతు); బేడ (రూపాయిలో ఎనిమిదవ వంతు); అణా (రూపాయలో పదహారవవంతు); అర్ధణా

(రూపాయిలో 32 వంతు); కాని (రూపాయిలో 64 వంతు); దమ్మిడీ (రూపాయిలో 192 వ వంతు).

మదరాసు రాష్ట్రంలో వాడుకలో లేనప్పటికీ, ఒరిస్సా మొదలైన కొన్ని రాష్ట్రాలలో అర్ధకాని నాణెంకూడా వాడుకలో వుంది.

గవర్నమెంటు తరఫున రిజర్వు బ్యాంకువారు చెలామణీలోకి తెచ్చిన 1, 2, 5, 10, 50, 100, 1000, 10,000 రూపాయలనోట్లు వుండేవి. కాని, 1945 జనవరి 13 తేదీన కేంద్రప్రభుత్వంవారు ఒక ఆర్డినెన్సు ప్రకటించి, 500, 1000, 10,000 రూపాయల నోట్లను రద్దు చేశారు.

ఇలా చెయ్యడానికి ప్రభుత్వంవారు చెప్పిన కారణం ఏమిటంటే: చాలమంది వ్యక్తులు యుద్ధకాలంలో చేసిన వ్యాపారంలో, సరకులను వాటి అసలు ఖరీదులకన్నచాల ఎక్కువ లాభాలకు అమ్మి ఆ లాభపు సొమ్మును తమ పద్దులలో కనపరచకుండా, వెయ్యిరూపాయలనోట్ల రూపంలో దాచిపెట్టుకున్నారు. అందువల్ల, వారివద్దనుంచి, ఆ లాభాల మీదకూడా ఇన్కంటాక్సు వసూలు చెయ్యడానికి వీలులేకపోయింది. ఈ ఆర్డినెన్సువల్ల, ప్రతివ్యక్తీకూడా తనదగ్గరవున్న పెద్దనోట్లను బ్యాంకికి తీసుకొని వెళ్ళి, ఆ నోటు తనకు ఎలావచ్చిందో వివరాలన్నీ చెపితేగాని, దానికి చిల్లర యివ్వరు. అలా చెప్పడంలో, ఆ వ్యక్తి ఇన్కంటాక్సు ఆఫీసర్లకు దొరికిపోతాడు, బ్యాంకికివెళ్ళి, ప్రభుత్వం నిర్ణయించిన గడువు, సుమారు ఒక నెల, లోపల ఆ నోట్లను మార్చుకోకపోతే, ఆ నోటు ఎందుకూ పనికిరాదు.

ఈ ఆర్డినెన్సువల్ల కలిగిన ఫలితం ఏమిటంటే—చాటుగా అన్యాయపు ధరలకు వస్తువులను అమ్మి డబ్బు కూడబెట్టినవారు కొందరు నష్టపడడం: లంచాలు తీసుకొని, ఆ డబ్బును బ్యాంకులలో వేసుకుంటే దొరికిపోతామేమోనని, వెయ్యిరూపాయల నోట్లరూపంగా డబ్బు దాచుకున్న లంచగొండి వుద్యోగులెవరైనా వుంటేవారు తమ అన్యాయార్జిత విత్తాన్ని కోల్పోవడం.

ఇదివరకు, రూపాయి, అర్ధరూపాయి, పావలా నాణెములు వెండివి చెలామణీలో వుండేవి. యుద్ధకాలంలో తక్కువ వెండితోను, ఎక్కువ నికెల్‌తోను, యీ నాణెములు తయారుచేశారు. కాని, 1946 మే 23 న కేంద్ర ప్రభుత్వంవారు, యికముందు కేవలం నికెల్‌తోనే అర్ధరూపాయలను, పావలాలను తయారు చెయ్యడానికి నిర్ణయించారు.

1952 మే మాసంలో ఇండియాలో చెలామణీలోవున్న నోట్ల విలువ; 1148,48,96,000 రూపాయలు. చెలామణీలోవున్న రూపాయి నాణెములవిలువ, 75,04,62,000.

1949 సెప్టెంబర్ 19 న ఇండియా ప్రభుత్వం, రూపాయి మారకపు రేటును తగ్గించారు.

ప్రపంచంలోని ముఖ్యదేశాలలోని ప్రధాననాణెములు, వాటికి రూపాయి మారకపురేటు వివరాలు యీక్రింద ఇవ్వబడినవి;

| దేశం | నాణెము | మారకంలో రూపాయిలు |
|---|---|---|
| యునైటెడ్ స్టేట్స్ | డాలరు | 4.78 |
| కెనడా | డాలరు | 4.81 |
| బ్రజిల్ | క్రూజిరో | 1.709 |
| బెల్జియం | ఫ్రాంక్ | 0.705 |
| ఫ్రాన్సు | ఫ్రాంకు | 0.078 |
| ఇటలీ | లీరా | 0.006 |
| హాలెండ్ | గిల్డర్ | 1.247 |
| ఇంగ్లండ్ | పౌను | 13.333 |
| జర్మనీ | మార్కు | 0.333 |
| ఈజిప్టు | పౌను | 13.674 |
| జపాను | ఎన్ | 0.222 |
| సిలోన్ | రూపాయి | 1.03 |
| ఆఫ్ఘనిస్తాన్ | రూపాయి | 0.253 |
| ఆస్ట్రేలియా | పౌను | 10.667 |
| పర్షియా | రియల్ | 0.103 |

# ఇన్‌కంటాక్స్

1951 ఫిబ్రవరి 28 తేదీన ప్రతిపాదింపబడిన ఆర్థిక శాసనం ప్రకారం, యీ క్రింద ఉదహరింపబడిన రేట్లలో, ఇన్‌కంటాక్స్ (ఆదాయపు పన్ను) వసూలుచేయబడుతుంది. ఈ పన్నురేట్లు 1951 ఏప్రిల్ 1 నుంచి 1952 మార్చి 31 వరకు వచ్చిన ఆదాయంమీద వసూలుచేసే పన్నురేట్లు.

మొత్తం ఆదాయంలో—

(1) మొదటి రు. 1,500 ల మీద — పన్నులేదు

(2) తరువాతి రు. 3,500 ల మీద — రూపాయికి ముక్కాని

(3) తరువాతి రు. 5,000 ల మీద — రూపాయికి ఏడుకానులు

(4) తరువాతి రు. 5,000 ల మీద — రూపాయికి రెండణాలు.

(5) తరువాతి మొత్తంమీద — రూపాయికి 3 అణాలు.

అయితే ఎవరిసంపాదన అయినా సంవత్సరానికి రు. 3,600 లకు మించనట్లయితే, వారు పన్ను చెల్లించ నక్కరలేదు.

రు. 3,600 లకి పైగా ఆదాయం వచ్చేవారు, రు 3,600 లకు పైన తమకు ఎంత ఆదాయం వస్తుందో దానిలో సగాన్ని మించిన పన్నును ఎప్పుడూ కట్టనక్కరలేదు.

ప్రతివ్యక్తికీ, అతని సంపాదనలో అయిదవ వంతు, నాలుగువేలకు మించకుండా 'ఎరన్డ్ ఇన్‌కం' క్రింద, పన్నునుండి మినహాయించడానికి గాను, మొత్తం ఆదాయంలోనుంచి తీసివేయబడుతుంది.

హిందూ అవిభక్త కుటుంబం మొత్తం ఆదాయం ఏడాదికి రు. 7,200 మించినట్లయితే, ఆ కుటుంబంకూడా పన్నుకట్ట నక్కరలేదు. రు. 14,000 పైబడిన ఆదాయం కలవారు నూటికి రు. 5. సర్‌చార్జి యిచ్చుకోవాలి.

ఇదికాక, ఎక్కువ ఆదాయం వచ్చినవారు సూపర్‌టాక్స్ మొదలైనవి కూడా యిచ్చుకోవాలి.

1952-53 లో కూడా ఇదే రేటులో పన్నులు ఇచ్చుకోవాలి.

## రాష్ట్రాలకు పంపిణీ

దేశం అంతటా ఇన్‌కంటాక్సు వసూలు చెయ్యడానికి కేంద్ర ప్రభుత్వం నియమించిన అధికారులే వుంటారు. ఇలా వసూలైన మొత్తంలో సగభాగం కేంద్రప్రభుత్వం తీసుకుంటుంది. మిగతా సగభాగాన్ని వివిధ రాష్ట్రాలకు వంతులవారిగా, ఆయారాష్ట్రాలలో వసూలయే మొత్తాన్ని దృష్టిలో వుంచుకొని, పంచుతారు. దేశవిభజన తరువాత రాష్ట్రాలకు పంపిణిచెయ్యడంలో అంతకు పూర్వపద్ధతిని మార్చవలసిన అగత్యం ఏర్పడింది. కొత్త పంపిణీ ఎలాజరగాలనే విషయాన్ని గురించి ప్రభుత్వానికి సలహా యివ్వడానికి శ్రీ చింతామణి దేశముఖ్‌ను కేంద్రప్రభుత్వం నియమించింది. ఆయన తన నిర్ణయాన్ని 1950 ఫిబ్రవరి 1 వ తేదీన ప్రకటించారు. ఈ నిర్ణయం 1953 మార్చి వరకు అమలులో వుంటుంది. దీని ప్రకారం, రాష్ట్రాలకు పంపిణీచేసే మొత్తం నూరు భాగాలు చేయబడి, వివిధరాష్ట్రాలకు యీ క్రింద వివరింపబడినన్ని భాగాలు ఇవ్వబడుతవి.

అస్సాం, 3; ఉత్తరప్రదేశ్, 18; ఒరిస్సా, 3; పంజాబ్, 5.5; పశ్చిమ బెంగాల్, 13.5, బీహార్, 12.5; బొంబాయి, 21; మదరాసు 17.5; మధ్యప్రదేశ్, 6.

చింతామణి సలహాలు 1953 వరకే అమలులో వుంటాయి కాబట్టి, 1953 నుంచీ దేశంలో కేంద్రప్రభుత్వ ఆధ్వర్యంలో వసూలు చేయబడే పన్నులలో రాష్ట్రాలకు ఎంతెంత భాగాలు ఇవ్వవలసినదీ, కేంద్రప్రభుత్వ మూలనిధిలోనుంచి రాష్ట్రాలకు మంజూరుచేసే గ్రాంటులు ఏఏ నియమాలపై జరగాలో ప్రెసిడెంటుకు సలహా ఇవ్వడానికి, ఒక ప్రత్యేక సలహా సంఘం, ఫైనాన్సు కమిషన్, 1951 నవంబరు 1 న నియమింపబడింది. దీనికి అధ్యక్షుడు సి. డి. దేశ్‌ముఖ్; సభ్యులు: వి. పి. మీనన్, జస్టిస్ ఆర్. కొసలేంద్రరావు; బి. కె. మదన్; ఎం. వి. రంగాచారి.

# నేషనల్ సేవింగ్సు

ప్రతివ్యక్తీ తాను సంపాదించేదానిలో కొంతడబ్బు, ముందు అవసరానికిగాని, వృద్ధాప్యానికిగాని దాచుకోడం అలవాటు చేసుకోవాలి. అలా దాచుకున్న డబ్బును, అది వృద్ధిపొందే పద్ధతిలో, అసలుకి నష్టం రాకుండా పెట్టుబడిగా వినియోగించడం, జాగ్రత్తగలవారు చెయ్యవలసినపని. అలా పెట్టుబడి పెట్టడం మూడువిధాలు. మంచి పద్ధతులమీద నడుపబడుతున్న బ్యాంకిలలో దాచుకోవడం; ఇన్సూరెన్సు చెయ్యడం; నేషనల్ సేవింగు సర్టిఫికెట్లు కొనడం. బ్యాంకిలలో డబ్బు దాచుకోవడం విషయమై వివరాలను, ఏ బ్యాంకి మేనేజరును అడిగినా చెపుతాడు. ఇన్సూరెన్సు వివరాలను, ఏ యిన్సూరెన్సు ఏజెంటును అడిగినా చెపుతాడు. నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్ల వివరాలు ఇవి:

నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు కొనడం అంటే, డబ్బును గవర్నమెంటువద్ద దాచుకోవడం అన్నమాట. ఇలా దాచుకున్న డబ్బుకు అయిదేళ్ళు దాచుకుంటే నూటికి ఏడాదికి మూడురూపాయల వంతున. ఏడేళ్ళు దాచుకుంటే నూటికి ఏడాదికి మూడున్నరరూపాయల వంతున 12 సంవత్సరాలకు నూటికి ఏడాదికి $1\frac{1}{2}$ వంతున వడ్డీయిస్తారు. అయితే యీ సర్టిఫికెట్లను ఎన్ని సంవత్సరాల గడువుకు కొంటే అన్ని సంవత్సరాలూ అలాగే వుంచనక్కరలేదు. అవసరం కలిగినట్లయితే, గడువు లోపలనే వాటిని మార్చుకోవచ్చును. అప్పటివరకు అయిన వడ్డీతో సహా తమ డబ్బు తాము తీసుకోవచ్చును.

ఈ సర్టిఫికెట్లు రు. 5; 10; 1,000; 5,000 విలువలలో, సేవింగ్సు బ్యాంకిగల ఏ పోస్టాఫీసులోనైనా దొరుకుతవి.

ఒక వ్యక్తి తన పేరుమీద, 2,500 రూపాయల విలువగల సర్టిఫికెట్లను కొనవచ్చును. ఈ సర్టిఫికెట్లమీద కూడే వడ్డీమీద ఇన్కంటాక్సులేదు.

1943 నుంచి 1950 డిసెంబరువరకు దేశంలో రు. 128 కోట్ల విలువగల నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు అమ్మబడినవి.

# ఇన్సూరెన్సు

ప్రతీవ్యక్తీ కూడా, తన జీవితానికి కొంత విలువకట్టుకోడానికీ, వృద్ధాప్యానికి కొంతడబ్బు దాచుకోడానికీ ఉత్తమమైన మార్గం ఇన్సూరెన్సు. ఏవో కొన్ని సంవత్సరాలకు, ప్రతిసంవత్సరమూ, (మూడేసి, ఆరేసి నెలల కొకసారి వాయిదాలలో) ఒక కొంతసొమ్మును కట్టడానికీ, నియమిత సంవత్సరాల తరువాత, తన సొమ్మును తిరిగి పుచ్చుకోవడానికీ చేసుకునే ఏర్పాటు—ఇన్సూరెన్సు. నియమిత సంవత్సరాలలోపున, ఆ వ్యక్తి చనిపోయినట్లయితే, అసలు ఎంత మొత్తంకొరకు అతడు ఏడాది కొకసారి కొంత సొమ్మును కట్టుకుంటున్నాడో, అంత మొత్తాన్నీ, ఇన్సూరెన్సు కంపెనీవారు ఆ వ్యక్తి కుటుంబానికి, ఆ వ్యక్తి కట్టిన డబ్బు ఎంత తక్కువైనా సరే, చెల్లిస్తారు. ముఖ్యమైన షరతు ఏమిటంటే, మూడు నెలలకో, ఆరు నెలలకో, ఏడాదికో ఎంతడబ్బు కడతానని ఒప్పుకున్నాడో, అంతాకూడా, ఒక్కసారికూడా తప్పకుండా, ఆ వ్యక్తి ప్రతి వాయిదాకూ కట్టితీరాలి.

తెలుగువారిలో చాలామందికి, చదువుకున్న వారికికూడావున్న ఒక దురభిప్రాయం ఏమిటంటే, ఇన్సూరెన్సు కట్టడం అంటే చనిపోయిన తరువాత తన కుటుంబంకోసం, డబ్బుకట్టడమని. అది పొరపాటు. ఇన్సూరెన్సు చేసినవ్యక్తి, నియమిత సంవత్సరాలలో, కాలకర్మంవల్ల చనిపోతే ఆ డబ్బు కుటుంబానికి చెందుతుందికాని, లేకపోతే అతనే అందుకుని వృద్ధాప్యంలో సుఖంగావుంటాడు. ఇన్సూరెన్సుకు సంబంధించిన వివరాలన్నీ ఏ ఇన్సూరెన్సు ఏజెంటును అడిగినా చెప్తాడు. కాని ప్రతివారూ గమనించవలసిన ముఖ్యాంశాలు ఏమిటంటే:

తన జీవితంమీద ఎంతోకొంత విలువవుండడంకోసం, తన శక్తిని బట్టి, కనీసం వెయ్యిరూపాయలకైనా ఇన్సూరు చెయ్యాలి.

తాను ఇన్సూరుచేసే కంపెనీ సమర్థంగా నడుపబడుతున్నదో లేదో విచారించి మరీ ఆ కంపెనీలో ఇన్సూరు చెయ్యాలి.

వీలైనంతవరకూ మనదేశంలో, తనకు సమీపంలోవున్న కంపెనీలోనే ఇన్సూరు చెయ్యాలి.

అలవాటు తప్పకుండా నియమిత కాలానికి, తాను చెల్లించవలసిన డబ్బును చెల్లించాలి.

ఇన్సూరు చేసిన వెంటనే, తన వయస్సును గురించిన దాఖలాను కంపెనీకి పంపి, ఆ విషయంలో సందేహంలేకుండా చూసుకోవాలి.

కర్మంచాలక తాను, పరిమిత కాలంలో చనిపోయినట్టయితే, తన ఇన్సూరెన్సు డబ్బును తన కుటుంబంలో ఎవరికియియ్యాలో కంపెనీవారికి ముందుగానే తెలియపరచుకోవాలి.

ప్రతివ్యక్తీ, తన సంపాదనలో ఆరవవంతును ఇన్సూరెన్సు ప్రీమియం క్రింద ప్రతిఏడాదీ కట్టవచ్చును. ఇలా కట్టిన డబ్బుమీద, రాబడి పన్ను లేదు.

1951 అక్టోబరు 7 తేదీనాటికి, ఇండియాలో 334 కంపెనీలు ఇన్సూరెన్సు వ్యాపారం చేస్తున్నవి: వీటిలో 230 మనదేశంలో స్థాపించబడినవి. 104 విదేశీవి.

మనదేశపు కంపెనీలు 230 లోనూ, 127 కంపెనీలు జీవిత భీమా వ్యాపారం చేస్తున్నవి. 49 కంపెనీలు, జీవితభీమా, ఇతర భీమాలుకూడా చేస్తున్నవి. 54 కేవలం ఇతర భీమాలనే (మనుష్యుల జీవితానికి సంబంధించనివి) చేస్తున్నవి.

1950 లో మనదేశపు ఇన్సూరెన్సు కంపెనీలు, సుమారు 4,79,000 పాలసీలమీద, 1,18,38,00,000 రూపాయల విలువగల ఇన్సూరెన్సును చేసినవి. ఈ పాలసీలమీద, ఏడాదికి 6,46,00,000 రూపాయలు ప్రీమియం క్రింద కట్టబడుతుంది.

ఇదే సంవత్సరంలో, విదేశకంపెనీలు మనదేశంలో 19,000 పాలసీలమీద 13,70,00,000 రూపాయలకు ఇన్సూరుచేశాయి.

1950 సంవత్సరాంతానికి, మనదేశంలో ఇన్సూ చేసినవారెన్నుచు తీసుకున్న పాలసీల సంఖ్య : 32,80,000 వీటివిలువ, 744,65,00,000

రూపాయలు. వీటిలో విదేశీ కంపెనీల పాలసీలు: 2,31,000 వీటి విలువ : 108,84,00,000 రూపాయలు.

(ఒకేవ్యక్తి రెండు మూడు పాలసీలుకూడా తీసుకోవచ్చును)

ఇన్సూరెన్సు ఏజెంట్లసంఖ్య 1943 నుంచి 1950 వరకు చాలా పెరిగింది. కాని 1948 లో తగ్గింది. ఆ వివరాలు యీ క్రింది అంకెలను బట్టి తెలుసుకోవచ్చును.

| సంవత్సరం | ఏజెంట్ల సంఖ్య |
|---|---|
| 1943 | 65,921 |
| 1944 | 89,902 |
| 1945 | 1,22,926 |
| 1946 | 1,56,992 |
| 1947 | 1,74,169 |
| 1948 | 1,70,016 |
| 1949 | 1,80,737 |
| 1950 | 1,72,936 |

1950 లో లైసెన్సులు తీసుకున్న 1,72,936 మంది ఇన్సూరెన్సు ఏజెంట్లలో 1,01,322 మంది అంతకుపూర్వపు సంవత్సరం ఏజెంట్లుగా పనిచేసినవారు! 71,614 మంది కొత్తవారు. అంటే 1949 లో ఏజెంట్లుగా పనిచేసిన వారిలో 79,415 మంది ఏజెంట్లుగా మళ్లీ లైసెన్సులు తీసుకోలేదన్నమాట.

1950 లో లైసెన్సుపొందిన 1,72,936 మందిలోను 31,500 మంది స్త్రీలు.

1950 నుంచి ప్రతిఏడాదికీ లైసెన్సులకు ఫీజుకట్టే పద్ధతి తొలగించబడి, మూడేళ్ల కొకసారి రు. 5 ఫీజుకట్టే పద్ధతి అమలు జరుపబడింది.

## ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ :

మన రాష్ట్రంలో స్థాపించబడి అభివృద్ధికి వచ్చిన ఇన్సూరెన్సు కంపెనీలలో ముఖ్యమైనవాటిలో ఒకటి.

1925 లో మచిలీపట్టణంలో స్థాపింపబడినది. క్రమేపీ చాలా అభివృద్ధిలోకి వచ్చింది. నేడు భారతదేశములోని పెద్ద ఇన్స్యూరెన్సు కంపెనీలలో ఇదిఒకటి. సెక్రిటరీ, శ్రీ ధూర్జటి సుబ్రహ్మణ్యం; మేనేజింగ్-డైరెక్టర్, శ్రీ పిళ్ళారిసెట్టి పార్థసారధినాయుడు; 1951 లో ఈకంపెనీ రు. 2 కోట్ల 15 లక్షల రూపాయల వ్యాపారం చేసింది. 1946 వరకు యీ కంపెనీ కేవలం జీవితభీమా మాత్రమే చేసింది. కాని, 1947 నుంచి అగ్ని, మెరైన్, మోటారు భీమాలనుకూడా చేస్తున్నది.

వివిధ వయస్సులవారు 25 సంవత్సరాల తరువాత లాభాలతో తమకుగాని, యీలోపల తాము మరణిస్తే తమ వారసులకుగాని వెయ్యి రూపాయలు చెల్లుబడికావాలంటే ఏడాదికి ఎంత ప్రీమియం కట్టవలసిందీ, వివరాలు: 25 ఏళ్లుగలవారు, రు. 45-11-0; 30 ఏండ్లవారు, రు. 47-0-0; 35 ఏళ్ళవారు రు. 49-8-0; 40 ఏళ్ళవారు రు. 53-12-0.

# ఫిలిం పరిశ్రమ

భారతదేశంలో ఫిలిం పరిశ్రమకు పునాదివేసినవ్యక్తి, డి. జి. ఫల్కే. 1913 సంవత్సరంలో ఇతడు తీసిన 'రాజా హరిశ్చంద్ర' అనేది, మనదేశంలో మొట్టమొదట తయారైన ఫిలిం. తరువాత, ఫిలిం పరిశ్రమను ఇంకా అభివృద్ధిలోకి తెచ్చినవాడు, బాబురావు పెయింటర్.

1913 నుంచీ 1930 వరకు 17 సంవత్సరాలు, మనదేశంలో తయారైన చిత్రాలన్నీ 'మూక' చిత్రాలేగాని, టాకీలులేవు. టాకీలు తియ్యడం విదేశాలలో 1926 లోనే ప్రారంభమైనప్పటికీ, మనదేశంలో మొట్టమొదట టాకీ 1931 లో గాని, తయారుకాలేదు. ఈ చిత్రంపేరు 'ఆలం ఆరా.' దీనిని అర్దెషిర్ ఇరానీ, కొంత మనదేశంలోనూ, కొంత ఇంగ్లండులోనూ తీశాడు. అప్పటినుంచీ, టాకీ ఫిలిములు మన దేశంలో విస్తారంగా తయారవుతూనే వచ్చాయి. 1950 నాటికి 2,120 ఫిలిములు తయారయాయి.

టాకీలు రాకపూర్వం, ఫిలిముల విషయంలో భాషాభేదపు పాటింపులేదు. ఏ ఫిలిమయినా దేశంలో ఎక్కడనైనాసరే ప్రదర్శింప

బడేది. టాకీలు రావడంతో, భాషవిషయంలో ప్రత్యేక అభిమానం ఏర్పడి తీరింది. ఒక భాషాప్రాంతంలో ఇతరక భాష ఫిలిం ఎక్కువగా జనాన్ని ఆకర్షించలేదు. అందుచేత వివిధ భాషలలో ఫిలిములు రావడం ఆరంభించాయి.

1931 లో మొట్టమొదటి తెలుగుచిత్రం, ప్రహ్లాద. దీనికి డైరెక్టరు హెచ్. ఎం. రెడ్డి. తరువాత, వరుసగా తయారైన చిత్రాలు ఇవి; 1932, పాదుకా పట్టాభిషేకం, శకుంతల, 1933 : పృథ్వీపుత్ర, రామదాసు, (రెండు కంపెనీలవారివి, రెండు చిత్రాలు); సావిత్రి (రెండు కంపెనీల వారివి, రెండు చిత్రాలు); చింతామణి. 1934: అహల్య, లవకుశ; సీతాకల్యాణం. 1935 సక్కుబాయి, హరిశ్చంద్ర, కుచేల, కృష్ణతులాభారం, కృష్ణలీల, అనసూయ, ప్రమీలార్జున, భక్తకబీర్. 1936: ధ్రువ-అనసూయ, ప్రేమవిజయం, ద్రౌపదీ వస్త్రాపహరణం, ద్రౌపదీ మానసంరక్షణం, సతీసులోచన, సంపూర్ణ రామాయణ, వీరాభిమన్య, మాయాబజారు, లంకాదహనం. 1937: సారంగధర, దశావతారాలు, కనకతార, రుక్మిణీ కల్యాణం, మోహినీ-రుక్మాంగద, నరనారాయణ, విజయదశమి, విప్రనారాయణ, బాలయోగిని, 1938: తుకారాం, చిత్రనళీయం, సత్యనారాయణవ్రతం, కాసులపేరు, గృహలక్ష్మి, భక్తమార్కండేయ, కచదేవయాని, కృష్ణజరాసంధ, మాలపిల్ల, భక్తజయదేవ, మోహినీ భస్మాసుర, గులేబకావళి. 1939: వెంకటేశ్వర మహాత్యం, వందేమాతరం, వరవిక్రయం, జయప్రద, మహానంద, రైతుబిడ్డ, రాధాకృష్ణ, పాశుపతాస్త్రం, అమ్మా- మళ్ళీ పెళ్ళి, పాండురంగ విఠల్. 1940: మైరావణ, చండిక, సుమంగళి, కాలచక్రము, భోజ-కాళిదాస, బొండాం పెళ్లి - చదువుకున్న పెళ్లాం-బారిష్టర్ పార్వతీశం, ఇల్లాలు, మాలతీమాధవం, జీవనజ్యోతి, ఉషాపరిణయం, భూకైలాస్, మీరాబాయి .1941: ధర్మపత్ని, తెనాలి రామకృష్ణ, మహాత్మాగాంధి, తారాశశాంకం, దక్షయజ్ఞం, చూడామణి, తల్లిప్రేమ, దేవత, నాజీ ఘాతం, గజలక్ష్మి, భక్తమాల, హారవిలాసం, అపవాదు, చంద్రహాస, పార్వతీకల్యాణం, 1942: జీవన్ముక్తి, భక్తప్రహ్లాద, ఘరానాదొంగ, పత్ని, శాంత బాలనాగమ్మ, సత్యభామ, దీనబంధు, సుమతి, బాల

నాగమ్మ. 1943: పోతన, భాగ్యలక్ష్మి, కృష్ణప్రేమ, పతిభక్తి, గరుడ గర్వభంగం, పంతులమ్మ, 1944: సంసారనారద, సీతారామజననం, తాసిల్దార్, భీష్మ. 1945: పాదుక, స్వర్గసీమ, వాల్మీకి, మాయా మచ్ఛీంద్ర, మాయలోకం. 1946: నారద-నారది, భక్తతులసీదాస్, ముగ్గురుమరాటీలు, గృహప్రవేశం, త్యాగయ్య, వరూధిని, మంగళ సూత్రం, సేతుబంధనం. 1947: యోగివేమన, గొల్లభామ, రత్నమాల, బ్రహ్మరథం, పల్నాటియుద్ధం, రాధిక, బాలరాజు. 1948: శిరియాళ, సువర్ణమాల, మదాలస, వింధ్యరాణి, ద్రోహి, గీతాంజలి. 1949: ధర్మాంగద, గుణసుందరికథ, కీలుగుర్రం, లైలామజ్ను, మనదేశం, పల్లెటూరిపిల్ల, రక్షరేఖ, స్వప్నసుందరి. 1950: అపూర్వసహోదరులు, ఆహుతి, అదృష్టదీపుడు, బీదలపాట్లు, మొదటిరాత్రి, జీవితం, లక్ష్మమ్మ, మాయారంభ. పరమానందయ్యశిష్యులు, రాజవిక్రమ, షావుకారు, శ్రీ లక్ష్మమ్మకథ, సంసారం, శాయిబాబా, తిరుగుబాటు, వాలిసుగ్రీవ. 1951: చంద్రవంక, ఆకాశరాజు, నిర్దోషి, పాతాళభైరవి, అగ్నిపరీక్ష, పెంకిపిల్ల, సౌదామిని, నవ్వితే నవరత్నాలు, పేరంటాలు, మాయలమారి, రూపవతి, స్త్రీసాహసం, దీక్ష, జీవితనౌక, సర్వాధికారి, మంత్రదండం, మాయ పిల్ల, ఆడజన్మ, పెళ్లికూతురు, మల్లీశ్వరి. మొత్తం .77.

ఆంధ్రదేశంలో మొత్తం 411 సినిమాథియేటర్లు వున్నాయి.

దక్షిణదేశంలో మొత్తం 23 సినిమా స్టూడియోలు వున్నాయి.

## సౌత్ ఇండియన్ ఫిలిం ఛేంబర్:

స్థాపన, 1880; ఫిలిం పరిశ్రమ అభివృద్ధికి, ఆ పరిశ్రమలతో సంబంధం వున్నవారంతా కలసి కృషిచేనేటందుకు ఏర్పడిన సంస్థ. ఈసంస్థ తరఫున ఫిలిం సెన్సారు బోర్డులో ఒక సభ్యుడు వుంటాడు. సినిమా ఆప రేటర్సు, ఎగ్జామినర్సు బోర్డులోకూడా, యీ ఛేంబర్‌కు ప్రాతినిధ్యంవుంది.

## ఫిలిం సెన్సార్ బోర్డు:

ప్రభుత్వంవారు నియమించే సంస్థ. ఈ బోర్డు సర్టిఫికేటు ఇస్తేనే కాని రాష్ట్రంలో ఏ ఫిలిమునూ ప్రదర్శించకూడదు. ప్రతి ఫిలిమూ,

నిర్మాణం పూర్తి అయిన తరువాత, దానిని యీ బోర్డులోని సభ్యులు కొందరు ముందుగా చూస్తారు. ఆ ఫిలుములో అసభ్య సంభాషణలుగాని, సన్నివేశాలుగాని వున్నట్టయితే, దానిని ప్రదర్శించడానికి అనుమతియివ్వ కూడదని ఆ సభ్యులు సూచిస్తారు. ఇలాటి సెన్సారు బోర్డులు 1951 జనవరి 15 కు పూర్వం ప్రతిరాష్ట్రంలోనూ వుండేవి.

ఫిలిం సెన్సారుబోర్డువారు, ఫిలిములను సెన్సారుచేసేటప్పుడు యీ క్రింది విషయాలను మనస్సులో వుంచుకోవాలని ప్రభుత్వం సూచించారు: చూసేవారి నైతిక ప్రవర్తనము పాడుచేసే ఫిలుములను ప్రదర్శించనివ్వ రాదు. దుష్ప్రవర్తన, నేరములు, పాపము అసభ్య ప్రవర్తనలపట్ల సానుభూతి కలిగించే ఫిలిములను ప్రదర్శింపనివ్వరాదు. సృష్టిన్యాయాన్ని మానవులు పరిగణించే చట్టాలనూ అపహసించే ఫిలిములను ప్రదర్శింపనివ్వరాదు. ఏ కులానికిచెందిన ప్రజలకూ అవమానము కలిగించే ఫిలిములను ప్రదర్శించ నివ్వరాదు.

ప్రతిరాష్ట్రంలోను ఒక్కొక్క సెన్సారుబోర్డు వుడడంకన్న దేశాని కంతకూ ఒకే సెన్సారుబోర్డువుంటే మంచిదనే ఉద్దేశంతో, అలాటి సెన్సారుబోర్డును ఏర్పాటుచేయడానికి ఇండియా ప్రభుత్వం ఒక చట్టాన్ని కేంద్ర శాసనసభలో ప్రవేశపెట్టారు. ఆ చట్టం శాసనసభ ఆమోదాన్ని పొందింది. 1949 డిసెంబరు 27 తేదీన గవర్నర్ జనరల్ ఆమోదాన్ని కూడా పొందింది. 1951 జనవరి 15 నుంచి అమలులోకి వచ్చింది. ఆనాడు నియముంపబడిన అఖిల భారత ఫిలింసెన్సార్ బోర్డు సభ్యుల పేర్లు ఇవి: సి. అగర్వాలా (ఛైర్మన్) సి. ఆర్. శ్రీనివాసన్; ఎస్. కె. పాటిల్; తుషా కాంతిఘోష్; డాక్టర్ అమరనాథ ఝా; బి. ఎన్. సర్కార్; లీలావతి మున్షి.

ఈ బోర్డు ఆఫీసు బొంబాయిలో వుంటుంది.

ఈ బోర్డు అధికారానికి లోబడి పనిచేసే ప్రాంతీయ కార్యాలయాలు మదరాసు ఒకటి, కలకత్తాలో ఒకటి, వుంటాయి.

మదరాసు ఆఫీసు నిర్వహణకు, ప్రాంతీయ ఆఫీసరుగా కె. శ్రీనివాసన్ నియమింపబడినారు.

ప్రాంతీయ ఆఫీసర్లకు సలహా ఇవ్వడానికి, ప్రాంతీయ సలహా కమిటీలు వుంటాయి. ఇలా ఏర్పాటు చేయబడిన మదరాసు కమిటీ సభ్యుల పేర్లు ఇవి . శ్రీమతి మంజుభాషిణి; సరోజిని వరదప్పన్; ఆర్ కృష్ణమూర్తి, పి. బాలసుబ్రహ్మణ్య మొదలియార్; జి. రాజగోపాలన్; సి. అచ్యుత మీనన్; కె. కురువిల్లజాకబ్; ఆర్. ఆర్. దళవాయి; షఫీమహమ్మద్; పి. వీరరాఘవన్; టి. వి. కృష్ణయ్య; కె. ఎస్. నారాయణన్; ఎ. రామయ్య.

ఒక ఫిలింను సెన్సార్ చెయ్యాలంటే, నిర్మాతలు ఆ ఫిలిం పొడవును బట్టి ప్రతి వెయ్యి అడుగులకూ రు. 40 ఫీజు కట్టాలి.

సినిమాలను తియ్యడానికి కావలసిన ఫిలిం మనం విదేశాలనుంచి దిగుమతి చేసుకోవలసిందే.

## పోస్టు, టెలిగ్రాఫ్, టెలిఫోన్ సదుపాయాలు

ఉత్తరాల రవాణాపద్ధతి భరతఖండంలో అక్బరు చక్రవర్తికాలం నాటికే అమలులో వున్నప్పటికీ, సరియైన మార్గంలో యీ పద్ధతి 1766లో అమలు జరుపబడింది. అప్పుడు కేవలం ప్రభుత్వపు ఉత్తరాలే రవాణా అవుతూ వుండేవి. కాని ప్రజలందరికీ ఉపయోగకరమైన, పోస్టేజిస్టాంపులు, కవర్లు, కార్డులు రవాణా సౌకర్యాలూ 1854 లో అమలులోకి వచ్చాయి.

టెలిగ్రాములు పంపించే సదుపాయం 1856 లో ఏర్పాటుచేయబడింది. టెలిఫోనులో ఒక చోటనుంచి మరొకచోటికి మాట్లాడే సదుపాయం 70 సంవత్సరాల క్రితం ఏర్పాటు చేయబడినా, 1913 లోనే ప్రజోపయోగార్థం టెలిఫోనులను స్థాపించడం జరిగింది. 1949 జూన్ 1 తేదినుంచి హిందీభాషలో టెలిగ్రాములను పంపించే సదుపాయం, ఉత్తరప్రదేశ్, బీహారు, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో ఏర్పాటు చేయబడింది.

1950-51 లో ఇండియాలో 20 కొత్త పోస్టుఆఫీలు నగరాల లోనూ, 410 గ్రామాలలోను తెరువబడినవి. 1951 మార్చి 31 నాటికి ఇండియాలోవున్న పోస్టాఫీసులసంఖ్య: నగరాలలో,4387; గ్రామాలలో 21,921.

1951-52 ఇండియాలోని పోస్టాఫీసులు మొత్తం 258,40,00,000 వస్తువులను బట్వాడాచేసినవి. 182 కోట్ల రూపాయల విలువగల మణి ఆర్డరులను బట్వాడాచేసినవి. 2,57,60,000 టెలిగ్రాములను అందించినవి.

1952 మార్చి 31 నాటికి ఇండియా పోస్టల్ డిపార్టుమెంటులో 883 మంది గెజెటెడ్ ఆఫీసర్లూ, 2,94,755 మంది ఉద్యోగులూ ఉన్నారు. వీరిలో ఖాయపు ఉద్యోగులు, 1,43,974.

1951 మార్చి 31 నాటికి మదరాసు రాష్ట్రంలో మొత్తం 9,147 పోస్టు ఆఫీసులువున్నాయి. వీటిలో నగరాలలో వున్నవి. 1,442 గ్రామాలలో 7,705.

1951 సెప్టెంబరు అంతానికి దేశంలో పనిచేస్తున్న టెలిఫోనులు మొత్తం 1,71,144.

1951-52 లో పోస్టల్ డిపార్టుమెంటు ఆదాయం, రు. 36,46,00,000. ఖర్చు రు. 34,13,00,000,లాభం రు. 2,33,00,000.

*　　*　　*　　*

# పోస్టల్ రేట్లు

మనదేశంలో ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి ఎంతదూరం. పైనాసరే ఉత్తరాలను, పార్శెళ్ళను, టెలిగ్రాములను పంపడానికి అయ్యే ఖర్చు వివరాలు యివి:

కార్డు:

పోస్టాఫీసులో అమ్మేకార్డును ముక్కాలి పెట్టి కొనుక్కొని, దానిమీద సంగతులు వ్రాసుకోవచ్చును. లేదా విడిగా బజారులో అమ్మే

వివిధరంగుల కార్డులనుకొని, వాటికి ముక్కాని బిళ్ళను కొని అంటించి పోస్టులో వెయ్యవచ్చును. ఈ కార్డులపొడవు 5 1.8 అంగుళాలకు, వెడల్పు 4 1 8 అంగుళాలకు మించి ఉండకూడదు; 4 అంగుళాల పొడవుకు, రెండు అంగుళాల వెడల్పుకు తక్కువ వుండకూడదు. విదేశాలలో బట్వాడా చేసే కార్డుకు 0-0-6 బిళ్ళ అంటిస్తే చాలు.

కవరు :

కార్డుమీద వ్రాసేదానికన్న ఎక్కువ విషయాలను వ్రాయవలసి వస్తేగాని, యితరులెవరూ చూడకూడని విషయాలు వ్రాయవలసి వస్తేగాని, వ్రాసిన ఉత్తరాన్ని కవరులోపెట్టి, పైన అడ్రసు వ్రాసి పోస్టులో వెయ్యవచ్చును. ఈ కవరుమీద అంటించవలసిన పోస్టుబిళ్ళల విలువ, కవరు బరువునుబట్టి వుంటుంది. కవరు ఒక తులంగాని, ఒకతులానికి లోపు గాని వుంటే కవరుమీద రెండణాల విలువగల పోస్టుబిళ్ళను అంటించాలి. ఒక తులం తరువాత అధికమైన ప్రతి తులం బరువుకూ అదనంగా ఒక్కొక్క అణాబిళ్ళ చొప్పున అంటించాలి. కవరుకేకుండా ఇన్‌లెండ్ లెటర్ మీద వ్రాస్తే అణాన్నర.

ఎక్స్‌ప్రెస్ డెలివరీ :

పోస్టాఫీసు ఉన్న ప్రతి ఊళ్లోనూ, పోస్టు బంట్రోతులు, ఉత్తరాలు ఒక్కొక్క యింటికీ వరసగా యిచ్చుకుంటూ పోతారు. అలా కాక, ఉత్తరం పోస్టాఫీసుకు అందినవెంటనే చిరునామాదారునికి అందజెయ్యడానికికూడా ఏర్పాటువుంది. ఈ ఏర్పాటును ఎక్స్‌ప్రెస్ డెలివరీ అంటారు. దీనికి, అలా అందజెయ్యవలసిన ఉత్తరంమీద, దాని మామూలు చార్జీలుకాక, అదనంగా రెండణాల బిళ్ళలను అంటించి, స్పష్టంగా కనపడే అక్షరాలలో 'ఎక్స్‌ప్రెస్ డెలివరీ' అని వ్రాయాలి. లేదా, పోస్టాఫీసులలో ఉచితంగా ఇచ్చే 'ఎక్స్‌ప్రెస్ డెలివరీ' అని వ్రాసిన చిన్న, ఎర్రటి కాగితపు ముక్కను అంటించాలి. అలా చేసినట్లయితే, ఆ ఉత్తరాన్ని పోస్టాఫీసుకు అయిదుమైళ్ళలోపున ఏ అడ్రసుకు అయినా వెంటనే అందజేస్తారు. ఈ పద్ధతిలో, పోస్టుకార్డులను, కవరులను, రిజిస్టరు చెయ్యని ప్యాకెట్టులను పంపవచ్చును.

బుక్ పోస్టు :

అచ్చువేసిన నోటీసులు, ఉత్తరాలు కాకుండా అందరూ చదువుకోడానికి వీలున్న పత్రాలు, తక్కువ చార్జీలకు, పోస్టుద్వారా పంపవచ్చును. ఇలాంటివాటికి వాటి బరువునుబట్టి, మొదటి 5 తులాలకు ముక్కాని బిళ్ళ అంటించాలి. ఆ తరువాత ప్రతి $3\frac{1}{2}$ తులాల బరువుకీ, కాని పోస్టు బిళ్ళలను అంటించాలి.

రిజిస్ట్రేషన్ :

ఎవరికైనా ఉత్తరాలు పంపినప్పుడు, అవి ఆ చిరునామాదారునికే అందేటట్టూ, అందిన దాఖలా వుండేటట్టూ ఉత్తరాలు పంపడాన్ని రిజిస్ట్రేషన్ అంటారు. రిజిస్టర్ చేసే ఉత్తరాలకు, మామూలుగా వాటికి అంటించే పోస్టుబిళ్ళలు కాక, అదనంగా నాలుగున్నర అణాల బిళ్ళలు అంటించాలి. చిరునామాదారు సంతకంపెట్టిన రసీదు, ఉత్తరం పంపినవారికి కావాలంటే, ఐదణాల బిళ్ళలు అంటించాలి.

పార్సెళ్ళు :

పోస్టుద్వారా పంపే పార్సెళ్ళకు ప్రతి 40 తులాలకూ ఆరేసి అణాల బిళ్ళలను అంటించాలి. 440 తులాల బరువుకు మించిన పార్సెలును తప్పనిసరిగా రిజిస్టరు చేసితీరాలి.

వి. పి.

ఏదైనా విలువగల వస్తువును ఒకరు మరొకరికి పంపి, పుచ్చుకున్నవారి దగ్గర దానివిలువను వసూలుచేసేపద్ధతి. రు. 25 లపై విలువగల వి.పి.లను, వాటివిలువకు ఇన్సూరు చెయ్యాలి. అదికాక రు. 25 లోపు విలువగల వస్తువు అయితే, వి. పి. చార్జి ఒకఅణా; రు. 25 పైన విలువగల వస్తువు అయితే అదనంగా వి. పి. చార్జి రెండు అణాలు చెల్లించాలి. అంటే వి. పి. లను విడిపించుకొనేవారు చెల్లించవలసిన డబ్బు వివరాలు ఇవి :

రు. 25 లోపు విలువుగల వస్తువులకు : వస్తువువిలువ; ఆ వస్తువుకు అయే బట్వాడా చార్జి (బరువునుబట్టి); నాలుగున్నర అణాలు రిజిస్ట్రేషన్ చార్జి; ఒకఅణా వి. పి. చార్జి.

రు 25 పైన విలువగల వస్తువులకు: వస్తువుకిలువ; ఆ వస్తువు బట్వాడాకు అయే చార్జి; నాలుగున్నర అణాలు రిజిస్ట్రేషన్ చార్జి; రెండు అణాలు వి. పి. చార్జి; ఆవస్తువు విలువను బట్టి ఇన్స్యూరెన్సు చార్జి.

అయితే, పుస్తకములు, రైల్వే పార్సెలు రశీదులు వి. పి. గా పంపినప్పుడు, వాటి విలువ ఎంతయినాసరే, వాటిని ఇన్స్యూరు చెయ్యాలనే నిర్బంధంలేదు.

## ఇన్స్యూరెన్సు :

పోస్టుద్వారా విలువగల వస్తువులను పంపేటప్పుడు, ఒకవేళ ఆ వస్తువులుపోతే, ఆ వస్తువుల ఖరీదును రాబట్టుకోడానికి చేసుకొనే ఏర్పాటు. ఈ ఏర్పాటుద్వారా, రిజిష్టర్ ఉత్తరాలను, బంగారు నగలనూ, విలువగల దస్తావేజులనూ ఒకచోటినుంచి మరొకచోటికి పంపవచ్చును. ఈ వస్తువులను, వాటి అసలైన విలువకుమించిన మొత్తానికి ఇన్స్యూరుచెయ్యకూడదు. ఇలా ఇన్స్యూరుచేసే వస్తువుల విలువ రు. 5000 లకు, మించరాదు.

ఇలా ఇన్స్యూరు చెయ్యడానికి, ఆ వస్తువులు పెట్టిన కవరుకుగాని, పెట్టెకుగాని దాని బరువునుబట్టి చెల్లించవలసిన ఛార్జి, రిజిస్ట్రేషను చార్జీలు కాక అదనంగా, యీక్రింది రేటులో చార్జీలు యిచ్చుకోవాలి.

నూరు రూపాయల విలువకు మించని ఇన్స్యూరెన్సుకు నాలుగణాలు. రు. 100 కు పైబడి, ప్రతి అదనపు రు. 100 లకు రెండణాలు.

## మని ఆర్డరు :

దూరాన వున్నవారికి ఎవరికైనా, నమ్మకంగా చేరేలాగున డబ్బు పోస్టాఫీసులద్వారా పంపవచ్చును. ఇలా పంపే డబ్బును అయిదు రూపాయల లోపు అయితే రెండణాలు, రు. 5 పైన రు. 10 లోపు అయితే, మూడణాలు, రు. 10 పైన రు. 15 లోపు నాలుగణాలు; రు. 15 పైన రు. 25 లోపు ఆరణాలు. ఆ పైన మొత్తాలకు పై క్రమంలో అదనపు చార్జీలు, చెల్లించాలి.

టెలిగ్రాఫ్ మని ఆర్డరు :

అతి స్వల్ప వ్యవధిలో, దూరాన వున్నవారికి డబ్బు పంపాలంటే టెలిగ్రాం ద్వారా పంపవచ్చును. దీనికి చార్జీ, మామూలు మని ఆర్డరు చార్జీ కాక, చిరునామాకూ, అతనికి తెలియపరచే విషయాలకూ టెలిగ్రాం చార్జీ ఎంత అవుతుందో, అదికూడా యివ్వాలి.

టె లి గ్రా ము లు :

అత్యవసరంగా ఒకచోటనుంచి మరొక చోటికి కబురు అందజెయ్యడానికి టెలిగ్రాం మంచి సౌకర్యం. టెలిగ్రాములు ఇంగ్లీషులోనే పంపాలి. చెప్పేసంగతులకూ, టెలిగ్రాము ఎవరికి పంపుతామో వారి చిరునామాకూ ఎన్నిమాటలు వుంటాయో వానినిబట్టి చార్జీ యివ్వాలి. టెలిగ్రాము రెండురకాలు. మామూలు టెలిగ్రాములు, యిచ్చేచోట అందుకున్న వరుసలో పంపేవి; అర్జెంటు టెలిగ్రాములు, అందుకోగానేపంపేవి.

మామూలు టెలిగ్రాములకు చార్జీలు : మొదటి ఎనిమిది మాటలకు గాని, అంతకు తక్కువకుగాని 12 అణాలు; ఎనిమిదిపైన ప్రతిమాటకూ ఒక అణా అదనం. అర్జెంటు టెలిగ్రాములకు, ఎనిమిది మాటలకు రు. 1-8-0. ఆపైన ప్రతిమాటకు రెండేసి అణాలు.

ఈ పోస్టు చార్జీలు, టెలిగ్రాము చార్జీలు, ఇండియాలో ఒక చోటనుంచి మరొకచోటికే. విదేశాలకు చార్జీలు వేరు.

విదేశాలకు :

పాకిస్తాన్, సిలోనులకు కార్డు 0-1-6 ; బర్మాకు కార్డువెల, 0-4-0 ఆసియాలో ఇతరదేశాలకు కార్డువెల, 0-5-0 ;

యూరప్‌కు వ్రాసే కార్డువెల 6 అణాలు; కవరువెల, ఒక ఔన్సు బరువుకు మించనిది 12 అణాలు; ఆపైన ప్రతిఔన్సుకీ రెండేసి అణాలు.

అమెరికాకు : కార్డు, 10 అణాలు ; కవరు, రు. 1-8-0

విమాన టపాద్వారా : అరఔన్సు బరువుగల ఉత్తరాలకు :

యూరప్‌కు : 6 అణాలు.
ఆఫ్రికాకు : 8 అణాలు.
ఆస్ట్రేలియాకు : 8 అణాలు.
అమెరికాకు : 10 అణాలు.

కేబిల్ గ్రాం :

సముద్రాంతరంలోవున్న దేశాలకు పంపించే టెలిగ్రాములను కేబిల్ గ్రాం అంటారు.

ఇండియానుంచి ఇంగ్లండు, అమెరికాలకు కేబిల్ గ్రాం పంపితే అయే చార్జీలు ఇవి :

ఇంగ్లండు : ప్రతిమాటకు 13 అణాలు.

అమెరికా : ప్రతిమాటకు రు. 1-7-0.

చాలా ఉత్తరాలు సరియైన అడ్రసు వ్రాయనందున, ఎవరికి అందాలో వారికి అందక, 'డెడ్ లెటర్' ఆఫీసుకు పోతాయి. అందుచేత ప్రతి ఉత్తరంమీద సరియైన అడ్రసు వ్రాయడం ముఖ్యం.

ఆదివారం సెలవు :

ఇండియాలోని పోస్టాఫీసు లన్నిటికీ, ప్రతి ఆదివారమూ పూర్తిగా సెలవురోజు. ఆనాడు మామూలు ఉత్తరాలు, మామూలు టెలిగ్రాములు బట్వాడా జరుగదు. ఎక్స్‌ప్రెస్ డెలివరీ ఉత్తరాలు, అర్జెంటు టెలిగ్రాములు మాత్రమే బట్వాడా అవుతవి.

## విమాన సమాచారాలు

యుద్ధానంతరం, మునుపటికన్న మనదేశంలో విమానప్రయాణాలు చాలా ఎక్కువగా సాగుతున్నాయి. మనదేశంనుంచి విదేశాలకు వెళ్ళడానికే కాక, దేశంలోనే ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి చాలామంది విమానాలలోనే ప్రయాణం చేస్తున్నారు.

విదేశాలకు ప్రయాణికులను తీసుకొని వెళ్ళడానికి బ్రిటిష్ ఓవర్సీస్ ఏర్వేస్ కార్పొరేషన్ అనే బ్రిటిషు విమాన సర్వీసు, కె. ఎల్. ఎం. అనే డచ్చివిమాన సర్వీసు ప్రస్తుతం పనిచేస్తున్నాయి.

1951 డిసెంబరు నాటికి దేశంలో, విమానాలను నడిపించి ప్రయాణ సౌకర్యాలను ఏర్పాటుచేస్తున్న కంపెనీలు ఎనిమిదివున్నాయి. అవి ఏమిటంటే: ఏర్ ఇండియా లిమిటెడ్ ; ఏర్ సర్వీస్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ ; ఏర్వేస్ ఇండియా లిమిటెడ్ ; భారత్ ఏర్వేస్ లిమిటెడ్ ; డాల్మియా-జెయిన్ ఏర్వేస్ లిమిటెడ్ ; డక్కన్ ఏర్వేస్ లిమిటెడ్ ; ఇండియన్ నేషనల్ ఏర్వేస్ లిమిటెడ్ ; ఇండియన్ ఓవర్సీస్ ఏర్ లైన్స్ లిమిటెడ్. వాటిలో మూడు మాత్రమే చెన్నపట్టణం గుండా వాటి ప్రయాణమార్గాన్ని కలిగివున్నాయి. ఆ కంపెనీల ప్రయాణ మార్గాలు ఇవి:

### ఏర్-ఇండియా లిమిటెడ్ (తాతా కంపెనీ)

కొలంబో—బొంబాయి సర్వీసు:

మదరాసు—బొంబాయిసర్వీసు: మదరాసు—త్రివేంద్రం సర్వీసు:

### ఏర్ వేస్ ఇండియా లిమిటెడ్ :

బెంగుళూరు—కలకత్తా సర్వీసు :

### డెక్కన్ ఏర్వేస్ :

మదరాసు—ఢిల్లీ సర్వీసు :

హైదరాబాద్—బెంగుళూర్ :

హైదరాబాద్—బొంబాయి :

విమాన ప్రయాణ సౌకర్యాల విషయమై యీకంపెనీల చర్యలను, ఏర్పాట్లను పరిశీలించి, తగిన పద్ధతులలో వీరు ప్రయాణ సౌకర్యాలను కలిగిస్తున్నారో లేదో చూడడానికి కేంద్ర ప్రభుత్వంవారు డైరెక్టర్ జనరల్ ఆఫ్ సివిల్ ఏవియేషన్ అనే హోదాతో ఒక ఉద్యోగిని నియమించారు. ప్రస్తుతం, యీ పదవిలో టి. పి. భల్లా ఉన్నారు.

1949 లో ఇండియాలో సంభవించిన విమానప్రమాదాలు మొత్తం 84. వీటిలో మరణించిన వారిసంఖ్య మొత్తం, 71.

1950 లో ఇండియాలో మొత్తం 57 విమానప్రమాదాలు జరిగాయి. చనిపోయిన ప్రయాణికుల సంఖ్య 118.

నాగపూర్‌నుంచి కలకత్తాకు ప్రయాణంచేసున్న డక్కన్ ఏర్వేస్ విమానం, కలకత్తాకు మూడు మైళ్ళదూరంలో 1951 నవంబరు 21 ఉదయం కూలింది. విమానంలోవున్న 17 మందిలోను 16 మంది చనిపోయారు.

ఇండియాలో విమానాశ్రయాలలో అంతర్జాతీయ హోదాగలవి ఇవి:

1. బొంబాయి (శాంటాక్రూజ్); 2. కలకత్తా, (డండం); ఢిల్లీ (పలం).

ఇండియాలో ప్రధాన హోదా గలవి :

1. అహమ్మదాబాద్; 2. అగర్తలా; 3. బేగంపేట; 4. బొంబాయి (జుహూ); 5. ఢిల్లీ (సఫ్దార్‌జంగ్); 6. గౌహతి; 7. మదరాసు; 8. నాగపూర్.

ఇండియాలో మధ్యరకపు హోదాగలవి :

1. అలహాబాద్; 2. అమృతసర్; 3. ఫన్‌బోరా; 4. బెనారెస్; 5. బారకపూర్; 6. బరోడా; 7. భావనగర్; 8. భోపాల్; 9. భుజ్; 10. కోయంబత్తూర్; 11. కొచ్చిన్; 12. కటక్ (భువనేశ్వర్); 13. గయా; 14. ఇండోర్; 15. జయపూర్; 16. జోర్‌హాట్; 17. జునఘడ్; 18. లక్నో; 19. మోహన్‌బారి; 20. పాట్నా; 21. పోర్‌బందర్; 22. రాజకోట; 23. తేజ్‌పూర్; 24. తిరుచిరాపల్లి; 25. త్రివేండ్రం; 26. విజయవాడ; 27. విశాఖపట్టణం.

కడపటిరకపు హోదాగలవాటిలో మదరాసురాష్ట్రంలో ఇవి.

కడప; దొనకొండ; మధుర; రాజమండ్రి; రామనాథం; తంజావూరు; నెల్లూరు.

# బ్రాడ్ కాస్టింగ్

రేడియో బ్రాడ్ కాస్టింగ్ భారతదేశంలో మొట్ట మొదట 1924 లో మదరాసులో రేడియోక్లబ్ ఒకటి స్థాపింపబడటంతో ప్రారంభమైంది. కాని, ఇండియన్ బ్రాడ్ కాస్టింగ్ కంపెనీ అనే పేరుతో ఒక కంపెనీ ఏర్పడి, 1927 జులై 23 తేదిన బొంబాయిలో ఒక స్టేషనును, 1927 ఆగస్టు 26 తేదిన కలకత్తాలో ఒక స్టేషనును స్థాపించడంతో, బ్రాడ్ కాస్టింగ్ సర్వీసు ప్రారంభమైంది. అయితే, యీ కంపెనీకి లాభాలు ఏమీ కట్టక, 1930 మార్చిలో దివాలాతీసింది. 1930 ఏప్రిల్ 1 తేదినుంచి కేంద్రప్రభుత్వంవారే, బ్రాడ్ కాస్టింగ్ ను తమ అధికారంలోకి తీసుకు న్నారు. 1932 దాకా ప్రభుత్వంవారుకూడా దీని విషయంలో తగు శ్రద్ధ చూపలేదు.

1930 లో మనదేశంలో సుమారు 7,700 మంది మాత్రమే రేడియో లను కలిగివున్నారు. రేడియోసెట్టు వున్న ప్రతివారు, ఆ సర్కిల్ పోస్టు మాస్టరు జనరల్ దగ్గరనుంచి లైసెన్సు తీసుకోవాలి. దీనికి ఫీజు ఏడాదికి 15 రూపాయలు.

ప్రస్తుతం మనదేశంలో 25 రేడియో స్టేషనులు వున్నాయి. వీటిలో కొత్తగా స్థాపింపబడినవి; విజయవాడ. 1948 డిసెంబరు 1; అలహాబాదు, 1949 ఫిబ్రవరి 1; ధార్వార్, 1950 జనవరి 8. కొళికోడ్, 1950 మే 14.

మదరాసు స్టేషను 1938 జూన్ 16 తేదిన స్థాపింపబడింది.

ప్రస్తుతం రేడియోస్టేషనలు ఇవి. ఢిల్లి, బొంబాయి, కలకత్తా, జలంధర్, నాగపూర్, బరోడా, కటక్, షిల్లాంగ్, గౌహతి, లక్నో, పాట్నా అలహాబాద్, మదరాసు, తిరుచిరాపల్లి, విజయవాడ, ధార్వార్. జమ్మూ, అమృతసర్, కోళికోడ్, శ్రీనగర్, మైసూరు, ఔరంగాబాద్, హైదరాబాద్, అహమ్మదాబాద్, తిరువనంతపురం.

ఇండియాలో రేడియోసెట్లు యింటిలో వుంచుకున్నందుకు లైసెన్సులు, తీసుకున్నవారిసంఖ్య 1952 జనవరి 1 తేదినాటికి 6,35,026. మదరాసురాష్ట్రంలో 1,38,810.

అధీనంలోవున్న డబ్బు, రోడ్లవిషయంలో పరిశోధనలు చేయించడానికి, కేంద్రప్రభుత్వ రోడ్లశాఖకు అయేఖర్చుకీ వినియోగింపబడుతుంది.

ప్రస్తుతం ఇండియాలోవున్న రోడ్ల వివరాలివి: (1943 నాటి లెక్కల ప్రకారం) : ఇవి ప్రభుత్వ అధీనంలో వున్నది.

మొత్తం రోడ్లు : 2,39,081 మైళ్లు.

మోటార్లు నడపడానికి వీలైనవి : 1,81,406 మైళ్లు.

ఇవికాక మునిసిపాలిటీల అధీనంలోనూ, జిల్లాబోర్డుల అధీనంలోనూ వున్నరోడ్లు మొత్తం, 2,99,720 మైళ్లు. వీటిలో 97,547 మైళ్ళరోడ్లకు మాత్రమే కంకర వేయబడినది. తక్కినవి, రోడ్లు పేరుతో చెలామణి అయే కాలి దారులే.

1947 ఏప్రిల్ నుంచి 20 ఏండ్లలోగా, ప్రభుత్వ అధీనంలోవున్న రోడ్లను 3,85,226 మైళ్లకు పెంచడానికీ, దీనిలో మోటార్లు నడపడానికి వీలైన రోడ్లను 2,89,855 మైళ్ళకు పెంచడానికీ ప్రభుత్వంనిశ్చయించింది.

## రైళ్లు

మొట్టమొదట ఇండియాలో 1853 లో బొంబాయినుంచి కల్యాణ్ వరకు 21¾ మైళ్లు, కలకత్తానుంచి మీర్జాపూర్ వరకు సుమారు 100 మైళ్లు, రైలుదారి వెయ్యడం జరిగింది. తరువాత అక్కడక్కడ కొద్దిగా రైలుదార్లు పడినప్పటికీ 1880 వరకు యీ విషయంలో పెద్ద ప్రయత్నం ఏమీ జరగలేదు. తరువాత 1856 లో మదరాసు—వాలాజా రోడ్ రైల్వే 85 మైళ్ళు వేయబడింది. 1878 లో వచ్చిన కరవు (ధాత కరువు) తరువాత, కరవును నివారించడానికి నియమింపబడిన కమిషను వారు, దేశంలో రైలుదార్లు విస్తారంగావుంటే, ఆహారధాన్యాలను కరువువచ్చిన ప్రదేశాలకు పంపడానికి ఎక్కువ సదుపాయం వుంటుందని సూచించారు, అప్పటినుంచీ, రైలుదార్లు ఎక్కువగా వెయ్యడం జరిగింది.

ఆ తరువాత, దేశంలో వ్యాపారం బాగా వృద్ధిపొందడమూ, ప్రజలు ప్రయాణాలను ఎక్కువగా చేస్తూవుండడమూ రైల్వేల ఆదాయాన్ని వృద్ధిపొందించాయి కంపెనీల యాజమాన్యంలోవున్న రైల్వేలు లాభం హెచ్చినకొద్దీ రైలుదార్లను ఎక్కువగా వేశాయి.

ఇటీవలివరకు, మనదేశంలో చాలా రైలుదారులు ప్రత్యేకంగా అనేక కంపెనీలయాజమాన్యంలోనే వుంటూవచ్చాయి. కాని, ఇండియా గవర్నమెంటు, యీ కంపెనీలనుంచి రైలుదార్లన్నిటినీ కొనివేశారు. ఇప్పుడు దేశంలోవున్న రైలుదార్లన్నీ, కేంద్ర ప్రభుత్వ పరిపాలనలో వున్నాయి.

రైల్వే వ్యవహారాలన్నిటినీ చూడడానికి, కేంద్రప్రభుత్వంలో ఒక మంత్రివున్నాడు. ఆయనకు సలహాలు యివ్వడానికి రైల్వేబోర్డు ఉంది. ఈ బోర్డుకు అధ్యక్షుడు ఛీఫ్ కమిషనర్. రైల్వేల పరిపాలన అంతా ఈయన ద్వారానే జరుగుతుంది. ఈ బోర్డులో సభ్యులు: ఛీఫ్ కమిషనర్, ఫైనాన్షల్ కమిషనర్, కాక ముగ్గురు సభ్యులు వుంటారు. వీరిలో ఒకరు ట్రాఫిక్, ఒకరు ఎస్టాబ్లిష్‌మెంట్, మరొకరు ఇంజనీరింగ్ శాఖల తరఫున సభ్యులు.

1951 మార్చి 31 నాటికి ఇండియాలోవున్న రైలుదారి పొడవు మొత్తం 34,022, మైళ్లు, దీనిలో, 1,010 మైళ్ళ దూరంలో రెండు జతల పట్టాలు (అంటే రెండు రైళ్లు ఒకేసారి ఎదురెదురు దిక్కులలో నడపడానికి వీలుగా వేయబడినవి.) దీనిలో బ్రాడ్ గాజ్ మైళ్ళు, 15,697; మీటర్ గేజ్, 14,951 మైళు; నారోగాజ్, 3,377 మైళ్లు.

| | |
|---|---|
| మొత్తం మైళ్లు : | 34,022.29 |
| ఇంజనులు : | 8,400 |
| ప్యాసెంజరు పెట్టెలు : | 14,624 |
| గుడ్సు పెట్టెలు : | 1,51,462 |
| పనివారు : | 8,99,248 |

1950-51 లో రైల్వేల ఆదాయం : రు. 263,01 లక్షలు.

1950-51 లో రైల్వేల ఖర్చులు : రు. 180,23 లక్షలు.

1950-51 లో రైల్వేలు సంపాదించిన లాభం : రు. 14,59 లక్షలు.

గవర్నమెంటు ఆధీనంలోవున్న రైల్వేలు, ఇతర రైల్వేలు కలిపి, 1950-51 లో రు. 263,01 లక్షల రూపాయల ఆదాయాన్ని తెచ్చాయి. దీనిలో సరుకుల రవాణాచార్జీవల్ల వచ్చిన ఆదాయం, రు. 143,01 లక్షలు. ప్రయాణీకుల రవాణావల్ల వచ్చిన ఆదాయం, రు. 97,84 లక్షలు. పార్సెల్సు, లగ్గేజీ మొదలైనవాటి రవాణావల్ల, 22,16 లక్షలు.

రైల్వేలు తమ ఆదాయంలో, రు. 32,51 లక్షలను కేంద్రప్రభుత్వ రెవిన్యూ ఆదాయానికి ఇచ్చాయి.

1950-51 రైల్వేలో ప్రయాణంచేసినవారి సంఖ్య: 130,77,20 వేలు. 1949-50 లో 125,75,40 వేలు, (యింత ఎక్కువమంది యిది వరకు ఏ సంవత్సరంలోనూ ప్రయాణం చెయ్యలేదు.)

రైల్వేలద్వారా రవాణా అయిన సరకుల బరువు మొత్తం : 916 లక్షల టన్నులు

1950 మార్చి 31 నాటికి రైల్వేలలో పనిచేస్తున్నవారి సంఖ్య 89,99,248.

1949 మార్చి 31 నాటికి రైల్వేలలో ఉద్యోగంచేస్తున్నవారి సంఖ్య : 9,12,724. (రైల్వేలైనుల నిర్మాణంలో పనిచేస్తున్నవారు, యీసంఖ్యలోలేరు.) 1948 మార్చి 31 నాటికి రైల్వేలలో పనిచేస్తున్న వారిసంఖ్య : 9,00,497 .

1950-51 లో కొత్త రైలుదారి మొత్తం 62.62 మైళ్లు నిర్మింపబడింది. 1949-50 లో కొత్తగా 233.14 మైళ్ల రైలుదారి వెయ్యబడింది.

1950-51 అంతానికి 358 గ్రెయినుషాపులు, రైల్వే ఉద్యోగులకు చౌకధరలలో బియ్యం, పప్పులు అమ్మడానికి పనిచేస్తున్నవి.

1950-51 లో రైల్వేలమీదవున్న పెట్టుబడి విలువ మొత్తం రు.813.17 కోట్లు.

ఇండియాలోని వివిధ రైల్వేశాఖలను ప్రాంతీయశాఖలుగా కలిసి వెయ్యడానికి ప్రభుత్వం నిశ్చయించింది. 1951 ఏప్రిల్ 14 నుంచి, మూడేళ్లలో ఇండియాలోని రైల్వేలు ఆరు ప్రాంతీయ శాఖలుగా ఏర్పడుతవి. వీటిలో మొదటిది, దక్షిణరైల్వే, 1951 ఏప్రిల్ 14 న ఏర్పాటు చేయబడింది. మధ్యరైల్వే, పశ్చిమ రైల్వేలు 1951 నవంబరు 5 న ఏర్పాటు చేయబడినవి.

ఆ ప్రాంతీయ శాఖల పేర్లు, ఒకొక్కశాఖకు ఎన్నిమైళ్ల రైలుదారి ఉండేదీ, వివరాలు ఇవి:

1. ఉత్తర రైల్వే : 5,259.
2. పశ్చిమరైల్వే : 3,552.
3. మధ్య రైల్వే : 5,315.
4. దక్షిణ రైల్వే : 5,999.
5. తూర్పురైల్వే : 5,605.
6. ఈశాన్య రైల్వే : 5,557.

## తరగతులు

ఇండియాలోని రైల్వేలన్నిటినీ మూడు తరగతులుగా విభజించారు. సంవత్సరానికి 50 లక్షల రూపాయలకు పైబడిన ఆదాయం వచ్చేవి, మొదటి తరగతిరైల్వేలు. రు. 50 లక్షలలోపు, రు. 10 లక్షల పైన ఆదాయం గలవి రెండవతరగతి. పదిలక్షలలోపు ఆదాయంకలవి, మూడవతరగతి.

మొదటి తరగతి రైల్వేలివి: అస్సాం, బెంగాల్ నాగపూర్, బొంబాయి బరోడా అండ్ సెంట్రల్ ఇండియా, ఈస్టు ఇండియన్, గ్రేట్ ఇండియన్ పెనిన్సులా, మదరాస్ అండ్ సదరన్ మహరాటా,

తూర్పు పంజాబ్, ఔధ్ తిర్హుత్, సౌత్ ఇండియన్, బికనీర్ స్టేట్, జోధపూర్, మైసూర్ స్టేట్ నైజాం స్టేట్ రైల్వేలు.

## రైలుదారి వెడల్పు

దీనినే గాజ్ అంటారు. ఇండియాలో రైలుదార్లు రెండు గాజ్ లలో వున్నాయి: బ్రాడ్ గాజ్, మీటర్ గాజ్. బ్రాడ్ గాజ్ వెడల్పు, $5\frac{1}{2}$ అడుగులు; మీటర్ గాజ్ వెడల్పు, 3 అడుగుల 3 3/8 అంగుళాలు.

## ప్రమాదములు

1948 ఏప్రిల్-1949 మార్చి-ఒక ఏడాదిలో ఇండియాలోని రైల్వేలలో 25 ప్రమాదాలు జరిగినవి. ఈ ప్రమాదములో మరణించిన వారిసంఖ్య. 105.

1949-50 లో జరిగిన రైలు ప్రమాదములలో మొత్తం 605 మంది ప్రయాణీకులు చనిపోయారు; 3,432 మంది గాయపడ్డారు. ప్యాసెంజరు ట్రెయినులకు జరిగిన ప్రమాదముల సంఖ్య, 277

## ఎలక్ట్రిక్ రైల్వేలు

బొగ్గు ఇంజనుల సహాయంతో కాక, ఎలక్ట్రిసిటీవల్ల నడుపబడే రైళ్లు ప్రస్తుతం ఇండియాలో 235.99 మైళ్ళదూరం నడుస్తున్నాయి. ఇలాటి రైళ్ళు నడిచేదారి వివరాలు ఇవి:

| | |
|---|---|
| మదరాసు బీచి నుంచి తాంబరం: | 18.14 మైళ్ళు. |
| బొంబాయినుంచి పూనావరకు; కల్యాణ్ నుంచి ఇజత్ పురివరకు | 181.05 మైళ్ళు. |
| బొంబాయి చర్చిగేట్ నుంచి వీరార్ వరకు: | 36.80 మైళ్ళు. |

## రైల్వే పెట్టెల తరగతులు

ఇటీవలివరకు ఇండియాలోని రైల్వే ట్రెయినులలో ఫస్టుక్లాసు, సెకండ్ క్లాసు, ఇంటర్ క్లాసు, థర్డుక్లాసు అనే నాలుగు రకాలు పెట్టెలు వుండేవి. 1949 జనవరి 1 తేది నుంచి, యీ నాలుగు రకాల పెట్టెలకు

బదులుగా, ఒకటవ, రెండవ, స్పెషల్ రెండవ, మూడవక్లాసులనే పేరుతో నాలుగురకాల పెట్టెలను నడిపారు. అంటే, పూర్వపు సెకండుక్లాసును తీసివేసి, తదనుగుణ్యంగా, రైల్వే చార్జీలనుకూడా మార్చినారు. మళ్లీ 1950 ఏప్రిల్ నుంచి యథాప్రకారం, ఫస్టు, సెకండ్, ఇంటర్, థర్డుక్లాసుల పద్ధతి అమలులో పెట్టబడింది.

## రైల్వే చార్జీలు

దేశంలోని రైల్వేల నన్నిటినీ ప్రభుత్వం స్వాధీనంలోకి తీసుకోవడంతో, రైల్వేలలో ప్రయాణికుల పెట్టెల తరగతులను దేశమంతటా ఒకే విధంగా మార్చడంతో రైల్వే ప్రయాణికులవద్దనుంచి వసూలుచేసే చార్జీలనుకూడా, దేశమంతటా ఒకేపద్ధతిలో అమలుజరుపడానికి ప్రభుత్వం నిశ్చయించారు: ప్రయాణికుడు ఎంతదూరం ప్రయాణంచేసినా, తాను ప్రయాణంచేసే తరగతినిబట్టి, మైలుకి ఇంత అని నిర్ణీతచార్జీలు ఇవి :

ఒకటవక్లాసు : మైలుకి 27 పైసలు.
రెండవక్లాసు : మైలుకి 16 పైసలు.

ఇంటర్ క్లాసు: మెయిలు, ఎక్స్ప్రెసు ట్రెయినులలో మైలుకి $10\frac{1}{2}$ పైసలు.
ప్యాసెంజరు ట్రెయినులో మైలుకి 9 పైసలు.

మూడవక్లాసు : మెయిలు, ఎక్స్ప్రెసు ట్రెయినులలో మైలుకి 6 పైసలు.
ప్యాసెంజరు ట్రెయినులలో మైలుకి 5 పైసలు.

ఫస్టు, సెకండుక్లాసు ప్రయాణికులకు పడకకు సీటు రిజర్వు చేసుకోవాలంటే, టిక్కెట్టు ఛార్జీమీద అదనంగా అర్ధరూపాయి చెల్లించాలి; ఇంటరుక్లాసులో సీటు రిజర్వుచేసుకోవాలంటే, టిక్కెట్టుమీద అదనంగా అర్ధరూపాయి చెల్లించాలి.

## కొన్ని ముఖ్యనగరాల దూరం

దూరప్రయాణం చెయ్యగోరేవారికి, ఆయానగరాలు మదరాసు, బెజవాడలనుంచి ఎంతదూరాన వున్నదీ వివరాలు ప్రక్క పేజీలో యివ్వబడినవి. ఆ దూరాన్నిబట్టి. తాము ఏ క్లాసులో ప్రయాణంచేస్తారో, ఆ

క్లాసుకు మైలుకు అయ్యే ఛార్జీనిబట్టి, టిక్కెట్టు ఖర్చు ఎంత అవుతుందో లెక్క కట్టుకోనవచ్చును.

| నగరము | మదరాసునుంచి మైళ్లు | విజయవాడనుంచి మైళ్లు |
|---|---|---|
| అలహాబాద్ | 1250 | 982 |
| బొంబాయి | 794 | 714 |
| కాశీ | 1334 | 1066 |
| కలకత్తా | 1033 | 764 |
| కాన్పూర్ | 1243 | 975 |
| కటక్ | 778 | 510 |
| ఢిల్లీ | 1361 | 1093 |
| లక్నో | 1288 | 1020 |
| నాగపూర్ | 682 | 414 |
| హైదరాబాద్ | 491 | 223 |
| తిరుపతి | 91 | 240 |
| పూరి | 776 | 508 |
| మధుర | 305 | 573 |
| భువనేశ్వర్ | 760 | 492 |
| మైసూర్ | 308 | 532 |
| బెంగుళూర్ | 222 | 446 |
| త్రివేంద్రం | 512 | 780 |
| కాకినాడ | 401 | 134 |
| మచిలీపట్టణం | 318 | 50 |
| ఏలూరు | 305 | 37 |
| రాజమండ్రి | 361 | 93 |
| గుంటూరు | 264 | 20 |
| కర్నూలు | 353 | 271 |
| కడప | 162 | 312 |
| చిత్తూరు | 102 | 285 |

| | | |
|---|---|---|
| అనంతపూర్ | 279 | 322 |
| బళ్ళారి | 307 | 310 |
| హోస్పేట | 347 | 350 |
| విశాఖపట్టణం | 486 | 219 |
| బరంపురం | 658 | 390 |
| పాట్నా | 1364 | 1096 |

## 1952–53 బడ్జెట్టు

ఇండియాప్రభుత్వ రైల్వేమంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి 1952-53 రైల్వే బడ్జెట్టును, ఇండియా పార్లమెంటులో 1952 మే 22న ప్రవేశపెట్టారు. ఆ బడ్జెట్టు వివరాలివి :

| | | |
|---|---|---|
| మొత్తం ఆదాయం అంచనా | : | రు. 2,82,16,00,000 |
| మొత్తం ఖర్చు అంచనా | : | రు. 2,17,93,00,000 |
| పెట్టుబడిమీద వడ్డీ చార్జీలు | : | రు. 34,00,00,000 |
| మిగులు (అంచనా) | : | రు. 23,47,00,000 |

అసలు ప్రయాణీకులవలననూ గూడ్సు చార్జీలవల్లనూ దాదాపు రు. 1,77,25,00,000 ఆదాయం వస్తుందనీ, రైల్వేలను నడపడానికి మొత్తం రు. 1,87,69,00,000 అవుతుందనీ అంచనా.

## దక్షిణ రైల్వే

1951 ఏప్రిల్ 14 తేదీన, దక్షిణఇండియాలోని ఎం. ఎస్. ఎం., ఎస్. ఐ., మైసూరు రయిల్వేలు మూడూను కలిపివేయబడి, ఒకే రయిల్వేగా దక్షిణ రయిల్వే అనే పేరుతో వ్యవహరింపబడుతున్నది. ఆ రయిల్వే శాఖలో మొత్తం రయిలు దారిపొడవు, 5,999 మైళ్లు. దీనిలో ఎం. ఎస్. ఎం. రయిల్వే పొడవు 2,938 మైళ్లు; ఎస్. ఐ. రయిల్వే. 2,349 మైళ్లు. మైసూరు రయిల్వే, 712.

ఈ మూడు రయిల్వేలలోనూ కలిపి 1,326 ఇంజనులూ (పెద్దవి 549, చిన్నవి 777); 20,431 వాగన్లూ (పెద్దవి 9,489, చిన్నవి 10,942); 3,003 పాసెంజరు పెట్టెలు (పెద్దవి 964, చిన్నవి 2,039) వున్నవి.

## ఆంధ్రప్రాంతంలో రైల్వేలైనులు

బరంపురం-వాల్తేరు 173; లంగేఘర్-విజయనగరం 135; నౌపడ-గుణుపూర్ 56; వాడి-రాయచూర్ 67; బల్లార్ష-చాందా 9; అదిలాబాద్-ముదిఖేడ్-హైదరాబాదు 260; బోధన్-నిజామాబాద్ 12; బల్లార్షా-ఖాజీపేట 170; వాడీ-తాండూరు-హైదరాబాదు, విజయవాడ 305; సికందరాబాద్-ద్రోణాచలం 185; డోర్నకల్లు-భద్రాచలంరోడ్డు 24; కారేపల్లి-సింగరేణి 7; బెంగుళూర్-హిందుపూర్ 63; తుంకూరు-బెంగుళూరు 44; బెంగుళూరు-కోలారు 82; మద్రాసు-వాల్తేరు 485; కాకినాడ-సామర్లకోట 10; నిడుదవోలు-నరసాపూర్ 48; భీమవరం-గుడివాడ 41; మచిలీపట్టణం-బళ్లారి 349; మాచర్ల-గుంటూరు 80; గుంతకల్లు-హిందూపూర్ 113; బళ్ళారి-రాయదుర్గం 34; ధర్మవరం-గూడూరు 226; పాకాల-కాట్పాడి 39; రాయచూరు-గుంటకల్లు-మద్రాసు 351; రేపల్లె-గుంటూరు 37; మొత్తం 3493.

## మధ్య రైల్వే

పూర్వం జి. ఐ. పి. రైల్వే, నైజాం రైల్వే, సింధియా రయిల్వే, ధోల్పూర్ రయిల్వేలని వ్యవహరింపబడే శాఖలన్నీ కలిపి మధ్య రయిల్వే అనే పేరుతో ఒకేఒక శాఖగా 1951 నవంబరు 5న ఏర్పాటుచేయబడినవి. ఈ రయిల్వేలో మొత్తం రయిల్వేలైనుల పొడవు 5,400 మైళ్లు. దీనిలో 4091 మైళ్లు బ్రాడ్ గాజ్; 744 మైళ్లు మీటర్ గాజ్; 564 మైళ్లు నారో గాజ్.

## పశ్చిమ రైల్వే

పూర్వం, బొంబాయి బరోడా సెంట్రల్ ఇండియా రయిల్వే, సౌరాష్ట్ర రైల్వే, రాజస్థాన్-జయపూర్ రయిల్వేలని పిలువబడేశాఖలన్నీ పశ్చిమ రయిల్వే అనే పేరుతో ఒకే రయిల్వేశాఖగా 1951 నవంబరు 5వ తేదిన ఏర్పాటు చేయబడినవి.

ఈ రయిల్వేలో మొత్తం 5,973 మైళ్ళ పొడుగు రయిలు దారి వుంది. దీనిలో 1,266 మైళ్ల బ్రాడ్ గాజ్; 3,914 మైళ్లు మీటర్ గాజ్; 793 మైళ్లు నారో గాజ్.

# విదేశీయుల అధీనంలోవున్న ప్రాంతాలు

భారతదేశంలో ఫ్రాన్సు, పోర్చుగల్ దేశాల ఆక్రమణలో కొంత భూభాగంవుంది. మూడు శతాబ్దాలనాడు, వర్తకానికి భారతదేశానికి వచ్చి, దేశీయ రాజకీయ వ్యవహారాలలో జోక్యంకలిగించుకొని, ఫ్రాన్సు, పోర్చుగల్ దేశాలు కొంతదేశాన్ని తమపరిపాలనలోకి తెచ్చుకున్నవి. తరువాత వచ్చిన బ్రిటిష్‌వారితో పోరాటఫలితంగా, ఈ రెండుదేశాల పలుకుబడి, వాటిపాలనలోవున్న భూభాగమూ చాలవరకు తగ్గిపోయాయి. నేడు ఈరెండుదేశాల పాలనలోవున్న ప్రదేశాలను సెటిల్మెంట్లు అని వాడుకలో అంటారు. ఈప్రదేశాలలో యిటీవల స్వాతంత్ర్యోద్యమం ప్రబలుతూవుంది. ఈరెండు సెటిల్మెంట్లలోనూవున్న ప్రజానాయకులు, ఈరెండు సెటిల్మెంట్లనూ, భారత దేశంలోని యితర ప్రాంతాలలో కలిపివెయ్యాలని కోరుతున్నారు. ఆ సెటిల్మెంట్ల వివరాలివి:

## ఫ్రెంచి సెటిల్మెంట్లు

వీటి వైశాల్యం మొత్తం 203 చదరపు మైళ్లు. ఈ సెటిల్మెంటు మొత్తం అయిదు. అవి, పుదుచ్చేరి, కరికాల్, మాహీ, యానాం అనే వూళ్లూ, వాటి పరిసర ప్రదేశాలు. వీటన్నిటిలోనూ మొత్తం జనాభా, 1941 లెఖలప్రకారం, 3,23,295. వీరిలో 1,62,916 మంది పురుషులు, 1,69,379 మంది స్త్రీలు. వీటన్నిటి పరిపాలన నిర్వహించడానికి, ఒక కమిషనర్ ఉన్నాడు. ఆయన వుండే స్థలం పుదుచ్చేరి. కమిషనర్: ఏండ్రి మేనార్డ్.

## పుదుచ్చేరి

ఈ నగరం, భారతదేశపు తూర్పుతీరంలో మదరాసుకు దక్షిణంగా 105 మైళ్ళ దూరంలోవుంది. ఈ నగరమూ, దీని పరిసర ప్రదేశాలూ మొత్తం ఫ్రెంచివారి అధీనంలోవున్నభూమి, 115 చ. మైళ్లు. జనాభా, 1941 లెక్కలప్రకారం 2,04,653.

## క రి కా ల్

ఇదికూడా మదరాసుకు దక్షిణంగా, సముద్రతీరాన తంజావూరు జిల్లాలోవుంది. ఈ సెటిల్మెంటులో మొత్తం 110 గ్రామాలు వున్నాయి. వీటి జనాభా 1941 లో 69,555. దీని వైశాల్యం 53 చ. మైళ్లు.

మా హి :

ఇది భారతదేశపు పశ్చిమతీరాన, మలబారులోవుంది.

యా నా ం :

ఇది తూర్పు గోదావరిజిల్లాలో, గోదావరి బంగాళా ఖాతంలోపడే చోటికి సమీపంలో, కాకినాడకు సుమారు 18 మైళ్ళదూరంలో వున్నది. దీని జనాభా 1941 లో 5,711.

దక్షిణ ఇండియాలోని ఫ్రెంచి సెటిల్మెంట్లు ఇండియాలో చేరాలా, ఫ్రాన్సుకు లోబడివుండాలా అనే విషయాన్ని గురించి రిఫరెండం 1949 డిసెంబరు 11 న జరుపాలని ఫ్రెంచి ఇండియామునిసిపల్ కౌన్సిలర్ల జనరల్ అసెంబ్లీ 1949 మార్చి 21 న తీర్మానించింది. ఫ్రెంచి ప్రభుత్వంతోను, ఇండియా ప్రభుత్వంతోను సమాలోచనలు జరుపడానికి ముగ్గురు సభ్యులతో ఒక రాయబారవర్గాన్నికూడా యీ అసెంబ్లీ నియమించింది. ఈ రాయబారవర్గం ఫ్రాన్సుకువెళ్ళి అచ్చటి ప్రభుత్వంతోనూ, ఢిల్లీలో ఇండియా ప్రభుత్వంతోను మంతనాలు జరిపింది.

ఇండియాలోని ఫ్రెంచి సెటిల్మెంట్లు ఫ్రాన్సుతో సంబంధం కలిగి వుండేటట్లయితే, వాటికి ఫ్రెంచి యూనియన్‌లో స్వపరిపాలన హక్కు ఇస్తామని ఫ్రెంచి ప్రభుత్వవర్గాలవారు చెప్పినట్లు యీ రాయబారవర్గం ప్రకటించింది.

ఫ్రెంచి ఇండియా మునిసిపల్ కాంగ్రెసు 1949 అక్టోబరు 17, 18 తేదులలో సమావేశమై, 1949 డిసెంబరులో జరుపుటకు నిశ్చయించిన రిఫరెండమును వాయిదా వేయ్యవలసినదనీ, ఫ్రెంచి ప్రభుత్వం ఇస్తానన్న స్వపరిపాలన హక్కును ఆమోదిస్తూ ఫ్రాన్సుతో సంబంధాన్ని ఉంచుకోడానికి నిశ్చయించింది.

1950 ఫిబ్రవరి 26 తేదీన వచ్చిన వార్త ప్రకారం, రిఫరెండం జనపదాన్ని త్రోసించి ప్రభుత్వం నిర్ణయించినట్లు తెలిసింది.

## పోర్చుగీసు సెటిల్మెంట్లు

పోర్చుగీసువారు మొట్టమొదట (1510) లో భారతదేశంలో ఆక్రమించుకున్న ప్రదేశం గోవా. ఇప్పటికీ ఇది వారి పాలనలో నేవుంది. నేడు దేశంలో పోర్చుగీసువారి ఆధీనంలోవున్న ప్రాంతం మొత్తం 3,983 కిలోమీటర్లు. ఈ ప్రాంతమంతా బొంబాయి రాష్ట్రంలో మూడు విడివిడి ప్రదేశాలుగావుంది. అవేమిటంటే, గోవా, డయ్యూ, డామన్. వీటన్నిటికీ రాజధాని నోవాగోవా. ఇది, పశ్చిమతీరంలోవున్న మర్మగోవాకు 6 మైళ్ళ దూరంలో నూతనంగా నిర్మింపబడింది. పోర్చుగీసు సెటిల్మెంట్ల గవర్నర్ జనరల్ ఇక్కడే వుంటాడు. డయ్యూ, డామన్‌లలో ఒక్కొక్క లెఫ్టినెంట్ గవర్నర్ ఉంటాడు. పోర్చుగీసు సెటిల్మెంట్ల మొత్తంలో 1931 లో 5,79,970 మంది ప్రజలున్నారు. తరువాత జనాభా లెఖలు తీసుకోలేదు. ఈ సెటిల్మెంట్ల మొత్తంలో నాలుగు పట్టణాలు, మూడు నగరాలు, సుమారు 600 గ్రామాలు వున్నాయి.

### మర్మగోవా :

నోవాగోవా, మర్మగోవా పట్టణాలూ, పరిసరప్రాంతాలూ కలిపి గోవాజిల్లా అని వాడుకలో వున్నాయి. నోవాగోవా, పోర్చుగీసు సెటిల్మెంటుకు రాజధాని అయినప్పటికీ రేవుపట్టం మర్మగోవా. ఇది బొంబాయికి దక్షిణంగా 226 మైళ్ళదూరంలోవుంది.

### డామన్ :

ఈ జిల్లా, బొంబాయికి ఉత్తరంగా సుమారు 100 మైళ్ళదూరంలో సముద్రతీరానవుంది. ఈ జిల్లా వైశాల్యం 86 చ. మైళ్లు.

### డయ్యూ :

ఈ జిల్లా, భారతదేశపు పశ్చిమతీరాన, కథియవాడకు దక్షిణంగా వున్న చిన్నద్వీపం. దీనివైశాల్యం సుమారు 20 చ. మైళ్ళు ఒకప్పుడు

ఇది గొప్ప వ్యాపారకేంద్రంగా వుండేదిగాని, ప్రస్తుతం అ[illegible] వుంది.

గవర్నర్-జనరల్: కమాండర్ క్వింటానిలా మెం[illegible]కా డయస్.

# సాయుధ బలాలు

ఇప్పుడు ఇండియాలోవున్న సైన్యదళానికి పునాది ఈస్టిండియా కంపెనీవారు తమ ఫ్యాక్టరీల రక్షణకు పదిహేడవశతాబ్దంలో ఏర్పాటు చేసుకున్న చిన్నచిన్న కాపలాదళాలు. క్రమేపీ, యీ దళాలసంఖ్య హెచ్చుచేయబడింది. ఈస్టిండియాకంపెనీవారు, దేశీయవ్యవహారాలలో జోక్యంకలిగించుకొని, దేశీయరాజుల పరస్పరకలహాలలో, ఎవరికో ఒకరికి సహాయపడడమూ, క్రమేపీ తామకూడా ఇండియాలో రాజ్యాన్ని సంపాదించుకోవడమూ జరగడంతో, తమసైన్యాన్ని విస్తరింపజెయ్యడమూ, సైనికులకు మంచి తర్ఫీదు ఇవ్వడమూ జరిగింది. బ్రిటిషువారు తయారుచేసిన యీ సైన్యంలోవున్న బ్రిటిషుసైనికులకు సోల్జర్సనీ, భారతీయసైనికులకు సిపాయిలనీ వ్యవహారనామం ఉండేది.

1857 లో సిపాయిలు సాగించిన మొదటి భారతీయ స్వాతంత్ర్య సమరఫలితంగా, ఇండియా పరిపాలనను ఈస్టిండియాకంపెనీ చేతినుండి బ్రిటిషు ప్రభుత్వం తీసుకున్నది. అప్పుడు ఇండియాలోని సైన్యం, బొంబాయి, మదరాసు, బెంగాల్ రాష్ట్రపు సైన్యాలుగా, మూడు భాగాలు చెయ్యబడింది.

ఆనాటికి ఇండియాలోని సైన్యంలో 65,000 మంది బ్రిటిషు సైనికులు, 1,40,000 భారతీయసైనికులూ వుండేవారు. 1895 లో సైన్యశాఖ నిర్వహణవిషయంలో మార్పు జరిగింది. సైన్యబలాలు నాలుగు కేంద్రాల క్రింద విభజింపబడినవి. 1904 లో, మళ్ళీ, మూడు కేంద్రాలుగా ఏర్పాటు చేయబడినవి. 1920 లో మళ్ళీ నాలుగు కేంద్రాలు ఏర్పాటు చేయబడినవి.

బ్రిటిషువారు భారతదేశంలో సైన్యాలను సమకూర్చడం ఆరంభించినప్పటినుంచి చాలాకాలందాకా, భారతీయు లెవరికీ బాధ్యతగల

హోదాలను సైన్యంలో ఇవ్వలేదు. మొట్టమొదటిసారి, 1918 లో భారతీయులకు సైన్యంలో ఆఫీసరుహోదా యివ్వడం జరిగింది. తరువాత, క్రమేపీ కొద్దికొద్దిగా, కింగ్స్ కమిషన్ (ఆఫీసరు హోదా) లను భారతీయులకు ఇవ్వడం జరిగినా, 1939 నాటికి భారతదేశంలోని సైన్యం అంతటిలోనూ 500 మందికంటె ఎక్కువ మంది ఆఫీసర్లు ఉద్యోగాలలోలేరు.

1939 లో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైన తరువాత, కొంచెం ఎక్కువగానే భారతీయులకు ఇండియా సైన్యంలో ఆఫీసరు ఉద్యోగాలు యివ్వబడినవి. యుద్ధం ముగిసేటప్పటికి, దాదాపు 8,000 మంది భారతీయులు ఆఫీసరు హోదాలో వున్నారు.

ప్రపంచయుద్ధం ముగిసిన రెండు సంవత్సరాలలో, రాజకీయ పరిస్థితులు అతివేగంగా మార్పులు చెందటముతో, సైన్యశాఖ పునర్నిర్మాణం విషయమై ఏమీ ఏర్పాట్లు జరుగలేదు. 1947 ఆగస్టు 15 తేదీన భారతదేశం విభజన జరగడంతో, భారతదేశపు సైన్యంకూడా విభజింపబడింది. అనాటికి భారతదేశంలోవున్న సైన్యంలో రెండు భాగాలు ఇండియా వంతుకీ, ఒక భాగం పాకిస్తాన్ వంతుకీ వచ్చాయి.

దేశవిభజనతో పాటు, దేశస్వాతంత్ర్యంకూడా లభించినందున, ఇండియాలోని బ్రిటిషు సైనికులందరినీ విడుదల చెయ్యడంకూడా జరిగింది. ఇండియాలోని ఆఖరు బ్రిటిషు పటాలం, 1948 ఫిబ్రవరి 28 తేదీన ఇండియా నుంచి వెళ్ళిపోయింది. అయితే, కొంతమంది బ్రిటిషువారు ఇంకా ఇండియా సైన్యంలో, ఇండియా ప్రభుత్వం కోరికపై పనిచేస్తూనే వున్నారు. వీరు యుద్ధ చర్యకుగాని, సైన్యనాయకత్వానికిగాని కాక భారతీయ సైనికులకు తర్ఫీదు ఇవ్వడం, సైనిక వ్యవహారాలలోని మెళుకువలను నేర్పడంలో నియమితులై వున్నారు. వీరి సంఖ్య చాలాతక్కువ.

ఇండియా సర్వసైన్యాధిపతిగా మొట్టమొదటి భారతీయుని నియామకం, 1948 డిసెంబరులో జరిగింది. ఈ పదవికి నియమింపబడిన జనరల్ కె. ఎం. కరియప్ప, 1949 జనవరి 15 తేదీన పదవీ స్వీకారం చేశారు.

## సాయుధబలాల నిర్వహణ

ప్రస్తుతం ఇండియా సాయుధబలాల నిర్వహణ ఎలా జరుగుతున్నదంటే :

సైన్యాలన్నీ సర్వసైన్యాధిపతికి లోబడివుంటాయి. నౌకాదళాలన్నీ సర్వనౌకాదళాధిపతికి లోబడివుంటాయి. విమానదళాలన్నీ సర్వవిమానదళాధిపతికి బాధ్యులై వుంటాయి. ఈముగ్గురున్నూ, ప్రభుత్వ రక్షణ శాఖామంత్రికి బాధ్యులై వుంటారు. సైన్య నిర్వహణ విషయంలో ఏయే విధానాలు అవలంబించాలో, యుద్ధచర్యలలో ఏయే విధానాలు అవలంభించాలో మొదలైనవాటిని ప్రభుత్వమంత్రిమండలి నిర్ణయించి, వాటిని మంత్రిమండలిలో ఏర్పాటుచేయబడిన డిఫెన్సుకమిటీద్వారా రక్షణశాఖామంత్రి తెలియజేస్తారు. రక్షణశాఖామంత్రి, యీవిధానాలను తన కార్యాలయం ద్వారా వివిధబలాల అధిపతులకు తెలియజేసి, అవి అమలు జరిగేటట్టు చూస్తాడు.

## సైన్యం

ఇండియాసైన్యం అనేకభాగాలుగా విభజింపబడివుంది. అవేమిటంటె : కవచదళాలు ; ఫిరంగి దళాలు ; సైనిక ఇంజనీరు దళాలు ; కాల్బలము ; మోటారు దళాలు ; వైద్యసహాయ దళాలు ; గుమస్తా దళాలు.

## నేషనల్ కేడెట్ కోర్

ఇండియాలోని యువకులకు సైనికశిక్షణను యివ్వడానికీ, అలా శిక్షణపొందినవారిలో అర్హులైనవారికి సైన్యంలో ఉద్యోగాలు యివ్వడానికీ ఒక పథకం తయారుచేయబడింది. ఆ పథకం ప్రకారం ఇండియాలో నేషనల్ కేడెట్ కోర్ స్థాపింపబడుతుంది. కేడెట్ అంటే సైనికశిక్షణ పొందేయువకుడని అర్థం. కోర్ అంటే దళం అని అర్థం : నేషనల్ కేడెట్ కోరును స్థాపించడానికి కేంద్రప్రభుత్వంవారి పథకానికి అన్నిరాష్ట్రాలప్రభుత్వాలవారూ అంగీకరించారు.

ఈ పథకం ఏమిటంటే : ఈ దళం రెండుభాగాలుగా వుంటుంది. భాగానికి డివిజన్ అని పేరు. సీనియర్ డివిజన్, అంటే కాలేజి విద్యార్థుల దళం : జూనియర్ డివిజన్ అంటే హైస్కూలు విద్యార్థుల దళం. ట్రెయినింగు ఆరంభించిన నాలుగు సంవత్సరాలలో, అంటే 1948 నుంచి 1952 నాటికి, సీనియర్ దళంలో 55,000 మందికీ, జూనియర్ దళంలో 1,25,000 మందికీ సైనికశిక్షణ యివ్వబడుతుంది. మొదటిసంవత్సరములో, అంటే 1948 ఆగస్టునుంచి ఒక ఏడాదిలోపల సీనియర్ డివిజన్‌లో 15,000 మందికీ, జూనియర్ డివిజన్‌లో 30,000 మందికి తర్ఫీదు యివ్వడానికి నిశ్చయింపబడింది.

1951 మార్చి 7 తేదినాటికి ఇండియా అంతటిలోనూ సీనియర్ డివిజన్ లో 736 మంది ఆఫీసర్లూ, 25,938 మంది కేడెట్లూ, జూనియర్ డివిజన్‌లో 1,455 మంది ఆఫీసర్లూ, 73,657 మంది కేడెట్లూ, బాలికల డివిజన్‌లో 9 మంది ఆఫీసర్లూ, 270 మంది కేడెట్స్ వున్నట్లు తేలింది.

మదరాసు రాష్ట్రంలో సీనియర్ డివిజన్‌లో 49 మంది ఆఫీసర్లూ, 1,869 కేడెట్లూ; జూనియర్ డివిజన్‌లో 113 ఆఫీసర్లూ, 3,030 కేడెట్లూ ఉన్నారు.

1951-52 లో నేషనల్ కోరును విస్తరింప చెయ్యవలసిందనీ, ఉన్న డివిజనులను కట్టుదిట్టమైన పద్ధతులలో స్థిరపరచవలసిందనీ ప్రభుత్వం నిశ్చయించింది.

నేషనల్ కేడెట్ కోర్ లో ప్రతి విద్యార్థీ చేరాలని నిర్బంధం లేదు ; ఇష్టంవచ్చినవారే చేరవచ్చును. ఇలాచేరి, తర్ఫీదుపొందినవారు తప్పనిసరిగా సైన్యములోచేరి యుద్ధకార్యాలలో పాల్గొనాలనే నిర్బంధంకూడా ఏమీలేదు. ఈ తర్ఫీదు కేవలమూ, యువకులకు సైనికశిక్షణను యిచ్చి, వారు ప్రయోజకులుగా తయారయ్యేటట్టు చెయ్యడానికే ఉద్దేశింపబడింది.

జూనియర్ డివిజన్‌లో చేర్చుకొనబడే కేడెట్ వయస్సు 13 ఏండ్లలోపు వుండకూడదు. 17 ఏండను మించకూడదు,

## ప్రాంతీయ సైన్యదళాలు

## (Territorial Army)

సైన్యంలోచేరి పనిచేస్తున్న వారికేగాక, దేశంలోని యువకులందరికి సైనికశిక్షణ యివ్వవలసిందనీ, అవసరం వచ్చినప్పుడు దేశరక్షణ కార్యాలలో సైన్యానికి చేదోడుగా వుండేటట్లు ప్రాంతీయ సైన్యదళాలను ఏర్పాటు చేయవలసిందనీ, చాలామంది నాయకులు కోరారు. ఈ కోరికను అనుసరించి, ఇండియా ప్రభుత్వంవారు ప్రాంతీయ సైన్యదళాలను ఏర్పాటు చెయ్యడానికి నిశ్చయించారు.

ప్రథమంలో, యీ ప్రాంతీయసైన్యం సంఖ్య 1,30,000 వుంటుంది. ఇది ఎనిమిదిదళాలుగా విభజింపబడి వుంటుంది. ఒకొక్క దళానికి ఒకొక్క ప్రాంతం నిర్ణీతమై వుంటుంది. ఆప్రాంతాలు ఇవి:

(1) పంజాబ్ రాష్ట్రం : తూర్పుపంజాబ్ సంస్థానాల యూనియన్ ; ఢిల్లీ. (2) ఉత్తరప్రదేశ్ ; (3) మధ్యప్రదేశ్ ; తూర్పు సంస్థానాలు. (4) బొంబాయి, కథియవాడ్. (5) మదరాసు ; మైసూర్ ; తిరువాంకూరు సంస్థానాలు. [6[ బీహార్ ; ఒరిస్సా, [7] పశ్చిమ బెంగాల్, కూచ్‌బీహార్. [8] అస్సాం, త్రిపుర, ,మణిపూర్ సంస్థానాలు.

మదరాసు రాష్ట్రంలో ప్రాంతీయ సైన్యదళం 1949 అక్టోబర్ 7 తేదీన స్థాపించబడింది.

ఈ దళాలుచేసే పని ఏమిటంటే : యుద్ధపరిస్థితులు ఏర్పడినపుడు, సైన్యానికి తగినవారు లభించేటట్లు సహాయకరంగా వుండటం: సైన్యం యుద్ధకార్యాలలో నిమగ్నమైవున్నందున, అంతరంగిక దేశరక్షణ కార్యాలలో పోలీసువారికి సహాయపడుతూ అల్లరులు, కల్లోలాలు జరుగకుండా శాంతిభద్రతలను కాపాడడం. తీరరక్షణ, విమానదాడి ప్రమాదఘటన మొదలైన పనులలో పాల్గొనడం. అవసరమైనప్పుడు దేశరక్షణలో పాల్గొని, దేశ స్వాతంత్ర్యాన్ని కాపాడడానికి సహాయపడా

లనే ఉత్సాహం గలవారంతా, యీ దళంలోచేరి సైనికశిక్షను పొందవచ్చును.

## నేషనల్ వార్ ఎకడెమీ

ఇండియాలోని సైన్య, నౌకా, విమాన దళాలలోని ఆఫీసరు ఉద్యోగాలకు భారతీయులను తయారుచేయడానికి ఒక కళాశాల [మిలిటరీ ఎకడెమీ] ను స్థాపించడానికి ఇండియా ప్రభుత్వంవారు నిశ్చయించారు. ఈ కళాశాల, రెండవ ప్రపంచయుద్ధంలో భారతీయ సైన్యాలు చూపిన ప్రతిభకు చిహ్నంగా పరిగణింప బడుతుందనికూడా ప్రకటింపబడింది. అదే వుద్దేశంతో, నేషనల్ వార్ ఎకడెమీ అనే పేరు పెట్టబడింది.

ఈ కళాశాలను ఎక్కడ స్థాపించాలో, దానికి ఏ పేరు పెట్టాలో, శిక్షణ పద్ధతులు ఎలా వుండాలో, విద్యార్థుల వయస్సు, అర్హతలు ఎలావుండాలో నిర్ణయించడానికి ప్రభుత్వంవారు ఒక కమిటీని నియమించారు. ఆ కమిటీచేసిన సలహాలను ఆమోదిస్తూ, 1948 మే 2 తేదిన ఇండియా ప్రభుత్వం చేసిన ప్రకటనను బట్టి, యీ ఎకడెమీ స్థాపన పథకం ఇది :

నేషనల్ వార్ ఎకడెమీ, పూనాకు 13 మైళ్ళ దూరంలోవున్న ఖరక్‌పస్లవద్ద స్థాపింపబడుతుంది. ఇండియాసైన్య, నౌకా, విమాన దళాలకు ఆఫీసర్లను తర్ఫీదు చెయ్యడానికి ఇది ఉద్దేశింపబడింది. దీనిలో చేర్చుకొనబడే విద్యార్థులు, కేవలము అర్హతలనుబట్టే ఎన్నుకోబడుతారు. వారి వయస్సు 15 ఏండ్లకుపైన 19 ఏండ్లకులోపు వుండాలి. దీనిలో చేరడానికి ముందు వారు మెట్రిక్యులేషనుగాని- దానితో సమానమైన పరీక్షగాని చదివివుండాలి. దీనిలో చేర్చుకొనబడిన విద్యార్థులకు తర్ఫీదు భోజనవసతి, దుస్తులు ఉచితంగా యివ్వబడుతవి. ఇక్కడ తర్ఫీదు మూడేళ్లు వుంటుంది. నౌకాశాఖలో చేరదలచిన విద్యార్థులు మాత్రం, 15 ఏటనే చేరాలి. సైన్యశాఖలో చేరదలచిన యువకులు,

మూడేళ్ల తర్ఫీదు అయిన తరువాత, మరొక ఏడాది యిక్కడవుండి యితర సైన్య శాఖలనుగురించి నేర్చుకోవాలి.

ఖరక్ వస్లలో, యీ కళాశాలకు కావలసిన భవన నిర్మాణానికి పునాదిని 1949 అక్టోబరు 6 న పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ వేశారు. ఈ భవననిర్మాణం జరిగేవరకు, యీ కళాశాల డేరాడూన్‌లో నిర్వహింపబడుతుంది. ఈ శిక్షణకు ఎన్నుకోబడే విద్యార్థుల మొదటి జట్టు తర్ఫీదు 1949 జనవరి 4 వ తేదిన ప్రారంభమైంది.

దీనిలో ప్రతిసంవత్సరమూ 600 లేక 700 మంది విద్యార్థులు చేర్చుకోనబడుతారు.

## నౌ కా ద ళ ం

ఈనాటి ఇండియా నౌకాదళపు పుట్టుక, 1612 లో జరిగిందని చెప్పవచ్చును. ఆ రోజులలో డచ్చివారు, పోర్చుగీసువారు తమ నౌకలను ఆటంకపరచకుండానూ, సముద్రపుదొంగలు తమ నౌకలను దోచుకోకుండానూ తమ నౌకలలో సాయుధ నావికదళాలను వుంచుకోడానికి నిశ్చయించి, ఈస్టిండియాకంపెనీవారు రెండు సాయుధనౌకలను ఏర్పాటుచేసుకున్నారు. క్రమేపి, యీ నౌకలసంఖ్య పెరిగి, ఇండియాప్రభుత్వాధిపత్యంలో పెద్ద నౌకాదళమే ఏర్పడింది.

1947 ఆగస్టులో భారతదేశ విభజనతోపాటు, నౌకాదళవిభజన కూడా జరిగింది. ఆనాటి నౌకాదళంలో మూడింట రెండువంతులూ ఇండియా వంతుకు వచ్చినవి. ఇండియావంతుకువచ్చిన నౌకలు ఏమిటంటే :

స్లూప్స్ : సట్లెజ్, యమున, కృష్ణ, కావేరి,

ఫ్రిగేట్స్ : తీర్, కుక్రి.

మైన్‌స్వీపర్ : ఒరిస్సా, డెక్కన్, బీహార్, కుమయూన్, [illegible]రోహిల్ ఖండ్, కర్నాటిక్, రాజపుటానా, కొంకణ్, [illegible]బెంగాల్, మదరాస్.

కార్వెట్ : అస్సాం.
సర్వేనౌక : ఇన్వెస్టిగేటర్.
ట్రాలర్స్ : కలకత్తా, కొచ్చిన్, అమృతసర్.

ఇవికాక, నాలుగు మోటారుమైన్‌స్వీపర్లు, హార్బర్లరక్షణకు ఉపయోగపడే నాలుగు మోటారులాంచీలు, భారత నౌకాదళంలోవున్న రేవు పడవలుకూడా ఇండియావంతుకు వచ్చాయి.

ఇండియా నౌకాదళాన్ని వృద్ధిచేసేఉద్దేశంతో, ప్రభుత్వం బ్రిటను నుంచి 'ఏచిల్లిస్' అనే 7030 టన్నుల క్రూయిజరును కొన్నారు. 'ఢిల్లీ' అనే పేరుతో ఇది, ఇండియా నౌకాదళ అగ్రనౌకగా ఇండియాకు 1948 జులై 4 తేదిన అప్పగించబడింది. తరువాత రోదర్‌హాం అను 1700 టన్నుల నౌకనుకొని, రాజపుట్ అనే పేరుతో ఇండియా నౌకాదళంలో చేర్చారు.

ఇండియాతీరం చాలా పొడవైనది కనుక, ప్రస్తుతంవున్న నౌకాదళం తీరరక్షణకు చాలదు. పదేళ్ళలో. ఇండియా నౌకాదళాన్ని తగినంతగా విస్తరింపచెయ్యడానికి ప్రభుత్వం ఒక పథకాన్ని తయారు చేశారు. నౌకాదళంలో పనిచేసే నావికసైనికులు (రేటింగ్స్)కు ట్రెయినింగు బొంబాయి, విశాఖపట్టణములలో ఇవ్వబడుతున్నది. నౌకాదళంలో ఆఫీసర్లుగా తర్ఫీదు పొందడానికి 47 మంది ఇంగ్లండు పంపబడినారు.

ఎక్కువమంది యువకులు నౌకాదళంలోచేరి, అతిముఖ్యమైన యీ దేశరక్షణ సేవలో పాల్గొనవలసిన అవసరం ఎంతేనావుంది.

ఇండియా స్వాతంత్ర్యాన్ని పొందినతరువాత, అంటే 1947 ఆగస్టు 15 తరువాత 1947 నవంబరు 29 నాటికి కొత్తగా ఏడు నౌకలను సుమారు 2,43,00,000 రూపాయల వ్యయంతో ఇండియాప్రభుత్వం కొన్నారు.

ఇండియాకు ప్రత్యేకంగా ఒక డెస్ట్రాయర్ దళాన్ని ఏర్పాటు చేసే వుద్దేశంతో ఇండియాప్రభుత్వం బ్రిటనునుంచి మూడు నౌకలను (ఒక్కొక్కటి 1700 టన్నులు) కొన్నారు. రాజపుట్, రంజిత్ రాణా అనే పేర్లతో యీ మూడు నౌకలు బొంబాయికి 1950 జనవరి 23 తేదిన చేరినవి. ఈ నౌకలు మూడునూ 1942 లో నిర్మింపబడినవి. ఒక్కొక్కదాని పొడవు 358 అడుగులు. ఒక్కొక్కదానిలో నాల్గేసి 4.7 అంగుళాల మూతిగల ఫిరంగులు వుంటాయి.

## విమానదళం

భారతదేశంలో మొట్టమొదటి విమానదళం, 1933 ఏప్రిల్‌లో ఏర్పాటుచేయబడింది. ఆ విమానదళ బలపుసంఖ్య ఎంతంటే : మూడు విమానాలు : ఆరుగురు వైమానికులు. ఇంత స్వల్పబలంతో ఆరంభమైన విమానదళం, రెండవ ప్రపంచయుద్ధం ముగిసేటప్పటికి పది స్క్వాడ్రనుల బలంగా తయారయింది. వీటిలో ఎనిమిది యుద్ధచర్యలలో పాల్గొనే విమానాలుగల స్క్వాడ్రనులు. రెండు యుద్ధసామగ్రిని సరఫరాచేసేవి.

1947 ఆగస్టులో దేశవిభజనతోపాటు విమానదళ విభజనకూడా జరిగింది. యుద్ధచర్యలలో పాల్గొనే విమానాలుగల స్క్వాడ్రనులుఏడు. యుద్ధసామగ్రిని సరఫరాచేసే విమానాలుగల స్క్వాడ్రను ఒకటి ఇండియా వంతుకు వచ్చాయి.

ఇండియావైశాల్యం, ఇండియాకుగల ప్రాముఖ్యతనుబట్టి, ప్రస్తుత వున్న విమానదళపు బలంచాలదు. ఈ దళాన్ని బాగా విస్తరింపచెయ్యడానికి ప్రభుత్వంవారు నిశ్చయించారు.

ఇండియా విమానదళంలో బాంబరు స్క్వాడ్రనులు, జెట్ విమాన స్క్వాడ్రనులుకూడా ఏర్పాటుచేయబడుతవి. అయిదు సంవత్సరాలలో, విమానదళ బలం మొత్తం 15 స్క్వాడ్రనులు చెయ్యడం ప్రభుత్వం సంకల్పం.

ప్రస్తుతం, కోయంబత్తూరు, జోథ్‌పూర్, అంబాల, బెంగుళూరు, మదరాసులలో వైమానికులకు తర్ఫీదునిచ్చే కేంద్రాలు వున్నాయి. ఇండియాలో తర్ఫీదుపొందిన వైమానికులలో కొందరిని ప్రతిఏటా ఇంగ్లండుపంపి, ఉత్తమశిక్షణను యిప్పించడానికికూడా ఏర్పాట్లు చేయబడినవి.

## వీరసత్కారం

ఇండియా సైన్య, నౌకా విమానదళాలలో అసాధారణమైన ధైర్యసాహసకార్యాలను ప్రదర్శించిన వీరులను సత్కరించడానికి, ఇకముందు యీ క్రింది బిరుదములు ఇవ్వడానికి కేంద్రప్రభుత్వంవారు నిశ్చయించారు.

ప్రథమ సత్కారం : పరమ వీర చక్ర

ద్వితీయ సత్కారం: మహా వీర చక్ర
తృతీయ సత్కారం: వీర చక్ర

పరమ వీర చక్ర పతకసత్కారం. ఇంతకుపూర్వ బ్రిటిషు ప్రభుత్వంయిచ్చే విక్టోరియా క్రాస్ పతకంతో సమానమైన హోదాగలది. భారతప్రజారాజ్య అవతరణసందర్భంలో, 1950 జనవరి 26 తేదిన ప్రభుత్వం వీరసత్కారం చేశారు. పరమ వీర చక్రం, మేజర్ సోమ నాథశర్మ, లాన్స్‌నాయక్ కరంసింగ్ అనువారిద్దరికి ఇవ్వబడింది. వీరిలో మేజర్ సోమనాథశర్మకు మరణానంతరం ఇవ్వబడింది. 1950 డిసెంబరు 18 న, సిపాయ్ ఎస్. కుమారన్ పిళ్లైకు యీ బహూకరణ జరిగింది. 1952 జనవరి 25 న హావల్దార్ మేజర్ పీరు సింగ్‌కు, మరణానంతరం ఇవ్వబడింది.

చాలామందికి మహావీర్ చక్ర, వీర చక్ర సత్కారం జరిగింది. ఈ సత్కారాలన్నీ కాశ్మీర్ యుద్ధంలో పాల్గొన్నవారికే.

పరమ వీరచక్ర సత్కారాన్ని పొందినవారికి నెలకు రు. 50 భృతి ఇవ్వబడుతుంది. ఒకసారి పరమ వీరచక్రంపొంది, మళ్లీ గొప్పపని చేసినవారికి పరమ వీరచక్రం బార్ ఇవ్వబడుతుంది. అలా బార్ పొందిన వారికి, ప్రతిబార్‌కూ, అదనంగా రు. 20 భృతి ఇవ్వబడుతుంది.

మహా వీరచక్రం పొందినవారికి నెలకు రు. 30 భృతి ఇవ్వబడుతుంది. ఒకొకబార్‌కు అదనంగా రు. 10 భృతి ఇవ్వబడుతుంది.

వీరచక్ర సత్కారం పొందినవారికి నెలకు రు. 20 భృతి ఇవ్వబడుతుంది. అదనంగా ప్రతిబార్‌కూ రు. 8 భృతి ఇవ్వబడుతుంది.

సత్కారంపొందిన వీరుడు మరణించినట్లయితే, యీ భృతి, అతని భార్యకు ఇవ్వబడుతుంది.

ఈభృతి జూనియర్ కమిషన్డ్ ఆఫీసర్లకు, అంతకు తక్కువ హోదా గలవారికిమాత్రమే ఇవ్వబడుతుంది. కమిషన్ ఆఫీసర్లకు ఇవ్వబడదు.

బ్రిటిషుప్రభుత్వ పాలనకాలంలో, విక్టోరియాక్రాస్, జార్జిక్రాస్ అనే బహుమతులు ఇవ్వబడేవి. (వీటి వివరాలకు 1950-51 సంవత్సరపు ప్రపంచదర్శిని చూడండి.)

## అ శో క చ క్ర

యుద్ధచర్యలలోగాక, ఇతర సందర్భాలలో సాహస, ఔదార్యాలను ప్రదర్శించి ప్రశంసనీయమైన సేవచేసినవారికి, సాయుధబలాలలో వున్నవారికేగాక ఇతర సామాన్యప్రజలకుకూడా బహూకరణ చెయ్యడానికి 'అశోకచక్ర' పతకాన్ని ఏర్పాటుచేస్తూ, ప్రెసిడెంటు ఉత్తరువు 1952 జనవరి 12 న జరిగింది.

ఈ పతకం మూడు తరగతులు కలిగివుంటుంది.

గొప్ప సాహసము, త్యాగము చూపినవారికి మొదటి తరగతి; గొప్ప సాహసము చూపినవారికి రెండవ తరగతి; ప్రశంసనీయమైన సాహసము చూపినవారికి, మూడవ తరగతి.

# రా జ కీ య ప క్షా లు

### కాంగ్రెసు

అఖిలభారత కాంగ్రెసు మహాసభ 1885 లో స్థాపింపబడింది. అప్పుడు కేవలం మతవాదపక్షంగా ఏర్పడినా, క్రమేపీ, దేశ స్వాతంత్ర్య సంపాదనకు పూనుకున్న ప్రధాన సంస్థ ఇదే. దీనిలోచేరి, అనేక కష్టనష్టాలకు గురియై, ఎంతోమంది స్వాతంత్ర్య వీరులు, స్వాతంత్ర్య సమరంలో తమ ప్రాణాలనుకూడా అర్పించారు. ఈనాడు, అఖిలభారత జాతీయ సంస్థగా, కాంగ్రెసు పక్షం, దేశంలోని రాజకీయ కక్షలలో ప్రధాన స్థానాన్ని పొందింది.

కాంగ్రెసు మహాసభ ప్రాతినిధ్యం, భాషాప్రయుక్త రాష్ట్ర విధానంమీద ఆధారపడివున్నది.

కాంగ్రెసు మహాసభ అధ్యక్షుడు : జవహర్‌లాల్ నెహ్రూ.

వివిధ భాషాప్రాంతముల కాంగ్రెసు కమిటీలకు ప్రదేశ్ కాంగ్రెసు కమిటీలని పేరు.

ప్రస్తుతం 25 ప్రదేశ్ కాంగ్రెసు కమిటీలు ఉన్నాయి. అజ్మీరు, అస్సాం, ఆంధ్ర, ఉత్కళ, కర్నాటక, కేరళ, గుజరాత్, ఢిల్లి, తమిళనాడు, నాగపూర్, పంజాబ్, పాటియాల తూర్పు పంజాబ్ సంస్థా

గాల యూనియన్, బీహార్, బెంగాల్, బొంబాయి, మధ్యభారత్ మహాకోసల, మహారాష్ట్ర, మైసూరు, ఉత్తరప్రదేశ్, రాజపుటానా, విదర్భ, (బీరార్), వింధ్యప్రదేశ్, హిమాచల ప్రదేశ్, హైదరాబాదు,

1947 ఆగష్టు 15 న ఇండియా స్వాతంత్ర్యాన్ని పొందడంతో, అంతవరకు స్వాతంత్ర్య సంపాదనే ప్రధాన ధ్యేయంగా పెట్టుకున్న కాంగ్రెసు, తన కార్యక్రమాన్ని నూతన పరిస్థితులకు అనుగుణంగా మార్చుకోవలసివచ్చింది. ఈవిషయమై నాయకులంతా తీవ్రంగా ఆలోచనలు జరిపారు. తన హత్యకుపూర్వం గాంధీమహాత్ముడు కొన్ని సూచనలను కూడా చేశారు. ఆ సూచనలను దృష్టిలో పెట్టుకొని, కాంగ్రెసువర్కింగు కమిటీవారు కాంగ్రెసు విధానాన్ని గురించి ఒక తీర్మానాన్ని తయారు చేశారు. ఆ తీర్మానాన్ని, 1948 ఏప్రిల్‌లో అఖిలభారత కాంగ్రెసు కమిటీవారు ఆమోదించారు. ఆ తీర్మానంప్రకారం, కాంగ్రెసు నిర్మాణం, నిర్వహణ యీ క్రిందిపద్ధతులలో జరుగుతుంది.

"అందరు వ్యక్తులకూ సమానమైన సాంఘిక, రాజకీయ, ఆర్థిక హక్కులువుండే సహకార ప్రభుత్వవిధానాన్ని ఇండియాలో స్థాపించడమూ, ఇండియాప్రజల స్థితిగతులను చక్కబరచడమూ, ప్రపంచశాంతికీ, అన్యోన్యతకూ పాటుపడటమూ కాంగ్రెసు ఆశయం.

"21 సంవత్సరాలు వయసునిండి, కాంగ్రెసు ఆశయాన్ని అంగీకరించి, ఏడాదికి పావలా రుసుము చెల్లించే ఏ వ్యక్తిఅయినా ప్రాథమిక కాంగ్రెసు పంచాయితీని ఎన్నుకోడానికి ఓటు కలిగివుంటాడు.

"ఒక గ్రామానికిగాని, కొన్ని గ్రామాలసమూహానికిగాని, నగరంలో ఒక భాగానికిగాని, ప్రతి 2,500 మంది ఓటర్లకు ఒకొక్క ప్రాథమిక కాంగ్రెసు పంచాయితీ ఏర్పాటు చేయబడుతుంది. ఏ పంచాయితీలోను ముగ్గురు సభ్యులకు తక్కువ, పదిమందికి ఎక్కువ సభ్యులు వుండరు.

"ప్రాథమిక పంచాయితీకి సభ్యుడుగా ఎన్నిక కాదలచిన వ్యక్తి యీ క్రింది నిబంధనలకు లోబడివుండాలి.

"అతడు చేతితో వడికిన నూలుతో నేసిన ఖద్దరునే సర్వదా ధరించాలి. మద్యపానీయాలను వాడకూడదు. అస్పృశ్యతను అన్నివిధాలా

నిరసించాలి. కులసామరస్యంపట్ల విశ్వాసం కలిగివుండాలి. అన్నిమతాల పట్ల గౌరవం కలిగివుండాలి. జాతి, మత, స్త్రీ, పురుష వివక్షతలేకుండా అందరు ప్రజలూ సమానహక్కులు, సమాన సదుపాయాలు కలిగివుండాలనే విశ్వాసాన్ని కలిగివుండాలి.

"ప్రాథమిక పంచాయితీలలోని సభ్యులందరూ ఏడాది కొక పావలా చందా కట్టాలి.

"ప్రతి రాష్ట్రంకూడా, ఆ రాష్ట్రంలోని జనాభానుబట్టి ప్రతిలక్ష మంది ప్రజలకు ఒక సభ్యుడుచొప్పున అఖిలభారత కాంగ్రెసుకు ప్రతినిధులను ఎన్నుకోడానికి హక్కు కలిగివుంటుంది.

"కాంగ్రెసు మహాసభ ప్రతిసంవత్సరమూ జరగాలి."

## చీలికలు

ప్రస్తుతం కాంగ్రెసు సంస్థవ్యవహారాలను నిర్వహిస్తున్నవారు, కాంగ్రెసు మహాసభ ఆశయాలను సరిగా పాటించడంలేదనే ఆరోపణతో, కాంగ్రెసులోనే 'డెమొక్రాటిక్ పక్షం' అనే పేరుతో ఒక కొత్తకక్షిని ప్రారంభిస్తూ 1950 నవంబరు 2 ఆచార్య కృపాలినీ ఒకప్రకటన చేశారు.

ఆకక్షి ఆశయాలు ఏమిటంటే: కాంగ్రెసు ఆదర్శాలను ఆచరణలోనికి తేవడం; కులసామరస్యతను దృష్టిలోపెట్టుకొని కాంగ్రెసు నిర్మాణకార్యక్రమాన్ని అమలుజరపడం; ప్రజాజీవితంలోనూ, ప్రభుత్వశాఖలలోను కల్మషంలేకుండా చూడటం; విపరీత లాభాలను సంపాదించే తత్వాన్నీ దొంగ మార్కెట్ లో వ్యాపారాన్నీ నిర్మూలించడం; కాంగ్రెసు మహాసభలో అవినీతిని, అభిమానతత్వాలను తొలగించి, ప్రజాప్రభుత్వ సూత్రాలపై ఆ సంస్థను నడపడం.

ఆంధ్రరాష్ట్రంలో యీ కక్షికి రాష్ట్రీయ సంఘాన్ని ఏర్పాటు చేసినట్లు, 1950 నవంబరు 16 న టి. ప్రకాశం ప్రకటనచేశారు. ఈకక్షికి అధ్యక్షులు, టి. ప్రకాశం. కార్యదర్శులు: తెన్నేటి విశ్వనాధం, బి.ఎస్. మూర్తి, ఆర్. వెంకటరెడ్డి, కోశాధిపతి: సత్రశాల వెంకటరాం.

## నెహ్రూ అధ్యక్షత

కాంగ్రెసులో చీలికలు ఏర్పడడం, కొంతమంది సభ్యులు వైదొలగి పోయి, ప్రజాపక్షంలో చేరడం; కాంగ్రెసులోనే కొందరు ముఠాలుగా ఏర్పడడంతో కాంగ్రెసుపట్ల ప్రజల గౌరవం క్షీణించడం జరిగింది. అలాటి పద్ధతిలో కాంగ్రెసులో ఐకత్యము, సంఘీభావాన్ని నెలకొల్పి, ప్రజాసేవాదీక్షను సభ్యులలో పురికొల్పి, ప్రజలకు కాంగ్రెసు అంటే గౌరవం కలిగిస్తేనేగాని ఎన్నికలలో కాంగ్రెసుకు విజయం కలుగదేమో నని, కాంగ్రెసు నాయకత్వంలో మార్పులు చేయించడానికి ప్రయత్నాలు జరిగినవి. కాని, మార్పులకు కాంగ్రెసు అధ్యక్షుడు సమ్మతించనందున, వర్కింగుకమిటీ సభ్యత్వానికీ, ఎన్నికల కమిటీ సభ్యత్వానికీ పండిట్ నెహ్రూ 1951 ఆగస్టులో రాజీనామా ఇచ్చారు. ఈ రాజీనామాను గురించి చర్చించడానికి ఐ. సి. సి. సమావేశం ఢిల్లీలో సెప్టెంబరు 8 న జరిగింది. ఆ సభలో కాంగ్రెసు అధ్యక్షుడు టాండన్ తమ పదవికి రాజీ నామా ఇచ్చారు. వర్కింగుకమిటీ సభ్యులంతా కూడా రాజీనామా ఇచ్చారు. కాంగ్రెసు అధ్యక్షులుగా పండిట్ నెహ్రూ ఎన్నుకోబడినారు.

1951 సెప్టెంబరు 15 తేదిన, 15 మంది సభ్యులతో యీ క్రింది వర్కింగు కమిటీని పండిట్ నెహ్రూ నియమించారు.

1. మౌలానా అబుల్ కలాం ఆజద్; 2. పురుషోత్తమదాస్ టాండన్; 3. పండిట్ గోవిందవల్లభపంత్; 4. మురార్జి దేశాయ్; 5. కె. కామ రాజ నాడార్; 6. శంకరరావ్ దేవ్; 7. నీలం సంజీవరెడ్డి; 8. నవకృష్ణ చౌధురి; 9. సర్దార్ ప్రతాప్‌సింగ్ కైరాన్; 10. ఓ. ఎస్. హిరే; 11. గుల్జారిలాల్ నంద; 12. మాణిక్యలాల్ వర్మ; 13. పి. ఐ. ముని స్వామిపిళ్లె; 14. లాల్ బహదూర్ శాస్త్రి; 15. యు. శ్రీనివాస మల్లయ్య.

వీరిలో లాల్ బహదూర్ శాస్త్రి, యు. శ్రీనివాస మల్లయ్యగార్లు ప్రధాన కార్యదర్శులుగాను, మురార్జి దేశాయ్‌గారు కోశాధికారిగాను నియమింపబడినారు.

ప్రదేశ్ కాంగ్రెసు సంఘాల అధ్యక్షులు: అజ్మీర్, పండిట్ ముకుటబిహారీలాల్ భార్గవ; ఆంధ్ర, నీలం సంజీవరెడ్డి; అస్సాం, సిద్ధినాథ్ శర్మ: ఉత్కళ, విశ్వనాథదాస్; ఉత్తర ప్రదేశ్, అల్గురాయ్ శాస్త్రి; కర్నాటక, ఎస్. నిజలింగప్ప; కేరళ, కుట్టిమాలు అమ్మ; గుజరాత్, కన్యాలాల్ దేశాయి; ఢిల్లీ, బ్రహ్మప్రకాశ్; తమిళనాడు, డాక్టర్ పి. సుబ్బరాయన్; నాగపూర్, ఎం. ఎస్. కన్నమ్వార్; పంజాబ్, ప్రతాపసింగ్ కైరాన్; పాటియాల తూర్పు పంజాబ్ సంస్థానాల యూనియన్, హరవంశలాల్; బీహార్, లక్ష్మీనారాయణ సుధాంశు; బెంగాల్, అతుల్యఘోష్; బొంబాయి. ఎస్. కె. పాటిల్; మధ్యభారత్, గోపీకృష్ణ విజయవర్గీయ; మహాకోసల, సేట్ గోవిందదాస్; మహారాష్ట్రం, టి. ఎస్. హిరె; మైసూరు, కె. హనుమంతయ్య; రాజపుటానా, మాణిక్యలాల్ వర్మ; విదర్భ (బీరార్), డాక్టర్ గోపాలరావు ఖేద్కర్; వింధ్యప్రదేశ్, వనస్పతిసింగ్; హిమాచలప్రదేశ్, పండిత పద్మదేవ్; హైదరాబాద్, స్వామి రామానంద తీర్థ.

## ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్

ఆంధ్రనాయకులలో అభిప్రాయభేదములు ఎక్కువై కాంగ్రెసు సంస్థలో ముఠాలు ఏర్పడి, నాసిక్ కాంగ్రెసు సమావేశం నాటికి, ఆంధ్ర రాష్ట్రంలో కాంగ్రెసు పంచాయతీల ఎన్నికలు జరుగలేదు.

1950 సెప్టెంబరు 3 తేదీన కాంగ్రెసు వర్కింగుకమిటీ ఢిల్లీలో, డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారి అధ్యక్షతను సమావేశమై ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కమిటీని రద్దుచెయ్యడానికి నిశ్చయించింది. ఆ నిశ్చయంతోపాటు, రాష్ట్ర కాంగ్రెసు రికార్డులనూ, ఆస్తిపాస్తులను, బొంబాయి కాంగ్రెసు అధిపతి ఎస్. కె. పాటిల్‌కు స్వాధీనపరచడానికీ, రాష్ట్ర కాంగ్రెసు పరిపాలనలో ఆయనకు సలహా యివ్వడానికి అయిదుగురు సభ్యులను ఏర్పాటు చేయడానికీ నిర్ణయింపబడింది. ఈ అయిదుగురు సభ్యులు ఎవరంటే, పోటీలేకుండా ఆంధ్రదేశంనుంచి నాసిక్ కాంగ్రెసుకు ఎన్నుకోబడిన 38 మంది ప్రతినిధులచేత ఎన్నుకోబడినవారు.

ఈ 38 మంది ప్రతినిధులు విజయవాడలో సెప్టెంబరు 9 తేదీన సమావేశమై శ్రీ టంగుటూరి ప్రకాశం, కళా వెంకటరావు, ఆచార్య ఎన్. జి. రంగ, కె. కోటిరెడ్డి, సి. ఎల్. ఎన్. రాజుగార్లను ఏ. ఐ. సి. సి. సభ్యులుగా ఎన్నుకున్నారు.

రాష్ట్రకాంగ్రెసు పాలనలో ఎస్. కె. పాటిల్‌కు సలహా ఇవ్వడానికి యీ క్రింది అయిదుగురు సలహా సభ్యులుగా ఎన్నుకోబడినారు: శ్రీ టంగుటూరి ప్రకాశం, ఆచార్య ఎన్. జి. రంగ, ఓ. సుబ్బరాజు, కె. వెంకటరత్నం, సి. శివారెడ్డి.

1951 ఏప్రిల్ 11 తేదీన రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష ఎన్నిక జరిగింది. ఎన్నికలో నీలం సంజీవరెడ్డిగారికి 87 ఓట్లు వచ్చినవి. ఆచార్య రంగాగారికి 82 ఓట్లు వచ్చినవి. సంజీవరెడ్డిగారు అధ్యక్షులయ్యారు.

1952 జనవరిలో రాష్ట్రంలో శాసనసభలకు జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు బాగా దెబ్బతిన్నందున, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కార్య నిర్వాహకవర్గ సభ్యులందరూ ఎన్నికలలో ఓడిపోయినందున, కార్య నిర్వాహకవర్గం, 1952 ఫిబ్రవరి 27 న, చిత్తూరు సమావేశంలో రాజీనామా ఇచ్చింది. ప్రదేశ్ కాంగ్రెసు వ్యవహారాలను, అధ్యక్షులు శ్రీ నీలం సంజీవరెడ్డిగారు నిర్వహించడానికి, వారికి అధికారం ఇవ్వబడినది.

ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షపదవికి ఎన్నికలు మళ్లీ 1952 మే 4 తేదీన విజయవాడలో జరిగినవి. నీలం సంజీవరెడ్డిగారు అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడినారు.

ఈ క్రింది కార్యవర్గాన్ని 1952 మే 9 న అధ్యక్షులు నియమించారు.

ఉపాధ్యక్షులు: వేముల కూర్మయ్య, శ్రీమతి బి. కామేశ్వరమ్మ.

ప్రధాన కార్యదర్శి: కాకాని వెంకటరత్నం.

జాయింట్ సెక్రటరీలు: లుకలాపు లక్ష్మణదాసు, ఎన్. పి. వెంగళ్రాయ నాయుడు.

## ప్ర జా ప క్షం

1951 ఏప్రిల్ 11 తేదీన ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక తరువాత, టంగుటూరి ప్రకాశం, ఆచార్య రంగాగార్లు కాంగ్రెసు నుంచి విడిపోయి, ప్రజాపక్షం అనే కొత్తపార్టీని స్థాపించారు.

## కాంగ్రెసు మహాసభ అధ్యక్షులు

| సంవత్సరం | స్థలం | అధ్యక్షులు |
|---|---|---|
| 1885 | బొంబాయి | డబ్ల్యు. సి. బెనర్జి |
| 1886 | కలకత్తా | దాదాభాయ్ నౌరోజి |
| 1887 | మదరాసు | బద్రుద్దీన్ త్యాబ్జి |
| 1888 | అలహాబాద్ | జార్జి యూల్ |
| 1889 | బొంబాయి | సర్ డబ్ల్యు. వెడ్డర్ బర్న్ |
| 1890 | కలకత్తా | సర్ పి. మెహాత |
| 1891 | నాగపూర్ | పి. ఆనందాచార్లు |
| 1892 | అలహాబాద్ | డబ్ల్యు. సి. బెనర్జి. |
| 1893 | లాహోర్ | దాదాభాయ్ నౌరోజి |
| 1894 | మదరాసు | ఎ. వెబ్ |
| 1895 | పూనా | ఎస్. ఎన్. బెనర్జి |
| 1896 | కలకత్తా | ఆర్. ఎం. సియాని |
| 1897 | అమరావతి | సి. శంకరన్ నాయర్ |
| 1898 | మదరాసు | ఆనందమోహనబోస్ |
| 1899 | లక్నో | రమేశచంద్రదత్ |
| 1900 | లాహోర్ | ఎన్. జి. చంద్రావర్కార్ |
| 1901 | కలకత్తా | డి. వాచా |
| 1902 | అహమ్మదాబాద్ | ఎస్. ఎస్. బెనర్జి |
| 1903 | మదరాసు | లాల్ మోహన ఘోష్ |
| 1904 | బొంబాయి | సర్ హెన్రీ కాటన్ |
| 1905 | కాశీ | గోపాలకృష్ణ గోఖలే |

| | | |
|---|---|---|
| 1906 | కలకత్తా | దాదాభాయ్ నౌరోజి |
| 1907 | సూరత్ | రాసవిహారిఘోష్ |
| 1908 | మదరాసు | రాసవిహారిఘోష్ |
| 1909 | లాహోర్ | మదనమోహన మాళవియ |
| 1910 | అలహాబాద్ | సర్ దబ్ల్యు. వెడ్డర్ బర్న్ |
| 1911 | కలకత్తా | బి. ఎన్. దార్ |
| 1912 | పాట్నా | ఆర్. ఎన్. మధోల్కార్ |
| 1913 | కరాచి | నవాబ్ సయ్యద్ మహమ్మద్ |
| 1914 | మదరాసు | భూపేంద్రనాథ్ బాసు |
| 1915 | బొంబాయి | ఎస్. పి. సింహా |
| 1916 | లక్నో | ఎ. సి. మజుందార్ |
| 1917 | కలకత్తా | అని బెసెంట్ |
| 1918 | ఢిల్లీ | హస్సన్ ఇమాం |
| 1918 (ప్ర.స.) | బొంబాయి | మదనమోహన మాళవీయ |
| 1919 | అమృతసర్ | పండిత మోతిలాల్ నెహ్రూ |
| 1920 | నాగపూర్ | సి. విజయరాఘవాచారి |
| 1920 | కలకత్తా | లాలా లజపతిరాయ్ |
| 1921 | అహమ్మదాబాద్ | హకీం అజ్మల్ ఖాన్ |
| 1922 | గయ | చిత్తరంజనదాస్ |
| 1923 | కాకినాడ | మహమ్మద్ అలీ |
| 1923 (ప్ర.స.) | ఢిల్లీ | అబుల్ కలాం ఆజద్ |
| 1924 | బెల్గాం | కరంచంద్ గాంధి |
| 1925 | కాన్పూర్ | సరోజిని నాయుడు |
| 1926 | గౌహతి | ఎస్. శ్రీనివాస అయ్యంగార్ |
| 1927 | మదరాసు | డాక్టర్ ఎం. ఎ. అన్సారి |
| 1928 | కలకత్తా | పండిత మోతిలాల్ నెహ్రూ |
| 1929 | లాహోర్ | పండిత జవహర్ లాల్ నెహ్రూ |
| 1931 | కరాచి | వల్లభాయ్ పటేల్ |

| | | |
|---|---|---|
| 1932 | ఢిల్లీ | సేట్ రణచోడ్‌లాల్ |
| 1933 | కలకత్తా | పండిత మదనమోహన మాళవీయ |
| 1934 | బొంబాయి | బాబు రాజేంద్రపసాద్ |
| 1935 | లక్నో | పండిత జవహర్‌లాల్ నెహ్రూ |
| 1936 | ఫైజుపూర్ | పండిత జవహర్‌లాల్ నెహ్రూ |
| 1937 | హరిపుర | సుభాసచంద్రబోస్ |
| 1938 | త్రిపురి | సుభాసచంద్రబోస్ |
| 1939 | | బాబు రాజేంద్రప్రసాద్ |
| 1940 | రామఘర్ | అబుల్ కలాం అజద్ |
| 1946 | | పండిత జవహర్‌లాల్ నెహ్రూ |
| 1946-47 | | ఆచార్య కృపలాని |
| 1947 | | బాబు రాజేంద్రప్రసాద్ |
| 1948 | జయపూర్ | డాక్టర్ బి. పట్టాభి సీతారామయ్య |
| 1950 | నాసిక్ | బాబు పురుషోత్తమదాస్ టాండన్ |
| 1951 | | పండిత జవహర్‌లాల్ నెహ్రూ |

ముస్లింలీగ్ :

ముస్లిములకు ప్రత్యేక సౌకర్యాలను సంపాదించడానికి 1906 లో స్థాపింపబడినది. ఆనాడు దేశంలో ముస్లిములతరఫున ప్రధాన ప్రాతినిధ్యంగల సంస్థ. కాంగ్రెసుకు ప్రతికక్షిగా నిలచి, దేశంలో ముస్లిములు అధికసంఖ్యాకులుగాగల ప్రాంతాలన్నిటినీ ఒక ప్రత్యేకభాగంగా విభజించి, ముస్లిము పరిపాలనకు, పాకిస్తాన్ అనే పేరుతో అప్పజెప్పాలని కోరింది.

1947 డిసెంబరు 15 న కరాచీలో, ఆల్ యిండియా ముస్లింలీగు సమావేశమైంది. దేశవిభజన తరువాత మొట్టమొదట జరిగిన యీ సమావేశంలో, యికముందు ఇండియాకు వేరు, పాకిస్తాన్‌కు వేరు ముస్లింలీగులను స్థాపించడానికి నిర్ణయించబడింది. పాకిస్థాన్ ముస్లింలీగు స్థాపన ఏర్పాటుచేయ్యడానికి లియాకత్ అలి ఖాన్, ఇండియా ముస్లింలీగు స్థాపన ఏర్పాటు చెయ్యడానికి మహమద్ ఇస్మాయిల్ గార్లు ఎన్నుకోబడినారు.

**హిందూమహాసభ :**

హిందువుల ప్రత్యేకహక్కులను కాపాడడానికి ఏర్పడిన సంస్థ. దేశవిభజనను తీవ్రంగా ప్రతిఘటించింది. గాంధీజీ హత్య జరిగిన తరువాత రాజకీయాలలో పాల్గొనటాన్ని విరమించింది. కాని 1949 మే లో మళ్లీ రాజకీయాలలో పాల్గొనడానికి నిశ్చయించింది.

అధ్యక్షుడు: డాక్టర్ ఎన్. బి. ఖారే.

**సోషలిస్టుపార్టీ :**

ఇన్నాళ్లూ కాంగ్రెసులోనే ఒకపక్షంగావుండి, 1947 లో ప్రత్యేక పార్టీగా ఏర్పడింది. దేశంలో సోషలిస్టు పద్ధతిలో పరిపాలన ఏర్పడాలని కోరే పక్షం. దేశమంతటా యీ పార్టీకి సభ్యులు వున్నారు.

ప్రధాన కార్యదర్శి : అశోక్ మెహతా.

ఆంధ్ర బ్రాంచి కార్యదర్శి : మద్దూరి అన్నపూర్ణయ్య.

**కమ్యూనిస్టుపార్టీ :**

కార్మికుల ఆధ్వర్యాన ఏర్పడే పరిపాలనను దేశంలో స్థాపించి, ధనస్వామిత్వాన్ని నిర్మూలనంచేసి, వర్గభేదంలేని సంఘాన్ని స్థాపించడం ప్రధానాశయంగా గల సంస్థ.

అఖిలభారత ప్రధానకార్యదర్శి : చంద్ర రాజేశ్వరరావు.

ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి : మద్దుకూరి చంద్రశేఖరరావు.

# రాజ్యాంగ సంస్కరణలు

బ్రిటిషు ప్రభుత్వంవారు ఈస్టిండియాకంపెనీ చేతిలోనుంచి భారత దేశ పరిపాలనాబాధ్యతను, 1858 లో తమ చేతిలోకి తీసుకున్నారు. తరువాత, 1861 లో బెంగాల్, బొంబాయి, మదరాసు, పంజాబ్, సరిహద్దు రాష్ట్రాలలో చిన్న శాసనసభలు ఏర్పాటు చెయ్యడమూ, 1853 లో స్థాపింపబడిన కేంద్రశాసనసభకు, అనధికార సభ్యులను నియమించడమూ జరిగింది. అయితే యీ శాసనసభలకు నిజమైన అధికారాలు ఏమీలేవు. 1892 లో, కేంద్రశాసనసభ్యులను, ప్రభుత్వంవారి

బడ్జెట్ ను గురించి చర్చించడానికీ, పరిపాలనా వ్యవహారాలలో కొన్నిటిని గురించి ప్రభుత్వ చర్యలను విమర్శించడానికీ అధికారం యివ్వబడింది.

కాని, కొంతవరకు చెప్పదగిన సంస్కరణలు 1909 లో అమలు జరుపబడినవి. వీటినే, మింటో—మార్లే సంస్కరణలు అంటారు. వీటి వల్ల, శాసనసభాసభ్యులసంఖ్య కొంచం పెంచబడింది. సభలలో అనధికారసభ్యులసంఖ్య, అనధికారసభ్యులకన్న ఎక్కువచేయబడింది. కొన్ని నిబంధనలకు లోబడి, శాసనసభ్యుల ఎన్నికకు వీలు కలుగజేయబడింది. మొట్టమొదటసారి, రాజప్రతినిధి కౌన్సిలులో భారతీయుణ్ణి నియమించడం జరిగింది. అంతేకాక, రాష్ట్రీయ గవర్నరుల కౌన్సిళ్ళలోకూడా, భారతీయులను నియమించడం జరిగింది. ప్రజాక్షేమానికి సంబంధించిన విషయాలన్నిటిగురించీ, శాసనసభలలో చర్చించడానికి వీలు కలుగజేయబడింది.

1919 చట్టప్రకారం మళ్లీ కొత్త సంస్కరణలు అమలులోకి వచ్చాయి. వీటికి మాంటెగు—ఛెమ్స్ఫర్డ్ సంస్కరణలు అని పేరు. ఈ సంస్కరణలవల్ల, రాష్ట్రాలలో ద్వంద్వప్రభుత్వం అమలు జరుపబడింది. శాసనసభలు చర్చించే విషయాలకు సంబంధించిన పరిపాలన సాగించే మంత్రులు వేరు; గవర్నరు, ప్రజల యిష్టాయిష్టములతో సంబంధ లేకుండా పరిపాలించే విషయాలలో గవర్నరుకు సలహాలిచ్చి, పరిపాలన సాగించే ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్లు వేరు. భారతదేశంలోని అన్ని రాష్ట్రాల లోను శాసనసభలు ఏర్పాటు చేయబడ్డాయి. ఈ 1919 చట్టం 1921 జనవరిలో అమలులోకి వచ్చింది.

తరువాత సయిమన్ కమిషన్ నివేదికను అనుసరించి, 1935 చట్టం, 1937 ఏప్రిల్ లో భారతదేశంలో అమలుజరుపబడింది. ఈ చట్ట ప్రకారం రాష్ట్రాలకు స్వపరిపాలనాధికారం ఎక్కువగా యివ్వబడింది. కాని, రాష్ట్రీయగవర్నరులకు రాష్ట్రీయమంత్రివర్గాల నిర్ణయాలను త్రోసిపుచ్చే ప్రత్యేకాధికారాలు యివ్వబడినవి. అయినప్పటికీ, సాధారణ పరిస్థితులలో గవర్నరులు యీ అధికారాలను ఉపయోగించరనే హామీని పొంది, ఎన్నికలలో విశేషంగా విజయంపొందిన కాంగ్రెసు వివిధ రాష్ట్రాలలో 1937 జూలైలో మంత్రివర్గాలను ఏర్పాటుచేసింది.

బ్రిటిషు పరిపాలనలో వున్న రాష్ట్రాలూ, స్వదేశ సంస్థానాలూ కలిసిన కేంద్ర పరిపాలనా వ్యవస్థను ఫెడరేషన్ అనే పేరుతో స్థాపించడంకూడా 1935 సంవత్సరపు రాజ్యాంగచట్టపు ఉద్దేశం. ఈ విషయంలో, రాజప్రతినిధి వివిధ సంస్థానాధిపతులతో రాయబారాలు జరుపుతూ వుండగానే, 1939 సెప్టెంబర్ 1 తేదీన రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైంది.

ఈ యుద్ధం ప్రారంభం అవడంతోనే, శాసనసభల సమ్మతి తెలుసుకోకుండానే రాజప్రతినిధి భారతదేశంకూడా జర్మనీకి ప్రతికూలంగా యీ యుద్ధంలో పాల్గొంటున్నట్లు ప్రకటించాడు. ఈ చర్యపట్ల నిరసన భావాన్ని తెలియజేస్తూ కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా యిచ్చాయి. కాంగ్రెసుకూడా, యుద్ధకార్యాలతో సహకారం చెయ్యడానికి నిరాకరించింది.

1942 లో జపాను యుద్ధంలో ప్రవేశించగానే, యుద్ధకార్యాలలో భారతదేశపు సంపూర్ణ సహకారాన్ని పొందడానికి, బ్రిటిష్ ప్రభుత్వంవారు నూతనరాజ్యాంగవిధానాన్ని ప్రతిపాదిస్తూ, దీనిపట్ల భారతీయుల ఆమోదాన్ని పొందడానికి బ్రిటిషు మంత్రులలో ఒకడైన సర్ స్టాఫర్డ్ క్రిప్స్‌ను భారతదేశం పంపించారు. కాని, క్రిప్స్ రాయబారం ఫలించలేదు. సంపూర్ణమైన అధికారం తమచేతికి యివ్వనిదే, యుద్ధకార్యాలపట్ల సంపూర్ణసహకారంతో తాము పనిచెయ్యజాలమని భారతదేశపు రాజకీయపక్షాలవారు స్పష్టపరిచారు. క్రిప్స్ తిరిగి వెళ్ళిపోయాడు.

ఒకవంక జపాను విజయం సంపాదిస్తూవుంటే, బ్రిటిషువారు ఎలాగా భారతదేశాన్ని కాపాడలేరని నిశ్చయించుకొని, ప్రజలకు స్వాతంత్ర్యోత్సాహం కలిగితే జపానును ప్రతిఘటించగలరనే ఉద్దేశంతో, కాంగ్రెసు బ్రిటిషుప్రభుత్వంవారిని భారతదేశం విడిచిపొమ్మని కోరుతూ 1942 ఆగస్టు 8 వ తేదీన తీర్మానంచేసింది. ఆ మరునాడే, కాంగ్రెసు నాయకులను ప్రభుత్వం అరెస్టుచేసింది. ఈ అరెస్టుపట్ల అసమ్మతి తెలుపుతూ, దేశమంతటా ప్రజలు విప్లవం చేసినట్లుగా ఎదురుతిరిగారు. కఠిన

మార్గాలను అవలంబించి, ప్రభుత్వమువారు యీ తిరుగుబాటును అణచి వేశారు. దేశంలో ప్రజలుమాత్రం బ్రిటిషుప్రభుత్వంపట్ల సుముఖతను ప్రకటించలేకపోయారు.

1945 లో యుద్ధం ఆయిపోయినతరువాత, బ్రిటనులో ఎన్నికలలో లేబరు పార్టీ ప్రభుత్వం ఏర్పడినతరువాత, భారతీయనాయకులు విడుదల చేయబడ్డారు. భారతదేశంలో ఎన్నికలు జరిగాయి. వివిధ రాష్ట్రాలలో ప్రజా ప్రభుత్వాలు 1946 ప్రారంభంలో ఏర్పడినాయి.

1946 ఏప్రిల్ లో బ్రిటీషుప్రభుత్వం తరుఫున ముగ్గురు మంత్రులు, పెథిక్ లారెన్సు ప్రభువు, ఏ. వి. అలెగ్జాండర్, సర్ స్టాఫర్డు క్రిప్సు భారతదేశానికివచ్చి భారతదేశంలో భవిష్యద్రాజ్యాంగ విధానాన్ని గురించి భారతీయ నాయకులతో సంప్రతింపులు జరిపారు. వీటి ఫలితంగా, 1945 మే 16 వ తేదీన బ్రిటీషు ప్రభుత్వం ఒక ప్రకటనచేసింది.

ఆ ప్రకటన సారాంశ మేమిటంటే: వివిధరాష్ట్రీయ శాసనసభలు ఆ శాసనసభ్యులనుగాని, యితరులనుగాని ఆ రాష్ట్రాలలో జనాభాలో, పదిలక్షల ప్రజలకు ఒక ప్రతినిధి లెఖతో ఎన్నుకున్న సభ్యులతో ఒక రాజ్యాంగ నిర్మాణసభ ఏర్పాటుచేయబడుతుంది. ఈ లెఖలో బ్రిటీషు పరిపాలనలోవున్న రాష్ట్రాలనుంచి 292 మంది, స్వదేశ సంస్థానాలనుంచి 93 మందీ, మొత్తం 385 మంది రాజ్యాంగసభకు ఎన్నుకోబడుతారు.

ఈ సభ్యులంతా సమావేశమై ప్రజల హక్కులు, మైనారిటీలకు రక్షణ మొదలైన విషయాలనుగురించి నిర్ణయంచేస్తారు.

తరువాత, ఈ సభ్యులు, రాష్ట్రాలవారిగా మూడు (ఏ. బి. సి.) వర్గాలుగా మళ్ళీ సమావేశమౌతారు. ఈ వర్గాలు ఏమిటంటే: ఏ: మదరాసు, బొంబాయి, బీహారు, ఒరిస్సా, యు. పి., సి. పి. రాష్ట్రాలు; బి. పంజాబ్, సింధు, సరిహద్దురాష్ట్రాలు; సి: బెంగాలు, అస్సాం రాష్ట్రాలు.

ఇలా మూడు ప్రత్యేకవర్గాలుగా ఏర్పడిన ప్రతినిధులు ప్రత్యేకంగా తమతమ రాష్ట్ర పరిపాలనావిధానాలనూ, తమ రాష్ట్రాలు ఆయా వర్గా

లలో కలిసివుండటమా, విడివిడిగా వుండటమా—కలిసివుంటే, ప్రత్యేకంగా తమ వర్గానికి కావలసిన పరిపాలనావిధానం ఏమిటి అనే విషయాలను గురించి నిర్ణయం చేసుకుంటారు, ఇలాటి వర్గాలలో చేరడమా, మానడమా అనే విషయాన్ని నిర్ణయించడానికి ప్రతిరాష్ట్రానికీ హక్కువుంది.

ఇది జరిగిన తరువాత, వివిధరాష్ట్రాల ప్రతినిధులూ, సంస్థానాల ప్రతినిధులుకూడా కలిసి మళ్లీ సమావేశమై, భారతదేశానికంతకూ పరిపాలనా విధానాన్ని తయారుచేస్తారు. అలాటి పరిపాలనావిధానం తయారైన తరువాత, ప్రభుత్వాన్ని పూర్తిగా బ్రిటిషువారు భారతీయులకు అప్పగించివేస్తారు.

ఈ ప్రకటనకు కాంగ్రెసు మొదట అంగీకరించలేదు, కాని తరువాత అంగీకరించింది. ముస్లింలీగు మొదట అంగీకరించింది కాని, తరువాత అంగీకరించలేదు. దేశంలోని అన్ని రాష్ట్రాలలోను యీ రాజ్యాంగ నిర్మాణసభకు (కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీకి) ఎన్నికలు జరిగాయి. 1946 డిసెంబరు 9 వ తేదిన యీ సభాసమావేశం జరిగింది.

రాజ్యాంగసభలో పాల్గొనే హామీతోనే, కేంద్రప్రభుత్వంలో కాంగ్రెసు నాయకులు 1946 సెప్టెంబరు 2-వ తేదీన, ముస్లింలీగు నాయకులు 1946 అక్టోబరు 26 వ తేదీన, చేరారు. కాని, రాష్ట్రాలు విడిగా వుండటమా, వర్గాలలో చేరడమా అనే విషయాన్ని అవి వర్గాలలో చేరకపూర్వమే నిర్ణయించుకోవచ్చుననే సూచన జరిగినతరువాత, అలా జరిగితే నిర్బంధంగా అస్సామును బెంగాలుతోను, సరిహద్దు రాష్ట్రాన్ని సింధు, పంజాబ్ రాష్ట్రాలతోను కలిపి, పాకిస్తాన్‌ను ఏర్పరచడానికి వీలుండదని, ముస్లింలీగు కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ సమావేశంలో పాల్గొనలేదు.

ఇలా వుంటూవుండగా, 1947 ఫిబ్రవరి 20 వ తేదిన బ్రిటిషు ప్రధాని అట్లీ పార్లమెంటులో ప్రకటనచేస్తూ, 1948 జూన్ నెలలోపున, బ్రిటిషు పరిపాలన భారతదేశంలో విరమించబడుతుందని చెప్పాడు. ఈ లోపున, పరిపాలనను భారతదేశంలో ఎవరికి అప్పగించాలో నిర్ణయించడానికీ, అందుకు ఏర్పాట్లను చెయ్యడానికి మౌంట్‌బాటెన్ ప్రభువును రాజప్రతినిధిగా భారతదేశం పంపించాడు.

మౌంట్‌బాటెన్ ప్రభువు కాంగ్రెసు, ముస్లింలీగు నాయకులతో సంప్రతించి చూశారు. ముస్లింలీగు నాయకులు, ముస్లింప్రజలు అధిక సంఖ్యాకులుగావున్న ప్రాంతాలను అంటే, సింధు, పంజాబ్, బెంగాల్ సరిహద్దు రాష్ట్రాలను పాకిస్తాన్ అనే పేరుతో, ప్రత్యేకరాజ్యంగా, మిగతా రాష్ట్రాలతో సంబంధంలేకుండా ఏర్పాటుచేసితీరాలని పట్టుబట్టారు. దీనికితోడు సుమారు ఏడాదినుంచి దేశంలో బెంగాల్, బీహార్, పంజాబు రాష్ట్రాలలో హిందూముస్లిములకు తీవ్రమైన కొట్లాటలుకూడా జరుగుతూ వచ్చాయి.

కాంగ్రెసునాయకులు దేశవిభజనకు అంగీకరించలేదు. కాని, ఒక వేళ బ్రిటిషుప్రభుత్వంవారు భారతదేశాన్ని హిందూస్తాన్, పాకిస్తాన్‌లుగా విభజించడానికి నిశ్చయించినట్లయితే, బెంగాల్, పంజాబ్,రాష్ట్రాలలోకూడా, ముస్లింలు అధికసంఖ్యాకులుగావున్న ప్రాంతాలను, హిందువులు అధిక సంఖ్యాకులుగావున్న ప్రాంతాలనుంచి వేరుచెయ్యాలని కోరారు.

ఈ విషయంలో బ్రిటిషు ప్రభుత్వంవారితో ఆలోచించి, వారి నిర్ణయాన్ని తెల్సుకురావడానికి రాజప్రతినిధి, 1947 మే 19 వ తేదిన బయలుదేరి ఇంగ్లండు వెళ్లాడు. బ్రిటిషు ప్రభుత్వంవారితో సమాలోచనలు జరిపి, మే 29 వ తేదిన ఇంగ్లండులో బయలుదేరి, 30 వ తేదినాటికి ఢిల్లీకి తిరిగి వచ్చివేశాడు.

జూన్ 2 వ తేదిన కాంగ్రెసు తరపున పండిత జవహర్‌లాల్ నెహ్రూ, సర్దార్ వల్లభాయిపటేల్, ఆచార్య కృపాలినీలనూ, ముస్లింలీగు తరఫున జిన్నా, లియాకత్ ఆలీఖాన్, అబ్దుర్‌రబ్ నిష్టర్‌గార్లనూ, సిక్కుల తరఫున సర్దార్ బలదేవసింగునూ సమావేశపరచి రాజప్రతినిధి మౌంట్‌బాటెన్ ప్రభువు, బ్రిటిషు ప్రభుత్వంవారి ప్రణాళికను తెలియచేశాడు. ఈ ప్రణాళికలోని ముఖ్యాంశాలు ఏమిటంటే: "రెండుమూడు మాసాల లోపున, బ్రిటిషుప్రభుత్వంవారు, భారతదేశపరిపాలనను భారతీయులకు అప్పగించివేస్తారు. అలా అప్పగించేలోపల, భారతదేశంలో ఇప్పటిలాగా ఒకే కేంద్రప్రభుత్వంకాక, రెండు కేంద్రప్రభుత్వాలు

ఏర్పాటుచేయబడుతాయి. హిందువులు అధిక సంఖ్యాకులుగా గల మద్రాసు, బొంబాయి, బీహారు, సి. పి., యు. పి., ఒరిస్సారాష్ట్రాలకూ, అస్సాం రాష్ట్రంలో ముస్లింలు అధికసంఖ్యలోవున్న సిల్హెట్ జిల్లాతప్ప మిగతా ప్రాంతానికీ ఒక కేంద్రప్రభుత్వం ఏర్పాటుచేయబడుతుంది. బెంగాల్, పంజాబ్ రాష్ట్రాలలో హిందువులు అధిక సంఖ్యలోవున్న ప్రాంతాలను ఆ రాష్ట్రాలలోనుంచి విడదియ్యడం జరుగుతుంది. ఈ ప్రాంతాలు వాటికి యిష్టమయితే తక్కిన హిందూరాష్ట్రాలతోపాటు కలసి, ఒకే కేంద్రప్రభుత్వంలోకి రావచ్చును. ముస్లిములు అధికసంఖ్యలో వున్న సింధు రాష్ట్రమూ, పంజాబ్, బెంగాలు రాష్ట్రాలలోని భాగాలూ ఒక కేంద్రప్రభుత్వాన్ని కలిగివుంటాయి. ఇది పాకిస్తాన్ అన్నమాట. సరిహద్దు రాష్ట్రంలో ప్రత్యేకం, ప్రజాభిప్రాయాన్ని కనుక్కొని ప్రజలకు హిందుస్తాన్‌లో చేరడం యిష్టమో, పాకిస్తాన్‌లో చేరడం యిష్టమో తేలిన తరువాత, అలా జరుగుతుంది. అప్పటికి జరుగుతూవున్న కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ, హిందూరాష్ట్రాలకు రాజ్యాంగ విధానాన్ని తయారు చేస్తుంది. ముస్లింరాష్ట్రాలకు రాజ్యాంగవిధానాన్ని తయారుచెయ్యటానికి మరొక కన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ స్థాపించబడుతుంది.

హిందూస్తాన్ కేంద్రప్రభుత్వానికీ, పాకిస్తాన్ కేంద్రప్రభుత్వానికీ బ్రిటిషుప్రభుత్వంవారు కెనడా, ఆస్ట్రేలియాదేశాల ప్రభుత్వాలలాగే సమానప్రతిపత్తి ఇస్తారు. హిందూస్తాన్, పాకిస్తాన్ కన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీలు, వాటికి యిష్టమైతే బ్రిటిషు కామన్‌వెల్తులో వుండడానికీ, లేదా స్వతంత్రరాజ్యాలుగా వుండడానికీ రాజ్యాంగవిధానాలను తయారు చేసుకోవచ్చును.

భారతదేశంలోని సంస్థానాలు స్వతంత్రరాజ్యాలు అవుతాయి. ఇవి తమకు యిష్టమైతే ఏ కన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీలోనైనా చేరవచ్చును. బ్రిటిషుప్రభుత్వంతో ప్రత్యేకంగా ఒడంబడిక చేసుకోవచ్చును.

ఈ ప్రణాళికను అమలుజరుపడానికి రాజప్రతినిధి వెంటనే ఏర్పాట్లు చేస్తాడు.

దీనికి కాంగ్రెసు, ముస్లింలీగు, శిక్కు నాయకులు అంగీకరించారు. తరువాత, బెంగాలు శాసనసభ; పంజాబు శాసనసభలు సమావేశమై ఆ రాష్ట్రాల విభజనకు అంగీకరించాయి.

పై ప్రకాళికను అనుసరించి, బ్రిటిషు ప్రభుత్వంవారు, జూలై 4 తేదిన పార్లమెంటులో "భారత స్వాతంత్ర చట్టాన్ని" ప్రవేశపెట్టారు. ఆ చట్టప్రకారం భారతదేశం, ఇండియా, పాకిస్తాన్ అనే రెండు స్వతంత్ర పరిపాలనగల డొమినియనులుగా ఏర్పడింది.

ఇండియా: మదరాసు, బొంబాయి, సెంట్రల్ ప్రావిన్సెసు, యునైటెడ్ ప్రావిన్సెసు, ఒరిస్సా, తూర్పుపంజాబ్, పశ్చిమబెంగాల్, బీహారు, అస్సాం (సిల్హెట్ జిల్లా మినహాగా) రాష్ట్రాలు. పాకిస్తాన్: సింధు, సరిహద్దురాష్ట్రం, పశ్చిమబెంగాల్, తూర్పుబెంగాల్ (సిల్హెట్ జిల్లా కలిపి) రాష్ట్రాలు.

ఇండియా, పాకిస్తాన్ డొమినియనుల రాజ్యాంగపరిషత్తులకు కొత్తగా ఏర్పడిన తూర్పు, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలనుంచీ, తూర్పు పశ్చిమ పంజాబ్ రాష్ట్రాలనుంచీ ఎన్నికలు జరిగాయి.

ఇండియాకు రాజధాని ఢిల్లియే. పాకిస్తాన్‌కు కరాచి రాజధానిగా నిర్ణయింపబడింది.

ఇండియా రాజ్యాంగ పరిషత్తు ప్రథమ సమావేశం 1946 డిసెంబరు 9 తేదీన జరిగింది. పాకిస్తాన్ రాజ్యాంగ పరిషత్తు ప్రథమ సమావేశం 1947 అగస్టు 10 తేదీన జరిగింది,

ఈ విధంగా భరతఖండం విభజన పూర్తి అయింది.

1949 నవంబరు 26 తేదీన ఇండియా రాజ్యాంగ చట్టాన్ని రాజ్యాంగ పరిషత్తు ఆమోదించింది. ఈ రాజ్యాంగచట్టం 1950 జనవరి 26 న అమలులోకి వచ్చింది.

ఈ రాజ్యాంగవిధానం ప్రకారం ఇండియా స్వపరిపాలనగల ప్రజారాజ్యం (రిపబ్లిక్) అయింది. అయితే, 1949 లో పండిట్ నెహ్రూ ఇంగ్లండువెళ్ళి బ్రిటిషు ప్రభుత్వంతోను, బ్రిటనుకు లోబడిన ఇతర అధీన రాజ్యాల ప్రధాన మంత్రులతోను జరిపిన సంభాషణల ఫలితంగా

ఇండియా బ్రిటిషు కామన్‌వెల్తులో సభ్యత్వంపొందడానికి నిర్ణయింపబడింది. ఈ నిర్ణయాన్ని ఇండియా రాజ్యాంగపరిషత్తు ఆమోదించింది.

ఈ నిర్ణయఫలితం ఏమిటంటే: ఇండియా స్వపరిపాలనగల ప్రజారాజ్యంగా వున్నప్పటికీ, బ్రిటిషురాజు ఇతర బ్రిటిషు అధీన రాజ్యాలకూ ఇండియాకు పరస్పర సంబంధాన్ని కలిగించే చిహ్నంగా పరిగణింపబడుతాడు. ఇండియా ప్రజలకు, ఇంగ్లండులో ఇంగ్లీషు ప్రజలతో సమాన పౌరసత్వ హక్కులువుంటాయి. ఇండియాలోని బ్రిటిషు ప్రజలకు, ఇతర విదేశీయులవలెగాక, ప్రత్యేక హక్కులు, రక్షణవుంటాయి.

ఇండియా బ్రిటనులమధ్య వ్యాపారం, ఇదివరకులాగనే పరస్పరం ప్రత్యేక సౌకర్యాలను కలిగించుకోవడంమీద ఆధారపడివుంటుంది.

కన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ ఆమోదించిన రాజ్యాంగవిధానం ఇండియాలో 1950 జనవరి 26 తేదీన అమలులోకి వచ్చింది. ఆనాటితో ఇండియా, స్వతంత్ర ప్రజారాజ్యంఅయింది. బ్రిటిషురాజుచే నియమింపబడిన గవర్నరు-జనరల్ పరిపాలన అంతమొందింది. ఇండియాకు ఆఖరు గవర్నరు జనరల్‌గావున్న శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి తమ పదవినుంచి విరమించారు. రిపబ్లిక్ ఇండియాకు ప్రెసిడెంట్‌గా డాక్టర్ రాజేంద్రప్రసాద్ పదవిని స్వీకరించారు.

డాక్టర్ రాజేంద్రప్రసాద్‌ను ప్రెసిడెంటుగా కన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ 1950 జనవరి 24 తేదిన ఎన్నుకున్నది. వీరి పేరును పండిట్ నెహ్రూ ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదనను సర్దార్‌పటేల్ బలపరచారు. జనవరి 23 తేదినాటికి ప్రతిపాదనలు రావలసిన సమయానికి డాక్టర్ రాజేంద్రప్రసాద్ పేరు ఒక్కటిమాత్రమే ప్రతిపాదించబడి ఎ. అందుచే, డాక్టర్ ప్రసాద్ పోటీలేకుండా ప్రెసిడెంట్‌గా ఎన్నుకోబడినారు.

1950 జనవరి 25 తేదిన రాజ్యాంగసభలో, ఇండియా ప్రెసిడెంటుగా డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఎన్నుకోబడిన తరువాత, సభ్యులు

కొత్త రాజ్యాంగంపైన సంతకాలు పెట్టారు. ఆనాడు రాజ్యాంగంమీద సంతకాలు పెట్టిన సభ్యులసంఖ్య, 271. ఆనాటితో రాజ్యాంగపరిషత్తు పనిముగిసింది. పరిషత్తు విరమించింది. కాని, రాష్ట్రశాసనసభ్యులుగా వున్న సభ్యులుతప్ప మిగతా సభ్యులతో ఇదే సభ 1950 జనవరి 26 తేదినుండి ఇండియా పార్లమెంటు అయింది. రాష్ట్రశాసనసభ్యుల బదులు కొత్తగా ఎన్నుకొనబడిన సభ్యులు 26 తేదినుంచి పార్లమెంటు సభ్యులు అయారు.

1950 జనవరి 26 తేది వుదయం 10 గంటల 18 నిమిషాలకు డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఇండియా ప్రెసిడెంటుగా ప్రమాణాన్ని స్వీకరించారు. ఇండియా ప్రెసిడెంటుకి భారతరాష్ట్రపతి అని దేశ భాషలో వ్యవహారనామం.

రాష్ట్రపతిగా డాక్టర్ రాజేంద్రప్రసాద్ పదవిని స్వీకరించడంతో గవర్నర్-జనరల్ పదవి అంతరించింది.

1946 డిసెంబరు 9 తేదిన ప్రారంభమైన రాజ్యాంగ పరిషత్తు, రాజ్యాంగ విధాన నిర్మాణకార్యాన్ని 1949 నవంబరు 26 తేది 11 గంటల 10 నిమిషాలకు పూర్తిచేసింది. పరిషత్తు ఆమోదించిన రాజ్యాంగ విధాన చట్టంమీద అధ్యక్షుడు, ఆనాడు 11 గంటల 12 నిమిషాలకు సంతకం పెట్టాడు. ఈచట్టం, 1950 జనవరి 26 తేదిన ఇండియా అంతటా అమలులోకి వచ్చింది.

1946 డిసెంబరు నుంచి 1949 నవంబరు 26 తేదినాటికి రాజ్యాంగ పరిషత్తు మొత్తం 11 సమావేశాలు జరిపింది. ఈ సమావేశాలు మొత్తం 165 రోజులపాటు జరిగాయి. దీనిలో, రాజ్యాంగ విధానంపై చర్చకు 114 రోజులు పట్టాయి. ఈ సమావేశాలకుగాను ప్రభుత్వానికి సుమారు 64 లక్షల రూపాయలు వ్యయమైంది.

# భారత రాజ్యాంగ విధానం

1947 ఆగస్టు 15 న స్వాతంత్ర్యాన్ని పొందిన భారతదేశానికి ప్రజాస్వామ్య సిద్ధాంతములతో రాజ్యాంగవిధానాన్ని తయారుచెయ్యడం 1949 నవంబరు 26 తేదిన పూర్తిఅయింది. ఈరాజ్యాంగ విధానప్రకారం, భారతదేశం (ఇండియా) 1950 జనవరి 26 తేదిన స్వతంత్ర ప్రజారాజ్యం అయింది.

ఇండియాకు రాజ్యాంగ విధానాన్ని తయారు చెయ్యడానికి ఏర్పడిన రాజ్యాంగపరిషత్తు (కన్స్టిట్యుయెంటు అసెంబ్లీ ప్రథమసమావేశం 1946 డిసెంబరు 9 న జరిగింది. ఆనాటి సమావేశానికి సభ్యులందరిలోకీ వయోవృద్ధుడైన డాక్టర్ సచ్చిదానందసింహా అధ్యక్షత వహించారు. ఆ సమావేశంలో, రాజ్యాంగపరిషత్తుకు అధ్యక్షులుగా డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఎన్నుకోబడినారు. రాజ్యాంగపరిషత్తు, ఇండియా పార్లమెంటుగా రూపొందేవరకూ, (1950 జనవరి 26 వరకూ) పరిషత్తు అధ్యక్షులుగా ఆయనే వున్నారు.

రాజ్యాంగ విధానాన్ని తయారుచెయ్యడానికి 1947 ఆగస్టు 29 తేదిన కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ నియమించిన కమిటీ రాజ్యాంగ విధానపు ముసాయిదాను 1948 ఫిబ్రవరి 26 తేదిన ప్రకటించింది. దీనిని పరిశీలించడానికి కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ ప్రథమ సమావేశం 1948 మే 19 తేదిన జరిగింది.

రాజ్యాంగవిధానపు ముసాయిదాలో 315 నిబంధనలు, ఎనిమిది షెడ్యూల్సు ప్రతిపాదింపబడినవి. ముసాయిదా సవరణజరిగి చట్టం అయేటప్పటికి 395 నిబంధనలు, ఎనిమిది షెడ్యూల్సు వున్నాయి.

రాజ్యాంగపరిషత్తు ఆమోదంతో 1950 జనవరి 26 తేదిన అమలులోకి వచ్చిన రాజ్యాంగ చట్టప్రకారం, ఇండియాలో ప్రజాస్వామ్య పరిపాలన యేయే నియమాలను అనుసరించి జరుగాలో, ప్రజల హక్కులు ఏమిటో ,దేశపరిపాలన, రాష్ట్రపరిపాలనల నిబంధనలు ఏమిటో క్లుప్తంగా యీ క్రింద ప్రకటిస్తున్నాము.

ఇండియా, అంటే భారత్, అనేక రాష్ట్రముల సమాఖ్యగా వుంటుంది. అస్సాం, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్, పంజాబ్, బీహారు, బొంబాయి, మదరాస్, మధ్యప్రదేశ్ (పూర్వం సెంట్రల్ ప్రావిన్సెసు), ఉత్తరప్రదేశ్ (పూర్వం యునైటెడ్ ప్రావిన్సెసు) అనే రాష్ట్రాలూ.

హైదరాబాద్, కాశ్మీర్, మధ్యభారత్, మైసూర్, పాటియాల తూర్పు పంజాబ్ సంస్థానాల యూనియన్, రాజస్థాన్, సౌరాష్ట్ర, తిరువాంకూరు-కొచ్చిన్ సంస్థానాల యూనియన్ అనే ఎనిమిది సంస్థానాల కూడలులూ.

అజ్మీర్, భోపాల్, బిలాస్‌పూర్, కూర్గు, ఢిల్లి, హిమాచలప్రదేశ్, కచ్, మణిపూర్, త్రిపుర, వింధ్యప్రదేశ్, అండమాన్ నికోబార్ దీవులు అనే 11 కమిషనర్ రాష్ట్రాలూ, కలిపి ఇండియాఅవుతుంది.

ఇవికాక, కొత్తరాష్ట్రాలను ఏర్పాటుచెయ్యడానికీ, పాతరాష్ట్రాలను రెండు మూడిటిని కలిపి ఒకరాష్ట్రంగా ఏర్పాటుచెయ్యడానికీ, ఒక రాష్ట్రంలోని కొంతభాగాన్ని మరొకరాష్ట్రంలో కలపడానికి ఇండియా పార్లమెంటుకి అధికారంవుంది. అయితే, ఇలాటి ఏర్పాట్లు ఏవైనా చేసే ముందు ఆయారాష్ట్రాల శాసనసభల అభిప్రాయాలను కనుక్కొని, భారత దేశాధ్యక్షుడు తదనుకూలమైన సిఫారసు చేస్తేతప్ప, ఇలాంటి ఏర్పాట్లకు సంబంధించిన చట్టాన్ని పార్లమెంటులో ప్రతిపాదించడానికి వీలులేదు.

ఈ రాజ్యాంగవిధానం అమలులోకివచ్చేనాటికి ఇండియాలోపుట్టిన ప్రతివ్యక్తిన్నీ, ఇండియాలో పుట్టిన తండ్రికిగాని, తల్లికిగాని పుట్టిన వ్యక్తిన్నీ, ఈ రాజ్యాంగ విధానం అమలులోకి వచ్చేనాటికి అధమం అయిదేళ్ల పాటు ఇండియాలో వుంటూవున్న వ్యక్తిన్నీ భారతదేశపు పౌరుడుగా హక్కు కలిగివుంటాడు.

ఇండియాలోపుట్టి పాకిస్తాన్‌కు వలసపోయిన వ్యక్తి 1947 జూలై 19 తేది తరువాత మళ్లీ ఇండియాకువచ్చి పౌరుడుగా వుండదలిస్తే, ఇండియాకువచ్చి అధమం ఆరు నెలలు నివాసం వున్నతరువాత తవను

భారతదేశపు పౌరునిగా అంగీకరించవలసిందని ప్రభుత్వానికి వ్రాతమూలకంగా విన్నపంచేసుకోవచ్చును.

భారతదేశపు ఎల్లలోపల నివసించే వ్యక్తులందరికీ చట్టప్రకారం సమానహక్కులను, రక్షణను ఇవ్వడం ప్రభుత్వ విధి.

జాతి, మత, కుల, స్త్రీ పుంవిభక్తతల కారణంగా ఏ వ్యక్తికీ. హోటళ్ళలోగాని, పబ్లిక్ వినోదశాలలకుగాని, దుకాణాలలోనికిగాని వెళ్ళకూడదనే నిర్బంధం వుండకూడదు.

ప్రభుత్వ ఉద్యోగాలను ఇవ్వడంలో భారతీయులందరికీ సమానావకాశాలు వుండాలి. అయితే, ప్రభుత్వోద్యోగాలలో చాలతక్కువగా వున్న ఏకులపు వ్యక్తులకైనా అదనంగా ఎక్కువ వుద్యోగాలను ఇవ్వవలసిందని ప్రభుత్వం నిర్ణయించవచ్చు.

అస్పృశ్యతఅనేది ఏరూపంలోనూ ఇండియాలో ఆచరణలో వుండకూడదు. అస్పృశ్యతను పాటించేవారు శిక్షార్హులవుతారు.

భారతదేశపు పౌరులందరికీ తమ అభిప్రాయాలను వెల్లడిచేయడానికి వాక్స్వాతంత్ర్యము, ఆయుధములు ధరించకుండాంగా శాంత సభలను జరుపుకోవడానికి సమావేశ స్వాతంత్ర్యము, సంఘములను, సమాజములను ఏర్పాటుచేసుకోవడానికి సమాజ స్వాతంత్ర్యము, దేశంలోని ఏప్రాంతానికైనా వెళ్ళడానికి సంచార స్వాతంత్ర్యము, దేశంలో తమ ఇష్టంవచ్చిన ప్రాంతాలలో నివాసంవుండడానికి, నివాస స్వాతంత్ర్యము, ఆస్తిపాస్తులను సంపాదించికోడానికి, వాటిని భద్రపరుచుకోవడానికి, అమ్మివెయ్యడానికి ఆర్జన స్వాతంత్ర్యము, తమకు ఇష్టమైన వృత్తిగాని, వ్యాపారంగాని చేసుకోవడానికి వృత్తిస్వాతంత్ర్యము వుండాలి. అయితే ఎవరుకూడా యీ స్వాతంత్ర్యాలను ప్రభుత్వానికీ, ప్రజలకూ ఉపద్రవం కలిగించే పద్ధతిలో వుపయోగించకుండా ప్రభుత్వం తగిన కట్టుదిట్టాలను చెయ్యవచ్చును.

అమలులోవున్న చట్టాలకు విరుద్ధంగా నేరంచేస్తేతప్ప, ఏవ్యక్తినీ శిక్షించకూడదు. ఒకే నేరానికి ఒకసారికన్న ఎక్కువగా ఏ వ్యక్తిపైనా కేసుపెట్టకూడదు. ఒకేనేరానికి ఒకసారికన్న ఎక్కువగాశిక్షించకూడదు.

చట్టప్రకారం నిర్ణయించబడిన పద్ధతిలోతప్ప ఏవ్యక్తికీ ఆస్తి నష్టాన్ని, ప్రాణనష్టాన్నీ కలిగించకూడదు.

ఏ వ్యక్తినైనా అరెస్టుచేస్తే, అతనిని అలా అరెస్టు చెయ్యడానికి గల కారణాలను వీలైనంత త్వరలో అతనికి తెలియపరచాలి. తనచర్యను సమర్థించుకోవడానికి వకీలుతో సంప్రతించడానికి తగు అవకాశం ఆవ్యక్తికి కలిగించాలి. అరెస్టుచేయబడిన ప్రతివ్యక్తినీ సమీపంలోవున్న మేజస్ట్రేటు దగ్గరకు తీసుకొనివెళ్లడానికి ఎంతసేపుపడుతుందో ఆవ్యవధి కాక, అరెస్టుఅయిన ఇరవైనాలుగు గంటలలోపల సమీపంలోవున్న మేజస్ట్రేటువద్ద ఆవ్యక్తిని హాజరుపెట్టాలి.

వానిసవ్యాపారం, నిర్బంధపెట్టి వెట్టిచాకిరి చేయించుకోవడం పనికిరాదు.

పద్నాలుగు సంవత్సరాల లోపు వయసుగల బాలబాలికలను యంత్రాగారాలలోను, గనులలోను, ప్రమాదకరమైన పనులలోను నియోగించరాదు.

ఎవరి యిష్టమైన మతాన్ని వారు అవలంబించడానికీ, దానిని ప్రచారం చెయ్యడానికీ హక్కువుంది.

ప్రభుత్వ ధనంతో నడుపబడే ఏ విద్యాసంస్థలోను మతబోధ చెయ్యడానికి వీలులేదు.

ప్రభుత్వధనంతో నడుపబడే విద్యాసంస్థలలోను, ప్రభుత్వ సహాయంతో నడుపబడే విద్యాసంస్థలలోను, అన్ని కులాలవారికీ, అన్నిజాతుల వారికీ ప్రవేశార్హత వుండాలి.

మతవిషయంలోను, భాషవిషయంలోను అల్పసంఖ్యలోవున్నవర్గాల వారు ప్రత్యేకంగా తమ ఉపయోగానికిగాను విద్యాసంస్థలను నిర్వహించుకోడానికి హక్కు కలిగివుంటారు. విద్యాసంస్థలకు ధనసహాయం చెయ్యడంలో, ప్రభుత్వంవారు వ్యత్యాసం చూపరాదు.

చట్టసమ్మతమైన ఉత్తరువును అనుసరించి తప్ప, ఏవ్యక్తికీ ఆస్తి నష్టాన్ని కలిగించరాదు.

రాజ్యాంగచట్టంప్రకారం తనకుగల హక్కులను అనుభవించడానికి సదుపాయం కలిగించ వలసిందని, సుప్రీంకోర్టుద్వారా చర్య తీసుకొనడానికి ప్రతివ్యక్తికీ హక్కువుంది.

## ప్రభుత్వం అవలంబించవలసిన పరిపాలనా సూత్రములు

జాతీయ జీవనంలో ఆర్థిక, సాంఘిక, రాజకీయ న్యాయము ప్రవర్తించే విధంగా సంఘజీవితాన్ని పరిణతిపొందించే పద్ధతిలో ప్రభుత్వం తన పరిపాలనా విధానాన్ని సాగించాలి.

స్త్రీ పురుషవివక్షత లేకుండా ప్రజలందరికీ తమకు తగిన జీవనాధారాన్ని చూసుకొనేటందుకు సమానమైన హక్కులు కలిగి వుండేటట్లు ప్రభుత్వం చూడాలి. దేశంలోని నైసర్గిక సంపద ప్రజలందరి సమష్టి మేలుకూ ఉపయోగపడేటట్లు ప్రభుత్వం చూడాలి. దేశంలోని సంపద అంతతా ప్రజాబాహుళ్యపు మేలుకు విరుద్ధంగా ఏదో ఒకవర్గం చేతిలో వుండే పద్ధతిలో ఆర్థికవ్యవస్థ దేశంలో నెలకొనకుండా ప్రభుత్వం చూడాలి. స్త్రీగాని పురుషుడుగాని సమానమైన పనిచేస్తే, వారికి సమానమైన ప్రతిఫలం లభించేటట్లు ప్రభుత్వం చూడాలి. ఆర్థిక దురవస్థకారణంగా కార్మికులబలమూ, ఆరోగ్యమూ స్వప్రయోజనాలకోసం ఇతరులు దుర్వినియోగం చెయ్యకుండానూ, ఆర్థిక దురవస్థలకారణంగా తమ వయస్సుకూ, ఆరోగ్యానికీ అనుకూలంగాని పనులలో కార్మికులు నియోగింపబడకుండా వుండేటట్లున్నూ ప్రభుత్వంచూడాలి. బాల్యమును, యౌవనమును వృధా పోనిచ్చే పద్ధతులలో, నైతికపతనం పొందే పద్ధతిలో ఏ వ్యక్తినీ ఇతరులు ఉపయోగించుకుండా ప్రభ్వుతం చూడాలి.

గ్రామపంచాయితీలను స్థాపించడానికి ప్రభుత్వం చర్యతీసుకోవాలి. స్వపరిపాలనకు ప్రాథమిక కేంద్రాలుగా యీ పంచాయితీలు పనిచేసేటట్లు, వాటికి అవసరమైన అధికారాలను ఇవ్వాలి.

ప్రతివ్యక్తికీ చెయ్యడానికీ పనివుండేటట్టూ విద్యలభించేటట్టూ, నిరుద్యోగం, ముసలితనం, జబ్బు, అంగవైకల్యం కలిగినప్పుడు సహాయం లభించేటట్టూ వీలైనంతవరకు ప్రభుత్వం శ్రద్ధవహించాలి.

దేశంలోని పారిశ్రామిక, వ్యావసాయిక వృత్తులలోవున్న పని వారందరూ యోగ్యమైన జీవనాన్ని గడపడానికి అవసరమైన కనీసపు జీతాలు వుండేటట్లూ వీలైన ఏర్పాట్లను శాసనమూలకంగాగాని, ఇతర విధంగాగాని ప్రభుత్వం చెయ్యాలి. గ్రామములలో గృహపరిశ్రమలను అభివృద్ధి పొందించడానికి ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధవహించాలి.

దేశమంతటా ఏకపద్ధతిలో నాగరికత నెలకొనడానికి అనువైన ధర్మశాస్త్రము అమలులోకి వచ్చేటట్లు ప్రభుత్వం కృషి చెయ్యాలి.

ఈ రాజ్యాంగ విధానం అమలులోకి వచ్చిన పదేళ్ళలోగా, దేశంలో ప్రతి బాలబాలికకూ పధ్నాలుగు సంవత్సరాల వయసు వచ్చినదాక తప్పని సరిగా ఉచితంగా విద్యలభించే అవకాశాన్ని ప్రభుత్వం కలిగించాలి.

ప్రజలలో బలహీనవర్గాలవారికీ, ముఖ్యంగా షెడ్యూల్డు కులాల వారికీ ఆర్థిక, విద్యావిషయములలో సదుపాయములను కలిగించడానికి ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధవహించాలి. వారు సాంఘిక దురన్యాయాలకు లోనుగాకుండ రక్షణ ఇవ్వాలి.

ప్రజలజీవన ప్రమాణాన్ని వృద్ధిపరచడమూ, ప్రజల ఆరోగ్యస్థితిని బాగుచెయ్యడమూ తన ప్రధాన బాధ్యతలుగా ప్రభుత్వం భావించాలి. అంతేగాక, మద్యపానమును, ఇతర మత్తుద్రవ్యాల సేవనమునూ నిషేధించడానికి ప్రత్యేక శ్రద్ధతీసుకోవాలి.

పశువుల రక్షణ, ఆధునిక పద్ధతులలో వ్యవసాయము, పశువుల వధ నిరోధము మొదలైనవాటి విషయమై ప్రభుత్వం శ్రద్ధచూపాలి.

ప్రభుత్వశాఖలలో న్యాయశాఖను ఇతర పరిపాలనా శాఖలతో సంబంధంలేకుండా వేరుచెయ్యడానికి ప్రభుత్వం చర్యతీసుకోవాలి.

దేశంలో శాంతి భద్రతలను కాపాడడానికీ, విదేశాలమధ్య గౌరవయుతమైన సంబంధాలు ఉండేటట్లు చూడడానికీ, అంతర్జాతీయ న్యాయములపట్లనూ, ఒడంబడికలపట్లనూ గౌరవంవుండేటట్లు చూడడానికీ, అంతర్జాతీయ వివాదాలను మధ్యవర్తి నిర్ణయముద్వారా పరిష్కారం చేయించడానికీ ప్రభుత్వం శ్రద్ధతీసుకోవాలి.

## ప్రెసిడెంట్

భారతదేశానికి ఒక ప్రెసిడెంటు వుండాలి. ప్రెసిడెంటు తనకు గల పరిపాలనాధికారాన్ని తాను స్వయంగాగాని, రాజ్యాంగవిధానాన్ని అనుసరించి ఆయనకులోబడి నియమింపబడిన అధికారులద్వారాగాని, సాగిస్తాడు. ఇండియాలోని సేనలన్నిటిమీద సంపూర్ణాధికారం ప్రెసిడెంటుదే. ఈ అధికార నిర్వహణ చట్టనిర్ణయాల ననుసరించి జరగాలి.

ప్రెసిడెంట్, ఎన్నికలవల్ల సభ్యత్వంపొందిన కేంద్రశాసన సభల సభ్యులునూ, రాష్ట్రశాసనసభల (అసెంబ్లీల) సభ్యులునూ కలసిన సభ చేత ఎన్నుకోబడినవాడై వుండాలి.

ప్రెసిడెంటును ఎన్నుకోవడంలో రాష్ట్రశాసనసభల సభ్యులకూ కేంద్ర శాసనసభ్యులకూ ఎన్నెసివోట్లువుంటేదీ, యీ క్రింది సూత్ర ప్రకారం నిర్ణయించబడింది.

ఒక రాష్ట్రంలో ఎంతమంది జనభావుంటారో ఆ సంఖ్యను ఆరాష్ట్ర శాసనసభలో ఎంతమంది సభ్యులువుంటారో ఆసంఖ్యచేత భాగించాలి. అలా భాగించినప్పుడు ఆసభ్యుల సంఖ్యకు ఎంతమంది జనాభావస్తారో ఆసంఖ్య ఎన్ని వేల సంఖ్యలలోవుంటుందో అన్నివోట్లు ఒక్కొక్క సభ్యుడికివస్తాయి. ఇలా వేలసంఖ్యను తీసుకున్న తరువాత శేషం అయిదువందలకంటె తక్కువుండనట్లయితే ఒక్కొక్క వోటు ఎక్కువ వస్తుంది.

ఉదాహరణ: రాష్ట్రజనాభా 1,90,40,656 అనుకుందాము.

రాష్ట్రశాసనసభ సభ్యులసంఖ్య 254 అనుకుందాము.

రాష్ట్రజనాభా సంఖ్యను రాష్ట్రశాసన సభ్యులసంఖ్యచే భాగించగా వచ్చిన లబ్ధము 74,964. ఈ లబ్ధములోని వేలసంఖ్య 74. అదిపోగా 964 మిగిలినది. ఇది 500 లకన్న ఎక్కువగాబట్టి ప్రతి సభ్యునికీ అదనంగా మరొక వోటువస్తుంది. అంటే రాష్ట్ర శాసనసభ్యునికిగల వోట్లు 75 అన్న మాట.

కేంద్ర శాసనసభ్యులకుగల వోట్లు ఎలా లెఖ్ఖ పెట్టాలంటే: పైన చెప్పిన సూత్రప్రకారం వివిధరాష్ట్రాల శాసన సభ్యులకీ వచ్చే మొత్తం ఓట్లను, కేంద్ర శాసనసభ సభ్యుల సంఖ్యతో భాగిస్తే వచ్చేలబ్ధంఎంతో, అదే కేంద్ర శాసనసభ సభ్యులకుగల ఓట్లసంఖ్య అవుతుంది. ఇలా భాగించినప్పుడు శేషం, కేంద్రశాసనసభ సభ్యులసంఖ్యలో సగంగాని సగంకంటె ఎక్కువగాని వున్నట్లయితే, ప్రతిసభ్యుడికీ మరొక ఓటు ఎక్కువవస్తుంది.

ఒక ప్రెసిడెంటు పదవిని స్వీకరించిన రోజుమొదలు అయిదేండ్లు అధికారంలో వుంటాడు. ఈలోగా అతడు రాజీనామాయిచ్చి పదవిని త్యజించవచ్చు. లేదా, చట్టానికి విరుద్ధంగా ప్రవర్తించాడనే నేరారోపణ కేంద్ర శాసనసభలో చేయబడినట్లయితే, ఇది రుజువైతే, ప్రెసిడెంటును పదవినుంచి తొలగించవచ్చును

ఇండియాలో పౌరుడు కాకపోయినా, 35 సంవత్సరాలలోపు వాడైనా, కేంద్రశాసనసభకు సభ్యుడుగా ఎన్నుకోబడడానికి అర్హత లేని వాడైనా, ప్రభుత్వంలో ఉద్యోగంలో వున్నవాడైనా, ప్రెసిడెంటుగా ఎన్నికకు అర్హుడుకాడు.

ప్రెసిడెంటుగా వున్నవ్యక్తి, కేంద్రశాసన సభలలోగాని రాష్ట్ర శాసనసభలలోగాని సభ్యుడుగా వుండకూడదు. ప్రెసిడెంటుగా ఎన్నికకు పూర్వం అలా వున్నట్లయితే, ప్రెసిడెంటు పదవిని స్వీకరించిన వెంటనే ఆ సభ్యత్వాలను విడిచిపెట్టాలి.

ధన సంపాదనకు మూలమైన మరే ఇతర ఉద్యోగాన్ని ప్రెసిడెంటు నిర్వహించకూడదు.

ప్రెసిడెంటుకు నెలకు రు. 10,000 జీతం ఇవ్వబడుతుంది. జీతం కాక, ఉచితగృహవసతి, ప్రయాణాలకు ఖర్చులూ, తన సొంత సిబ్బంది మొదలైనవాటికి జీతాలు ఇవ్వడానికి ఇతర అలవెన్సులుకూడా ఇవ్వబడుతవి.

ఒక ప్రెసిడెంటు పదవీకాలం ముగిసేలోపల, మరొక ప్రెసిడెంటు కొరకు ఎన్నిక జరగాలి. ఒక ప్రెసిడెంటు చనిపోయినా, రాజీనామా ఇచ్చినా, పదవినుంచి తొలగించబడినా, అలా జరిగిన ఆరునెలలోపల, వీలైనంత త్వరలో, మరొక ప్రెసిడెంటుకొరకు ఎన్నిక జరగాలి. ఇలాటి ఎన్నిక జరిగేదాకా ప్రెసిడెంటుపనిని, వైస్ ప్రెసిడెంట్ నిర్వహిస్తాడు. ఎన్నిక అయి కొత్తగావచ్చిన ప్రెసిడెంట్ అయిదేళ్లు పూర్తిగా పదవిలోవుంటాడు.

ఇండియాకు ఒక వైస్ ప్రెసిడెంట్ వుంటాడు. వైస్ ప్రెసిడెంట్ రాష్ట్రప్రతినిధి సభ, కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్‌కి చైర్మన్‌గా వుంటారు. ఇది తప్ప, ఆదాయంవచ్చే మరేఉద్యోగాన్ని అతను నిర్వహించకూడదు. ప్రెసిడెంటు తరపున ఇతను ప్రెసిడెంటు పదవిని నిర్వహించేకాలంలో, రాష్ట్రప్రతినిధి చైర్మను పదవినికూడా నిర్వహించకూడదు.

ప్రెసిడెంటు, కేంద్రశాసనసభల సమిష్టి సమావేశంలో ఎన్నుకోబడినవాడై వుండాలి. కేంద్రశాసనసభలలోగాని, రాష్ట్రసభలలోగాని సభ్యుడైవున్నట్లయితే, వైస్ ప్రెసిడెంటుగా పదవినిస్వీకరించిన వెంటనే, ఆ సభ్యత్వంనుంచి విరమించుకోవాలి, ఇండియా పౌరుడు కానివాడూ, 35 సంవత్సరాలలోపు వయస్సులో వున్నవాడూ, కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్‌కి సభ్యుడుగా ఎన్నుకోబడడానికి అర్హతలేనివాడూ వైస్ ప్రెసిడెంటుగా ఎన్నుకోడానికి అర్హుడుకాడు.

వైస్-ప్రెసిడెంటు పదవీకాలం అయిదు సంవత్సరాలు, అయిదు సంవత్సరాలలోపున మరొక వైస్-ప్రెసిడెంటుకు ఎన్నిక జరగాలి.

ప్రెసిడెంటు తన విధులను నిర్వర్తించడంలో అతనికి సలహాఇవ్వడానికి ఒక మంత్రిమండలి వుండాలి. ఈ మంత్రిమండలికి అధిపతి, ప్రధానమంత్రి. ప్రధానమంత్రిని ప్రెసిడెంటు నియమిస్తాడు. ప్రెసిడెంటుకు వీరిమీద నమ్మకంవున్నంతకాలమే, యీ మంత్రిమండలి అధికారంలోవుంటుంది. ఈ మంత్రిమండలి సమష్టిమీద పార్లమెంటులోని ప్రజాసభకు జవాబుదార్లుగావుండాలి. ప్రజాసభలో సభ్యుడుగాని వ్యక్తి

మంత్రిగా నియమింపబడిన ఆరునెల్లలోపున ప్రజాసభలో సభ్యత్వాన్ని పొందాలి. అలాపొందలేకపోతే మంత్రిత్వాన్ని కోల్పోవాలి.

ప్రధానమంత్రికీ, ఇతరమంత్రులకూ ఇండియా డొమినియన్‌గా వున్నప్పుడు ఏ జీతాలు ఇవ్వబడినవో (రు. 55,00), అవే జీతాలు యీ రాజ్యాంగవిధానం అమలులోకి వచ్చినతరువాతకూడా ఇవ్వబడాలి.

ప్రభుత్వం అమలుజరిపే చర్యలన్నీ, ప్రెసిడెంటు పేరుమీద నే జరుగుతాయి.

ఇండియా పరిపాలనకు సంబంధించిన విషయాలలో మంత్రి మండలి నిర్ణయాలను ప్రెసిడెంటుకు ప్రధానమంత్రి తెలియపరచాలి. మంత్రిమండలి పరిశీలనకు తీసుకురాకుండా ఏవిషయాన్ని గురించైనా ఒక మంత్రి ఏదైనా నిర్ణయించేస్తే, ఆ విషయాన్ని మంత్రిమండలి పరిశీలనకు తీసుకురమ్మని ప్రెసిడెంటు కోరితే, ప్రధానమంత్రి అలా చెయ్యాలి.

## పార్లమెంటు

ఇండియాకు ఒక పార్లమెంటు వుండాలి, ప్రజాసభ (హౌస్ ఆఫ్ ది పీపుల్), రాష్ట్రప్రతినిధిసభ [కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు] అనే రెండు సభలు కలసి పార్లమెంటు అనే పేరుతో పిలువబడుతవి.

రాష్ట్ర ప్రతినిధిసభలో 250 మందికి మించకుండా సభ్యులు వుంటారు. వీరిలో 12 మంది ప్రెసిడెంటుచే నామినేట్ చేయబడినవారు. ఇలా నామినేట్ చెయ్యడంలో, శాస్త్రవిజ్ఞానము, కళ, సంఘసేవలలో ప్రత్యేక నిపుణత్వం పొందినవారినే ప్రెసిడెంటు ఎన్నుకుంటాడు. తక్కిన సభ్యులు, 238 మందికి మించకుండా, రాష్ట్రాలలోని శాసన సభలచేత ఎన్నుకోబడిన వారై వుంటారు. వివిధరాష్ట్రాలనుంచి ఎన్నుకోబడే సభ్యుల సంఖ్య ఇది :

| | | |
|---|---|---|
| అస్సాం | : | 6 |
| ఉత్తరప్రదేశ్ | : | 31 |
| ఒరిస్సా | : | 9 |

| | | |
|---|---|---|
| పంజాబ్ | : | 8 |
| పశ్చిమ బెంగాల్ | : | 14 |
| బీహార్ | : | 21 |
| బొంబాయి | : | 17 |
| మదరాసు | : | 27 |
| మధ్యప్రదేశ్ | : | 12 |
| కాశ్మీర్ | : | 4 |
| తిరువాన్కూర్-కొచ్చిన్ | : | 6 |
| పాటియాల, తూర్పు పంజాబ్ సంస్థానాలు | : | 3 |
| మధ్యభారత్ | : | 6 |
| మైసూర్ | : | 6 |
| రాజస్థాన్ | : | 9 |
| సౌరాష్ట్ర | : | 4 |
| హైదరాబాద్ | : | 11 |
| అజ్మీర్ కూర్గ్ | : | 1 |
| కచ్ | : | 1 |
| ఢిల్లీ | : | 1 |
| త్రిపుర మణిపూర్ | : | 1 |
| భోపాల్ | : | 1 |
| విలాసపూర్ హిమాచలప్రదేశ్ | : | 1 |
| వింధ్యప్రదేశ్ | . | 4 |

ప్రజాసభ సభ్యులసంఖ్య 500 లకు మించకూడదు. వీరంతా కూడా దేశంలో, ఓటింగు హక్కుగల ప్రజలచేత ఎన్నుకోబడినవారై

వుండాలి. ప్రజాసభకు సభ్యులను ఎన్నుకోడానికి రాష్ట్రాలలో నియోజక వర్గాలను ఏర్పరచాలి. ఏనియోజకవర్గంలోనూ 750,000 మంది కంటె ఎక్కువ గాని, 500,000 మందికంటె తక్కువగాని ప్రజలు వుండకుండాచూడాలి. అంటే దేశంలోని ప్రజలలో ప్రతి 500,000 జనాభాకు ఒక ప్రతినిధికి తక్కువ కాకుండానూ, ప్రతి 750,000 జనాభాకు ఒక ప్రతినిధి యెక్కువ కాకుండానూ, ప్రజాసభలో సభ్యులువుండాలి.

ప్రజాసభ ప్రతి అయిదు సంవత్సరాలకూ రద్దు అయిపోతుంది. మళ్లా ఎన్నికలు జరుగుతాయి.

రాష్ట్రప్రతినిధిసభ రద్దుకాదు. ప్రతిరెండుసంవత్సరాలకూ, ఈ సభలోని సభ్యులలో మూడవవంతుమంది సభ్యత్వంనుంచి విరమిస్తారు. ఆ ఖాళీలకుమాత్రమే మళ్లీ ఎన్నికలు జరుగుతాయి.

పార్లమెంటు సభ్యుడుగా ఎన్నుకోబడే వ్యక్తి, ఇండియా పౌరుడై వుండాలి. రాష్ట్రప్రతినిధిసభకు అయితే 30 సంవత్సరాలలోపు వయసు వాడు పనికిరాడు. అంతేగాక, పార్లమెంటు ఏవైన అర్హతలను నిర్ణయిస్తే అలాటి అర్హతలనుకూడా అతడు కలిగివుండాలి.

పార్లమెంటుసభలు ప్రతిసంవత్సరం అధమం రెండుసార్లయినా సమావేశమవాలి. ఒక సమావేశం అయిన ఆరునెలలలోపున రెండవ సమావేశం జరిగితీరాలి, అవసరమైతే, యీ సభలను ప్రత్యేక సమావేశం జరపవలసిందని ఆజ్ఞాపించడానికిగాని, రెండు సభలుకలిసి సమావేశమవాలని కోరడానికిగాని, ప్రజాసభను రద్దుచెయ్యడానికి ప్రెసిడెంటుకు అధికారంవుంది.

ఇండియా వైస్‌ప్రెసిడెంట్ రాష్ట్రప్రతినిధిసభకు చైర్మన్‌గా వుంటాడు. చైర్మన్‌లేని సమయంలో సభాకార్యక్రమాలను నడపించడానికి ఒక డిప్యూటీ చైర్మనును రాష్ట్రప్రతినిధిసభ, ముందుగానే ఎన్నుకొంటుంది.

ప్రజాసభ కార్యక్రమాన్ని నడిపించడానికి ఒక స్పీకరునూ ఆయన లేని సమయాలలో ఆయన స్థానే పని చెయ్యడానికి ఒక డిప్యూటీ స్పీకరునూ ప్రజాసభ ఎన్నుకొంటుంది.

ఒకేవ్యక్తి, ప్రజాసభలోను-రాష్ట్ర ప్రతినిధిసభలోను సభ్యుడుగా వుండకూడదు. అంతేకాక, పార్లమెంటు సభ్యుడు రాష్ట్ర శాసనసభలలోను, రాష్ట్రశాసనసభ సభ్యుడు పార్లమెంటు సభ్యుడుగాను వుండకూడదు:

పార్లమెంటు సభ్యుడెవరైనా, 60 రోజులపాటు సభకు హాజరు కాకపోయినట్లయితే, అతని సభ్యత్వాన్ని రద్దుచేయవచ్చును.

పార్లమెంటు సభ్యులు పార్లమెంటులోచేసే వుపన్యాసాల విషయంలో, అసభ్యమైన పదములను ఉపయోగించనంతవరకూ, పార్లమెంటు నిబంధనలకు లోబడినంతవరకూ, సంపూర్ణస్వాతంత్ర్యం వుంది. పార్లమెంటులోచేసిన వుపన్యాసాల కారణంగా ఏసభ్యునిపైనా కోర్టు చర్యతీసుకోడానికి వీలులేదు.

డబ్బు ఖర్చుకూ, ఆదాయానికీ సంబంధించిన చట్టాలు తప్ప, మిగతా చట్టాలు ప్రజాసభలోగాని రాష్ట్రప్రతినిధి సభలోగాని ప్రతిపాదింపబడవచ్చును.

డబ్బుకు సంబంధించిన చట్టాలను ప్రజాప్రతినిధి సభలోనే ప్రతిపాదించాలి గాని, రాష్ట్రప్రతినిధిసభలో ప్రతిపాదించరాదు.

డబ్బుకు సంబంధించినచట్టాలు అంటే : పన్నులు వెయ్యడం, వున్న పన్నులను తీసివెయ్యడం, లేదా తగ్గించడం, ప్రభుత్వం అప్పు చెయ్యడం, ప్రభుత్వ మూలధనంనుంచి ఖర్చుకుగాను కొంత డబ్బును తీసుకోవటం మొదలైన విషయాలకు సంబంధించినవి.

ఒకచట్టం రెండుసభలచేతనూ ఆమోదింపబడిన తరువాత, అది ప్రెసిడెంటు అంగీకారానికి పంపబడుతుంది. దానికి అంగీకరించినట్లుగాని, లేదా అంగీకరించనట్లుగాని ప్రెసిడెంటు ప్రకటించాలి. అతడు

అంగీకరించక పోయినట్లయితే, అతడు ఆ చట్టాన్ని పూర్తిగాగాని దానిలో కొన్ని భాగాలనుగాని మళ్లీ పరిశీలించవలసిందని పార్లమెంటు సభలను రెండింటినీ కోరుతూ త్రిప్పివెయ్యవచ్చును. ప్రెసిడెంటు అలా చేసిన తరువాత, రెండు సభలూ మళ్ళీ ఆ చట్టాన్ని మార్పులు ఏమీ చెయ్యకుండా ఆమోదించినట్లయితే, ఆచట్టానికి ప్రెసిడెంటు తన అంగీకారాన్ని ఇచ్చి తీరాలి.

ప్రతిసంవత్సరమూ ప్రభుత్వానికిచ్చే ఆదాయానికీ, అయ్యే ఖర్చుకూ అంచనాలను తయారుచేయించి, ప్రతిసంవత్సరమూ పార్లమెంటుకు సమర్పించేటట్టు ప్రెసిడెంటు చూడాలి.

పార్లమెంటుసభలో కార్యక్రమం అంతా హిందీలోగాని, ఇంగ్లీషులోగాని జరగాలి. ఈ రెండుభాషలూ సరిగారాని సభ్యుడు అతని మాతృభాషలో మాటలాడవచ్చునని అతనికి ప్రెసిడెంటు అనుమతీనివ్వవచ్చును.

పార్లమెంటు మళ్ళీ ఏర్పాటుచేస్తేతప్ప, ఈ రాజ్యాంగచట్టం అమలులోకి వచ్చిన పదిహేను సంవత్సరాల తరువాత, ఇంగ్లీషుభాషా ఉపయోగం నిలిపివేయబడుతుంది.

పార్లమెంటు సభలు రెండూకూడా సమావేశం అవుతూవుండని సమయంలో, అత్యవసరంగా ఏదైనా శాసనాన్ని అమలులోకి తేవలసివుంటే, అలాటి శాసనాన్ని ప్రెసిడెంటు ప్రకటించి అమలులో పెట్టవచ్చును. దీనికే ఆర్డినెన్సు అని పేరు. తరువాత, పార్లమెంటు సమావేశం జరిగినప్పుడు, యీ ఆర్డినెన్సు పార్లమెంటు ఆమోదానికి ప్రతిపాదించాలి. అలా చెయ్యనట్లయితే, పార్లమెంటు సమావేశమైన ఆరు వారాలలోపున ఆర్డినెన్సు రద్దు అయిపోతుంది.

ఇండియాకు ఒక సుప్రీంకోర్టు [ప్రధానన్యాయస్థానం] వుంటుంది. ఒక ప్రధానన్యాయమూర్తి, ఏడుగురికి తక్కువకాకుండా న్యాయమూర్తులు యీ కోర్టుకు నియమించబడాలి. సుప్రీంకోర్టు జడ్జీలను రాష్ట్రాలలోని హైకోర్టులతోను, సుప్రీంకోర్టుతోను సంప్రతించి, ప్ర

డెంటు నియమిస్తాడు. ప్రధాన న్యాయమూర్తి నియామకంలో తప్ప, తక్కిన జడ్జిలను నియమించేటప్పుడు ప్రధాన న్యాయమూర్తితో కూడా ప్రెసిడెంటు సంప్రతించి తీరాలి. సుప్రీంకోర్టు జడ్జీలు 65 సంవత్సరాల వయసునిండగానే, ఆ పదవినుంచి విరమించాలి. ప్రధాన న్యాయమూర్తికి నెలకు రు. 5,000, తక్కిన జడ్జిలకు ఒక్కొక్కరికి నెలకు రు. 4,000 జీతం. వీరందరికీ అద్దెలేకుండా గృహవసతి ఇవ్వబడుతుంది.

## రాష్ట్ర పరిపాలన

ప్రతిరాష్ట్రానికీ ఒక గవర్నరు వుంటాడు. రాష్ట్ర పరిపాలనాధికారం అంతా గవర్నరు చేతిలోగాని, గవర్నరుకు లోబడి పనిచేసే అధికారుల చేతిలోగాని వుంటుంది.

గవర్నరును ఇండియా ప్రెసిడెంటు నియమిస్తాడు. అయిదుసంవత్సరాల పరిమితికి మించకుండా, ప్రెసిడెంటు విశ్వాసానికి పాత్రుడైనంత కాలము, గవర్నరు పదవిలో వుండవచ్చును.

ఇండియా పౌరుడు కానివాడూ, 35 సంవత్సరాల వయస్సుకు లోపువాడూ గవర్నరుగా నియమింపబడరాదు.

గవర్నరు, పార్లమెంటు సభలలోగాని రాష్ట్ర శాసన సభలలోగాని సభ్యుడుగా వుండరాదు.

గవర్నరుకు నెలకు 5,500 రూపాయిల జీతం ఇవ్వబడుతుంది. ఇది కాక ప్రయాణపు ఖర్చులు, ఉచితవసతి మొదలైన సౌకర్యాలు కూడా ఇవ్వబడుతవి.

గవర్నరుకు రాష్ట్రపరిపాలనలో సలహా ఇవ్వడానికి ఒక మంత్రిమండలి వుంటుంది. ఈ మంత్రిమండలి నాయకుడిని ప్రధాని (ఛీఫ్ మినిస్టర్) అంటారు. ప్రధానిని గవర్నరు నియమిస్తాడు. తక్కిన మంత్రులను ప్రధాని సలహా ప్రకారం గవర్నరు నియమిస్తాడు. మంత్రులందరూ కూడా గవర్నరు విశ్వాసానికి పాత్రులైనంతకాలమే పదవిలో వుంటారు. మంత్రిమండలి సమిష్టిమీద రాష్ట్ర శాసనసభకు జవాబుదారులై వుంటారు.

ఏవ్యక్తి అయినా, మంత్రిగా నియమింపబడిన ఆరునెలల లోపున అతడు రాష్ట్ర శాసనసభలో (అంతకుముందే సభ్యుడుగా వుండకపోయినట్లయితే) సభ్యత్వాన్ని సంపాదించుకోవాలి, లేకపోతే మంత్రి పదవిని కోల్పోతాడు. రాష్ట్ర శాసనసభలో నిర్ణయింపబడిన ప్రకారం, మంత్రులకు జీతాలు, అలవెన్సులు ఇవ్వబడుతవి.

రాష్ట్ర పరిపాలన అంతా గవర్నరు పేరుమీదనే జరుగుతుంది.

రాష్ట్రపరిపాలనకు సంబంధించిన విషయాలలో. మంత్రిమండలి చేసిన నిర్ణయాలను, కొత్తశాసనములను తయారు చెయ్యటానికి మంత్రి మండలి చేసే ప్రతిపాదనలనూ ప్రధాని గవర్నరుకు తెలియపరచాలి. ఏదైనా ఒక విషయంపైన, ఒక మంత్రి నిర్ణయంచేస్తే, ఆ ఒక నిర్ణయాన్ని మంత్రిమండలి పరిశీలనకు పెట్టాలని. గవర్నరు కోరితే, ప్రధాని అలా చెయ్యాలి.

## శా స న స భ లు

ప్రతిరాష్ట్రంలో శాసనసభ వుండాలి. పంజాబ్, పశ్చిమ బెంగాల్, బీహార్, బొంబాయి, మదరాసు, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో, ఒక్కొక్కదానిలో రెండు శాసనసభలు వుండాలి. తక్కినరాష్ట్రాలలో, ఒక్కొక్కదానిలో ఒక్కొక్క శాసనసభ వుంటుంది.

ఒకే సభవున్న రాష్ట్రంలోని శాసనసభకు లెజిస్లేటివ్ అసెంబ్లీ అని పేరు. రెండు సభలువుండే రాష్ట్రాలలోని శాసనసభలలో ఒకదానిని లెజిస్లేటివ్ అసెంబ్లీ అనీ, మరొకదానికి లెజిస్లేటివ్ కౌన్సిల్ అనిపేరు.

లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యులంతా ప్రజలచేత ఎన్నుకోబడినవారై వుండాలి. రాష్ట్రంలోని జనాభాలో ప్రతి 75 వేలమందికీ ఒక సభ్యుడు చొప్పున, అసెంబ్లీ సభ్యుల సంఖ్య నిర్ణయింపబడుతుంది, అయితే, ఏ రాష్ట్రంలోని అసెంబ్లీలోను 500మందికంటె ఎక్కువమందిగాని 60 మంది కంటె తక్కువమందిగాని సభ్యులు వుండరాదు.

లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులసంఖ్య, అసెంబ్లీ సభ్యులసంఖ్యలో నాల్గవవంతుకంటె ఎక్కువ వుండకూడదు. అయితే, ఏ లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులసంఖ్య 40 కన్న తక్కువ వుండకూడదు.

రాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులలో మూడవ వంతుమంది రాష్ట్రంలోని మునిసిపల్ కౌన్సిళ్ళ సభ్యులూ, జిల్లాబోర్డుల సభ్యులూ ఇతర స్థానిక సంస్థల సభ్యులూ ఎన్నుకున్నవారై వుండాలి. వీరుకాక, కౌన్సిలు సభ్యులలో దాదాపు పన్నెండవవంతుమంది, రాష్ట్రంలో నివసిస్తున్న యూనివర్సిటీ పట్టభద్రుల (గ్రాడ్యుయేట్లు)చే ఎన్నుకోనబడిన వారై వుండాలి. దాదాపు మరొక పన్నెండవవంతుమంది రాష్ట్రంలోని విద్యాసంస్థలలో ఉపాధ్యాయులచే ఎన్నుకోబడినవారై వుండాలి. వీరుకాక, కౌన్సిలుసభ్యులలో మరొక మూడవవంతుమంది రాష్ట్రంలోని అసెంబ్లీ సభ్యులచే ఎన్నుకోనబడినవారై వుండాలి. వీరు అసెంబ్లీ సభ్యులుగా వుండరాదు. పైవారంతాకాక, తక్కిన కౌన్సిలు సభ్యులు గవర్నరుచే నామినేట్ చేయబడినవారు వుంటారు, అలా నామినేట్ చేయబడేవారు, పౌరత్వము, విజ్ఞానశాస్త్రము, కళలు, సహకారోద్యమము సంఘసేవలలో ప్రత్యేకజ్ఞానంగాని, అనుభవంగాని కలవారై వుండాలి.

ఒకసారి ఎన్నుకోనబడిన అసెంబ్లీ అయిదు సంవత్సరాలుమాత్రమే అమలులోవుంటుంది. మొదటిసమావేశం జరిగిన నాటినుంచి అయిదుసంవత్సరాలు నిండగానే రద్దయిపోతుంది.

లెజిస్లేటివ్ కౌన్సిలుమాత్రము ఎన్నటికీ రద్దుకాదు. అయితే ఆసభలోని సభ్యులలో మూడవవంతుమంది, ప్రతి రెండు సంవత్సరాలతరువాత సభ్యత్వంనుంచి విరమిస్తారు. విరిస్తానే, కొత్త సభ్యులు ఎన్నుకోబడుతారు.

ఇండియా పౌరుడుకాని వ్యక్తికి అసెంబ్లీకిగాని కౌన్సిలుకుగాని సభ్యుడుగా ఎన్నుకోబడే హక్కులేదు. 25 ఏళ్లు నిండినవారైతేనే అసెంబ్లీకి, 30 ఏళ్లు నిండినవారైతేనే కౌన్సిలుకు-సభ్యుడుగా ఎన్నుకోబడడానికి అర్హత గలిగివుంటాడు.

రాష్ట్ర శాసనసభల సమావేశం, ప్రతిసంవత్సరమూ కనీసం రెండుసార్లయినా జరగాలి. ఒక సమావేశం జరిగిన ఆరు నెలలలోపున మరొక సమావేశం జరిగితీరాలి.

శాసనసభ సమావేశం జరిగినప్పుడు, ప్రారంభదినం నాడు ఆ సభలలో గవర్నరు ఉపన్యసించాలి.

ప్రతి లెజిస్లేటివ్ అసెంబ్లీ, వీలైనంత త్వరలో, ఆ సభలోని ఇద్దరు సభ్యులను ఒకరిని స్పీకరుగాను, మరొకరిని డిప్యూటి స్పీకరుగాను ఎన్నుకోవాలి. స్పీకరుగాని, డిప్యూటి స్పీకరుగాని అసెంబ్లీలో సభ్యత్వాన్ని కోల్పోయినట్లయితే, తమ పదవినికూడా కోల్పోవాలి. అయితే, ఒక అసెంబ్లీ రద్దుఅయినప్పుడు స్పీకరుమాత్రం తనపదవిని కోల్పోనక్కరలేదు. మళ్లీ కొత్త అసెంబ్లీ ఏర్పడినదాకా ఆపదవిలో వుండవచ్చును. శాసనసభ కార్యక్రమాన్ని జరిపించడం, సభలోజరిగే కార్యక్రమాన్ని నిర్ణయించడం, కార్యక్రమం విషయంలోవచ్చే భేదాభిప్రాయాలను పరిష్కరించడం స్పీకరువిధి. స్పీకరు అంటే సభాపతి అన్నమాట. స్పీకరు సభలో లేనప్పుడు స్పీకరు పనిని డిప్యూటీ స్పీకరు చెయ్యాలి.

లెజిస్లేటివ్ కౌన్సిలు కార్యక్రమాన్ని నడిపించేవాడు చైర్మెన్. లెజిస్లేటివ్ కౌన్సిలు ఏర్పడినతరువాత, వీలైనంతత్వరగా చైర్మెనును, డిప్యూటీ చైర్మెనులను ఎన్నుకోవాలి; ఇలా ఎన్నుకోబడినవారు కౌన్సిలు సభ్యులే అయివుండాలి. కౌన్సిలులో సభ్యత్వాన్ని కోల్పోయినవారు, యీ పదవులనుకూడా కోల్పోతారు. చైర్మను సభలోలేనప్పుడు, ఆయన పనిని డిప్యూటి చైర్మన్ చేస్తాడు.

శాసనసభలో చర్చకువచ్చే ప్రతి విషయంలోనూ, సభలోని సభ్యులలో ఎక్కువమంది ఎలా అభిప్రాయపడితే అది అలా నిర్ణయింపబడుతుంది. ఒకవిషయాన్ని గురించి, సగంమంది ఒకవైపూ, తక్కిన సగంమంది మరొకవైపూ వున్నట్లయితే, సభాపతి తనుకూడా ఓటువేసి, ఎటువైపు ఎక్కువఓట్లువస్తే అటువైపువారి అభిప్రాయాన్నే సభ నిర్ణయంగా ప్రకటించవచ్చును.

శాసనసభ సమావేశమైనప్పుడు సభమొత్తం సభ్యులలో పదవవంతు మంది అయినా సభలో లేకపోతే, ఆసభ నమావేశానికి విలువలేదు. రాష్ట్ర శాసనసభ సభ్యుల సంఖ్యలో పదవవంతు సభ్యులు, పదిమందికన్న తక్కువగావుండే పక్షంలో, ఆ సమావేశంలో అధమం పదిమంది సభ్యులైనా వుండకపోతే సమావేశానికి విలువలేదు.

అసెంబ్లీ, కౌన్సిలు రెండూవున్న రాష్ట్రంలో, ఏవ్యక్తీ రెండు సభలలోనూ సభ్యుడుగా వుండరాదు.

ఒకేవ్యక్తి రెండు రాష్ట్రాలలోని శాసనసభలలో సభ్యుడుగా వుండరాదు.

ఒక సభ్యుడు, శాసనసభ సమావేశానికి వరసగా 60 రోజులు రాకపోయినట్లయితే, అతని సభ్యత్వం రద్దుచేయబడుతుంది.

ప్రభుత్వోద్యోగంలో వున్నవారుగాని, మతిస్థిరం లేనివారుగాని, దివాలా తీసినవారుగాని, ఇండియా పౌరులు కానివారుగాని, విదేశ ప్రభుత్వాల అధికారానికి లోబడినవారుగాని, పార్లమెంటు శాసనాలవల్ల తమ అర్హతలను కోల్పోయినవారుగాని శాసనసభా సభ్యులుగా ఎన్నికకు అర్హులుకారు.

శాసనసభ నియమాలకు బద్ధులై, సభ్యులు ఏ విషయాన్ని గురించి అయినా మాట్లాడడానికి సంపూర్ణ స్వాతంత్ర్యం కలిగివుంటారు.

శాసనసభ నిర్ణయించినప్రకారం జీతాలుగాని అలవెన్సులుగాని సభ్యులకు ఇవ్వబడుతవి.

ద్రవ్యచట్టాలుతప్ప,తక్కినచట్టాలు శాసనసభలలోగాని అసెంబ్లీలోగాని కౌన్సిలులోగాని మొదటిసారి ప్రతిపాదింప బడవచ్చును. ద్రవ్య చట్టంఅంటే పన్నులు వెయ్యడానికీ, పన్నులు తగ్గించడానికీ సంబంధించినవి. అసెంబ్లీ ఒకచట్టాన్ని ఆమోదించినతరువాత, కౌన్సిలు ఆ చట్టాన్ని ఆమోదించక పోయినా, కౌన్సిలులో ఆచట్టంపై చర్చ ప్రారంభమైన మూడుసెలలలోపున ఆచర్చ ముగియకపోయినా, అసెంబ్లీ అంగీకరించని సవరణలతో ఆ చట్టాన్ని కౌన్సిలు ప్యాసుచేసినా, అసెంబ్లీ మళ్లీ ఆ చట్టాన్ని ఆమోదించి మళ్ళీ కౌన్సిలుకు పంపవచ్చును; అలా రెండవసారి వచ్చిన చట్టాన్ని కౌన్సిలు తిరస్కరించినా, ప్రతిపాదన జరిగిన మూడు నెలలలోపున ఆ చట్టంపై చర్చను ముగించకపోయినా, ఆచట్టం అసెంబ్లీ ఆమోదాన్ని రెండవసారి పొందిన రూపంలో ఉభయసభల ఆమోదాన్ని పొందినట్లే పరిగణించాలి.

ద్రవ్య చట్టాన్ని అసెంబ్లీలోనే ప్రతిపాదించాలిగాని కౌన్సిలులో ప్రతిపాదించకూడదు. అసెంబ్లీ ఆమోదం పొందినతరువాత ఆ చట్టాన్ని

కౌన్సిలులో ప్రతిపాదించాలి. అలా ప్రతిపాదన జరిగిన 14 రోజులలోపున కౌన్సిలు ఆ చట్టాన్ని తన సలహాలతో తిరిగి అసెంబ్లీకి పంపాలి. కౌన్సిలు సలహాలను అసెంబ్లీ ఆమోదించినట్లయితే, ఆ సవరణలతో సహా చట్టం ఉభయసభల ఆమోదాన్ని పొందినట్లే. కౌన్సిలు సలహాలను అసెంబ్లీ ఆమోదించకపోయినా, ఆ చట్టం ఉభయసభల ఆమోదాన్ని పొందినట్లే.

ఒకచట్టం రాష్ట్ర శాసనసభల ఆమోదాన్ని పొందినతరువాత, గవర్నరు ఆ చట్టాన్ని అంగీకరించినట్లయితే, అది శాసనమౌతుంది. లేదా గవర్నరు ఆ చట్టాన్ని నిరాకరించవచ్చును: లేదా ప్రెసిడెంటు పరిశీలనకు పంపవచ్చును.

గవర్నరు ఏ చట్టాన్నైనా అంగీకరించకపోతే, ఆ చట్టాన్నిగాని, ఆ చట్టంలోని కొన్ని నిర్ణయాలనుగాని మళ్ళీ పరిశీలించవలసిందని శాసనసభను కోరుతూ, శాసనసభకు పంపవచ్చును. అలా పంపినప్పటికీ, శాసనసభ ఆ చట్టాన్ని యథాపూర్వంగా ఆమోదించినట్లయితే, గవర్నరు ఆ చట్టమును అంగీకరించితీరాలి.

హైకోర్టు అధికారాలను కించపరచేచట్టం ఏదైనా రాష్ట్రశాసనసభ ఆమోదించినట్లయితే, ఆ చట్టాన్ని ప్రెసిడెంటుపరిశీలనకు గవర్నరుపంపాలి. ప్రెసిడెంటు ఆ చట్టాన్ని అంగీకరిస్తున్నాననిగాని, అంగీకరించడం లేదనిగాని ప్రకటించాలి. లేదా, పునఃపరిశీలన చెయ్యమని కోరుతూ ఆచట్టాన్ని రాష్ట్ర శాసనసభకు పంపమని గవర్నరును కోరాలి. అలా చేసినప్పటికీ, రాష్ట్ర శాసనసభకు ఆ చట్టాన్ని యథాపూర్వంగా ఆమోదించినట్లయితే, మళ్ళీ ఆ చట్టాన్ని ప్రెసిడెంటు పరిశీలనకు పంపాలి.

ప్రతిసంవత్సరమూ రాష్ట్ర ప్రభుత్వానికి వచ్చే ఆదాయమూ, అయే ఖర్చుల అంచనాను గురించి రాష్ట్ర శాసనసభలో ఒక ప్రకటన జరిగేటట్టు గవర్నరు చూడాలి.

రాష్ట్ర శాసనసభలలో కార్యక్రమం, ఆ రాష్ట్రప్రభుత్వం గుర్తించిన అధికార భాషలలోగాని, హిందీలోగాని, ఇంగ్లీషులోగాని జరగాలి: పదిహేనేండ్లు జరిగినతరువాత, మళ్ళీ శాసనరూపంగా ఏర్పాటు జరిగితే తప్ప ఇంగ్లీషుభాషలో ఏకార్యక్రమమూ జరుపరాదు.

సుప్రీంకోర్టు జడ్జీలుగాని, రాష్ట్ర హైకోర్టుల జడ్జీలుగాని తమ విధులను నిర్వర్తించడంలోచేసిన ఏపనిని గురించీ శాసనసభలలో చర్చ జరుగరాదు.

రాష్ట్రంలోని శాసనసభలు సమావేశం జరుపుతూవుండని సమయంలో, అవసరంగా చర్యతీసుకోవాలని గవర్నరుకు తోచినట్లయితే ఆర్డినెన్సు శాసనాన్ని అమలుజరుపవచ్చును. అయితే ఆ ఆర్డినెన్సు, రాష్ట్ర శాసనసభ సమావేశం అయిన ఆరువారాలలోపున శాసనసభ ఆమోదాన్ని పొందకపోయినట్లయితే, రద్దు అయిపోతుంది.

## హైకోర్టులు

ప్రతిరాష్ట్రానికీ ఒక హైకోర్టు వుండాలి. ప్రతి హైకోర్టుకీ ఒక ప్రధాన న్యాయమూర్తి, ప్రెసిడెంటు నిర్ణయించినంతమంది ఇతర జడ్జీలు వుంటారు. ఇండియా ప్రధాన న్యాయమూర్తితోను, రాష్ట్ర గవర్నరుతోను, రాష్ట్ర ప్రధానన్యాయమూర్తితోను సంప్రతించి హైకోర్టు జడ్జి నియామకాన్ని ప్రెసిడెంటు చేస్తాడు. హైకోర్టుజడ్జీ, బర్తరఫ్ చేయబడితేతప్ప, తనకు 60 సంవత్సరాల వయస్సువచ్చినదాకా ఉద్యోగంలో వుండవచ్చును.

ఒకసారి హైకోర్టు జడ్జీగా పనిచేసినవ్యక్తి ఇండియాలోని ఏ కోర్టులోను వాది ప్రతివాదులలో ఎవరితరఫునా వాదించరాదు.

ప్రతి హైకోర్టుకూ, ఆ రాష్ట్రంలోని తక్కినకోర్టులన్నిటిమీదా పరిశీలనాధికారంవుంది. రాష్ట్రంలోని జిల్లాకోర్టుకు జడ్జీలను నియమించడంలో, గవర్నరు రాష్ట్రంలోని హైకోర్టుతో సంప్రతించాలి.

ఇండియాలోని వివిధరాష్ట్రాలలోని, హైకోర్టులకు, జడ్జీల నియామకం యీ క్రింద తెలిపిన సంఖ్యకు మించకుండా వుండాలని ప్రెసిడెంటు 1951 డిసెంబరు 28 న ఉత్తరువుచేశారు.

అలహాబాద్, 20; అస్సాం, 5; బొంబాయి, 14; కలకత్తా, 20; మదరాసు. 16; నాగపూర్, 10; ఒరిస్సా, 7; పాట్నా, 14; పంజాబ్,

3; హైదరాబాద్, 11; మధ్యభారత్, 8; మైసూరు, 6; పాటియాల తూర్పుపంజాబ్ సంస్థానాలు, 5; రాజస్థాన్, 10; సౌరాష్ట్ర, 5; తిరువాంకూర్, కొచ్చిన్, 8.

## సంస్థానాల యూనియనులు

సంస్థానాల యూనియనులలోకూడా పరిపాలన అంతా రాష్ట్రాలలోలాగనే జరుగుతుంది. రాష్ట్రాలు అనేమాట వుపయోగించినప్పుడు ఆమాట సంస్థానాల యూనియనులకుకూడా వర్తిస్తుంది. అయితే, రాష్ట్రాలలో గవర్నరుకు బదులు సంస్థానాల యూనియనులలో రాజప్రముఖులు పరిపాలన సాగిస్తారు.

ప్రస్తుతం మనదేశంలో వున్న సంస్థానాల యూనియనులు ఇవి: కాశ్మీర్; తిరువాంకూర్-కొచ్చిన్; పాటియాల తూర్పు పంజాబ్ సంస్థానాలు, మధ్యభారత్, మైసూర్, రాజస్థాన్, సౌరాష్ట్ర, హైదరాబాద్.

## కమిషనర్ రాష్ట్రాలు

కమిషనర్ రాష్ట్రాలంటే ఇవి: అజ్మీర్, అండమాన్ నికోబార్ దీవులు, కచ్, కూర్గ్, ఢిల్లి, త్రిపుర, భోపాల్, మణిపూర్, బిలాస్‌పూర్, వింధ్యప్రదేశ్, హిమాచలప్రదేశ్.

ఈరాష్ట్రాల పరిపాలనను ప్రెసిడెంటే, తాను నియమించిన ఛీఫ్ కమిషనర్ ద్వారాగాని, లెప్టినెంట్ ద్వారాగాని సాగిస్తాడు.

ఈ రాష్ట్రాల పరిపాలనలో ఛీఫ్ కమిషనర్లకు సలహా ఇవ్వడానికి ఒక శాసనసభనుగాని మంత్రిమండలినిగాని ఏర్పాటు చెయ్యడానికి పార్లమెంటు నిర్ణయించవచ్చును.

పార్లమెంటు శాసనరీత్యా మార్పుచేస్తేతప్ప, కూర్గ్ రాష్ట్రంలో వున్న శాసనసభ, ఇప్పుడున్న అధికారాలూ, హక్కులతో పనిచేస్తు వుంటుంది.

# శాసననిర్మాణము

... ఇండియా అంతకూ శాసనాలనుచేసే అధికారం పార్లమెంటుకి. రాష్ట్రశాసనసభలు, ఆయా రాష్ట్రాలకు వర్తించేటట్టు మాత్రమే శాసనాలను చెయ్యగలవు.

ఈ క్రింది విషయాలను గురించి శాసనాలు చేసే అధికారం పార్లమెంటుకు మాత్రమే వుంది; అవేమిటంటే; ఇండియా రక్షణ; యుద్ధసమయంలో సన్నాహాలు; నౌకా, విమాన, సైన్యదళాలు; ఆయుధములు; ఆయుధసామగ్రి; ఏటంశక్తి ఉపయోగం; యుద్ధనిర్వహణకు అవసరమైన పరిశ్రమలు; కేంద్ర సి. ఐ. డి: ఇండియా రక్షణనిమిత్తం వ్యక్తులను నిర్బంధంలో వుంచడం; విదేశాలతో సంబంధాలు; యునైటెడ్ నేషన్స్, అంతర్జాతీయ సభలలో పాల్గొనడం; విదేశాలతో ఒడంబడికలు; యుద్ధము; శాంతి; పౌరసత్వహక్కులు; వలసవచ్చే వారిని ఇండియాకు రానివ్వడం; విదేశాలకు యాత్ర; రైల్వేలు; జాతీయరహదార్లు; నౌకా నిర్మాణం, నౌకాయానం; వ్యాపార నౌకాసౌకర్యాలు; పెద్దరేవులు; విమానప్రయాణాలు; విమానాశ్రయాలు; పోస్టు, టెలిగ్రాఫ్‌లు; నాణెములు, మారకపురేటు; రిజర్వుబాంక్; ప్రభుత్వంచే నడుపబడే లాటరీలు; విదేశాలతో వ్యాపారం; ఒక రాష్ట్రంలోంచి మరొక రాష్ట్రానికి వ్యాపారం; బ్యాంకులు; ఇన్సూరెన్సు కంపెనీలు మొదలైన వ్యాపార సంస్థల స్థాపన, వాటిమూసివేత; ఇన్సూరెన్సు; బ్యాంకి వ్యాపారము; స్టాక్ ఎక్స్చేంజి; కాపీరైట్; వ్యాపారగుర్తులు; తూకపు కొలతల నిర్ణయము; పెట్రోలు గనులు; గనులలో పనిచేసే కార్మికులు; ఉప్పుతయారీ, అమ్మకము; నల్లమందు తయారీ, అమ్మకము; సినిమా ఫిల్ముల ప్రదర్శనము; పురాతన వస్తువుల భద్రత; జనాభా లెఖలు, పార్లమెంటుకీ, రాష్ట్రశాసనసభలకూ ఎన్నికలు; ఉన్నతవిద్య; సుప్రీంకోర్టు; హైకోర్టులు; వ్యవసాయ రాబడితప్ప ఇతరరాబడిపై పన్ను, పత్రికల అమ్మకముపైన, పత్రికలలోని ప్రకటనలపైన పన్ను.

శాసనాలను చెయ్యడంలో రాష్ట్రశాసనసభలకుమాత్రం అధికారం గల విషయాలు ఏమిటంటే : ప్రజాశాంతి : పోలీసు ; న్యాయరక్షణ ; జైళ్లు; స్థానిక పరిపాలన; ప్రజారోగ్యము; మత్తుకలిగించే పానీయములు; పనిచేయలేనివారికి ఉపాధి; విద్య; రోడ్లు; వ్యవసాయము; పశుసంరక్షణ; వ్యవసాయానికి నీటిపారుదల; అడవులు; పరిశ్రమలు: వడ్డీ వ్యాపారము; హోటళ్ళు; నాటక ప్రదర్శనములు; జూదము; రాష్ట్రశాసనసభలకుఎన్నికలు; వ్యవసాయరాబడిపై పన్ను; భూములపైన, ఇళ్ళపైన పన్నులు; విద్యుచ్ఛక్తిపై పన్ను; అమ్మకపు పన్ను; మోటార్లు, బళ్లపైన పన్నులు; వృత్తి పన్ను.

పైన ప్రత్యేకంగా వివరించిన విషయాలుగాక, యీ క్రింది విషయాలనుగురించి శాసనాలను చెయ్యడానికి పార్లమెంటుకీ, రాష్ట్ర శాసన సభలకూ అధికారంవుంది. అవేమిటంటే: నేరములవివరణ, శిక్ష; అవసరాన్ని బట్టి నేరారోపణలేకుండా వ్యక్తులను నిర్బంధంలోవుంచడం; వివాహాలు; విడాకులు; వారసత్వము, అవిభక్త కుటుంబాల పంపిణీ; కోర్టులలో సాక్ష్యములు; కోర్టు ధిక్కారము; పశుహింసా నిరోధము; ఆహార పదార్థాలలో కల్తీ; కార్మికసంఘాలు; వృత్తి విద్యలు; వైద్యవృత్తి; ప్లీడరీ వృత్తి; చిన్న రేవులు; ధరలపై కంట్రోలు; ఫ్యాక్టరీలు; విద్యుచ్ఛక్తి; వార్తాపత్రికలు; పుస్తకములు; సుప్రీంకోర్టు తప్ప తక్కిన కోర్టులు.

పైన చెప్పిన విషయాలుగాక, తక్కిన ఏ ఇతర విషయాన్నిగురించి అయినా శాసనాలను చెయ్యడానికి పార్లమెంటుకే హక్కువుంది.

దేశంలోని పరిస్థితులు అలజడిలోవుంటే, దేశక్షేమంకోసం రాష్ట్రశాసనసభలకు హక్కువున్న విషయాలపైకూడా శాసనం చెయ్యడానికి పార్లమెంటుకి హక్కువుంది.

పార్లమెంటుచేసిన శాసనాలను సరిగా అమలుజరిగే పద్ధతిలో రాష్ట్రప్రభుత్వం పరిపాలన సాగించాలి.

శాసనరీత్యాతప్ప, మరేవిధంగానూ ఏవిధమైన పన్నునూ దేశంలో ఎవరివద్దనుంచీ ప్రభుత్వం వసూలుచేయరాదు.

పార్లమెంటుకీ, రాష్ట్ర శాసనసభలకీ ఎన్నికలుజరిపించడానికి ఎలెక్షన్ కమిషను ఒకటి ఏర్పాటు చేయబడుతుంది. ఈ కమిషన్‌లో చీఫ్ ఎలెక్షన్ కమిషనర్, ఇంకా ప్రెసిడెంటుచే నియమింపబడే ఇతర ఎలెక్షన్ కమిషనర్లు వుంటారు.

భారతదేశపు పౌరులుగావుండి, 21 సంవత్సరాల వయస్సు నిండిన స్త్రీ పురుషులందరికీ పార్లమెంటు ప్రజాసభ ఎన్నికలలోనూ, రాష్ట్ర అసెంబ్లీల ఎన్నికలలోనూ పాల్గొనడానికి ఓటు హక్కువుంది. మతిస్థిరం లేనివారికీ, నేరముచేసి శిక్షపడినవారికీ ఓటు హక్కులేదు.

పార్లమెంటు ప్రజాసభలో షెడ్యూల్డ్‌క్లాసెస్ (హరిజనులు)కు కొన్ని స్థానాలు ప్రత్యేకింపబడినవి.

ఆంగ్లో-ఇండియనుజాతి తరఫున తగినంతమంది సభ్యులు పార్లమెంటు ప్రజాసభకు ఎన్నుకోబడలేదని ప్రెసిడెంటుకు తోచినపక్షంలో ఇద్దరికి మించకుండా ఆంగ్లో-ఇండియనులను ప్రజాసభకు ప్రెసిడెంట్ నామినేట్ చేయవచ్చును.

రాష్ట్రశాసనసభలలోకూడా షెడ్యూల్డ్ క్లాస్‌వారికి స్థానాలు ప్రత్యేకించబడాలి. రాష్ట్ర మొత్తం జనాభాలో షెడ్యూల్డ్ క్లాసెస్ ప్రజలు ఎన్నోవంతో, రాష్ట్రశాసనసభ సభ్యులలో అన్నోవంతుమంది షెడ్యూల్డ్ క్లాసెస్ సభ్యులు వుండేటట్లుగా స్థానాలు ప్రత్యేకించబడాలి.

ఏరాష్ట్ర శాసనసభలలోనైనా ఆరాష్ట్రంలోని ఆంగ్లో-ఇండియను ప్రజలకు తగినప్రాతినిధ్యం లభించలేదని ఆరాష్ట్ర గవర్నరుకుగాని రాజప్రముఖునికికాని తోచినట్లయితే, ఆసభకు సభ్యులుగా తగినంతమందిని ఆయన నామినేట్ చెయ్యవచ్చును.

అయితే, యీ రాజ్యాంగవిధానం అమలులోకి వచ్చిన పదిసంవత్సరాల అనంతరం షెడ్యూల్డ్ క్లాసెస్ ప్రజలకును, ఆంగ్లో-ఇండియనులకును పార్లమెంట్‌లోను, రాష్ట్రశాసన సభలలోను కొన్ని స్థానాలను ప్రత్యేకించడం రద్దయిపోతుంది.

## భాష

ఇండియాలో ప్రభుత్వభాషగా హిందీ పరిగణింపబడుతుంది. ఈ భాషకు లిపి, దేవనాగరి.

అయితే. ఈరాజ్యాంగం అమలులోకి వచ్చినతరువాత పదిహేను సంవత్సరాలదాకా, ఇంగ్లీషుభాష ప్రభుత్వభాషగా ఉపయోగింపబడుతుంది. ఈ పదిహేను సంవత్సరాలలో, ఇంగ్లీషుతోపాటు హిందీనికూడా ప్రభుత్వభాషగా వుపయోగించవలసిందని ప్రెసిడెంట్ వుత్తరువు చెయ్యవచ్చును.

పదిహేను సంవత్సరాలు గడచిన తరువాతకూడా, ఇంగ్లీషును ప్రభుత్వభాషగావుపయోగించవచ్చునని పార్లమెంట్ శాసనంచెయ్యవచ్చు.

ఈ రాజ్యాంగ విధానం అమలులోకి వచ్చిన అయిదు సంవత్సరాల తరువాతను, అతరువాత మరొక అయిదు సంవత్సరాల అనంతరము-ప్రెసిడెంటు ఒక కమిషనును నియమించాలి, ఈ కమిషనుపని ఏమిటంటే : దేశంలో ప్రభుత్వ కార్యకలాపాలలో హిందీభాషను ఎంతవరకు ఉపయోగించవచ్చునో, ఇంగ్లీషుభాష ఉపయోగాన్ని ఎంతవరకు తగ్గించవచ్చునో సిఫారస్ చెయ్యడం.

రాష్ట్రాలలో హిందీగాని, రాష్ట్రంలోని ప్రజలు మాట్లాడే భాషలలో ఏదోఒక భాషనుగాని, అన్ని భాషలనుగాని ప్రభుత్వభాషగా ఉపయోగించాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించవచ్చును. అయితే, ఒక రాష్ట్ర ప్రభుత్వం మరొక రాష్ట్రప్రభుత్వంతో జరిపే వ్యవహారాలన్నీ ఇండియా ప్రభుత్వం ప్రభుత్వభాషగా వుపయోగించే భాషలోనే జరపాలి.

## ప్రమాదపరిస్థితి

వెలుపలనుంచివచ్చే శత్రువులవల్లనో, దేశంలో అల్లరులవల్లనో ఇండియా క్షేమానికిగాని, ఇండియాలో ఒకభాగం క్షేమానికిగాని భంగం కలిగే ప్రమాదపరిస్థితి ఏర్పడిందని ప్రెసిడెంటుకు నమ్మకంకలిగినట్లయితే, అలాంటి ప్రమాద పరిస్థితి ఏర్పడిందని ప్రెసిడెంటు ఒక ప్రకటన చెయ్యవచ్చును.

ఈ ప్రకటనను పార్లమెంటు రద్దుచెయ్యవచ్చును. ఇలాంటి ప్రకటన జరిగిన రెండునెలలలోపున ఈ ప్రకటనను పార్లమెంటు ఆమోదిస్తే తప్ప, యీ ప్రకటన రద్దయిపోతుంది.

ప్రతిరాష్ట్రంలోనూ పరిపాలన రాజ్యాంగవిధానంలోని సూత్రాలను అనుసరించి జరిగేటట్టూ, ఏరాష్ట్రంమీదా ఇతరులు దండెత్తి రాకుండా వుండేటట్టూ, ఏ రాష్ట్రంలోనూ అల్లరులు జరుగకుండా వుండేటట్టూ చూడడం ఇండియా ప్రభుత్వపు విధి.

ప్రత్యేక సౌకర్యాలు పొందడానికి అర్హత గల నిమ్నజాతుల పట్టీని 1950 ఆగస్టు 18 తేదిన ప్రెసిడెంటు రాజేంద్రప్రసాద్ ప్రకటించారు, ఆ పట్టీప్రకారం, వివిధరాష్ట్రాలలో యీ అర్హతగల నిమ్నజాతులు (షెడ్యూల్డ్ కాస్ట్స్) సంఖ్య ఇవి :

అస్సాం, 15; ఉత్తరప్రదేశ్, 63; ఒరిస్సా, 92; పశ్చిమ బెంగాల్. 58; పంజాబ్, 34; బీహార్, 21; బొంబాయి, 36; మదరాస్, 77; మధ్యప్రదేశ్, 9; తిరువాన్కూర్-కొచ్చిన్, 30; పాటియాల తూర్పుపంజాబ్ సంస్థానాలు, 34; మధ్యభారత్, 19; మైసూర్, 6; రాజాస్థాన్, 44; సౌరాష్ట్ర, 15; హైదరాబాద్, 32.

## మదరాసు రాష్ట్రంలోని షెడ్యూల్డు కులాల పేర్లు ఇవి

1. ఆది ఆంధ్ర; 2. ఆది ద్రావిడ; 3. ఆది కర్నాటక; 4. అజిల; 5. అరుంధతీర్; 6. బైర; 7. బాకుడ; 8. బండి; 9. బంకి; 10. బావురి; 11. బెల్లార; 12. బ్యాగార; 13. చచ్చాటి; 14. చక్కిలియన్; 15. చలవాది; 16. చమార్; 17. చండాల; 18. చెరుమాన్; 19. దండాసి; 20. దేవేంద్రకులత్తాన్; 21. డోం, లేక డొంబార, పైడి, పానో; 22. ఘాసి, లేక హడ్డి; 23. గొడగలి; 24. గొడరి; 25. గొడ్డ; 26. గోసంగి; 27. హస్ల; 28. హొలేయ; 29. జగ్గలి; 30. జంబువులు; 31. కడన్; 32. కల్లాడి; 33. కన

క్కన్ ; 34. కరింపాలన్ ; 35. కోడాలో ; 36. కూస ; 37. కొరగ ; 38. కుడుబి ; 39. కుడుందన్ ; 40. కురవన్ ; 41. కురిచ్చన్ ; 42. మాదారి ; 43. మాదిగ ; 44. మైల ; 45. మాల ; 46. మాలదాసు ; 47. మాలసార్ ; 48. మాతంగి ; 49. మావిలన్ ; 59. మోగేర్ ; 51. ముచ్చి ; 52. ముండల ; 53. నలకేయువ ; 54. నాయాది ; 55. పగడై ; 56. పైండ ; 57. పాకి ; 58. పల్లన్ ; 59. పంబడ ; 60. పామిడి ; 61. పానిన్ ; 62. పంచమ ; 63. పన్నియాండి ; 64. పరైయన్ ; 65, పరవన్ ; 66. పులయన్ ; 67. పుత్తిరైవణ్ణన్ ; 68. రాణెయర్ ; 69. సమగార ; 70. సంబన్ ; 71. సపరి ; 72. సెమ్మన్ ; 73. తోటి ; 74. తిరువల్లువార్ ; 75. వల్లువాను ; 76. వాల్మీకి ; 77, వెట్టువాన్.

ఈపై కులాలకు చెందినవారు, హిందూమతంలో కాక ఇతర మతాలలోవుంటే, వారు షెడ్యూల్డు కులాలకు చెందినవారుగా పరిగణింపబడరు.

హైదరాబాదులోని షెడ్యూల్డ్ కులాల పేర్లు ఇవి :

1. అనాముక్, 2. అరే, 3. అరవమాల, 4. బేడజంగం, 5. బిండ్ల, 6. బ్యాగార, 7. చలవాది, 8. చంభర్, 9. డొక్కల, 10. ధోర్, 11. యల్లమాలవాండ్లు, 12. హొలేయ, 13. హొలేయదాసరి, 14. కొలుపులవాండ్లు, 15. మాదిగ, 16. మహర్, 17. మాల, 18. మాలదాసరి, 19. మాలహన్నె, 20. మాలజంగం, 21. మాలమస్తి, 22. మాలసాలె, (నేత్కాని) 23. మాలసన్యాసి, 24. మంగ్, 25. మంగ్‌గరోడి, 27. మన్నె, 27 మష్టి, 28. మెహ్తార్, 29. మిథాఅయ్యల్వార్, 30. మోచి, 31. సమగార, 32. సింధోళ్లు.

ఈ పై కులాలకు చెందినవారు హిందుమతంలో కాక ఇతరమతాలలోవుంటే, వారు షెడ్యూల్డ్ కులాలకు చెందినవారుగా పరిగణింపబడరు.

## కొండ జాతులు

ప్రత్యేక సౌకర్యాలు పొందడానికి అర్హతగల కొండజాతుల (షెడ్యూల్డు ట్రైబ్సు) పట్టీని 1950 సెప్టెంబరు 9 తేదిన ఇండియా ప్రెసిడెంట్ ప్రకటించారు. ఆ పట్టీ ప్రకారం వివిధరాష్ట్రాలలో, యీ అర్హతగల కొండజాతుల సంఖ్య వివరాలివి :

అస్సాం, 11, ఉత్తర ప్రదేశ్. ఒరిస్సా, 42, పశ్చిమబెంగాల్, 7, పంజాబ్, 1, బీహార్, 28, బొంబాయి, 24, మదరాస్, 40, మధ్యప్రదేశ్, 31 తిరువాంకూర్-కొచ్చిన్, 16, పాటియాల తూర్పు పంజాబ్ సంస్థానాలు, మధ్యభారత్, 3, మైసూర్, 6, రాజస్థాన్, [illegible], సౌరాష్ట్ర, హైదరాబాద్, 9.

మదరాసు రాష్ట్రంలోని కొండజాతుల పేర్లు ఇవి :

1. అరనదను. 2. బగట, 3. భోట్టడ, 4. భూమియ, 5 ఖాందు, 6. గడబ 7. గోండి, 8 గౌడు, 9. కోసాల్య గౌడు 10. మగథగౌడు, 11. హోల్వ, 12, జాడపు, 13. జాతపు, 14. కమ్మార, 15. కట్టునాయకను, 16. ఖట్టి, 17. కోడు, 18. కొమ్మార, 19. కొండదొర, 20. కొండకాపు, 21. కొండరెడ్డి, 22. కొంధ్, 23. కోట, 24. కోటియ, 25. కోయ, 26. కుడియ, 27. కురుమను, 28. మన్నదొర, 29. మూనె, 30. ముఖదొర, 31. మురియ, 32. పైగారపు, 33. పలాశి, 34. పాణియను, 35. పోర్జ, 36. రెడ్డిదొర, 37. సవర, 38. షోలగ, 39. తోడ, 40. లక్కాదీవి, అమీను దీవి, మినికాయ్ దీవులలో పుట్టి పెరిగినవారు.

హైదరాబాదు రాష్ట్రంలోని కొండజాతుల పేర్లు ఇవి :

1. అంధ్, 2. భిల్, 3. చెంచు, 4. గోండ్, 5. కొండరెడ్డి, 6. కోలం, 7. కోయ, 8. పర్ధాను, 9. తోటి.

# ఎన్నికలు

భారత్ పార్లమెంటుకూ రాష్ట్రశాసనసభకూ, 1951 నవంబరు ఆఖరునగాని, డిసెంబరు ఆరంభంలోగాని ఎన్నికలు జరుపడానికి భారత్ ప్రభుత్వం నిశ్చయించిందని, 1950 నవంబరు 14 తేదిన భారత్ పార్లమెంటులో రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ ప్రకటించారు.

1950 ఏప్రిల్ 20 తేదిన పార్లమెంటు ఆమోదించిన చట్టప్రకారం, కొత్త పార్లమెంటు ప్రజాసభసభ్యుల సంఖ్య 496 గా నిర్ణయించబడింది. వివిధరాష్ట్రాలనుంచి ప్రజాసభకు ఎన్నుకోబడే సభ్యులసంఖ్య. ఆయా రాష్ట్రాలలోని జనాభాసంఖ్యమీద ఆధారపడివుంటుంది కనుక, దేశపు జనాభా సుమారు 34,73,40,000 వుంటుందని 1950 మార్చి 1 తేదిన జనాభా కమీషనర్ చేసిన నిర్ణయాన్ని ప్రెసిడెంటు అంగీకరించారు. ఆ నిర్ణయం ప్రకారం, వివిధరాష్ట్రాల జనాభా, యీ క్రిందివిధంగావుంటుందని నిర్ణయింపబడింది.

| | |
|---|---|
| అస్సాం : | 85,15,000 |
| ఉత్తరప్రదేశ్ : | 6,16,20,000 |
| ఒరిస్సా | 1,44,10,000 |
| పంజాబ్ : | 1,26,10,000 |
| పశ్చిమ బెంగాల్ : | 2,43,20,000 |
| బీహార్ : | 3,94,20,000 |
| బొంబాయి : | 3,26,80,000 |
| మదరాసు : | 5,42,90,000 |
| మధ్యప్రదేశ్ : | 2,09,20,000 |
| కాశ్మీర్ : | 43,70,000 |
| తిరువాంకూర్ - కొచ్చిన్ : | 85,80,000 |
| పాటియాలా, తూర్పు పంజాబ్ సంస్థానాల యూనియన్ : | 33,20,000 |
| మధ్యభారత్ : | 78,70,000 |

| | |
|---|---|
| మైసూర్ : | 80,60,000 |
| రాజస్థాన్ : | 1,46,90,000 |
| సౌరాష్ట్ర : | 39,60,000 |
| హైదరాబాద్ : | 1,76,90,000 |
| అజ్మీర్ : | 7,30,000 |
| కచ్ : | 5,50,000 |
| కూర్గ్ : | 1,70,000 |
| ఢిల్లీ : | 15,10,000 |
| త్రిపుర : | 5,80,000 |
| భోపాల్ : | 8,50,000 |
| మణిపూర్ : | 5,40,000 |
| బిలాస్ పూర్ : | 1,30,000 |
| వింధ్యప్రదేశ్ : | 38,30,000 |
| హిమాచలప్రదేశ్ : | 10,80,000 |

పార్లమెంటు ప్రజాసభకు ఎన్నుకోబడే 496 మంది సభ్యులూ, వివిధ రాష్ట్రాల జనాభా (పైలెక్కలను) బట్టి, ఆయా రాష్ట్రాలనుంచి యీ క్రింది సంఖ్యలలో వుండాలని పార్లమెంటు నిర్ణయించింది.

| | |
|---|---|
| అస్సాం : | 12 |
| ఉత్తరప్రదేశ్ : | 86 |
| ఒరిస్సా : | 20 |
| పంజాబ్ : | 18 |
| పశ్చిమబెంగాల్ : | 34 |
| బీహార్ : | 55 |
| బొంబాయి : | 45 |
| మదరాసు : | 75 |
| మధ్యప్రదేశ్ : | 29 |
| కాశ్మీర్ : | 6 |
| తిరువాంకూరు కొచ్చిన్ : | 12 |
| పాటియాలా యూనియన్ : | 5 |

| | |
|---|---|
| మధ్యభారత్ : | 11 |
| మైసూర్ : | 11 |
| రాజస్థాన్ : | 20 |
| సౌరాష్ట్ర : | 6 |
| హైదరాబాద్ : | 25 |
| అజ్మీర్ : | 2 |
| అండమాన్ నికోబార్ | 1 |
| కచ్ : | 2 |
| కూర్గు : | 1 |
| ఢిల్లి : | 4 |
| త్రిపుర : | 2 |
| భోపాల్ : | 2 |
| మణిపూర్ : | 2 |
| బిలాస్‌పూర్ : | 1 |
| వింధ్యప్రదేశ్ : | 6 |
| హిమాచలప్రదేశ్ : | 3 |

## రాష్ట్ర శాసనసభలు

వివిధ రాష్ట్రాలలోని లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యులసంఖ్య యీక్రింది విధంగా నిర్ణయింపబడింది.

| | |
|---|---|
| అస్సాం : | 108 |
| ఉత్తరప్రదేశ్ : | 430 |
| ఒరిస్సా : | 140 |
| పంజాబ్ : | 126 |
| పశ్చిమబెంగాల్ : | 238 |
| బీహార్ : | 330 |
| బొంబాయి : | 315 |
| మదరాసు : | 375 |
| మధ్యప్రదేశ్ : | 232 |

| | |
|---|---|
| కాశ్మీర్ : | |
| తిరువాంకూర్ - కొచ్చిన్ : | 108 |
| పాటియాల యూనియన్ : | 60 |
| మధ్యభారత్ : | 99 |
| మైసూర్ : | 99 |
| రాజస్థాన్ : | 160 |
| సౌరాష్ట్ర : | 60 |
| హైదరాబాద్ : | 175 |

లెజిస్లేటివ్ కౌన్సిళ్లుగల యీ క్రింది రాష్ట్రాలలో, ఆ కౌన్సిళ్ళ సభ్యత్వపుసంఖ్య యీ క్రిందివిధంగా నిశ్చయింపబడింది.

| | |
|---|---|
| ఉత్తర ప్రదేశ్ : | 72 |
| పంజాబ్ : | 40 |
| పశ్చిమ బెంగాల్ : | 51 |
| బీహార్ : | 72 |
| బొంబాయి : | 72 |
| మదరాసు : | 72 |
| మైసూరు . | 40 |

## మ ద రా సు రా ష్ట్రం

మదరాసు రాష్ట్రంనుంచి, భారత్ పార్లమెంటు ప్రజాసభకు ఎన్నుకోబడే సభ్యులసంఖ్య, 75. ఈ 75 సభ్యులూ ఎన్నుకోబడే స్థానాలలో, 12 స్థానాలు షెడ్యూల్డు కులాలవారికి, ఒక స్థానం షెడ్యూల్డు కొండజాతులవారికీ ప్రత్యేకించబడినవి, తక్కిన 62 స్థానాలూ, అన్ని వర్గాలకూ సమష్టిమీద నిర్ణయించబడిన స్థానాలు.

## రాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిలు

రాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యుల సంఖ్య, 72. వీరిలో 12 మందిని రాష్ట్ర లెజిస్లేటివ్ అసెంబ్లీ ఎన్నుకుంటుంది. తక్కిన 36 మంది లోనూ, 6 మందిని రాష్ట్రంలోని యూనివర్సిటీ పట్టభద్రులునూ, 6 మందిని

రాష్ట్రంలోని సెకండరీస్కూళ్ళలోని ఉపాధ్యాయులునూ, 24 మందిని రాష్ట్రంలోని మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు, పంచాయితీ బోర్డులు ఎన్నుకుంటారు.

## పట్టభద్రుల స్థానాలు

పట్టభద్రుల స్థానాలు ఆరింటిలోనూ రెండింటిని ఉత్తర మదరాసు నుంచీ, నాల్గింటిని దక్షిణమదరాసునుంచీ ఎన్నుకోబడే సభ్యులను కలిగి వుంటవి. ఈ యెన్నికకు ఉత్తర మదరాసు నియోజకవర్గం అంటే: శ్రీకాకుళం. విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పడమటి గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం, బళ్లారి జిల్లాలు. ఈ నియోజకవర్గంలో ఓటర్ల సంఖ్య : 10,733

దక్షిణ మదరాసు నియోజకవర్గం అంటే: మదరాసు నగరం, చంగల్పట్, ఉత్తరార్కాడు, దక్షిణార్కాడు, తంజావూరు, తిరుచినాపల్లి, మధుర, రామనాధపురం, తిరునెల్వేలి, సేలం, కోయంబత్తూరు, నీలగిరి, మలబారు, దక్షిణకన్నడ జిల్లాలు. ఈ నియోజకవర్గంలోని ఓటర్లసంఖ్య : 25,158

## ఉపాధ్యాయుల స్థానాలు :

ఎన్నుకోబడే సభ్యుల సంఖ్య, నియోజకవర్గాల నిర్ణయం విషయంలో, ఉపాధ్యాయుల స్థానాలనుకూడా, పట్టభద్రుల స్థానాలకు నిర్ణయింపబడిన ఏర్పాటే వర్తిస్తుంది. ఈ నియోజకవర్గాలలో ఉత్తరమదరాసు నియోజకవర్గంలో 6,736 ఓటర్లూ, దక్షిణ మదరాసు నియోజకవర్గంలో 13,637 ఓటర్లూ వున్నారు.

## స్థానిక సంస్థలస్థానాలు.

స్థానిక సంస్థలస్థానాలనుంచి ఎన్నుకోబడే 24 స్థానాలకు రాష్ట్రం 9 నియోజకవర్గాలుగా ఏర్పాటు చేయబడింది. అవేమిటంటే :

| నియోజకవర్గం : | సభ్యులస్థానాలు : | ఓటర్ల సంఖ్య : |
|---|---|---|
| 1. శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పు గోదావరి జిల్లాలు | 3 | 727 |
| 2. పడమటి గోదావరి, గుంటూరు, కృష్ణా జిల్లాలు | 3 | 937 |
| 3. నెల్లూరు, చిత్తూరు జిల్లాలు | 2 | 399 |
| 4. బళ్లారి, అనంతపురం, కడప కర్నూలు జిల్లాలు | 2 | 913 |
| 5. మదరాసునగరం, చంగల్పట్, ఉత్తరార్కాడు జిల్లాలు | 3 | 779 |
| 6. దక్షిణార్కాడు, తంజావూరు | 3 | 1093 |
| 7. మధుర, రామనాథపురం, తిరునెల్వేలి జిల్లాలు | 3 | 1569 |
| 8. సేలం, కోయంబత్తూరు, నీలగిరి జిల్లాలు | 3 | 1062 |
| 9. మలబార్, దక్షిణ కన్నడ జిల్లాలు | 2 | 616 |

## రాష్ట్ర లెజిస్లేటివ్ అసెంబ్లీ

రాష్ట్ర లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యులసంఖ్య 375. వీరిలో 61 మంది షెడ్యూల్డు కులాలవారికి ప్రత్యేకింపబడిన స్థానాలనుంచీ, 5 గురు షెడ్యూల్డు కొండజాతులవారికి ప్రత్యేకించబడిన స్థానాలనుంచీ ఎన్నుకోబడినవారు వుంటారు. తక్కిన 309 స్థానాలకూ, సమష్టిమీద రాష్ట్రం అంతటా ఏర్పాటుచేయబడిన నియోజకవర్గాలనుంచి ఎన్నుకోబడిన సభ్యులు వుంటారు.

షెడ్యూల్డు కొండజాతులవారికి ప్రత్యేకించబడిన 5 స్థానాలలోనూ 2 స్థానాలు విశాఖపట్టణంలోను, 1 స్థానం శ్రీకాకుళం జిల్లాలోను,

1 స్థానం తూర్పుగోదావరి జిల్లాలోను, 1 స్థానం మలబారు జిల్లాలో కొంత భాగం నీలగిరి జిల్లాలో కొంతభాగం కలసిన ఏప్రదేశంలోను ఏర్పాటు చేయబడినవి.

ఆ నియోజకవర్గాలు ఇవి:

షెడ్యూల్డు కొండజాతులవారికి ప్రత్యేకించబడిన 5 స్థానాలు కాక, తక్కిన 370 స్థానాలలో షెడ్యూల్డు కులాలవారికి ప్రత్యేకించిన 61 స్థానాలూ, తక్కిన 309 సాధారణస్థానాలూ, జిల్లాలవారీగా రాష్ట్రమంతటా యీ క్రింది సంఖ్యలో ఏర్పాటు చేయబడినవి.

| జిల్లా | సాధారణస్థానాలు | షెడ్యూల్డుకులాలస్థానాలు |
|---|---|---|
| అనంతపురం | 8 | 1 |
| ఉత్తరార్కాడు | 15 | 4 |
| కడప | 7 | 1 |
| కర్నూలు | 7 | 1 |
| కృష్ణ | 10 | 2 |
| కోయంబత్తూరు | 17 | 3 |
| గుంటూరు | 17 | 1 |
| చెంగల్పట్ | 9 | 4 |
| చిత్తూరు | 10 | 2 |
| తంజావూరు | 14 | 5 |
| తిరుచిరాపల్లి | 15 | 4 |
| తిరునెల్వేలి | 14 | 3 |
| తూర్పుగోదావరి | 12 | 3 |
| దక్షిణకన్నడ | 10 | 1 |
| దక్షిణార్కాడు | 14 | 6 |
| నీలగిరి | 1 | |
| నెల్లూరు | 11 | 2 |
| పశ్చిమగోదావరి | 10 | 2 |
| బళ్ళారి | 7 | 1 |

| | | |
|---|---|---|
| మదరాసు | 7 | 1 |
| మధుర | 15 | 3 |
| మలబార్ | 24 | 3 |
| రామనాథపురం | 13 | 2 |
| విశాఖపట్టణం | 12 | 2 |
| శ్రీకాకుళం | 11 | 2 |
| సేలం | 18 | 3 |

## ఓటర్లు

వయోజన ఓటింగు హక్కుగలవారెందరో నిర్ణయించడానికి, రాష్ట్రంలోని వయోజనుల జనాభా లెఖలు 1948 అక్టోబరు, నవంబరు నెలలలో తీసుకోనబడినవి.

రాష్ట్రమొత్తంలో 2,57,49,856 మంది ఓటర్లు రిజిష్టరు చేయబడినారనీ, వీరిసంఖ్య అసలు జనాభాలో నూటికి 48 వంతులు వుంటుందని తేలింది. ఓటర్లు అత్యధికంగావున్న జిల్లా విశాఖపట్టణం; అత్యల్పంగా వున్న జిల్లా నీలగిరి.

జిల్లాలవారీగా, ఓటర్లసంఖ్య ఈక్రిందివిధంగా తేలింది.

అనంతపురం: 6,11,059; ఉత్తరార్కాడు: 12,75,670; కడప: 5,61,751; కర్నూలు: 5,80,644; కృష్ణా: 8,02,797; కోయంబత్తూరు. 13,59,354; గుంటూరు: 12,63,164; చంగల్పట్: 8,77,009; చిత్తూరు: 8,39,427; తంజావూర్; 12,97,834; తిరుచిరాపల్లి: 13,12,774; తిరునెల్వేలి: 10,60,626; తూర్పుగోదావరి: 11,50,500; దక్షిణకన్నడ: 6,98,800; దక్షిణార్కాడు: 13,50,333 నీలగిరి: 1,11,711; నెల్లూరు: 8,98,972; పడమటి గోదావరి: 7,97,308; బళ్ళారి: 5,26,173; మదరాసు నగరం: 5,03,000; మధుర: 12,81,178; మలబార్; 19,39,423; రామనాథం: 11,32,844; విశాఖపట్టణం: 20,53,593; సేలం: 14,66,583. బళ్ళారి జిల్లా అంతటితోసహా, మదరాసునగరాన్ని మినహాయించి, ఆంధ్రదేశంఅంతటావున్న ఓటర్లసంఖ్య మొత్తం: 1,00,85,388.

1950 జూన్ 18, 25 తేదులనాడు ఓటర్ల లెక్క తయారు చెయ్యడానికి మళ్ళీ అదనపు గణితీజరిగింది. ఈ గణితీ ప్రకారం, క్రొత్తగా 78,241 మంది ఓటర్లు రిజిష్టరు చేయబడినారు. అంతకుపూర్వం రిజిష్టరు చేయబడినవారు 50,300 మందిలోను 4,910 మంది చనిపోయారు. క్రొత్తగా చేర్చబడినవారితో, 1950 జూన్ 25 తేదినాటికి మదరాసు నగరంలో ఓటర్ల సంఖ్య : 5,76,331.

## ఎన్నికలు

ఇండియా ప్రజారాజ్యం అయినతరువాత, వయోజన ఓటింగు పద్ధతిలో మొట్టమొదటిసారి ఎన్నికలు దేశమంతటా 1951 అక్టోబరు 25 తేదీన ప్రారంభమై, 1952 ఫిబ్రవరి తేదితో అంతమైనవి.

మొట్టమొదటి ఎన్నికలు హిమాచల ప్రదేశ్‌లో 1951 అక్టోబరు 25 న ప్రారంభమైనవి. ఈ ఎన్నికలలో పార్లమెంటుకు ఇద్దరు సభ్యులనూ, రాష్ట్రశాసనసభకు 34 మంది సభ్యులనూ ఎన్నుకోవడానికి ప్రజలు ఓట్లు వెయ్యడం జరిగింది.

ఈ రాష్ట్ర శాసనసభకు ఒక స్థానంలో విలాస్‌పూర్ రాజాకు ప్రత్యర్థిగా నిలబడిన కాంగ్రెసు అభ్యర్థి తన అభ్యర్థిత్వాన్ని విరమించుకున్నందున, పోటీలేకుండా విలాస్ పూర్ రాజా ఎన్నుకోబడినాడు. దేశంలో జరిగిన మొట్టమొదటి ఎన్నికలలో కాంగ్రెసు ప్రత్యర్థి, పోటీ లేకుండా ఎన్నుకోబడటం జరిగిందన్నమాట.

దేశంలో మొత్తం 497 స్థానాలు ప్రజాప్రతినిధి సభకు వున్నాయి. వాటిలో 6 స్థానాలు కాశ్మీరుకు, వీటికి ఎన్నికలు జరుగలేదు. అండమాన్, నికోబార్ దీవుల ప్రతినిధిని ప్రెసిడెంట్ నామినేట్, చేస్తాడు. ఈ ఏడు స్థానాలుపోగా, తక్కిన 490 స్థానాలకు దేశంలో ఎన్నికలు జరిగినవి.

అయితే 11 మంది సభ్యులు పోటీ లేకుండా ఎన్నుకోబడినారు. వీరిలో కాంగ్రెసువారు, 7 ; స్వతంత్రులు, 3 ; ప్రజాపార్టీ, 1 ; ఈ

11 నుంది పోగా, తక్కిన 478 మంది సభ్యుల ఎన్నికకు పోటీలు జరిగినవి. ఈ 479 స్థానాలకూ 1800 మంది పోటీ చేశారు.

పార్లమెంటుకు మొత్తం 10,59,87,310 మంది ఓటర్లు ఎన్నికలలో పాల్గొన్నారు.

పార్టీలవారీగా, ఏఏ పార్టీకి ఎన్ని ఓట్లువచ్చినదీ, ఏపార్టీకి ఎన్నిస్థానాలు వచ్చినదీ వివరాలు, యీ క్రింద ఇవ్వబడినవి.

| పార్టీలు : | పోలైన ఓట్లు | గెలుచుకొన్న స్థానాలు |
|---|---|---|
| కాంగ్రెసు | 47528911 | 362 |
| సోషలిస్టు | 11126344 | 12 |
| కె. యం. పి. | 6158782 | 9 |
| కమ్యూనిస్టుపార్టీ పీపిల్స్ డెమోక్రటిక్ ఫ్రంట్ | 4712009 | 23 |
| జనసంఘం | 3236361 | 3 |
| షెడ్యూల్డు తరగతులు ఫెడరేషన్ | 2501964 | 2 |
| రామరాజ్య పరిషత్ | 2094811 | 3 |
| కృషికర్ లోక్ పార్టీ | 1489488 | 1 |
| హిందూమహాసభ | 1046263 | 4 |
| ఫార్వర్డుబ్లాక్ (మార్క్సిస్టు) | 988272 | 1 |
| రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ | 393984 | 2 |
| ఫార్వర్డుబ్లాక్ (రూయికరు) | 133936 | — |
| రివల్యూషనరీ కమ్యూనిస్టుపార్టీ | 26245 | — |
| బోల్షివిక్ పార్టీ | 25792 | — |
| *మిగతపార్టీలు | 7678662 | 26 |
| స్వతంత్రులు | 16845494 | 41 |
| మొత్తం | 105987318 | 489 |

* మిగతపార్టీలు : బీహారు: జార్ఖండ్ పార్టీ 3 లోకసేవసంఘం 2 ఛోటానాగపూర్ సంతాల్ పర్గణా జనతాపార్టీ 1. బొంబయి: పెజంట్స్ అండ్ వర్కర్స్ పార్టీ 1. మద్రాసు : తమిళ టాయిలర్స్ పార్టీ 4, కామన్ వీల్ 3, ముస్లింలీగ్ 1. ఒరిస్సా: గణతంత్ర పరిషత్ 5. పంజాబు : అకాలీపార్టీ 2. హైదరాబాదు : పెజంట్స్ అండ్ వర్కర్స్ పార్టీ 1 పెప్సు: అకాలీపార్టీ 2. తిరువాన్కూరు కొచిన్: తిరువాన్కూర్ కొచ్చిన్ తమిళకాంగ్రెసు 1.

## రాష్ట్రాలవారీగా పోలైన ఓట్లు

పార్లమెంటు ఎన్నికలలో ప్రతిరాష్ట్రంలోనూ పోలైన ఓట్ల వివరాలివి: రాష్ట్రశాసనసభల ఓటర్ల సంఖ్య ఎంతో పార్లమెంటు ఓటర్లసంఖ్య కూడా అదే. అస్సాం 26,47,127, ఉత్తరప్రదేశ్ 1,70,74,957, ఒరిస్సా 37,05,393, పంజాబ్ 49,92,339, పశ్చిమ బెంగాల్ 76,13,932, బీహార్ 99,91,452, బొంబాయి 1,15,28,291, మద్రాసు 1,99,28,519. మధ్యప్రదేశ్ 71,92,591, తిరువాంకూర్ - కొచ్చిన్ 34,90,466, పాటియాల యూనియన్ 14,75,112, మధ్యభారత్ 19,53,571, మైసూర్ 28,24,427, రాజస్థాన్ 35,25,964, సౌరాష్ట్ర 7,62,706, హైదరాబాద్ 48,54,862, అజ్మీర్ 1,78,999, కచ్ 1,19,580, కూర్గ్ 63,813, ఢిల్లి 6,55,900, త్రిపుర 1,57,371, భోపాల్ 1,69,457, మణిపూర్ 1,51,467, వింధ్యప్రదేశ్ 7,05,833, హిమాచలప్రదేశ్ 2,23,139.

## రాష్ట్ర శాసనసభల ఎన్నికలు

రాష్ట్రశాసనసభల కన్నిటికీ మొత్తం 3280 మంది అభ్యర్థులు పోటీచేశారు. ఎన్నికలలో మొత్తం 10,38,00,772 మంది ఓటర్లు పాల్గొన్నారు. వివిధ పార్టీలకువచ్చిన ఓట్ల వివరాలివి.

| పార్టీ | వచ్చిన ఓట్లు | గెల్చిన స్థానాలు |
|---|---|---|
| కాంగ్రెసు | 4,39,50,265 | 2,247 |
| సోషలిస్టు | 1,00,72,316 | 125 |
| కమ్యూనిస్టు | 54,63,338 | 147 |
| ప్రజాపార్టీ | 52,91,777 | 77 |
| షెడ్యూల్డ్ కాస్ట్ ఫెడరేషన్ | 18,08,742 | 12 |
| జనసంఘ | 29,17,830 | 33 |
| కృషికార్ లోకపార్టీ, బొంబాయిలోని ఖేదూత్ సంఘ | 11,26,288 | 23 |
| రామరాజ్య పరిషత్ | 12,61,135 | 32 |
| హిందుమహాసభ | 8,58,899 | 20 |
| ఫార్వర్డ్ బ్లాక్ (మార్క్సిస్టు) | 8,53,810 | 18 |
| రివల్యూషనరీ సోషలిస్టు | 2,49,114 | 6 |
| ఫార్వర్డుబ్లాక్ (రూయికర్) | 1,81,664 | 2 |
| ఇతర పార్టీలు | 77,30,131 | 212 |
| రివల్యూషనరీ కమ్యూనిస్టు | 33,522 | 0 |
| బోల్షివిక్ | 27,731 | 0 |

## ఓ ట ర్ల సం ఖ్య

వివిధరాష్ట్రాలలో, 1951-52 లో జరిగిన ఎన్నికలలో ఓటు చెయ్యడానికి అర్హతపొంది, ఓటర్ల లిస్టులో పేర్లు నమోదుచేయబడిన ఓటర్ల సంఖ్యల వివరాలు ఇవి:

| రాష్ట్రం | ఓటర్ల సంఖ్య | ఓటుచేసినవారి సంఖ్య |
|---|---|---|
| అస్సాం: | 40,25,601 | 24,48,890 |
| ఉత్తర ప్రదేశ్: | 3,17,63,828 | 1,67,91,139 |
| ఒరిస్సా: | 77,08,161 | 36,70,275 |
| పంజాబ్: | 67,18,345 | 49,74,234 |
| పశ్చిమ బెంగాల్: | 1,24,99,850 | 74,42,697 |
| బీహార్: | 1,80,80,131 | 95,44,439 |

| | | |
|---|---|---|
| బొంబాయి : | 1,56,76,631 | 1,11,23,388 |
| మదరాసు : | 2,69,58,006 | 1,99,74,801 |
| మధ్యప్రదేశ్ : | 1,11,47,302 | 69,97,489 |
| తిరువాంకూర్-కొచ్చిన్ | 42,02,574 | 33,98,178 |
| పాటియాల, తూ. పంజాబ్ సంస్థానాల యూనియన్ | 17,63,531 | 13,54,455 |
| మధ్య భారత్ | 40,90,857 | 19,87,622 |
| మైసూర్ : | 39,69,735 | 27,45,515 |
| రాజస్థాన్ : | 76,39,145 | 32,58,640 |
| సౌరాష్ట్ర : | 18,06,997 | 9,53,765 |
| హైదరాబాద్ : | 90,35,497 | 52,02,142 |
| అజ్మీర్ : | 3,29,489 | 2,34,788 |
| కచ్ : | 2,88,400 | 1,15,414 |
| కూర్గ : | 94,593 | 87,871 |
| ఢిల్లీ : | 7,44,668 | 5,21,776 |
| త్రిపుర : | 3,25,067 | 1,28,382 |
| భోపాల్ : | 4,19,976 | 2,34,788 |
| మణిపూరు : | 2,98,452 | 1,39,332 |
| వింధ్యప్రదేశ్ : | 17,60,926 | 6,83,008 |
| హిమాచల ప్రదేశ్ : | 5,31,018 | 1,79,475 |

## రాష్ట్రపతి ఎన్నిక

రాష్ట్రపతి ఎన్నిక 1952 మే 2 తేదిన జరిగింది. దేశమంతటా, అన్ని రాష్ట్రాలలోని శాసన సభల సభ్యులూ పాల్గొని, రాజ్యాంగవిధాన ప్రకారం జరిగిన మొదటి ఎన్నిక ఇదే. ఎన్నికలో ఇంతకుపూర్వం అధ్యక్షుడుగా వున్న బాబురాజేంద్రప్రసాద్‌తోపాటు, మరి నలుగురు పోటీచేశారు. వారిపేర్లు : కె. టి. షా; ఎల్. జి. తట్టె; చౌదరిహరిరాం కె. కె. ఛటర్జీ.

పార్లమెంటునుంచి బాబురాజేంద్రప్రసాద్‌కు మొత్తం 539 ఓట్లు వచ్చాయి; కె. టి. షా, 83; తట్టె, 4; హరిరాం, 2; చటర్జి, 0.

వివిధరాష్ట్రాలనుంచి బాబు రాజేంద్రప్రసాద్‌కు వచ్చిన ఓట్ల వివరాలివి : అస్సాం, 83; బీహార్, 229; బొంబాయి, 226; మధ్య ప్రదేశ్, 187; మదరాసు, 197; ఒరిస్సా, 68; పంజాబ్, 100; ఉత్తర ప్రదేశ్, 370; పశ్చిమ బెంగాల్, 149: హైదరాబాద్, 96; కాశ్మీర్, 62; మధ్యభారత్ 75; మైసూర్, 78; పెప్సు, 26; రాజస్థాన్, 93; సౌరాష్ట్ర, 48; తిరువాంకూర్ - కొచ్చిన్, 55; అజ్మీర్, 19; భోపాల్, 23; కూర్గ్, 22; ఢిల్లి, 40; హిమాచల ప్రదేశ్, 30; వింధ్యప్రదేశ్, 41; మొత్తం 2237.

ప్రొఫెసర్ కె. టి. షాకు అన్నిరాష్ట్రాలనుంచి మొత్తం 512 ఓట్లు వచ్చినవి. వీనిలో ఒక్క మదరాసు రాష్ట్రంనుంచి 141 ఓట్లు వచ్చాయి, తక్కినరాష్ట్రంనుంచీ 48 కన్న ఎక్కువ రాలేదు.

ఎల్. జి. తట్టెకు పశ్చిమ బెంగాల్ 3 రాజస్థాన్ 2, ఢిల్లి 2, వింధ్య ప్రదేశ్ 1, మధ్యభారత్ 1, మొత్తం 9 ఓట్లు వచ్చినవి.

హరిరాంకు పంజాబ్ 3, ఉత్తరప్రదేశ్ 2, బీహార్, మదరాసు, రాజస్థాన్, అజ్మీరులనుంచి ఒకొక్కటి మొత్తం 9 ఓట్లు వచ్చినవి.

ఛటర్జికి పశ్చిమబెంగాల్ 2, రాజస్థాన్ 2, మదరాసు 1, మొత్తం 5 ఓట్లు వచ్చినవి.

బాబు రాజేంద్రప్రసాద్ అధ్యక్షులుగా ఎన్నుకోబడినట్లు మే 6 తేదిన ప్రకటన జరిగింది. మే 13 న ఆయన మళ్లీ పదవీస్వీకార ప్రమాణంచేశారు.

# భారత్ ప్రభుత్వం

## రాష్ట్రపతి (ప్రెసిడెంట్): డాక్టర్ రాజేంద్రప్రసాద్

పదవీస్వీకారం : 1952 మే 13. జీతం : నెలకు 10,000. కాని దేశంలోని ఆర్థిక పరిస్థితుల కారణంగా నూటికి 15 వంతులు తగ్గించుకొని నెలకు రు. 8,500 తీసుకొంటున్నారు.

సెక్రటరి : డి. మైత్ర

మిలిటరి సెక్రటరి ; కర్నల్ బి. చటర్జీ

డిప్యూటి మిలిటరి సెక్రటరి } స్క్వాడ్రన్ లీడరు డి. ఎస్. ప్రకాశ్, ఐ. ఎ, ఎఫ్.

రాజప్రాసాదాధికారి : మేజర్ ఎ. ఎన్. విల్సన్

అంగరక్షకులు : కెప్టెన్ ఎన్. ఎం. పాలంకోట్
లెఫ్టినెంట్ హెచ్. ఎం. రాయ్.

పర్సనల్ సెక్రటరి : వాల్మీకి చౌధురి

## ఉ ప రా ష్ట్ర ప తి

డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ, జీతం : రు. 3,000.

## మ ం త్రి మ ం డ లి

పదవీస్వీకారం : 13 మే 1952,

జవహర్‌లాల్ నెహ్రూ : ప్రధానమంత్రి, విదేశవ్యవహారాలు

మౌలానా అబుల్‌కలాం ఆజద్ : విద్యామంత్రి, సహజసంపద, విజ్ఞాన శాస్త్ర పరిశోధన

ఎన్. గోపాలస్వామి అయ్యంగార్ : రక్షణశాఖ మంత్రి

రాజకుమారి అమృతకౌర్ : ఆరోగ్య మంత్రి

డాక్టర్ కైలాసనాథ కాట్జు : హోం మంత్రి, సంస్థానాలు

రఫీఅహమద్ కిద్వాయ్ : ఆహారమంత్రి, వ్యవసాయము

వి. డి. దేశముఖ్ : ఆర్థికమంత్రి

జగజీవనరాం : పోస్టు, టెలిగ్రాఫ్‌లు

గుల్జారిలాల్ నంద : ప్లానింగ్ మంత్రి, నదీలోయల పథకాలు

టి. టి. కృష్ణమాచారి : పరిశ్రమల మంత్రి, వాణిజ్యం

సి. సి. విశ్వాస్ : న్యాయశాఖ మంత్రి, మైనారిటీ జాతుల వ్యవహారాలు

లాల్ బహదూర్ శాస్త్రి : రైల్వేల మంత్రి, రవాణా సౌకర్యములు.

సర్దార్ స్వరణ్ సింగ్ : నిర్మాణశాఖమంత్రి, గృహావసతి, సప్లయి శాఖలు

వి. వి. గిరి : కార్మికమంత్రి

కె. సి. రెడ్డి : ఉత్పత్తిశాఖ మంత్రి

## కాబినెట్ హోదాలేని మంత్రులు

అజిత్ ప్రసాద్ జెయిన్ : కాందిశీకుల పునరావాస శాఖ

సత్యనారాయన్ సింహ : శాసన సభా వ్యవహారములు

మహావీర్ త్యాగి : ఆర్థిక శాఖ

డాక్టర్ బాలకృష్ణ కేస్కార్ : ప్రచురణ, బ్రాడ్‌కాస్టింగ్

## డిప్యూటి మంత్రులు

దత్తాత్రేయ పరశురామ కర్మార్కర్ : వాణిజ్యం

సురేంద్రనాథ బుర్గొహైన్ : నిర్మాణము

రాజ బహదూర్ : రవాణా

మంత్రుల జీతాలు : నెలకు రు. 3,000
అలవెన్సు రు. 500

ఉచిత గృహ వసతి

ఉపమంత్రులకు జీతాలు నెలకు రు. 3,000. డిప్యూటీమంత్రులకు నెలకు రు. 2,000. వేరే అలవెన్సులు ఏమీ లేవు.

# పార్లమెంట్

## భారత్ పార్లమెంటుకి రెండు సభలు ఉన్నాయి

ప్రజాసభ సభ్యులు, 499; రాష్ట్ర ప్రతినిధులసభ సభ్యులు, 212. వివిధ రాష్ట్రాలనుంచి, ఆయా సభలకు ఎన్నికోబడిన సభ్యుల పేర్లను, రాష్ట్రాలవారీగా పూర్తి లిస్టును యీ క్రింద ప్రచురించాము. ప్రజలచే ఎన్నుకొనబడిన సభ్యులు గలది ప్రజాసభ; ప్రజా ప్రతినిధులచే ఎన్నుకొనబడిన సభ్యులుగలది రాష్ట్ర ప్రతినిధి సభ. అందుచేత, రాష్ట్ర ప్రతినిధి సభ వివరాలు ముందూ, ప్రజా ప్రతినిధి సభ వివరాలు తరువాత ఇవ్వబడినవి.

## రాష్ట్ర ప్రతినిధి సభ

**చైర్మన్ :** --

డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ (రు. 3,000)

**డిప్యూటి చైర్మన్ :**

ఎస్. వి. కృష్ణమూర్తి రావు

**అస్సాం : 6 :**

సూర్యకుమార్ భూయన్; లక్షేశ్వర భోరువా; శ్రీమతి పుష్పలత దాస్; మహమద్ తాయెబుల్లా; ధన్ వీరా; మహమద్ రఫీక్

**ఉత్తరప్రదేశ్ : 31 :**

లాల్ బహదూర్ శాస్త్రి; భటూరి నవాబు; అక్తర్ హుసేన్; అమరనాథ్ అగర్వాల్; అమలోక్ చంద్; బ్రజ్ బిహారి; శ్రీమతి ఎస్. చంద్రావతి; ధర్మదాస్; గోపీనాథ్ సింగ్; హరప్రసాద్ సాక్సేనా; ఇంద్రవిద్యావాచస్పతి; జగన్నాథప్రసాద్; సావుంద్ సింగ్; జస్పత్ రాయ్ కపూర్; కుద్సియాబీగం; మహమ్మద్ ఫరూక్; బి. కె. ముఖర్జి; మురారిలాల్ రోహాట్గి; నవాబ్ సింగ్ చౌహాన్; రాంచంద్ గుప్త రాం; కృపాల్ సింగ్; రాం ప్రసాద్ శ్రీమతి సావిత్రిదేవి నిగం;

ష్యాంధార్; శ్యామసుందర్ నారాయణ్ తంఖ; జె. కె. శ్రీవ స్తవ; సుమంత ప్రసాద్; తారకేశ్వర పాండె; ధాకుర్ దాస్; ఆచార్య నరేంద్ర దేవ; పండిట్ హృదయనాధ కుంజ్రూ.

ఒరిస్సా : 9 :

ఆర్. కె. విశ్వాస్; జగన్నాధదాస్; బోధరాండుబె; సుందర మోహన్ హేమరా; కుమారి శైలబాలదాస్; పి. సి. భంజ్ దేవ్; సురేంద్రనాధ మహంతి; సురేంద్రనాధ ద్వివేది; వైద్యనాధ రథ్

పంజాబ్ : 8 :

హంసరాజ్; ముకుందలాల్ పూరి; జాతెదార్ ఉద్ధంసింగ్ నాగకో: సర్దార్ నిహాల్ సింగ్ నాంధారి; సర్దార్ గురురాజసింగ్, డాక్టర్ అనూప్ సింగ్; దివాన్ చమన్ లాల్; సర్దార్ దర్శన్ సింగ్.

పశ్చిమ బెంగాల్ : 14 :

సి. సి. విశ్వాస్; సురేశ్ చంద్రమజుందార్; సయ్యద్ నౌషర్ ఆలి; ఇంద్రభూషణ్ బీద్; సత్యేంద్రప్రసాద్ రే; వేణీప్రసాద్ అగర్వాలా; నళినాక్షదత్త; రాజపత్ సింగ్ డుగార్; శ్రీమతి మాయాదేవి చిత్రిణి; భూపేశ చంద్రగుప్త; సత్యేంద్ర నారాయన్ మజుందార్: విమలకుమార్ ఘోష్; దేవ్ ప్రసాదు ఘోష్; సత్యప్రియ బెనర్జి.

బీహార్ : 21 :

రాజేశ్వరప్రసాద్ నారాయణ సింగ్; శ్రీ నారాయన్ మహత; రామగోపాల్ అగర్వాల్; అహమ్మద్ హుసేన్; జాఫర్ ఇమాం; ఎస్. మజార్ ఇమాం; రాంధారిసింగ్ దిన్ కర్; ఖ్వాజా ఇనయతుల్లా; కైలాస విహారిలాల్; శ్రీమతి లక్ష్మి ఎన్. మీనన్; పూర్ణచంద్రమిత్ర; కిశోరిరాం; బ్రజకిశోర్ ప్రసాద్ సింహా; రాంబహదూర్ సింహ; తాజముల్ హుసేన్; జి. జి. వలాడి; మహేశ్వరప్రసాద్ నారాయన్ సింగ్; మహారాజాధిరాజ సర్ కామేశ్వరసింగ్; రాజేంద్రప్రతాప్ సింహ (బాలాజి); శ్రీమతి ఆంజెలినా; రాజకుమారి విజయరాజె.

బొంబాయి : 17 :

అక్బర్‌అలీ జాఫర్‌భాయ్; శ్రీమతి వయొలెట్ జోచిం ఆల్వా; డాక్టర్ బి. ఆర్. అంబేడ్కర్; సోమనాథ్ ప్రభాశంకర్‌దవె, టి. ఆర్. దేవగిరికార్; దేవకీనందన్ నారాయణ్; ఆర్. ఆర్. దివాకర్; లాల్‌చంద్ హీరాచంద్‌దోషి; డాక్టర్ ఎం. డి. డి. గిల్డర్; బి. ఎం. గుప్తే; ఎస్. కే. జెయిన్; బి. జి. ఖెర్; శ్రీమతి లీలావతిమున్షి; సి. పి. పరీఖ్; డి. వై. పవార్; ఆర్. బి. రవుత్; ఎం. సి. షా.

మదరాసు : 27 :

శివశెంక శంభుప్రసాదు, ఎం. బసవ పున్నయ్య, హెచ్. డి. రాజా, ఎన్. జి. రంగ, ఇ. ఇంబుచ్చిబావా, ఎన్. గోపాలస్వామి అయ్యంగార్, ఎస్. గురుస్వామి, శ్రీమతి మోనా హెన్స్మన్, కె. ఎల్. నరసింహం, ఏ. ఎం. ఒబైదుల్లా, సదానంద హెగ్డె, పుచ్చలపల్లి సుందరయ్య, ఎస్. వెంకటరామన్, బి. వి. కక్కిలయ్య. మహమ్మదు ఇస్మాయిల్, సర్ ఎ. రామస్వామి మొదలియార్, టి. భాస్కరరావు, డాక్టర్ పట్టాభి సీతారామయ్య, పి. వి. కమలాస్వామి, కోటంరాజు రామారావు, కొమ్మారెడ్డి సూర్యనారాయణ, టి. ఎస్. పట్టాభిరామన్, పైడా వెంకటనారాయణ, కె. ఎం. రహింతుల్లా, జి. రాజగోపాలన్, పి. ఎస్. రాజగోపాలనాయుడు, సురేంద్రరాం.

మధ్యప్రదేశ్ : 12 :

డాక్టర్ దబ్ల్యు. ఎస్. బార్లింగే, భానుప్రతాప్‌సింగ్, ఆర్. ఎం. దేశముఖ్, సేట్ గోపాల్‌దాస్‌మెహత, డాక్టర్ రఘువీర, శ్రీమతి సీత-పరమానంద్, సామియుల్లాఖాన్, జి. ఎం. థవారె, ఆర్. ఎల్. దుబె, సీతాచరణ్‌దుబె, ఎం. ఆర్. మజుందార్, చంద్రగోపాల్‌మిశ్ర.

కాశ్మీర్ : 4 :

సర్దార్ బుధ్‌సింగ్, కర్నల్ పీర్ మహమ్మద్‌ఖాన్, పండిట్ అనంతరాం, ఆగా సయ్యద్ మహమ్మద్ షా జలాలి.

**తిరువాంకూర్-కొచ్చిన్ : 6 :**

కె. పి. మాధవమీనన్ నాయర్, సత్తినాథ కరయలార్, సి నారాయణపిళ్లై, కె. సి. జార్జి, మత్తైమంజూరన్, అబ్దుల్ రజాక్.

**పాటియాల తూర్పుపంజాబ్ సంస్థానాలు : 3 :**

జగన్నాథ్, సర్దార్ కర్తార్‌సింగ్, సర్దార్ జోగింద్రసింగ్.

**మధ్యభారత్ : 6 :**

కనయాలాల్ వైద్య, టి. డి. పుస్తకె, వి. ఎస్. సర్వాటె, కృష్ణకాంత్ వ్యాస్, డాక్టర్ రఘువీరసింగ్, సర్దార్ సి. ఎస్. ఆంగ్రె.

**మైసూర్ : 6 :**

ఎం. గోవిందరెడ్డి, ఓ. పి. బసవప్పశెట్టి, ఎస్. వి. కృష్ణమూర్తి రావు, తిమ్మబాయ్, వలీఉల్లా, సి. జి. కె. రెడ్డి.

**రాజస్థాన్ : 9 :**

దుంగర్‌పూర్ మహారావల్, రాజబహదూర్ సర్దార్ సింగ్ (ఖేత్రి రాజా), స్వామి కేశవానంద, రామనాథపోదార్, బర్కతుల్లాఖాన్, డాక్టర్ కాళీలాల్ శ్రీమాలి, శ్రీమతి శారదాబాయ్, మహేంద్రసింగ్ రణవత్, హరీశ్‌చంద్ర మధుర్.

**సౌరాష్ట్ర : 4 :**

ఎన్. కె. భట్, జయసుఖ్‌లాల్ హాతి, భోగిలాల్ షా, డాక్టర్ వరియావ దారావ హార్మస్జి.

**హైదరాబాద్ : 11 :**

కె. నారాయణప్ప, ఎస్. చెన్నారెడ్డి, డి. డి. ఇటాలియా, ఉస్మాన్ సుభాని, పురాన్‌మల్ సూరజ్‌మల్ లాహోటి, డాక్టర్ రాజబహదూర్ గౌడ్, ఏ. కె. ధగ, నరసింగరావు, కిషెన్‌చంద్, జె. హెచ్. సుబ్బయ్య, బి. ఎన్. వెంకటరావు.

అజ్మీర్-కూర్గ్ : 1 :

మౌలానా అబ్దుల్ షకూర్,

కచ్ : 1 :

ప్రేంజీ భావన్‌జీ ఠక్కర్,

ఢిల్లి : 1 :

ఓంకార్‌నాథ్

త్రిపుర, మణిపూర్ : 1 :

మున్షి అహ్మద్ అలి,

భోపాల్ : 1 :

భైరన్ ప్రసాద్

విలాస్‌పూర్; హిమాచలప్రదేశ్ : 1 :

చిరంజిలాల్ వర్మ,

వింధ్యప్రదేశ్ : 4 :

కెప్టెన్ అవదేశ్ ప్రతాప్‌సింగ్, బనారసిదాస్ చతుర్వేది, గుల్ షేర్ అహమద్, బాయినాథ్ డుబె.

ప్రెసిడెంట్‌చే నామినేట్ చేయబడినవారు : 12 :

డాక్టర్ జకిర్‌హుసేన్ ; అల్లాడి కృష్ణస్వామయ్య ; ప్రొఫెసర్ సత్యేంద్రనాథబోస్ ; డాక్టర్ జె. ఎం. కుమరప్ప ; డాక్టర్ కాళిదాస నాగ్ ; కాకాసాహెబ్ కలేల్కర్ ; మైథిలి శరణ్‌గుప్త ; పృథ్వీరాజ కపూర్ ; ప్రొఫెసర్ రాధాకుముద్‌ముఖర్జి ; డాక్టర్ సాహెబ్‌సింగ్ సకోఖే ; శ్రీమతి రుక్మిణిదేవి ; ప్రొఫెసర్ నారాయణదాస్ ఆర్. మల్కాని.

## సభ్యుల వివరాలు

రాష్ట్రప్రతినిధిసభలో మొత్తం, 23 మంది ముస్లిములు ఉన్నారు; 14 మంది స్త్రీలు ఉన్నారు.

**ముస్లిములు :**

అస్సాం, 2; బీహార్, 5; బొంబాయి, 1; మధ్యప్రదేశ్, 1; మదరాసు, 1; ఉత్తరప్రదేశ్, 4; హైదరాబాద్, 1; మైసూరు, 1; రాజస్థాన్, 1; తిరువాంకూర్ కొచ్చిన్, 1; అజ్మీర్, 1; వింధ్య ప్రదేశ్, 1; త్రిపుర, 1.

**స్త్రీలు :**

అస్సాం, 1; బీహార్, 3; బొంబాయి, 2; మధ్యప్రదేశ్, 1; మదరాసు, 1; ఒరిస్సా, 1; ఉత్తరప్రదేశ్, 3; పశ్చిమబెంగాల్, 1; రాజస్థాన్, 1.

**పార్టీలబలం :**

కాంగ్రెసు, 146, సోషలిస్టు, 6, కమ్యూనిస్టులు, వారితో చేరిన వారు, 12; ప్రజాపార్టీ, 4; జనసంఘు, 1; హిందూమహాసభ, 1; ఫార్వర్డుబ్లాక్ (మార్క్సిస్టు), 1; పెప్సు యునైటెడ్ ఫ్రంట్ పార్టీ, 1; తిరువాంకూరు తమిళ్ నాడ్ కాంగ్రెసు, 1; గణతంత్ర పరిషద్, 2; రాజస్థాన్ సంయుక్తదళ్, 2; రైతు, కార్మిక పార్టీ 2; షెడ్యూల్డ్ కాస్టు ఫెడరేషన్, 1; కృషికార్ లోకపార్టీ, 1; ముస్లింలీగ్, 1; జార్ ఖండ్, 1; అకాలి, 1; స్వతంత్రులు, 13.

## ప్రజాసభ

ఇండియాలోని వివిధ రాష్ట్రాలకు ప్రస్తుతపు ప్రజాసభలోగల సభ్యత్వపు సంఖ్య వివరాలు ఇవి;

| | |
|---|---|
| అస్సాం | 12 |
| ఉత్తర ప్రదేశ్ | 86 |
| ఒరిస్సా | 20 |
| పంజాబ్ | 18 |
| పశ్చిమ బెంగాల్ | 34 |
| బీహార్ | 55 |

| | |
|---|---|
| బొంబాయి | 45 |
| మదరాసు | 75 |
| మధ్యప్రదేశ్ | 29 |
| కాశ్మీర్ | 6 |
| తిరువాంకూర్-కొచ్చిన్ | 12 |
| పాటియాల, తూర్పుపంజాబ్ సంస్థానాలు | 5 |
| మధ్యభారత్ | 11 |
| మైసూర్ | 11 |
| రాజస్థాన్ | 20 |
| సౌరాష్ట్ర | 6 |
| హైదరాబాద్ | 25 |
| అజ్మీర్ | 2 |
| కచ్ | 2 |
| కూర్గ్ | 1 |
| ఢిల్లీ | 4 |
| భోపాల్ | 2 |
| మణిపూర్ త్రిపుర | 2 |
| విలాసపూర్ | 2 |
| వింధ్యప్రదేశ్ | 6 |
| హిమాచల ప్రదేశ్ | 3 |
| అండమాన్, నికోబార్ | 1 |
| అస్సాం కొండజాతుల ప్రతినిధి | 1 |
| ప్రెసిడెంటుచే నామినేట్ చేయబడిన ఆంగ్లోఇండియనులు | 2 |
| మొత్తం | 499. |

స్పీకరు : జి. వి. మవలంకర్ (రు. 3,000)

డిప్యూటి స్పీకరు : మాడభూషి అనంతశయనం అయ్యంగార్

సెక్రటరి :

ఎం. ఎన్. కౌల్

డిప్యూటి సెక్రటరి:

ఎం. జె. ఎం. అట్కిన్సన్

అస్సాం: 12:

(కాంగ్రెసు, 11; సోషలిస్టు, 1)

సురేంద్రనాథ బురగొహైన్, కాంగ్రెస్; సురేశ్‌చంద్రదేవ్, కాం; నివారణ చంద్రలాస్కర్, కాం; బానిలీ ఖాంగ్మన్‌కతి, కాం, అంజాద్ ఆలి, సోష; సీతానాథబ్రహ్మ చౌధురి, కాం; బేలిరాందాస్, కాం; రోహిణికుమార్ చౌధురి, కాం; కామాఖ్యప్రసాద్ త్రిపాఠి, కాం: దేవకాంత బారువ, కాం; దేవేశ్వరశర్మ, కాం; జోగేంద్రనాథ హజారికా, కాం.

ఉత్తరప్రదేశ్: 86:

(కాం. 81; సోషలిస్టు, 2; హిందూమహాసభ 1; స్వతంత్రులు, 2).

రఘువీర్‌సింగ్, కాం; చంద్‌సింఘాల్, కాం; నరదేవ్‌జీ, కాం; సేట్ అచల్‌సింగ్, కాం; జవహర్‌లాల్ నెహ్రూ, కాం; మనూదియా దిన్, కాం; పురుషోత్తందాస్‌టాండన్, కాం; దేవిదత్తపంత్, కాం; అల్గురాయ్‌శాస్త్రి, కాం; శీతారాం, కాం; విశ్వనాథ్, కాం; రఫీ అహమద్ కిద్వాయ్, కాం; సర్దార్ జోగేంద్రసింగ్, కాం; మురళి మనోహర్, స్వతంత్ర; రఘునాథసింగ్, కాం; త్రిభువన్ నారాయణసింగ్, కాం; శివదయాళ్, కాం; ప్యారిలాల్ కురీల్, కాం; సతీశచంద్ర, కాం; రాంశంకర్‌లాల్, కాం; సోహన్‌లాల్ ధూసియా, కాం; ఉదయ శంకర్‌డుబే, కాం; నేమిశరణ, కాం; బదన్‌సింగ్, కాం, రఘువీర్ దయాళ్, కాం; కన్హైయాలాల్ వాల్మీకి, కాం; మహావీర్‌త్యాగి, కాం; రాంజీ, సోష; సరయుప్రసాద్‌మిశ్ర, కాం; విశ్వనాథ్, కాం; లాలన్‌జీ, కాం; రోషన్‌లాల్ చతుర్వేది. కాం; రఘువీర్ సహాయ, కాం; దిగంబర్ సింగ్, కాం; పన్నాలాల్, కాం; మాల్‌చంద్‌ధుబె, కాం; భక్తదర్శన్, కాం; మహారాణి కమలేందు మతిషా, స్వతం; నగినరాం, సోష; హరప్రసాద్, కాం; కేశవదేవ మాలవీయ, కాం; చౌధురి హైదర్‌హుసేన్,

కాం; శ్రీమతి శకుంతలనయ్యర్, హిందుమహాసభ; దశరథ ప్రసాద్ ద్వివేది, కాం; హరిశంకర ప్రసాద్, కాం; సింహాసన్‌సింహ, కాం; మన్నూలాల్ ద్వివేది, కాం; బషీర్‌హుసేన్ జైది, కాం; బులాకిరాం, కాం; హోతిలాల్, కాం; లోటన్‌రాం, కాం; బీర్బల్‌సింగ్, కాం; గణపత్, కాం; రఘునాథ్ ధులేకార్, కాం; హరిహరనాథశాస్త్రి, కాం; వెంకటేశనారాయణ తివారి, కాం; బాలకృష్ణశర్మ, కాం; శ్రీమతి విజయలక్ష్మీపండిట్, కాం; మోహనలాల్ శాక్సేనా, కాం; శ్రీమతి గంగా దేవి, కాం; పాద్మాగుప్త, కాం; కృష్ణచంద్ర, కాం; షానవాజ్ ఖాన్, కాం; కృష్ణచంద్రశర్మ, కాం; ఖుషీరాంశర్మ, కాం; జె. ఎన్, విల్సన్, కాం; రూపనారాయన్, కాం; హిఫ్జుల్ రహమన్, కాం; ప్రొఫెసర్ రామశరన్, కాం; హీరావల్లభ త్రిపాఠి, కాం; సి. డి. పాండె, కాం; ముకుందలాల్ అగర్వాల్, కాం; మునీశ్వరదత్త ఉపాధ్యాయ, కాం; ఫిరోజ్ గాంధి, కాం; బాయిజనాథ్ కురీల్, కాం; మౌలానా అబుల్ కలాం ఆజద్, కాం; సేట్ రామేశ్వరప్రసాద్ నివాటియా, కాం; గణేశలాల్ చౌధురి, కాం; అజిత్ ప్రసాద్ జెయిన్, కాం; సుందర్ లాల్, కాం; శ్రీమతి ఉమానెహ్రు, కాం; ప్రాగిలాల్, కాం; ఎం. ఎ. కజ్మి, కాం; బాలకృష్ణ విశ్వనాథ్ కేస్కర్, కాం; విశాంభర్‌దయాళ్, కాం; స్వామి రామానంద్, కాం.

ఒరిస్సా : 20 :

(కాంగ్రెసు 11, సోషలిస్టు 1, కమ్యూనిస్టు 1, గణతంత్ర పరిషద్, 5, స్వతంత్రులు 2.)

భగవత్ సాహు, కాం; కణుచరణ్ జెన, కాం; ఘనశ్యామదాస్ శిరాణి, స్వతంత్ర; హరకృష్ణమహతబ్, కాం; సారంగధరదాస్, సోషలిస్టు; నిరంజన్ జెన, కాం; విజయచంద్రదాస్, కమ్యూనిస్టు; ఉమాచరణపట్నాయక్, స్వతంత్ర; భువనానందదాస్, కాం; లక్ష్మీధర్ జెన, గణతంత్ర; మహారాజారాజేంద్ర నారాయణసింగ్ దేవ్, గణతంత్ర; గిరిధారిభాయ్, గణతంత్ర; నిత్యానంద కణుంగో, కాం; లింగరాజమిశ్ర, కాం; రాంచంద్రమజె, కాం; పొన్నాడ సుబ్బారావు,

గణతంత్ర ; లోకనాథమిశ్ర, కాం ; టి. సంగన్న, కాం.) పోటీలేని ఎన్నిక) ; నటవర్ పాండే, కాం ; శివనారాయణసింగ్, కాం.

పంజాబ్ : 16 :

(కాంగ్రెసు, 16; అకాలిపార్టి, 2.)

కాంగ్రెస్, 16 : టేక్‌చంద్, జ్ఞాని గురుముఖ్‌సింగ్, పండిట్ ఠాకుర్‌దాస్ భార్గవ, లాలా అచింతరాం, దివాన్ చంద్, రాందాస్, ఘామండిలాల్, అమర్‌నాథ్ విద్యాలంకార్, హేంరాజ్, శ్రీమతి సుభద్రజోషి, వీరేంద్రకుమార్, సర్దార్ బలదేవసింగ్, చౌధురి రణ్‌బీర్ సింగ్, సర్దార్ సుర్జిత్‌సింగ్ మజీథియా.

అకాలిపార్టి, 2 . సర్దార్‌లాల్‌సింగ్, సర్దార్ బహదూర్ సింగ్.

పశ్చిమ బెంగాల్ : 34 :

(కాంగ్రెసు, 24 ; జనసంఘు, 2; కమ్యూనిస్టు, 5 ; స్వతంత్రులు, 1; హిందూమహాసభ, 1 ; రివల్యూషనరీ సోషలిస్టుపార్టి, 1.)

జగన్నాథకోలే, కాం; పశుపతిమండల్, కాం ; రామానంద దాస్, కాం ; శ్రీమతిరేణు చక్రవర్తి, కమ్యూ; పతిరాంరాయ్, కాం ; త్రిదివ్ చౌధురి, రివల్యూషనరీ సోషలిస్టు; కమలకృష్ణదాస్, కాం ; అతుల్యఘోష్, కాం ; డాక్టర్ మనోమోహనదాస్, కాం ; ప్రొఫెసర్ హీరేంద్రనాథముఖర్జి, కమ్యూ ; డాక్టర్ మేఘనాథసాహ, స్వతంత్ర ; డాక్టర్ శ్యామప్రసాదముఖర్జి, జనసంఘు ; అషింకృష్ణదత్, కాం ; వసంతకుమార్‌దాస్, కాం ; కమల్‌బాసు, కమ్యూ ; పూర్ణేందుశేఖర్ నాస్కర్, కాం ; నికుంజవిహారిచౌధురి, కమ్యూ; ఎన్. సి. ఛటర్జి, హిందూమహాసభ ; సంతోషకుమారదత్త, కాం ; అబ్దుస్ సత్తార్, కాం ; సురేంద్ర మోహనఘోష్, కాం ; దుర్గాచరణ బందోపాధ్యాయ, జనసంఘు ; భరత్‌లాల్‌తుడు, కాం ; మహమద్ ఖుదాబక్షి, కాం ; లక్ష్మీకాంతమైత్ర, కాం ; అమియకాంతబాస్, కాం ; ఉపేంద్ర నాథబర్మన్, కాం , తుషార్‌కాంతిభటోపాధ్యాయ, కమ్యూ ; సతీష్

చంద్రసామంత, కాం ; డాక్టర్ సత్యబన్ రాయ్. కాం ; సుశీల్ రంజన్ ఛటోపాధ్యాయ, కాం.

బీహారు : ౫౫ :

(కాంగ్రెసు, 45; సోషలిస్టు, 3 ; జార్ ఖండ్ పార్టీ, 3 ; లోక సేవకసంఘ, 2 ; జనతపార్టీ, 1 ; స్వతంత్రులు 1.)

బనారసిప్రసాద్ జంజంవాలా, కాం ; శ్రీమతి సుశామసేన్, కాం ; అనుప్ లాల్ మెహత, కాం ; కిరణ్ మునాహార్, సోష ; కాను రాండేవ్ గం, జార్ ఖండ్ ; బిపిన విహారి వర్మ, కాం ; డాక్టర్ సయ్యద్ మహమద్, కాం ; శ్రీ నారాయణదాస్, కాం ; అనిరుద్ధసింహ, కాం; శ్యామనందన్ ప్రసాద్ మిశ్ర, కాం ; లవిత్ నారాయణ్ మిశ్ర, కాం ; వ్రజేశ్వర ప్రసాద్, కాం ; రామధానిదాస్, కాం ; బిగేశ్వర్ మిశ్ర, సోష ; సత్యనారాయణ్ సింహ, కాం ; నాగేశ్వరప్రసాద్ సింహ, కాం ; రామనారాయణ్ సింగ్, జనత ; ప్రభాత్ చంద్రబోస్, కాం ; హరిమోహన్, కాం ; భజహరి మహతో, లోక సేవక్ సంఘ ; మంఘు చైతన్, లోక సేవక్ ; సురేశ్ చంద్ర మిశ్ర, సోష ; మధురప్రసాద్ మిశ్ర. కాం ; బనారసి ప్రసాద్ సింహ, కాం ; నయనతారదాస్, కాం ; శ్యామనందనసహాయ, కాం ; అవధేశ్వరప్రసాద్ సింహ, కాం; దిగ్విజయ్ నారాయణ్ సింగ్, కాం ; చంద్రేశ్వరర్ నారాయణ్ ప్రసాద్ సింహ, కాం ; రాజేశ్వర్ పటేల్, కాం ; రామేశ్వర్ పటేల్, కాం ; రామేశ్వరసాహు, కాం ; (పోటీలేకుండా ఎన్నిక) ; జగాన్ ఖేర్వార్, కాం ; గజేంద్రప్రసాద్ సింహ, కాం ; సారంగధర్ సింహ, కాం ; కైలాసపతి సింహ, కాం ; శ్రీమతి తారకేశ్వరిదేవి, కాం ; బాలిరాం భగతు, కాం ; ఫణిగోపాల్ సేన్ గుప్త, కాం మహమ్మద్ ఇస్లాముద్దిన్ కాం ; భగవత్ జా, కాం ; సారెన్ పాల్ జుజార్, జార్ ఖండ్ ; అబ్దుల్ ఇబ్రాహిం, కాం ; జయపాల్ సింగ్, జార్ ఖండ్ ; సత్యేంద్ర నారాయణ్ సింహ కాం ; రామరాజ్ జజ్వారె, కాం ; లాల్ హెంబ్రాం, కాం ; మహేంద్రనాధ్ సింగ్, కాం ; జులాన్ సింహ, కాం ; ద్వారక్ నాధ్ తివారి, కాం ; విభూతిమిశ్ర, కాం ; భోలా

రపుల్ కాం ; కమల్ సింగ్, స్వతంత్ర ; రామసుభగ్ సింగ్, కాం ; జగజీవనరాం, కాం ; ఒకస్థానం ఖాళీ.

బొంబాయి : 45 :

(కాంగ్రెస్, 40 ; స్వతంత్రులు, 3 ; షెడ్యూల్డుకాస్టుఫెడరేషన్ 1 ; పెజెంట్స్ అండ్‌వర్కర్స్, 1.)

కాంగ్రెస్ 40 . జి. వి. మవలంకర్, ఎం. బి. వైశ్య, పండరి నాథ్ రామచంద్ర కనవాడె, ఉత్తంచంద్ రామచంద్ భగవత్, అక్బర్ డాలుమియాన్ చవ్డా, బలవంత్ నాగేశ్ దాతార్, ఎస్. వి. సొరత్, ఎస్. ఆర్. రాణె, రాజారాం గిరిధరిలాల్ డుబే, ఆర్. బి. పిడ్రి, విఠల్ బాలకృష్ణగాంధీ, ఎన్. ఎస్. కజ్రోల్కార్, ఎస్. కె. పాటిల్, శ్రీమతి జయశ్రీ రాయ్‌జీ, ఎస్, ఎం. భట్, డి. పి. కర్మార్కర్, టి. ఆర్. నెస్వి, హెచ్. వి. పటాస్కర్, ఎఫ్. బి. దభి, శ్రీమతి మణిబెన్ పటేల్, జోషింఆల్వా, చింతామణ్ దేశముఖ్, కే. ఎల్. మోరె, శాంతి లాల్ పరీఖ్, జి. హెచ్. దేశపాండె, జి. ఎస్. అల్టెకార్, ఎం. ఎం. గాంధీ, ఆర్. బి. పరమార్, ఎన్. వి, గాడ్గిల్, శ్రీమతి మాయాదేవ్ ఇందిరఅనంత్, జె. కె. భోసాలె, ఎం. డి. జోషి, గుల్జారిలాల్ నంద, వి. పి. పవార్, కన్హైయాలాల్ నానాభాయ్‌దేశాయ్, బి. కె. పటేల్, జి. డి. వర్తక్, అనంత్ శావలరాం నందకర్, ఎస్. ఆర్. భారతీయ, జె. జి. నటావద్కర్.

స్వతంత్రులు, 3 : ఇందుభాయ్‌అమీన్, బి. హెచ్. ఖర్డెకార్, తులసీదాస్ కిలాచంద్.

షెడ్యూల్డ్ కాస్టుస్ ఫెడరేషన్, 1 : పి. ఎన్. రాజభోజ్.

పెజంట్స్అండ్ వర్కర్స్, 1 : ఎస్. ఎస్. మోరె.

మదరాసు : 75 :

(కాంగ్రెసు 34; సోషలిస్టు, 2; ప్రజాపార్టి, 6; కమ్యూనిస్టు, 8; స్వతంత్రులు, 15; తమిళ్‌నాడు శ్రమజీవులు, 4; కామన్‌వీల్, 3, ముస్లిం లీగ్, 1)

(అరుప్పుకోట్టై, కోయంబత్తూరుల స్థానాలు ఖాళీగా వున్నాయి)।
కాంగ్రెసు, 35: పైడి లక్ష్మయ్య, అనంతపూర్; టి. సుబ్రహ్మణ్యం, బళ్ళారి; డి. వి. అలగేశన్, చెంగల్పట్; టి. ఎస్. విశ్వనాధరెడ్డి, చిత్తూరు; ఎం. వి. గంగాధరశివ, చిత్తూరు, షెడ్యూల్డ్ కాస్టు రిజర్వ్డ్; ఎల్. ఎలయపెరుమాళ్లు, కడలూర్, షెడ్యూల్డ్ కాస్టు రిజర్వ్డ్; శ్రీమతి అమ్ముస్వామినాధన్, దిండిగల్; పెరియస్వామి గౌండర్, ఈరోడ్; బాలకృష్ణన్, ఈరోడ్; షెడ్యూల్డ్ కాస్టు రిజర్వ్డ్; సి. ఆర్. నరసింహన్, కృష్ణగిరి; సి. రామస్వామి మొదలియార్, కుంభకోణము; హెచ్. సీతారామరెడ్డి, కర్నూలు; టి. టి. కృష్ణమాచారి, మదరాస్, ఎస్. బాలసుబ్రహ్మణ్యం, మధుర; పి. కాక్కన్. మధుర, షెడ్యూల్డ్ కాస్టు రిజర్వ్డ్; వి. వి. గిరి, పాతపట్నం; కె. శక్తివడివేలు గౌండర్, పెరియకులం; దామోదరన్, పొల్లాచి; ఐ. ఈశ్వరన్, పొన్నాని, షెడ్యూల్డ్ కాస్టు రిజర్వ్డ్; ఎ. వి. ఆర్. నాగప్పచెట్టియార్, రామనాధపురం; ఎస్. వి. రామస్వామి, సేలం; ఎం. శంకరపాండ్యన్, శంకరనయినార్ కోవిల్; ఎ. వి. థామస్, శ్రీ వైకుంఠం; కె. కామరాజనాడార్, శ్రీవిల్లిపుత్తూరు; యం. శ్రీనివాసమల్లయ్య, దక్షిణకన్నడ (ఉత్తరం); బి. శివరావు, దక్షిణకన్నడ (దక్షిణ); ఆర్. వెంకటరామన్, తంజావూరు; కొత్త రఘురామయ్య, తెనాలి; తానుపిళ్లై, తిరునెల్వేలి; ఎం. అనంతశయనం అయ్యంగార్, తిరుపతి; టి. ఎస్. అవినాషిలింగం చెట్టియార్, తిరుపూర్; పి. నటేశన్, తిరువళ్లూరు; శ్రీమతి మరకతం చంద్రశేఖర్, తిరువళ్లూరు, షెడ్యూల్డ్ కాస్టు రిజర్వ్డ్; ముత్తుక్రిష్ణన్, నెల్లూరు, షెడ్యూల్డ్ కాస్టు రిజర్వ్డ్;

సోషలిస్టులు, 2: నల్లా రెడ్డినాయుడు, రాజమండ్రి; కె. సుబ్రహ్మణ్యం, విజయనగరం.

ప్రజాపార్టీ, 6: వి. ఎస్. మూర్తి, ఏలూరు; కె. ఎ. దామోదరమీనన్, కోళికోడ్; కె. ఎస్. రాఘవాచార్యులు, పెనుగొండ; కె. కేలప్పన్, పొన్నాని; కె. ఎం. వల్లతరసు, పుదుకోట; పి. దామోదరన్ పెట్టార్, తెలిచ్చేరి;

కమ్యూనిస్టులు, 8: ఎ. కె. గోపాలన్, కన్ననూర్; యెద్దుల ఈశ్వరరెడ్డి, కడప; కొండ్రు సుబ్బారావు, ఏలూరు; షెడ్యూల్డ్ కాస్టు రిజర్వ్‌డ్; కడియాల గోపాలరావు, గుడివాడ; చలికాని వెంకటరామా రావు, కాకినాడ; సంకా బుచ్చికోటయ్య, మచిలీపట్టణం; కె. ఆనందన్ నంబియార్, మయూరం; కె. మోహనరావు, రాజమండ్రి, షెడ్యూల్డ్ కాస్టు రిజర్వ్‌డ్;

స్వతంత్రులు, 15: ఎన్. సత్యనాథన్, ధర్మపురి; శిష్ట్లా వెంకట లక్ష్మీ నరసింహం, గుంటూరు; పి. వీరాస్వామి, మయూరం, షెడ్యూల్డు కాస్టు రిజర్వ్‌డ్; శేషగిరిరావు, నంద్యాల; సి. రామస్వామినాథన్, నరస రావుపేట; బెజవాడ రామచంద్రారెడ్డి, నెల్లూరు; కె. వెంకటరాఘవయ్య, ఒంగోలు; మంగళగిరి నానాదాస్, ఒంగోలు, షెడ్యూల్డు కాస్టు రిజర్వ్‌డ్; నూతక్కి రామశేషయ్య, పార్వతీపురం; పి. రాజగోపాలరావు, శ్రీకా కుళం; ఎస్. కె. బాడీ, తిరుచెంగోడ్; ఇ. మధురం, తిరుచిరాపల్లి; హరీంద్రనాథ్ చట్టోపాధ్యాయ, విజయవాడ; డాక్టర్ లంకసుందరం, విశాఖపట్టణం; గాం మల్లుదొర, విశాఖపట్టణం; షెడ్యూల్డు ట్రైబ్సు రిజర్వ్‌డ్, పోటీలేకుండా ఎన్నిక.

తమిళనాడు శ్రమజీవులు, 4: గోవిందస్వామి కచిరయర్ కడలూర్; కె. భూవరాహస్వామి పడయాచి, పెరంబలూర్; వి. మునుస్వామి, తిండివనం; ఎ. జయరామన్, తిండివనం, షెడ్యూల్డు కాస్టు రిజర్వ్‌డ్.

కామన్ వీల్, 3: డాక్టర్ ఎ. కృష్ణస్వామి, కంచీపురం; రామచందర్, వెల్లూరు; ఆర్. మునుస్వామి, వందవాసి.

ముస్లింలీగ్, 1: బి. పోకర్, మలప్పురం.

## మధ్యప్రదేశ్ : 29 :

(కాంగ్రెస్, 27, స్వతంత్రులు, 2)

కాంగ్రెస్, 27: డాక్టర్ పంజాబ్ రావ్ శ్యామరావ్ దేశముఖ్, కె. జి. దేశముఖ్, సి. డి. గౌతం, బి. ఎల్. చందర్, సి. వి. జసాని, టి. సి. సఖారె, సర్దారు అమరసింగ్ సైగల్ బాయజ్ నాథ్ సింగ్,

రేషంలాల్ తికారాం, భూపేంద్రనాథమిశ్ర, గురుఆగందాస్, జి. ఓ. ఖేద్కార్, లక్ష్మన్ శ్రావన్ భట్కార్, అబ్దుల్లా తాహెరాలిముల్లా, రాయ్‌చంద్ భాయ్‌షా, వి. ఎస్. కిరోలికార్, భగవతి చరన్‌శుక్ల, సయ్యద్ అహమద్ ఇసాక్, సుశీల్ కుమార్, శివదాస్ దాగా, సేట్ గోవిందదాస్, మంగ్రూ, శ్రీమతి అనసూయాబాయి కాళే, బి. ఎస్. తివారి, కె. డి. సోకియా, బాబునాథ్ సింగ్, ఎస్. డి. అగర్వాల్, సహదేవ్ అర్జున్ భారతి.

స్వతంత్రులు, 2; ముచకికేశ, మహారాజకుమార్ చండికేశ్వర్ శరన్ సింగ్ జేదేవ్.

**కాశ్మీరు : 6 :**

మౌలానా మహమ్మద్ సయీద్ మసూది, మేజర్ లక్ష్మణసింగు చరక్, సుఫీమహమ్మద్ అక్బరు, పండిట్ శివనారాయన్ ఫొతెదారు, చౌధురి మహమ్మద్ షఫీ, ఖాన్‌ఘులాం ఖాదిర్.

**తిరువాంకూరు—కొచ్చిన్ : 12 :**

కాంగ్రెస్, 5, స్వతంత్రులు, 5, ఇతర పార్టీలు, 2).

కాంగ్రెస్, 5: కె. టి. అచ్యుతన్, ఎ. ఎన్. తామస్, సి. పి. మాతూలీ. పి. టి. చకో, సి. ఆర్. ఇయ్యుణ్ణి.

స్వతంత్రులు, 5: పి. టి. పున్నూస్, వి. పరమేశ్వరన్ నాయర్, ఆర్. వేలాయుధన్, సి. పి. మాథెన్, శ్రీమతి ఆనీ మెస్కరీన్.

తిరువాంకూరు తమిళనాడు కాంగ్రెస్, 1: ఎ. నేశమణి, రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, 1: శ్రీ కంఠన్ నాయర్.

**పాటియాల, తూర్పుపంజాబ్ సంస్థానాలు : 5 :**

కాంగ్రెసు, 2, అకాలి, 2, స్వతంత్ర, 1).

కాంగ్రెసు, 2: హీరాసింగ్, రామప్రతాప్ గర్గ్. అకాలి, 2: సర్దార్ అజిత్ సింగు, స్వతంత్ర, 1: సర్దార్ రంజిత్ సింగు.

**మధ్యభారత్ : 11 :**

(కాంగ్రెస్, 9. హిందూమహాసభ 2.)

కాంగ్రెస్, 9: నందలాల్ సూర్యనారాయన్, అమరసింగ్, డాక్టర్ కైలాసనాథ కాట్జు, రాధా చరన్ శర్మ, సూర్యప్రసాదు, బాయిజినాథ్ మహోదయ, లీలాధర్ జోషి; హిందూమహాసభ, 2 వి. జి. దేశపాండె, డాక్టర్ ఎన్. బి. ఖారె.

మైసూర్ 11:

కాంగ్రెస్, 10, ప్రజాపార్టీ, 1):

కాంగ్రెస్, 10: ఎస్. కేశవఅయ్యంగారు, టి. మాదయ్యగౌడ, ఎస్. నిజలింగప్ప, హెచ్. సిద్దలింగప్ప, ఎం. వి. కృష్ణప్ప, దొడ్డ తిమ్మయ్య, ఎం. కె. శివనంజప్ప, ఎన్. రాచయ్య, కె. జి. వడెయర్, సి. ఆర్. బసప్ప.

ప్రజాపార్టీ, 1: ఎం. ఎస్. గురుపదస్వామి.

రాజస్థాన్ 20:

(కాంగ్రెస్, 9, జనసంఘు, 1, స్వతంత్రులు, 5, ఇతర పార్టీలు, 4) ఒక స్థానంలో ఎన్నిక మళ్లీ జరగాలి.

శోభారాం, భికాభాయ్, రాధేశ్యాంరామకుమార్ మురార్కా, పన్నాలాల్, దౌలత్ మల్, రాజబహదుర్, నేమిచంద్ కస్లివాల్, పన్నాలాల్ కౌసిక్ బలవంత్ సింగ్ మెహత.

జనసంఘు 1: ఉమాశంకర్ త్రివేది,

స్వతంత్రులు: 5: భవానిసింగ్, గిరిరాజశరణుసింగ్, మహారాజా, గజధర్, అజిత్ సింగ్.

రామరాజ్య పరిషత్: 3: హరిరాం, చంద్రసేన్, నందలాల్.

కృషిక్ లోక్: మానకచంద్.

సౌరాష్ట్ర 6:

అర్ధహూ కాంగ్రెసే:

బలవంతరాయ్ మెహత, చిమన్ లాల్ షా, మేజర్ జనరల్ మహారాజ్ హిమతు సింహజీ (పోటీలేకుండా ఎన్నిక); జె. హెచ్. దోషి, నరేంద్రనత్వాని, రసిక్ లాల్ పరీఖ్.

హైదరాబాద్: 26 :

(కాంగ్రెస్, 14, పీపుల్స్ డెమొక్రటిక్ ఫ్రంట్, 7 సోషలిస్టు, 1, పెజంట్స్ అండ్ వర్కర్సు, 1, స్వతంత్ర 1, షెడ్యూల్ కాస్టు ఫెడరేషన్, 1

కాంగ్రెస్- 14 : హనుమంతరావ్ గణేశరావు, సురేశచంద్ర శివ ప్రసాద ఆర్య, షౌకతుల్లాషా అన్సారి, స్వామిరామానందతీర్థ, అహమద్ మొహియుద్దీన్, సాదత్ అలీఖాన్, జనార్దన రెడ్డి, పి. రామస్వామి (పోటీలేకుండా ఎన్నిక), శంకరరావు శ్రీనివాసరావు, డి. నామదేవ రావు, హరిశ్చంద్ర హెడా, దివాన్ రాఘవేంద్రరావు, డాక్టర్ ఎస్. ఎ. ఎబనీజర్, కృష్ణాచార్యజోషి (పోటీలేకుండా ఎన్నిక).

పీపుల్స్ డెమొక్రటిక్ ఫ్రంట్, 7 : ఆర్. జి. పరంజపె, బద్దం యెల్లారెడ్డి, టి. బి. విఠల్ రావు, డాక్టర్ ఎ. ఎం. జయసూర్య, రావి నారాయణరెడ్డి, సుంకం అచ్చాలు, పెండ్యాల రాఘవరావు.

సోషలిస్టు, 1 : సి. మాధవరెడ్డి.

పెజంట్స్ అండ్ వర్కర్స్, 1 : నారాయణరావు వాఘ్మారె.

స్వతంత్ర, 1 : శివమూర్తిస్వామి.

షెడ్యూల్డు ఫెడరేషన్, 1 : ఎం. ఆర్. కృష్ణ.

అజ్మీరు : 2 :

ఇద్దరూ కాంగ్రెసే :

జ్వాలాప్రసాద్, ముకుటబిహారిలాల్.

కచ్ : 2

ఇద్దరూ కాంగ్రెసే :

గులాబ్ శంకర్ ధోలాకియా, భవాంజీ అర్జున్ ఖీంజీ.

కూర్గు :1 :

కాంగ్రెస్ : ఎన్. సోమన్న.

ఢిల్లీ 4 :

(కాంగ్రెస్, 3, ప్రజాపార్టీ 1.)

శ్రీమతి సుచేత కృపాలిని, ప్రజాపార్టీ. రాధారమణ్, సి. కృష్ణ నాయర్, నవల్ ప్రభాకర్, ముగ్గురూ కాంగ్రెస్.

భోపాల్ 2 :

ఇద్దరూ కాంగ్రెస్.

పండిట్ చతుర్నారాయణ్ మాలవీయ, సయీద్ ఉల్లాఖాన్ రజ్మి.

మణిపూరు : 2 :

(కాంగ్రెస్ 1, సోషలిస్టు 1.)

లైస్రాం జుగేశ్వర్ సింగ్, కాం; రిషాంగ్, సోష.

త్రిపుర : 2 :

(ఇద్దరూ కమ్యూనిస్టులే) : బిరేంద్రచంద్ర దత్, దశరథ్ దేవ్.

వింధ్యప్రదేశ్ : 6 :

(కాంగ్రెస్, 4, సోషలిస్టు, 1, ప్రజాపార్టీ 1)

భగవాన్ దత్తశాస్త్రి, సోష, రణదమన్ సింగ్, ప్రజాపార్టీ, (పోటీ లేకుండా ఎన్నిక), రామ్‌సహాయ్, మోతిలాల్ మాల్వి, రాజభానుసింగ్, ఎస్. డి. ఉపాధ్యాయ, నలుగురూ కాంగ్రెస్.

బిలాస్‌పూర్ : 1 :

స్వతంత్ర: రాజా ఆనంద్‌చంద్ (బిలాసపూర్ రాజా, పోటీ లేకుండా ఎన్నిక.)

హిమాచలప్రదేశ్ : 3 :

ఇద్దరు కాంగ్రెస్, ఒక స్వతంత్రుడు.

రాజకుమారి అమృతకౌర్. కాం, గోపీరాం, కాం. ఎ. ఆర్. సేవాల్, స్వతంత్ర.

అండమాన్, నికోబారు దీవులు : 1 :

బిషప్ జాన్ రిచర్డ్‌సన్.

అస్సాంకొండజాతుల ప్రతినిధి :

చౌఖమాన్ గొహైన్.

**ఆంగ్లో-ఇండియనులు :**

ప్రెసిడెంటుచే నామినేట్ చేయబడినవారు: 2 ఫ్రాంక్ ఆంథోనీ, ఎ. ఇ. టి. బార్లో.

**వివిధపార్టీల బలాలు :**

కాంగ్రెసు, 363, కమ్యూనిస్టులు, వారితో చెందినవారు, 27, సోషలిస్టులు, 12, ప్రజాపార్టీ, 10, జనసంఘు, 3, హిందూమహాసభ, 4, రామరాజ్యపరిషత్, 3, రైతు, కూలిపార్టి, 2, షెడ్యూల్డు ఫెడరేషన్, 2, గణతంత్ర పరిషత్, 5, స్వతంత్రులు, 36, జార్ఖండ్ పార్టి, 3, లోకసేవక్ సంఘు, 2, అకాలీదళం, 4 తమిళనాడు శ్రమజీవులపార్టీ, 4, కామన్ వీల్ పార్టీ, 4, కృషికర్ లోక్ పార్టీ, 1, ఫార్వర్డ్ బ్లాక్, 1, రివల్యూషనరీ సోషలిస్టు, 1, యునైటెడ్ సోషలిస్టు, 1, తిరువాంకూర్ తమిళనాడు కాంగ్రెసు, 1 ముస్లింలీగ్, 1.

## సభ్యుల వివరాలు

ప్రజాసభ సభ్యులలో 18 మంది ముస్లిములు ఉన్నారు, 19 మంది స్త్రీలు వున్నారు.

**ముస్లిములు :**

అస్సాం, 1, బీహారు, 3, మధ్యప్రదేశ్, 2, మదరాసు, 1, ఉత్తర ప్రదేశ్, 6, పశ్చిమబెంగాల్, 1, హైదరాబాదు, 3 భోపాల్ 1.

**స్త్రీలు :**

అస్సాం: 1: బొనిలీ ఖాంగ్మన్

బీహారు : 2 : సుశామసేన్, తారకేశ్వరిదేవి,

బొంబాయి : 3 : జయశ్రీ రాయ్‌జీ, మణిబెన్ పటేల్, మాయాదేవ్ ఇందిర అనంత.

మధ్యప్రదేశ్ : 1 : అనసూయాబాయ్ కాళె.

మదరాసు : 2 : అమ్ముస్వామినాథన్, మరకతం చంద్రశేఖరం.

పంజాబ్ : 1 సుభద్రాబాయ్ జోషి.

ఉత్తరప్రదేశ్ : 5 : మహారాణి కమలేందుమతి షా, శకుంతలా నయ్యరు, విజయలక్ష్మిపండిట్, గంగాదేవి, ఉమనెహ్రూ.

పశ్చిమ బెంగాల్ 1: రేణు చక్రవర్తి.
తిరువాంకూరు - కొచ్చిన్ : అని మెస్కారీన్.
ఢిల్లీ : 1 సుచేత కృపలాని
హిమాచల ప్రదేశ్ : 1 : రాజకుమారి అమృతకౌర్.

## సభ్యుల అలవెన్సు

పార్లమెంటు సభ్యులకు అలవెన్సు రోజుకు 45 రూపాయలు వుండేది. కాని, ఆర్థికమాంద్య పరిస్థితులను గమనించి తమ అలవెన్సులో రోజుకు అయిదురూపాయలను తగ్గించుకోడానికి సభ్యులు 1949 అక్టోబరు 17 న నిశ్చయించారు.

ప్రస్తుతం సభ్యులకు తమ స్వస్థానాలనుంచి ఢిల్లీకి రాకపోకలను ఫస్టుక్లాసు టిక్కెట్లూ- సభజరిగిన రోజులకు రోజుకి 40 రూపాయల అలవెన్సూ ఇవ్వబడుతున్నవి.

## విదేశాలలో భారతదేశ ప్రతినిధులు

| | | | |
|---|---|---|---|
| ఇంగ్లండ్ : | హైకమిషనర్ | బి. జి. ఖేర్ | (రు.5500) |
| అమెరికా : | రాయబారి | వినయరంజన్ సేన్ | |
| రష్యా : | ,, | | (రు. 12.500) |
| చైనా : | ,, | ఎన్. రాఘవన్ | (రు. 6000) |
| యునైటెడ్ నేషన్స్ : | ,, | రాజేశ్వరదయాళ్ | |
| కెనడా : | హైకమిషనర్ | ఆర్. ఆర్. శాక్సేనా | (రు. 2250) |
| ఆస్ట్రేలియా : | ,, | యువరాజు దులీప్‌సింహజీ | |
| పెర్షియా : | రాయబారి | డాక్టరు ఐ. ఆర్. తారాచంద్ | (రు. 5000) |
| ఇరాక్ : | మినిస్టరు | ఖుబ్‌చంద్ | |
| ఆఫ్ఘనిస్థాన్ : | రాయబారి | వింగ్ కమాండర్ రూప్‌చంద్ | (రు. 5000) |

| | | | |
|---|---|---|---|
| ఫ్రాన్సు : | ,, | సర్దారు హెచ్. ఎస్. మాలిక్ | (రు. 6500) |
| నేపాల్ : | ,, | చంద్రేశ్వరప్రసాద్ నారాయణసింగ్ | (రు. 3000) |
| ఆస్ట్రియా<br>స్విట్జర్లెండ్<br>వాటికన్ : | ,, | అసఫ్ ఆలి | (రు. 5250) |
| చెకోస్లావేకియా : | ,, | | |
| మలయా : | రిప్రెజెంటేటివ్ | ఎం. గోపాలమీనన్ | (. 3875) |
| సింహళము : | హైకమిషనరు | కె. పి. కేశవమీనన్ | ( .2750) |
| బర్మా : | రాయబారి | ఎం. ఎ. రవూఫ్ | (రు. 4050) |
| జపాన్ : | ,, | డాక్టరు పి. పద్మనాభపిళ్లై | |
| సయాం : | ,, | ఎం. కె. కృపలాని | (రు. 2667) |
| పాకిస్తాన్ : | హైకమిషనరు | డాక్టరు మోహనసింగ్ మెహతా | (రు. 3000) |
| ఇండో-చైనా : | కాన్సల్ | అశోకనందలాల్ మెహత | |
| టర్కీ : | రాయబారి | సి. ఎస్. ఝూ | (రు. 5000) |
| మారిషస్ : | హైకమిషనరు | ధర్మయశదేవ్ | |
| గోవా : | కాన్సల్ | పి. ఎన్. డ్రైవర్ | |
| బ్రిటిష్ తూర్పు ఆఫ్రికా | కమిషనరు | అప్పాసాహెబ్ బి. పంత్ | (రు. 50,0) |
| వెస్టుఇండీస్ : | కమిషనరు | ఆనందమోహన్ సహాయ | (రు. 2050) |
| పోలెండ్ : | రాయబారి | బి. ఎన్. చక్రవర్తి | |
| ఇటలీ : | ,, | | |
| ఈజిప్ట్ :<br>సిరియా | ,, | | |
| ఫిలిప్పైన్స్ : | కాన్సల్ జనరల్ | పి. ఆర్. ఎస్. మణి | |
| అర్జెంటైనా :<br>చిలి : | రాయబారి | నవాబ్ ఆలియవరు జంగ్ | |

| | | |
|---|---|---|
| పోర్చుగల్ : | ,, | పి ఎ మీనన్ |
| ఇండోనేషియా : | ,, | సయ్యద్ అలి జహీర్ |
| అబిసీనియా : | ,, | సర్దార్ శాంతసింగ్ |
| స్వీడన్ : | | |
| డెన్మార్కు : | మినిస్టరు | ఎమ్. జె దేశాయ్ |
| ఫిన్లెండ్ : | | |
| బ్రజిల్ : | రాయబారి | రాజా జోగేంద్ర సేన్ |
| పశ్చిమజర్మనీ : | ,, | ప్రేమ్ కిషన్ |
| జపాన్ : | ,, | కె కె చెట్టూరు |

## భారతదేశంలో విదేశ ప్రతినిధులు

| | | |
|---|---|---|
| బ్రిటన్ : | హైకమిషనరు | జె. జె. గాస్నరు |
| ఆస్ట్రేలియా : | ,, | డబ్ల్యు. క్రొకరు |
| ఫ్రాన్సు : | రాయబారి | కౌంట్ స్టానిస్లాస్ ఆస్ట్రొబర్గ |
| అమెరికా : | ,, | చెస్టర్ బౌల్స |
| చైనా : | ,, | యువాన్ చుంగ్ షీన్ |
| ఇటలీ : | ,, | కౌంట్ ప్రేగా రికోటి |
| పెర్షియా : | ,, | నూరి ఇస్ఫాండారి |
| కెనడా : | హైకమిషనరు | వార్విక్ చిప్మన్ |
| హాలెండ్ : | రాయబారి | ఎ. ఎం. ఎ వినకెల్మన్ |
| పాకిస్తాన్ : | హైకమిషనరు | ఘయెజ్ కురెషి |
| సయాం : | ఛార్జి డిఎఫేరు | ధన్సత్ ఖోమన్ |
| నేపాల్ : | రాయబారి | విజయ షంషేర్ జంగ్ |
| సింహళం : | హైకమిషనరు | సర్ అరుణాచల మహాదేవ |
| రష్యా : | రాయబారి | కె. వి. నోవికోవ్ |
| బర్మా : | ,, | మహాత్ర్యసితు యు. క్యిన్ |
| చెకొస్లొవేకియా : | ,, | డాక్టర్ బొహుస్లావ్ క్రొటాచిల్ |
| స్విట్జర్లెండు : | ,, | ఆర్మిన్ దయేన్కర్ |

| | | |
|---|---|---|
| బెల్జియం : | రాయబారి | స్టెఫాను హూలెట్ |
| ఆఫ్ఘనిస్తాను : | ,, | సర్దార్ నజీబుల్లాఖాన్ |
| వాటికను : | ,, | రివరెండ్ డాక్టర్ లియో పి. కీర్కెల్స్ |
| బ్రజిల్ | ,, | డాక్టర్ అబిలార్దో బ్రెటాణా బోర్గోస్డోప్రాడ |
| ఈజిప్టు : | ,, | ఇస్మాయిల్ కమల్ బే |
| స్వీడెను : | ,, | రెగుస్టాఫ్ అడాల్ఫ ఏక్మన్ |
| పోర్చుగల్ : | ,, | డాక్టర్ వాస్కోగోరిన్ |
| నార్వే : | ,, | నట్ లిక్ |
| ఫిన్లెండ్ : | ,, | హ్యూగో వాల్ వస్నె |
| ఇండోనీషియా : | ,, | డాక్టర్ సుదర్శనో |
| డెన్మార్క్ : | ,, | హారిటాయ్ బెర్గ్ ఫ్రాంజెన్ |
| యుగోస్లావియా : | ,, | జోజాడ్ విలాన్ |
| సిరియా : | ,, | డాక్టర్ నగూబ్ అర్మనాజ |
| అర్జెంటైనా : | ,, | కర్నల్ రాఫేల్ లాసెరా |
| మెక్సికో : | ,, | లీ ఎమీలియో పోర్టెస్ గిల్ |
| పశ్చిమజర్మనీ : | ,, | ప్రొఫెసర్ ఇ. డబ్ల్యు మెయెర్ |

## ఇండియా సాయుధ దళాధిపతులు

సైన్యాధిపతి : జనరల్ కె. ఎం. కరియప్ప

నౌకాదళాధిపతి : రియల్ అడ్మిరల్ సి. టి. ఎం. పైజీ

విమానదళాధిపతి : ఏర్ మార్షల్ జి. ఇ. గిబ్స

## మంత్రివర్గాల కార్యదర్శులు

| | |
|---|---|
| ప్రచురణ బ్రాడ్ కాస్టింగు : | పి. సి. చౌదరి |
| విదేశ వ్యవహారాలు : | కె. పి. ఎస్. మీనన్ |
| ఆహారం, వ్యవసాయం | - విష్ణుసహాయ |

| | |
|---|---|
| రక్షణశాఖ : | హెచ్. ఎం. పటేల్ |
| కార్మికులు : | వి. కె. ఆర్. మీనన్ |
| పరిశ్రమలు : | వై. ఎస్. సుక్తాంకర్ |
| పోస్టు టెలిగ్రాఫ్ : | ఏ. వి. పాయ్ |
| గనులు : | బి. కె. గోఖలె |
| నిర్మాణం, సప్లయి : | సి. సి. దేశాయ్ |
| కాందిశీకులు : | ధనత్యాగి |
| హోం : | హెచ్. వి. ఆర్. అయ్యంగా |
| న్యాయశాఖ : | కె. వి. కె. సుందరం |
| శాస్త్ర పరిశోధన, విద్య: | సర్. ఎస్. ఎస్. భట్నాగర్ |
| రైల్వేలు : | హవేలి రాం |
| శాసనసభ : | ఎం. ఎన్. కౌల్ |
| ఆర్థికశాఖ: వ్యయం: | కె. ఆర్. కె. మీనన్ |
| ఆర్థికశాఖ: విదేశాలలో వ్యయం: | కె. జి. అంబగామ్ కార్ |
| సంస్థానాలు : | సి. ఎస్. వెంకటాచార్ |

## ఇండియా టారిఫ్ కమిషన్

చైర్మను : జి. ఎల్. మెహతా
మెంబర్లు : బి. ఎన్. అదార్ కార్
డాక్టర్ వి. వి. నారాయణస్వామి నాయుడు.

## సుప్రీంకోర్టు

| | | |
|---|---|---|
| ప్రధాన న్యాయమూర్తి : | ఎం. పతంజలిశాస్త్రి జీతం : | [రు. 7,000] |
| జడ్జీలు : | మెహర్ చంద్ మహాజన్ | [రు. 5,000] |
| | విజయకుమార్ ముఖర్జీ | [రు. 5,000] |
| | సుధిరంజనుదాస్ | [రు. 5,000] |
| | ఎన్. చంద్రశేఖర అయ్యర్ | [రు. 5,000] |
| | వివియన్ బోస్ | [రు. 5,000] |

## యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్

| | |
|---|---|
| చైర్మన్ : | ఆర్. ఎన్. బెనర్జి |
| సభ్యులు : | ఎస్. ఏ. ఏ. పైజీ |
| | ఎన్. వి. కానుంగో |
| | జి. సి. ఛటర్జి |
| | ఎస్. గోవిందరాజన్ |
| | సి. బి. నాగర్కర్ |
| | ప్రొఫెసరు ఎస్. కె. సిద్ధాంత |
| సెక్రటరి : | బిషణ్ దాస్ |

## ఇండియా ప్రభుత్వంలో కొందరు ముఖ్య ఉద్యోగులు

| | |
|---|---|
| ఆడిటరు-జనరల్ : | వి. నరహరిరావు [రు. 4,000 |
| ఆర్కియాలజీ డైరెక్టర్ జనరల్ : | ఎ. ఎస్. వత్స |
| ప్రిన్సిపాల్ ఇన్ఫర్మేషను ఆఫీసరు : | బి. ఎల్. శర్మ |
| ఆహారశాఖ డైరెక్టర్ జనరల్ : | ఆర్. ఎస్. కృష్ణస్వామి |
| మెడికలు సర్వీసెస్ డైరెక్టర్ జనరల్ : | డాక్టరు ఆర్ విశ్వనాథన్ |
| పరిశ్రమలశాఖ డైరెక్టర్ జనరల్: | టి. శివశంకర్ |
| టెక్స్టయిలు కమిషనర్ : | టి. పి. బరత్ |
| పోస్టు, టెలిగ్రాఫ్ డైరెక్టర్ జనరల్ : | శ్రీ కృష్ణప్రసాద్ |
| పశురక్షణశాఖ కమిషనర్ : | పి. ఆర్. నంద |
| రీసెటిల్మెంట్, ఎంప్లాయ్మెంట్ డైరెక్టర్ జనరల్ | డాక్టరు ఎస్. దార్ |
| ఎవాక్యుయేషను డైరెక్టర్ జనరల్ : | వై. కె. పూరి |
| ఆలిండియా రేడియో డైరెక్టరు జనరల్ : | |
| డైరెక్టర్ జనరల్ ఆఫ్ సివిల్ ఏవియేషన్ | టి. పి. భల్లా |

## యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్

| | |
|---|---|
| చైర్మన్ : | ఆర్. ఎన్. బెనర్జి |
| సభ్యులు : | ఎస్. ఏ. ఏ. పైజీ |
| | ఎన్. వి. కానుంగో |
| | జి. సి. ఘటర్జి |
| | ఎన్. గోవిందరాజన్ |
| | సి. బి. నాగర్కార్ |
| | ప్రొఫెసరు ఎన్. కె. సిద్ధాంత |
| సెక్రటరి : | బిషణ్ దాస్ |

## ఇండియా ప్రభుత్వంలో కొందరు ముఖ్య ఉద్యోగులు

| | |
|---|---|
| ఆడిటరు-జనరల్ : | వి. నరహరిరావు [రు. 4,000] |
| ఆర్కియాలజీ డైరెక్టర్ జనరల్ : | ఎ. ఎస్. వత్స |
| ప్రిన్సిపాల్ ఇన్ఫర్మేషను ఆఫీసరు : | బి. ఎల్. శర్మ |
| ఆహారశాఖ డైరెక్టర్ జనరల్ : | ఆర్. ఎస్. కృష్ణస్వామి |
| మెడికలు సర్వీసెస్ డైరెక్టర్ జనరల్ : | డాక్టరు ఆర్ విశ్వనాథన్ |
| పరిశ్రమలశాఖ డైరెక్టర్ జనరల్ : | టి. శివశంకర్ |
| టెక్స్టయిలు కమిషనర్ : | టి. పి. బరత్ |
| పోస్టు, టెలిగ్రాఫ్ డైరెక్టర్ జనరల్ : | శ్రీ కృష్ణప్రసాద్ |
| పశురక్షణశాఖ కమిషనర్ : | పి. ఆర్. నంద |
| రీసెటిల్మెంట్, ఎంప్లాయిమెంట్ డైరెక్టర్ జనరల్ | డాక్టరు ఎస్. దార్ |
| ఎవాక్యుయేషను డైరెక్టర్ జనరల్ : | వై. కె. పూరి |
| ఆలిండియా రేడియో డైరెక్టరు జనరల్ : | |
| డైరెక్టర్ జనరల్ ఆఫ్ సివిల్ ఏవియేషన్ | టి. పి. భల్లా |

రిజర్వుబ్యాంక్ గవర్నరు : బి. రామారావు
డైరెక్టర్ జనరల్ ఆఫ్ షిప్పింగ్ | ఎస్. జగన్నాథం
అటర్నీ జనరల్ : ఎ. సి. సెతల్వాడ్
ఇన్సూరెన్సు కంట్రోలర్ : ఎం. ఎ. అజీజ్
రిజిస్ట్రార్ జనరల్ : ఆర్. ఎ. గోపాలస్వామి
ఎన్నికల కమిషనర్ : సుకుమార్ సేన్
షెడ్యూల్డు జాతుల కమిషనర్: లక్ష్మీదాస్ శ్రీకాంత్

## సెక్రటేరియట్

మంత్రులూ, మంత్రివర్గాల కార్యదర్శులూ పనిచేసుకొనే ఆఫీసులన్నిటినీ కలిపి సెక్రటేరియట్ అంటారు. ఇండియా ప్రభుత్వ సెక్రటేరియట్‌ని సెంట్రలు సెక్రటేరియట్ అంటారు. ఇండియా ప్రభుత్వ స్థానం ఢిల్లీ కనుక, సెంట్రలు సెక్రటేరియట్ కూడా ఢిల్లీలోనే వుంటుంది.

1939 లో సెంట్రలు సెక్రటేరియట్‌లో మొత్తం 1272 మంది గుమాస్తాలు పనిచేస్తూ వుండేవారు. వీరి జీతాలకుగాను 1939-40 లో మొత్తం రు. 36,36,224 ఖర్చు అయింది 1939 లో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైన తరువాత సెక్రటేరియట్ బాగా విస్తరిల్లింది స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మరీ పెరిగిపోయింది. 1949 లో సెక్రటేరియట్‌లో పనిచేస్తున్న గుమస్తాల సంఖ్య, 6,718.

## బడ్జెటు

1952-53 సంవత్సరానికి బడ్జెటును 1952 మే 28 తేదీన పార్లమెంటులో ఆర్థికశాఖామంత్రి సి. డి. దేశ్‌ముఖ్ ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి :

| | |
|---|---|
| ఆదాయ అంచనా: | రు. 404,98,00,000 |
| వ్యయం అంచనా : | రు. 401,25,00,000 |
| లోటు అంచనా : | రు. 3,73,00,000 |

బడ్జెటులో సూచించబడిన ఖర్చులలో, సైనికశాఖకు రు. 197,95,00,000, ఆహార పదార్థాల కొనుగోలులో సహాయంగా యివ్వడానికి రు. 73,66,00,000 వున్నవి.

## ఉరిశిక్షలు

ఇండియాలోని కోర్టులలో 1944 నుంచి 1948 వరకు ఏ ఏ సంవత్సరంలో ఎంతమందికి ఉరిశిక్షలు విధింపబడినది, వివరాలు యీ క్రింది పట్టికలను తెలుసుకోవచ్చును. 1944 : 762, 1945 : 739, 1946 : 539, 1947 : 271, 1948 : 290.

# ప్లానింగ్ కమిషన్

దేశంలోని సహజసంపదనూ, మనుష్యబలాన్నీ సరిగా పరిశీలించి, యీ సంపదను సరిగా ఉపయోగించి, ప్రజల ఆర్థిక సౌష్టవాన్ని పెంపొందించడానికి తగిన నిర్మాణ కార్యక్రమాలను తయారుచేసి, వాటిని అమలు జరిపించడానికి నేషనలు ప్లానింగ్ కమిషనును నియమించడానికి 1950 మార్చి 15 తేదిన ఇండియా ప్రభుత్వం నిశ్చయించింది.

ఈ ప్లానింగ్ కమిషను చేసేపనులు ఏమటింటే : 1. దేశంలో భౌతిక ఆర్థిక, మనుష్యసంపద యెంతఉందో, విజ్ఞానశాస్త్రములు చదువుకున్న వారెంతమంది ఉన్నారో పరిశీలించడం. శాస్త్రజ్ఞులు తక్కువగావుంటే, వారి సంఖ్యను ఎక్కువ చెయ్యడానికి మార్గాలనుసూచించడం

2. దేశసంపదను సక్రమంగా వినియోగించడానికి తగిన పథకములను తయారు చెయ్యడం

3. తయారు చేసిన పథకములను ఏ వరుసలో అమలు జరపవలసినది, నిర్ణయించడం

4. దేశ ఆర్థిక సౌష్టవానికి కంటకములుగా వున్న పరిస్థితులను గమనించి వాటిని తొలగించడానికి మార్గాలు చూపడం,

## కమిషన్ సభ్యులు

చైర్మను : జవహర్‌లాల్ నెహ్రూ

డిప్యూటి చైర్మను : గుల్జారిలాల్ నంద

సభ్యులు : వి. టి. కృష్ణమాచారి, చింతామణ్ దేశముఖ్, . ఎల్. మెహత, ఆర్. కె. పటేల్.

సెక్రటరి : ఎన్. ఆర్. పిళ్లే.

# బ్రిటిష్ రాజకుటుంబము

## ఎలిజబెత్ రాణి

జార్జి రాజు, ఎలిజబెత్ రాణుల ప్రథమ సంతానము. జననం, 1926 ఏప్రిల్ 21. ఇంగ్లండు సింహాసనమునకు వారసురాలు. గ్రీసు రాజ కుటుంబానికి చెందిన ప్రిన్సు ఫిలిప్‌తో, (ఎడింబరో ప్రభువు) ఈమెతో వివాహం 1947 నవంబరు 20 న జరిగింది. 1952 ఫిబ్రవరి 6 తేది న జార్జి రాజు మరణంతో, ఇంగ్లండు సింహాసనానికి రాణిఅయింది.

## మార్గరెట్ రోజ్ రాకుమారి

జార్జి రాజు, యెలిజబెత్ రాణుల రెండవ సంతానము. జననం. 1930 ఆగస్టు 21.

## ఎలిజబెత్ రాణి

స్ట్రాత్ మోరు ప్రభువు కుమార్తె. జననం 1900. ఆగస్టు 4. జార్జి రాజు యార్కు ప్రభువు హోదాలోనుండగా వివాహం. ఆయన ఆరవ జార్జిగా రాజరికము వహించుటతో రాణిహోదా.

## మేరి రాణి

అయిదవ జార్జిరాజు భార్య. జననం, 1867 మే 26. వివాహం 1893, జూలై 6. భర్త రాజరికమును పొందుటతో, 1919. మే 6, రాణి హోదా. భర్త్రుమరణము 1936 జనవరి 29.

## విండ్సర్ ప్రభువు

అయిదవ జార్జిరాజు, మేరిరాణిల జ్యేష్ఠపుత్రుడు. జననం 1894, జూన్ 23. తండ్రి జీవితకాలంలో వేల్సురాజు హోదా. రాజరిక స్వీకారము 1936 జనవరి 20, రాజ్యత్యాగము 1936 డిసెంబర్ 11, అప్పటినుంచీ విండ్సరు ప్రభువు అని వ్యవహారిక నామము వివాహం: వాలిస్ వార్‌ఫీల్డ్ సతితో, 1937 జూన్ 3. రాజ్యత్యాగానికి కారణం ఆమెను వివాహంచేసుకోదలచటమే. బహామాస్ దీవులకు గవర్నరుపదవి, 1940 ఆగస్టునుంచి 1945 మేవరకు. ప్రస్తుతం ఫ్రాన్సులో నివాసము.

## సివిల్ లిస్టు

రాణ్ణికీ ఆమె కుటుంబానికీ, ప్రతి సంవత్సరమూ గవర్నమెంటు యిచ్చే డబ్బును 'సివిల్ లిస్టు' అంటారు.

రాజుకి రాణికి (ఆమె పరివారానికీ రాజభవన పరిచారికులకు జీతాలూ, ఆమె యివ్వదలచుకునే విరాళాలూ కలిపి) 4,10,000 పౌనులు

| | |
|---|---|
| మేరి రాణి | 70,000 పౌనులు |
| గ్లస్టరు ప్రభువు | 35,000 పౌనులు |
| విక్టోరియా రాజకుమారి | 6,000 పౌనులు |
| ఎడింబరో ప్రభువు | 10,000 పౌనులు |

# స్వతంత్ర సంస్థానాలు

భరతఖండపు మొత్తం వైశాల్యం 15,31,410 చదరపు మైళ్ళలోనూ, దాదాపు సగం, 7,15,964 చదరపు మైళ్ళ భూమి 1947 ఆగస్టు 15 నాటికి సంస్థానాధీశుల పరిపాలనలో వుండేది. వీటిలో కొన్ని చాలా పెద్దవి; కొన్ని చాలా చిన్నవి మొత్తం సంస్థానాలు, 562.

అన్ని సంస్థానాలలోనూ ఎక్కువ వైశాల్యముగలది కాశ్మీరు (85,885 చ. మైళ్లు.) అన్నిటిలోనూ ఎక్కువ జనాభాగలది హైదరాబాదు (1,63,38,534) అన్ని సంస్థానాలలోనూ చిన్నది, బిల్బారి. దీని జనాభా 27 మంది. సంవత్సరాదాయం, 80 రూపాయలు.

ఈ సంస్థానాలన్నీ, తమ రాజ్యంలో సంపూర్ణ స్వతంత్ర పరిపాలన హక్కులుగల రాజుల అధీనంలో వుండేవి. వీరిలో కొంతమంది రాజులకు మహారాజు అనీ, కొంతమందికి రాజు అనీ బిరుదులు వున్నాయి. బ్రిటిషు వారు ఇచ్చిన హిజ్ హైనెస్ అనే బిరుదుగల రాజులుకూడా కొంత మంది వున్నారు.

ఈ రాజులలో ఎవరిహోదా పెద్దది, ఎవరిహోదాతక్కువది అనే విషయాన్ని వారి గౌరవార్థం కాల్చడానికి నిర్ణయింపబడిన ఫిరంగుల సంఖ్యనుబట్టి నిర్ణయించవచ్చును. ఈగౌరవం అందరు రాజులకూ జరుగదు. దేశంలోని 562 సంస్థానాలలోనూ, 149 సంస్థానాల రాజులకుమాత్రమే, యీ లాంఛనం జరుగుతుంది. అంటే, వీరు ఇండియాలోని ఏ ప్రాంతంలోకైనా వచ్చినట్లయితే, వీరి రాకను తెలియపరచడానికి వారి హోదానుబట్టి నిర్ణయింపబడినన్ని సార్లు ఫిరంగి కాల్పులు జరుగుతాయి. అయితే, యీఫిరంగులను కాల్చడానికి అయేఖర్చును, ఆసంస్థానాధిపతులే యిచ్చుకోవాలట. ఈ సంస్థానాధీశులలో ఎవరికీ 21 ఫిరంగులకంటె ఎక్కువ కాల్చేహోదా లేదు.

21 ఫిరంగులు లాంఛనంగల సంస్థానాధిపతులు : కాశ్మీరు మహారాజా, హైదరాబాదు నైజాం, మైసూరు మహారాజా, బరోడా గాయక్వార్, గ్వాలియర్ సింధియా.

19 ఫిరంగులు : భోపాల్ నవాబు, ఇండోర్ హోల్కార్, కలాట్ ఖాన్, కొల్హాపూర్ మహారాజా, తిరువాన్కూరు మహారాజా, ఉదయపూరు మహారాజా.

సంస్థానాలలో పరిపాలన, ఆ సంస్థానాధీశుల యిష్టప్రకారం జరుగుతూవుండేది. కొన్ని సంస్థానాలలో శాసనసభలువున్నాయి. కొన్నిటిలోలేవు. శాసనసభలువున్న సంస్థానాలలోకూడా, రాజు యిష్టప్రకారం శాసనసభలతో సంప్రతించకుండా నియమించబడిన దివానులకు పరిపాలనలో సంపూర్ణమైన అధికారం వుండేది.

భరతఖండం విభజనానంతరం, ఇండియా భూఖండంలోపలను, ఇండియాను అనుకొని వున్న సంస్థానాలు మొత్తం 544. వీటి వైశాల్యం 5,87,888 చ. మైళ్లు. జనాభా, దాదాపు 8,88,00,000.

1947 ఆగస్టు 15 వ తేదీవరకు, భారతదేశంలోని అన్ని సంస్థానాలు, బ్రిటిషురాజు సార్వభౌమత్వాన్ని అంగీకరించాయి. తమ తమ రాజ్యాలలో పరిపాలనకు సంపూర్ణాధికారాలు వున్నప్పటికీ, సంస్థానాధీశులు విదేశ వ్యవహారాలు, దేశరక్షణ విషయాలలో బ్రిటిషురాజు నియమించిన రెసిడెంట్ల సలహాప్రకారం ప్రవర్తిస్తూవుండేవారు. పోస్టు, టెలిగ్రాఫ్, రైళ్లు, రోడ్లు మొదలైన సదుపాయాల విషయంలో భారతదేశపు కేంద్రప్రభుత్వంతో ఒడంబడిక చేసుకొన్నారు. బ్రిటిషురాజు తరఫున సార్వభౌమత్వం చెలాయించే అధికారాలు, రాజప్రతినిధికి వుండేవి. సంస్థానాల వ్యవహారాలను పరిశీలించడానికీ, సంస్థానాధిపతులకు సలహాలను యివ్వడానికీ రాజప్రతినిధి అధికారానికి లోబడిన పొలిటికల్ డిపార్టుమెంటు ఒకటి ఏర్పాటుచేయబడింది.

ఏ సంస్థానాధిపతి అయినా, ప్రజలను మిక్కిలిగా హింసిస్తున్నా, మతిభ్రమణత్వాన్నిపొందినా, బ్రిటిషురాజు సార్వభౌమత్వాన్ని ధిక్కరించినా, అతన్ని పదభ్రష్టుని చేసి, అతని వారసుని సింహాసనమెక్కించడానికి బ్రిటిషురాజుతరఫున రాజప్రతినిధికి అధికారం వుండేది. చాలా సందర్భాలలో, రాజప్రతినిధి ఈ అధికారాన్ని చెలాయించాడుకూడాను.

సంస్థానం పెద్దదయితే ఒక్కొక్కదానికి ఒకడూ, చిన్నదయితే కొన్ని చిన్న సంస్థానాలకు కలిసి ఒకడూ, రెసిడెంటు ఆ సంస్థానాలలో కాపురంవుంటేవాడు. అతడి ఉద్యోగం ఏమిటంటే, సంస్థానాధిపతి ప్రవర్తనను ఒక కంట కనిపెడుతూ వుండడం; బ్రిటిషువారి ప్రయోజనాలకు విరుద్ధంగా, ఆ సంస్థానాధిపతి ఏమైనా చెయ్యబోయినట్లయితే, అతన్ని హెచ్చరించి, అలాటి పనులు జరగకుండా చూడడం. ఇదంతా ఇండియా స్వరాజ్యం పొందడానికి పూర్వ చరిత్ర.

1947 ఆగస్టు 15 వ తేదీన భారతదేశానికి స్వాతంత్ర్యం రావడంతో, స్వదేశసంస్థానాలమీద బ్రిటిషురాజుగారి సార్వభౌమాధికారం కూడా రద్దయింది.

అయితే, ఈ సంస్థానాలలో ప్రతిదీ సర్వస్వతంత్రమైపోతే, భారతదేశం ఇంకీ చిన్నాభిన్నమైపోవడమేగాక, దేశ రక్షణ, విదేశ వ్యవహారాలు మొదలైన వాట్లలో నానాచిక్కులు, కల్లోల పరిస్థితి ఏర్పడుతుందని గ్రహించి ప్రతి సంస్థానమూకూడా, తనకు సమీపంలో వున్న దానిలో ఏదో ఒక డొమినియను (ఇండియన్ డొమినియన్, పాకిస్తాన్ డొమినియన్)తో ఒడంబడిక చేసుకోవడం మంచిదని బ్రిటిషు ప్రభుత్వంవారూ, గవర్నరు-జనరల్ లార్డు మౌంట్‌బాటెన్ పదేపదే హెచ్చరించారు.

ఇండియన్ డొమినియన్ ప్రభుత్వపు సంస్థానశాఖామంత్రి సర్దారు వల్లభభాయ్ పటేల్, గవర్నరు-జనరల్ మౌంట్‌బాటెన్ ప్రభువు, సంస్థానాధిపతులతో జరిపిన సమాలోచనల ఫలితంగా చాలామంది సంస్థానాధిపులు ఇండియన్ డొమినియనుతో ఒడంబడిక చేసుకొని, ఒడంబడిక పత్రం (ఇన్‌స్ట్రుమెంట్ ఆఫ్ ఎక్సెషను)మీద సంతకాలు చేశారు.

ఇండియను డొమినియనుతో చేరిన సంస్థానాలలో, వాటి రాజులకు స్వపరిపాలన హక్కులు సంపూర్ణంగానే వుంటాయి. దేశరక్షణ, విదేశ వ్యవహారాలు, రవాణా సౌకర్యాలు—ఈ మూడింటి విషయాలలోనూ సంస్థానాల వ్యవహారాలుకూడా, ఇండియన్ డొమినియన్ చూస్తుంది. ఈ వ్యవహారాలకు సంబంధించిన విషయాలలో శాసనం చెయ్యడానికి, డొమినియన్ శాసనసభకు అధికారం ఇవ్వబడుతుంది. ఈ శాసనాలను, తన

సంస్థానంలో అమలుజరిపే బాధ్యత ఇండియన్ డొమినియన్‌తో కలిసిన సంస్థానాధిపతి వహిస్తాడు.

1947 ఆగస్టు 15 తరువాత, అతిశీఘ్రకాలంలోనే, సంస్థానాధీశులంతా తమ పరిస్థితిని గ్రహించుకొని, ఏదో ఒక డొమినియన్‌తో దృఢసంబంధం పెట్టుకోడానికి ఒడంబడికమీద సంతకంచేశారు. ఏ డొమినియన్‌తోనూ చేరకుండా హైదరాబాదు నైజాము, కాశ్మీరు మహారాజా మాత్రం జరిపారు. చివరకు కాశ్మీరు మహారాజు 1947 అక్టోబరు 27 న ఇండియాతో దృఢసంబంధపు ఒడంబడిక చేసుకొన్నాడు. (కాశ్మీరు, హైదరాబాదు సంస్థానాలను గురించి సంపూర్ణవివరాలను, ఆ సంస్థానాల పేర్లతోవున్న శీర్షికక్రింద, ప్రక్క పేజీలలో చూడండి.

హిందువులు అత్యధికసంఖ్యాకులుగాగల జునగఢ్ సంస్థానాధిపతి, తాను ముస్లిము అగుటచే, పాకిస్తాన్‌తో ఒడంబడిక చేసుకున్నాడు.

దానిపై ప్రజలు తిరుగుబాటు చెయ్యడమూ, నవాబు, అతని దివాను సంస్థానాన్ని వదలిపోవడమూ, 1948 ఫిబ్రవరిలో సంస్థానంలో జరిపిన రిఫరెండం ఫలితరంగా, సంస్థానాలలోని అధికసంఖ్యాకులైన ప్రజలు తమ సంస్థానం ఇండియాతో దృఢసంబంధం కలిగి వుండాలనే వాంఛను తెలియపరచడం జరిగింది. తరువాత, సౌరాష్ట్రరాజ్యాంగసభ యీ కోర్కెను ఆమోదింపడం జరిగింది. 1949 జనవరి 20 తేదిన జునగఢ్ సౌరాష్ట్ర రాజ్యంలో కలిపివేయబడింది.

చాలామంది సంస్థానాధీశులు - రాజకీయ సంస్కరణలకొరకు తమ ప్రజలుచేసే ఆందోళన గమనించీ, పరిపాలనా సౌకర్యానికి తమ సంస్థానాలను ప్రక్కనవున్న రాష్ట్రాలలో కలిపివేస్తే కలిగే ప్రయోజనాలను గమనించీ, తమ సంస్థానాలను ప్రక్కనవున్న రాష్ట్రాలలో కలిసి వెయ్యడానికి అంగీకరించారు.

ఈ అంగీకారంవల్ల, అత్‌గరు, అత్‌మలిక్, బమ్రా, బరాంబా, బుధ్, బోవాలో దాస్పాలా, ధెంకనాల్, గంగపూరు, హిందోళ్, కలాహండి, కుంజహారు, ఖండపరా, నరసింగపూరు, నయాఘరు, నీలగిరి,

పాల్‌లహారా, పాట్నా, రైరఖోల్, రణపూర్, సోనెపూర్, తల్చేర్, టిగిరియా అనే 23 సంస్థానాలు ఒరిస్సా రాష్ట్రంలో, 1948 జనవరి 1 తేదిన కలిపి వేయబడినవి. ఈ కలయికవల్ల ఒరిస్సా వైశాల్యం, 24,000 చ. మైళ్లు ఎక్కువయింది. ఈ సంస్థానాలన్నీ ఒరిస్సా రాష్ట్రంలో అను జిల్లాలుగా ఏర్పాటుచేయబడినవి. సుమారు 4,000 చ. మైళ్ళ వైశాల్యమూ, 9.90,000 జనాభాగల మయూర్‌భంజ్ సంస్థానం ఒరిస్సా రాష్ట్రంలో 1949 జనవరి 1 తేదిన కలిపి వేయబడింది.

ఇదేవిధంగా బస్తరు, చంగ్ భాకరు, ఛూయిఖదన్, జాష్‌పూరు, కంకేర్, కవర్ధా, ఖైరాఘరు, కొరియా, నంద్‌గామ్, శక్తి, సారంగరు, సుర్గుజా, ఉదయపూర్ అనే 14 సంస్థానాలు సెంట్రల్ ప్రావిన్సెస్‌లో 1949 జనవరి 1 తేదిన కలిపివేయబడినవి. ఈ కలయికవల్ల సెంట్రల్ ప్రావిన్సెసు రాష్ట్ర వైశాల్యం, 31,598 చ. మైళ్లు ఎక్కువైంది.

మద్రాసు రాష్ట్రంలోవున్న బంగనపల్లి సంస్థానం మద్రాసు రాష్ట్రంలోని కర్నూలుజిల్లాలో 1948 ఫిబ్రవరి 22 తేదిన కలిపివేయబడింది.

తిరుచినాపల్లి జిల్లాను అనుకొనివున్న పుదుక్కోట సంస్థానం, 1948 మార్చి 3 తేదిన మద్రాసురాష్ట్రంలో కలిసిపోయింది. 151 చ. మైళ్ళ వైశాల్యమూ. 15,800 జనాభాగల సాండూరు సంస్థాన మద్రాసు రాష్ట్రంలో, 1948 జులై 30 తేదిన కలిసిపోయింది. వీటివల్ల మద్రాసు రాష్ట్రపు వైశాల్యం 1602 మైళ్లు పెరిగింది.

దక్కన్‌లోవున్న, అక్కల్‌కోట, ఔంధ్, జాంఖండీ, జాత్, కురుంద్వాడ్ (జూనియర్) కురుంద్వాడ్ (సీనియర్), ముథోల్, ఫాల్టాన్ రామదుర్గ, సాంగ్లి, సావనూర్, సావంతవాడీ, వాడి, జహాగీర్ అనే 17 సంస్థానాలు మొత్తం 7,651 చ. మైళ్ళ వైశాల్యముగలవి 1948 మార్చి 8 తేదిన బొంబాయి రాష్ట్రంలో కలిసిపోయాయి.

తెహ్రీఘర్వాల్ సంస్థానం 1949 ఆగస్టు 1 తేదిన యునైటెడ్ ప్రావిన్సెస్‌లో కలిపివేయబడింది. బెనారెస్ సంస్థానం 1949 ఆగస్టు 15 తేదిన యునైటెడ్ ప్రావిన్సెసులో కలిపివేయబడింది.

1948 మే 18 తేదిన, సరైకెలా, ఖార్‌శ్వాన్ అనే సంస్థానాలు రెండూ, 623 చ. మైళ్లు వైశాల్యం గలవి, బీహారు రాష్ట్రంలో కలిసి పోయాయి.

1948 జూన్ 19 తేదిన, గుజరాత్ సంస్థానాలు అనే పేరుగల 157 సంస్థానాలు, మొత్తం 10,300 చ. మైళ్ళ వైశాల్యముగలవికూడా బొంబాయిరాష్ట్రంలో కలసిపోయాయి.

3,219 చ. మైళ్ళ వైశాల్యముగల కొల్హాపూరు సంస్థానం బొంబాయిరాష్ట్రంలో 1949 మార్చి 1 న కలిసింది. 8,235 చ. మైళ్ళ బరోడా కలయిక 1949 మే 1 న జరిగింది. ఈ కలయికవల్ల బొంబాయి రాష్ట్ర వైశాల్యం 1,21,848 చ. మైళ్లు అయింది.

తూర్పుపంజాబ్ రాష్ట్రంలోవున్న చంబ, సుకేత, భాగల్, బాగన్, బేజ్జ, సాంగ్రి, ధామి, కుమార్సేన్, కుతార్, ధారోద్ర అనే సంస్థానాల అధిపతులు, మొత్తం 11,900 చ. మైళ్లు వైశాల్యముగల తమ సంస్థానాలను కేంద్రప్రభుత్వ పరిపాలనకు అప్పగించివేశారు. ఈ ప్రాంతఅంతా, "హిమాచలప్రదేశ్" అనే పేరుతో, ఇండియాప్రభుత్వం నియమించిన లెఫ్టినెంట్ గవర్నరు పరిపాలనలో వుంటుంది. ఈ ప్రదేశానికి ప్రత్యేకంగా ఒక శాసనసభ ఏర్పాటు చేయబడుతుంది. ఇలా తమ సంస్థానాలను రాష్ట్రాలలో కలిపివేసిన సంస్థానాధీశులకు, వారి ఖర్చుల నిమిత్తం ప్రతిసంవత్సరం కొంతడబ్బు యివ్వబడుతుంది. వారి బిరుదులూ, హోదాలూ, మునుపటిలాగే వుంటాయి. వారి కుటుంబ సాంప్రదాయాన్ని అనుసరించి, వారి వారసులకుకూడా యిదే ఏర్పాటు చెయ్యబడుతుంది.

2818 చ. మైళ్ళ వైశాల్యముగల సిక్కిం సంస్థానపరిపాలనను 1949 జూన్ 7 తేదిన ఇండియాప్రభుత్వం స్వాధీనపరచుకొన్నారు. కూచ్‌బీహారు సంస్థాన పరిపాలనను ఇండియా ప్రభుత్వం, 1949 సెప్టెంబరు 12న స్వాధీనపరచుకొన్నారు. ఈ సంస్థాన వైశాల్యం 1318 చ. మైళ్లు. ఈ సంస్థానం, 1950 జనవరి 1 తేదిన పశ్చిమబెంగాల్ రాష్ట్రంలో కలిపి వేయబడింది.

## సంస్థానాల యూనియనులు

కొన్ని చిన్న సంస్థానాలు రాష్ట్రాలలో కలిసిపోతే, కొన్ని చిన్న సంస్థానాలూ కొన్ని పెద్ద సంస్థానాలూ కలిసి ఒకే సంయుక్త రాజ్యంగా ఏర్పడడానికి నిశ్చయించుకున్నాయి. ఇలా ఏర్పడినవాటిలో మొదటిది సౌరాష్ట్రరాజ్యం. ఇలా ఏర్పడిన సంస్థానాల యూనియనులన్నీ, 1950 జనవరి 26 నుంచీ ఇండియాలోని ఇతరరాష్ట్రాలతోపాటే పరిగణింపబడు తవి. అయితే రాష్ట్రాలపరిపాలన గవర్నరుల చేతిలోవుంటే, సంస్థానాల యూనియనులను పరిపాలన రాజప్రముఖులచేతిలో వుంటుంది.

ఒక్కొక్క యూనియనుగా ఏర్పడిన సంస్థానాల పరిపాలనకు ఒక కేంద్రప్రభుత్వం ఏర్పాటుచేయబడుతుంది. వీటిలో పెద్ద భాగాల సంస్థానాధీశులు ఒకమండలిగా ఏర్పడుతారు. వీరందరూ అయిదుసంవత్సరాలకు ఒక అధిపతిమండలిని ఎన్నుకొంటారు. ఈ అధిపతిమండలికి ఒక అధ్యక్షుడూ, ఒక ఉపాధ్యక్షుడూ వుంటారు. ఆ అధ్యక్షునికి రాజప్రముఖుడనీ, ఉపాధ్యక్షునికి ఉపరాజప్రముఖుడనీ పేరు. యూని యనులలో కలసిన సంస్థానాల అధిపతులు తమ రాజరికపు హక్కులను రాజప్రముఖునికి అప్పగించివేస్తారు. యూనియను పరిపాలన నిర్వహించ డంలో రాజప్రముఖునికి సలహాఇవ్వడానికి ఒక మంత్రిమండలి వుంటుంది. యీ మంత్రిమండలి సలహాప్రకారం, ఇండియాప్రభుత్వ సూచనలప్రకారం, యూనియను పరిపాలనను రాజప్రముఖుడు సాగిస్తాడు.

సంస్థానాలలోని సైన్యాలన్నిటినీ 1950 ఏప్రెల్ 1 తేదిన కేంద్ర ప్రభుత్వం తన అధీనంలోకి తీసుకున్నది.

సంస్థానాల యూనియనులు, ఇండియాలోని రాష్ట్రాలతో సమానం గానే పరిగణింపబడుతవి కనుక, వాటి వివరాలు వేరుగా రాష్ట్రాలతో పాటు ప్రత్యేక శీర్షికలక్రింద ఇవ్వబడినవి.

## ప్రీ వీ ప ర్సు

సంస్థానాధిపతులందరికీ తమ సంస్థానపు రాబడిలో నూటికి పది వంతులకు మించకుండా భృతిఇవ్వబడుతుంది. ఈ భృతి ఇంత అని

విర్ణయం జరిగినతరువాత, ఆసంస్థానాధిపతి జీవితకాలంలో దానిని హెచ్చించడంగాని తగ్గించడంగాని జరగదు. ప్రతిసంస్థానాధిపతీ, 1947 ఆగస్టు 15 నాటికి అతడు అనుభవిస్తూవున్న లాంఛనాలను, బిరుదులను హోదాలను ఇకముందుకూడా అనుభవిస్తాడు.

సంస్థానాధీశుల స్వంత ఖర్చులకోసం సంస్థానాదాయంలో నుంచి ఇచ్చేడబ్బును ప్రీవీపర్స్ అంటారు.

ఇండియాలో కలసిపోయినవాటన్నీ, యూనియన్లుగా ఏర్పడి నవాటన్నీ సంస్థానాల అధిపతులకు, ఆ సంస్థానాల ఆదాయంలో మొదటి లక్షలో నూటికి 15 వంతులున్నూ, తరువాత నాలుగు లక్షలలో నూటికి 10 వంతులున్నూ, ఆ పైనవచ్చే ఆదాయంలో నూటికి 7½ వంతులున్నూ ఇవ్వబడుతుంది. అయితే, ఏసంస్థానాధిపతికిన్నీ ఏడాదికి పదిలక్షలకు మించిన ప్రీవీపర్సు ఇవ్వబడదు.

కొంతమంది సంస్థానాధీశుల విషయంలోమాత్రం, పైనిబంధన వర్తించకుండా మినహాయింపు చెయ్యబడింది. అయితే యీ మినహాయింపు ఆయా సంస్థానాలలో ప్రస్తుతం పరిపాలనచేస్తున్న రాజుల జీవితకాలంలోనే వర్తిస్తుంది. వారి తదనంతరం వచ్చేవారికి ఇవ్వబడే ప్రీవీపర్సు గురించి, యిప్పటివరకు ఏమీ నిర్ణయింపబడలేదు.

ప్రస్తుతం అమలులోవున్న ఏర్పాటునుబట్టి, రాజులకు ఇవ్వబడే ప్రీవీపర్సు వివరాలివి:

| | |
|---|---|
| ఒరిస్సాలో కలిసిపోయిన సంస్థానాలన్నిటి రాజులకూ ఇచ్చే మొత్తం: | రు. 18,12,100 |
| బీహారులో కలిసిపోయిన సంస్థానాలు రెండిటి రాజులకూ ఇచ్చే మొత్తం: | రు. 1,21,900 |
| మధ్యప్రదేశ్‌లో కలిసిపోయిన సంస్థానాలన్నిటి రాజులకూ మొత్తం: | రు. 16,66,650 |
| పంజాబ్‌లో కలిసిపోయిన సంస్థానాల రాజులకు ఇచ్చే మొత్తం: | రు. 1,32,000 |

| | |
|---|---|
| బంగనపల్లి నవాబుకు | రు. 53,900 |
| పుదుకోట రాజుకు | రు. 2,66,500 |
| సాందూరు రాజుకు | రు. 90,000 |
| బరోడా గాయక్వార్ | రు. 10,00,000 |
| కొల్హాపూరు మహారాజు | రు. 10,00,000 |
| బొంబాయిలో కలిసిపోయిన సంస్థానాల రాజులకు (బరోడా, కొల్హాపూరులు మినహాగా) ఇచ్చే మొత్తం: | రు. 46,33,121 |
| తెహ్రి-గార్వాలు రాజుకు | రు. 6,00,000 |
| కాశీ మహారాజు | రు. 2,80,000 |
| రాంపూరు నవాబు | రు. 7,00,000 |
| కూచ్ బెహారు మహారాజు | రు. 8,50,000 |
| పాటియాల మహారాజు | రు. 17,00,000 |
| నాభా మహారాజు | రు. 4,10,000 |
| తిరువాంకూరు మహారాజు | రు. 18,00,000 |
| కొచ్చిన్ మహారాజు | రు. 2,35,000 |
| గ్వాలియరు మహారాజు | రు. 25,00,000 |
| ఇండోరు మహారాజు | రు. 15,00,000 |
| మధ్యభారత్‌లోని సంస్థానాల రాజులకు (గ్వాలియరు, ఇందోరు మినహాగా) | రు. 19,67,705 |
| ఉదయపూరు మహారాణా | రు. 10,00,000 |
| బికనీరు మహారాజు | రు. 17,00 000 |
| జోధ్‌పూరు మహారాజు | రు. 17,50,000 |
| జయపూరు మహారాజు | రు. 18,00,000 |
| కోటా మహారాజు | రు. 7,00,000 |
| రాజస్థాన్‌లో (పైచెప్పిన అయిదుగురు కాక) తక్కిన సంస్థానాల రాజులకు మొత్తం: | రు. 31,92,875 |
| నవనగరు మహారాజు | రు. 10,00,000 |
| భావనగరు మహారాజు | రు. 10,00,000 |

సౌరాష్ట్రంలో (పై యిద్దరు మహారాజులు కాక)
తక్కిన రాజులకు మొత్తం: రు. 49,26,443
(వీరిలో కటోడియా సంస్థానాధీశుడికి ఇచ్చేది రు. 192)

| | |
|---|---|
| హిమాచల ప్రదేశ్‌లోని రాజులకు మొత్తం | రు. 10,64,860 |
| భోపాలు నవాబు | రు. 11,00,000 |
| బిలాస్‌పూరు రాజు | రు. 70,000 |
| కచ్ రాజు | రు. 8,00,000 |
| త్రిపుర మహారాజు | రు. 3,30,000 |
| మణిపూరు మహారాజు | రు. 3,00,000 |
| రీవా మహారాజు | రు. 10,00,000 |
| వింధ్యప్రదేశ్‌లోని సంస్థానాల (రీవా మినహాగా) రాజులకు | రు. 12,75,600 |
| హైదరాబాదు నైజాముకు | రు. 50,00,000 |
| మైసూరు మహారాజు | రు. 26,00,000 |

## రాజవంశీకులకు పింఛనులు

బ్రిటీషు ప్రభుత్వంవారు లోబరచుకొన్న రాజుల వంశీకులకు యీ క్రింది పింఛనులు ఇవ్వబడుచున్నవని 1947 డిసెంబరు 3 తేదీన సర్దారు వల్లభ్‌భాయ్‌పటేలు కన్స్టిట్యూయెంట్ అసెంబ్లీలో చెప్పారు.

| | |
|---|---|
| కర్నాటక నవాబు వంశీకులకు: | రు. 1,88,200 |
| (ఆర్కాటు నవాబుకు యిచ్చే | రు. 1,50,000 కలిపి). |
| తంజావూరు రాజా వంశీకులకు: | రు. 19,000 |
| టిప్పూ సుల్తాను వంశీకులకు: | రు. 1,800 |
| అయోధ్య బేగం వంశీకులకు: | రు. 3,00,000 |
| నాగపూరు రాజు మనుమనికి: | రు. 50,000 |
| ఝాన్సీ రాజ వంశీకులకు: | రు. 81,500 |
| సూరత్ నవాబు వంశీకులకు: | రు. 62,000 |
| సతారా రాజా వంశీకులకు: | రు. 30,000 |
| మూర్షిదాబాదు నవాబుకు: | రు. 2,30,000 |

| | |
|---|---|
| అయోధ్యారాజ వంశీకులకు : | రు. 10,000 |
| ఖుర్దా రాజవంశీకులకు : | రు. 25,600 |
| మొగల్ చక్రవర్తుల వంశీకులకు : | రు. 30,000 |
| ఆఖరు మొగల్ చక్రవర్తి బహదూరుషా వంశీకునకు | రు. 120. |

ఇవన్నీ ఏడాదికి యిచ్చే మొత్తములు.

ఇండియాకు ప్రెసిడెంటుగా కొంతకాలం వుండి విరమించిన వ్యక్తికిని, తన పదవీపరిమితికాలం ముగిసిన తరువాత విరమించిన వ్యక్తికిని, ఏడాదికి రు. 15,000 పింఛను ఇవ్వబడుతుంది.

ఇండియాకు ఆఖరు గవర్నరు జనరల్‌గావున్న శ్రీ సి. రాజగోపాలాచారికి కూడా ఇదే పింఛను ఇవ్వబడుతుంది. అయితే, ఆయన మంత్రి పదవి నిర్వహిస్తూవున్నంతకాలమూ, మంత్రి పదవికివచ్చే జీతం తీసుకుంటూ వున్నారు కాని, గవర్నరు జనరల్ పదవికి వచ్చే పింఛను తీసుకోవడంలేదు.

## గవర్నరుల అలవెన్సులు

రాష్ట్రాల గవర్నరులకు ఇచ్చే జీతాలు కాక, యీ క్రింది అలవెన్సులు ఇవ్వబడుతవి.

ఉద్యోగ స్వీకారానికి రాష్ట్రానికి తన స్వస్థలంనుంచి రావడానికి అయేఖర్చులు, పదవీ పరిమితి అయినతరువాత తమ స్వస్థలం వెళ్ళడానికి అయేఖర్చులు, ఈ ఖర్చులు గవర్నరుకూ, ఆయనకుటుంబానికీకూడా ఇవ్వబడుతవి. గవర్నరు హోదాకు అవసరమైన దుస్తులు వగైరా కొనుక్కోవడానికిగాను, రు. 1600 ఇవ్వబడుతవి.

అద్దెలేకుండా నివాసగృహము, ప్రయాణం చెయ్యడానికి చార్జీలు లేకుండా రైల్వేసెలూన్, మోటారుకార్లు, స్టీములాంచీలు, విమానాలు మొదలైనవి గవర్నరుకు ఇవ్వబడుతవి.

ఒక గవర్నరు కొత్తగా ఒక రాష్ట్రాన్ని పరిపాలించడానికి వచ్చినప్పుడు, ఆయనకు ఇవ్వబడే వసతిగృహంలో తగిన అలంకరణములు చేసుకోడానికీ, తగిన కుర్చీలు బల్లలు మొదలైనవి అమర్చుకోడానికి, యీ క్రింద సూచింపబడిన మొత్తాలు ఇవ్వాలి.

| | |
|---|---|
| మద్రాసు గవర్నరు : | రు. 70,000 |
| బొంబాయి గవర్నరు : | రు. 1,13,000 |
| పశ్చిమబెంగాల్ గవర్నరు : | రు. 87,500 |
| ఉత్తరప్రదేశ్ గవర్నరు : | రు. 93,000 |
| పంజాబ్ గవర్నరు : | రు. 10,000 |
| బీహారు గవర్నరు : | రు. 50,900 |
| మధ్యప్రదేశ్ గవర్నరు : | రు. 30,500 |
| అస్సాం గవర్నరు : | రు. 40,000 |
| ఒరిస్సా గవర్నరు : | రు. 46,000 |

ఈ అలవెన్సులు, ఖాయపు గవర్నరులు కొత్తగా పదవి స్వీకరించినప్పుడు తప్ప, ఆక్టింగు గవర్నరులకు ఇచ్చేవికావు.

గవర్నరులు తమ వసతిగృహాలకు మరమ్మతులు చేయించుకోడానికీ, తమ పరివారాలకు జీతాలు యివ్వడానికీ యీ క్రింది పేర్కొన బడిన మొత్తాలకు మించకుండా ప్రతిసంవత్సరమూ ఖర్చుపెట్టవచ్చును. ఈ మొత్తములను రాష్ట్రఖజానానుంచి తీసుకోవచ్చును.

| | |
|---|---|
| మద్రాసు : | రు. 4,92,500 |
| బొంబాయి : | రు. 3,55,800 |
| పశ్చిమబెంగాల్ : | రు. 3,70,500 |
| ఉత్తరప్రదేశ్ ; | రు. 2,95,000 |
| పంజాబ్ : | రు. 1,79,900 |
| బీహార్ : | రు. 1,94,000 |
| మధ్యప్రదేశ్ : | రు. 1,55,500 |
| అస్సాం : | రు. 1,70,000 |
| ఒరిస్సా : | రు. 15,34,00 |

# ఇండియా రాష్ట్రాలు

ఆగస్టు 15 వ తేదివరకు భారతఖండం ఒకే రాజ్యంగా వున్నంత వరకు, స్వదేశ సంస్థానాలు మినహాగా, బ్రిటీషు పరిపాలనలోవున్న దేశంలో, గవర్నరుల పరిపాలనలోవున్న రాష్ట్రాలు పదకొండూ. కమిషనర్ల పరిపాలనలోవున్న చిన్న రాష్ట్రాలు నాలుగు వుండేవి.

1947 ఆగస్టు 15 వ తేదీన దేశానికి స్వరాజ్యం రావడంతోపాటు, స్వదేశ సంస్థానాలు మినహాగా మిగతాదేశం, ఇండియా, పాకిస్తాను అనే పేర్లతో రెండు డొమినియనులుగా ఏర్పడడంతో, తదనుకూలంగా రాష్ట్ర విభజనకూడా జరిగింది.

947 ఆగస్టు 15 వ తేదీ తరువాత ఇండియాలో వున్న రాష్ట్రాలు ఇవి:

అజ్మీరు-మార్వార, అస్సాం, ఒరిస్సా, కూర్గు, ఢిల్లీ, తూర్పు పంజాబ్, పశ్చిమబెంగాల్, బీహారు, బొంబాయి, మదరాసు, యునైటెడ్ ప్రావిన్సెసు, సెంట్రల్ ప్రావిన్సెసు.

1950 జనవరి 26 తేదీన నూతన రాజ్యాంగ విధానం అమలులోకి రావడంతో ఇండియాలోని రాష్ట్రాలసంఖ్య, రూపము కూడా మారింది. అంతవరకూ గవర్నరుల పరిపాలనలోవున్న రాష్ట్రాలతోపాటు,సంస్థానాలు కూడా ఇండియా ప్రభుత్వపాలనకు లోబడిన రాష్ట్రాలైపోయినవి. ఇదికాక, ఛీఫ్ కమిషనర్ల పాలనలోవున్న చిన్నరాష్ట్రాలు వున్నాయి. ఆయా రాష్ట్రాలు ఇవి:

## గవర్నరుల రాష్ట్రాలు:

1. అస్సాం, 2. ఉత్తర ప్రదేశ్ (పూర్వం యునైటెడ్ ప్రావిన్సెసు) 3. ఒరిస్సా, 4. పంజాబ్ (పూర్వం తూర్పు పంజాబ్), 5.

పశ్చిమ బెంగాల్, 6. బీహారు, 7. బొంబాయి, 8. మద్రాసు, 9. మధ్య ప్రదేశ్ (పూర్వం సెంట్రల్ ప్రావిన్సెసు).

రాజప్రముఖుల రాష్ట్రాలు :

1. కాశ్మీరు, 2. తిరువాంకూరు-కొచ్చిన్, 4. పాటియాల, తూర్పు పంజాబ్ సంస్థానాలు, 4. మధ్యభారత్, 5. మైసూరు, 6. రాజస్థాన్ 7. సౌరాష్ట్ర, 8. హైదరాబాదు.

కమిషనరు రాష్ట్రాలు :

1. అజ్మీరు, 2. అండమాన్ నికోబారు దీవులు, 3. కచ్, 4. కూర్గు, 5. ఢిల్లీ, 6. త్రిపుర, 7. భోపాల్, 8. మణిపూరు, 9. విలాస్‌పూరు, 10. వింధ్యప్రదేశ్, 11. హిమాచలప్రదేశ్, 12. సిక్కిం.

రాష్ట్రాలన్నిటిలోకీ ఎక్కువ వైశాల్యం గలది, మధ్యప్రదేశ్. తరువాత స్థానాలు వరుసగా రాజస్థాన్, మదరాసు, బొంబాయి, ఉత్తర ప్రదేశ్‌లకు చెందుతవి.

రాష్ట్రాలన్నిటిలోకీ ఎక్కువ జనాభాగలది, ఉత్తరప్రదేశ్, తరువాత స్థానాలు వరుసగా, మద్రాసు, బీహారు, బొంబాయి, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలకు చెందుతవి.

# అస్సాం

బర్మాదేశాన్ని ఆనుకొని, మనదేశానికి ఈశాన్యదిక్కున ఉన్న రాష్ట్రం. దీనివైశాల్యం, 54,084 చ. మైళ్ళు. జనాభా, 91,29,442. వీరిలో పురుషులు 48,69,868, స్త్రీలు, 42,59,564.

1874 వరకు అస్సాం రాష్ట్రం అనే ప్రత్యేకరాష్ట్రం లేదు. ఈ ప్రదేశమంతాకూడా బెంగాలు లెఫ్టినెంటు గవర్నరు పరిపాలనలో వుంచడం జరిగింది. అప్పటినుంచి 1921 వరకు ఇదే ఏర్పాటు అమలులో వుంది. 1921 లో ఈ రాష్ట్రానికి, మిగతా పెద్ద రాష్ట్రాలతో సమాన హోదా ఇవ్వబడింది. ప్రత్యేకం ఒక గవర్నరును నియమించడం జరిగింది.

ఈ రాష్ట్రంలో ప్రధానమైన ఆహారపు పంట బియ్యం. 1946–47 లో యీ రాష్ట్రంలో దాదాపు 101,000 టన్నుల వరిపంట పండింది. వ్యాపారపు పంటలలో ముఖ్యమైనవి : టీ, జనపనార, చెరకు.

రాష్ట్రంలోని కొండప్రాంతాలలో, పొట్టిపింజప్రత్తి పైరుకూడా విరివిగా చేయబడుతున్నది. అస్సాంరాష్ట్రంలో వానలు యెక్కువ. ఈ రాష్ట్రంలో కురిసినంత వాన, ఇండియాలోలోని మరొక రాష్ట్రంలో యెక్కడా కురవదు. చిరపంజి అనే ప్రదేశంలో, సంవత్సరానికి దాదాపు 500 అంగుళాలపైగా వాన కురుస్తుంది. ప్రపంచంలో, నేల తడి యెక్కువగా ఆకర్షించుకొంటున్నట్టి ప్రదేశాలలో చిరపంజి ఒకటి.

ఈ రాష్ట్రంలో ప్రవహించే ప్రధానమైననదులు బ్రహ్మపుత్ర, సుర్మా.

ఇక్కడ దొరికే ఖనిజాలలో వ్యాపారానికి ప్రస్తుతం త్రవ్వబడుతున్నవి, బొగ్గు, పెట్రోలు. 1946 లో 190 లక్షలు, 1947 లో 179 లక్షలు, 1948 లో 140 లక్షలు, గాలనుల పెట్రోలు యీ రాష్ట్రంలో దొరికింది.

నాగపర్వతాలలోను, లక్కీంపూరు జిల్లాలోను వున్న గనులలోనుంచి 1947 లో 3,22,942, టన్నుల బొగ్గు త్రవ్వబడింది, గారో కొండల ప్రాంతంలో కూడా చాలా బొగ్గు వున్నట్లు పరిశోధనలవల్ల తేలింది. పెట్రోలు లక్కీంపూరు, కచారు జిల్లాలలో తీస్తున్నారు.

ప్రజలలో నూటికి 43 వంతులమంది బెంగాలీ భాషను, 21 వంతులమంది అస్సాం భాషను మాట్లాడుతున్నట్లు, 1941 జనాభా లెఖలవల్ల తెలుస్తున్నది. మిగతా ప్రజలు, హిందీ, ఒరియా, ముండారి, నేపాళీ భాషలను, టిబెటు–బర్మా భాషల సంకరభాషను మాట్లాడుతున్నారు.

కలకత్తానుంచి షిల్లాంగువరకు ప్రధాన రైలుదారివుంది. ఇదికాక, అస్సాములో రెండు మూడు చిన్న లైనులుకూడా వున్నాయి.

అస్సాంలో సిల్కు, నూలు, వస్త్రాల నేతపరిశ్రమ పెద్ద గృహ పరిశ్రమలలో ఒకటి. నేత అంతా, యెక్కువగా స్త్రీలే చేస్తారు. ఇటీవల, మిల్లుబట్టల దిగుమతివల్ల, చేనేతపరిశ్రమ చాలావరకు దెబ్బ తిన్నప్పటికీ, ఈ పరిశ్రమకు తగిన ప్రోత్సాహం ఇవ్వడానికి ప్రభుత్వం తీవ్రకృషి చేస్తున్నది.

పడవలు కట్టడం, ఇత్తడి, మట్టి పాత్రలను తయారుచెయ్యడం కూడా, ఈ రాష్ట్రంలోని ప్రధాన పరిశ్రమలలో చెప్పదగినవే, అయితే రాష్ట్రప్రజలలో నూటికి 80 మంతులు, కేవలం వ్యవసాయం మీద ఆధారపడినవాళ్లే.

ఈరాష్ట్రానికి లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిలు (రెండుశాసనసభలు) వుండేవి. కాని, కౌన్సిలు 1947 ఆగస్టు 15 తరువాత రద్దుచేయబడింది.

రాజధాని : షిల్లాంగ్

గవర్నరు : జయరాందాస్ దౌలత్ రాం

పదవీ స్వీకారం: 1950 మే.

జీతం : రు.5,500. (ఇన్ కంటాక్సుపోను రు. 3,000)

## పార్లమెంటు సభ్యులు

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకి యెన్నుకోబడే సభ్యులసంఖ్య 12. వీరిలో ఒకరు షెడ్యూల్డు కులాల ప్రతినిధి, ఇద్దరు షెడ్యూల్డు కొండజాతుల ప్రతినిధులూ వుంటారు.

ఎన్నికలలో మొత్తం 12 స్థానాలకూ 40 మంది అభ్యర్థులు పోటీ చేశారు.

## శాసనసభ

ఈ రాష్ట్రానికి అసెంబ్లీమాత్రమే వుంది. అసెంబ్లీ మొత్తం సభ్యత్వం : 108.

వీటిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకింపబడిన స్థానాలు: 5

షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకింపబడిన స్థానాలు : 26

రాష్ట్ర శాసనసభ ఎన్నికలలో మొత్తం 108 స్థానాలలోనూ ఒక స్థానానికి కాంగ్రెసు అభ్యర్థి పోటీలేకుండా ఎన్నుకోబడినాడు. తక్కిన 107 స్థానాలకూ 457 మంది అభ్యర్థులు పోటీచేశారు.

రాష్ట్ర శాసనసభలో పార్టీబలం : కాంగ్రెసు, 82; సోషలిస్టు, 5; ప్రజాపార్టీ, 2; కమ్యూనిస్టు, 1; ఇతరులు, 5, స్వతంత్రులు, 10.

స్పీకరు : కులాధర్ చలీహా

డిప్యూటీ స్పీకరు : రాజేంద్ర బారువ

మంత్రిమండలి :

పదవీస్వీకారం : 25 ఫిబ్రవరి 1952.

ప్రధానమంత్రి, హోం, ఉద్యోగాలు, కొండ జాతుల క్షేమపరిశీలన : విష్ణురాం మేధి
ఆర్థికమంత్రి, రెవిన్యూ : మోతీరాం బోరా
పబ్లిక్ వర్క్సు మంత్రి : సిద్ధినాథ్ శర్మ
విద్యామంత్రి, కార్మికులు : ఓమియోకుమార్ దాస్
ఆహారమంత్రి, వ్యవసాయం : మహేంద్రమోహన్ చౌధురి
పరిశ్రమల మంత్రి : వైద్యనాథ ముఖర్జి
ఆరోగ్య మంత్రి, న్యాయశాఖ : రూపనాథ బ్రహ్మ
అటవీ మంత్రి : రామనాథదాస్
ఎక్సైజు మంత్రి, జైళ్ళశాఖ : రెవరెండ్ జె. ఎం. నికొల్సరాయ్
స్థానిక పరిపాలన మంత్రి : అబ్దుల్ మతిలిబ్ మజుందార్
డిప్యూటీ మంత్రులు :
రెవిన్యూ : హరేశ్వర్ దాస్
విద్య, కార్మికులు : పూర్ణానంద చేటియా

25

మంత్రుల జీతాలు : ప్రధాని, రు. 1,500. ఇతరులకు రు. 1000. ఇదిగాక అందరికీ తలకొక రు. 250 ఇంటి అద్దె. రు. 250 కారు అలవెన్సు ఇవ్వబడుతుంది.

బడ్జెటు

1952-53 సంవత్సరానికి బడ్జెటును, శాసనసభలో 1952 మార్చి 10 తేదిన, ఆర్థికశాఖామంత్రి మోతీరాం బోరా ప్రవేశపెట్టాడు. ఆ బడ్జెటు వివరాలివి.

| | | |
|---|---|---|
| 1952-53 లో వస్తుందని అంచనా వేసిన ఆదాయం | ... | రు. 10,05,43,000 |
| 1952-53 లో అవుతుందని అంచనా వేసిన ఖర్చు | ... | రు. 12,60,08,000 |
| లోటు | ... | రు. 2,54,65,000 |

# ఉత్తర ప్రదేశ్

ఉత్తర హిందూదేశపు కొనభాగంలోవున్న పెద్దరాష్ట్రం ఇది. 1950 జనవరి 26 పూర్వం ఈ రాష్ట్రం యునైటెడ్ ప్రావిన్సెసు అని పిలువబడేది. దేశంలోనిరాష్ట్రాలన్నిటిలోనూ ఎక్కువ జనాభాగలరాష్ట్రం ఇదే. దీని వైశాల్యం : 1,12,523 చదరపు మైళ్లు. జనాభా, 6,32,54,118; పురుషులు, 3,31,42,457; స్త్రీలు, 3,01,11,661; రాష్ట్రంలో మాట్లాడే భాషలు హిందీ, ఉర్దూలు.

గంగా, యమునా, గోగ్రా నదులు ఈ రాష్ట్రంలోనుంచి ప్రవహించడంవల్ల, ఈనదులు ప్రవహించే భాగం చాలా సారవంతమైనది. రాష్ట్రంలోని ప్రజలలో నూటికి 71 వంతులు వ్యవసాయంమీద ఆధారపడి జీవించేవారే. మరొక ఎనిమిది వంతులు, వ్యవసాయంవల్ల ఆదాయం కలవారు. ఇక్కడ పండే పంటలలో ప్రధానమైనవి, బియ్యం, రాగులు, మొక్కజొన్న, అవిసె, ఆవాలు, ప్రత్తి, గోధుమ, బార్లీ, చెరకు, పప్పుదినుసులు, బంగాళాదుంపలు.

ఈ రాష్ట్రంలో ప్రధానమైన పరిశ్రమకేంద్రం, కాన్పూరు. ఇక్కడ తోళ్ళను వూనే ఫ్యాక్టరీలు, నూనె మిల్లులు, వూలు మిల్లులు వున్నాయి. యాంత్రపరిశ్రమలలో ఈ రాష్ట్రం, పెద్ద అభివృద్ధికి ఏమీ రాలేదుగాని, గృహపరిశ్రమల విషయంలోమాత్రం చెప్పదగిన ప్రాధాన్యతను వహించింది. గాజు పరిశ్రమలో యీరాష్ట్రం, ఇండియాలో ప్రధాన స్థానాన్ని పొందుతుంది.

గవర్నరు : కె. ఎం. మున్షి.

పదవిస్వీకారం : 2 జూన్ 1952.

జీతం : రూ. 5,500,

## పార్లమెంటు సభ్యులు

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకి 86 మంది సభ్యులు ఎన్నుకోబడతారు. వీరిలో 17 మంది, షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు. ఎన్నికలలో మొత్తం 86 స్థానాలకూ 364 మంది అభ్యర్థులు పోటీచేశారు.

## రాష్ట్ర శాసనసభ

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీ, లెజిస్లేటివ్ కౌన్సిలూ, వున్నాయి.

అసెంబ్లీ సభ్యత్వపు సంఖ్య మొత్తం : 430. వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోనబడినవారు 81. అసెంబ్లీ ఎన్నికలలో మొత్తం 430 స్థానాలకూ, 2,584 మంది అభ్యర్థులు పోటీ చేశారు.

రాష్ట్రశాసనసభలో పార్టీలబలం :

కాంగ్రెసు, 390, సోషలిస్టులు, 18, స్వతంత్రులు, 14, జనసంఘు, 2, యు. పి. ప్రజాపార్టీ, 2, కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ, 1, హిందూమహాసభ, 1, యు. పి. రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, 1.

స్పీకరు : ఎ. జి. ఖేర్

డిప్యూటీ స్పీకరు : హరగోవింద్ పంత్

కౌన్సిల్ చైర్మన్ : చందర్ భాల్

డిప్యూటీచైర్మన్ . నజీముద్దీన్

శాసనసభ్యుల జీతములు : నెలకు రు. 200, సభకు హాజరైన రోజుకి రు. 10 అలవెన్సు.

## మంత్రి మండలి

పదవీ స్వీకారం: 20 మే, 1952.

| | |
|---|---|
| ముఖ్యమంత్రి : | |
| ప్లానింగ్ | గోవింద వల్లభపంత్ |
| ఆర్థిక మంత్రి : | హఫీజ్ మహమద్ ఇబ్రహిం |
| హోంమంత్రి : | |
| కార్మికులు | సంపూర్ణానంద |
| పరిశ్రమలమంత్రి : | హుకుంసింగ్ |
| పబ్లిక్ వర్క్సు మంత్రి : | గిరిధారిలాల్ |
| ఆహారమంత్రి : | చంద్రభాన్ గుప్త |
| రెవిన్యూమంత్రి : | చరణ్ సింగ్ |
| న్యాయమంత్రి : | అలీజహీర్ |
| విద్యామంత్రి : | హరగోవిందసింగ్ |
| స్థానిక పరిపాలన మంత్రి : | మోహన్‌లాల్ గౌతమ్ |
| ప్రచురణశాఖ మంత్రి : | కమలాపతి త్రిపాఠి |
| రవాణామంత్రి : | వి. ఎన్. శర్మ |

మంత్రులజీతాలు : నెలకు రు. 1,200 (ఇన్‌కంటాక్సు లేకుండా), ఉచిత గృహవసతి, కారు.

డిప్యూటీమంత్రులకు : నెలకు రు. 750, ఇంటి అద్దె, రు. 100 కారు అలవెన్సు, రు. 150.

బడ్జెటు

1952-53 సంవత్సరానికి బడ్జెటును, 1952 మార్చి 14 తేదీన శాసన సభలో ముఖ్యమంత్రి పండిట్ పంత్ ప్రవేశపెట్టారు. ఆ బడ్జెట్ వివరాలివి :

| | |
|---|---|
| 1952-53 లో రాగలదని అంచనా వేసిన ఆదాయం | ... రు. 62,54,90,000 |
| 1952-53 లో అవుతుందని అంచనా వేసిన ఖర్చు | ... రు. 63,01,73,000 |
| లోటు అచంనా | ... రు. 46,83,000 |

# ఒరిస్సా

ఒరిస్సారాష్ట్రం నిర్మాణం 1937 ఏప్రిల్ 1 వ తేదీన జరిగింది. అంతకు పూర్వం, ఒరియాభాష మాట్లాడే ప్రజలు గల భాగం కొంత బీహారు రాష్ట్రంలోను, కొంత సెంట్రల్ ప్రావిన్సెసులోను, కొంత మదరాసు రాష్ట్రంలోను వుండేది.

ఒరియా ప్రజలు చాలా కాలం ఆందోళన చేసినతరువాత, 1903 లో కేంద్ర ప్రభుత్వంవారు, ఒరియాభాష మాట్లాడే ప్రజలుగల ప్రాంతాన్ని అంతనూ ఒకే పరిపాలనగలిగి వుండేటట్టు చెయ్యడం ధర్మమేనని అంగీకరించారు. తరువాత 1912 లో, బెంగాలు రాష్ట్రంలో చేరివున్న ఒరియా జిల్లాలను విడదీసి బీహారుతో కలిపి, బీహారు - ఒరిస్సా అనే రాష్ట్రంగా ఏర్పాటు చేయడంజరిగింది. కాని, అప్పటికీ ఒరియా ప్రజలు పూరుకోక, తమ దేశం ఒక స్వపరిపాలనగల రాష్ట్రంగా ఏర్పడాలని ఆందోళన చేస్తూనే వచ్చారు. తరువాత, 1927 లో సైమను కమిషను వారు వచ్చినప్పుడు ఒరియా నాయకులు తమకు ప్రత్యేక రాష్ట్రం కావాలని కోరారు. ఆ తరువాత, రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సు జరిగినప్పుడు, ఒరిస్సారాష్ట్ర నిర్మాణం జరగాలని, పర్లాకిమిడి మహారాజా

ఒక నివేదికను సమర్పించారు. ఒరిస్సా సరిహద్దులను నిర్ణయించడానికి, దాని ఆర్థిక స్వాతంత్ర్యాన్ని గురించి నివేదిక తయారుచెయ్యడానికి 1931 సెప్టెంబరులో కేంద్రప్రభుత్వంవారు ఓడెనెల్ కమిటీని నియమించారు. ఈ కమిటీ సూచనల ప్రకారం, ఒరిస్సా రాష్ట్ర నిర్మాణం జరిగింది.

ఒరిస్సారాష్ట్రపు వైశాల్యం (ఒరియా సంస్థానాలతో సహా) 59,869 చదరపు మైళ్లు. జనాభా 1,46,45,946. పురుషులు 72,40,008, స్త్రీలు 74,04,285. రాష్ట్రజనాభాలో మూడవవంతుకు పైగా షెడ్యూల్డు జాతులు, కొండజాతులకు చెందినవారని 1951 జనాభా లెఖల ప్రకారం తేలింది. వీరిలో షెడ్యూల్డుకులాలవారు 28,30,763 మందిఅనీ, షెడ్యూల్డు కొండ జాతులకు చెందినవారు 29,67,334 మంది. రాజధాని భువనేశ్వర్. వేసవిలో గవర్నరువుండేనగరం : పూరి (జగన్నాథం)

వ్యవసాయకంగానూ, పారిశ్రామికంగానూ ఒరిస్సా చాల వెనుకబడ్డ రాష్ట్రం. ఒరిస్సాలో ప్రధానమైన వ్యాపార పంటలు : చెరకు, జనపనార. చేపలుపట్టడం ఒరిస్సాలో ఒక పెద్ద పరిశ్రమ. చిలకసరస్సు నుంచీ, పూరివద్ద సముద్రంలోనూ, ఏడాదికి 59,000 మణుగుల చేపల్ని పట్టి కలకత్తాకు పంపుతారు. గృహపరిశ్రమలో, చేనేత, కంచుపాత్రలు చెయ్యడము, ఇత్తడి పాత్రలుచెయ్యడం, ముఖ్యమైనవి. రాష్ట్రంలో 12,695 చ. మైళ్ళ అడవివుంది.

ఒరిస్సాలో దొరికే ముఖ్యమైన ఖనిజములు : ఇనుము, బొగ్గు, సున్నపురాయి, మెంగనీసు, అభ్రకము.

ప్రజలలో 68,32,706 మంది హిందువులు : 1,46,301 మంది ముస్లిములు.

గవర్నర్ : సయ్యద్ ఫజల్ అలి.

పదవీస్వీకారం : 7 జూన్, 1952.

జీతం : రు. 5,500

## పార్లమెంటు సభ్యత్వం

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకి ఎన్నుకోబడే సభ్యుల సంఖ్య మొత్తం : 20. వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడిన వారు : 3. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు : 4.

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకు జరిగిన ఎన్నికలలో, మొత్తం 20 స్థానాలలోనూ, రాయగడ - ఫుల్‌బాణీ నియోజకవర్గంనుంచి కాంగ్రెసు అభ్యర్థి టి. సంగన్న పోటీలేకుండా ఎన్నుకోబడినారు. తక్కిన 19 స్థానాలకూ 58 మంది పోటీ చేశారు. వారిలో 18 మంది కాంగ్రెసు, గణతంత్ర, 10, సోషలిస్టు, 10, కమ్యూనిస్టు, 4, స్వతంత్రులు, 12, ఆదివాసి మహాసభ, 1, ప్రజాపార్టీ, 2.

## శాసనసభ

ఈ రాష్ట్రానికి లెజిస్లేటివ్ అసెంబ్లీమాత్రం వుంది. అసెంబ్లీ మొత్తం సభ్యత్వం : 140. వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడిన వారు 20 : షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు : 28.

రాష్ట్రశాసన సభకు ఎన్నికలు 1951 డిసెంబరు 10, 1952 జనవరి 24 తేదిల మధ్యజరిగాయి. మొత్తం 140 స్థానాలలోనూ, అయిదు స్థానాలకు కాంగ్రెసు ప్రతినిధులు పోటీ లేకుండా ఎన్నుకోబడినారు. ఒక స్థానానికి అభ్యర్థుల నామినేషనులు అన్నీ నిరాకరింపబడినందున, (ఝంజార్ జిల్లాలో అనంతపూర్), ఆస్థానానికి ఎన్నికలు వాయిదా వేయబడినవి. తక్కిన 134 స్థానాలకూ మొత్తం 519 మంది అభ్యర్థులు పోటీ చేశారు. వీరిలో 129 మంది కాంగ్రెసు, 77 సోషలిస్టు 53 గణతంత్ర పార్టీ, 31 కమ్యూనిస్టు, ప్రజాపార్టీ ఇండిపెండెంట్ పీపుల్సుపార్టీ కలసి. 10, ఫార్వర్డుబ్లాక్ 4, స్వతంత్రులు 186.

నారంగపూర్ నియోజకవర్గంనుంచి, షెడ్యూల్డు కొండజాతుల స్థానానికి కాంగ్రెసు అభ్యర్థి ముడినాయక్‌తో పోటీలేకుండా యెన్నికో బడినారు.

రాష్ట్రశాసనసభలో పార్టీబలం :

కాంగ్రెసు 68, సోషలిస్టు 10, కమ్యూనిస్టు 7, గణతంత్ర 31, ఇతరులు, 5, స్వతంత్రులు, 19.

శాసనసభ్యుల జీతాలు నెలకు రు. 150.

స్పీకరు : నందకిశోర్‌దాస్

డిప్యూటీ స్పీకరు : మహమ్మద్ హనీఫ్

మంత్రిమండలి : పదవీస్వీకారం : 20 ఫిబ్రవరి 1952

| | |
|---|---|
| ప్రధాని<br>హోం, ఆర్థికశాఖ | నవకృష్ణ చౌధురి |
| రెవిన్యూమంత్రి : | సదాశివ త్రిపాఠి |
| ఆరోగ్యమంత్రి :<br>న్యాయశాఖ, | దీన బంధు సాహు |
| పరిశ్రమలమంత్రి : | కిశోర్‌చంద్రదేవ్ భంజ్ |
| కార్మికమంత్రి వాణిజ్యం,<br>కొండజాతులక్షేమం | సోనారాం సోరెన్ |
| ఆర్థికమంత్రి, విద్య | రాధానాథ్ రథ్ |

డిప్యూటీమంత్రులు : కృపానిధి నాయక్, తీర్థవాసి ప్రధాన్, శ్రీమతి వసంత మంజరి, భైరవ్ చంద్ర మహంతి, నీలమణి రౌత్రే, అనూపసింగ్ దేవ్, ఖరియార్ జమీందార్, సంతాను కుమార్‌దాస్.

మంత్రుల జీతాలు . నెలకు రు. 1000.

డిప్యూటి మంత్రులకు నెలకు రు. 750.

## బడ్జెటు

1952-53 సంవత్సరానికి బడ్జెటును, 1952 మార్చి 13 తేదిన ప్రధాని నవకృష్ణచౌధురి ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి :

1952-53 లో రాగలదని అంచనావేసిన

| | | |
|---|---|---|
| ఆదాయం | ... | రు. 11,78,07,000 |
| వ్యయం (అంచనా) | ... | రు. 12,06,91,000 |
| లోటు | ... | రు. 28,84,000 |

# పంజాబ్

పంజాబ్ అంటే పంచ నదుల దేశం అని అర్థం. జీలం, చినాబ్, రవి, బియాస్, సట్లెజ్ నదులు అయిదూ ఈ ప్రాంతాన్ని పరివేష్టించీ, యీ ప్రాంతంలోంచి ప్రవహిస్తూనూ, ఉన్నాయి. అందు చేతనే, దీనికి ఆ పేరు వచ్చింది.

రాష్ట్రంలోని ప్రజలలో నూటికి 65 వంతులు తమ జీవితానికి వ్యవసాయంమీద ఆధారపడుతున్నారు. ఈ రాష్ట్రంలో పండే పంటలలో ప్రధానమైనది గోధుమ. తరువాత చెప్పదగినవి, బార్లీ, బియ్యం, రాగులు, మొక్కజొన్న, ప్రత్తి, చెరకు.

పంజాబులోని ప్రధాన పరిశ్రమ, చేనేత. దుప్పట్లు, ఫూలురగ్గులు ఇక్కడ విస్తారంగా తయారుచేయబడుతవి. పట్టు పరిశ్రమకూడా చాలా ఎక్కువగా అభివృద్ధిపొందుతోంది. నూది ఏకే మిల్లులు రాష్ట్రంలో చాలా వున్నాయి.

దేశవిభజనతోపాటు 1947 ఆగస్టు 15 వ తేదీనాటికి తాత్కాలికంగా రాష్ట్రాన్ని రెండుభాగాలు చేస్తూ, తూర్పు పంజాబ్, పశ్చిమ పంజాబ్ అనే పేర్లతో రెండు రాష్ట్రాలకూ చెరిఒక గవర్నరుని నియమించడం, రెండురాష్ట్రాలకు వేరువేరుగా మంత్రివర్గాలను ఏర్పాటు చెయ్యడం జరిగింది. రెండు రాష్ట్రాలకు వేరువేరుగా హైకోర్టులు, యూని

వర్సిటీలు ఏర్పాటు చెయ్యబడినవి. ఇండియాలోని పంజాబ్, తూర్పు పంజాబ్ అని 1950 జనవరి 26 వరకూ వ్యవహరింపబడింది. తరువాత పంజాబ్ అని వ్యవహరింపబడుతున్నది.

పంజాబ్ వైశాల్యం 37,428 చ. మైళ్లు. జనాభా 1,26,38,611; పురుషులు, 67,80,770 ; స్త్రీలు, 58,57,841.

పంజాబ్ రాష్ట్రానికి రాజధానిని చండీఘర్‌లో క్రొత్తగా నిర్మించడానికి ప్రభుత్వంవారు నిశ్చయించారు. ప్రస్తుతం ప్రభుత్వం శీతకాలంలో జలంధర్‌లోనూ, ఎండకాలంలో సిమ్లాలోను వుంటున్నది.

గవర్నర్ : చందూలాల్ మాధవలాల్ త్రివేది.
పదవీస్వీకారం . 15 ఆగస్టు 1947.
జీతం : రు. 5,500.

పార్లమెంటు సభ్యత్వం :

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకి ఎన్నుకోబడే సభ్యుల సంఖ్య మొత్తం : 18. వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాల నుంచి ఎన్నుకోబడినవారు: 3. పార్లమెంటులోని 18 స్థానాలకూ ఎన్నికలలో మొత్తం 99 మంది పోటీ చేశారు.

శాసనసభ

ఈ రాష్ట్రానికి లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిలు వున్నాయి. అసెంబ్లీ సభ్యులసంఖ్య మొత్తం : 126. వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు : 20.

ఈ రాష్ట్రంలో, రాష్ట్రశాసనసభకూ, పార్లమెంటుకూ ఎన్నికలు 1951 డిసెంబరు 26 తేదిన ప్రారంభమయాయి. 1952 జనవరి 21 న పూర్తి అయాయి.

రాష్ట్రశాసన సభలోని 126 స్థానాలలోనూ ఒక స్థానానికి పోటీలేకుండా కాంగ్రెసు అభ్యర్థి ఎన్నుకోబడినందున, ఎన్నికలు 125

స్థానాలకే జరిగాయి. మొత్తం 837 మంది అభ్యర్థులు పోటీచేశారు. వారిలో 511 మంది డిపాజిట్లు పోగొట్టుకున్నారు.

రాష్ట్రశాసన సభలో పార్టీల బలం :

కాంగ్రెసు, 100; అకాలీలు, 13; కమ్యూనిస్టులు, 5; జనసంఘ్ లీగ్, 2; ఫార్వర్డ్ బ్లాక్, 1; లాల్ కమ్యూనిస్టులు, 1; స్వతంత్రులు, 4.

స్పీకరు : డాక్టర్: సత్యపాల్
డిప్యూటీ స్పీకరు : సర్దార్ గురుదయాళ్ సింగ్ థిల్లాన్
కౌన్సిల్ ఛైర్మను : సర్దార్ కపూర్ సింగ్
డిప్యూటీ ఛైర్మను : మిస్ వి. జి. ఖాన్

## మంత్రి మండలి

| | |
|---|---|
| ముఖ్యమంత్రి : న్యాయశాఖ, జైళ్లు | భీమసేన్ సచార్ |
| రెవిన్యూమంత్రి : డెవలప్ మెంట్, అడవులు, వ్యవసాయం | సర్దార్ ప్రతాప్ సింగ్ కైరాన్ |
| పబ్లిక్ వర్క్స్ మంత్రి : | చౌధురి లాహిరిసింగ్ |
| ఆర్థికమంత్రి : | సర్దార్ ఉజ్జల్ సింగ్ |
| ఆహారమంత్రి స్థానికపరిపాలన | పండిట్ శ్రీరాంశర్మ |
| విద్యామంత్రి ఆరోగ్యము, రవాణా | లాలా జగత్ నారాయణ్ |
| కార్మికమంత్రి : | చౌధురి సుందర్ సింగ్ |

మంత్రుల జీతాలు : ప్రధానికి నెలకు రు. 1,500. ఇతరులకు నెలకు 1250. అదనంగా అందరికీ నెలకు రు. 300 అలవెన్సు. ఉచిత గృహవసతి.

బడ్జెట్

పంజాబ్ రాష్ట్రానికి 1952-53 బడ్జెటును, 1952 మార్చి 15 తేదిన, కేంద్ర ప్రభుత్వ ఆర్థికమంత్రి సి. డి. దేశముఖ్, పార్లమెంటులో ప్రవేశపెట్టారు. దీనికి కారణం, అప్పుడు రాష్ట్రపరిపాలన ప్రెసిడెంటు తరఫున గవర్నర్ సాగిస్తూ వుండటమే.

ఆ బడ్జెట్ వివరాలివి.

| | | |
|---|---|---|
| 1952-53 లో వస్తుందని అంచనా వేసిన ఆదాయం | ... | రు. 16,71,00,000 |
| 1952-53 లో అవుతుందని అంచనా వేసిన ఖర్చు | ... | రు. 16,70,00,000 |
| లోటు అంచనా | ... | రు. 1,00,000 |

# పశ్చిమ బెంగాల్

1947 జూన్ 3 వ తేదిన బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించిన విభజన సూత్రం ప్రకారం, బెంగాల్ రాష్ట్రం, పశ్చిమ, తూర్పు బెంగాల్ రాష్ట్రాలుగా విభజించబడింది.

విభజనకు పూర్వం బెంగాల్ రాష్ట్రపు వైశాల్యం : 77,442 చ. మైళ్లు. జనాభా. 6,03,06,525. వీరిలో నూటికి 54 వంతులు ముస్లిములు, 42 వంతులు హిందువులు. నూటికి 92 వంతులు బెంగాలీభాషను మాట్లాడుతారు. మిగతావారు హిందీ, ఉర్దూలను మాట్లాడుతారు.

జనాభాలో నూటికి 21 వంతులు వ్యవసాయంమీద ఆధారపడి జీవించేవారు. ఉత్తరదేశంలో బియ్యం అత్యధికంగా పండే రాష్ట్రం బెంగాలే. ఈరాష్ట్రంలో వ్యవసాయం క్రిందవున్న భూమిలో నూటికి 85 వంతులు బియ్యపు పంటలో వుంటుంది. మిగతా ముఖ్య పంటలు : బార్లీ, గోధుమ, పప్పుదినుసులు, తిలధాన్యములు, జనపనార.

పరిశ్రమలలో జనపనార, టీ, బొగ్గు, పంచదారల ఉత్పత్తి ప్రధానంగా చెప్పదగినవి.

పశ్చిమబెంగాల్ వైశాల్యం 29,370 చ. మైళ్లు. జనాభా 2,47,86,683. వీరిలో 1,33,19,941 మంది పురుషులు. 1,14,66,742 మంది స్త్రీలు. జనాభాలో 21,17,896 మంది తూర్పు బెంగాలునుంచి వచ్చివేసిన కాందిశీకులు.

ఉత్తర ప్రదేశ్ తరువాత, ఇండియాలో అత్యధిక జనాభాగల రాష్ట్రం ఇదే. రాష్ట్రంలో అడవులు చాలా తక్కువ. జనపనార మిల్లులు యీ రాష్ట్రంలో చాలా ఎక్కువ. ఇండియాలో ఉత్పత్తిఅయే కాగితములో నూటికి 50 వంతులు, పింగాణీ సరకులలో నూటికి 60 వంతులు యీ రాష్ట్రంలోనే తయారవుతున్నవి.

రాజధాని కలకత్తా.

గవర్నరు: డాక్టరు హెచ్. సి. ముఖర్జి

పదవిస్వీకారం: 1951 నవంబరు 1.

జీతం: రు. 5,500 (ఇన్‌కంటాక్సుపోగా రు. 3,000)

గవర్నరు, తాము పదవి స్వీకరించిన నాటినుంచీ నెలకు రు. 500 మాత్రమే జీతం తీసుకుంటూ, మిగతా భాగాన్ని రాష్ట్రప్రభుత్వానికి వదలివేస్తున్నారు. ప్రభుత్వం ఆ డబ్బును, కలకత్తా యూనివర్సిటీలో విద్యార్థి వేతనములు ఇవ్వడానికి వినియోగిస్తున్నది.

## పార్లమెంటు సభ్యత్వం:

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకి ఎన్నుకోబడే సభ్యుల సంఖ్య మొత్తం. 34. వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించిన స్థానాలనుంచి ఎన్నుకోబడేవారు: 6. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు: 2

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడిన 34 సభ్యుల స్థానాలకూ మొత్తం 148 మంది పోటీచేశారు.

శాసనసభ

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిలు వున్నాయి.

అసెంబ్లీ సభ్యుల మొత్తం సంఖ్య: 238. వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు: 37. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు: 13

అసెంబ్లీ ఎన్నికలలో మొత్తం 238 స్థానాలలోను ఒకస్థానానికి కాంగ్రెసుపార్టీ సభ్యుడు పోటీలేకుండా ఎన్నుకోబడినాడు. తక్కిన 237 స్థానాలకూ 1,373 మంది పోటీచేశారు.

రాష్ట్రశాసనసభలో పార్టీలబలం

కాంగ్రెసు, 151; కమ్యూనిస్టులు, 28, ప్రజాపార్టీ, 15, ఫార్వర్డు బ్లాక్ (మార్క్సిస్టు), 10, జనసంఘు, 9, హిందూమహాసభ, 4, ఫార్వర్డు బ్లాక్ (రూయికర్), 1, ఇతరులు, 8, స్వతంత్రులు, 12.

మంత్రిమండలి :

పదవీస్వీకారం : 13 జూన్ 1952

ముఖ్యమంత్రి హోం, ఆర్థికశాఖ : డాక్టర్ బి. సి. రాయ్

గృహపరిశ్రమలమంత్రి : యాధవేంద్రనాధ పంజా

అడవులమంత్రి : హేమచంద్రనాస్కర్

నీటి పారుదలశాఖ మంత్రి : అజయకుమార్ ముఖర్జీ

ఎక్సైజుమంత్రి : శ్యామపాద బర్మన్

నిర్మాణశాఖమంత్రి : ఖగేంద్రనాద దాస్ గుప్త

కొండజాతుల క్షేమశాఖమంత్రి : రాధాగోవిందరాయ్

స్థానిక పరిపాలనమంత్రి : ఈశ్వర్‌దాస్ జాలన్

కాందిశీకుల రక్షణమంత్రి : శ్రీమతి రేణుక రే

ఆహారమంత్రి : ప్రఫుల్ల చంద్రసేన్

వ్యవసాయమంత్రి : రఫీఉద్దీన్ అహమద్

విద్యామంత్రి : పన్నాలాల్ బోస్

కార్మికమంత్రి : కాళీపాద ముఖర్జి

న్యాయశాఖమంత్రి : సత్యేంద్రకుమార్ బాసు

డిప్యూటీమంత్రులు : సతీశచంద్ర రేసింహ; సత్యేంద్రచంద్రఘోష్ మల్లిక్; జీవన్ రతన్‌దార్; గోపికావిలాస్ సేన్‌గుప్త; తరుణకాంతి ఘోష్; అమూల్యధన్ ముఖోపాధ్యాయ; శాకేంద్ర మోహన్ మిశ్ర; తెంజింగ్ వాంగ్‌దీ; శ్రీమతి మాయాదత్తగుప్త; ఐజేష్‌చంద్రసేన్; సమర జిత్ బంద్యోపాధ్యాయ; రజనీకాంత ప్రమాణిక్; అర్ధున్ సర్కార్; చిత్త రంజన్‌రాయ్; శ్రీమతి పూరవి ముఖర్జి; శివకుమార్ రాయ్.

స్పీకరు :

డిప్యూటీ స్పీకర్:

మంత్రుల జీతాలు : ప్రధాన మంత్రికి నెలకు రు: 1,500: ఇతర మంత్రులకు ఒక్కొక్కరికి నెలకు రు. 1,250, అలవెన్సులతో సహా.

అసెంబ్లీ సభ్యులకు జీతాలు, నెలకు రు. 200. సభాసమావేశానికి హాజరైన ప్రతిరోజుకు, కలకత్తా నగరవాసులకు రు. 2-8-0, బయట ప్రాంతములనుండి వచ్చినవారికి రైలు ఖర్చులుకాక, రోజుకు రు. 15.

## బడ్జెట్

1952-53 సంవత్సరానికి బడ్జెటును శాసనసభలో, 1952 మార్చి 14 తేదీన ఆర్థికశాఖామంత్రి ఎన్. ఆర్. సర్కారు ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి:

| | |
|---|---|
| 1952-53 లో వస్తుందని అంచనా వేసిన ఆదాయం | రు. 35,91,06,000 |
| 1952-53 లో అవుతుందని అంచనా వేసిన ఖర్చు | రు. 41,11,34,000 |
| లోటు | రు. 5,20,28,000 |

# బీహార్

బీహార్ రాష్ట్రం, ఒరిస్సా, బెంగాల్, మధ్యప్రదేశ్, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రాల మధ్యవుంది. దీని వైశాల్యం 70,368 చ. మైళ్ళు. జనాభా. 4,02,18,916. పురుషులు, 2,01,72,567. స్త్రీలు, 2,00,46,349. ఇండియాలోని రాష్ట్రాలలో అత్యధిక జనాభాగల రాష్ట్రాలలో మూడవస్థానం బీహారుది.

జనాభాలో నూటికి 80 వంతులు వ్యవసాయంమీద ఆధారపడి జీవించేవారే. నూటికి ఎనిమిదివంతులు మాత్రమే పరిశ్రమలమీద ఆధారపడినవారు. ఈ రాష్ట్రంలో పండే పంటలలో ప్రధానమైనది బియ్యం. మామూలుగా ప్రతిసంవత్సరమూ, 1,20,00,000 ఎకరాల భూమిలో బియ్యం పంటవేస్తారు. అంటే, వ్యవసాయ భూమిలో, నూటికి 52 వంతులు బియ్యం పంటక్రింద వుంటుందన్నమాట. బియ్యం తరువాత చెప్పదగిన ముఖ్యపంటలు: మొక్కజొన్న, బార్లీ, ఆముదపుగింజలు, ఆవాలు. తెల్లచక్కెర ఉత్పత్తిలో, మనదేశంలో, ఉత్తరప్రదేశ్ తరువాత చెప్పవలసింది బీహార్. దేశం మొత్తంలో తయారయే తెల్లచక్కెరలో. నూటికి 26 వంతులు బీహారులోనే తయారవుతుంది. జనపనార పంటకూడా, ఈ రాష్ట్రంలోని ముఖ్యపంటలలో ఒకటి. ఇటీవల పొగాకు పంటకూడా ఎక్కువ అవుతున్నది.

ప్రపంచంలోని గొప్ప ఉక్కు పరిశ్రమలో ఒకటైన, టాటా ఉక్కుకంపెనీ బీహారు రాష్ట్రంలోనేవుంది. ప్రపంచంలోని గొప్ప ఇనుప గనులలో ఒకటి, ఈ రాష్ట్రంలోవుంది. అందుచేత, పారిశ్రామికంగా ఈ రాష్ట్రం పేరుపొందింది. ఖనిజ సంపత్తి ఈ రాష్ట్రంలో విశేషంగావుంది. వాటిలో ముఖ్యమైనవి, ఇనుము, బొగ్గు, అభ్రకము.

లక్క పరిశ్రమకూడా ఈ రాష్ట్రంలో ఎక్కువ. ఇక్కడనుంచి ఏడాదికి పదికోట్ల రూపాయలపైబడిన విలువగల లక్క ప్రతిసంవత్సరమూ విదేశాలకు ఎగుమతి అవుతుంది. సిమెంటుకూడా ఎక్కువగా తయారవుతున్నది.

రాజధాని: పాట్నా. వేసవిలో గవర్నరు రాంచిలో వుంటాడు.
గవర్నరు: ఆర్. ఆర్. దివాకర్
పదవీస్వీకారం: 14 జూన్ 1952
జీతం: రు. 5,500 (ఇన్‌కంటాక్సు పోగా రు. 3,000)

## పార్లమెంటు సభ్యత్వం

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడే సభ్యుల సంఖ్య: 54. వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాల నుంచి ఎన్నుకోబడినవారు: 7. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు: 6. ఈరాష్ట్రంనుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడే సభ్యుల 54 స్థానాలకూ మొత్తం 198 మంది పోటీచేశారు.

## శాసన సభ

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిలు వున్నాయి,

అసెంబ్లీ సభ్యుల మొత్తం సంఖ్య: 330

వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు: 44

షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు: 12

రాష్ట్ర అసెంబ్లీకి ఎన్నికలలో మొత్తం 330 స్థానాలలోనూ ఒక స్థానానికి అభ్యర్థి పోటీలేకుండా ఎన్నుకోబడినాడు. తక్కిన 329 స్థానాలకూ 1,583 మంది పోటీచేశారు.

శాసన సభలో పార్టీ బలాలు:

కాంగ్రెసు, 241; జార్‌ఖండ్ పార్టీ, 32; సోషలిస్టులు, 23; జనత పార్టీ, 11; లోకసేవక్ సంఘ, 7; ఫార్వర్డు బ్లాక్, 1; ప్రజాపార్టీ, 1; రామరాజ్యపరిషత్, 1; జనతంత్రపరిషత్, 1; స్వతంత్రులు, 12;

స్పీకరు : వింధ్యేశ్వరీప్రసాద్ వర్మ
డిప్యూటీ స్పీకరు : జగత్ నారాయన్‌లాల్
కౌన్సిలు చైర్మన్ . శ్యామప్రసాద్ సింగ్
డిప్యూటి చైర్మన్ : రాజ బ్రజరాజకృష్ణ

మంత్రిమండలి :

పదవీస్వీకారం : 1952 ఏప్రిల్ 28
ముఖ్యమంత్రి : శ్రీ కృష్ణసింహ
ఆర్థికమంత్రి : డాక్టర్ అనుగ్రహనారాయణసింహ
రెవిన్యూమంత్రి : కె. బి. సహాయ్
విద్యామంత్రి : బదరీనాథ్ వర్మ
నీటి సదుపాయాలమంత్రి : రామచరితర్ సింగ్
న్యాయశాఖమంత్రి : శివనందన్‌ప్రసాద్‌మండల్
ఆరోగ్యమంత్రి : దేవశరన్ సింగ్
స్థానిక పరిపాలనమంత్రి : భోలాపశ్వాన్
పరిశ్రమలమంత్రి : మహేశప్రసాద్‌సింహ
సహకారమంత్రి : దీపనారాయణసింగ్
సివిసప్లయిస్‌మంత్రి : హరినాథ్ మిశ్ర
పబ్లిక్‌వర్క్సుమంత్రి : షఫి అహమద్
జైళ్ళమంత్రి : షామహమ్మద్ ఒజేర్ మునేవి

## బడ్జెటు

1952-53 సంవత్సరానికి బడ్జెటును, 1952 మే 16 వ ఆర్థికశాఖామంత్రి అనుగ్రహనారాయణసింహ, రాష్ట్ర శాసనసభ ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి :

1952-53 లో రాగలదని అంచనావేసిన

| | | |
|---|---|---|
| ఆదాయం | ... | రు. 28,42,00,000 |

1952-53 లో అవుతుందని అంచనా

| | | |
|---|---|---|
| వేసిన ఖర్చు | ... | రు. 29,80,00,000 |
| లోటు | ... | రు. 1,38,00,000 |

# బొంబాయి

బొంబాయి రాష్ట్రం వైశాల్యము 1,15,570 మైళ్లు. జనాభా, 3,59,43,559. పురుషులు, 1,86,31,883; స్త్రీలు, 1,73,11,676. మదరాసు రాష్ట్రంలాగనే ఇదికూడా మూడు భాషాభాగాలు కలసిన రాష్ట్రం. ప్రజలు గుజరాతీ, మహారాష్ట్రం, కన్నడ తెగలకు చెందినవారు. ఇండియాలోగల ఎక్కువజనాభాగలరాష్ట్రాలలో నాల్గవస్థానం, బొంబాయిది. వైశాల్యంలోకూడా యీ రాష్ట్రానిది, నాల్గవ స్థానమే.

ఈ రాష్ట్రప్రజలలో నూటికి 69 వంతులమంది వ్యవసాయంమీద ఆధారపడి జీవించేవారే. ఇక్కడి పంటపంటలలో ముఖ్యమైనవి ప్రత్తి, చెరకు, ధాన్యం, గోధుమ, పప్పుదినుసులు, రాగులు.

పారిశ్రామికంగా చాలా ముందుకువచ్చిన రాష్ట్రం ఇది. మనదేశంలోని వస్త్రపరిశ్రమకు ప్రధాన కేంద్రం ఈ రాష్ట్రమే. దీనికి ముఖ్య ప్రదేశాలు బొంబాయి నగరం, అహమ్మదాబాదు నగరం. విదేశాలతో మనదేశపు వ్యాపారమంతాకూడా ఎక్కువగా, బొంబాయి నగరంనుంచే జరుగుతున్నది. అంచేత, మనదేశపు వ్యాపారానికి బొంబాయి ఆయువు పట్టు అయింది.

ఈ రాష్ట్రానికి ప్రధాన నగరం బొంబాయి; వేసవికాలంలో ప్రభుత్వం పూనాలో వుంటుంది. బొంబాయి నగరం, అసలు దేశపు భూభాగంకాదు. అసలు భూమికి కొంచెందూరంగా సముద్రంలో వున్న చిన్న ద్వీపాల సమూహం. ఇప్పుడు వంతెనలు కట్టి, రోడ్లు వేసి, ఈ ద్వీపాలను అసలు భూభాగంతో కలిపివేశారు. అయినప్పటికీ ఇది చిన్న ద్వీపాల సమూహం కనుక, ఓడలకు రేవు వసతి బాగా వుంటుంది.

గవర్నరు : గిరిజ శంకర్ బాజ్‌పాయ్

పదవీస్వీకారము : 30 మే 1952

జీతం : రు. 5,500

పార్లమెంటు సభ్యత్వం :

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకి ఎన్నుకోబడే సభ్యుల సంఖ్య మొత్తం : 45. వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాల నుంచి ఎన్నుకోబడినవారు: 4. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు : 4. ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడే 45 సభ్యుల స్థానాలకీ మొత్తం 148 మంది పోటీచేశారు.

శాసనసభ :

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిలు వున్నాయి.

అసెంబ్లీ సభ్యుల మొత్తంసంఖ్య: 316. వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు : 27. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు : 29.

ఆంగ్లో ఇండియనుల తరఫున గవర్నరుచే నామినేట్ చేయబడిన సభ్యుడు, 1.

రాష్ట్ర అసెంబ్లీకి ఎన్నికలలో మొత్తం 315 స్థానాలలోనూ రెండు స్థానాలకు పోటీలేకుండా ఎన్నుకోబడినారు. తక్కిన 313 స్థానాలకూ, 1,243 మంది పోటీచేశారు.

రాష్ట్ర శాసనసభలో పార్టీ బలాలు :

కాంగ్రెసు, 269; సోషలిస్టులు, 9: రైతు కార్మికపక్షం, 14; షేదూత్ సంఘు, 1; షెడ్యూల్డుకాస్టుస్ ఫెడరేషన్, 1; కమ్యూనిస్టులు, 1; కిసాన్ కాంగార్ పార్టీ, 3; స్వతంత్రులు, 17.

| | | |
|---|---|---|
| అసెంబ్లీ స్పీకరు : | డి. కె. కుంతె | రు. 1,100 |
| డిప్యూటి స్పీకరు : | ఎస్. ఆర్. కాంతి | రు. 300 |
| కౌన్సిలు చైర్మన్ : | ఆర్. ఎస్. హుక్కేరికార్ | రు. 1,100 |
| డిప్యూటి చైర్మన్ : | వామనరావ్ లిమాయి | రు. 300 |

మంత్రిమండలి :

పదవీస్వీకారం ; 1952 ఏప్రిల్ 21.
ముఖ్యమంత్రి, హోం : మురార్జి దేశాయ్
రెవిన్యూమంత్రి అడవులు, వ్యవసాయం : బి. ఎస్. హిరే
విద్యామంత్రి : దినకరరావు దేశాయ్
స్థానికపరిపాలనమంత్రి : ఎం. కె. పాటిల్
పబ్లిక్‌వర్క్సుమంత్రి : ఎం. ఎం. నాయక్‌నింబాల్కర్
నిమ్నజాతుల ఉద్ధరణమంత్రి : జి. డి. తపసె
ఆరోగ్యమంత్రి: శాంతిలాల్ షా
సివిలుసప్లయిస్‌మంత్రి : వై. బి. చవాన్
ఆర్థికమంత్రి : డాక్టర్ జీవరాజ్ మెహత.

డిప్యూటి మంత్రులు : కుమారి ఇందుమతి చమన్‌లాలు, ఓ. జె. [illegible]; డి. ఎస్. వాంద్రెకార్; కె. ఎఫ్. పాటిల్; బి. డి. జట్టి; [illegible]. డి. దేశముఖ్; డాక్టర్ టి. ఎం. ఆర్. నర్వానె; ఎం. జి. ఫకి; ఎ. కె. సతె.

మంత్రుల జీతాలు : నెలకు రు. 1,100; ఇంటి అద్దె అలవెన్సు రు. 250; కారు అలవెన్సు రు. 250.

డిప్యూటి మంత్రుల జీతాలు : నెలకు రు. 750; ఇంటి అద్దె అలవెన్సు రు. 150; కారు అలవెన్సు రు. 200.

## బడ్జెటు

1952-53 సంవత్సరానికి బడ్జెటును 1952 ఫిబ్రవరి 24 తేదీన ఆర్థికశాఖామంత్రి వి. ఎల్. మెహతా, రాష్ట్రశాసనసభలో ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి :

| | | |
|---|---|---|
| 1952-53 లో రాగలదని అంచనా వేసిన ఆదాయం | ... | రు. 61,54,49,000 |
| 1952-53 లో అవుతుందని అంచనా వేసిన ఖర్చు | ... | రు. 63,17,62,000 |
| లోటు | ... | రు. 1,63,13,000 |

# మధ్యప్రదేశ్

ఇది, బొంబాయి, బీహారు రాష్ట్రాలకు మధ్యగా, త్రికోణాకారంలో వున్న రాష్ట్రం. 1950 జనవరి 26 వరకు దీనిని సెంట్రల్ ప్రావిన్సెస్ అండ్ బీరారు అనేవారు. బీరారు అనబడేభాగం, హైదరాబాదు నైజాం వద్దనుంచి బ్రిటిష్ ప్రభుత్వం శాశ్వతమైన కౌలుకు తీసుకున్నభాగం. ఈ రాష్ట్రపు వైశాల్యం, 1,30,323 చ. మైళ్లు (దీనిలో బీరారు, 17,809 చ. మైళ్ళు) జనాభా, 2,13,27,898. పురుషులు, 1,06,88,811. స్త్రీలు, 1,06,39,087. ఇండియాలోని రాష్ట్రాలన్నిటిలోకీ ఎక్కువ వైశాల్యం గల రాష్ట్రం ఇదే.

రాష్ట్రంలోని భూమిలో అడవుల క్రిందవున్న భాగమూ, బంజరు భూమిపోగా, మిగతాదానిలో నూటికి 67 వంతులు వ్యవసాయంలో వుంది. ప్రజల ప్రధానవృత్తికూడా ఇదే. వ్యవసాయంలోవున్న భూమిలో నూటికి 33 వంతులు వరిపంట క్రిందవుంది. తరువాత గోధుమ, పప్పుదినుసులు, నూనె ధాన్యాలు లెఖకువస్తాయి.

పరిశ్రమలలో బట్టల మిల్లులు చెప్పదగినవి. నాగపూర్ ఈ పరిశ్రమకు కేంద్రం. తరువాత, మెంగనీసును త్రవ్వి ఎత్తడంకూడా, పరిగణనీయమైన పరిశ్రమే. ఈ రాష్ట్రంనుంచి కలపకూడా విశేషంగా ఇతర రాష్ట్రాలకు, ముఖ్యంగా మదరాసు రాష్ట్రానికి, ఎగుమతి అవుతుంది.

రాజధాని : నాగపూర్

గవర్నరు : మంగళదాస్ పక్వాశ

పదవీస్వీకారం : 1947 ఆగస్టు 15

జీతం రు. 5,500 (ఇన్‌కంటాక్సు పోను, రు. 3000)

## పార్లమెంటు సభ్యత్వం

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడే సభ్యులసంఖ్య మొత్తం: 29. వీరిలో షెడ్యూల్డుకులాలకు ప్రత్యేకించిన స్థానాలనుంచి

ఎన్నుకోబడినవారు: 4. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు: 3. రాష్ట్రంనుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడే సభ్యులు స్థానాలు 29 కి 109 మంది పోటీచేశారు.

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీమాత్రంవుంది.

అసెంబ్లీసభ్యుల మొత్తం సంఖ్య : 233.

వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు : 32.

షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు : 26.

ఆంగ్లోఇండియనుల తరఫున గవర్నరుచే నామినేట్ చేయబడిన సభ్యుడు 1.

రాష్ట్రశాసన సభకు ఎన్నికలు 1951 డిశంబరు 22 తేది నుంచిజరిగాయి. మొత్తం 232 స్థానాలలోను 7 స్థానాలకు అభ్యర్థులు పోటీ లేకుండా ఎన్నుకోబడినారు. వారిలో కాంగ్రెసువారు ముగ్గురు, స్వతంత్రులు నలుగురు, తక్కిన 225 స్థానాలకు 1,122 మంది పోటీ చేశారు.

రాష్ట్రశాసన సభలో పార్టీల బలం:

కాంగ్రెసు, 194; సోషలిస్టు, 2, ప్రజాపార్టీ, 8; ఇతరులు, 5; స్వతంత్రులు, 23.

స్పీకర్ : పండిట్ కుంజిలాల్ దుబే

డిప్యూటీస్పీకర్ ; ఎస్. కె. వాంఖెడె

**మంత్రి మండలి :**

పదవీ స్వీకారం: 23 ఫిబ్రవరి 1952.

| | |
|---|---|
| ముఖ్యమంత్రి హోం, ఉద్యోగనియామకాలు | పండిట్ రవిశంకర్ శుక్ల |
| పరిశ్రమలమంత్రి వాణిజ్యం, అడవులు, న్యాయశాఖ, అభివృద్ధిశాఖ | డి. కె. మెహత |

| | |
|---|---|
| విద్యామంత్రి<br>స్థానికపరిపాలన | పి. కె. దేశముఖ్ |
| ఆర్థికమంత్రి<br>రెజిస్ట్రేషన్ | బ్రజ్ లాల్ బియాని |
| రెవిన్యూమంత్రి : | బి. ఎ. మండలాయ్ |
| వ్యవసాయమంత్రి : | శంకరలాల్ తివారి |
| ఆరోగ్యమంత్రి : | యం యెస్. కన్నమ్వార్ |
| పబ్లిక్ వర్క్సు మంత్రి<br>కొండజాతుల క్షేమ<br>పరిశీలన | రాజా నరేశచంద్రసింగ్ |
| ఆహారమంత్రి<br>కార్మికులు | దీనదయాళ్ గుప్త |

డిప్యూటి మంత్రులు :

ముఖ్యమంత్రికి : రాజా బహదూర్ వీరేంద్ర బహదూర్ సింగ్;

ఆర్థికశాఖ : పి. ఎల్. భగత్

పరిశ్రమశాఖ : శ్రీమతి ప్రభావతిబాయ్ జగత్ దార్

విద్యాశాఖ : అబ్దులు కాదర్ మనూం

వ్యవసాయశాఖ : గణేశరాం మొహర్ శాయ్

రెవిన్యూశాఖ : వాసుదేవ నాయక్

మంత్రుల జీతాలు : ఒకొకరికి నెలకు రు. 1,000.

డిప్యూటి మంత్రులకు, నెలకు రు. 750.

## బడ్జెటు

1952-53 సంవత్సరానికి బడ్జెటును, 1952 మార్చి 6 న శాసన [illegible] ఆర్థికశాఖామంత్రి బ్రిజ్ లాల్ బియాని ప్రవేశపెట్టారు. ఆబడ్జెటు

| | | |
|---|---|---|
| 1952-53 లో రాగలదని అంచనా వేసిన ఆదాయం | ... | రు. 20,73,96,000 |
| 1952-53 లో అవుతుందని అంచనా వేసిన ఖర్చు | ... | రు. 19,83,02,000 |
| ఆదాయంలో ఖర్చుపోగా మిగులు | ... | రు. 90,94,000 |

# కాశ్మీరు

వైశాల్యం : 85,258 చ. మైళ్లు. జనాభా, సుమారు, 43,70,000

కాశ్మీరుసంస్థానం, భారతదేశంలోని సంస్థానాలన్నిటిలోను పెద్దది. అంతేగాక, అతి సుందరమైన ప్రకృతి దృశ్యాలు గలది. సింధు, చినాబ్, జీలం నదులు. ఈ రాజ్యంగుండా ప్రవహిస్తున్నాయి. రాజు హిందువు అయినప్పటికీ, ప్రజలలో నూటికి 75 వంతులు ముస్లిములు. సికిందరు అనే నవాబు ఈ రాజ్యాన్ని పరిపాలించినరోజులలో, అంటే 1,400 సంవత్సర ప్రాంతంలో, ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ఇస్లాం మతంలో చేరి పోయారు. ఇది 1337 సంవత్సరంవరకూ హిందూరాజుల పరిపాలనలోనే వుంది. అప్పుడు పారశీక దేశస్థుడొకడు ఈ రాజ్యాన్ని జయించి, ముస్లిం రాజరికంలోకి తీసుకొనివచ్చాడు. కాని, 1586లో అక్బరు ఈరాజ్యాన్ని మొగలు సామ్రాజ్యంలో కలిపివేసి ఒక సుబేదారును నియమించినదాకా, స్వతంత్ర రాజుల పాలనలో నేవుంది. మొగలు చక్రవర్తుల బలం సన్నగిలి నప్పుడు, ఈరాజ్యాధిపతి క్రమేపీ స్వాతంత్ర్యాన్ని ప్రకటించాడు. 1819 లో మహారాజా రంజిత్ సింగు యీ రాజ్యాన్ని జయించి, తన రాజ్యంలో కలిపివేసుకున్నాడు. రంజిత్ సింగు మరణానంతరం, ఈ రాజ్యాన్ని జమ్ము రాజైన మహారాజా గులాబ్ సింగుకు బ్రిటిషువారు 75 లక్షల రూపా యలకు అమ్మివేశారు.

దేశంలో బాధ్యతాయుత పరిపాలన కావాలని షేక్ అబ్దుల్లా నాయకత్వాన నేషనలు కాన్ఫరెన్సువారు ఉద్యమాన్ని సాగించారు.

భరతఖండంవిభజనానంతరం కాశ్మీరును పాకిస్థానుతో కలుపుకోవ డానికి ఆ ప్రభుత్వం చాలా ప్రయత్నించింది. కాని, అది సాగలేదు.

అంచేత, పశ్చిమోత్తరసరిహద్దులోవున్న కొండజాతులకు ఆయుధసామగ్రిని యిచ్చి, కాశ్మీర్‌మీదకు దండయాత్ర చేయించింది. ఈ కొండదండు కాశ్మీరులో ప్రవేశించి, నానాభీభత్సం చేస్తూవుండగా, 1947 అక్టోబరు 26 న కాశ్మీరు మహారాజు, తన సంస్థానాన్ని ఇండియాలో కలుపుకొని తనకూ తన సంస్థానానికీ రక్షణ యివ్వవలసిందని ఇండియాప్రభుత్వాన్ని కోరాడు. ఆ కోరికను గవర్నర్‌జనరలు అంగీకరిస్తూ, కాశ్మీర్ భారత దేశంతో చేరడం తాత్కాలికమేననీ, కొండదండులను వెళ్ళగొట్టి సంస్థానంలో శాంతి నెలకొల్పిన తరువాత, ప్రజల యిష్టప్రకారం ఆ సంస్థానాన్ని ఇండియాలో చేర్చుకోవడమో, మానివెయ్యడమో జరుగుతుందనీ తెలియపరిచాడు. తాత్కాలికంగా యీసంస్థానం ఇండియాతో కలియడం, 1947 అక్టోబరు 27 న జరిగింది. ఆనాడే, ఇండియానుంచి సైన్యాలు కాశ్మీరుకు పంపబడినవి.

అప్పటినుంచీ, 1949 జనవరి 1 తేదిదాకా, భారతసేనలు కాశ్మీరుపై దండయాత్రజరిపిన సరిహద్దుమూకలతోను, వారికి సహాయంచేస్తున్న పాకిస్థాను సైన్యాలతోనూ పోరాటం సాగించుతూ, వీరి ఆక్రమణలో వున్న సంస్థానదేశాన్ని చాలావరకు విడిపించినవి.

కాశ్మీరు సమస్యవల్ల ఇండియా పాకిస్థానులమధ్య ఏర్పడిన తగాదా మిత్రరాజ్యసమితి సెక్యూరిటీ కౌన్సిలువద్దకు విచారణకు వచ్చింది. ఈ సమస్యను విచారించి, ఉభయపక్షాలకూ రాజీ కుదర్చడానికి సెక్యూరిటీ కౌన్సిలు ఒక ఉపసంఘాన్ని నియమించింది. ఈ ఉపసంఘుకృషివల్ల, ఉభయులకూ కాశ్మీరు భవిష్యత్తును నిర్ణయించే విషయంలో ఒక ఒడంబడిక కుదిరింది. ఆ ఒడంబడిక కారణంగా కాశ్మీరులో యుద్ధం, 1949 జనవరి 1 తేదిన విరమింపబడింది.

ఈ ఒడంబడిక ప్రకారం, కాశ్మీరును ఇండియాతో చేర్చాలా, పాకిస్థానుతోచేర్చాలా అనేవిషయాన్ని నిర్ణయించడానికి ప్రజాభిప్రాయం కనుగొనబడుతుంది. ప్రజాభిప్రాయం కనుగొనడానికిజరిగే ఎన్నికలు, మిత్రరాజ్యసమితి నియమించిన ఒక ప్రత్యేక అధికారి పర్యవేక్షణలో జరుగుతాయి. కాశ్మీరులోని పాకిస్థాను సైన్యాలు తరలిపోతాయి.

కాశ్మీర్‌లో జనవాక్య నిర్ధారణను తేల్చడానికి యునైటెడ్ నేషన్సు తరఫున అడ్మిరలు ఛెస్టర్ నిమిజ్ నియమింపబడినారు. కాని జనవాక్య నిర్ధారణకు పూర్వం, కాశ్మీరులోని కొన్ని ప్రాంతాలలోవున్న పాకిస్తాను సైన్యాలు ఉపసంహరించుకుని తరలిపోవాలనే విషయంపై ఒడంబడికకుదరనందున జనవాక్యనిర్ధారణ తీసుకోవడం జరగలేదు. ఈవిషయం ఇంకా (1952 ఫిబ్రవరి అంతానికి) సెక్యూరిటీ కౌన్సిలు పరిశీలనలోనే వుంది.

కాశ్మీర్ మహారాజా హిజ్ హైనెస్ సర్ హరిసింగు బహదూర్, రాజ్యపరిపాలననుంచి తాత్కాలికంగా విరమించి, పరిపాలనాధికారాన్ని తనకుమారుడు యువరాజ కర్ణసింగుకు అప్పగించారు. 1950 జనవరి 26 నుంచి కాశ్మీర్‌కు రాజప్రముఖ్‌గా కర్ణసింగు వున్నారు.

1947 అక్టోబరు 31 వ షేక్ అబ్దుల్లా నాయకత్వాన కాశ్మీరుకు బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటు చెయ్యబడింది. షేక్ అబ్దుల్లా 1948 మార్చి 18 తేదీన తన మంత్రి మండలిని ఏర్పాటుచేశారు. ఆ మంత్రి మండలి వివరాలివి :

| | |
|---|---|
| ప్రధాని : | షేక్ మహమ్మదు అబ్దుల్లా |
| ఉపప్రధాని : | బక్షీ గులాం మహమ్మదు |
| రెవిన్యూమంత్రి : | మిర్జా మహమ్మదు అఫ్జలుబెగ్ |
| పరిశ్రమలమంత్రి : | గులాం మహమ్మదు సాదిక్ |
| ఆరోగ్యమంత్రి : | పండు శ్యామలాల్ షరీఫ్ |
| ఆర్థికమంత్రి : | గిరిధరిలాల్ డోగ్రా |
| రవాణామంత్రి : | కర్నలు పీర్ మహమ్మదుఖాన్ |

మంత్రుల జీతాలు : నెలకు రు. 1,000. కాని దేశంలోని ఆర్థిక పరిస్థితులనుబట్టి 1950 ఏప్రిలునుంచీ నూటికి 20 వంతులు తగ్గించుకొని, నెలకు రు. 800 మాత్రమే తీసుకోవడానికి మంత్రులు నిశ్చయించుకున్నారు.

కాశ్మీరు ప్రతినిధులు, షేక్ మహమ్మదు అబ్దుల్లా, మిర్జాఅఫ్జలు బేగ్, మౌలానా మహమ్మద్ సయ్యద్, పండిట్ మోతీరాం గార్లు 194

జూన్ 16 తేదీన ఇండియా రాజ్యాంగ పరిషత్తులో మొట్టమొదటిసారి కూచున్నారు.

ఇటీవలనే కాశ్మీర్‌లో ఒక విశ్వకళాపరిషత్తు స్థాపించబడింది.

కాశ్మీరు భవిష్యత్తును నిర్ణయించడానికి కాశ్మీరు ప్రజలు ఎన్నుకున్న ప్రజాపరిషత్తు ప్రథమసమావేశం 1951 నవంబరు 1 న జరిగింది. ఈ సభకు అధ్యక్షుడుగా ఘులాంమహమ్మదు సాదిక్ ఎన్నుకోబడినారు.

1951 నవంబరు 20 నుంచి, యీ ప్రజాపరిషత్తే రాష్ట్ర శాసన సభగాకూడా వ్యవహరిస్తుందనీ, మంత్రిమండలి శాసనసభకు బాధ్యులై వుంటారనీ, రాజరికం నిమిత్తమాత్రుడుగా, మంత్రుల సలహామీద యువ రాజు కర్ణసింగు సాగిస్తారనీ ప్రకటన జరిగింది.

## బడ్జెటు

1952-53 సంవత్సరానికి రాష్ట్ర బడ్జెటును, 1952 మే 6 న ఆర్థికమంత్రి శాసనసభలో ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి :

| | |
|---|---|
| ఆదాయం అంచనా : | రు. 4,66,03,000 |
| వ్యయం అంచనా | రు. 4,73,14,000 |
| లోటు అంచనా : | రు. 7,11,000 |

# తిరువాంకూర్ - కొచ్చిన్

తిరువాన్కూర్ కొచ్చిన్ సంస్థానాలు రెండూ ఒక యూనియన్‌గా 1949 జూలై 1 తేదీన ఏర్పాటు చేయబడినవి. ఈ యూనియన్ వైశాల్యం 9142 చ. మైళ్లు. జనాభా 92,65,157. వీరిలో పురుషులు, 46,15,335; స్త్రీలు, 46,49,829. రాష్ట్రంలోని ప్రతి చదరపు మైలుకూ 1012 మంది ప్రజలు నివసిస్తూవున్నట్లు లెక్క.

ఈ యూనియను ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు వ్యవసాయం మీద ఆధారపడి జీవించేవారే.

పారిశ్రామికంగానూ, విద్యలోనూ యీ యూనియన్ చాలా అభివృద్ధిలోకి వచ్చింది. ఈ యూనియనులో 29 ఫస్టుగ్రేడు కాలేజిలు, 482 హైస్కూళ్ళు, 707 మిడిల్ స్కూళ్లు, 4,010 ప్రైమరీ స్కూళ్లు వున్నాయి. విద్యావంతులైన స్త్రీలు చాలా యెక్కువగావున్న ప్రాంతం ఇండియాలో ఇదే. త్రివేంద్రంలో ఒక విశ్వకళా పరిషత్తువుంది.

కొచ్చిన్‌లో చాలా బాగా నిర్మింపబడిన ఓడరేవువుంది.

ఈ యూనియనుకు రాజధాని త్రివేంద్రం.

రాజప్రముఖ్. ఆనరరీ మేజర్ హిస్ హైనెస్ శ్రీ పద్మనాభదాస వాంచిపాల సర్ బలరామవర్మ కులశేఖర కిరీటపతి మన్నె సులాన్ మహారాజ రామరాజ బహాదూర్ షంషేర్‌జంగ్ తిరువాంకూరు మహారాజు.

ప్రీవీపర్స్: రు. 18,00,000. రాజప్రముఖ్‌గా వున్నందుకు అదనపు అలవెన్సు రు. 3,00,000.

ఈ సంస్థాన యూనియన్‌లోని రెండు స్థానాలవివరాలు విడిగా యీ క్రింద ప్రకటింపబడినవి

## తిరువాన్కూర్

వైశాల్యం : 7,662 చ. మైళ్ళు. భారతదేశము నైరుతి అగ్రంలో వున్న సంస్థానం. ఒకప్పుడు దక్షిణ భారతదేశంలో ప్రబలులైవున్న చేర వంశపురాజుల వంశీకులే ఇప్పటికీ ఈ రాజ్యాన్ని పాలిస్తున్నారు. అయితే, రాజ్యాధికారానికి వారసత్వం, రాజు బిడ్డలకు కాక మేనల్లుళ్ళకు చెందుతుంది రాజుతల్లికి మహారాణి బిరుదు వుంటుంది. రాజు వివాహం చేసుకున్న యువతికి మహారాణి హోదాలేదు. ప్రస్తుతపు మహారాజు 1931 లో సింహాసనాన్ని అధిష్ఠించారు. 1924 లోనే ఈ మహారాజు సింహాసనాధికారాన్ని పొందినా, మైనారిటీ తీరేవరకూ, ఆయన పెదతల్లి మహారాణీ సేతు లక్ష్మీబాయి పరిపాలన సాగించారు. ఇక్కడ ప్రజల జీవనాధారానికి ప్రధానమైన వృత్తి వ్యవసాయము.

కొబ్బరి, రబ్బరు, టీ తోటలు ప్రజలకు ప్రధాన జీవనాధారాలుగా వుండటమేకాక, ప్రభుత్వానికి విశేష ఆదాయాన్ని చేకూరుస్తున్నాయి.

ఏటంబాంబులు చెయ్యడానికి ఉపయోగపడే థోరియం అనే లోహం ఈ సంస్థానంలో ఎక్కువగా లభిస్తున్నది

వైశాల్యం : 1,393 చ. మైళ్లు. ఈసంస్థానం, తిరువాంకూరుకూ మద్రాసు రాష్ట్రంలోని మలబారు జిల్లాకు మధ్యన, భారతదేశపు నైరుతీ తీరానవుంది, ఒకప్పుడు చోళరాజుల ప్రతినిధిగా ప్రస్తుతపు తిరువాంకూరు, మలబారు ప్రాంతానికంతకూ ఏలికగావున్న చేరమన్ పెరుమాళ్ వంశీకులు ఈ రాజ్యాన్ని పరిపాలిస్తున్నారు.

మహారాజు : హిస్ హైనెస్ శ్రీరామవర్మ

రాజకుటుంబం అందరికీ ప్రీవీపర్స్ రు. 14,00,000. మహారాజుకు దీనిలో రు. 2,35,000.

## పార్లమెంటు సభ్యత్వం :

ఈరాష్ట్రంనుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడే సభ్యులసంఖ్య: 12

వీరిలో షెడ్యూల్డుకులాలకు ప్రత్యేకించిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు : 1.

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకు జరిగిన ఎన్నికలలో, రాష్ట్రంలోని మొత్తం 12 సీట్లకూ మొత్తం 47 మంది పోటీచేశారు. వీరిలో 10 మంది కాంగ్రెసువారు; 9 మంది సోషలిస్టులు; 21 మంది స్వతంత్రులు; ఇతర చిన్న పార్టీలవారు 7 మంది.

## శాసనసభ :

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీమాత్రం వుంది.

అసెంబ్లీ సభ్యుల మొత్తం సంఖ్య : 109

వీటిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించిన స్థానాలనుంచి ఎన్నికో-బడినవారు : 10

ఆంగ్లో ఇండియనుల తరఫున రాజప్రముఖ్ చే నామినేట్ చేయబడిన సభ్యుడు, 1.

రాష్ట్ర శాసనసభకు ఎన్నికలు 1951 డిసెంబరు 10 తేదిమొదలు 1952 జనవరి 5 తేదిలోపల జరిగాయి. శాసనసభ స్థానాలు మొత్తం 108 కీ, రెండు స్థానాలలో పోటీలేకుండా కాంగ్రెసు అభ్యర్థులూ, ఒక స్థానంలో పోటీలేకుండా సోషలిస్టు అభ్యర్థి ఎన్నికోబడినారు. తక్కిన 105 స్థానాలకు పోటీచేసినవారిలో 103 మంది కాంగ్రెసువారు, 68 మంది సోషలిస్టులు, 207 మంది స్వతంత్రులు, ఇతర చిన్న పార్టీలకు చెందినవారు 60 మంది, మొత్తం 458 మంది పోటీచేశారు.

శాసనసభలో పార్టీలబలం :

కాంగ్రెసు, 44; సోషలిస్టులు, 12; కమ్యూనిస్టులు, వారితో చేరినవారు, 32; స్వతంత్రులు, 11; ఇతరపార్టీలు, 9. తిరువాంకూరు తమిళ్ నాడు కాంగ్రెసుకు చెందిన 8 మంది సభ్యులు 1952 మే 9 తేదిన కాంగ్రెసు పార్టీతో చేరిపోయారు.

స్పీకర్ : కె. [illegible]. నీలకంఠన్ పిళ్లై

డిప్యూటి స్పీకరు: కె. పి. కృష్ణమీనన్

**మంత్రిమండలి :**

ముఖ్యమంత్రి, విద్య: ఎ. జె. జాన్

ఆర్థికమంత్రి : ఆహారము, వ్యవసాయము, కార్మికులు: పనంపల్లి గోవిందమీనన్.

హోంమంత్రి : న్యాయశాఖ, ప్రచురణ : టి. ఎం. వర్గీస్.

స్థానిక పరిపాలనమంత్రి: గ్రామపునర్నిర్మాణము, సహకారము, దేవస్వములు: కె. కోచుకుట్టన్.

పబ్లిక్ వర్క్స్ మంత్రి: రవాణా, విద్యుచ్ఛక్తి: కలాత్తిల్ వేలాయుధన్ నాయర్.

ఆరోగ్యమంత్రి ఎక్సైజు, దేవాలయములు: వి. మాధవన్.

రెవిన్యూమంత్రి : చిదంబరనాధ నాడార్

మంత్రిమండలి సలహాదారు : ఓ. కె. గోఖ్లే

శాసన సభ్యులకు నెలకు రు. 120 జీతం. లేదా సభకు హాజరైన ప్రతిరోజుకీ రు. 15. వారి స్వస్థలంనుంచి త్రివేండ్రం రావడానికి రైలులో ఫస్టుక్లాసు చార్జికి రెట్టింపు. రోడ్డుమీద ప్రయాణంచేస్తే, ప్రతిమైలుకీ యెనిమిదణాలు బత్తా.

బడ్జెట్

1952-53 సంవత్సరానికి యీరాష్ట్రానికి బడ్జెటును శాసనసభలో 1952 మార్చి 25 తేదిన, ఆర్థిక శాఖామంత్రి పి. గోవిందమీనన్ ప్రవేశపెట్టారు, ఆ బడ్జెటు వివరాలివి :

| | |
|---|---|
| అంచనావేసిన ఆదాయం : | రు. 16,30,00,000 |
| అంచనావేసిన ఖర్చు : | రు, 16,24,00,00 |
| మిగులు | రు. 4,00,000 |

# పాటియాలా, తూర్పు పంజాబ్ సంస్థానాల యూనియన్ (పెప్సు)

1948 జూలై 15 తేదిన, పాటియాలతోసహా తూర్పు పంజాబ్ లోని కపుర్థలా, నాభా, ఫరీద్‌కోట, మాలేర్‌కోట్ల, నలఘర్, కాల్సియా అనే తొమ్మిది సంస్థానాలు పాటియాల, తూర్పుపంజాబ్ సంస్థానాల యూనియన్‌గా ఏర్పడినాయి.

ఈ యూనియన్ వైశాల్యం 10,099 చ. మైళ్లు. దీనిలో దాదాపు 6,000 చ. మైళ్లు పాటియాల సంస్థానం. ఈ యూనియన్

జనాభా 34,68,631; పురుషులు, 18,73,205; స్త్రీలు, 15,95,426 ఈ యూనియన్ ప్రభుత్వాదాయం, ఏడాదికి దాదాపు అయిదుకోట్ల రూపాయలు.

ఈ యూనియన్‌లో ప్రజల ప్రధానవృత్తి వ్యవసాయం. జనాభాలో ప్రధానభాగమైన జాట్ జాతివారు చాలా సమర్థులైన వ్యవసాయదార్లు.

ఈ యూనియన్‌లో దాదాపు 9 లక్షల యెకరాల సేద్యయోగ్యమైన భూమి ప్రస్తుతం బీడుగావున్నది. దీనిలో అర్థమం రెండు లక్షల యెకరాల భూమినైనా శీఘ్రంగా వ్యవసాయంలో పెట్టడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది.

పరిశ్రమల విషయంలో యీ యూనియన్ యిప్పుడిప్పుడే కొంచెం ముందంజవేస్తున్నది.

ఈ యూనియన్‌లో 10 కాలేజీలు, 51 హైస్కూళ్లు, 73 మిడిల్ స్కూళ్లు 77 లోయరు మిడిల్‌స్కూళ్లు, 642 ప్రైమరీస్కూళ్లు వున్నాయి.

రాజ ప్రముఖ్ : లెఫ్టినెంట్ కర్నల్ హిస్‌హైనెస్ మహారాజాధిరాజ సర్ యాదవేంద్రసింగ్ మహేంద్రబహదూర్ (పాటియాల మహారాజు)

ఉపరాజప్రముఖ్ : కపుర్థల మహారాజు

## పార్లమెంటు సభ్యత్వం

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకు యెన్నుకోబడే సభ్యులసంఖ్య మొత్తం : 5. వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాల నుంచి యెన్నుకోబడేవారు : 1. పార్లమెంటు స్థానాలు అయిదింటికీ, యెన్నికలలో 41 మంది పోటీ చేశారు. ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీమాత్రం వుంది. అసెంబ్లీ సభ్యులసంఖ్య మొత్తం : 60. వీరిలో

షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి యెన్నుకోబడినవారు : 10.

రాష్ట్ర శాసనసభలోని 60 స్థానాలకూ 374 మంది అభ్యర్థులు పోటీచేశారు. వారిలో 51 మంది కాంగ్రెసు, అకాలీలు 41. పోటీచేసిన 17 మంది సోషలిస్టులలోనూ, 11 మంది ఫార్వర్డుబ్లాకు సభ్యులలోనూ ఒక్కరుకూడా ఎన్నికకాలేదు. పోటీచేసినవారిలో, 219 మంది తమ డిపాజిట్లను కోల్పోయారు.

రాష్ట్ర శాసనసభలో పార్టీల బలాలు :

కాంగ్రెసు, 25; అకాలీలు, 18; కమ్యూనిస్టులు, 3; జనసంఘ, 2; ప్రజాపార్టీ, 1; షెడ్యూల్డు కాస్టు ఫెడరేషన్, 1.

స్పీకరు : రామశరణ్ చంద్ మిట్టల్
డిప్యూటిస్పీకరు : లేఖారాం
మంత్రిమండలి సలహాదారు : వి. కె. బి. పిళ్లై

1952 మార్చి 19 తేదిన కర్నల్ రఘువీరసింగ్ నాయకత్వాన కాంగ్రెసు మంత్రిమండలి ఏర్పాటుచేయబడింది. కాని, ఏప్రిల్ 16 తేదిన స్పీకరు ఎన్నికసమయంలో, మంత్రిమండలి పక్షంనుంచి ముగ్గురుసభ్యులు ప్రతికూల పక్షంలో చేరినందువల్ల, ఆ మంత్రిమండలి రాజీనామా ఇవ్వవలసివచ్చింది. ఏప్రిల్ 17 తేదిన ఆ మంత్రిమండలి రాజీనామా ఇవ్వగా, ఏప్రిల్ 22 తేదిన సర్దార్ గ్యాన్ సింగ్ రేరివాలా, మంత్రిమండలిని ఏర్పాటుచేశారు.

మంత్రిమండలి :

పదవీ స్వీకరణ : 1952 ఏప్రిల్ 22.

| | |
|---|---|
| ముఖ్యమంత్రి : పోలీసు, న్యాయశాఖ, రవాణా. | సర్దార్ గ్యాన్ సింగ్ రేరివాలా |
| పబ్లిక్ వర్క్సు మంత్రి : విద్య, వైద్యం. | సర్దార్ భూపేంద్రసింగ్ మాన్ |
| రెవెన్యూమంత్రి : [illegible], వ్యవసాయం. | చౌధురి రాంసింగ్ |

పరిశ్రమలమంత్రి : | చౌధురి అత్తర్‌సింగ్
స్థానికపరిపాలన |
ఆర్థికమంత్రి : | సర్దార్ దారాసింగ్
కార్మికశాఖ. |

డిప్యూటీ మంత్రులు : డాక్టర్ దేవకీనందన్, సుబేదార్ ఓంకార్ సింగ్.

మంత్రుల జీతాలు : ప్రధానమంత్రికి నెలకు రు. 1250; తక్కిన మంత్రులకు నెలకు రూ. 1,000.

బ డ్జె టు

రాష్ట్రానికి 1952-53 బడ్జెటును 1952 మే 5 న ముఖ్యమంత్రి సర్దార్ గ్యాన్‌సింగ్ రేరివాలా, శాసనసభలో ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి :

| | |
|---|---|
| ఆదాయం అంచనా : | రూ. 5,22,36,000 |
| వ్యయం అంచనా : | రూ. 5,85,05,000 |
| లోటు అంచనా : | రూ. 62,69,000 |

# మ ధ్య భా ర త్

మాళ్వరాజ్యం అనే పేరుగల మధ్యభారత సంస్థానాల కూడలి సంయుక్త మధ్యభారత్ రాజ్యం అనేపేరుతో 1948 మే 28 న ఏర్పాటు చేయబడింది. ఈ కూడలిలో గ్వాలియర్, ఇందోర్ సంస్థానాలున్నూ, 20 మాళవసంస్థానాలున్నూ చేరాయి. ఆ సంస్థానాల పేర్లివి : ఆలిరాజపూర్, బార్వాని, దేవాస్ (సీనియర్) దేవాస్, (జూనియర్), ధార్, గ్వాలియర్, ఇందోర్, జావొరా, ఝూబువా, ఖిల్చిపూర్, నరసింగ్‌ఘర్, రాజ్‌ఘర్, రట్లం, శైలానా, సితామా, జోబాట్, కథివారా, కుర్వాయ్, మత్వార్, పిప్లోడా, మహమ్మద్‌ఘర్, పథారి, జామ్నియా, నిఖేదా,

ఈ యూనియన్ వైశాల్యం, 46,710 చ. మైళ్లు జనాభా 79, 41, 642; పురుషులు, 41, 28, 308; స్త్రీలు, 38, 13, 334.

జనాభాలో నూటికి 75 వంతులు వ్యవసాయంమీద ఆధారపడి జీవించేవారే. ఇచ్చట పండే పంటలలో ముఖ్యమైనవి గోధుమ, పప్పు దినుసులు, జొన్నలు, సజ్జలు, బియ్యం, మొక్కజొన్న, తిలధాన్యములు, చెరకు. ప్రస్తుతం యీ యూనియన్‌లో వ్యవసాయం చేయబడుతున్న 87,83,000 ఎకరాలభూమిలో దాదాపు 67,07,000 ఎకరాలలో ఆహారధాన్యములు పండించబడుతున్నవి. ఇంకా వ్యవసాయానికి ఉపయోగించకుండా వున్న వ్యవసాయ యోగ్యమైన భూమి 47,88,000 ఎకరాలు వుంటుంది. ఈ యూనియన్‌లోని మొత్తంభూమిలో దాదాపు నాల్గవవంతు, అంటే 12,000 చ. మైళ్లు, అడవి. ఇక్కడ పండే వ్యాపారం పంటలలో ముఖ్యమైనది ప్రత్తి. దాదాపు 11 లక్షల ఎకరాలలో ప్రత్తి పంటవెయ్యబడుతుంది. ఇక్కడ 17 బట్టల మిల్లులు వున్నాయి. వీటిలో దాదాపు 50,000 మంది కార్మికులు పనిచేస్తారు. ఇండియాఅంతటిలోనూ ఉత్పత్తి అయేవస్త్రంలో, నూటికి ఏడువంతులు, అంటే దాదాపు 25 కోట్ల గజాలబట్ట, యీ యూనియన్‌లోని మిల్లులలోనే తయారవుతుంది.

ఈ యూనియన్‌కు సంవత్సరంలో ఏడునెలలు గ్వాలియర్‌లోను, ఎండకాలం అయిదు నెలలు ఇందోర్‌లోను రాజధాని వుంటుంది.

రాజప్రముఖ్ : లెఫ్టినెంటు జనరల్ హిస్ హైనెస్ మహారాజా ముక్తర్ ఉల్ ముల్క్, అజీం ఉల్ ఇక్తిదార్ రఫీఉష్షహాన్ వాలాషికో మొహాత్ అష్షందౌరాన్ ఉమ్దత్ ఉల్ ఉమ్రా మహారాజాధిరాజ హిసముస్సలానత్ సర్ జీవాజీరావు సింధియా అలిజా బహదూర్

ఉపరాజప్రముఖ్ : మేజర్ జనరల్ హిస్ హైనెస్ మహారాజాధిరాజ రాజరాజేశ్వర్ శావాయ్ శ్రీ యశ్వంతరావ హోల్కార్ బహదూర్.

## పార్లమెంటు సభ్యత్వం

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకి ఎన్నుకోబడే సభ్యుల సంఖ్య మొత్తం: 11. వీరిలో షెడ్యూల్డ్ కులాలకు ప్రత్యేకించబడి స్థానాలకు ఎన్నుకోబడేవారు: 2. షెడ్యూల్డ్ కొండజాతులకు ప్రత్యేకించ

బడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు: 1. ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడిన సభ్యుల స్థానాలు 11 కీ మొత్తం 37 మంది పోటీచేశారు.

## శాసనసభ

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీమాత్రం వుంది. అసెంబ్లీ సభ్యుల సంఖ్య మొత్తం: 99. వీరిలో షెడ్యూల్డ్ కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు: 17. షెడ్యూల్డ్ కొండ జాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు: 12. రాష్ట్రశాసనసభకు ఎన్నికలలో మొత్తం 99 స్థానాలకూ 440 మంది పోటీచేశారు.

రాష్ట్రశాసనసభలో పార్టీబలం:

కాంగ్రెసు, 75; సోషలిస్టు, 4; జనసంఘ, 4; ఇతరులు, 13; స్వతంత్రులు, 3.

స్పీకర్: ఎ. ఎస్. పట్వర్ధన్

డిప్యూటి స్పీకర్: సౌభాగ్యమల్ జెయిన్.

## మంత్రిమండలి:

పదవీస్వీకారం: 3 మార్చి 1952

| | |
|---|---|
| ముఖ్యమంత్రి<br>ఆర్థికశాఖ,<br>ఉద్యోగనియామకాలు,<br>గ్రామపాలన | మిశ్రీలాల్ గంగ్వాల్ |
| రెవిన్యూమంత్రి<br>ఆహారము,<br>సివిల్ సప్లయిస్ | శ్యామలాల్ పాండవీయ |
| ఆరోగ్యమంత్రి:<br>అడవులు,<br>కొండజాతుల క్షేమం | డాక్టర్ ప్రేమ్‌సింగ్ రతోడ్ |

విద్యామంత్రి, హోం : మనోహర్‌సింగ్ మెహత

న్యాయమంత్రి
పరిశ్రమలు, } సీతారాం జాజు
వాణిజ్యం

కార్మికమంత్రి
అడవులు } వి. వి. ద్రావిడ్
స్థానికపరిపాలన

మంత్రిమండలిక సలహాదారు : పెండ్యాల సత్యనారాయణరావు

## బడ్జెట్

1952-53 బడ్జెటును రాష్ట్ర శాసనసభలో ముఖ్యమంత్రి మిశ్రీలాల్ గంగ్వాల్ 1952 మార్చి 18 తేదిన ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి :

| | |
|---|---|
| ఆదాయం అంచనా : | రూ. 10,96,00,000 |
| ఖర్చు అంచనా : | రూ. 10,91,00,000 |
| మిగులు అంచనా : | రూ. 5,00,000 |

# మైసూర్

వైశాల్యం. 29,458 చ. మైళ్లు; జనాభా, 90,71,678. పురుషులు 46,63,858; స్త్రీలు, 44,07,820.

మైసూరు రాజ్యం, ఒక్క ఉత్తరపువైపునతప్ప, తక్కిన అన్ని దిశలలోనూ మదరాసు రాజధానితో ఎల్లలు కలిగివుంది. ఉత్తరపువైపున బొంబాయి రాజధానితో ఎల్ల కలిగివుంది. ఈ రాజ్యం 18వ శతాబ్దంలో కొన్ని సంవత్సరాలుమాత్రం హైదరాలి, టిప్పుసుల్తాన్‌ల పాలనలో ముస్లిం ఆధిపత్యంలో వుందిగాని, అంతకు పూర్వము, ఆ తరువాత హిందూరాజులే మైసూరును పరిపాలించారు. 1799 లో టిప్పుసుల్తానును ఓడించిన ఇంగ్లీషువారు, మైసూరు రాజ్యాన్ని అంతకుపూర్వపు హిందూరాజుల వంశీకుడైన కృష్ణరాజ వడయరుకు అప్పగించారు. పారిశ్రామికంగానూ, నీటి సప్లయి,

విద్యుచ్ఛక్తి ఉత్పత్తి మొదలగు విషయాలలోనూ మైసూరురాజ్యం చాలా అభివృద్ధిలోకి వచ్చింది.

బాధ్యతాయుత పరిపాలనను సంస్థానంలో నెలకొల్పాలని,సంస్థాన కాంగ్రెసువారు చేసిన ఆందోళన ఫలితంగా, సంస్థానంలో తాత్కాలిక ప్రజాప్రభుత్వాన్ని నెలకొల్పడానికీ, కన్స్టిట్యుయెంట్ అసెంబ్లీ సూచించిన ప్రకారం రాజ్యాంగ విధానాన్ని అమలులోకి తేవడానికీ,మహారాజు అంగీకరించారు. ఈ అంగీకార ఫలితంగా, 1947 అక్టోబరు 24 న, సంస్థానంలో తాత్కాలిక మంత్రిమండలి స్థాపించబడింది.

ఇండియా రాజ్యాంగవిధానాన్ని మైసూరు సంస్థానంలో అమలు జరుపుతూ మైసూరు మహారాజు 1949 నవంబరు 25 న ప్రకటనచేశారు.

భారతదేశంలో సిల్కును ఎక్కువగా తయారుచేసే ప్రాంతాలలో, ప్రథమస్థానం మైసూరుది. భద్రావతి దగ్గరవున్న ఉక్కుఫాక్టరీ ఇనుము, ఉక్కు తయారుచేసే ఫాక్టరీలలో చాలా ప్రసిద్ధి వహించింది. మైసూర్ పరిశ్రమలలో ముఖ్యంగా చెప్పవలసిన మిగతావి, చందనతైలము, చందన చెక్కడము, సబ్బులు. భారతదేశంలోకల్లా ఎక్కువ బంగారం దొరికేది యీ రాష్ట్రంలోనే.

రాజప్రముఖ్: హిజ్ హైనెస్ సర్ శ్రీ జయచామ రాజేంద్ర వడయర్ బహదర్.

## పార్లమెంటు సభ్యత్వం:

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడే సభ్యుల సంఖ్య మొత్తం: 11. వీరిలో షెడ్యూల్డ్ కులాలకు ప్రత్యేకించబడిన స్థానాల నుంచి ఎన్నుకోబడినవారు: 2. ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడే 11 మంది సభ్యులస్థానాలకూ మొత్తం 37 మంది పోటీచేశారు. పార్టీల వారీగా వారి వివరాలు ఇవి: కాంగ్రెసు, 11; కిసాన్ మజ్దూర్ ప్రజా పార్టీ, 9; సోషలిస్టులు, 4; భారతీయ జనసంఘు, 4; కమ్యూనిస్టు, 1; స్వతంత్రులు, 8.

చివరకు ఎన్నికలలో కాంగ్రెసువారు 10 మందీ, ప్రజాపార్టీ అభ్యర్థి ఒకడూ గెలిచారు.

శాసనసభలు :

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిలు వున్నాయి. అసెంబ్లీ సభ్యుల సంఖ్య మొత్తం : 100

వీరిలో షెడ్యూల్డ్ కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారి సంఖ్య : 19

అసెంబ్లీ సభ్యుల సంఖ్య, రాజ్యాంగచట్టంలో 99 గా నిర్ణయించబడినప్పటికీ, ఆంగ్లో-ఇండియనులకు ఎన్నికలలో తగిన ప్రాతినిధ్యం లేకపోతే, అసెంబ్లీకి ఒక సభ్యుణ్ణి రాష్ట్రపాలకుడు నామినేట్ చెయ్యవచ్చును అనే సూత్రాన్నిబట్టి, రాజప్రముఖ్ ఒక ఆంగ్లో-ఇండియనును అసెంబ్లీకి నామినేట్ చేశారు. అందువలన, అసెంబ్లీ సభ్యుల సంఖ్య 100 అయింది.

రాష్ట్రశాసనసభకు ఎన్నికలు 1952 జనవరి 2 తేదినుంచి జనవరి 24 తేదిలోపల జరిగాయి. మొత్తం 99 స్థానాలలోనూ, ఒక స్థానానికి కాంగ్రెసు అభ్యర్థి పోటీలేకుండా ఎన్నుకోబడినాడు. తక్కిన 98 స్థానాలకూ 393మంది పోటీచేశారు. పార్టీలవారీగా వారి వివరాలు ఇవి: కాంగ్రెసు, 98; కిసాన్‌మజ్దూర్ ప్రజాపార్టీ, 65; సోషలిస్టులు, 51; భారతీయ జనసంఘు, 25; కమ్యూనిస్టులు, 6; షెడ్యూల్డ్ జాతుల ఫెడరేషన్, 4; ఫార్వర్డుబ్లాక్, 1; రైతుసంఘు, 1; స్వతంత్రులు, 135.

శాసనసభలో పార్టీల బలాలు:

కాంగ్రెసు, 72; ప్రజాపార్టీ, 8; సోషలిస్టులు, 3; షెడ్యూల్డ్ కాస్ట్ ఫెడరేషన్, 2; కమ్యూనిస్టు, 1; ఇతరులు, 11.

స్పీకరు : హెచ్. సిద్దయ్యా

డిప్యూటీ స్పీకరు :

కౌన్సిల్ చైర్మన్ : కె. టి. భాష్యం

మంత్రిమండలి :

పదవీస్వీకారం : 4 ఏప్రిల్ 1952

| | |
|---|---|
| ముఖ్యమంత్రి ఆర్థిక శాఖ, పబ్లిక్ వర్క్స్ | కె. హనుమంతయ్య |
| విద్యామంత్రి : ప్రచురణశాఖ | ఎ. జి. రామచంద్రరావు |
| హోంమంత్రి : న్యాయశాఖ | సిద్ద వీరప్ప |
| పరిశ్రమలమంత్రి : కార్మికశాఖ | టి. సిద్ధలింగయ్య |
| ఆరోగ్యమంత్రి : స్థానికపరిపాలన | టి. చెన్నయ్య |
| రెవిన్యూమంత్రి : ఆహారశాఖ | కడిదల్ మంజప్ప |

మంత్రులజీతాలు: ఒక్కొక్కరికి నెలకు రు. 1,000. కారు అలవెన్సు రు. 250; ఇంటి అలవెన్సు రు. 250.

శాసనసభ్యులకు, నెలకు రు. 100 జీతం. అదికాక, సమావేశానికి హాజరైన ప్రతిరోజుకి రూ. 15 అలవెన్సు. ప్రయాణానికి ఫస్టుక్లాసు టికెట్ కు రెట్టింపు.

## బడ్జెట్

1952-53 బడ్జెటును 1952 మార్చి 21 న అప్పటి ఆర్థికమంత్రి దాసప్ప ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి :

| | |
|---|---|
| ఆదాయం : | రూ. 19,82,85,000 |
| వ్యయం : | రూ. 20,66,80,000 |
| లోటు : | రూ. 83,95,000 |

# రాజస్థాన్

రాజపుత్రస్థానంలోని ఉదయపూర్ (మీవార్) బన్స్వారా, బూంది, దుంగర్‌పూర్, జలావర్, కిషెన్‌ఘర్, కోటా, ప్రతాపఘర్ షాపుర, టోంక్, అనే పది సంస్థానాల యూనియన్ 1948 మే 28 తేదిన ఏర్పాటయింది. తరువాత 1949 మార్చి 30 న బికనీర్, జయపూర్, జోధ్‌పూర్, జైసల్మీర్ అనే మరినాలుగు సంస్థానాలుకూడా యీయూనియన్‌లో చేరాయి. ఆతరువాత, 1949 మే 15 న, అప్పటికి మత్స్యరాజ్యం అనే పేరుతో ఒక కూడలిగావున్న ఆల్వార్, భరత్‌పూర్, ధోల్పూర్, కరౌలి అనే మరినాలుగు సంస్థానాలుకూడా, రాజస్థాన్ యూనియనులో కలపబడినవి. రాజస్థాన్ పశ్చిమోత్తరాన పాకిస్థాన్‌తో సరిహద్దుకలిగివుంది. అంటే జోధ్‌పూర్, బికనీర్, జైసల్మీర్ సంస్థానాలకు పడమటి ఎల్ల పాకిస్థాన్ అన్నమాట. రాజస్థాన్‌కు దక్షిణాన బొంబాయి, తూర్పున మధ్యభారత్, ఉత్తరప్రదేశాలు, ఈశాన్యాన పంజాబ్‌రాష్ట్రాలు ఎల్లలు.

ఇండియాలో అత్యధిక వైశాల్యంగల రాష్ట్రాలలో 2 వ స్థానం రాజస్థాన్‌దే.

సంస్థానాల యూనియనులలో కల్లా పెద్దది రాజస్థాన్ యూనియనే. దీని వైశాల్యం 1,28,424 చ. మైళ్లు. జనాభా 1,52,97,979; పురుషులు, 79,66,208, స్త్రీలు, 73,31,771. ప్రభుత్వాదాయం ఏడాదికి సుమారు, రూ. 16 కోట్లు.

ఇచ్చట పండే పంటలలో ముఖ్యమైనవి సజ్జలు, జొన్నలు. ఈ యూనియన్‌లో కొండలు, ఎడారి ఎక్కువ. వర్షము తక్కువ. చెప్పదగిన నదులేమిలేవు. చంబల్, వనస్ అనేవి రెండే, నదులనే పేరుకు తగినవి. చంద్రకాంతశిలలు, కలప, వెదురు, వున్ని, తేనె, లక్క మొదలైనవి ఇచ్చట నుంచి ఎగుమతి అవుతవి.

ఈ యూనియన్‌కు ఒక విశ్వకళాపరిషత్తు వుంది. ఈ యూనియన్‌కు తాత్కాలిక రాజధాని, జయపూర్.

మహారాజప్రముఖ్ : హిస్ హైనెస్ మహారాజాధిరాజ మహారాణా శ్రీ సర్ భోపాలసింగ్ జీ బహదూర్ (ఉదయపూర్ మహారాణా)

రాజప్రముఖ్: లెఫ్టినెంట్ జనరల్ హిస్ హైనెస్ శర్మాద్-ఇ-రాజా హైహిందుస్థాన్ రాజరాజేంద్ర శ్రీమహారాజాధిరాజ సర్ శావాయ్ మాన్ సింగ్ బహదూర్ (జయపూర్ మహారాజు)

## పార్లమెంట్ సభ్యత్వం :

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకి ఎన్నుకోబడే సభ్యుల సంఖ్య మొత్తం : 20. వీరిలో షెడ్యూల్డ్ కులాలకు ప్రత్యేకించబడిన స్థానాల నుంచి ఎన్నుకోబడినవారు: 2. ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడే 20 సభ్యుల స్థానాలలోనూ, రెండు స్థానాలకు పోటీలేకుండా ఎన్నిక జరిగింది. తక్కిన 18 స్థానాలకూ 72 మంది పోటీచేశారు.

## శాసనసభ :

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీమాత్రం వుంది. అసెంబ్లీ సభ్యులసంఖ్య మొత్తం : 160. వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు: 17. షెడ్యూల్డు కొండ జాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు : 4. రాష్ట్ర శాసనసభ ఎన్నికలలో మొత్తం 160 స్థానాలలోనూ రెండు స్థానాలకు కాంగ్రెసువారు పోటీలేకుండా ఎన్నుకోబడినారు. తక్కిన 158 స్థానాలకూ 616 మంది పోటీచేశారు.

రాష్ట్ర శాసనసభలో పార్టీలబలం :

కాంగ్రెసు, 83; సోషలిసు, 1; ప్రజాపార్టీ, 1; జనసంఘు, 8; కృషిలోక్, 7; స్వతంత్రులు, 34; రామరాజ్యపరిషత్, 24; హిందూ మహాసభ 2; సోషలిస్టులు, 1.

స్పీకరు : నరోత్తం లాల్ జోషి

డిప్యూటీ స్పీకరు: ఠాకూర్ లాల్ సింగ్ శక్తవాన్

మంత్రిమండలి :

పదవీస్వీకారం : 3 మార్చి 1952

ముఖ్యమంత్రి, హోం, ఉద్యోగ నియామకములు : తికారాం పలివాల్.

రెవిన్యూమంత్రి, వ్యవసాయము : ఎం. ఎల్. సుఖాడియా

పబ్లిక్ వర్క్సుమంత్రి : భోలానాథ్ మాస్టర్.

ఆహారమంత్రి : భోగిలాల్ పాండ్య.

న్యాయమంత్రి, వ్యాపారము, ఆహారము : రాం కిశోర్ వ్యాస్.

ఆర్థికమంత్రి, విద్య : నాథురాం మిర్థా.

అడవులమంత్రి : అమృతలాల్ యాదవ్.

స్థానిక పరిపాలన మంత్రి : రామ్‌కరణ్ జోషి.

## బడ్జెట్

1952-53 సంవత్సరానికి బడ్జెటును, ఆర్థికమంత్రి టి. మిర్థా, 1952 ఏప్రిల్ 7 న శాసనసభలో ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి :

| | |
|---|---|
| ఆదాయం అంచనా | రూ. 16,32,18,000 |
| వ్యయం అంచనా : | రూ. 17,25,66,000 |
| లోటు అంచనా : | రూ. 93,48,000 |

# సౌరాష్ట్ర

సౌరాష్ట్రరాజ్యం ఫిబ్రవరి 15 న ఏర్పాటుచేయబడినది. ఈ సంస్థానాల యూనియన్‌ను కథియవాడ్ అనికూడా అంటారు. ఇండియాలో ఏర్పడిన మొట్టమొదటి సంస్థానాల యూనియన్ ఇదే. దీనిలో చిన్నవీ, పెద్దవీ కలిపి మొత్తం 221 సంస్థానాలు వున్నాయి. వీటిలో పెద్దవి జూనగఢ్, భావనగర్, నవనగర్, ధరంగధ్ర, రాజకోట మొదలైనవి, సుమారు 30. ఈ యూనియన్ బొంబాయి రాష్ట్రానికి ఉత్త

రంగా, ఇండియా పశ్చిమతీరానవున్నది. చరిత్రప్రసిద్ధమైన సోమనాథదేవా లయం యీ యూనియన్‌లోనే వుంది. ఈ యూనియన్‌లోని ప్రజలందరూ గుజరాతీ భాష మాట్లాడుతారు. ఈ యూనియన్ వైశాల్యం, 21,062 చ. మైళ్లు జనాభా 41,36,005; పురుషులు, 20,94,968; స్త్రీలు, 20,41,037. ప్రభుత్వాదాయం ఏడాదికి సుమారు ఎనిమిదికోట్లు.

సౌరాష్ట్రరాజ్యం పూర్తిగా వ్యావసాయికదేశం అని చెప్ప వచ్చును. ఇచ్చటపండే పంటలలో ప్రధానమైనవి, గోధుమ, జొన్న, సజ్జ, వేరుశెనగ, ప్రత్తి.

ఈ యూనియన్‌లోని ప్రధానపరిశ్రమ బట్టలనేత. ఇక్కడ తొమ్మిది బట్టల మిల్లులు వున్నాయి. ఉప్పు తయారుచెయ్యడంకూడా ఇచ్చట చెప్పదగ్గ పరిశ్రమలలో ఒకటి. యూనియన్ ఏర్పాటైన తరు వాత, ఇక్కడ కొత్త పరిశ్రమలు అనేకం స్థాపించబడినవి.

ఈ యూనియన్‌కు రాజధాని రాజకోట.

రాజప్రముఖ్: నవనగర్ మహారాజు

ఉపరాజప్రముఖ్. భావనగర్ మహారాజు

పార్లమెంటు సభ్యత్వం:

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడే సభ్యుల సంఖ్య మొత్తం: 6.

పార్లమెంటుకు ఈరాష్ట్రంనుంచి ఎన్నుకోబడిన 6 స్థానాలలోనూ ఒక స్థానానికి మేజర్ జనరల్ హిమత్‌సింహజీ, కాంగ్రెసు అభ్యర్థి పోటీ లేకుండా ఎన్నుకోబడినారు. తక్కిన 5 స్థానాలకూ 19 మంది పోటీ చేశారు.

శాసనసభ:

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీమాత్రం వుంది. అసెంబ్లీ సభ్యుల సంఖ్య మొత్తం: 60. వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యే

కించిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు : 4. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు : 1.

రాష్ట్ర శాసనసభకు ఎన్నికలలో మొత్తం 60 స్థానాలలోనూ ఒక స్థానానికి కాంగ్రెసు అభ్యర్థి పోటీలేకుండా ఎన్నుకోబడినాడు. తక్కిన 59 స్థానాలకూ 224 మంది పోటీచేశారు.

రాష్ట్ర శాసనసభలో పార్టీలబలం :

కాంగ్రెసు, 55; సోషలిస్టు, 2; ఇతరులు, 1; స్వతంత్ర, 2;

స్పీకరు : మగన్‌లాల్ జోషి

డిప్యూటి స్పీకరు : ప్రేంచంద్ ఎం. షా

మంత్రిమండలి :

పదవీస్వీకారం : 28 ఫిబ్రవరి 1952
ముఖ్యమంత్రి రెవిన్యూ : యు. ఎన్. ఢేబర్
హోం మంత్రి, రవాణా సౌకర్యములు : ఆర్. యు. పరీఖ్
పోర్టుఫోలియోలేనిమంత్రి : ఎం. ఎం. షా
విద్యామంత్రి, పబ్లిక్ వర్క్సు : జె. కె. మోడి
ఆర్థికమంత్రి : జి. బి. కోటక్
న్యాయమంత్రి : డి. టి. డవె
పరిశ్రమలమంత్రి, ఆహారము, కార్మికులు : జి. సి. ఓజా
స్థానిక పరిపాలనమంత్రి : ఆర్. ఎం. అదాని

## బడ్జెటు

1952-53 సంవత్సరానికి బడ్జెటును రాష్ట్ర శాసనసభలో 1952 మార్చి 20 న, ఆర్థికమంత్రి గిరిధరిలాల్ కోటక్ ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి :

| | |
|---|---|
| వస్తుందని అంచనా వేసిన ఆదాయం : | రు. 8,73,24,000 |
| అవుతుందని అంచనా వేసిన ఖర్చు : | రు. 8,71,94,000 |
| మిగులు అంచనా : | రు. 1,30,000 |

# హైదరాబాద్

వైశాల్యం : 82,312 చ. మైళ్లు. జనాభా, 1,86,52,964; పురుషులు, 94,64,495; స్త్రీలు, 91,88,469.

బ్రిటిషువారితో ఒడంబడిక చేసుకోవడానికి పూర్వం, హైదరాబాద్ పాలకుడు దక్కన్ సుబేదారు అనే హోదాతో, ఢిల్లీలోని మొగల్ చక్రవర్తికి లోబడిప్రంచేవాడు. మొగల్ చక్రవర్తి అధికారం సన్నగిలినకొద్ది దక్కన్ సుబేదారు ప్రాబల్యం హెచ్చింది. అయితే, దక్కన్ సుబేదారీలో మొట్టమొదట వున్నంత భూభాగం యిప్పుడులేదు. కొంతభాగం, మహారాష్ట్రుల వశమైంది. కొంతభాగం, ఇంగ్లీషువారికి దత్తం చెయ్యబడింది. బ్రిటీషు ప్రభుత్వం, హైదరాబాదు పాలకుణ్ణి నైజాం అనే హోదాతో "హిజ్ ఎగ్జాల్టెడ్ హైనెస్" అనే బిరుదుతో, స్వతంత్రరాజుగా గుర్తించారు.

హైదరాబాదు పాలకుడు ముస్లిం మతావలంబి అయినప్పటికీ ప్రజలలో నూటికి 86 వంతులు హిందువులు.

ఈ సంస్థానం 17 జిల్లాలుగా విభజింపబడింది. మొత్తం 153 తాలూకాలు వున్నాయి. రాజ్యంలోని ప్రజలు విస్తారంగా తెలుగువారు, మహారాష్ట్రులు కాబట్టి, రాజ్యాన్ని తెలంగాణమనీ, మహారాట్వారా అని రెండు భాగాలుగా వ్యవహరిస్తారు.

సంస్థాన పరిపాలన అంతా, నైజాం యిష్టప్రకారం జరిగేది. ప్రజలలో నూటికి పన్నెండు వంతులకు తక్కువగావున్న ముస్లిములకు, హిందువులతో సమాన ప్రాతినిధ్యం యివ్వబడిన శాసనసభ 1947 లో ఏర్పాటు చేయబడింది. ఈ శాసనసభ ప్రథమసమావేశం 1947 ఫిబ్రవరి 17 వ తేదిన జరిగింది.

తెలంగాణా ప్రాంతం, 41,41,502 చ. మైళ్ళు. మహారాష్ట్రప్రాంతం 27,591 చ. మైళ్ళు. కర్ణాటకప్రాంతం, 13,605 చ. మైళ్ళు.

ఈ రాష్ట్రంలో ప్రతి ఏటా దాదాపు 10 లక్షల టన్నుల బొగ్గు త్రవ్వబడుతున్నది.

పంచదార, కాగితము, సిమెంటు, గాజు, సిగరెట్లు యీ రాష్ట్రంలోని ప్రధాన పరిశ్రమలు.

ఇండియాలోని సంస్థానాలన్నీ, 1947 ఆగస్టు 15 అనంతరం ఇండియాప్రభుత్వంతో దృఢసంబంధాల ఒడంబడికలను చేసుకున్నప్పటికీ, హైదరాబాదు నైజాం మాత్రం, అలా చెయ్యడానికి అంగీకరించలేదు. తన సంస్థానం ఇతర సంస్థానాలవలె గాక ప్రత్యేక హోదాగలదనీ, తాను ఇండియాతో స్నేహంగావుంటానని ఒడంబడిక చేసుకోగలనేగాని, అందరివలెనే ఇండియాప్రభుత్వానికి లోబడి దృఢసంబంధపు ఒడంబడిక చేసుకోనజాలననీ నైజాం ప్రకటించాడు. ఇండియాప్రభుత్వానికీ, నైజాం ప్రతినిధులకూ సుమారు నాలుగునెలలపాటు రాయబారాలుజరిగినతరువాత 1947 నవంబరు 18 న, యథాతథపు ఒడంబడికపై నైజాము సంతకం పెట్టడం జరిగింది. ఈ ఒడంబడిక ప్రకారం, హైదరాబాదుకీ, ఇండియా ప్రభుత్వానికీ 1947 ఆగస్టు 15 కు పూర్వం ఏ సంబంధాలు వుండేవో, అవే ఇకముందు ఒక సంవత్సరందాకా వుంటాయి. ఆ సంవత్సరం లోపల శాశ్వతమైన ఒడంబడిక కుదుర్చుకోవటానికి ఉభయులూ ప్రయత్నిస్తారు.

ఈ ఒడంబడిక ప్రకారం, హైదరాబాదులోవున్న ఇండియా సైన్యాలన్నీ 1948 ఫిబ్రవరి మాసాంతంలోపల హైదరాబాదునుంచి రప్పించివేయబడుతవి. అన్ని దేశాలలోను తన ఏజంట్లను నియమించడానికి నిజాం హక్కు కలిగివుంటారు. హైదరాబాదులో ప్రభుత్వాన్ని కూలదోయడానికి ఏమైనా ప్రయత్నాలు జరిగితే, వాటిని అణచివెయ్యడానికి తగిన సహాయం ఇండియా ప్రభుత్వం ఇస్తుంది.

జనాభాలో నూటికి 15 వంతులేవున్న ముస్లిములకు, హిందువులతో సమానంగా ప్రాతినిధ్యంవున్న శాసనసభను ఏర్పాటుచెయ్యడం అన్యాయమనీ, ప్రజలందరికీ సమానహక్కులు, వయోజన ఓటింగుహక్కు, మెజారిటీ పక్షప్రభుత్వము సంస్థానంలో నెలకొల్పవలసిందనీ, సంస్థానం ఇండియాతో దృఢసంబంధపు ఒడంబడికను చేసుకోవాలనీ సంస్థాన

కాంగ్రెసు కోరింది. సంస్థానాధిపతి యీ కోర్కెలకు అంగీకరించనందున కాంగ్రెసు సత్యాగ్రహం జరిపింది.

ఇండియాతో యథాతథపు ఒడంబడికను చేసుకున్న తరువాత నైజాం అప్పటికివున్న మంత్రిమండలిని తొలగించి, హైదరాబాదులో పెద్దవ్యాపారస్తుడు మీర్ లాయకు ఆలీని ప్రధానమంత్రిగా నియమించాడు. ఆయన 1947 డిసెంబరు 16 న ఒక మంత్రిమండలిని ఏర్పాటు చేశాడు. ఈ మంత్రిమండలిలో ఎనిమిదిమంది ముస్లిములు, ఆరుగురు హిందువులు, ముస్లిములు ముఖ్యంగా, హైదరాబాదులోని ఇత్తెహాద్ ఉల్ ముస్లిమీన్ అనే సంస్థ నాయకుడు సయ్యద్ కాశిం రజ్వీ సూచనపై నియమింపబడినవారు. ఈ రజ్వీ, హైదరాబాదు స్వతంత్రరాజ్యంగావుండాలనీ, సంస్థానంలో అల్పసంఖ్యలోవున్న ముస్లిములే పరిపాలన సాగించాలని ప్రచారం ఆరంభించి, తనకు ప్రతికూలురనందరినీ అణచడానికి రజాకార్లు అనే సేనతో, సైనిక తరఫీదు పొందిన ముఠా తయారుచేశాడు. వీరు సంస్థాన ప్రజలపైన, ముఖ్యంగా హిందువులపై చేసిన దౌర్జన్యాలు చెప్పరానివి. అంతేగాక, యీముఠా, ఇండియాసరిహద్దులపైనకూడా దాడులు జరుప నారంభించింది. ఈ ముఠా దౌర్జన్యాలను సహించడమేకాక, వీరికి ప్రోద్బలంయిస్తూ లాయక్ ఆలి మంత్రివర్గం, సంస్థానసైన్యాలను పెంచడం ఆరంభించింది. దొంగతనంగా ఆయుధాలను దిగుమతిచేసుకోడం సాగించింది. యథాతథపు ఒడంబడిక ప్రకారం, హైదరాబాదులో వున్న ఇండియా సైన్యాలు ఇండియాకు రప్పించివెయ్యబడినందున, యీ దౌర్జన్యచర్యలను అరికట్టేవారే లేకపోయారు. సంస్థానంలోని ఉద్యోగులలో అధిక సంఖ్యాకులు ముస్లిములే. వారిలో చాలామంది రజాకార్లకు ప్రోద్బలంకూడా యివ్వడం ఆరంభించారు.

హైదరాబాదులో శాంతినిఏర్పరచడానికి, ఇండియాప్రభుత్వంతో ఒక ఒడంబడికకు వచ్చేటట్టు చెయ్యడానికి, ఇండియాప్రభుత్వం హైదరాబాదు ప్రతినిధులతో 1948 మార్చిలోనూ, జూన్‌లోనూ ఢిల్లీలో సంప్రతింపులు జరిపారు. కాని, హైదరాబాదు ప్రతినిధులు ఢిల్లీలో ఒక ఒడంబడికకుఒప్పుకోవడం, హైదరాబాదువెళ్ళి దానిని కాదనడం జరిగింది.

ఈలోపల రజాకార్ల దౌర్జన్యాలు చాలా ఎక్కువ అయిపోయాయి. వందలకొలది గ్రామాలపై దాడులు, హిందువులను, తమ హింసాపద్ధతులకు వ్యతిరేకతను చూపిన ముస్లిములను ఘోరహత్యలకు పాల్పరచడము, ఇళ్ళను తగులబెట్టడము, స్త్రీలను అవమానించడము, మొదలైన కృత్యాలు హైదరాబాదు సంస్థానంలోని గ్రామాలలోనే కాక, ఇండియా సరిహద్దు గ్రామాలలోకూడా రజాకార్లు సాగించారు. ఒకవైపున మీర్ లాయక్ అలి మంత్రివర్గం విమానములమీద దొంగతనంగా ఆయుధాలను దిగుమతి చేయించి, సైన్యాన్ని ఎక్కువగా పెంచివేస్తున్నది. ఇదంతా చూసి, ఇక పూరుకుంటే పరిస్థితులు విషమించుతాయని ఇండియా ప్రభుత్వం నిశ్చయించి, హైదరాబాదులో శాంతిభద్రతలు, ఇండియాఅంతట శాంతిభద్రతల నిర్వహణకు ప్రధానం కనుక, సంస్థానంలో శాంతిభద్రతలను కాపాడడానికి ఇండియా సైన్యాలను యథాతథపు ఒడంబడికకు పూర్వంవలెనే సికిందరాబాదు, బొలారం, తిరుమలగిరిలలో వుంచటానికి అనుమతి ఇవ్వవలసిందని నైజామును సెప్టెంబరు 7 వ తేదీన కోరింది. నైజాం యీ కోరికను నిరాకరించాడు. అయినప్పటికీ, ఇండియా సేనలు హైదరాబాదుకు కదులుతాయనీ, సికింద్రాబాదు, బొలారం, తిరుమలగిరి లో స్థావరం ఏర్పరచుకుంటాయనీ, హైదరాబాద్ సేనలు ప్రతిఘటించినట్లయితే, ఆ ప్రతిఘటనను అణచివేసి, ఇండియా సేనలు తమ గమ్యస్థానాన్ని చేరుకుంటాయని ఇండియా ప్రధానమంత్రి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, సెప్టెంబరు 10 వ తేదిన ప్రకటించారు.

ఇండియా ప్రభుత్వంవారి, యీ నిర్ణయాన్ననుసరించి, ఇండియా సైన్యాలు, సెప్టెంబరు 12 వ తేది రాత్రి నాలుగుగంటలకు, తెల్లవారితే 13 తేది అనగా, హైదరాబాదు సంస్థానంలోకి కదలినవి. సంస్థానంలో శాంతి, భద్రతలను నెలకొల్పడానికి ఇండియాప్రభుత్వం ఉపక్రమించిన యీ చర్యలను జయప్రదంగా సాగించడానికీ, సేనలకు నాయకుడు, లెప్టినెంట్ జనరల్ మహారాజ్ శ్రీరాజేంద్రసింహాజీ. ఈ చర్య ఆరంభమవడానికి రెండురోజులు ముందుగా, లాయక్ ఆలీ మంత్రిమండలి, ఇండియాపైన మిత్రరాజ్య భద్రతామండలిలో ఫిర్యాదు చెయ్యడానికి ఒక ప్రతినిధివర్గాన్ని పాలిస్ పంపించింది. భద్రతామండలి యీ విషయాన్ని చర్చించ

డానికి నిశ్చయించింది. కాని, ఓపనం చెప్పకు రాకముందే, సెప్టెంబరు 17 తేదీన హైదరాబాదు, ఇండియాకు లొంగిపోయింది. ఇండియా సేనలు హైదరాబాదుకు 30 మైళ్ళ సమీపంలోకివచ్చేసరికి, లాయకుఅలీ మంత్రి వర్గం రాజీనామా యిచ్చింది. నిజాం, ఆ రాజీనామాను అంగీకరించి, ఇండియాసైన్యాలను హైదరాబాదుకు ఆక్రమించి, శాంతిభద్రతలను నెల కొల్పవలసిందిగా కోరాడు. సెప్టెంబరు 18 తేదీ సాయంకాలం, ఇండియా సేనలు హైదరాబాదునగరంలో ప్రవేశించాయి. భద్రతాసంఘంలో ఫిర్యాదును ఉపసంహరించుకోడానికి, రజాకార్ల ముఠాను తొలగించ డానికీ, నిజాం ఫర్మానా చేశాడు.

హైదరాబాదులో ఇండియాసేనలు ప్రవేశించేటప్పటికి, సంస్థానం పరిస్థితిఅంతా అల్లకల్లోలంగా ఉంది. సంస్థానంలో శాంతిని నెలకొల్పడం, ప్రజాపరిస్థితిని విర్పరచడం, సక్రమ పరిపాలనను ఏర్పాటు చెయ్యడం, ఇండియాప్రభుత్వ కర్తవ్యమైంది. పరిస్థితులు చక్కబడేదాకా, పరిపాలన సాగించడానికి మేజర్-జనరల్ జె. ఎన్. చౌధురి హైదరాబాదుకు మిలి టరీ గవర్నరుగా నియమింపబడినారు. చీఫ్ సివిల్ అడ్మినిస్ట్రేటర్‌గా డి. ఎస్. భక్లె. అడిషనల్ అడ్మినిస్ట్రేటర్‌గా డి. ఆర్. ప్రధాన్, నియ మింపబడినారు. సంస్థానంలోని 17 జిల్లాలలోను పరిపాలనను సక్రమ మార్గంలోకి తీసుకురావడానికి, ఇండియా రాష్ట్రాలనుంచి 17 మంది కలెక్టర్లు, 17 మంది జిల్లా పోలీసు సూపరింటెండెంట్లు హైదరాబాదుకు పంపబడినారు. 1949 డిసెంబరు 1 నుంచీ, సంస్థానపరిపాలనకు జనరల్ చౌధురిస్థానే ఎం. కె. వెల్లోడి నియమింపబడినారు.

1949 డిసెంబరు 1 తేదీన ఎం. కె. వెల్లోడి ప్రధానమంత్రిగా, యీ క్రింది మంత్రిమండలి ఏర్పాటు చేయబడింది. ప్రధానమంత్రి : ఎం. కె. వెల్లోడి, హోంమంత్రి : డి. ఎస్. భక్లె, ఆరోగ్యమంత్రి : నవాబ్ జెయిన్ యార్‌జంగ్ బహదూర్, విద్యామంత్రి : రాజాధోండి రాజ్ బహదూర్, రెవిన్యూమంత్రి : ఎం. శేషాద్రి, ఆర్థికమంత్రి : సి. వి. ఎస్. రావు, కార్మిక మంత్రి : సి. హెచ్. కృష్ణారావు. కాని ప్రజానాయకులనుకూడా ప్రభుత్వ పాలనతో సంబంధం పెట్టుకొనేటట్లు

చూడవలసిందని ఆందోళన ఎక్కువైనందున, సంస్థాన కాంగ్రెసుతో ప్రభుత్వం రాయబారాలు జరిపింది. తత్ఫలితంగా సంస్థాన కాంగ్రెసు ప్రతినిధులు నలుగురు (బూర్గుల రామకృష్ణరావు, వినాయకరావు విద్యాలంకార్, వల్లూరు బసవరాజు, ఫూల్‌చంద్ గాంధి) మంత్రులుగా ప్రభుత్వంలో చేరడానికి అంగీకరించారు. వీరితో క్రొత్త మంత్రిమండలి, 1950 జూన్ 5 తేదిన ఏర్పాటు చేయబడింది, పూర్వపు మంత్రిమండలినుంచి డి. ఎస్. భక్లె, ధోండిరాజ్ బహదూర్, వి. హెచ్. కృష్ణారావుగారు రాజీనామా యిచ్చారు. కొత్తమంత్రిమండలి జూన్ 12 తేదీన ప్రమాణ స్వీకారం చేసింది. తరువాత ఎన్నికలు జరిగినవి.

ఎన్నికల అనంతరం, వయోజన ఓటింగు హక్కుతో ప్రజలు ఎన్నుకున్న మొట్టమొదటి శాసనసభకు 1952 మార్చి 23 న రాజప్రముఖ్ ప్రారంభోత్సవం జరిపారు.

రాజప్రముఖ్ : హిస్ ఎగ్జాల్టెడ్ హైనెస్ రుస్తుమ్-ఇ-దౌరాన్ అగస్తు-ఇ-జమాన్, లెఫ్టినెంటు జనరల్ ముజఫర్ ఉల్ ముల్క్ వాల్ మామాలిక్ నవాబ్ మీర్ ఉస్మాన్ అలిఖాన్ బహదూర్ ఫతేజంగ్ సిపాహి సాలారు నిజాముద్దౌలా నిజాముల్ ముల్క్ అసఫ్ జా.

యువరాజు : హిస్ హైనెస్ నవాబ్ మీర్ హిమాయత్ అలిఖాన్ అజం బహదూర్, బేరార్ యువరాజు.

ప్రీవీపర్స్ : నిజాం సొంతఖర్చులకుగాను ఏడాదికి ఒక కోటి రూపాయలు ప్రీవీపర్స్ ఇవ్వబడుతున్నది. ఇదిగాక, నిజాం సొంతఆస్తిగా పరిగణింపబడుతున్న సర్ఫ్ కాస్ భూములను సంస్థాన ప్రభుత్వం స్వాధీన పరచుకున్నందున, యీ భూములనుంచి వచ్చే ఆదాయానికి నష్టపరిహారంగా నిజాంకు ఏడాదికి 25 లక్షల రూపాయలు ఇవ్వబడుతున్నది.

## పార్లమెంట్ సభ్యత్వం :

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకి ఎన్నుకోబడే సభ్యుల సంఖ్య మొత్తం : 25

వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించిన స్థానాలనుంచి ఎన్నుకోబడిన వారు : 4

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకి జరిగిన ఎన్నికలలో, 25 స్థానాలకీ, రెండు స్థానాలకు కాంగ్రెసు అభ్యర్థులు పోటీలేకుండా ఎన్నికో బడినారు. తక్కిన 23 స్థానాలకూ మొత్తం 70 మంది అభ్యర్థులు పోటీ చేశారు. పార్టీలప్రకారం ఆ అభ్యర్థుల వివరాలు ఇవి : కాంగ్రెసు, 23; సోషలిస్టు, 13; పీపుల్సు డెమొక్రటిక్ ఫ్రంటు, 12; షెడ్యూల్డు జాతుల ఫెడరేషన్, 4; స్వతంత్రులు, 16; ఇతర పార్టీలు, 2.

శాసనసభ :

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీమాత్రం వుంది. అసెంబ్లీ సభ్యుల సంఖ్య మొత్తం : 175

వీటిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించిన స్థానాలనుంచి ఎన్నుకోబడిన వారు : 30

షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించిన స్థానాలనుంచి ఎన్నుకోబడిన వారు : 2

రాష్ట్ర శాసనసభ ఎన్నికలలో మొత్తం 175 స్థానాలలోను, నాలుగు స్థానాలకు కాంగ్రెసు అభ్యర్థులు పోటీలేకుండా ఎన్నుకోబడీనారు. తక్కిన 171 స్థానాలకూ 554 మంది పోటీచేశారు. పార్టీలవారీగా ఆ అభ్యర్థుల వివరాలివి : కాంగ్రెసు, 168; సోషలిస్టులు, 98; పీపుల్సు డెమొక్రటిక్ ఫ్రంట్, 75; షెడ్యూల్డ్ జాతుల ఫెడరేషన్, 20; రైతుకూలీ పార్టీ, 17; ప్రజాపార్టీ, 6; రామరాజ్య పరిషత్, 6; స్వతంత్రులు, 155; తక్కిన పార్టీలు, 9

రాష్ట్ర శాసనసభలో పార్టీలబలం :

కాంగ్రెసు, 93; సోషలిస్టు, 11; కమ్యూనిస్టులు, వారి సహచరులు, 42; షెడ్యూల్డ్ కాస్ట్ ఫెడరేషన్, 5; ఇతరులు, 10; స్వతంత్రులు, 14.

స్పీకర్ : కాశీనాథరావు వైద్య (రు. 1,250)

డిప్యూటి స్పీకర్ : పంపన్ గౌడ (రు. 750)

శాసనసభ్యుల జీతాలు : నెలకు రూ. 200; కాక, సభా సమావేశానికి హాజరైన ప్రతిరోజుకీ రూ. 12-8-0 భత్యం.

మంత్రిమండలి :

పదవీస్వీకారం : 6 మార్చి 1952

ముఖ్యమంత్రి : భూమిశిస్తు, పరిపాలనా వ్యవహారాలు: బూర్గుల రామకృష్ణరావు

ఆరోగ్యమంత్రి : విద్యాశాఖ ఫూల్ చంద్ గాంధి

పరిశ్రమలమంత్రి, వాణిజ్యం : వినాయకరావ్ విద్యాలంకార్

కార్మికమంత్రి : వి. బి. రాజు

హోంమంత్రి : డి. జి. బిందు

ఆర్థికమంత్రి : డాక్టర్ జి. ఎస్. మెల్కోటే

ఆహారమంత్రి, వ్యవసాయం : డాక్టర్ ఎం. చెన్నారెడ్డి

ఎక్సైజుమంత్రి, కస్టమ్స్, అడవులు: కె. వి. రంగారెడ్డి

పబ్లిక్ వర్క్స్ మంత్రి : నవాబ్ మెహిది నవాజ్ జంగ్

స్థానిక పరిపాలనమంత్రి : అన్నారావు

గ్రామపునర్నిర్మాణమంత్రి : దేవసింగ్ చౌహాన్

సంఘసేవలమంత్రి : శంకరదేవ్

న్యాయమంత్రి : జగన్నాథరావ్ చందార్కి

మంత్రిమండలి సలహాదారు : ఎం. కె. వెల్లోడి

మంత్రులజీతాలు : నెలకు రు. 1,250; జీతంకాక, ఉచిత గృహవసతి, కారు అలవెన్సు రు, 500.

## బడ్జెటు

1952-53 సంవత్సరానికి బడ్జెటును, 1952 మార్చి 25 న ఆర్థిక మంత్రి జి. ఎస్. మెల్కోటే ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి :

| | | |
|---|---|---|
| అంచనా వేసిన ఆదాయం : | రు. | 30,98,87,000 |
| అంచనా వేసిన ఖర్చు : | రు. | 31,51,73,000 |
| లోటు అంచనా : | రు. | 52,86,000 |

# కమిషనర్ రాష్ట్రాలు

స్వపరిపాలన లేకుండా, ప్రెసిడెంటు పరిపాలనలోవున్న కొన్ని ప్రదేశాలను చీఫ్ కమిషనర్ల రాష్ట్రాలు అంటారు. వీటి పరిపాలనను ప్రెసిడెంటు అధికారానికి లోబడిన చీఫ్ కమిషనరు సాగిస్తాడు. ఇలాటి రాష్ట్రాలు ఇండియాలో 12 వున్నాయి. అవి : అజ్మీర్, అండమాన్ నికోబార్, కచ్, కూర్గ్, ఢిల్లీ, భోపాల్, మణిపూర్, బిలాస్‌పూర్, సిక్కిం, వింధ్యప్రదేశ్, హిమాచలప్రదేశ్.

ఈ రాష్ట్రాల వివరం యీ క్రింద ఇవ్వబడింది.

## అజ్మీరు

ఇది రాజపుత్రస్థానంలో వుంది. దీనివైశాల్యం, 2,425 చదరపు మైళ్ళు. జనాభా, 6,92,506 ; పురుషులు, 3,59,572 ; స్త్రీలు, 3,32,934 ప్రజలలో నూటికి 62 వంతులు వ్యవసాయంమీద ఆధారపడినవారు. ఇక్కడ పండేపంటలు, మొక్కజొన్న, రాగులు, బార్లీ, ప్రత్తి, తిలధాన్యములు, గోధుమ. ప్రభుత్వాదాయం ఏడాదికి రు. 116 లక్షలు. చీఫ్ కమిషనర్ : ఎ. డి. పండిట్.

రాష్ట్రశాసనసభ్యులసంఖ్య 30. వీరిలో షెడ్యూల్డు కులాల ప్రతినిధులు 6.

శాసనసభలో పార్టీల బలం : కాంగ్రెసు, 20 ; జనసంఘం 3 స్వతంత్రులు, 4 ; ఇతర పార్టీలు, 3.

స్పీకరు : భాగీరథిసింగ్ చౌధురి

మంత్రిమండలి : పదవీస్వీకారం : 1952 మార్చి 24

ముఖ్యమంత్రి : హరిభాయ్ ఉపాధ్యాయ

రెండవమంత్రి : బాలకృష్ణకౌల్

మూడవమంత్రి : బ్రిజ్ మోహనశర్మ

# అండమాన్, నికోబారు దీవులు

బంగాళాఖాతంలో, మదరాసుకు తూర్పుగా 740 మైళ్ళు, కలకత్తాకు దక్షిణంగా 780 మైళ్ళదూరంలోవున్న అండమాను దీవులున్నూ ఈ దీవులకు దక్షిణంగా 85 మైళ్ళదూరాన, బంగాళాఖాతంలోవున్న నికోబార్ దీవులున్నూ, ఇండియా ప్రభుత్వపరిపాలనలో, ఒక చీఫ్ కమిషనర్ పాలనలో వున్నాయి.

అండమానుదీవులలో పెద్దవి ఆరున్నూ, చిన్నదీవులు సుమారు రెండువందలున్నూ వున్నాయి. వీటి వైశాల్యం మొత్తం, 2,508 చ. మైళ్ళు. నికోబార్ దీవుల సంఖ్య, 19. వీటి వైశాల్యం, 635 చ. మైళ్లు మొత్తం జనాభా, 30,963 ; పురుషులు, 19,036 ; స్త్రీలు, 11,927. అండమాను దీవుల ప్రధాననగరం పోర్ట్ బ్లేర్.

పశ్చిమపంజాబు, తూర్పు బెంగాలు రాష్ట్రాలనుంచి ఇండియాకు వచ్చిన కాందిశీకులలో కొంతమందిని యీ దీవులకు పంపి, వీటిని నివాస యోగ్యులుగా చేసి, వీటిని ఉపయోగించాలని ఇండియా ప్రభుత్వంవారి ఉద్దేశం. 1949 డిసెంబరు 2 నాటికి తూర్పుబెంగాలునుంచి ఇండియాకు వచ్చివేసిన కాందిశీకులలో 189 కుటుంబములు యీ దీవులకు పంపబడినారు.

చీఫ్ కమిషనర్ : ఎ. కె. ఘోష్.

# కచ్

1948 జూన్ 1 తేదీవరకు స్వతంత్ర సంస్థానంగావున్న కచ్, ఆ తేదీన, ఇండియాలో ఒక రాష్ట్రంగా కలిసిపోయింది. దీనిని, ఇండియా ప్రభుత్వంవారు ఒక కమిషనర్ రాష్ట్రంగా ఏర్పాటు చేశారు.

ఇండియాకు పశ్చిమోత్తరాన, పాకిస్థాన్ రాష్ట్రమైన సింధుకు దిగువన, ఈ సంస్థానం వుంది. దీని వైశాల్యం 8461 చ. మైళ్లు. జనాభా 5,67,825 ; పురుషులు, 2,73,363 ; స్త్రీలు, 2,94,462. ఆదాయం ఏడాదికి రు. 80 లక్షలు. ఈ సంస్థానాన్ని సంయుక్త సౌరాష్ట్ర రాజ్యంలో కలిపివేయడమా, లేక తమ పరిపాలనలోకి తెచ్చుకోవడమా అనే విషయాన్ని పరిశీలించి, ఇండియా ప్రభుత్వం వారు దీనిని తమ పరిపాలనలో కమిషనర్ రాష్ట్రంగా వుంచడానికి నిశ్చయించారు. ఆప్రకారమే కచ్ సంస్థానాధిపతి, మహారాజాధిరాజ మీర్జా మహారావు శ్రీ మదనసింహాజీ బహదూర్‌తో 1948 మే 4 తేదీన ఒక ఒడంబడికకు వచ్చారు. 1948 జూన్ 1 తేదీ నుంచి కచ్ కమిషనర్ రాష్ట్రమైంది. దీనికి రాజధాని, భుజ్. ఈ రాష్ట్రంలో ఇనుము, లిగ్నైట్ మొదలైన ఖనిజములు ఎక్కువగా వున్నాయి.

షీఫ్ కమిషనర్ : సి. కె. దేశాయ్,

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకు సభ్యులను ఎన్నుకోడానికి, ఎన్నిక సభ్యులసభ ఒకటివుంది. దానిలో 30 మంది సభ్యులు ప్రజలచే ఎన్నుకోబడినవారు వుంటారు. గత ఎన్నికలలో ఈ సభకు 28 మంది కాంగ్రెసువారూ, ఇతరులు ఇద్దరూ ఎన్నుకోబడినారు.

# కూర్గు

దక్షిణ భారతదేశంలో, మైసూరు రాజ్యానికి పశ్చిమంగా వున్న చిన్న రాష్ట్రం ఇది. దీని వైశాల్యం. 1,593 చ. మైళ్లు. జనాభా, 2,29,255 ; పురుషులు, 1,25,333 ; స్త్రీలు; 1,03,922. ప్రజల ప్రధాన జీవనాధారం, వ్యవసాయం. ఇక్కడ ప్రధానమైన పంట కాఫీ. ఈరాష్ట్రానికి ప్రధాననగరం. మెర్కారా.

షీఫ్ కమిషనర్ : లెఫ్టినెంట్ కర్నల్ దయాసింగ్ బేడి.

రాష్ట్రశాసనసభ సభ్యులసంఖ్య 24. వీరిలో షెడ్యూల్డు కులాల ప్రతినిధులు 6 ; షెడ్యూల్డు కొండజాతుల ప్రతినిధులు 6.

శాసనసభలో పార్టీలబలం :
కాంగ్రెసు 15 ; స్వతంత్రులు 9.
మంత్రిమండలి : పదవీ స్వీకారం : 1952 మార్చి 17
ముఖ్యమంత్రి : సి. ఎం. పునచ
రెండవమంత్రి : కె. మల్లప్ప
మంత్రుల జీతాలు : నెలకు రు. 650,
శాసనసభ్యుల జీతాలు : నెలకు రు. 150,

# ఢిల్లీ

ఇండియాకు రాజధాని ఢిల్లీ. 1912 కు పూర్వం, కలకత్తా మన దేశానికి రాజధానిగావుండేది. 1911 డిసెంబరు 12 వ తేదీన ఢిల్లీ దర్బారులో, జార్జి చక్రవర్తి, ఇకముందు భారతదేశానికి రాజధాని ఢిల్లీ నగరమేనని ప్రకటించాడు. అప్పటినుంచీ, రాజప్రతినిధి ఢిల్లీలోవుంటున్నాడు.

పాతఢిల్లీ, కొత్తఢిల్లీ, పరిసరాలు మొత్తం 574 చదరపు మైళ్ళ ప్రదేశం, ఒక ప్రత్యేక రాష్ట్రంగా, చీఫ్ కమిషనరు పరిపాలనక్రింద ఏర్పాటుచేయబడింది. రాజప్రతినిధికీ, శాసనసభలకూ కొత్త భవనాలను నిర్మించడానికీ, అంటే కొత్తడిల్లి నిర్మాణానికి 14 కోట్ల రూపాయలు ఖర్చు అయింది. 1951 లో డిల్లి జనాభా, 17,43,992 ; పురుషులు, 9,90,443 ; స్త్రీలు. 7,53,549.

చీఫ్ కమిషనర్ : శంకర్ ప్రసాద్.

రాష్ట్ర శాసనసభ సభ్యుల సంఖ్య 48. వీరిలో షెడ్యూల్డు కులాల ప్రతినిధులు, 6.

శాసనసభలో పార్టీలబలం : కాంగ్రెసు, 39; సోషలిస్టులు, 2; జనసంఘ, 4; స్వతంత్రులు, 2; ఇతరపార్టీలు, 1.

శాసనసభ్యుల జీతాలు : నెలకు రూ. 200; అదనంగా శాసనసభకు హాజరైన ప్రతిరోజుకూ రూ. 10 బత్తా.

స్పీకరు : శాంత్ గురుముఖ్ నిహాల్ సింగ్ (రూ. 1,000)
డిప్యూటీస్పీకరు : గోపీనాథ్ అమన్ (రూ. 750)
మంత్రిమండలి : పదవిస్వీకారం : 1952 మార్చి 17.
ముఖ్యమంత్రి : చౌధరి బ్రహ్మప్రకాశ్
రెండవమంత్రి : మౌలానా షఫీక్ ఉర్ రహమన్ కిద్వాయ్
మూడవమంత్రి : డాక్టర్ సుశీల నయ్యర్

మంత్రుల జీతాలు : నెలకు రూ. 1,000. ప్రధానమంత్రికి అదనంగా రూ. 250; ఇదికాక, ప్రతిమంత్రికీ నెలకు రూ. 250 కారు అలవెన్సు ఉచితవసతి.

డిప్యూటీ మంత్రులు నియమింపబడితే, వారికి నెలకు రూ. 500 జీతం, రు. 150 ఇంటిఅద్దె, రూ. 150 కారుఅలవెన్సు ఇవ్వబడుతుంది.

# త్రిపుర

ఇది స్వతంత్ర సంస్థానంగా వుండేది. దీనిని 1949 లో ఇండియా ప్రభుత్వం తమ పరిపాలనలోకి తీసుకున్నారు. ఇది పశ్చిమ బెంగాల్ రాష్ట్రానికి తూర్పున వున్నది. ఒక్క అస్సాం వైపునతప్ప తక్కినమూడు వైపులా ఈ రాష్ట్రానికి సరిహద్దు పాకిస్తాన్‌తో. దీని వైశాల్యం 4,049 చ. మైళ్లు. జనాభా 6,49,930; పురుషులు, 3,39,962; స్త్రీలు, 3.09.968. ప్రభుత్వాదాయం ఏడాదికి 27 లక్షల రూపాయలు. మహారాజు : హిస్ హైనెస్ మహారాజా మాణిక్య వీరవిక్రమ కిశోర్ దేవ వర్మన్ బహదూర్.

చీఫ్ కమిషనర్ : ఆర్. కె. రే.

పార్లమెంటుకిసభ్యులను ఎన్నుకోవడానికి, ప్రజలచే ఎన్నుకోబడిన సభ్యుల సభ (ఎలెక్టరల్ కాలెజి) ఒకటి యీ రాష్ట్రంలో వుంది. దాని సభ్యుల సంఖ్య 30. గత ఎన్నికలలో యీ సభకు తొమ్మిదిమంది కాంగ్రెసువారూ, 12 మంది కమ్యూనిస్టులూ, 6 మంది స్వతంత్రులూ, ముగ్గురు ఇతర పార్టీలవారూ ఎన్నుకోబడినారు.

# భోపాల్

భోపాల్ సంస్థానము మధ్యభారత్‌కు తూర్పు దక్షిణములలోను, నర్మదానదికి ఉత్తరముననుఉంది. దీనిని 1949 జూన్ 1 తేదీన ఇండియా కేంద్రప్రభుత్వము స్వాధీనపరచుకొని, చీఫ్ కమిషనర్ రాష్ట్రంగా పరిపాలన జరుపుతున్నారు.

భోపాల్ వైశాల్యం: 6,921 చ. మైళ్లు. జనాభా: 8,38,107; పురుషులు, 4,38,778; స్త్రీలు, 3,99,329.

నవాబ్: కర్నలు నవాబ్ సికందర్ సౌలత్ ఇప్తికార్-ఉల్-ముల్క్ మహమ్మద్ హమీదుల్లా ఖాన్ బహదూర్. నవాబుకు కుమారులు లేరు. కుమార్తె, కర్నల్ సుల్తైయా జా నవాబ్ గోహార్-ఇ-తాజ్, యీ, రాజ్యానికి వారసురాలు. కాని, ఆమె ఇండియాను వదలిపెట్టి, పాకిస్తాన్‌కు వెళ్ళిపోయింది.

చీఫ్ కమిషనర్: భగవాన్ సహాయ్

రాష్ట్ర శాసనసభ సభ్యులసంఖ్య, 30. వీరిలో షెడ్యూల్డు కులాల ప్రతినిధులు 5; షెడ్యూల్డు కొండజాతుల ప్రతినిధులు, 2.

శాసనసభలో పార్టీలబలం: కాంగ్రెసు, 25; జనసంఘ, 1; స్వతంత్రులు, 3; ఇతరులు, 1.

స్పీకర్: సుల్తాన్ మహమ్మద్ ఖాన్.

మంత్రిమండలి: పదవీస్వీకారం: 1952 మార్చి 20.

ముఖ్యమంత్రి: డాక్టర్ శంకరదయాళ్ శర్మ

రెండవమంత్రి: కొంతప్రసాద్

మూడవమంత్రి: మౌలానా తార్జి మష్రికి

మూడవమంత్రికి డిప్యూటీమంత్రి: ఉమ్రావ్ సింగ్

మంత్రుల జీతాలు: నెలకు రూ. 700.

### బడ్జెట్

రాష్ట్రానికి 1952-53 బడ్జెటును రాష్ట్ర శాసనసభలో ఆర్థిక మంత్రి కాంతప్రసాద్ ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి.

| | |
|---|---|
| ఆదాయం అంచనా : | రూ. 2,19,04,000 |
| వ్యయం అంచనా : | రూ. 2,13,04,000 |
| మిగులు అంచనా : | రూ. 6,00,000 |

# మణిపూర్

మణిపూరు సంస్థానాన్ని కేంద్ర ప్రభుత్వం 1949 అక్టోబరు 15 తేదిన స్వాధీనపరచుకొని, చీఫ్ కమీషనరు రాష్ట్రంగా ఏర్పాటుచేశారు. ఇది అస్సాం, బర్మాల సరిహద్దులలోవున్న సంస్థానం. వైశాల్యం. 8,620 చ. మైళ్లు. జనాభా, 5,79,058; పురుషులు, 2,84,747; స్త్రీలు, 2,94,311. ప్రభుత్వాదాయం, రూ. 29 లక్షలు.

మహారాజు : హిజ్ హైనెస్ మహారాజు బోధచంద్రసింగ్.

చీఫ్ కమిషనర్ : హిమ్మత్ సింగ్ మహేశ్వరి.

పార్లమెంటుకు సభ్యులను ఎన్నుకోడానికి 30 మంది సభ్యులుగల ఎలెక్టరల్ కాలెజి యీ రాష్ట్రంలో వుంది. గత ఎన్నికలలో యీసభకు 10 మంది కాంగ్రెసువారూ, ఒక సోషలిస్టు, ఇద్దరు కమ్యూనిస్టులూ, ఒక స్వతంత్రుడూ, 16 మంది ఇతరపార్టీలూ, ఒక స్వతంత్రుడూ, 16 మంది ఇతరపార్టీలవారూ ఎన్నుకోబడినారు.

# విలాస్‌పూర్

పంజాబ్ రాష్ట్రంలోవున్న విలాస్‌పూరు సంస్థానాన్ని ఇండియా ప్రభుత్వంవారు స్వాధీనపరచుకొని 1948 సెప్టెంబరు 18 తేదిన చీఫ్ కమీషనరు రాష్ట్రంగా ఏర్పాటుచేశారు. ఈ సంస్థానపు వైశాల్యం 453 చ. మైళ్లు. జనాభా, 1,27,566. పురుషులు, 65,332; స్త్రీలు 62,234. సంస్థానంలోని ప్రజలంతా 952 గ్రామాలలో నివసిస్తున్నారు.

ఈ రాష్ట్రంలోని పట్టణం విలాస్‌పూరు ఒక్కటే. దాని జనాభాకూడా 4000 లోపే.

చీఫ్ కమిషనర్ : శ్రీశ చంద్ చబ్బా.

# వింధ్యప్రదేశ్

వింధ్యప్రదేశ్ అనే పేరుగల సంస్థానాలకూడలి 1948 ఏప్రిల్ 2 తేదిన ఏర్పాటయింది. ఇది, అజయఘుర్, బావోని, బారౌంధ, బిజావార్, ఛత్రపూర్, ఛరారి, దాటియా, మైహారు, నాగోడ్, ఓర్ఛ, పన్నా, రీవా, సంథారు, అలీపూరు, బంకపహారి, బేరి, భాయ్‌సుంధ బీహాట్, బిజన, ధుర్వాయ్, గౌరిహారు, గరౌలి, జాసో, జిగ్ని, కామత రాజౌల, ఖానియా దహాన, కోఠి, లుగాసి, నైగజాన్-రెబాయ్, సారా, పాల్దేవ్, సరిల, సోహావాల్, తరౌన్, తోరి-ఫతేపూరు అనే 35 సంస్థానాల కూడలి. దీని వైశాల్యం 22,867 చ. మైళ్లు. జనాభా, 35,77,431; పురుషులు, 18,34,610; స్త్రీలు, 17,42,821. సంవత్సరాదాయం సుమారు, రూ. 2,43,30,000. ఈ సంస్థానాల కూడలిని 1950 జనవరి 1 తేదినుంచి కమిషనరు రాష్ట్రంగా కేంద్రప్రభుత్వం ఏర్పాటుచేశారు. రాజధాని, రీవా.

రాష్ట్ర శాసనసభ సభ్యులసంఖ్య 60. వీరిలో షెడ్యూల్డు కులాల ప్రతినిధులు 6; షెడ్యూల్డు కొండజాతుల ప్రతినిధులు 6.

లెఫ్టినెంట్ గవర్నరు : కె. సంతానం

పదవీ స్వీకరణ : 1952 మార్చి 1

జీతం : నెలకు రూ 3,000

అలవెన్సు రూ. 500

రాష్ట్ర శాసనసభలో పార్టీబలం :

కాంగ్రెసు, 40; సోషలిస్టులు, 11; ప్రజాపార్టీ, 3; జనసంఘు [illegible] స్వతంత్రులు, 2; ఇతరులు 2.

స్పీకర్ : శివానంద్
మంత్రిమండలి : పదవీస్వీకారం , 1952 మార్చి 17.
ముఖ్యమంత్రి : ఆర్థికశాఖ, రెవిన్యూ , శంభునాథ్ శుక్ల
న్యాయమంత్రి : ప్లానింగ్ గోపాల్‌శరణ్ సింగ్
హోంమంత్రి : స్థానికపరిపాలన లాలారాం బాజ్‌పాయ్
పరిశ్రమలమంత్రి : ధన్‌బహదూర్ సింగ్
విద్యామంత్రి : మహేంద్రకుమార్ జైన్

## బడ్జెట్

1952-53 సంవత్సరానికి బడ్జెటును ముఖ్యమంత్రి, శాసనసభలో 1952 ఏప్రిల్ 26 న ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి.

| | |
|---|---|
| ఆదాయం అంచనా : | రూ. 3,41,94,000 |
| వ్యయం అంచనా : | రూ. 3,32,45,000 |
| మిగులు అంచనా : | రూ. 9,49,000 |

# హిమాచలప్రదేశ్

పూర్వపంజాబ్ రాష్ట్రంలోవున్న బాఘల్. బాఘట్, బల్సాన్, బషాహర్, భజ్జి, బెజ, దార్కోటి, ధామి, జుబ్బల్, కెవన్‌థాల్, కుమార్‌సెయిన్, కునిహార్, కుథార్, మహలోగ్, ప్రాంగి, మంగళ్, సిర్మూర్, థరోచ్, చంబ, మండి, సుకేత్ అనే 31 సంస్థానాల అధిపతులు, తమ సంస్థానాలను కేంద్రప్రభుత్వ పరిపాలన అప్పగించివేశారు. దీనివైశాల్యం, 10,655 చ. మైళ్లు. ఈ రాష్ట్రంలో విస్తారభాగం అడవి, రాష్ట్ర ప్రభుత్వానికి ఆదాయంకూడా విస్తారభాగం అడవులనుంచే జనాభా, 9,89,446. పురుషులు 5,17,317 ; స్త్రీలు, 4,73.120, ఈ ప్రాంతంఅంతా హిమాచల ప్రదేశ్ అనే పేరుతో ఛీఫ్ కమిషనరు రాష్ట్రంగా ఏర్పాటుచేయబడింది,

రాష్ట్రశాసనసభ సభ్యులసంఖ్య, 36, వీరిలో షెడ్యూల్డు కులాల ప్రతినిధులు, 8.

లెఫ్టినెంట్ గవర్నరు : మేజరు జనరల్ హిమత్ సింహజీ

పదవీ స్వీకరణ : 1952 మార్చి 1

జీతం : నెలకు రు. 3,000

అలవెన్సు రు. 500

రాష్ట్రంనుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడవలసిన నాలుగు మంది సభ్యులకూ, ఒక సభ్యుడు, విలాస్ పూరురాజా, పోటీలేకుండా ఎన్నుకోబడినాడు. తక్కిన మూడు స్థానాలకూ ఇద్దరు కాంగ్రెసువారు, ఇద్దరు ప్రజాపార్టీవారు, ఒక సోషలిస్టు, ఇద్దరు ప్రజాపార్టీవారు, ఒక సోషలిస్టు, ఇద్దరు జనసంఘు సభ్యులు, ఇద్దరు స్వతంత్రులు, ఒక షెడ్యూల్డు కాస్టు ఫెడరేషన్ సభ్యుడు పోటీ చేశారు,

రాష్ట్రశాసనసభకు ఎన్నికలు 1951 అక్టోబరు 25 తేది మొదలు 1951 నవంబరు మాసాంతంలో జరిగాయి. మొత్తం 36 స్థానాలలో రెండు స్థానాలకు ఎన్నిక, ప్రత్యర్థుల నామినేషనులు నిరాకరింపబడి నందున, పోటీలేకుండా కాంగ్రెసువారు ఎన్నుకోబడినారు. తక్కిన 34 స్థానాలకూ 133 మంది అభ్యర్థులు పోటీచేశారు. వారిలో 33 కాంగ్రెసు, 22 ; ప్రజాపార్టీ, 10 ; జనసంఘ్, 9 ; షెడ్యూల్టు కాస్టస్ ఫెడరేషన్, 5 సోషలిస్టులు, హిందూమహాసభ 3; రామరాజ్య పరిషత్, 1; స్వతంత్రులు 49.

శాసనసభలో పార్టీ బలం :

కాంగ్రెసు, 25; ప్రజాపార్టి, 3; షెడ్యూల్డ్ కాస్టు ఫెడరేషన్, 1; స్వతంత్రులు, 8.

స్పీకరు: జయంత్ సింగ్

మంత్రిమండలి , పదవీస్వీకారం , 1952 మార్చి 8

ముఖ్యమంత్రి : వై. ఎస్. పరమార్

రెండవ మంత్రి . పండిట్ పద్మదేవ్
మూడవ మంత్రి : గౌరి ప్రసాద్

## బ డ్జె ట్

1952-53 సంవత్సరానికి బడ్జెటును రాష్ట్ర శాసనసభలో ముఖ్య మంత్రి వై. ఎస్. పరమార ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి :

| | |
|---|---|
| ఆదాయం అంచనా . | రూ. 2,36,39,000 |
| వ్యయం అంచనా : | రూ. 2,23,57,000 |
| మిగులు అంచనా : | రూ. 12,82,000 |

## చంద్రనగర్

ఈ పట్టణం పశ్చిమబెంగాల్ రాష్ట్రంలో కలిసినది ఫ్రెంచిప్రాంతం. 1950 వరకు ఇది ఫ్రెంచివారి ఆధీనంలో వుండేది. 1949 జూన్‌లో జరిగిన రెఫరెండం ఫలితంగా, చంద్రనగరు ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు యీ పట్టణాన్ని ఇండియాలో కలిపివెయ్యాలని కోరినట్లు స్పష్టపడింది. 1950 మే 2 తేదీని యీ నగర పరిపాలన ఇండియా ప్రభుత్వ ప్రతినిధికి అప్పగించబడింది. ఈ అప్పగింతను ఆమోదిస్తూ, ఇండియా, ఫ్రెంచి ప్రభుత్వాలమధ్య ఒడంబడిక 1951 ఫిబ్రవరిలో జరిగింది.

## రాష్ట్రాల ప్రధానమంత్రుల జీతాలు

| రాష్ట్రం | జీతం |
|---|---|
| అస్సాం : | రు. 1320 |
| ఉత్తరప్రదేశ్ : | రు. 1500 |
| ఒరిస్సా : | రు. 850 |
| పంజాబ్ : | రు. 1500 |
| పశ్చిమబెంగాల్ : | రు. 1500 |
| మదరాసు : | రు. 1000 |
| మధ్యప్రదేశ్ : | రు. 1000 |
| కాశ్మీరు : | రు. 800 |
| మైసూరు : | రు. 800 |
| రాజస్థాన్ : | రు. 900 |
| పెప్సు : | రు. 1250 |

# గ్రామాభ్యుదయ ప్రణాళిక

భారతదేశం అంతటా మొత్తం, 17,500 గ్రామాలకూ, 1.20,00,000 ప్రజలకూ వర్తించేలాగున, గ్రామాభ్యుదయ కార్యక్రమం అమలుజరుపబడుతున్నవి. ఈ కార్యక్రమానికి ప్రణాళిక రెండు ప్రత్యేక భాగాలుగా తయారయింది

ఈ రెండింటిలో మొదటి కార్యక్రమం, భారత ప్రభుత్వ గ్రామీణాభ్యుదయ కార్యక్రమోద్యోగుల అజమాయిషీ క్రింద సాగుతుంది. ఇండో-అమెరికా నిధి సహాయంకూడా వీరికి ఉంటుంది.

జనవరి నెలలో ప్రారంభించబడిన ఈ కార్యక్రమానుసారం, మూడు రకాల ప్రాజెక్టులు ఏర్పాటు చేయబడాలనే అంశాన్ని భారత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు స్థూలంగా అంగీకరించినవి. ఈ మూడు రకాల ప్రాజెక్టులు కూడా ఇదివరకే ఇండియాలో వివిధ ప్రాంతాలలో విజయవంతంగా అమలు జరుపబడిన నమూనా ప్రాజెక్టుల అనుభవ విజ్ఞానంతో రూపొందించబడినవి.

మొదటిది : 2,00,000 జనాభాగల 300 గల గ్రామాలు గల ఒక ప్రాంతాన్ని ప్రాతిపదిక ప్రాజెక్టుగా నిర్ణయించారు. వ్యవసాయోత్పత్తులను వృద్ధిచేయడమే ఈ ప్రాజెక్టు ప్రధానాశయం. ప్రజారోగ్యానికి, పారిశుద్ధ్యానికి, విద్యాభివృద్ధికి, రోడ్ల నిర్మాణానికి సంబంధించిన కార్యక్రమాలుకూడా ఈ ప్రాజెక్టులో చేరిఉంటవి. ప్రాజెక్టు ప్రాంతాల కన్న చిన్నవి. అయిన "బ్లాకు" లలో 100 గ్రామాలు మాత్రమే చేరి ఉంటవి. వీటి రెంటికి పరిమాణంలో మాత్రమే వ్యత్యాసం ఉన్నది. మిగిలిన కార్యక్రమాలన్నీ సమానంగానే ఉంటవి.

రెండవది : ఉమ్మడి ప్రాజెక్టులు, బ్లాకులు, వీటిలో స్వల్ప పరిశ్రమల ఏర్పాటుకీ, వ్యవసాయాభివృద్ధికికూడ ప్రాధాన్యం ఉంటుంది. ఈ ఉమ్మడి ప్రాజెక్టుల కార్యక్రమం నిలోఖేరి, ఫరీదాబాదులలోని [illegible] పారిశ్రామికాభ్యుదయ ప్రాంతాలను బోలి ఉంటుంది.

మూడవది : గ్రామ సేవకులకు తర్ఫీదు ఇవ్వడానికై ఏర్పాటవుతున్న శిక్షణ కేంద్రాలన్నిటినీ, వివిధ గ్రామాభ్యుదయ ప్రాంతాలలోగాని, వాటికి సన్నిహితంగాగాని ఏర్పాటుచేసి, విద్యార్థులను పొలాలలోకి తీసుకొని వెళ్ళి ప్రత్యక్ష శిక్షణ ఇవ్వడానికి వీలుకల్గించాలని నిర్ణయించబడింది.

వివిధ రకాల ప్రాజెక్టుల వివరాలనుకూడా నిర్ధారణచేసి, వాటిని అమలుజరపడాన్ని గురించి చర్చించడానికి ఢిల్లీలో జరుగనున్న అఖిల భారత గ్రామాభ్యుదయ మహాసభ ఆశయం. ప్రాతిపదిక ప్రాజెక్టు ప్రాంతాలలో అమలుజరుపదగిన కార్యక్రమాలను గ్రామాభ్యుదయ శాఖ వారు, రాష్ట్రప్రభుత్వాలు ఇదివరకే స్థూలంగా తయారుచేశాయని తెలుస్తుంది.

ప్రజలందరికీ త్రాగడానికి పరిశుభ్రమైన నీరు సరఫరా చేయడానికి గాను ప్రతి గ్రామానికి రెండు బావులు త్రవ్వించడం, గొట్టపుబావులకు అనువైన ప్రాంతాలలో కర్షకుల ఉపయోగార్థం గొట్టపుబావులు తీయించడం. (ప్రస్తుతం నిర్దేశించిన ప్రాజెక్టు ప్రాంతాలలో నూటికి పది గొట్టపు బావులు త్రవ్వడానికి అనువైన ప్రదేశాలలో ఉన్నవి); ఇతర ప్రాంతాలలో వ్యవసాయోపయోగార్థం కాలువలు, చెరువులు, నూతులు త్రవ్వించి ప్రతి గ్రామంలోను కనీసం సగం భూమి అయినా ఆధునిక పద్ధతులపై వ్యవసాయం చేయబడే అవకాశం కల్గించడం; వీలున్న చోటనల్లా వ్యవసాయోగ్యములైన బంజర్లను సాగు చేయించడం; గ్రామ పారిశుద్ధ్య కార్యక్రమంతోపాటు; గ్రామంలోని మురికినీటి పారుదలకు ఏర్పాట్లు చేయడం; ప్రక్క గ్రామాలకు రోడ్లువేయడం, ప్రాథమిక, వయోజన విద్యలకు ఏర్పాట్లు చేయడం;—ఈ కార్యక్రమాలలో ప్రధానమైనవని తెలుస్తున్నది.

ముఖ్యంగా, వ్యవసాయాభ్యుదయ కార్యక్రమాలకు స్థానిక ప్రభుత్వాలు, జాతీయ ప్రణాళికారచనా సంఘముకూడా విశేష ప్రాముఖ్య మిస్తున్నవి. సుశిక్షితులైన గ్రామ సేవకులద్వారా ఈ కార్యక్రమం అమలు జరుపబడుతుంది. ఆధునిక వ్యవసాయ పద్ధతులను గురించి, మంచి విత్తనాలను ఎంచుకొనడాన్ని గురించి, ఎరువుగా వుపయోగించే పంటలను గురించి, రసాయనికపు ఎరువులను గురించి, కొత్తరకం వ్యవసాయ పరిక

రాలను ఉపయోగించే విధానాలు గురించి వీరు గ్రామస్థులకు బోధిస్తారు. ఏయే ప్రాజెక్టు ప్రాంతంలోను ఏయే కార్యక్రమాలను అవలంబించవలసి నదీ రాష్ట్రప్రభుత్వాలు అంతిమ నిర్ణయం చేస్తాయి.

## "మండీ" సమూహాలు

ప్రతి ప్రాజెక్టు, లేక బ్లాక్ ప్రాంతంలోను 15 నుంచి 25 వరకు గ్రామాలను కలిపి "మండీ" లనబడే సమూహాలు ఏర్పరచాలనికూడా ఈ చిత్తు కార్యక్రమంలో సూచించబడింది. ప్రతి మండీకి ఒక ఆసుపత్రి, ఒక ఆరోగ్యకేంద్రం ఉంటవి. ఆరోగ్య పరీక్షకులు, మంత్రసానులు, గ్రామ పారిశుద్ధోద్యోగులు ఈ కేంద్రాలనుంచి కారులలో ప్రతి గ్రామానికి వెళ్ళి గ్రామస్థులకు సహాయంచేస్తారు. ప్రతి "మండీ" లోను ఒక ప్రయాణ సౌకర్య కేంద్రము, ఒక భూమిదున్నే యంత్రాలు సప్లయిచేసే కేంద్రం, రైతులకు ఉపయోగపడే ఒక మార్కెట్టు, వ్యవసాయోత్పత్తుల కొటారం, ఒక పశువుల ఆసుపత్రికూడా ఉంటవి. ఈ "మండీ" ల ఏర్పాటు విషయంలోకూడా రాష్ట్రప్రభుత్వాలే అంతిమ నిర్ణయం చేయవలసి ఉంటుంది.

ఈ గ్రామాభ్యుదయ ప్రణాళికవల్ల నాలుగు సంవత్సరాలలో ఆ ప్రాంతాల వ్యవసాయోత్పత్తులను నూటికి 50 పాళ్ళు వృద్ధిచేయవచ్చునని లోగడ ఇండియాలో కొంతకాలంనుంచి అమలు జరుపబడుతూన్న ఈ కార్యక్రమాలవల్ల తేలింది. దీనికితోడు, గ్రామాల నగదు ఆదాయం నూటికి 35 వంతులు పెరుగగలదనికూడా తేలింది. అనగా, ఇండియా ఎదుర్కొంటున్న దారుణమైన ఆహార పదార్థాల లోపాన్ని కొంతవరకు తీర్చుడమేకాక, గ్రామస్థుల ఆర్థిక జీవనస్థాయికూడా పెరగగలదని తేలింది.

ఇక గ్రామీణాభ్యుదయ కార్యక్రమంలో రెండవభాగం పోర్డు [illegible] నిధి సంస్థ సహాయంతో భారతప్రభుత్వ ఆహార వ్యవసాయశాఖవారి [illegible]ం క్రింద సాగుతుంది. గ్రామీణాభ్యుదయ ప్రణాళికకన్న [illegible] ముందుగా ప్రారంభించబడిన ఈ ప్రణాళిక, అప్పుడే ఆచరణలో

కృషి జరుగుతున్నది. అయినప్పటికీ ఈ కార్యక్రమాలు జాగరూకతతో మెల్లగా కొనసాగించడం అవసరం.

ఒక్కొక్కటి సుమారు 100 గ్రామాలతో కూడిన 15 గ్రామీణ గ్రామాభ్యుదయ కేంద్రాలలో ఇంటెన్సివ్ వ్యవసాయాభ్యుదయ కార్యక్రమాలే కొనసాగించబడనున్నవి. ఈ ప్రాజెక్టులు పదిహేనింటిలో 14 ప్రాజెక్టులకు అప్పుడే కార్యక్రమాలు తయారుచేయబడి, ఆమోదించబడినవి. వీటిలో ఒకటైన పెప్సు రాష్ట్రంలోని ఖద్యాన్ ప్రాజెక్టుకి ఏప్రిల్ 9 న ప్రారంభోత్సవం చేయబడి, పని ప్రారంభించబడింది. ఈ ప్రాజెక్టుల వివరాలను, ఆదాయ వ్యయపట్టికలను తయారుచేయడంలో భారతీయోద్యోగులు ప్రదర్శించిన దూరదృష్టి, చురుకుతనము వారి సమర్థతలకు, చాకచక్యానికి ప్రబల నిదర్శనములు.

## శిక్షణ కేంద్రాలు

ఈ కార్యక్రమంలో రెండవభాగం గ్రామసేవక శిక్షణ కేంద్రాలను స్థాపించి, సమర్థులైన సేవకులను, అజమాయిషీ ఉద్యోగులను తయారు చేయడం. ఈ కార్యక్రమాలన్నిటికీ ఇది వెన్నెముకవంటిది. 300 గ్రామాలుగల ఒక్కొక్క ప్రాజెక్టు ప్రాంతానికి 103 గ్రామసేవకులు, 22 భారతీయ వ్యవసాయ, ఆరోగ్య, విద్యా నిపుణులు అవసరం. ఇంతకన్న చిన్నదైన, 100 గ్రామాలతో కూడిన ప్రతి "బ్లాక్"కి వీరిలో మూడవ వంతు సేవకులు, నిపుణులు కావలసి ఉంటారు. అనగా ఇండియాలో మొత్తం 7500 మంది సుశిక్షితులైన గ్రామ సేవకులను సాధ్యమైనంత శీఘ్రకాలంలో తయారు చేయవలసి వుంటుంది.

ఫోర్డు ధర్మనిధి సంస్థవారు నెలకొల్పినవైతేనేమి, వారి ధన సహాయంతో నెలకొల్పినవైతేనేమి మొత్తం ఐదు శిక్షణకేంద్రాలు ఇప్పుడు పని చేస్తున్నవి. ఈ కేంద్రాలన్నీ ఉద్యోగులను నియమించుకొనడం పూర్తిఅయి, విద్యార్థులను ఎంచుకొంటున్నవి. ఈ కేంద్రాలలో ప్రతీది ఏదో ఒక ప్రాజెక్టు ప్రాంతానికి అంటిపెట్టుకొని, శిక్షణపొందేవారికి పొలాలలో స్వయంగా పనిచేసే అనుభవాన్ని కలుగజేయడానికికూడా వీలుగా ఏర్పాటుచేయబడింది. మరి 25 శిక్షణ కేంద్రాలను స్థాపించడానికి

కొలది రోజులక్రితమే ఫోర్డు ధర్మనిధి సంస్థ మరి 18,73,485 డాలర్లు కూడా మంజూరు చేసింది. బహుశః ఈ కేంద్రాలుకూడా ఆయా రాష్ట్రాలలోని ప్రాజెక్టు ప్రాంతాలకు సమీపంలోనే ఏర్పాటు చేయబడగలవు.

ఈ శిక్షణ కార్యక్రమం చాలా పెద్ద ఎత్తున చాలా జాగరూకతతో జరుపబడవలసినపని. ఈ కార్యక్రమాల విజయం గ్రామసేవకులు పొందే శిక్షణపైనా, వారి సామర్థ్యంపైనా ఆధారపడి వుంటుంది.

మదరాసురాష్ట్రంలో యీ అభ్యుదయ కార్యక్రమం అమలు జరుపడానికి నిర్ణయించబడిన ప్రాంతాలు ఇవి:

## ఇండో-అమెరికా నిధి

(1) ప్రాజెక్టు-కర్నూలు, కడపజిల్లాలు; కడప, ప్రొద్దుటూరు, జమ్మలమడుగు తాలూకాలు, కర్నూలు జిల్లాలోని సిరువెళ్ల, నంది కొట్కూరు, కోయిల్‌కుంట్ల తాలూకాలు; (2) ప్రాజెక్టు-కోయంబుత్తూరు జిల్లా; (3) ప్రాజెక్టు-మలబార్ జిల్లా; (4) ప్రాజెక్టు-తూర్పు గోదావరి జిల్లా; కాకినాడ, రామచంద్రపురం, పెద్దాపురం, పిఠాపురం తాలూకాలు; (5) ప్రాజెక్టు-దక్షిణ కెనరాజిల్లా; (6) ప్రాజెక్టు-మధుర జిల్లా.

ఈ ప్రాజెక్టులలో పని సక్రమంగా జరిగేటట్టు చూడడానికి డైరెక్టర్‌గా టి. ఎస్. రామచంద్రన్, ఐ. సి. ఎస్., నియమించబడినారు.

ఈ అభ్యుదయ కార్యక్రమాలను ఆయాప్రాంతాల గ్రామీణ ప్రజల యిష్టంమీదనే అమలు జరుపాలిగాని, వారి అభిప్రాయాలకు విరుద్ధంగా ఏ కార్యక్రమాన్ని అమలు జరుపరాదని భారత కేంద్రప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు చేసుకున్న నిర్ణయం ఈ అభ్యుదయ ప్రణాళికకు పునాదివంటిది. గ్రామస్థులు తమంత తాముగా ఈ కార్యక్రమాలను నిర్ణయించడంతో ఉత్సాహంగా పాల్గొని, వారే నడుముకట్టి, క్రమంగా [illegible]వం, ఆత్మవిశ్వాసం, స్వయంకృషివల్లనే ఫలితాలను, అభ్యుదయ[illegible] సాధిస్తున్నామనే వ్యక్తిగతానందమును పొందగలిగే విధంగా [illegible] [illegible]కార్యక్రమాన్ని కొనసాగించాలని నిర్ణయించబడింది.

# మదరాసు రాష్ట్రం

ఇండియాలోని పెద్దరాష్ట్రాలలో మూడవస్థానం మదరాసుది. మదరాసురాష్ట్రపు వైశాల్యం 1,27,409 చ. మైళ్లు. ఈ రాష్ట్రానికి తూర్పున 1,250 మైళ్ళ పొడవునా, పడమట 450 మైళ్ళ పొడవునా, సముద్రతీరం వుంది. తెలుగు జిల్లాలలోని కృష్ణా, గోదావరీనదులూ, అరవ జిల్లాలలోని కావేరీనదీ, ఈ రాష్ట్రంలోని విశేష భాగానికి వ్యవసాయ భూముల సాగుకు ఆధారంగా వున్నాయి. ఈ నదులమీద ఆధారపడిన ప్రాంతాలే ఈ రాష్ట్రంలో అత్యధికంగా సారవంతమైనవి.

ఈ రాష్ట్రంలో ప్రధాన పంటలు బియ్యము, చోళ్లు, రాగులు, జొన్నలు, సజ్జలు.

## ప్రజలు :

తెలుగు, అరవం, కన్నడం, మళయాళం, తుళుభాషలు, ఇక్కడ ప్రధాన భాషలు. రాష్ట్రంలోని ప్రజలలో 1941 లెక్కలప్రకారం నూటికి 40.04 వంతులు అరవము, 37.68 వంతులు తెలుగు, 7.9 వంతులు మళయాళము. 3.57 వంతులు కన్నడము, 10.81 వంతులు ఇతర భాషలు మాట్లాడుతారు. ప్రజలలో నూటికి 86.77 వంతులు హిందువులు; 7.88 వంతులు ముస్లిములు; 4.15 వంతులు క్రైస్తవులు; మిగతా ఒకవంతు తక్కినవారు.

ఈ రాష్ట్రనిర్మాణము, భారతదేశంలోని ప్రస్తుతపు రాష్ట్రాలన్నిటిలాగే, ఒక క్రమపద్ధతిమీద జరుగలేదు. బ్రిటీషువారు, ఆదిలో వర్తకానికి వచ్చి, మదరాసు, మచిలీపట్టణం నగరాలవద్ద ఫాక్టరీలు కట్టుకొని, క్రమేపీ దేశీయ రాజుల కలహాలలో జోక్యం కలిగించుకొని తమ పలుకుబడిని ఎక్కువ చేసుకున్నారు. తరువాత, దేశీయరాజులతో తామే

యుద్ధాలుచేసి, భూమిని ఆక్రమించుకున్నారు. ఈ విధంగా ఏర్పడ్డ రాష్ట్రాలలో మదరాసు ఒకటి.

హైదరాబాదు నవాబు దత్తంచేసిన తెలుగు జిల్లాలు, కర్నాటక నవాబువద్దనుంచీ, మైసూరు పాలకుడైన టిప్పుసుల్తాన్‌ను, మహారాష్ట్ర రాజులను ఓడించి ఆక్రమించిన దక్షిణ జిల్లాలుకలిసి ప్రస్తుతపు మదరాసు రాష్ట్రం ఏర్పడింది.

క్రమక్రమంగా విస్తరిల్లిన మదరాసురాష్ట్ర పరిపాలన, మదరాసు లోని సెంట్ జార్జికోట అధిపతి చేతిలో వుండేది. ఈ కోట వ్యవహారాలను నిర్వహించే అధిపతికి 1785 వరకూ, ప్రెసిడెంటు అని వ్యవహారిక హోదా. ఆ తరువాత, యీ రాష్ట్ర పరిపాలనకు గవర్నర్లు నియమింపబడినారు.

1951 లో తీసిన జనాభా లెఖల ప్రకారం, మదరాసు రాష్ట్రపు జనాభా మొత్తం, 5,69,52,332. వీరిలో పురుషులు, 2,84,13,661, స్త్రీలు, 2,85,38,671.

రాష్ట్రంలోని ప్రజలలో ప్రతి వెయ్యిమందికీ 1004 మంది స్త్రీలు ఉన్నారన్నమాట. రాష్ట్రం మొత్తంలో పురుషులకంటె స్త్రీలు, 1,25,010 మంది ఎక్కువ.

తెలుగు జిల్లాలలోని ప్రజలు, 2,12,33,847; తమిళజిల్లాలలో, 2,77,43,696; మళయాళజిల్లాలో, 47,58,886; కన్నడ జిల్లాలో, 17,46,118. మదరాసు నగరంలో. 14,29,985.

రాష్ట్ర వైశాల్యాన్ని బట్టి జనాభాను లెక్కవేస్తే, ప్రతి చదరపు మైలుకూ 446 మంది ఉన్నట్టు లెఖ తేలింది.

1941 లో రాష్ట్రజనాభా, 4,98,47,508. అంటే గత 10 సంవత్సరాలలోనూ జనాభా, 71,05,124 మంది, అంటే ప్రతి వెయ్యికీ 143 మంది చొప్పున, పెరిగారన్నమాట.

జిల్లాల జనాభా

| | | | |
|---|---|---|---|
| అనంతపురం : | 13,60,727 | దక్షిణ కన్నడ : | 17,46,118 |
| ఉత్తరార్కాడు : | 28,62,155 | దక్షిణార్కాడు : | 27,66,468 |

| | | | |
|---|---|---|---|
| కడప : | 11,61,713 | నీలగిరి : | 3,12,172 |
| కర్నూలు : | 12,64,154 | నెల్లూరు : | 17,93,774 |
| కృష్ణ : | 17,79,760 | పడమటి గోదావరి : | 16,97,892 |
| కోయంబత్తూరు : | 32,94,840 | బళ్లారి : | 12,40,988 |
| గుంటూరు : | 25,42,244 | మదరాసు : | 14,29,985 |
| చెంగల్పట్ : | 18,39,896 | మధుర : | 28,84,994 |
| చిత్తూరు : | 18,08,725 | మలబార్ : | 47,58,886 |
| తంజావూరు . | 29,79,754 | రామనాథం : | 20,78,750 |
| తిరుచినాపల్లి : | 29,42,225 | విశాఖపట్టణం : | 20,71,671 |
| తిరునెల్వేలి : | 24,47,949 | శ్రీకాకుళం : | 21,05,847 |
| తూర్పు గోదావరి : | 24,06,352 | సేలం : | 33,74,284 |

రాష్ట్రమంతటికి ఎక్కువ జనాభాగల జిల్లా, మలబార్. తక్కువ జనాభా నీలగిరి.

తెలుగు జిల్లాలన్నిటిలో ఎక్కువ జనాభా గలది, గుంటూరు, తక్కువ జనాభా గలది, కడప.

తమిళ జిల్లాలో ఎక్కువ జనాభాగలది, సేలం. తక్కువ జనాభా గలది, నీలగిరి.

## రాష్ట్రంలోని ప్రధాన నగరముల జనాభా

| నగరం : | | | జనాభా 1951 |
|---|---|---|---|
| మదరాసు : | 14,29,985 | విజయవాడ : | 1,60,831 |
| సేలం : | 2,02,312 | మచిలీపట్టణం : | 78,021 |
| తూత్తుకుడి : | 98,891 | కాకినాడ : | 1,00,054 |
| కరూర్ : | 42,128 | విజయనగరం : | 67,156 |
| కంచి : | 85,043 | ఏలూరు : | 87,060 |
| కడలూర్ : | 68,394 | నెల్లూరు : | 81,467 |
| తంజావూర్ : | 1,00,787 | బళ్లారి : | 70,764 |
| ఉదకమండలం : | 41,414 | తిరుచిరాపల్లి : | 2,18,565 |
| కూనూర్ : | 23,925 | కోయంబత్తూరు : | 1,94,555 |

| | | | |
|---|---|---|---|
| మధుర : | 3,61,954 | మెంగుళూరు : | 1,17,095 |
| కడప : | 37,446 | నెల్లూరు : | 1,06,603 |
| తిన్నెవిల్లి : | 73,500 | తెనాలి : | 57,980 |
| రాజమండ్రి : | 1,05,300 | కర్నూలు : | 60,110 |
| విశాఖపట్టణం : | 1,07,815 | ఆదోని : | 53,508 |
| గుంటూరు : | 1,23,829 | ఉదకమండలం : | 41,414 |

## 1941 లో

1941 లో మదరాసు రాష్ట్రంలో గ్రామాలు 35,432; రాష్ట్ర మొత్తంలో ప్రజలు నివసిస్తూవున్న ఇండ్లు, 96,36,792. వీటిలో, 14,63,649 పట్టణాలలో వున్నాయి. 81,73,146 గ్రామాలలో వున్నాయి.

1941 లో రాష్ట్రపు జనాభా మొత్తం : 4,93,41,810 వీరిలో 78,64,833 మంది పట్టణాలలో నివసిస్తున్నవారు; 4,14,76,927 మంది గ్రామవాసులు; పురుషులు : 2,45,57,143; స్త్రీలు : 2,47,84,667. అక్షరాస్యులు, 66,00,645 మంది మాత్రమే.

1941 లో మతములవారిగా లెఖలు ఈ క్రిందివిధంగా తేలినవి :

హిందువులు 4,26,99,822, వీరిలో షెడ్యూల్డు కొస్టు 80,68,492; ఇతరులు, 3,47,31,330) ముస్లిములు, 38,96,452 భారతీయ క్రైస్తవులు, 20,01,082; ఆంగ్లో-ఇండియనులు, 28,661; ఇతర క్రైస్తవులు, 17,535; సిక్కులు, 418; జైనులు, 30,136; పార్శీలు, 469, బౌద్ధులు, 1,072; యూదులు, 191; కొండజాతులు, 5,62,029; ఇతరులు, 4,043.

| | |
|---|---|
| 1950 లో జననాలు : | 16,72,536 |
| వీరిలో పురుషులు : | 8,62,224 |
| స్త్రీలు : | 8,10,312 |
| వీరిలో పల్లెలలో : | 14,24,016 |
| పట్టణాలలో : | 2,48,520 |

| | |
|---|---|
| 1950 లో మరణాలు : | 10,66,317 |
| వీరిలో పురుషులు : | 5,41,444 |
| స్త్రీలు . | 5,24,873 |
| వీరిలో పల్లెలలో : | 8,56,309 |
| పట్టణాలలో : | 2,10,008 |

1941 తరువాత ప్రతి సంవత్సరము, రిజిస్టరుచేయబడిన జనన మరణాల వివరాలు ఇవి :

| సంవత్సరం | జననాలు | మరణాలు |
|---|---|---|
| 1941 : | 17,17,133 | 11,35,837 |
| 1942 : | 16,84,023 | 11,20,126 |
| 1943 : | 15,65,644 | 12,70,687 |
| 1944 : | 14,94,134 | 12,91,418 |
| 1945 : | 15,11,878 | 11,43,401 |
| 1946 : | 16,39,674 | 9,79,041 |
| 1947 : | 17,13,102 | 10,50,720 |
| 1948 : | 16,54,313 | 9,58,069 |
| 1949 : | 17,08,805 | 9,21,373 |
| 1950 : | 16,72,536 | 10,66,317 |

పై జనన మరణాల లెక్కనుబట్టి, ఆ తొమ్మిది సంవత్సరాలలోనూ ప్రతిఏటా మరణాలకంటె, ఎన్ని జననాలు ఎక్కువ వున్నదీ ఇలా తేలింది.

1941 : 5,81,296; 1942 : 5,63,894; 1943 : 2,94,957; 1944 : 2,02,716; 1945 : 3,68,477; 1946 : 6,60,632; 1947: 6,62,382; 1948 : 6,96,224; 1949 : 7,87,432; 1950 : 6,06,219.

## వ్యవసాయదారులు

రాష్ట్ర జనాభాలో, 3,61,42,332 మంది ప్రజలు వ్యవసాయ వృత్తి జీవనాధారంగా వున్నారు.

వారిలో 2,06,01,120 మంది సొంత సేద్యం చేసుకుంటున్నారు; 50,59,928 మంది తమ భూమిని కౌలుకు ఇస్తున్నారు; 50,59,926 మంది ఇతరుల భూమిని కౌలుకు తీసుకొని జీవనం జరుపుతున్నారు. 54,21,349 మంది చిన్న రైతులు, ఇతరుల భూమినికూడా కౌలుకు తీసుకొని బ్రతుకుతున్నారు.

1944 డిసెంబరులో తీసుకున్న లెక్కల ప్రకారం, మన రాష్ట్రంలోని పశుసంపద ఇవి :

## పశు సంపద

| | |
|---|---|
| ఆవులు : మొత్తం | 58,07,079 |
| పాలిస్తూవున్నవి | 18,64,058 |
| వట్టిపోయినవి | 21,55,862 |
| గొడ్డుమోతువి | 10,09,593 |
| పొలంలో పనులకు ఉపయోగిస్తున్నవి | 5,84,540 |
| ఎందుకూ పనికిరానివి | 1,93,026 |
| ఎద్దులు : మొత్తం | 69,42,549 |
| ఆంబోతులు | 91,144 |
| పొలం పనులకు ఉపయోగిస్తున్నవి | 56,48,336 |
| పనులకు పనికివచ్చేవీ, ఎదకు పనికివచ్చేవీ | 8,42,310 |
| ఎందుకూ ఉపయోగించనివి | 3,60,759 |
| పెయ్యలు : మొత్తం | 36,05,286 |
| మగవి | 17,75,790 |
| ఆడవి | 18,29,496 |
| గేదెలు : మొత్తం | 30,42,827 |
| పాలిచ్చేది | 15,69,658 |
| వట్టిపోయినవి | 9,21.620 |
| గొడ్డుమోతువి | 4,26,836 |
| పొలం పనులకు ఉపయోగిస్తున్నవి | 77,160 |
| ఎందుకూ పనికిరానివి | 46,053 |

| | |
|---|---|
| దున్నలు : మొత్తం | 11,79,375 |
| అంబోతులు | 52,008 |
| పొలం పనులకు ఉపయోగిస్తున్నవి | 10,10,638 |
| ఎందుకూ ఉపయోగించనివి | 1,16,729 |
| పెయ్యలు : మొత్తం | 20,67,123 |
| మగవి | 8,72,450 |
| ఆడవి | 11,94,673 |
| గొర్రెలు | 1,05,69,189 |
| మేకలు | 60,87,650 |
| గుర్రములు | 50,016 |
| గాడిదలు | 1,54,534 |
| ఒంటెలు | 119 |
| పందులు | 7,43,754 |
| కోళ్లు | 1,40,08,870 |
| బాతులు | 7,66,214 |

## వ్యవసాయపు భూమి : పంటలు
## (1949-50)

| వివరం : | ఎకరాలు. |
|---|---|
| రాష్ట్రంలో మొత్తం భూమి : | 8,07,02,595 |
| దానిలో అడవి : | 1,38,14,304 |
| వ్యవసాయం జరిగిన భూమి : | 3,13,07,676 |
| వ్యవసాయానికిరానిబీడు : | 93,00,584 |
| వ్యవసాయానికి పనికివచ్చేబీడు : | 79,77,355 |
| వ్యవసాయానికికాక ఇతర ఉపయోగాల క్రిందవున్న భూమి | 51,75,993 |
| పచ్చికబయళ్లు : | 17,29,821 |
| చెట్లు, తోటలు, కూరపాదులు మొదలైన వాటిక్రిందవున్న భూమి : | 15,65,137 |

| | |
|---|---|
| నదుల క్రింద, కాలువల క్రిందవున్న భూమి : | 58,07,077 |
| ఇతర నీటివసతుల క్రిందవున్న భూమి : | 40,79,018 |
| వ్యవసాయం జరిగిన భూమిలో నీటిలీరువపొందినభూమి : | 98,50,022 |

మదరాసు రాష్ట్రంలోని రైతువారి గ్రామాలు, 21,559. 1359 ఫసలీ (1949-50) లో మదరాసు రాష్ట్రంలో రైతువారి అధీనంలో వున్న భూమి, 2,80,85,248 ఎకరాలు. 1948-49 లో 2,81,07,724 ఎకరాలు. అంటే 1948-49 లో కంటె 22,476 ఎకరాలు తక్కువైం దన్నమాట.

రాష్ట్రంలోని భూమిలో, 1949-50 లో 3,13,07,676 ఎకరాలలో వ్యవసాయం జరిగింది. దీనిలో 50,37,264 ఎకరాలలో రెండు పంటలు వెయ్యబడినవి. కాబట్టి రాష్ట్రం మొత్తంలో ఎన్ని ఎకరాలలో వ్యవసాయం జరిగింది అంటే, 3,63,44,940 ఎకరాలలో అని చెప్పవలసి వుంటుంది.

## పంట భూమి

1949-50 1948-49 లో మదరాసు రాష్ట్రంలో ఏఏ పంటలు ఎన్ని ఎకరాలలో వేసినదీ వివరాలు.

| పంట : | 1949-50 | 1948-49 |
|---|---|---|
| బియ్యం : | 1,05,98,646 | 1,04,30,382 |
| యవధాన్యములు : | 1,21,57,788 | 98,96,957 |
| పప్పుదినుసులు : | 29,68,586 | 29,45,510 |
| వేరుశనగ : | 37,67,123 | 36,98,330 |
| ప్రత్తి : | 16,91,001 | 16,32,639 |
| చెరకు | 2,61,785 | 1,75,675 |
| నువ్వులు : | 7,59,359 | 6,12,819 |
| కొబ్బరి : | 6,33,043 | 6,22,850 |
| పొగాకు : | 3,45,344 | 3,22,856 |
| ఆముదాలు : | 2,23,718 | 2,29,850 |
| మిరప : | 3,13,776 | 3,36,022 |

1950-51 లో 89,12,000 ఎకరాలలో బియ్యపుపంట వెయ్య బడిందని అంచనా.

## పంటలు

1948-49, 1949-50 లలో రాష్ట్రంలో పండిన వివిధ ముఖ్య పంటల వివరాలివి. పంట అంకెలు టన్నులలో ఇవ్వబడినవి.

| పంట : | 1948249 | 1949-50 |
|---|---|---|
| వరి : | 63,94,720 | 60,45,080 |
| జొన్నలు : | 11,37,200 | 11,09,190 |
| సజ్జలు : | 5,02,490 | 5,35,95 |
| రాగులు : | 6,46,730 | 5,95,470 |
| కొర్రలు : | 2,48,380 | 2,20,890 |
| మొక్కజొన్న : | 27,790 | 19,110 |
| గోధుమ : | 2,320 | 880 |
| శనగలు : | 20,600 | 27,190 |
| ఉలవలు : | 1,04,190 | 95,590 |
| పెసలు : | 39,200 | 42,380 |
| కందులు : | 45,080 | 47,330 |
| మినుములు : | 35,540 | 29,820 |
| మిరపకాయలు | 1,43,750 | 1,38,730 |
| నీరుల్లి : | 2,29,150 | 2,50,230 |
| బంగాళాదుంపలు : | 50,770 | 47,830 |
| చెరకు : | 5,32,530 | 5,00,260 |
| వేరుశనగ | 14,80,100 | 15,67,040 |
| నువ్వులు : | 70,600 | 89,390 |
| ఆముదము : | 21,100 | 20,200 |
| పొగాకు : | 1,14,480 | 1,18,850 |
| ప్రత్తి : (బేళ్లు) | 3,41,650 | 4,47,780 |
| అల్లం : | 3,540 | 3,410 |
| మిరియాలు : | 7,610 | 7,960 |

# ఆహారపు పంటలు

పైన యిచ్చిన అంకెలలో వరి అంకెలు వడ్లకు సంబంధించినవి. వడ్లు దంచినప్పుడు, వడ్ల తూకంలో మూడింట ఒక వంతు తగ్గుతుంది.

గత ఎనిమిది సంవత్సరాలలోను రాష్ట్రంలో పండిన బియ్యపు పంట వివరాలివి : పంట అంకెలు టన్నులలో ఇవ్వబడినవి.

| | | | |
|---|---|---|---|
| 1942-43 : | 46,14,000; | 1943-44 | 49,32,000; |
| 1944-45 : | 50,54,000; | 1945-46 | 42,41,500; |
| 1946-47 : | 49,19,500; | 1947-48 | 43,82,600; |
| 1948-49 : | 42,84,500; | 1949-50 | 38,11,000; |

మదరాసు రాష్ట్రం, ఆహారపు పంటలలో లోటు రాష్ట్రం. రాష్ట్రంలో పండే పంటలు చాలక, ఇతర రాష్ట్రాలనుంచీ, ఇతర దేశాల ఆహారధాన్యాలను మదరాసు రాష్ట్రవాసులు దిగుమతి చేసుకొనేవారు. రాష్ట్రంలోని జనాభా ప్రతి సంవత్సరమూ పెరుగుతూవున్నకొద్దీ, విదేశాలనుంచి ఆహార ధాన్యాలను దిగుమతిచేసుకోవడంకూడా ఎక్కువైంది.

1945-46 నుంచీ 1549-50 వరకూ రాష్ట్రంలో పండిన ఆహార ధాన్యాల పంట వివరాలివి.

| సంవత్సరం | పంట (టన్నులు) |
|---|---|
| 1945-46 | 61,18,000 |
| 1946-47 | 68,61,000 |
| 1947-48 | 66,87,000 |
| 1948-49 | 87,19,760 |
| 1949-50 | 64,44,000 |

రాష్ట్రంలో పండేపంట చాలక ఇతర ప్రాంతాలనుంచి 1944-45 లో 1,55,447 టన్నులూ, 1945-46 లో 6,21,222 టన్నులూ, 1946-47 లో 2,51,305 టన్నులూ, 1947-48 లో 4,87,074

టన్నులూ, 1948-49 లో 3,87,848 టన్నులూ, 1949-50 లో 4,91,942 టన్నులూ ఆహారధాన్యాలు రాష్ట్రానికి దిగుమతిచేయబడినవి. ఆ దిగుమతుల వివరాలివి :

| సంవత్సరం : | బియ్యం : | గోధుమ : | యవధాన్యములు : |
|---|---|---|---|
| 1945-46 | 17,000 : | 36,613 : | 1,01,834 |
| 1946-47 | 2,68,612 : | 1,28,879 : | 2,23,721 |
| 1947-48 | 1,44,100 : | 42,440 : | 64,756 |
| 1948-49 | 1,28,724 : | 1,43,232 : | 1,15,892 |
| 1949-50 | 2,19,453 : | 1,48,579 : | 1,23,910 |

## రేషనింగు

రాష్ట్రంలో పండేపంట ప్రజలకు చాలకపోవడమూ, యుద్ధ పరిస్థితులవల్ల విదేశాలనుంచి (ముఖ్యంగా బర్మానుంచి) బియ్యపు దిగుమతులు ఆగిపోవడమూ, ఉన్న కొద్దిపాటి ధాన్యాన్నీ ప్రజల అవసరాన్ని అవకాశంగా వినియోగించుకొని అధిక ధరలకు అమ్మి లాభం సంపాదించడానికి కొంతమంది స్వలాభపరులు ప్రయత్నించడమూ ప్రభుత్వం గమనించి, 1943 లో రేషనింగు పద్ధతిని అమలులోకి తెచ్చింది.

ప్రారంభంలో, రేషనింగుపద్ధతి పట్టణాలలోనే అమలుపెట్టబడింది. పెద్దలకు రోజుకు 16 ఔన్సులు, పిల్లలకు రోజుకు 8 ఔన్సులు రేషను ఇవ్వబడింది. కాని, ఆహార పరిస్థితి క్రమంగా విషమించినందున, రేషను పెద్దలకు పది ఔన్సులు, పిల్లలకు 5 ఔన్సులకు తగ్గించడమేకాకుండా, రాష్ట్రమంతటా రేషనింగు అమలు జరుపబడింది. 1946 ఆగస్టునాటికి, రాష్ట్రంలోని అన్నిప్రాంతాలలోనూ రేషను పద్ధతి అమలులోకి వచ్చింది. పట్టణాలలో అమలులోవున్న పద్ధతికి పూచీ (స్టాటూటరి) రేషనింగు అనీ, పల్లెలలోవున్న పద్ధతికి నిర్పూచీ (ఇన్‌ఫార్మల్) రేషనింగు అనీ పేర్లు. దీని వివరం ఏమిటంటే; పట్టణాలలో పంటలులేవు గనుక, పట్టణాలలో నివసించే ప్రజలందరికీ రేషను సప్లయి చెయ్యడం, ప్రభుత్వపుపూచీ. పల్లెలలో పంటలు వుంటాయి కనుక, ప్రజలందరికీ రేషను సప్లయిచెయ్యాలనే పూచీ ప్రభుత్వానికి లేదు. ప్రభుత్వోద్యోగులకు, వ్యవసాయదార్లుకాని వారికీ మాత్రమే, రేషను ఇవ్వబడుతుంది.

ప్రజలకు రేషను సప్లయి చెయ్యాలంటే, ప్రభుత్వానికి ధాన్యం కావాలికదా. ఆ ధాన్యాన్ని రైతులవద్దనుంచి ప్రభుత్వమే స్వయంగా సేకరించడానికి పూనుకున్నది; రైతులపంటలో, సంవత్సరం పొడుగునా వారి కుటుంబాలకూ, పనివాండ్లకూ, సేద్యానికి కావలసినవిత్తులకూ, ఇతర అవసరాలకూ సరిపోయేటంత ధాన్యాన్ని వారు ఉంచుకోగా, మిగులు ధాన్యాన్ని ప్రభుత్వం కొనడం ఆరంభించింది. ఈ ధాన్య సేకరణకు ప్రత్యేకంగా ఉద్యోగస్థులు నియమింపబడినారు.

రాష్ట్రంలో ఆహారధాన్యాల ఉత్పత్తిలో స్వయంపోషకములు కాని జిల్లాలలో ధాన్య సేకరణను, రేషనింగును 1951 జనవరి 1 తేది నుంచి నిలిపివెయ్యడానికి రాష్ట్రప్రభుత్వం నిశ్చయించింది.

1947 జులై 12 తేదిన, బియ్యపు సప్లయితగ్గగా, బియ్యపురేషన్ ఎనిమిది ఔన్సులకు తగ్గించబడింది. 1940 జులై 1 వరకు, రేషనింగు అమలులోవున్న ప్రాంతాలలో రోజుకు ఎనిమిది ఔన్సుల బియ్యం ఇయ్య బడేది. కాని, రాష్ట్రంలో బియ్యం సరకు చాలా తక్కువగా వున్నందున, 1950 జులై 2 న బియ్యం రేషను ఏడు ఔన్సులకు తగ్గించబడింది. కాని, బియ్యం చాలినంతగా లేనందున 1950 ఆగస్టు 13 నుంచి, యీ రేషను 6 ఔన్సులకు తగ్గింపబడింది.

అయితే, బియ్యపు రేషను 6 ఔన్సులకు తగ్గించినా, గోధుమ, గోధుమనూక, మొదలైనవాటితో మొత్తం రేషను రోజుకి మనిషికి 12 ఔన్సులు ఇస్తామని ప్రభుత్వం ప్రకటించారు. కాని, ధాన్యపు కొరతవల్ల రాష్ట్రంలో చాలచోట్ల, అలా జరుగలేదు, దేశంలో లభించే ధాన్యాన్ని, ప్రజలందరికీ సమానంగా పంచిపెట్టాలనే వుద్దేశంతో, దేశమంతటాకూడా ఒక మనిషికి రోజుకు 9 ఔన్సుల ధాన్యమునే ఇవ్వడానికి 1951 జనవరి 19 తేదిన కేంద్రప్రభుత్వం నిర్ణయించింది. అయితే, 1951 జనవరి 28 తేదినుంచి మదరాసురాష్ట్రంలో బియ్యపు రేషను మనిషికి ఏడు ఔన్సులు చేయబడింది. మిగతా రెండు ఔన్సులు ఇతర ధాన్యాలు. 1951 ఏప్రిల్ 8 నుంచి బియ్యం రేషను 8 ఔన్సులు చేయబడింది. మిగతా ఒక ఔన్సు ఇతర ధాన్యం.

ఫ్యాక్టరీలు, రైల్వేకర్మాగారాలు, రేవులలో ఎగుమతి దిగుమతి పనులు మొదలైనవాటిలో ఎక్కువ శరీరకష్టంపడేవారికి తొమ్మిది ఔన్సుల రేషను చాలదుకనుక, వారికిమాత్రం రోజుకు 16 ఔన్సుల రేషను 1951 ఫిబ్రవరి 19 నుంచి ఇవ్వడానికి నిశ్చయించింది.

రాష్ట్రంలో రేషనింగు విధానాన్ని పూర్తిగా రద్దుచేస్తూ, ముఖ్యమంత్రి రాజగోపాలాచారి 1952 జూన్ 6 తేదిన ప్రకటన చేశారు. 1943 లో అమలులోకి వచ్చిన రేషనింగు 1952 లో అంతమొందింది.

## ధాన్య సేకరణ

1945 నుంచీ రాష్ట్రంలో ప్రతిసంవత్సరమూ ప్రభుత్వం సేకరించిన ధాన్యాల వివరాలివి :

| సంవత్సరం : | బియ్యం : | యవధాన్యములు |
|---|---|---|
| 1945-46 : | 13.13,895 | 1,16,739 |
| 1946-47 : | 14,98,465 | 1,23,647 |
| 1947-48 : | 9,47,405 | 25,559 |
| 1948-49 : | 18,64,528 | 77,165 |
| 1949-50 : | 10,19,145 | 90,420 |
| 1950-51 : | 9,36,605 | |
| 1951-52 : | | |

మదరాసు రాష్ట్రంలో ఆహార ధాన్యాల విషయంలో, తమకు సరిపోగా ఎగుమతికికూడా పంటపండే జిల్లాలు ఆరు. అవి : తూర్పుగోదావరి, పడమటి గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, తంజావూరు. మిగతావన్నీ లోటు జిల్లాలక్రిందనే లెఖ. గత రెండుసంవత్సరాలలోనూ, యీ జిల్లాలలో ఎంత బియ్యం ప్రభుత్వ సేకరణకు లభించినదీ యీ క్రింది అంకెలవల్ల తెలుస్తుంది.

| జిల్లా | 1947-48 | 1948-49 | 1949-50 |
|---|---|---|---|
| తూర్పుగోదావరి | 1,04,565 | 97,056 | 63,272 |
| పశ్చిమగోదావరి | 1,81,433 | 2,30,289 | 1.18,777 |
| కృష్ణ | 1,45,847 | 1,97,056 | 98,207 |

| | | | |
|---|---|---|---|
| గుంటూరు | 49,918 | 93,544 | 74,326 |
| నెల్లూరు | 32,879 | 56,489 | 65,840 |
| తంజావూరు | 2,68,384 | 3,09,365 | 2,58,107 |

## ఆంధ్రదేశంలో ఆహారధాన్యపు పంటలు

1949-50 లో తెలుగు జిల్లాలలో, ఏజిల్లాలో ఏఏ ఆహార ధాన్యం ఎంతపండినదీ వివరాలు యీ క్రిందపట్టీలో ఇవ్వబడినవి :

### వరి (టన్నులు)

శ్రీకాకుళం, 2,32,510, విశాపట్టణం, 1,50,010, తూర్పు గోదావరి, 4,29,420, పశ్చిమ గోదావరి, 4,79.450, కృష్ణ, 3,61,700. గుంటూరు, 3,31,350, నెల్లూరు, 2,69,020. కర్నూలు, 51,440, బళ్లారి, 20,800, అనంతపురం, 75,000, కడప, 1,01,000, చిత్తూరు, 1,55.110. మొత్తం 12 జిల్లాలలో పంపబడిన వరి, 26.66,810 టన్నులు. వడ్లను దంచి బియ్యాచేస్తే, దానిలో మూడింట ఒకవంతు తగ్గుతుంది. కాబట్టి. ప్రజలు తినడానికి దాదాపు 18,00,000 టన్నుల బియ్యం ఆంధ్ర జిల్లాలలో పండినవన్నమాట.

### జొన్నలు (టన్నులు)

శ్రీకాకుళం, 4.210, విశాఖపట్టణం, 9,490, తూర్పుగోదావరి, 15,600, పశ్చిమ గోదావరి, 10,490, కృష్ణ, 43,009, గుంటూరు, 1,17,250, నెల్లూరు, 83,260, కర్నూలు. 1,49,380, బళ్లారి, 1,35,840, అనంతపురం, 56,360, కడప, 67,220, చిత్తూరు, 9,700, మొత్తం 12 జిల్లాలలో పండిన జొన్నలు, 7,10,800, టన్నులు.

### సజ్జలు (టన్నులు)

శ్రీకాకుళం, 8,420, విశాఖపట్టణం, 67,240, తూర్పు గోదావరి, 8,960, పశ్చిమ గోదావరి, 1,500, కృష్ణ, 2,820, గుంటూరు, 40,120, నెల్లూరు, 44,240, కర్నూలు, 18,410, బళ్ళారి, 21,780, అనంతపురం, 27,200, కడప, 30,080, చిత్తూరు, 33,700 మొత్తం 12 జిల్లాలలోను పంపబడిన సజ్జలు, 3,04,390 టన్నులు,

## రాగులు (టన్నులు)

శ్రీకాకుళం, 35,460, విశాఖపట్టణం. 27,179, తూర్పుగోదావరి, 4,250, పశ్చిమగోదావరి, 1,360, కృష్ణ, 600, గుంటూరు, 7,250. నెల్లూరు, 48,240, కర్నూలు, 11,420, బళ్ళారి. 5,250, అనంతపురం, 49,150, కడప, 32,750, చిత్తూరు, 55,640, మొత్తం 12 జిల్లాలలోను పండిన రాగులు, 2,78,540 టన్నులు.

## కొర్రలు (టన్నులు)

శ్రీకాకుళం, 880, విశాఖపటణం, 2,220, తూర్పుగోదావరి, 880, పశ్చిమగోదావరి, 90, కృష్ణ, 140, గుంటూరు, 14,850, నెల్లూరు, 9,030, కర్నూలు, 58,990, బళ్ళారి, 59,390, అనంతపురం, 38,510, కడప, 17,790, చిత్తూరు, 460. మొత్తం 12 జిల్లాలలోను పండిన కొర్రలు, 2,02,230 టన్నులు.

పైన ఇచ్చిన పట్టీలను బట్టి తెలుగు జిలాలలో 1949-50 లో 18,00,000 టన్నుల బియ్యం, 7,01,900 టన్నుల జొన్నలు, 3,04,390 టన్నుల సజ్జలు, 2,78,540 టన్నుల రాగులు, 2,02,230 టన్నుల కొర్రలు, మొత్తం 32,86,960 టన్నుల ఆహారధాన్యాలు పండినవన్న మాట.

12 తెలుగు జిల్లాలలోను 1951 ఫిబ్రవరి నాటికి ఉన్న జనాభా, 2,12-33,347. ఈ జనాభాలో మూడవవంతు పన్నెండేళ్ళలోపువారు వుంటారు, అంటే 70,77,949 మంది పన్నెండేళ్ళలోపువారూ, 1,41,56,898 మంది పన్నెండేళ్ల పైబడినవారూ వుంటారనుకోవచ్చును. పన్నెండేళ్లలోపు వారికి రోజుకు ఆరు ఔన్సులూ, పన్నెండేళ్ల పైబడిన వారికి రోజుకు 12 ఔన్సులూ ఆహారధాన్యాలు ఇస్తే, సంవత్సరానికి మొత్తం 21,23,540 టన్నుల ఆహారధాన్యాలు చాలును. పండిన పంటలో ఇంకా పది లక్షల టన్నుల ఆహారధాన్యాలను ఎగుమతి చెయ్యవచ్చును. కాని, తెలుగుజిల్లాలు అరవజిల్లాలతో ఒకే రాష్ట్రంలో వుండటంవల్ల, తెలుగుజిల్లాలనుంచి ఆహారధాన్యాలు తక్కిన తమిళ

జిల్లాలకు ఎగుమతి కావడంవల్ల తెలుగు జిల్లాలలోకూడా ధాన్యం కొరత ఏర్పడింది.

కందులు :

మదరాసు రాష్ట్రంలో 1947-48 లో 3,37,500 ఎకరాలలో కంది పంట వెయ్యబడింది. 41,400 టన్నుల కందులు పండినవి. 1948-49 లో 3,40,900 ఎకరాలలో కందిపంట వెయ్యబడింది. 42,800 టన్నుల కందులు పండినవి. 1949-50 లో 3,73,841 ఎకరాలలో 47,330 టన్నుల కందులు పండినవి.

మినుములు :

రాష్ట్రంలో 1947-48 లో 2,92,100 ఎకరాలలో మినపపంట వెయ్యబడింది. 32,300 టన్నులు మినుములు పండినవి. 1948-49 లో 2,87,800 ఎకరాలలో మినపపంట వెయ్యబడింది. 34,500 టన్నుల మినుములుపండినవి. 1949-50 లో 2,98.692 ఎకరాలలో 29,820 టన్నుల మినుములు పండినవి.

శనగ :

1947-48 లో రాష్ట్రంలో 79,100 ఎకరాలలోనూ, 1948-49 లో 71,800 ఎకరాలలోనూ, 1949-50 లో 1,33,850 ఎకరాలలోనూ శనగపంట వెయ్యబడింది. 1948-49 లో 20,600 టన్నులూ 1949-50 లో 27,190 టన్నులూ శనగలు పండినవి.

## వ్యాపారపు పంటలు

ప్రత్తి :

1949-50 లో మదరాసు రాష్ట్రంలో 16,91,001 ఎకరాల భూమిలో ప్రత్తిపంట వెయ్యబడింది.

వేరుశనగ :

మదరాసు రాష్ట్రం అంతటలోనూ 1949-50 లో మొత్తం 37,67,123 ఎకరాలలో వేరుశనగ పంట వెయ్యబడింది, ఆ పంటవల్ల మొత్తం 14,60,100 టన్నుల వేరుశనగ కాయలు పండినది,

1949-50 లో రు. 4,53,05,000 విలువగల 6,0,60,000 గాలనుల వేరుశనగ నూనె విదేశాలకు ఏగుమతి చేయబడింది.

చెరకు :

1948-50 లో మదరాసు రాష్ట్రంలో 1,81,386 ఎకరాలలో చెరకు పంట వేయబడింది. దీనిలో 5,32,530 టన్నుల బెల్లం లభించింది, దాని విలువ రు. 29,03,16,000.

అల్లం :

1949 లో మలబార్‌లో 9,800 ఎకరాలలోను, దక్షిణ కన్నడ జిల్లాలో 800 ఎకరాలలోను (మొత్తం 18,000 ఎకరాలలో) నీలగిరిలో 100 ఎకరాలలోను, అల్లం తోటలు వేయబడినవి. మలబార్‌లో 3,260 టన్నులు, దక్షిణకన్నడలో 320 టన్నులు (మొత్తం 3,580 టన్నులు) అల్లం పండింది.

1950 లో మలబార్ 10,000 ఎకరాలలోను, దక్షిణకన్నడ జిల్లాలో 800 ఎకరాలలోను, నీలగిరిలోను, 100 ఎకరాలలోను అల్లపు తోటలు వేయబడినవి.

మిరియం :

దక్షిణ ఇండియాలోని ముఖ్యమైన వ్యాపారపు పంటలలో మిరియము ఒకటి. దక్షిణ ఇండియాలో ఏఏప్రాంతంలో సాధారణంగా ఎంత భూమిలో యీ పంటచేసేదీ, సంవత్సరానికి ఎంత పండేది యీ క్రింది పట్టీవలన తెలుసుకొనవచ్చును,

| ప్రాంతం | పంటవేసిన భూమి (ఎకరాలు) | పంట (టన్నులు) |
|---|---|---|
| తిరువాంకూరు కొచ్చిన్ | 1,01,030 | 14,500 |
| మలబార్ దక్షిణకన్నడ | 98,100 | 9,100 |
| ఉత్తర కెనడ | 4,736 | 500 |
| మైసూర్ | 560 | 60 |
| కూర్గ్ | 3,200 | 350 |

దక్షిణకన్నడ జిల్లాలో 730 టన్నులు (మొత్తం 8,280 టన్నులు) పంట పండింది.

1950 లో రాష్ట్రంలో మొత్తం 1,04,700 ఎకరాలలో మిరియపు పంట వెయ్యబడింది. దీనిలో మలబారులో 91,600 ఎకరాలు, దక్షిణకన్నడ జిల్లాలో 13,100 ఎకరాలు, నీలగిరిలో 100 ఎకరాలు. దీనిలో 3,410 టన్నుల మిరియాలు పండినవి.

మిరియములు చాలా విలువగల ఎగుమతి ద్రవ్యములలో ఒకటి. 1950-51 లో రూ. 20 కోట్ల విలువగల మిరియములు ఇండియానుంచి విదేశాలకు ఎగుమతి చేయబడినవి. 1948-49 లో రూ. 2,67,00,000 విలువగలవీ, 1949-50 లో రూ. 14,50,00,000 విలువగలవీ ఎగుమతి చేయబడినవి.

**తేయాకు :**

1948-49 లో రాష్ట్రంలో 81,041 ఎకరాలలో తేయాకు వెయ్యబడింది. 1949 లో మొత్తం తేయాకు పంట : 4,91,09,332 పౌనులు. 1951 లో దక్షిణఇండియాలో మొత్తం 11,49,35,927 పౌనుల టీ పండింది.

**పొగాకు :**

మదరాసు రాష్ట్రంలోని ముఖ్యమైన వ్యాపారపు పంటలలో పొగాకు ఒకటి. 1949-50 లో 3,45,344 ఎకరాలలో యీ పంట వెయ్యబడింది. సుమారు 83,700 టన్నులు పొగాకు పండింది. 1950-51 లో 4,21,300 ఎకరాలలో పొగాకు పంట వెయ్యబడిందని అంచనా.

ఇండియాలోని రాష్ట్రాలన్నిటిలోకీ ఎక్కువ గా పొగాకు వాడకం చేసేరాష్ట్రం మదరాసే. 1949-50 లో యీరాష్ట్రంలో 17,00,63,337 పౌనుల పొగాకు వాడకంజరిగింది. అదే సంవత్సరంలో ఉత్తరప్రదేశ్ లో 9,52,40,334 పౌనులు, బొంబాయిలో 5,81,74,045 పౌనులు పొగాకు వాడుకఅయింది.

పొగాకు పంటలోకూడా మదరాసుదే ప్రధానస్థానం. ఇండియాలో పండే పంటలలో నూటికి 95 వంతుల పొగాకు గుంటూరు, కృష్ణా, తూర్పుగోదావరిజిల్లాలోనే పంట అవుతుంది.

1949-50 లో రూ. 9,75,36,000 విలువగల 7,23,28,982 పౌనుల పొగాకు యీ రాష్ట్రంనుంచి ఎగుమతి చేయబడింది.

# భూమిపన్ను ప్రభుత్వాదాయం

మదరాసు రాష్ట్రప్రభుత్వానికివచ్చే భూమిపన్ను మూడువిధాలు : ఒకటి జమీందారులు చెల్లించే పేష్కష్; రెండు శ్రోత్రియం, ఇనాం భూముల యజమానులు చెల్లించే భూమిశిస్తు; నీటితీరువపన్ను.

1949-50 జమీందారులు చెల్లించవలసిన పేష్కష్, రు. 33,78,926.

శ్రోత్రియ ఇనాం భూముల యజమానులు చెల్లించే పన్ను రూ. 7,82,796. రైతువారి పన్ను 7,13,65,622. దీనిలో నీరు తీరువవల్లనూ, రెండవపంటలమీద వేసిన పన్నులవల్లనూ వచ్చే ఆదాయం రూ. 57,78,000.

ఇతర భూమి పన్నులవల్ల వచ్చే ఆదాయం రూ. 2,60.22,195. రాష్ట్రం అంతటినూలో, లాండ్ రెవిన్యూ డిపార్టుమెంటుకు రావలసిన ఆదాయం రూ. 10,14,99,539. దీనిలో రూ. 9,09,682 వదులుకోబడింది. తక్కినదానిలో రూ. 9,17,23,650. వసూలు అయింది.

# నీటి తీరువ సదుపాయాలు

మదరాసురాష్ట్రంలో వ్యవసాయయోగ్యమైనభూమి 3,92,85,031 ఎకరాలు అయితే దీనిలో 3,13,07,676 ఎకరాల భూమిలోనే, 1949-50 లో వ్యవసాయం జరిగింది. దీనిలో, మాగాణి, 98,50,022 ఎకరాలు.

మాగాణి భూమిలో చెరువులమీదనూ, బావులమీదనూ ఆధార పడిన భూమికాక, నదుల నీటిని కాలువలద్వారా పొలాలకు తీరువ కట్టడంవల్ల, 1949-50 లో మొదటి పంట 46,25,252 ఎకరాలలోను, రెండవపంట 7,48,474 ఎకరాలలోను పండింది. నీటి తీరువను పొందిన భూములలో పండిన పంట విలువ, రూ. 62,99,60,929 అని అంచనా.

రాష్ట్రంలో మొత్తం 26,70,000 ఎకరాల భూమికి చెరువుల ద్వారాను, 15,40,000 ఎకరాల భూమికి బావులద్వారాను నీటి తీరువ కలిగింది.

మదరాసు రాజధానిలో పంటభూములకు అత్యధికంగా నీటి తీరువ జరిగే ప్రాంతాలు కృష్ణా, గోదావరి డెల్టాలలోనూ, కావేరిడెల్టాలలోనే. 1949-50 లో నదుల కాలువలవల్లనూ, ఆ ప్రాంతాలలో బావులవల్లనూ, ఏఏ ప్రాంతాలలో ఎంతెంత భూమికి నీటి తీరువకట్టినదీ, ముఖ్యమైన ప్రాంతాలను గురించిన వివరాలివి: నీటి తీరువపొందిన ప్రాంతపువైశాల్యం ఎకరాలలో ఇవ్వబడింది. ఇక్కడ యిచ్చిన వివరాలు ఆయాప్రాంతాలలో పండిన రెండు రెండు పంటలూ ఎంత భూమిలో పండినదీ సూచిస్తాయి.

| కాలువలు : | పంటపండిన భూమి |
|---|---|
| గోదావరి డెల్టా : | 13,11,968 |
| కావేరి డెల్టా : | 10,75,302 |
| కృష్ణా డెల్టా : | 11,97,419 |
| కావేరి - మెట్టూరు ప్రాజెక్టు : | 2,68,171 |

| | |
|---|---|
| పెన్న నది : | 1,84,269 |
| పెరియార్ నది : | 2,07,095 |
| తాడేపల్లి కాలువ : | 25,988 |
| కృష్ణ తూర్పు కాలువ : | 85,663 |
| కర్నూలు - కడప కాలువ : | 89,772 |
| చికాకోల్ కాలువ : | 70,849 |
| పాలార్ అనకట్ట : | 88,071 |
| నాగావళి నది : | 29,028 |

మదరాసు రాష్ట్రంలో, ప్రజలకూ, పంటలకూకూడా ప్రధాన జీవనదులు, గోదావరి, కృష్ణ, కావేరి, పెన్న; ఈ నదులవల్ల ఎంత భూమికి నీటి సరఫరా అయేదీ, వాటి పుట్టుక, ప్రవాహం, వివరాలు క్రింద ఇవ్వబడినవి :

గోదావరి :

అరేబియన్ సముద్రానికి 50 మైళ్ళ దూరాన, పశ్చిమ కనుమలలో పుట్టి తూర్పుకు ప్రవహించి, బంగాళాఖాతంలో పడుతున్నది. ఈ మహానది పొడవు 900 మైళ్లు. మంజీర, ప్రాణహిత, ఇంద్రావతి, శబరి, అనేవి యీ నదికి ఉపనదులు. ఈ మహానదిలోనికి సుమారు 1,15,000 చదరపు మైళ్ళ ప్రాంతంలోనుంచీ, వాగులోనుంచీ నీరు కలుస్తుంది. ఈ మహానది కాలువవల్ల, 8,20,000 ఎకరాలపైగా భూమికి మొదటిపంటవ్యవసాయానికి నీరు లభిస్తున్నది. రెండుపంటలకు మొత్తం పది లక్షల ఎకరాలకు పైగా నీరులభిస్తుంది. ఈ నది నీటి తీరువపొందే ప్రాంతంలో పండే పంట విలువ ఏడాదికి 1,177 లక్షల రూపాయలువుంటుంది. ఈనది నీటిని వ్యవసాయానికి అందజెయ్యడానికి కాలువలూ, అనకట్టలూకట్టడానికి మొత్తం రు. 220,00,000 అయింది. ఈ పెట్టుబడిమీద, ఏడాదికి నూటికి 18.22 వంతులచొప్పున, పన్నులరూపంగా తిరిగివస్తున్నది. ఈనదికి అనకట్ట, రాజమండ్రికి దిగువను ధవళేశ్వరంవద్దకట్టారు. అయితే గోదావరిలో ప్రతిసంవత్సరం ప్రవహించే నీటిలో నూటికి 65 వంతులుమాత్రమే ప్రస్తుతం ఉపయోగింపబడుతున్నది.

### కృష్ణ :

ఆంధ్రదేశాన్ని సస్యశ్యామలం చేస్తున్న మహానదులలో రెండవది కృష్ణ. ఈ నదికూడా పశ్చిమ కనుమలలో మహాబలేశ్వరం వద్ద పుట్టి బంగాళాఖాతంలో పడుతున్నది. భీమనది, తుంగభద్ర, మూసినదులు దీనికి ఉపనదులు. సుమారు 97,000 చదరపుమైళ్ళప్రాంతంనుంచి వాన నీరు వాగులు దీనిలో కలుస్తాయి. గోదావరికి ఆనకట్టి కట్టిన సర్ ఆర్థర్ కాటన్‌గారే, కృష్ణకుకూడా విజయవాడవద్ద ఆనకట్ట కట్టించారు. ఈ నది కాలువలవల్ల సుమారు 9,30,000 ఎకరాలభూమికి నీటిసరఫరా అవుతున్నది. ఈ భూమిలోపండే పంటల విలువ ఏడాదికి దాదాపు 12 కోట్ల రూపాయలు. ఈ నదికి కాలువలు, ఆనకట్టకట్టడానికి రు. 2,20,00,100 ఖర్చయింది. ఈ పెట్టుబడిమీద ప్రస్తుతం ఏడాదికి నూటికి 16,20 వంతుల చొప్పున, పన్నులరూపంగా ఆదాయంవస్తుంది, కృష్ణలో ప్రతిసంవత్సరం ప్రవహించే నీటిలో, నూటికి ఏడు వంతులు మాత్రమే ప్రస్తుతం ఉపయోగింపబడుతున్నది.

### కావేరి:

దక్షిణదేశానికి జీవనది అయిన కావేరి జన్మస్థానం కూర్గు. అక్కడ నుంచి మైసూరు రాష్ట్రంగుండానూ, తంజావూరు జిల్లా గుండానూ ప్రవహించి, అనేక పాయలుగా చీలి, బంగాళాఖాతంలో పడుతున్నది. ఈనది పొడవు దాదాపు 500 మైళ్లు. సుమారు 31,000 చదరపుమైళ్ళ ప్రాంతం నుంచి, వరదనీరు యీనదిలో కలుస్తుంది. ఈనదికి మైసూరువద్ద కృష్ణరాజ సాగరం, సేలంవద్ద స్టాన్లీ డాం అనే రెండు రిజర్వాయర్లుఉన్నాయి. శివసముద్రంవద్ద, యీ నదీ పాతంవల్ల ఉద్భవించే శక్తిని ఉపయోగించీ, దక్షిణదేశంలో విశేషప్రాంతానికి విద్యుచ్ఛక్తి సప్లయిచేస్తున్నారు. ఈ నది శ్రీరంగంవద్ద రెండుగా చీలుతున్నది. ఈ రెండు పాయలకు మధ్యవున్న దీవిని శ్రీరంగద్వీపం అంటారు. ఇక్కడి చీలికలలో దక్షిణపుపాయను కావేరి అనే పిలుస్తారు. ఉత్తరపుపాయను కోలెరూన్ అంటారు. కావేరి నీటి తీరువవల్ల దాదాపు 8,70,000 ఎకరాల భూమి

మొదటిపంటకు సాగుఅవుతుంది, ఈ భూమిలో పండేపంటల విలువ ఏడాదికి దాదాపు 982 లక్షల రూపాయలు.

పెన్న :

పెన్నానది (పినాకిని) నెల్లూరుజిల్లాలో ప్రవహిస్తున్నది. దీనికి సంగంవద్ద ఒక ఆనకట్ట, నెల్లూరువద్ద మరొక ఆనకట్ట వున్నాయి. ఈనది వల్ల 1,67,500 ఎకరాల భూమికి నీటితీరువ లభిస్తున్నది. దీనికి కాలువలు కట్టడానికి రు. 71,00,000 ఖర్చయింది. దీనిమీద ఏడాదికి నూటికి 5.88 వంతుల చొప్పున పన్నులరూపంగా ఆదాయం వస్తున్నది.

విశాఖపట్టణం జిల్లాలో బాహుద, పద్మపురం గడ్డనదులు సుమారు 6,000 ఎకరాలకూ, వరశధార, లాంగుల్యనదులు సుమారు 67,000 ఎకరాలకూ నాగావళినది సుమారు 28,000 ఎకరాలకూ వరాహనది 18,000 ఎకరాలకూ, శారదానది 9,000 ఎకరాలకూ నీటివసతిని కల్గిస్తున్నవి.

# రామ పాదసాగర నిర్మాణము

మద్రాసు ప్రభుత్వం స్పెషల్ ఇంజనీరు ఎన్. గోవిందరాజ అయ్యంగార్ 1947 అక్టోబరు 17 తేదిన శాంక్వెటింగ్ హాలులో ప్రత్యేకము ఏర్పాటుచేయబడిన సభలో రామపాదసాగర నిర్మాణమునుగురించి ఈ క్రింద వివరాలు తెలియచేశారు,

రామపాదసాగరం ప్రాజెక్టు ఎత్తు 40 అడుగులు. బాగా లోతు పునాదిరాయినుంచి 427 అడుగులు. రాజమహేంద్రవరమునకు 20 మైళ్ల దూరమున పోలవరమువద్ద ఇది కట్టబడును. ఇక్కడ గోదావరిలో మహానందీశ్వరకొండ ఉన్నది, దానిపై శివ, విష్ణ్వాలయములు ఉన్నవి. ఆ కొండకు అటూ ఇటూ ఆనకట్ట కట్టవలసి ఉన్నది. ఆ దేవాలయములు పైకి ఎత్తి కట్టబడును. గోదావరికి ఎడమవైపున విశాఖపట్టణం నౌకా

శ్రయంవరకూ 131 మైళ్ళ పొడవుననూ, కుడివైపున కృష్ణానదివరకూ 110 మైళ్ళ పొడవుననూ, కృష్ణ దాటి గుంటూరుమండలమున 105 మైళ్ళ దూరము, కాల్వలు త్రవ్వబడును. ఉభయ గోదావరులు, విశాఖ కృష్ణ, గుంటూరు మండలములందు 33 లక్షల ఎకరములు ఇందువల్ల సాగును.

మెట్టప్రదేశములలో 90 లక్షల ఎకరములలో మొదటి పంట, 4 లక్షల ఎకరములలో రెండవ పంట రాగలదు, గోదావరి డెల్టాలో మూడులక్షల రెండువేల ఎకరములు కృష్ణ డెల్టాలో 64 లక్షల ఎకరములు రెండవ పంట నిచ్చును. కొల్లేరు సరస్సుప్రాంతములో 60 వేల ఎకరములు, మొత్తము 22 లక్షల ఎకరములపై పంటవచ్చును. దీనికి 1945 అంచనాలప్రకారము 86 కోట్ల రూపాయలు వెచ్చింపవలెను దీనిమీద ఏడాదికి 242 లక్షల రూపాయల ఆదాయం వస్తుంది.

డాముక్రింద కుడివైపున విద్యుచ్ఛక్తి ఉత్పత్తిస్థానము ఉండును. లక్ష మొదలు లక్షన్నరవరకూ కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని, ఆరుమాసములు దీనికితోడు 39 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చెయ్యవచ్చును. లాకులుకట్టి అటు సెంట్రల్ ప్రావెన్సులో బస్తరువరకును, ఇటు హైదరాబాదు, విశాఖపట్టణం మద్రాసువరకు నావల రవాణా సౌకర్యములను కలిగించవచ్చును.

పోలవరమునకు పైన రెండుమైళ్ళ దూరమున ఆనకట్టకట్టుదురు. రిజర్వాయరు భద్రాచలం దుమ్ముగూడెమువరకు వ్యాపించును. భద్రాచలస్వామి రామపాదములకు 8, 10 అడుగుల దిగువవరకూ నీరు వచ్చును. అనకట్ట ఎత్తు పెంచినచో రామపాదమువరకుగూడా నీరు రాగలదు. గోదావరి ప్రవాహములో సాలీనా 600 లక్షల ఘ. అ. నీరు ప్రవహించుచున్నది. ప్రస్తుతం 100 కి ఆరువంతులైనా నీరు ఉపయోగ పడుటలేదు. ఆనకట్ట కట్టినచో 15 మొదలు 20 వంతులువరకూ యీ నీటిని ఉపయోగించుకోవచ్చును. సాలీనా 25 కోట్ల ఆదాయము ఈ ప్రాజెక్టువల్ల లభించును.

సలహా ఇంజనీర్ల బోర్డువారు ఆనకట్ట నిర్మాణము సాధ్యమని తీర్మానించిరి. సాధారణమైన నదీగమనము, ప్రవాహము, పునాది, ఖననము మున్నగు సమస్యలున్ననూ, నిస్సందేహముగా ఆనకట్టలు నిర్మించవచ్చునని వారు అభిప్రాయపడిరి.

రిజర్వాయరు నీరు 587 చ. మైళ్ళు వ్యాపించును. దానిలో హైద్రాబాదులో 181 చ. మైళ్ళు, బస్తరు సంస్థానమున 16 చ. మైళ్ళు జయపూరునందు 14 చ. మైళ్లు, చెన్నరాష్ట్రమునందు 381 చ. మైళ్లు ప్రభుత్వము వారు ప్రాజక్టును మంజూరుచెయ్యదలచనట్లయితే 1948 చివరగాని 1949 ప్రారంభముగాని పని ప్రారంభించులోపున ప్లాంటు యంత్రములు, నిర్మాణపరికరములు సమీకరించుకొనవలెను. కార్మికులకు, అధికారులకు క్యాంపులు, భవనములు వెయ్యవలెను. కొవ్వూరునుంచి పరికరములు అందజేయుటకు రైలుమార్గము వెయ్యవలెను. 160 మొదలు 169 వరకు పంపులు 6 ఏళ్ళు పనిచెయ్యవలెను. నదిపై అచ్చట వంతెనలు కట్టుకొనవలెను. 60- టన్నుల ఉత్పత్తిచెయ్యగల సిమెంటు ఫాక్టరీని కట్టవలెను. కొవ్వూరు దగ్గరగాని, బెజవాడదగ్గరగాని సిమెంటుఫాక్టరీ కట్టుకొనవచ్చును. స్టీము లాంచీలు తెప్పించవలెను. అమెరికా, ఇంగ్లండులనుంచి పంపులు తెప్పించవలెను.

1949 మార్చిలో కేంద్రశాసనసభలో ఒక ప్రశ్నకు జవాబు చెబుతూ, మంత్రి ఎన్. వి. గాడ్గిల్ చెప్పిన దానినిబట్టి, రామపాద సాగర్ నిర్మాణానికి 130, కోట్ల రూపాయలు అవుతుందనీ, 19 సంవత్సరాలకాలం పడుతుందనీ, అంచేత, యింతకన్న తక్కువఖర్చులో నిర్మాణం పూర్తిఅయే ఇతర ప్రాజెక్టులను ప్రభుత్వంవారు పూర్తిచేస్తారని తేలింది.

1950 జనవరి 7 తేదిన మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలులో ప్రశ్నకు సమాధానంగా పబ్లిక్ వర్క్సుమంత్రి భక్తవత్సలంగారు రామపాదసాగర నిర్మాణాన్ని గురించి యీ క్రింది విశేషములు తెలియచేశారు.

ప్రస్తుతపు ధరలనుబట్టి, యీ ప్రాజెక్టు నిర్మాణానికి రు. 129 కోట్లు ఖర్చు అవుతుందని అంచనా. ఈ సాగరు నిర్మాణంవల్ల అదనంగా 11 లక్షల 80 వేల ఎకరాల భూమిని సాగుకు తీసుకొనిరావచ్చును. మరొక 15 లక్షల 60 వేల ఎకరాలలో రెండవపంట వెయ్యవచ్చును.

అదనంగా 11 లక్షల టన్నులబియ్యం ఏడాదికి, ఈ స్కీంవల్ల పండుతుంది.

## తుంగభద్ర ప్రాజెక్టు

బళ్లారిజిల్లాలో హాస్పేట సమీపంలో మల్లాపురంవద్ద తుంగభద్రకు ఆనకట్టకట్టి, నీటిని నిలువచేయడానికి తటాకొాదినిర్మాణం జరుగుతున్నది. ఈ రిజర్వాయరునుంచి కాలువలలో సుమారు మూడు లక్షల ఎకరాలు నీటి వసతి కల్పించవచ్చునని అంచనా. కాలువకు రెండు ప్రక్కల, రెండుచోట్ల విద్యుచ్ఛక్తినికూడా ఉత్పత్తి చేయడానికి ఏర్పాట్లు జరుగుతున్నవి. ఈ ప్రాజెక్టుకు 27 కోట్ల రూపాయలు ఖర్చు అవుతుంది. ఈ ప్రాజెక్టు నిర్మాణం పూర్తిఅయిన తరువాత, రాయలసీమలో కరవుబాధ అంతరిస్తుందని ఆశ.

దీని ఆనకట్ట 6000, అడుగుల పొడవుపుంటుంది. మదరాసు రాష్ట్రంలో యీ ప్రాజెక్టు కాలువ పొడవు 226 మైళ్లు వుంటుంది. దీనినుంచి నీరు తీసుకొనిపోయే చిన్నకాలువలన్నింటి పొడవూ కలిసి మొత్తం 1,700 మైళ్లు.

## విద్యుచ్ఛక్తి

మదరాసు రాష్ట్రంలో ప్రభుత్వయాజమాన్యంలో ప్రస్తుతంమూడు హైడ్రో ఎలక్ట్రిక్ స్కీములు, పది థర్మల్ స్కీములు వున్నాయి.-

రాష్ట్రంలోని హైడ్రో ఎలక్ట్రిక్ స్కీములు ఏమిటంటే: పైకార; మెట్టూరు; పాపనాశం. ఈ స్కీములలో ఉత్పత్తి చేయబడ్డ విద్యుచ్ఛక్తి వివరాలివి :

క్రింది అంకెలు K. W. H. పది లక్షల యూనిట్లు

| స్కీము. | 1948-49. | 1949-50. | 1950-51. |
|---|---|---|---|
| పైకార | 208.20 | 222.86 | 227.80 |
| మెట్టూరు | 156.80 | 160.39 | 183.10 |
| పాపనాశం | 71.77 | 79.84 | 99.27 |

రాష్ట్రంలోని థర్మల్ స్కీములు ఏమిటంటే : మదరాసు, విశాఖపట్టణం, విజయవాడ, కాకినాడ, కర్నూలు, కడప, నెల్లూరు, మధుర, అనంతపురం, సాందూర్ ఈ స్కీములలో ఉత్పత్తిచేయబడ్డ విద్యుచ్ఛక్తి వివరాలివి :

క్రింది అంకెలు K. W. H. పది లక్షల యూనిట్లు

| స్కీము. | 1948-49. | 1949-50. | 1950-51. |
|---|---|---|---|
| మద్రాసు : | 102.70 | 108 | 120.80 |
| విశాఖపట్టణం : | 10.68 | 12.08 | 13.40 |
| విజయవాడ : | 17.30 | 18.80 | 22.63 |
| కాకినాడ : | 1.89 | 2.53 | 3.67 |
| కర్నూలు : | 0.56 | 0.65 | 0.876 |
| కడప : | 0.13 | 0.47 | 0.694 |
| అనంతపురం : | | 0.18 | 0.28 |
| నెల్లూరు : | (1950 అక్టోబరు 2న ప్రారంభింపబడింది) | | 1.05 |
| మధుర : | (1950 ఫిబ్రవరి 19 న ప్రారంభింపబడింది) | | 0.07 |
| సాందూర్ | | | 0.047 |

హైడ్రో ఎలక్ట్రిక్ స్కీములవల్లనూ, థర్మల్ స్కీములవల్లనూ 1948-49 లో 5,694 లక్షల యూనిట్లూ, 1949-50 లో 6,058 లక్షల యూనిట్లూ, 1950-51 లో 6,746 లక్షల యూనిట్లూ విద్యుచ్ఛక్తి రాష్ట్రంలో వుత్పత్తిఅయింది. ఇదికాక మైసూరురాష్ట్రంనుంచి 69 లక్షల యూనిట్లు సప్లయి అయింది.

ఇదికాక కంపెనీలు లైసెన్సులు పొంది, రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో విద్యుచ్ఛక్తి తయారుచేస్తున్నాయి. ఇలాతయారైన విద్యు

చ్ఛక్తి 1948-49 లో 67,30,000 K. W. H. యూనిట్లు, 1949-50 లో 61,20,000 K. W. H. యూనిట్లు; 1950-51 లో 46,50,000 యూనిట్లు.

ఇటీవల గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సప్లయి చెయ్యడం విషయంలో ఎక్కువకృషి జరుగుతున్నది. ప్రస్తుతం మద్రాసు రాష్ట్రంలో 1,186 గ్రామాలకు, 141 పట్టణాలకు విద్యుచ్ఛక్తి సప్లయి జరుగుచున్నది.

1950-51 లో ఉత్పత్తిఅయిన విద్యుచ్ఛక్తిలో నూటికి 58 పాళ్లు పరిశ్రమలకును, 12 పాళ్లు వ్యవసాయ కార్యక్రమములకును, 12 పాళ్లు గృహస్థుల అవసరములకును, 8 పాళ్లు వ్యాపారసంస్థల అవసరములకును, 3 పాళ్లు ప్రజల సమష్టిఉపయోగానికి దీపాలను పెట్టడానికిన్నీ ఉపయోగించబడింది.

రాష్ట్రంలోని విద్యుచ్ఛక్తి స్కీములవల్ల ఖర్చులుపోగా ప్రభుత్వానికి 1949-50 లో మొత్తం 101 లక్షల రూపాయలు, 1950-51 లో 167 లక్షల రూపాయలు లాభంవచ్చింది.

# రాష్ట్ర ప్రభుత్వ ఆదాయ వ్యయాలు

మదరాసురాష్ట్ర ప్రభుత్వానికి 1944-45 నుంచి 1951-52 వరకూ ఏయే సంవత్సరం ఎంత ఆదాయం వచ్చినదీ, ఎంత వ్యయంఅయినదీ యీ క్రింది పట్టివలన తెలుస్తుంది.

| సంవత్సరం | ఆదాయం | వ్యయం |
|---|---|---|
| 1944-45 : | రు. 41,23,72,993 | రు. 41,23,17,830 |
| 1945-46 : | ,, 47,98,89,000 | ,, 47,98,74,000 |
| 1946-47 : | ,, 56,99,53,000 | ,, 56,98,89,000 |
| 1947-48 : | ,, 50,71,10.000 | ,, 55,83,64,000 |
| 1948-49 : | ,, 53,28,52,000 | ,, 53,33,42,000 |
| 1949-50 : | ,, 55,89,49,000 | ,, 55,54,01,000 |
| 1950-51 : | ,, 58,16,34,000 | ,, 59,45,21,000 |

| | | |
|---|---|---|
| 1951-52 : | రు 63,48,02,000 | రు 63,57,64,000 |
| 1952-53 అంచనా | ,, 61,75,74,000 | ,, 65,34,44,000 |

1952-53 బడ్జెటులో ప్రభుత్వం ఖర్చుపెట్టే డబ్బులో ప్రధాన కార్యక్రమాలకు ఎంత అయేదీ వివరాలు ఇవి :

| | |
|---|---|
| విద్య : | రు. 11,80,00,000 |
| వైద్యం : | ,, 4,83,00,000 |
| నీటి పారుదల | ,, 8,97,00,000 |
| విద్యుచ్ఛక్తి : | ,, 8,00,00,000 |
| వ్యవసాయం : | ,, 8,89,00,000 |

## ప్రభుత్వోద్యోగులు : వారి జీతాల ఖర్చు

1948-49 లో రాష్ట్రప్రభుత్వం అధీనంలో పనిచేస్తున్న ఆఫీసర్ల వివరాలివి :

| | |
|---|---|
| ఇండియన్ సివిల్ సర్వీసు ఆఫీసర్లు : | 104 |
| ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీసు ఆఫీసర్లు : | 19 |
| ఇతర ఇండియన్ సర్వీసు ఆఫీసర్లు : | 108 |
| రాష్ట్రీయ సర్వీసు ఆఫీసర్లు : | 3,224 |

గవర్నరు జీతం, మంత్రుల జీతాలు, శాసనసభాధ్యక్షుల జీతాలు, శాసనసభ్యుల జీతాలు, మొత్తం, 6,56,000 రూపాయలు కలిపి, రాష్ట్ర ప్రభుత్వంలోని పై ఆఫీసర్ల జీతాలకు 1948-49 లో రు. 2,01,86,000 ఖర్చు అయింది.

గ్రామోద్యోగులుకాక, రాష్ట్రంలోని ఇతర ఉద్యోగుల సంఖ్య 1,60,465. ఈ ఉద్యోగుల జీతాలకు రూ. 8,59,26,000 ఖర్చుఅయింది. రాష్ట్రంలోని గ్రామోద్యోగులు, వారి పరివారం మొత్తం : 1,07,708: వీరికి ఇచ్చిన జీతం మొత్తం రు. 1,87,35,910.

1948-49 లో మదరాసు రాష్ట్రప్రభుత్వంలో పనిచేసిన ఉద్యోగులూ, పరివారమూ (అన్నిహోదాలవారూ) మొత్తం: 2,71,628. వీరికి ఇచ్చిన జీతాలమొత్తం రు. 12,30,39,000.

జిల్లాలలో ప్రభుత్వ పరిపాలనకు నియోగించబడిన ఉద్యోగులందరికీ, 1949-50 లో మొత్తం రు. 1,50.41,869 ఖర్చు అయింది. దీనిలో, గ్రామోద్యోగులకు వారిపరివారానికి ఇవ్వబడినది రు. 2,42,49,948.

# విద్య

1951 మార్చి 31 తేదినాటికి మదరాసురాష్ట్రంలో 1354 సెకండరీ స్కూళ్లు వున్నాయి. వానిలో 224 ప్రత్యేకం బాలికలకు, తక్కిన 1,130 ఉభయులకు. వీటిలో హైస్కూళ్లు ఎస్. ఎస్. ఎల్. సి. క్లాసులు గలవి 861. ఇవికాక ఎలిమెంటరీ స్కూళ్లు, 38,101.

1950 ఏప్రిల్ 1 నాటికి రాష్ట్రంలో 37,812 ఎలిమెంటరీ స్కూళ్లు, 1,247 సెకండరీస్కూళ్లు ఉన్నాయి.

1950 ఏప్రిల్ 1 నాటికి రాష్ట్రంలోని ఎలిమెంటరీ స్కూళ్ళలో చదువుతున్నవారిసంఖ్య 36,89,822 ఈ స్కూళ్ళలో పనిచేసిన ఉపాధ్యాయుల సంఖ్య 1,32,968 మంది. వీరిలో 29,661 మంది స్త్రీలు. పురుషులలో 95,449 మంది ట్రెయినింగు పొందినవారు. స్త్రీలలో 28,526 మంది ట్రెయినింగు పొందినవారు.

బాలురకొరకు స్థాపింపబడిన సెకండరీ స్కూళ్ళలో చదువుతున్న వారిసంఖ్య 4,76,004. వీరిలో 36,139 మంది బాలికలు. ఈస్కూళ్ళలో పనిచేసిన ఉపాధ్యాయుల సంఖ్య 20,549. వీరిలో స్త్రీలు 487. పురుషులలో ట్రెయినింగు పొందినవారు 16,543. స్త్రీలలో ట్రెయినింగు పొందినవారు, 440.

రాష్ట్రంలో ప్రత్యేకంగా బాలికలకొరకు 250 సెకండరీస్కూళ్లు వున్నవి. వీటిలో 182 హైస్కూళ్లు. తక్కిన 68 మిడిల్ స్కూళ్లు. ఈ సెకండరీ స్కూళ్ళలో చదివిన బాలికలసంఖ్య 67,211. ఈబాలికలుస్కూ బాలుర స్కూళ్ళలో చదివిన 67,211 మంది బాలికలుస్కూ

కలిసి మొత్తం, 1,03,350 మంది బాలికలు, 1949-50 లో సెకండరీ స్కూళ్ళలో చదివారు. బాలికలకొరకు స్థాపింపబడిన 250 సెకండరీ స్కూళ్ళలోను 3,206 మంది ఉపాధ్యాయినులు, 184 మంది ఉపాధ్యాయులు పనిచేశారు. స్త్రీలలో 2,788 మంది, పురుషులలో 137 మంది ట్రెయినింగుపొందినవారు. 1949-50 లో పైన చెప్పిన స్కూళ్లుకాక, రాష్ట్రంలో 30 ఆంగ్లో ఇండియన్ స్కూళ్లు ఉన్నాయి. ఈస్కూళ్ళలో చదివినవారి సంఖ్య, 13,667. ఈ స్కూళ్ళలో మొత్తం 747 మంది ఉపాధ్యాయులు పనిచేశారు.

1949-50 లో రాష్ట్రంలోని స్కూళ్ళలోను, కాలేజిలలోను చదివినవారందరినీ కులాలవారిగా లెక్కవేశారు. వారిలో పురుషులలో ఎంత మంది, స్త్రీలలో ఎంతమంది, చదివినదీ యీ క్రింది వివరాలు తెలిసవి.

| కులం | పురుషులు | స్త్రీలు |
|---|---|---|
| బ్రాహ్మణేతరులు : | 19,96,490 | 8,72,759 |
| హరిజనులు : | 3,57,166 | 1,71,584 |
| మూస్లిములు : | 2,85,944 | 1,45,820 |
| క్రైస్తవులు : | 2,13,641 | 1,61,756 |
| బ్రాహ్మణులు : | 2,39,490 | 1,28,043 |
| ఆంగ్లోఇండియనులు : | 8,330 | 5,916 |
| బౌద్ధులు : | 461 | 84 |
| పార్శీలు : | 111 | 64 |
| ఇతరులు . | 33,598 | 16,992 |
| మొత్తం : | 31,30,231 | 16,03,118 |

గత మూడు సంవత్సరాలలోను ఎలిమెంటరీ స్కూళ్ళ సంఖ్య, వానిలో చదివిన బాలుర సంఖ్య ఎలా పెరిగిందీ యీ క్రింది పట్టివలన తెలుస్తుంది.

| సంవత్సరం | స్కూళ్లు | చదివినవారు |
|---|---|---|
| 1947-48 | 36,575 | 36,50,748 |
| 1948-49 | 37,206 | 38,17,631 |
| 1949-50 | 37,812 | 39,89,822 |

బాలబాలికలు ఎలిమెంటరీ విద్యపొందవలసిన వయస్సు ఆరు సంవత్సరాలు మొదలు 12 ఏండ్లవరకు నిర్ణయింపబడింది.

గత మూడు సంవత్సరాలలోను రాష్ట్రంలోని సెకండరీ స్కూళ్ళ వివరాలు ఇవి :

| సంవత్సరం | స్కూళ్లు | చదివినవారు |
|---|---|---|
| 1947-48 | 790 | 4,18,697 |
| 1948-49 | 1,162 | 5,35,035 |
| 1949-50 | 1,247 | 5,97,254 |

విద్యాబోధనకు 1949-50 లో రు. 9,60,00,000, 1950-51లో రు. 10,30,00,000 1951-52 లో రు. 11,80,00,000 రాష్ట్రప్రభుత్వం ఖర్చుపెట్టింది.

మదరాసు రాష్ట్రంలో మూడు విశ్వకళాపరిషత్తులు వున్నాయి, అవి : మద్రాసు, ఆంధ్ర, అన్నామలై. మద్రాసు విశ్వకళాపరిషత్తు 1857 లో, 47 గురు విద్యార్థులతో స్థాపింపబడింది. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు 1926 లోను, అన్నామలై విశ్వకళాపరిషత్తు 1929 లోను స్థాపింపబడినవి.

మద్రాసు, అన్నామలై, ఆంధ్ర విశ్వకళాపరిషత్తుల ఆధ్వర్యాన మొత్తం 99 కాలేజీలు రాష్ట్రంలోవున్నాయి. వీనిలో ఇంజనీరింగ్ కాలేజీలు, 4; టెక్నాలాజికల్ ఇన్స్టిట్యూట్, 1: మెడికల్ కాలేజీలు, 5; వ్యవసాయ కాలేజీలు, 2: పశువైద్య కాలేజలు, 1; లాకాలేజీలు, 2; టీచర్ల ట్రెయినింగ్ కాలేజీలు, 5; మిగతావి, ఆర్ట్సు, సైన్సు కాలేజీలు.

1950 ఫిబ్రవరి 1 నాటికి మదరాసు యూనివర్సిటీ ఆధ్వర్యాన నడుపబడుతున్న కాలేజీల వివరాలివి :

మదరాసు నగరంలో వున్నవి : 11. వీటిలో నాలుగు ప్రత్యేకం స్త్రీలకొరకు స్థాపింపబడినవి.

జిల్లాలలోవున్న ఫస్టుగ్రేడు కాలేజీలు, 38 ; వీనిలో ఆరు కాలేజీలు రాయలసీమలో వున్నాయి.

జిల్లాలలోవున్న సెకండుగ్రేడు కాలేజీలు, 7.

వృత్తివిద్యలు బోధించే కాలేజీలు 14 ; వీనిలో లా కాలేజి, 1 మెడికల్ కాలేజీలు 3 ; ఇంజనీరింగ్ కాలేజీలు, 3 ; ఉపాధ్యాయుల ట్రెయినింగ్ కాలేజీలు, 5 ; పశువైద్య కాలేజి, 1 ; వ్యవసాయ కాలేజి 1.

ప్రాచ్యభాషలను బోధించే కాలేజీలు, 26.

రాయలసీమలోవున్న కాలేజీల వివరాలివి :

ఆర్ట్సు కాలేజీలు, 6 ; (1) వీరశైవ కాలేజి, బళ్ళారి ; (2) తియొసాఫికల్ కాలేజి, మదనపల్లి ; (3) గవర్నమెంట్ ఆర్ట్సు కాలేజి, అనంతపురం ; (4) శ్రీ వెంకటేశ్వర కాలేజి, తిరుపతి ; (5) ఉస్మానియా కాలేజి, కర్నూలు ; (6) గవర్నమెంట్ ఆర్ట్సు కాలేజి, కడప.

వృత్తివిద్య కాలేజి, (1) ; ఇంజనీరిగ్ కాలేజి, అనంతపూర్.

ఆంధ్రయూనివర్శిటీ ఆధ్వర్యాన నడుపబడుతున్న కాలేజీల వివరాలివి :

ఆర్ట్సు కాలేజీలు, 20 ; (1) మిసెస్ ఎ. వి. యన్. కాలేజి, విశాఖపట్టణం ; (2) మహారాజా కాలేజి, విజయనగరం ; (3) ఆంధ్ర యూనివర్శిటీ కాలేజ్ ఆఫ్ ఆర్ట్సు, వాల్తేర్ ; (4) ఆంధ్రయూనివర్శిటి కాలేజ్ అఫ్ సైన్సెస్, వాల్తేరు (5) ఆంధ్రయూనివర్శిటి యెర్స్కిన్ కాలేజిఆఫ్ నాచురల్ సైన్సు, వాల్తేరు ;(6) పి. ఆర్ కాలేజి ; కాకినాడ: (7) గవర్నమెంట్ ఆర్ట్సు కాలేజి, రాజమండ్రి, (8) భీమవరం కాలేజి, భీమవరం ; (9) సి. ఆర్. రెడ్డి కాలేజి, ఏలూరు ; (10) హిందూ కాలేజి, మచిలీపటణం ; (11) ఎస్. ఆర్. ఆర్. కాలేజి, విజయవాడ ; (12) ఆంధ్రక్రిస్టియన్ కాలేజి, గుంటూరు ; (13) హిందు కాలేజి, గుంటూరు ; (14) వి. ఆర్. కాలేజి, నెల్లూరు, (15) నరసాపూర్ కాలేజి, నరసాపూర్. (16) ఆంధ్రజాతీయ కళాశాల,

మచిలీపట్టణం ; (17) ఎస్. ఎస్. కాలేజి, నరసారావు పేట. (18) గుడివాడ కాలేజి, గుడివాడ. (19) ఆర్ట్స్ కాలేజి (స్త్రీలకుమాత్రం). గవర్నమెంట్ కాలేజి ఫర్ వుమెన్; గుంటూరు. (20) గవర్నమెంట్ ఆర్ట్స్ కాలేజి, శ్రీకాకుళం.

వృత్తి విద్యల కాలేజీలు, 8 : (1) గవర్నమెంట్ ట్రెయినింగ్ కాలేజి, రాజమండ్రి; (2) ఇంజనీరింగ్ కాలేజీ, కాకినాడ ; (3) మెడికల్ కాలేజి ,విశాఖపట్టణం ; (4) మెడికల్ కాలేజి, గుంటూరు; (5) వ్యవసాయ కాలేజి, బాపట్ల ; (6) ఆంధ్ర యూనివర్సిటీ లా కాలేజి, మచిలీపట్నం ; (7) ఆంధ్రయూనివర్శిటీ కాలేజ్ ఆఫ్ టెక్నాలజీ, వాల్తేర్. (8) వృత్తి విద్యల కాలేజి (స్త్రీలకుమాత్రం), ; సెంట్ జోసెఫ్స్ ట్రెయినింగ్ కాలేజి, గుంటూరు.

ప్రాచ్యవిద్యల కాలేజిలు, 9 : (1) శారదానికేతనం, గుంటూరు. (2) ఎస్. వి. జె. వి. సంస్కృతకాలేజి, కొవ్వూరు. (3) నరసింహ సంస్కృత కాలేజి, చిట్టి గూడూరు, మచిలీపట్నం. (4) సంస్కృత కాలేజి, నెల్లూరు, (5) ఆంధ్రమహిళా సంస్కృత కాలేజి, విజయనగరం. (6) కోటలక్ష్మయ్య నాయుడు సంస్కృత కాలేజి, తెనాలి. (7) మహారాజా సంస్కృత కాలేజి, విజయనగరం. (8) శ్రీ భావనారాయణస్వామి సంస్కృత కాలేజి, పొన్నూరు, (9) మహారాజా సంగీత కాలేజి, విజయనగరం.

రాష్ట్రంలోని వివిధ ఆర్ట్స్ కాలేజిలలో చదువుతున్నవారి సంఖ్య 1942-43 నుంచి 1949-50 లోగా ఎనిమిదేళ్లలోనూ రెండురెట్లకుపైగా పెరిగింది ఆ వివరాలు ఇది :

1942-43, 17,030 ; 1943-44, 19,950 ; 1944-45 26,097; 1945-46, 29,292 ; 1946-47, 31,943; 1947-48, 35,974; 1948-49, 39,199 ; 1949-50, 45,009

వృత్తి విద్యలకాలేజిలలో చదువుతున్నవారి సంఖ్య, 6,460. వీరిలో 5,670 మంది పురుషులు. 790 మంది స్త్రీలు.

ప్రస్తుతం అనంతపురం, బళ్ళారి, కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలు, ఆంధ్ర యూనివర్శిటీలో చేరకుండా, మదరాసు యూనివర్శిటీలోనే వున్నాయి.

## మెడికల్ కాలేజీలు

మనరాష్ట్రంలో ప్రస్తుతం అయిదు మెడికల్ కాలేజిలువున్నాయి అవి : మద్రాసు మెడికల్ కాలేజి, స్టాన్లీ మెడికల్ కాలేజీ (మద్రాసు) ఆంధ్ర మెడికల్ కాలేజి (విశాఖపట్నం), గుంటూరు మెడికల్ కాలేజి; మధుర మెడికల్ కాలేజి.

మధురలో మెడికల్ కాలేజికి భవన సదుపాయాలు లేనందున, మధుర మెడికల్ కాలేజి విద్యార్థులు ప్రస్తుతం మదరాసు స్టాన్లీ మెడికల్ కాలేజిలో శిక్షణ పొందుతున్నారు. ఈ అయిదు కాలేజీలలోను 1950 సంవత్సరములో మొత్తం 313 మంది విద్యార్థులు చేర్చుకొనబడినారు. వీరిలో స్త్రీలు, 69.

విద్యార్థులను చేర్చుకొనడంలో రాష్ట్రమును నాలుగు ప్రాంతాలుగా విభజించి, ఒక్కొక్క ప్రాంతానికి దాని జనాభాబట్టి విద్యార్థుల సంఖ్యను నిర్ణయించి, యీ క్రిందివిధంగా సీటులను నిర్ణయించారు.

రాయలసీమ, 39; ఇతర తెలుగుజిల్లాలు, 79.
తమిళ జిల్లాలు, 160; పశ్చిమతీర జిల్లాలు, 35.
విద్యార్థులలో బ్రాహ్మణులు 77 (వీరిలో స్త్రీలు 15)
బ్రాహ్మణేతరులు, 216 (వీరిలో స్త్రీలు, 43).
క్రైస్తవులు, 22 (వీరిలో స్త్రీలు 7)
ముస్లిములు, 27 (వీరిలో స్త్రీలు, 1)
హరిజనులు, 17 (వీరిలో స్త్రీలు, 3)

రాయలసీమనుంచి చేర్చుకొనబడిన వారిలో 8 మంది స్త్రీలు, తక్కిన తెలుగుజిల్లాలనుంచి 74 మంది స్త్రీలు వున్నారు.

## ఇంజనీరింగ్ కాలేజీలు

రాష్ట్రంలో ప్రభుత్వ యాజమాన్యంలోవున్న ఇంజనీరింగ్ కాలేజీలు : 4. అవి, గిండీ, కోయంబత్తూరు, అనంతపూర్, కాకినాడలో వున్నాయి.

ఈ కాలేజీలలో 1951 లో మొత్తం 395 మంది విద్యార్థులు చేర్చుకొనబడినారు. వీరిలో 21 మంది ఇతర రాష్ట్రాలనుంచి వచ్చిన విద్యార్థులు. తక్కిన వారిలో 20 మంది, ప్రభుత్వం యిష్టప్రకారం చేర్చుకొనబడినవారు. తక్కిన 354 సీట్లలో నూటికి 15 మంది చొప్పున వెనుకబడ్డ తరగతులవారికి ప్రత్యేకించబడినవి.

గిండి కాలేజికి 108 మంది, కోయంబత్తూరు కాలేజికి 69 మంది, అనంతపూర్ కాలేజికి 76 మంది, కాకినాడ కాలేజికి 103 మంది చేర్చుకోబడినారు.

## వ్యవసాయశాఖ కాలేజీలు

మన రాష్ట్రంలో ప్రస్తుతం రెండు వ్యవసాయ కళాశాలలు వున్నాయి. ఒకటి కోయంబత్తూరులోను, ఒకటి బాపట్లలోను వుంది. 1951-52 లో యీ రెండు కాలేజీలలోను ఒక్కొక్క దానిలో 80 మంది విద్యార్థులు చేర్చుకొనబడినారు. ఇలా చేర్చుకొనబడిన 160 మందిలోనూ 12 మంది ఇతర రాష్ట్రాలవారు, 37 మంది సర్కారు జిల్లాలనుంచి, 18 మంది రాయలసీమనుంచి, 76 మంది తమిళనాడు నుంచి, 17 మంది పశ్చిమతీర జిల్లాలనుంచి. బాపట్ల కాలేజీకి తెలుగు జిల్లాల విద్యార్థులందరూ, తమిళ జిల్లాలనుంచి 19 మంది పంపబడినారు.

## పశువైద్య కళాశాల

పశువైద్య కళాశాల మదరాసు రాష్ట్రంలో ఒకటి ఉంది. దానిలో ఏడాదికి 100 మంది విద్యార్థులను చేర్చుకోవడానికి వీలువుంది 1951-52 లో ఈ కాలేజీలో 62 మంది మాత్రమే చేర్చుకొనబడి

నారు, వీరిలో 16 మంది సర్కారు జిల్లాలనుంచి, 5 గురు రాయలసీమ నుంచి, 34 మంది తమిళనాడు నుంచి; 7 గురు పశ్చిమతీర జిల్లాలనుంచి.

## కమ్యూనల్ జి. ఓ.

ప్రభుత్వ యాజమాన్యంలో వున్న కాలేజిలో విద్యార్థులను చేర్చుకొనడంలో గవర్నమెంటు ఉద్యోగాలను ఇవ్వడంలో కులాలవారిగా ఏ నిష్పత్తి అవలంబించ బడుతున్నదో, అదే నిష్పత్తి 1949-50 దాకా అవలంబించబడింది. ఆ నిష్పత్తి ఏమిటంటే: బ్రాహ్మణేతర హిందువులు, 6; బ్రాహ్మణులు, 2; హరిజనులు, 2; క్రైస్తవులు, 1; ముస్లిము, 1; హిందూనిమ్న జాతులు, 3.

కులాల నిష్పత్తి ప్రకారం కాలేజిలలో విద్యార్థులను చేర్చుకొనడం విషయంలో ప్రభుత్వం చేసిన నియమానికి కమ్యూనల్ జి. ఓ. అని పేరు. ఈ వుత్తరువు కులాల ప్రకారం, ఒకవ్యక్తికీ మరొక వ్యక్తికీ మధ్య భేదం చూపుతున్నదని, మద్రాసు హైకోర్టున్నూ, ఇండియా సుప్రీంకోర్టున్నూ తీర్పుచెప్పినవి.

కమ్యూనల్ జి. ఓ. అనుసరణ పౌరుల ప్రాథమిక హక్కులను వ్యతిరేకమని కోర్టులు తీర్పుచెప్పినందున, వెనుకబడిన జాతులకు విద్యాబోధన విషయంలో ప్రత్యేక సౌకర్యం కలిగించడానికి రాష్ట్రప్రభుత్వాలకు హక్కు ఇస్తూ, భారత రాజ్యాంగచట్టం 1951 జూన్‌లో సవరించబడినది. ఈ సవరణ జరిగిన తరువాత, రాష్ట్రంలోని ప్రభుత్వ విద్యాసంస్థలలో విద్యార్థులను చేర్చుకోవడం విషయంలో రాష్ట్రప్రభుత్వం కొత్త నిబంధనలను ప్రకటించారు.

ఆ నిబంధన ప్రకారం:

కాలేజిలలో మొత్తం సీట్లలో నూటికి 15 వంతులు షెడ్యూల్డు కులములవారికి ప్రత్యేకించబడినవి.

అలాగే, మొత్తం సీట్లను నూటికి 25 వంతులు విద్యా, సాంఘిక, పరిస్థితులలో వెనుకబడిన కులాలకు ప్రత్యేకించబడినవి.

తక్కిన కులాల విద్యార్థులను చేర్చుకోవడంలో వారి తెలివి

తేటలు, వ్యాయామక్రీడలలో సమర్థత,ఆ విద్యార్థుల పూర్వీకులు విద్యలో వెనుకబడివుండటం మొదలైన స్థితిగతులన్నీ పరిశీలింప బడుతవి.

## ఎస్. ఎస్. ఎల్. సి.

1946 నుంచీ 1951 వరకు రాష్ట్రమంతటిలోనూ ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షకు ఎంతమంది కూర్చున్నదీ, ఎంతమంది కాలేజీలలో చేరడానికి అర్హత సంపాదించినదీ, యీ క్రింది అంకెలవలన తెలియ గలదు.

| సంవత్సరం | పరీక్షకు కూచున్నవారు | ప్యాసయినవారు |
|---|---|---|
| 1946 | 32,681 | 16,116 |
| 1947 | 41,142 | 20,373 |
| 1948 | 63,669 | 20,667 |
| 1949 | 66,445 | 24,344 |
| 1950 | 65,963 | 24,480 |
| 1951 | 68,418 | 31,395 |

ఆంధ్ర యూనివర్శిటీ జిల్లాలలో, 1944 నుంచి 1951 వరకు అయిదు సంవత్సరాలలోను స్కూలుఫైనలు, ఇంటర్మీడియెట్ పరీక్షలకు ఎంతమంది విద్యార్థులు హాజరైనదీ, యెంతమంది ప్యాసయినదీ, యీ క్రింది అంకెలనుబట్టి తెలుసుకోవచ్చును.

### స్కూలు ఫైనలు

| సంవత్సరం | పరీక్షకు కూర్చున్నవారు | ప్యాసయినవారు |
|---|---|---|
| 1944 | 8,777 | 3,500 |
| 1945 | 8,703 | 3,836 |
| 1946 | 8,771 | 3,903 |
| 1947 | 11,103 | 5,034 |
| 1948 | 14,133 | 7.331 |
| 1949 మార్చి | 212,644 | 5,612 |
| అక్టోబర్ | 2,034 | 557 |

| | | |
|---|---|---|
| 1950 మార్చి | 17,719 | 5,871 |
| 1951 మార్చి | 18,580 | 8,017 |

## ఇంటర్మీడియెట్

| సంవత్సరం | పరీక్షకు కూచున్నవారు | ప్యాసయినవారు |
|---|---|---|
| 1943 | 3,581 | 1,328 |
| 1944 | 3,969 | 1,360 |
| 1945 | 4,519 | 1,578 |
| 1946 | 5,096 | 1,792 |
| 1947 | 5,731 | 1,888 |
| 1949 | 7,885 | 2,890 |
| 1950 | 9,671 | 3,146 |

## ఇంటర్మీడియెట్ (రాష్ట్రమంతటా)

1946-47 నుంచి 1950-51 వరకు, రాష్ట్రంలోని మూడు యూనివర్సిటీ కాలేజిలలోను, ఇంటర్మీడియేట్ తరగతులలో యెంత మంది చేర్చుకోనబడింది వివరాలు ఇవి :

మద్రాసు యూనివర్సిటీ : 1946-47, 10,828 ; 1947-48, 11,895 ; 1948-49, 1250 ; 12,850 ; 1949-50, 12,880 , 1950-51, 14,214.

ఆంధ్ర యూనివర్సిటీ : 1946-47. 3,454 ; 1947-48, 4029; 1948-49, 5,039 ; 1949-50, 4,847; 1950-51, 5,490.

అన్నామలై యూనివర్సిటీ : 1946-47 నుంచి 1950-51 వరకు, 392 (ప్రతిఏడూ)

## ఉపాధ్యాయులు

1949 మార్చి 31 నాటికి మద్రాసు రాష్ట్రంలోని 889 సెకండరీ స్కూళ్లలో మొత్తం 18,386 మంది ఉపాధ్యాయులు (వీరిలో 406 మంది స్త్రీలు). పనిచేశారు. వీరిలో ట్రెయినింగు పొందినవారు 14,615 మంది పురుషులు ; 850 మంది స్త్రీలు.

ఇదేసంవత్సరంలో రాష్ట్రంలోని ఎలిమెంటరీ స్కూళ్లలో పని చేస్తున్న ఉపాధ్యాయులసంఖ్య 1,26,442. (వీరిలో 28,276 మంది స్త్రీలు). మొత్తం ఉపాధ్యాయులలో ట్రెయినింగు పొందినవారు (26,986 మంది స్త్రీలతో) 1,18,055.

## విజ్ఞానవ్యాప్తికి ప్రభుత్వ తోడ్పాటు

మదరాసు ప్రభుత్వంవారు ప్రాంతీయభాషలను అభివృద్ధిపరచడానికి, వాటి గౌరవహోదాలను విస్తృతపరచడానికి నిశ్చయించు ఆంధ్ర, తమిళ, మళయాళ, కన్నడ, సంస్కృతభాషలలో ఆస్థాన కవులను నియమించేడానికి తీర్మానించుకున్నారు. ఈ ఐదుభాషలనుంచి ఐదుగురు ఆస్థానకవులు నియమించబడుతారు, వీరి ఉద్యోగకాలపరిమితి అయిదు సంవత్సరాలు. తరుపరి ప్రభుత్వం ముందునిమిత్తం ఏర్పాటుచేసే కమిటీల ద్వారా ప్రతి ఐదు సంవత్సరముల కొకసారి యీ ఆస్థానకవులు నియమించబడుతూ వుంటారు. ఈ ఆస్థాన కవులకు ఏడాదికి వెయ్యి రూపాయలు గౌరవవేతనం ఇవ్వబడుతుంది. ప్రస్తుతం యీ క్రిందివారు ఆసాన కవులుగా ఉన్నారు.

తెలుగు : మహా మహోపాధ్యాయ కళాప్రపూర్ణ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

తమిళం : విద్వాన్ నామక్కల్ రామలింగపిళ్లై

మళయాళం : మహాకవి వల్లతోల్ నారాయణ మీనన్

కన్నడం : ఎం. నారాయణపాయ్

సంస్కృతం :మహామహోపాధ్యాయ కె. ఎస్. కృష్ణమూర్తి శాస్త్రి

(తెలుగులో ఆస్థానకవిగా మొదట కళాప్రపూర్ణ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి నియమించబడినారు. వీరు 1950 ఫిబ్రవరి 15 న చనిపోగా, 1950 ఆగస్టు 6 న శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ఎన్నుకోబడినారు.)

ఇంతేగాక ప్రాంతీయభాషలలో వివిధ సమస్యలను గూర్చిన వాఙ్మయాన్ని అభివృద్ధిచేయడానికి మరొక విధానాన్ని ప్రభుత్వం తయారు చేసింది. వివిధ విషయాలమీద వ్రాయబడ్డ, ప్రకటించబడ్డ, గ్రంథాలకు యేటేట బహుమానాలిస్తారు. తెలుగు, అరవభాషల గ్రంథాలకు రు. 500 ల చొప్పున, మళయాళ, కన్నడభాషలలో వ్రాయబడే వాటికి రు. 250 ల చొప్పున బహుమానాలుంటాయి. ప్రస్తుతం దిగువ విషయాలనుగూర్చిన గ్రంథములకు బహుమతు లివ్వడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

(1) పాటలు, పద్యాలు (2) గద్యరచన (కళ), జీవితచరిత్ర, యాత్ర (3) చిన్నకథ (4) నవల, నాటకము (5) పరిశోధన (భాష, చరిత్ర, పురాణవాఙ్మయం) (6) భౌతిక, రసాయనశాస్త్రాలు (7) ప్రకృతి శాస్త్రం, వ్యవసాయం (8) చరిత్ర, ఆర్థిక, రాజకీయ, సాంఘిక శాస్త్రాలు (9) గణిత, భూగోళశాస్త్రాలు. ఇంజనీరింగు (10) బాల వాఙ్మయం (11) విద్యాపద్ధతులు, వేదాంత మానసిక తత్వశాస్త్రాలు (12) ఔషధ, పారిశుద్ధ్య శాస్త్రాలు.

ఈ విషయాలన్నిటిలోనూ వెలువడిన పుస్తకాలు అంతగా లేనందున ఏడాదికి ఆరు బహుమతులు మాత్రమే యిచ్చుటకు ఉద్దేశింపబడినది.

1949 లో 2,310 పుస్తకములు 905 పత్రికలు ప్రకటించబడినవి.

1949 లో యీ క్రిందివాటికి బహుమతులు ఇవ్వబడినవి.

| | |
|---|---|
| పాటలు పద్యాలు : | శివభారతం |
| గద్యరచన, కళ | (1) నవరస గంగాధరం |
| బహుమతి | కర్త : జమ్మలమడక మాధవరామశర్మ |
| ఇద్దరికి | (2) త్రిపురాంతకోదాహరణ |
| పంచబడినది | కర్త: నిడదవోలు వెంకటరావు |

| | |
|---|---|
| బాలవాఙ్మయం : బహుమతి ఇద్దరికి పంచబడినది | (1) పిల్లల బొమ్మల భారతము<br>కర్త : మాగంటి బాపినీడు<br>(2) బాలానందం<br>కర్త : డాక్టర్ గిడుగు వెంకటసీతాపతి |
| వ్యవసాయం : | వ్యవసాయశాస్త్రం<br>కర్త : గోటేటి జోగిరాజు |
| చరిత్ర : | ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము<br>కర్త : మల్లంపల్లి సోమశేఖరశర్మ |
| పారిశుద్ధ్య-శాస్త్రము : | గ్రామారోగ్యరక్షణము<br>కర్త : డాక్టర్ గుళ్లపల్లి నారాయణమూర్తి |

1950 లో యీ క్రింది వాటికి బహుమతులు ఇవ్వబడినవి

| | |
|---|---|
| జీవిత చరిత్ర : | సరోజిని<br>కర్త : జి. వి. సుబ్బారావు |
| నవల : | నారాయణభట్టు<br>కర్త : నోరి నరసింహశాస్త్రి |
| మనశ్శాస్త్రము : | మనశ్శాస్త్రము<br>కర్త జి. నారాయణమూర్తి |
| చిన్నకథ : | కాంతం<br>కర్త : మునిమాణిక్యం నరసింహారావు |
| పరిశోధన : | తెలుగుభాష పుట్టుక, చరిత్ర<br>కర్త : కోరాడ రామకృష్ణయ్య |
| [illegible] శాస్త్రము : | రమ్యార్థశాస్త్రము<br>కర్త : ఎన్. ఎం. వేణుగోపాలరావునాయుడు |

1951 లో యీ క్రిందివాటికి బహుమతులు ఇవ్వబడినవి.

| | |
|---|---|
| | గౌతమబుద్ధ |
| నాటకము : | కర్త : కొండముది గోపాలరాయశర్మ |
| జీవిత చరిత్ర : | శ్రీ కృష్ణదేవరాయులు |
| | కర్త : కె. రాఘవాచారి |
| | అక్కన్న-మాదన్న |
| | కర్త . వేదం వెంకటరాయశాస్త్రి |
| విద్యుచ్ఛక్తి : | విద్యుచ్ఛక్తి ఉపయోగాలు |
| | కర్త : హరి ఆదిశేషులు |
| సహకారశాస్త్రం : | సహకార ఆర్థికవిజ్ఞానము |
| | కర్త : ఓ. పద్మరాజు |
| వైద్యశాస్త్రం : | వనౌషధ విజ్ఞానం |
| | కర్త : ఐ. వెంకటేశ్వరశర్మ |

## కర్నాటక సంగీత కళాపరిషత్తు

కర్నాటకగాత్ర, వాయిద్య సంగీత సాహిత్యములనూ, నాట్య కళనూ అభివృద్ధి పొందించడానికీ, యీ కళలలో ప్రత్యేక పరిశోధన కృషి జరపడానికీ కర్నాటక సంగీత కళాపరిషత్తును ఏర్పాటు చెయ్యడానికి, మద్రాసు, హైద్రాబాదు, మైసూరు, తిరువాంకూరు-కొచ్చిన్ ప్రభుత్వ ప్రతినిధులు హైద్రాబాదులో సమావేశమై నిర్ణయించారు. ఈ నిర్ణయం 1951 జులై 17 న జరిగింది.

## లైబ్రరీలు

మద్రాసు రాష్ట్రంలో 1945-46 లో 1,563 లైబ్రరీలు 1946-47 లో 1544 లైబ్రరీలు, 1947-48 లో 1,619 లైబ్రరీలు, 1948-49 లో 1681 లైబ్రరీలు 1949-50 లో 1,580 వున్నాయి. వీనిలో జిల్లా బోర్డులు, పంచాయతుల అధీనంలో వున్నవి. 932; మునిసిపాలిటీలవి, 62;

ప్రభుత్వానివి, 99 ; ఇతరసంస్థలవి, 487. రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలోను లైబ్రరీలను స్థాపించడానికి, రాష్ట్రంలో ఒక కేంద్ర లైబ్రరీని స్థాపించడానికి ప్రభుత్వం ఉద్దేశించారు. ప్రభుత్వంవారి యీ ఉద్దేశాన్ని ఆచరణలోకి తీసుకొని రావడానికి, విద్యాశాఖామంత్రి 1948 ఫిబ్రవరి 21 న ఒక బిల్లును శాసనసభలో ప్రవేశపెట్టారు. ఈ బిల్లు 1949 ఫిబ్రవరిలో శాసనమైంది. దీనిప్రకారం అచ్చువేసిన ప్రతిపుస్తకాన్నీ నాలుగు ప్రతులు ఉచితంగా రాష్ట్రంలోని కేంద్ర లైబ్రరీకి, ప్రచురణకర్తలు పంపించవలసి వుంది.

## వయోజనవిద్యాబోధన

వయోజనులలో నిరక్షరాస్యతను నిర్మూలించడానికీ, వారికి సాంఘిక విషయాలు పూర్తిగా అవగాహన అయేటట్టు చెయ్యడానికీ రాష్ట్రప్రభుత్వం ఒక ప్రణాళికను తయారుచేసి, దానిని అమలు జరుపుతున్నారు. ఈ ప్రణాళిక ప్రకారం, వయోజనులకు చదవడం, వ్రాయడం, నేర్పడానికీ సాంఘిక ఆర్థిక సమస్యలలో ప్రధాన విషయాలను విడమరచి బోధించడానికి రాష్ట్రంలో అనేకచోట్ల కేంద్రాలు స్థాపింపబడినవి. 1950 జనవరి అంతానికి, రాష్ట్రంలో ఇలాటి కేంద్రాలు 450 స్థాపింపబడినవి. 1951 సెప్టెంబరు నాటికి యీ కేంద్రాలు 1,678 వున్నాయి.

అంతేగాక, విద్యాసంస్థలలో పనిచేసే ఉపాధ్యాయులలో ఎవరైనా తమకు తీరుబాటు వున్నప్పుడు, కొంతసేపు ప్రతిరోజూ నిరక్షరాస్యులైన వయోజనులకు చదువుచెప్పడానికి వినియోగించినట్లయితే వారికి నెలకు ఎనిమిది రూపాయలు అలవెన్సు, స్కూలు నడపడానికి ఖర్చులకుగాను నెలకు నాలుగు రూపాయలు ప్రభుత్వం ఇస్తున్నది. అంతేగాక ఒక నిరక్షరాస్యుణ్ణి అక్షరాస్యుణ్ణిగా తయారుచేసినందుకు, ఉపాధ్యాయునికి ఒక రూపాయి బహుమతి ఇవ్వబడుతుంది.

అక్షరాస్యులుగా వుండి, విజ్ఞానవంతులు కానివారికి భాష, ఆరోగ్యశాస్త్రము, దేశచరిత్ర, ఆర్థిక విషయాలను బోధించడానికి గ్రామీణ

కళాశాలలు స్థాపింపబడినవి. పేరుకు స్వల్పంగా ఫీజుకట్టి, వయోజనులు యీ కళాశాలలో చేరి ప్రతిరోజు సాయంత్రం తమకు అభిమానంగల విషయంలో ప్రత్యేక విజ్ఞానం పొందవచ్చును. ఇలాటి గ్రామీణకళాశాలలు పెంటపాడు (పశ్చిమగోదావరి), ఆర్కాడు, బడగార(మలబార్) లోను వున్నాయి.

వయోజనులకు విద్య నేర్పడానికి ప్రత్యేకంగా ఉపాధ్యాయులకు ట్రెయినింగు ఇవ్వడానికి 1951-52 లో 7 కేంద్రాలు స్థాపించబడినవి.

## హరిజనులకు విద్యా సౌకర్యములు

1950 మార్చి 31 నాటికి రాష్ట్రంలో హరిజనులకు ప్రత్యేకంగా 4,847 ఎలిమెంటరీ స్కూళ్లు ఉన్నవి. వీనిలో చదివినవారిసంఖ్య 3,49,177. అన్నికులాలవారికి ఏర్పడిన స్కూళ్లలోచదివిన హరిజనుల సంఖ్య మొత్తం 1,29,222.

కాలేజిలలో చదివిన హరిజనుల సంఖ్య 741. వీరిలో స్త్రీలు, 57.

# ఆంధ్ర విశ్వ కళాపరిషత్

## స్థాపితము : 1926 ఏప్రిల్ 26

| | |
|---|---|
| ఛాన్సెలర్ : | శ్రీ శ్రీ ప్రకాశ |
| వైస్-ఛాన్సెలర్ : | డాక్టర్ వి. ఎస్. కృష్ణ (జీతం ; నెలకు రు. 2000) |
| రిజిష్ట్రార్ : | శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి (జీతం :రు. 750-50-2-1000) |
| లా సలహాదారు : | శ్రీ లక్కరాజు సుబ్బారావు |

తెలుగు వక్త : శ్రీ బి. గోపాలరెడ్డి
ఇంగ్లీషు వక్త : ప్రొఫెసర్ కె. ఆర్. శ్రీనివాసయ్యంగార్

## సిండికేట్

(1) డాక్టర్ వి. ఎస్. కృష్ణ, (2) ఎస్. గోవిందరాజులు, డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్, మదరాసు. (3) టి. ఏ. వర్ఘీస్, సెక్రటరీ, ఫైనాన్స్ డిపార్టుమెంట్, మద్రాసు. (4) శ్రీ ఎస్. బి. పి. పట్టాభి రామారావు, కపిలేశ్వరపురం కుమార జమీందారు. (5) శ్రీ మేకా రంగయ్య అప్పారావు బహదూర్, వుయ్యూరు కుమార్ జమీందారు. (6) శ్రీ లక్కరాజు సుబ్బారావు, కాకినాడ. (7) శ్రీ వి. కె. రావు, జిల్లాకలెక్టర్, విశాఖపట్టణం. (8) శ్రీ గోపీనాథ్ బెహరా, జయపురదివాను, జయపురం. (9) శ్రీ కె. వి. రమణయ్యనాయుడు, మచిలీపట్నం. (10) డాక్టర్ మల్లవరపు వెంకటకృష్ణారావు, వాల్తేరు. (11) శ్రీ పి. భద్రయ్య, ప్రిన్సిపాల్, పి. ఆర్. కాలేజి. కాకినాడ, (12) డాక్టర్ ఎ. ఎల్. నారాయణ, ప్రిన్సిపాల్. ఎం. ఆర్. కాలేజీ, విజయనగరం. (13) లెఫ్టినెంట్ కర్నల్ ఎం. వి. రమణమూర్తి, సూపరింటెండెంట్, కింగ్‌జార్జి హాస్పిటల్, విశాఖపట్నం, (14) శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు. మదరాసు. (15) జనాబ్ మహమ్మద్ రఫీవుద్దీన్ అహమద్ అన్సారి, నెల్లూరు, (16) శ్రీ ఓ. పుల్లారెడ్డి, సెక్రటరీ, హోంశాఖ, మద్రాసు.

## అకడమిక్ కౌన్సిలు

(1) డాక్టర్ వి. ఎస్. కృష్ణ. వైస్-చాన్సెలర్, ఆంధ్ర యూనివర్శిటీ వాల్తేరు. (2) డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్, మద్రాసు. (3) సర్. సి. వి. రామన్, బెంగుళూరు. (4) ప్రొఫె. కె. రంగధామరావు, ఆంధ్ర యూనివర్శిటీ, వాల్తేరు. (5) ప్రొఫె. వి. రామస్వామి, ఆంధ్రయూనివర్శిటీ వాల్తేరు. (6) ప్రొఫె. ఎస్. మీనాక్షి సుందరం, ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు. (7) ప్రొఫె. ఎస్. కె

నూక్, ఆంధ్రయూనివర్శిటీ వాల్తేరు. (8) ప్రొఫె. జీ. గోపాలరావు ఆంధ్రయూనివర్సిటీ, వాల్తేరు, (9) ప్రొఫె. సి. వెంకటరావు, ఆంధ్ర యూనివర్శిటీ, వాల్తేరు. (10) ప్రొఫె. ఎస్. రంగస్వామి, ఆంధ్ర యూనివర్శిటీ. వాల్తేరు. (11) ప్రొఫె. కె. నీలకంఠం, వాల్తేరు. (12) ప్రొఫె. సి. మహాదేవన్, ఆంధ్రయూనివర్శిటీ, వాల్తేరు. (13) ప్రొఫె జి. ఎస్. రంగస్వామిఅయ్యంగార్, ఆంధ్రయూనివర్శిటీ, వాల్తేరు (14) ప్రొఫె. ఆర్. గోపాలయ్యర్, ఆంధ్రయూనివర్శిటీ, వాల్తేరు (15) ప్రొ.ఫె శైలేశ్వర్ సేన్, ఆంధ్రయూనివర్శిటీ, వాల్తేరు. (16) ప్రొఫె. సి. వెంకట్రామన్. ఆంధ్రయూనివర్సిటీ, వాల్తేరు. (17) ప్రొఫె (18) ప్రొఫె. కె. కె. దాస్, ఆంధ్రయూనివర్శిటి, వాల్తేరు. 1పె
ప్రొఫె. శ్రీనివాసయ్యంగారు, ఆంధ్రయూనివర్శిటీ, వాల్తేరు. 19)
ప్రొఫె. యెస్. వెంకట్రామన్, ఆంధ్రయూనివర్శిటి, వాల్తేరు. (20) డాక్టర్. ఎస్. జే. పండలె, ప్రిన్సిపాల్, ఆంధ్రమెడికల్ కాలెజి విశాఖపట్నం. (22) కె. సత్యనారాయణ, ప్రిన్సిపాల్, గవర్నమెంట్ ట్రయినింగ్ కాలెజీ. రాజమండ్రి, (23) మిస్టర్ మేరీ స్టానిస్లాస్, ప్రిన్సిపాల్, సెంట్ జోసెఫ్స్ ట్రెయినింగ్ కాలేజి, గుంటూరు, (24) పి. వెంకటరామయ్య. ప్రిన్సిపాల్, వ్యవసాయ కాలేజి, గుంటూరు, (5) వి. హెచ్. సదారంగని, ప్రిన్సిపాల్. ఇంజనీరింగ్ కాలేజి, కాకినాడ. (27) డాక్టర్ టి. యస్. పౌలస్, ప్రిన్సిపాల్, ఆంధ్ర క్రిస్టియన్ కాలేజి, గుంటూరు. (28) డాక్టర్ ఎం. గౌరీనాథశాస్త్రి, ప్రిన్సిపాల్, హిందు కాలేజి, మచిలీపట్టణం. (29) కె. సచ్చిదానంద పిళ్లే, వి. ఆర్. కాలేజ్, నెల్లూరు. (30) కె. వి. పున్నయ్య, ప్రిన్సిపాల్. గవర్నమెంటు ఆర్ట్సు కాలేజ్, రాజమండ్రి. (31) ఎస్. పార్థ సారధినాయుడు, ప్రిన్సిపాల్, మిసెస్ ఏ. వి. ఎన్. కాలేజ్, విశాఖ పట్టణం. (32) డాక్టరు ఎ. ఎల్. నారాయణ, ప్రిన్సిపాల్, ఎం. ఆర్. కాలేజ్, విజయనగరం. (33) డాక్టరు పి. శ్రీనివాసాచారి ఎస్. ఆర్. ఆర్. కాలేజీ. విజయవాడ. (34) వి. సుబ్బారావు ప్రిన్సిపాల్, హిందూ కాలేజి, గుంటూరు. (35) శ్రీమతి ఎ. శంకున్ని

ప్రిన్సిపాల్, గవర్నమెంటు స్త్రీల కాలేజీ. గుంటూరు. (36) జీ. లక్ష్మీనాధరావు, ప్రిన్సిపాల్, పశ్చిమగోదావరి భీమవరంకాలేజి భీమవరం. (37) డి. యస్. సుబ్రహ్మణ్యం, ప్రిన్సిపాల్, సర్ సి. ఆర్. రెడ్డి కాలేజీ, ఏలూరు. (38) వంగూరు సుబ్బారావు, ప్రిన్సిపాల్ నరసాపూర్. కాలేజీ, నర్సాపూరు. (39) ఎస్. టి. ఎ. వరదాచారి, ప్రిన్సిపాల్, జాతీయకళాశాల, మచిలీపట్టణం. (40) ఐ. రంగనాయకులు, ప్రిన్సిపాల్, ఎస్. ఎస్, ఎస్. కాలేజీ, నరసరావుపేట. (41) ఏ. ఎవ్, త్యాగరాజు, ప్రిన్సిపాల్, గుడివాడకాలేజీ, గుడివాడ. (42) డాక్టరు తోలేటి కనకరాజు, గవర్నమెంటు హాస్పిటలు, రాజమండ్రి. (43) ఎం. నరసింహారావు, హెడ్‌మాస్టరు, బోర్డుహైస్కూలు, అవనిగడ్డ. (44) పెద్దాడ సీతాపతిరావు, అడ్వొకేటు, రాజమండ్రి. (45) డి. వెంకటావధాని, మిసెస్ ఎ. వి. ఎస్. కాలేజీ. విశాఖపట్టణం. (46) విద్వాన్ వై. మల్లికార్జునరావు, ఆంధ్రస్త్రీల సంస్కృత కాలెజీ, రాజమండ్రి. (47) మహమ్మద్ అహమద్ మొహియుద్దీన్ అన్సారి. గవర్నమెంటు ఆర్ట్సు కాలేజీ రాజమండ్రి. (48) ఉభయభాషా ప్రవీణదండపాణిమిశ్రో, ఒరియా పండిట్, బోర్డు హైస్కూలు, సోంపేట. (49) లెఫ్టనెంటు కర్నల్ ఎం. వి, రమణమూర్తి, కింగ్ జార్జిహాస్పిటల్, విశాఖపటణం. (50) ఎస్. వి. దొరస్వామి, లెక్చరర్, వ్యవసాయకాలేజి, బాబట్ల, (51) ప్రొఫె. కె. ఎస్. రామనాథన్ ఇంజనీరింగుకాలేజి, కాకినాడ. (52) కె. ఎస్. శర్మ, పి. ఆర్. కాలేజి కాకినాడ. (53) డి. వి. కృష్ణయ్య, లెక్చరర్, ఎస్. ఆర్. ఆర్ కాలేజి, విజయవాడ. (54) కె. సుబ్బారావు, లెక్చరర్, ఎం. ఆర్ కాలేజి విజయనగరం, (55) కె. రామిరెడ్డి, లెక్చరర్, వి. ఆర్. కాలేజి నెల్లూరు. (56) జె. వి. పంతులు, లెక్చరర్, ఆంధ్ర క్రిస్టియన్ కాలేజీ, గుంటూరు. (57) వి. వెంకటేశ్వర్లు, లెక్చరర్, హిందూకాలేజి, మచిలీపట్టణం. (58) పి. వెంకటేశ్వరరావు, లెక్చరర్, హిందూ కాలేజి, గుంటూరు. (59) శ్రీమతి పి. రత్నావతి, లెక్చరర్, గవర్నమెంటు స్త్రీల కాలేజి, గుంటూరు. (60) విద్వాన్ బి. కుటుంబరావు, ఆంధ్రజాతీయ

కళాశాల, మచిలీపట్టణము. (61) డాక్టర్. బి. సుందరరామారావు, జె. వి. డి. కాలేజి ఆఫ్ సైన్సు, వాల్తేరు. (62) ఎస్. టి. కృష్ణమాచారి, యూనివర్సిటీ కాలేజి, వాల్తేరు. (63) జి. సుందరరామరెడ్డి, హిందీ పండిట్, యూనివర్సిటీ కాలేజి, వాల్తేరు.

## సెనేట్

(అకడమిక్ కౌన్సిలులోగాని సిండికేట్‌లోగాని సభ్యులుగా వుండి, సెనేట్ లోకూడా సభ్యులుగావున్నవారి అడ్రసులు, యీ క్రింద యివ్వలేదు)

(1) మదరాసు గవర్నరు, (2) జయపురంమహారాజా (3) డాక్టర్ వి. ఎస్. కృష్ణ (4) ఎస్. గోవిందరాజులు; (5) డాక్టర్ కె. వాసుదేవరావు, మదరాసు. (6) ఎం. టీ. రాజు, పరిశ్రమల శాఖ డైరెక్టరు, మదరాసు. (7) ఎం. కాంతిరాజు, వ్యవసాయశాఖ డైరెక్టరు మదరాసు. (8) ప్రొఫె. కె. రంగధామరావు. (9) కె. సత్యనారాయణ (10) సిస్టర్ మేరీ స్టానిస్లాస్ (11) డాక్టర్ ఎస్. జీ. పండాలె. (12) పి. వెంకట్రామయ్య (13) ఐ. హెచ్. సదారంగని. (14) పి. భద్రయ్య (15) డాక్టర్ టి. ఎస్. పౌలస్ (16) డాక్టర్ ఎం. గౌరినాథశాస్త్రి (17) కె. సచ్చిదానందపిళ్లె. (18) కె. పి. ప్రసన్నయ్య. (19) పి. పార్థసారథినాయుడు. (20) డాక్టర్ ఎ. ఎల్. నారాయణ. (21) డాక్టర్ పి. శ్రీనివాసాచారి. (22) వి. సుబ్బారావు, ప్రిన్సిపాల్, హిందూకాలేజి, గుంటూరు. (23) శ్రీమతి జి. శంకున్ని. (24) ఇ. లక్ష్మీనాథరావు. (25) డి. ఎస్. సుబ్రహ్మణ్యం. (26) కంగూరి సుబ్బారావు. ప్రిన్సిపాల్, నరసాపూర్ కాలేజి. (27) ఎస్. టి వరదాచారి. (28) ఐ. రంగనాయకులు. (29) ఎ. ఎఫ్. త్యాగరాజు. (30) జె. వి. డి. కాలేజి ఆఫ్ సైన్సు, ఫిజిక్సు ప్రొఫెసర్ (31) డాక్టర్ వి. రామస్వామి, యూనివర్సిటీ కాలేజీ, వాల్తేరు. (32) డాక్టర్ మీనాక్షిసుందరం. (33) ప్రొఫె. ఎస్. ఎస్. కె. నూర్. (34) ప్రొఫె. సి. వెంకటరావు. (35) ప్రొఫె ఎస్. రంగస్వామి, యూనివర్సిటీ కాలేజి. (36) ప్రొఫె. జి. గోపాలరావు, యూనివర్సిటీ కాలేజి (37) ప్రొఫె. కె. నీలకంఠం. (38) ప్రొఫె. పి.

మహాదేవన్. (39) ప్రొఫె. జి. ఎస్. రంగస్వామి అయ్యంగార్ (40) ప్రొఫె. ఆర్. గోపాలయ్యర్. (41) ప్రొఫె. శైలేశ్వర్ సేన్. (42) ప్రొఫె. జి. వెంకటరావు, యూనివర్సిటీ కాలేజి. (43) ప్రొఫె. ఎం. హెచ్. గోపాల్. (44) యూనివర్సిటీ కామెర్స్ కాలేజి, కామెర్స్ శాఖ ప్రధానప్రొఫెసర్. (45) ప్రొఫె. కె. కె. దాస్. (46) ప్రొఫె. కె. ఆర్ శ్రీనివాసఅయ్యంగార్. (47) ప్రొఫె. ఎన్. వెంకటరామన్ (48) టి. ఎ. వర్ఘీస్. (49) వి. కె. రావు, విశాఖపట్టణం కలెక్టర్ (50) ఆర్. ఓ. రామకృష్ణరాజు (51) జనాబ్ మహమ్మద్ రఫీవుద్దీన్ అహమద్ అన్సారి. (52) ఓ. పుల్లారెడ్డి. (53) గోపీనాథ్ బెహారా, (54) లెఫ్టినెంట్ కర్నల్ ఎం. వి. రమణమూర్తి.

## జీవితమంతా సభ్యులు

(55) డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ; (56) లక్కరాజు సుబ్బారావు, కాకినాడ (57) తిరువాంకూరు మహారాజు శ్రీ పద్మనాభదాస వాంచి పాలవర్మ కులశేఖర కిరీటిపతి మన్నె సుల్తాన్ మహారాజరాజ రామరాజ బహదూర్. (58) తిరువాంకూరు మహారాణి శ్రీ సేతుపార్వతీబాయి.

## ఇతర సభ్యులు

(59) ఎస్. ఓ. పి. పట్టాభిరామారావు, కపిలేశ్వరపురం కుమార జమీందార్, (60) వై అబద్ధయ్య, బ్రాడీపేట, గుంటూరు, (61) పి. వి. సుబ్బారావు, కవిరాజువీధి, తెనాలి. (62) కొల్లిపర వెంకటరమణయ్య, మచిలీపట్టణం. (63) మేకారంగయ్య అప్పారావు బహదుర్, వుయ్యూరు కుమార జమీందార్. (64) డాక్టర్ మల్లవరపు వెంకటకృష్ణారావు, వాల్తేరు. (65) ఎస్. మాలకొండరెడ్డి, అడ్వొకేటు, నెల్లూరు. (66) వి. ఎన్. వెంకటేశ్వర్, జూలజీ లెక్చరర్, మిసెస్ ఎ. వి. ఎన్. కాలేజి, విశాఖపట్టణం. (67) కందాళై సర్వేశ్వరశాస్త్రి, వకీలు వాల్తేరు. (68) పెద్దాడ సీతాపతిరావు, అడ్వొకేటు, రాజమండ్రి. (69) డాక్టర్ [illegible]లేటి కనకరాజు. (70) పి. వెంకట్రామయ్య, లెక్చరర్, గవర్నమెంట్ [illegible] కాలేజి, రాజమండ్రి. (71) వేమూరి విశ్వనాథశర్మ, మందపల్లి.

మదరాసు. (72) వడింపల్లి వెంకటలక్ష్మీ నరసింహరావు, బారిష్టర్ గుంటూరు, (73) నేతి సుబ్రహ్మణ్యం, 39, గోపతి నారాయణస్వామి చెట్టిరోడ్, త్యాగరాయనగర్, మదరాసు. (74) శ్రీమతి పి. రత్నావతి; (75) డాక్టర్ పి. సుందరరామారావు. (76) కె. సుబ్బారావు, లెక్చరర్, ఎం. ఆర్. కాలేజి, విజయనగరం. (77) పసుమర్తి వీరభద్రస్వామి, విజయనగరం. (78) జి. వెంకటరెడ్డి, ఎం. ఎల్. సి. కమలానగర్, అనంతపురం. (79) కె. బ్రహ్మానంద రెడ్డి, నరస రావుపేట. (80) నివర్తి వెంకటసుబ్బయ్య, నంద్యాల (81) కె. షణ్ముగం, ఎం. ఎల్. ఎ. వెంకటగిరి. (82) ఎం. నరసింహారావు, హెడ్ మాస్టర్, బోర్డు హైస్కూలు, అవనిగడ్డ (83) సి. వి. నరసింహారావు, హెడ్ మాస్టర్ వి. ఆర్. కాలేజి హైస్కూలు, నెల్లూరు (84) వీరమాచనేని వెంకటనారాయణ, మునిసిపల్ కౌన్సిలర్, ఏలూరు. (85) డి. లక్ష్మిరెడ్డి, నెల్లూరుజిల్లా బోర్డు మెంబరు, కనిగిరి. (86) డాక్టర్ వై. సీతాపతిరావు, మునిసిపల్ చైర్మన్, కాకినాడ. (87) వెనిగండ్ల సత్యనారాయణ, గుంటూరుజిల్లా బోర్డు మెంబరు, దుగ్గిరాల. (88) కొడాలి అచ్యుతరామయ్య, కృష్ణాజిల్లా బోర్డు మెంబరు, వల్లూరుపాలెం, తోట్ల వల్లూరుపోస్టు. (89) ఎ. జి. నాగిరెడ్డి. మునిసిపల్ కౌన్సిలర్, అనంతపురం. (90) పి. రామిరెడ్డి, అనంతపురంజిల్లా బోర్డు మెంబరు, గారి మాకులపల్లి, పెనుకొండ తాలుకా, (91) హెచ్. రామలింగారెడ్డి, బళ్లారి జిల్లాబోర్డు మెంబరు, బళ్ళారి. (92) ఎస్. అబ్దుల్ రజాక్ సాహెబ్, మున్సిపల్ కౌన్సిలర్, బళ్ళారి, (93) జి. గురువప్పనాయుడు, మునిసిపల్ కౌన్సిలర్, చిత్తూరు. (94) డి. మునిరత్నంనాయుడు, చిత్తూరు జిల్లాబోర్డు మెంబరు, చిత్తూరు. (95) శ్రీమతి కె. రామసుబ్బమ్మ మునిసిపల్ కౌన్సిలర్, కడప. (96) స్వర్ణ నాగయ్య, జిల్లాబోర్డు మెంబరు, కడప. (97) కుమారరాయ అప్పారావు బహదూర్, అమ్మపాలెం జమీందార్, కాళహస్తి. (98) జస్తుల్ అక్రాన్ బులుసు బుచ్చి సర్వారాయుడు, కపిలేశ్వరపురం జమీందార్, లజ్ చర్చిరోడ్ వీధి, మైలాపూర్, (99) బి. గోపాలరెడ్డి, బుచ్చిరెడ్డిపాలెం (100) ఎం. వి. గంగాధరశివ, రాయిచోటి. (101) వి. సి. కేశవరావు, ఒంగోలు. (102) ఎన్. సుబ్బరా

యుడు శ్రేష్ఠి, నరసరావుపేట. (103) దంతులూరి నారాయణరాజు, భీమవరం (104) మద్ది సుదర్శనం, గుంటూరు, (105) శ్రీమతి వి. సీతామహలక్ష్మమ్మ. జమీగొల్వేపల్లి, గుడివాడ తాలూకా. (106) శ్రీమతి ఎన్. కమల ఫిలిఫ్, 28-29, జగన్నాథపురం మొదలివీధి, చట్‌పట్, మదరాసు. (107) డాక్టర్ కె. గోవిందమీనన్, ప్రిన్సిపాల్, మెడికల్ కాలేజి, గుంటూరు. (108) ఎస్. భగవాన్‌దాస్, శ్రీకాకుళం జిల్లా కలెక్టర్ (109) ఎల్. బుల్లెయ్య, కేరాఫ్, లైబ్రేరియన్, మదరాసు యూనివర్సిటీ లైబ్రరీ, మదరాసు. (110) అల్లాడి ఆరన్‌రావు, గుంటూరు. (111) డి. వెంకటావధాని, లెక్చరర్, మిసెస్. ఎ. వి. ఎన్. కాలేజి, విశాఖపట్టణం. (112) విద్వాన్ వై. మల్లికార్జునరావు, రాజమండ్రి, (113) మహమ్మద్ అహమ్మత్ మొహియొద్దీన్ అన్సారి, రాజమండ్రి. (114) ఉభయభాషాప్రవీణ దండపాణి మిశ్రో, సోంపేట. (115) సి. అన్నారావు, కమిషనర్, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి. (116) జి. రంగారెడ్డి, శ్రీకాకుళంజిల్లాబోర్డు స్పెషల్ ఆఫీసరుకు పర్సనల్ అసిస్టెంటు. (117) కె. రామకోటయ్య, విశాఖపట్టణం జిల్లాబోర్డు స్పెషల్ ఆఫీసరుకు పర్సనల్ అసిస్టెంటు. (118) బి. వి. శ్రీహరిరావునాయుడు, 18, రామన్‌వీధి, త్యాగరాజనగర్. (119) ఎం. పళ్ళరాజు, కాకినాడ. (120) సి. వి. రావు, జయపురం దివాన్, జయపురం. (121) కుమార్ శ్రీ విధ్యాధర్ సింగ్‌దేవు, జయపురం.

## డిగ్రీలు : బోధనావిషయాలు

ఆంధ్ర విశ్వకళా పరిషత్ అధ్వర్యాన, ఆంధ్రదేశంలోని కాలేజీలలోను, వాల్తేరులోవున్న యూనివర్శిటీ కాలేజిలలోను బోధింపబడి, పరీక్షలు జరిగే డిగ్రీల వివరాలు :

### ఆర్ట్సు.

1. బాచిలర్ ఆఫ్ ఆర్ట్సు (బి. ఏ.) 2. బాచిలర్ ఆఫ్ ఆర్ట్సు ఆనర్సు (బి. ఎ. ఆనర్సు). 3. మాస్టర్ ఆఫ్ ఆర్ట్సు (ఎం. ఎ.) 4.

మాస్టర్ ఆఫ్ ఆర్ట్స్ ఆనర్స్ (ఎం. ఎ. ఆనర్స్) 5. డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ (పి. హెచ్. డి.), 6. డాక్టర్ ఆఫ్ లెటర్స్ (డి. లిట్.)

**సైన్స్:**

1. బాచిలర్ ఆఫ్ సైన్సు (బి. ఎస్. సి.) 2. బాచిలర్ ఆఫ్ సైన్సు ఆనర్స్ (బి. ఎస్. సి. ఆనర్స్), 3. మాస్టర్ ఆఫ్ సైన్సు (ఎం. ఎస్. సి.) 4. మాస్టర్ ఆఫ్ సైన్సు ఆనర్సు (ఎం. ఎస్. సి. ఆనర్స్) 5. డాక్టరు ఆఫ్ సైన్సు డి. ఎస్. సి.)

**కామెర్సు:**

1. బాచిలర్ ఆఫ్ కామెర్స్ (బి. కాం.) 2. బాచిలర్ ఆఫ్ కామెర్స్ ఆనర్సు (బి. కాం. ఆనర్సు) 3. మాస్టర్ ఆఫ్ కామెర్సు (ఎం. కాం.) 4. మాస్టరు ఆఫ్ కామెర్సు ఆనర్సు (ఎం. కాం. ఆనర్సు).

**వ్యవసాయశాస్త్రం:**

1. బాచిలర్ ఆఫ్ సైన్సు అగ్రికల్చరల్ [బి. ఎస్. సి. ఏజి.] 2. మాస్టరు ఆఫ్ సైన్సు అగ్రికల్చరల్ (ఎం. ఎస్. సి. ఎజి.)

**విద్యాబోధకశాస్త్రం:**

1. బాచిలర్ ఆఫ్ ఎడ్యుకేషన్ (బి. ఇడి), 2. మాస్టరు ఆఫ్ ఎడ్యుకేషన్ (ఎం. ఇడి)

**వైద్యశాస్త్రం:**

బాచిల ఆఫ్ మెడిసిన్ అండ్ సర్జరీ (ఎం. బి. బి. ఎస్) 2. డాక్టరు ఆఫ్ సైన్సు (డి. ఎస్. సి.) 3. డాక్టరు ఆఫ్ మెడిసిన్ (ఎం. డి.) 4. మాస్టరు ఆఫ్ సర్జరీ (ఎం. ఎస్.) 5. మెడిసిన్ సర్జరీలలో పోస్టు గ్రాడ్యుయేటు డిపొమా.

**న్యాయశాస్త్రం:**

బాచిలర్ ఆఫ్ లాస్ (బి. ఎల్.) 2. మాస్టరు ఆఫ్ లాస్ (ఎం. ఎల్.) 3. డాక్టరు ఆఫ్ లాస్ (డి. ఎల్.)

**ఆయుర్వేదశాస్త్రం :**

1. బాచిలర్ ఆఫ్ ఆయుర్వేద (బి. ఎ. వి.)

**ఇంజనీరింగ్ శాస్త్రం :**

బాచిలర్ ఆఫ్ ఇంజనీరింగ్ (బి. ఇ.)

**ప్రాచ్యభాషలు :**

1. విద్యాప్రవీణ ; 2. భాషాప్రవీణ ; 3. ఆలీమ్-ఇ-ఫజల్ ; 4. మున్షి-ఇ-ఫజల్ ; 5. ప్రాచ్యభాషావేతృత్వపత్రం (పి. ఒ, ఎల్.) 6, ప్రాచ్యభాషా కోవిద పట్టం (ఎం. ఒ. ఎల్.)

పరీక్షలు జరిపి, ఉత్తీర్ణులైనవారికి యిచ్చే పై పట్టములు కాక, 'కళా ప్రపూర్ణ' అనే గౌరవపట్టము, డి. లిట్; డి. ఎస్. సి; ఎల్. ఎలు. డి. అనే గౌరవపట్టములుకూడా, అర్హులని తోచినవారికి ఇవ్వబడుతవి.

**కాలేజిలు :**

ఆంధ్రాయూనివర్శిటీ అధ్వర్యాన నడుపబడుతున్న కాలేజిలు 32. వీటిలో యూనివర్శిటీ కాలేజీలు, 4 ; వృత్తి విద్య కాలేజీలు, 6; ఫస్టుగ్రేడు కాలేజి, 10 ; సెకండ్ గ్రేడు (ఇంటరు తరగతులు మాత్రం) కాలేజీలు, 6; ప్రాచ్యవిద్యల కాలేజిలు 9:

ఆంధ్ర యూనివర్శిటీఅధ్వర్యాన నడుపబడే కాలేజిలలో 1949-50 లో చదివినవారిసంఖ్య : 14,653. వీరిలో 942 మంది యూనివర్శిటీ కాలేజీలలోను, 1,252 మంది వృత్తివిద్యల కాలేజీలలోను, 11,244 మంది ఫస్టుగ్రేడు కాలేజీలలోను, 945 మంది సెకండుగ్రేడు కాలేజీలలోను, 270 మంది ప్రాచ్యవిద్యల కాలేజిలలోను చదివారు.

**మదరాసు విశ్వకళాపరిషత్ :**

స్థాపన : 1857
ఛాన్సెలర్ : మద్రాసు గవర్నరు
ప్రో ఛాన్సెలర్ : మద్రాసు విద్యామంత్రి
వైస్‌ఛాన్సెలర్ డాక్టరు సర్. ఎ. లక్ష్మణస్వామి మొదలియారు.

1952 ఫిబ్రవరి 14 న జరిగిన కాన్వొకేషన్‌లో 38 మంది బి. ఎల్; 14 మంది ఎం. బి. బి. ఎస్; 26 మంది బి. ఇ; 118 మంది. బి. ఎస్. సి; 56 మంది బి. కాం; 46 మంది ఎం. ఎ; 214 మంది బి. ఎం డిగ్రీలను స్వయంగా తీసుకున్నారు, పరోక్షంగా డిగ్రీలను పొందిన గ్రాడ్యుయేట్ల సంఖ్య 1,652.

# ప్రజారోగ్యం : వైద్యసహాయం

భారతదేశంలో అత్యధిక సంఖ్యాకుల మరణానికి కారణమైన జబ్బులలో ప్రధానమైనవి, మలేరియా, క్షయ, అమ్మవారు. మద్రాసు రాష్ట్రంలో 1950 లో ఏఏ జబ్బులవల్ల యెంతమంది చనిపోయినదీ యీ క్రింది అంకెలవల్ల తెలుసుకోవచ్చును.

| | |
|---|---|
| జ్వరములు | 2,40,972 |
| ఊపిరితిత్తులకు సంబంధించిన జబ్బులు | 97,385 |
| గ్రహణి, అతిసారము | 73,436 |
| స్ఫోటకం | 14,269 |
| కలరా | 33,004 |
| ప్లేగు | 38 |
| మలేరియా | 6,224 |

1950 లో మద్రాసు రాష్ట్రంలో, ప్రసూతి వైద్యం, శిశురక్షణ, చెయ్యడానికి చైల్డు వెల్ఫేరు అండ్ మెటర్నిటీ సెంటర్లు కొత్తగా 63

స్థాపింపబడినవి. అంతకుపూర్వం వున్నవాటితోకలిసి 1950 లో మొత్తం 468 సెంటర్లు పనిచేశాయి.

1952 సంవత్సరానికి మద్రాసు రాష్ట్రంలోవున్న వైద్యశాలలు 1,221; అంతకుపూర్వ సంవత్సరంలో 1,231 వుండేవి.

1950 అంతానికివున్న వాటి వివరాలివి:

ప్రభుత్వం పెట్టినవి : 246. ప్రభుత్వం పెట్టిన ప్రత్యేక వైద్యశాలలు 41 స్థానికసంస్థలు పెట్టినవి : 504. ప్రజలచే స్థాపింపబడి ప్రభుత్వ సహాయం పొందినవి: 34. ప్రభుత్వసహాయం లేకుండా, ప్రజలచేత స్థాపింపబడినవి : 88. రైల్వేవారు పెట్టించినవి : 57. గ్రాంటు సహాయంతో నడిచిన గ్రామీణ వైద్యశాలలు : 251.

అన్ని ఆస్పత్రులలోను, రోగులు అక్కడేవుండి చికిత్సపొందడానికి వున్న పడకలు, 21,339. 1950 లో రాష్ట్రంలోని అన్ని ఆస్పత్రులలోను జరిగిన ఆపరేషనుల సంఖ్య 7,00,702. ఈ ఆపరేషనుల అనంతరం చనిపోయిన రోగుల సంఖ్య , 2,087.

ఆస్పత్రులలో చికిత్సపొందినవారిలో ఏఏ రోగాలవల్ల యెంత మంది చనిపోయినదీ, వివరాలు :

| రోగం | చేరినరోగులు | మరణాలు |
|---|---|---|
| మలేరియా : | 12,17,416 | 452 |
| టైఫాయిడ్ | 65,474 | 1,485 |
| రక్తగ్రహిణి : | 5,55,007 | 748 |
| క్షయ : | 1,71,342 | 2,063 |

1950 లో 1,09,40,645 మందికి టీకాలు వేయబడినవి.

1950 లో రాష్ట్రంలో 720 ఆయుర్వేద వైద్యశాలలు వున్నవి. వీటిలో 279 స్థానిక సంస్థల యాజమాన్యంలో గ్రామాలలోవున్నది. నగరాలలోవున్నవి 77. అవికాక, ప్రభుత్వ ధనసహాయంతో నడుపబడేవి, గ్రామాలలో 355 వున్నవి. పూర్తిగా ప్రభుత్వ యాజమాన్యంలో వున్నవి, పట్నాలలో 8 ; పల్లెలలో 1.

## క్షయరోగ చికిత్సాలయాలు

1950 సెప్టెంబరు 9 నాటికి మద్రాసు రాష్ట్రంలో క్షయరోగ చికిత్సాలయాలు 10 ఉన్నాయి. వానిలో 3 ఆంధ్రదేశంలోను, 5 తమిళ నాడులలోను, 2 మద్రాసు నగరంలో, 1 దక్షిణ కన్నడ జిల్లాలలోను ఉన్నవి. ఆంధ్రదేశంలో వున్నవి ఏవంటే : బళ్ళారి ; మదనపల్లి (చిత్తూరుజిల్లా) ; రాజమండ్రి (తూర్పుగోదావరి జిల్లా).

క్షయరోగంవల్ల గత మూడు సంవత్సరాలలోను రాష్ట్రంలో ఎంతమంది చనిపోయినదీ వివరాలు ఇవి : 1947, 6946 ; 1948 6995 ; 1949 7146.

ఈ జబ్బువల్ల బాధపడేవారు రాష్ట్రమంతటిలోనూ ఎంత మంది ఉన్నది వివరాలు ఇవి ; 1947 : 88,697 ; 1948 : 100,655 ; 1949: 1,21,174.

ఈ జబ్బుచాలా ఎక్కువగావున్న ప్రాంతాలు మద్రాసునగరం, మధురజిల్లా, మలబార్ జిల్లాలు. రాష్ట్రంలోని 1,21,174 మంది క్షయ పీడితులలోను 27,818 మంది, అంటే నూటికి 20 వంతులకుపైగా, మద్రాసు నగరంలోనే వున్నారు.

## సుఖవ్యాధులు

గనేరియా, సవాయి మొదలైన సుఖవ్యాధులవల్ల బాధపడే వారిసంఖ్య రాష్ట్రంలో నానాటికీ ఎక్కువఅవుతున్నది. గవర్నమెంటు హాస్పిటల్సులో వైద్యంపొందినవారు 1947 లో 3,56,774 మంది, 1948 లో 3,51,010 మంది, 1949 లో 3,84,851 మంది అని తెలుస్తోంది. వీరుకాక ఇంకా ఎన్నో వేలమంది ప్రైవేటుగా చికిత్స పొంది వుంటారు.

## మనోవ్యాధి ఆస్పత్రులు

పిచ్చి మొదలైన మనోవ్యాధుల చికిత్సకు మద్రాసు రాష్ట్రంలో మూడు ఆస్పత్రులు, మద్రాసు, కోళికోడ్, వాల్తేరులలో వున్నాయి.

మద్రాసు ఆస్పత్రిలో 888 మందిని వుంచడానికీ, కోళికోడ్ లో 364, వాల్తేరులో 164 మందిని వుంచడానికి వసతివుంది.

## నర్సులు

మన రాష్ట్ర జనాభానుబట్టి, రోగులందరికీ సరియైన పరిచర్య జరగాలంటే, రాష్ట్రంలో 82,000 మంది నర్సులు వుండాలి. కాని, 1950 అంతానికి లిస్టులోవున్న నర్సులు మొత్తం, 5,410మంది మాత్రమే.

రాష్ట్రంలోని నర్సులలో మూడవవంతుమంది మగవారు.

# గ్రామాభివృద్ధి

గాంధిమహాత్ముని ఆశయాన్ననుసరించి గ్రామాలను స్వయంపోషకములుగానూ, ప్రజానివాసానికి ఆకర్షవంతములుగానూ చేయడానికి ఫిర్కా అభివృద్ధికార్యక్రమాన్ని మద్రాసు ప్రభుత్వం 1946 అక్టోబరులో ప్రారంభించారు. ఈ కార్యక్రమం అమలులోకి తేవడంలో ప్రభుత్వపు ఆశయాలు ఏమిటంటే : ప్రతిగ్రామము, దానికి అవసరమైన ఆహార ధాన్యాలనూ, ప్రత్తినీ పండించడం; ప్రతిగ్రామానికీ, దానిలోని పశువులు మెయ్యడానికి తగిన వసతిగలబంజరువుండాలి; ప్రతిగ్రామంలోనూ స్కూలు, నాటకశాల, ఉపన్యాసమందిరము, మంచినీటి వసతి వుండాలి. ప్రతిగ్రామము, మిగతా గ్రామాలతో సంబంధం కలిగివుండేటట్లుగా, మంచిరోడ్లవసతి వుండాలి. ప్రతి గ్రామంలోను పిల్లలు ఆడుకోవడానికీ, పెద్దలు పొద్దుపుచ్చడానికీ కేళీ విహారస్థానాలు వుండాలి. గ్రామాలనుంచి ప్రజలు పటణాలలో నివాసానికి వెళ్ళిపోకుండా: జీవిత సౌకర్యాలు గ్రామాంలో వుండాలి.

ఈ కార్యక్రమాన్ని రాష్ట్రమంతటా ఒకేసారి ప్రవేశపెటడం వల్ల కార్యభారం ఎక్కువవుతుందని, రాష్ట్రంలోని 34 ఫిర్కాలను మాత్రమే, సుమారు 1,000 గ్రామాలు గలవానిని, మొదట ఎన్ను

కాని, ఆ ఫిర్కాలోని గ్రామాలలో యీ కార్యక్రమాన్ని ప్రభుత్వం అమలులోకి తెచ్చింది.తరువాత, 1950 ఏప్రిల్ 1 తేదిన మరొక 50 ఫిర్కాలలో 1,394 గ్రామాలుగల వానిలో, యీ కార్యక్రమం ప్రారంభించబడింది. ఈ కొత్త ఫిర్కాలు, అంతకుపూర్వం వున్నవాటితో కలుపబడినవి.

ఈ కార్యక్రమాన్ని సాగించడానికి కేంద్రప్రభుత్వంకూడా ధన సహాయం చేస్తున్నది, 1947-48 లో యీ కార్యక్రమానికి అయిన ఖర్చునంతనూ కేంద్రప్రభుత్వమే భరించింది: 1948-49 లోనూ 1949-50 లోనూ అయిన ఖర్చులలో సగాన్ని భరించింది,

1950 అంతానికి యీ కార్యక్రమం సాగుతూవున్న ఫిర్కాలుఇవి,

అనంతపురంజిల్లా : హిందూపూర్ ఫిర్కా.

ఉత్తరార్కాడు జిల్లా : కలశపాక్కం ఫిర్కా

కడపజిల్లా : ప్రొద్దుటూర్ ఫిర్కా

కర్నూలుజిల్లా : కర్నూలు, యర్రగొండపాలెం ఫిర్కాలు

కృష్ణాజిల్లా : తిరువూర్ ఫిర్కా

కోయంబత్తూరుజిల్లా : తిరుపూర్, వెల్లకోయిల్ ఫిర్కాలు

గుంటూరుజిల్లా : ఒంగోలు, గురవారెడ్డిపాలెం ఫిర్కాలు

చంగల్పట్ జిల్లా : తిరువళ్లూరు ఫిర్కా

చిత్తూరుజిల్లా : నగరి ఫిర్కా

తంజావూరుజిల్లా : శాలిమంగళం ఫిర్కా

తిరుచిరాపల్లిజిల్లా : ముసిరి ఫిర్కా

తిరునెల్వేలిజిల్లా : పళంకోట్టై ఫిర్కా

తూర్పుగోదావరిజిల్లా : రాజమండ్రి ఫిర్కా

దక్షిణకన్నడజిల్లా : కుంబ్ల ఫిర్కా

దక్షిణార్కాడుజిల్లా : కడంబులియూర్, చిన్నసేలం ఫిర్కాలు

నీలగిరిజిల్లా : కుంద ఫిర్కా

నెల్లూరుజిల్లా : కణుపూర్ ఫిర్కా

పడమటిగోదావరిజిల్లా : దెందులూర్, పోలవరంఫిర్కాలు

బళ్ళారిజిల్లా : ఆలూరు ఫిర్కా
మధురజిల్లా : తిరుమంగళం ఫిర్కా
మలబార్ జిల్లా : తెలిచేరి, పయ్యానూర్-నీలేశ్వర్ ఫిర్కాలు
రామనాథంజిల్లా : మల్లిఫిర్కా
విశాఖపట్టణంజిల్లా : పెందుర్తి, కోటవురట్ల, మాడుగుల ఫిర్కాలు
శ్రీకాకుళంజిల్లా : గార ఫిర్కా
సేలంజిల్లా : వీరపాండి ఫిర్కా

ఈ కార్యక్రమం ఆరంభించినప్పటినుంచీ 1949 సంవత్సరాంతం లోపున యీఫిర్కాలలో మొత్తం 516 మైళ్ళ కొత్తరోడ్లు వేయబడినవి. ఎలిమెంటరీ స్కూళ్లు 293; రాత్రి స్కూళ్లు 426; వయోజన స్కూళ్లు 345: తెరువబడినవి. 4,480 ఎకరాల భూమి కొత్తగా సాగులోనికి తేబడింది. 83 కొత్త వైద్యశాలలు తెరువబడినవి. 537 బావులు త్రవ్వబడినవి. 120 రేడియోలు ఏర్పాటుచేయబడినవి.

## హరిజనోద్ధరణ

మదరాసు రాష్ట్రంలోని జనాభాలో నూటికి 16.2 వంతులు అంటే దాదాపు 80 లక్షలమంది హరిజనులు. సాంఘికంగా, ఆర్థికంగా విద్యావిషయంలో, అత్యంత అధోస్థితిలోవున్న ప్రజలువీరే. అందుచేతనే, గాంధిమహాత్ముడు వీరికి దేవుని బిడ్డలు అనే అర్థంలో హరిజనులు అని నామకరణం చేశాడు. ఇటీవల, యీ కులాలవారికి ప్రత్యేక సౌకర్యాలు ఇవ్వడంతో వీరిలో చాలామంది యువకులు ప్రజ్ఞచూపి ముందుకు వస్తున్నారు. అయినా, ఇంకా కొంతకాలం వీరికి ప్రత్యేక సౌకర్యాలు ఇస్తేనేకాని, యీ కులాలవారు బాగా ముందుకు రాలేరని గ్రహించి శాసన సభలలోను, గవర్నమెంటు ఉద్యోగాలలోను ఇంకా పదేళ్లు వీరికి కొన్ని స్థానాలను ప్రత్యేకించడానికి ప్రభుత్వం నిశ్చయించారు. హరిజనోద్ధరణకు దేశంలోని అన్ని రాష్ట్రాలలోను ప్రత్యేకశ్రద్ధ చూపబడుతున్నది.

మదరాసు రాష్ట్రంలోను 80 లక్షలమంది హరిజనులలో దాదాపు 73 లక్షలమంది గ్రామాలలో నివసిస్తున్నారు.

1946 లో హరిజనోద్ధరణకుగాను ఒక కోటిరూపాయలను మంజూరుచేశారు. హరిజనోద్ధరణ కార్యక్రమాలను సాగించడానికి ప్రత్యేకం ఒకశాఖను ఏర్పాటుచేసి, ఒక డైరక్టరును 1949 ఏప్రిల్ 1 తేదిన నియమించారు. గవర్నమెంటు మంజూర్ చేసిన కోటిరూపాయలు గ్రామీణ ప్రాంతాలలోనే ఖర్చు పెట్టడానికి నిశ్చయింపబడింది.

హరిజనోద్ధరణ కార్యక్రమంలో ప్రధానమైనవి ఇవి: గృహావసతి: నీటివసతి ; ఆరోగ్యవసతి ; వృత్తి ; విద్య ; వైద్యసహాయము.

రూ. 5,00,000ఖర్చుపెట్టి నివేశనస్థలములనుకొని, రూ. 15,00,000 పెట్టి ఇళ్లు కట్టించడానికీ, రూ. 15,00,000 పెట్టి నీటివసతి ఏర్పాటుచేయడానికీ, గ్రామపారిశుద్ధ్యము, ఆరోగ్యరక్షణలకు రూ. 5,00,000 ఖర్చు పెట్టడానికీ, గృహపరిశ్రమల స్థాపనకు రు. 10లక్షలు, వైద్యసహాయానికి రూ, 10,00,000 ఖర్చుపెట్టడానికీ నిశ్చయింపబడింది.

ఈ కార్యక్రమములను అమలు జరపడానికి రాష్ట్ర ప్రభుత్వం; ఏర్పాటుచేసిన కమిటీవారి ఆశయాలు ఏమిటంటే: ప్రతిజిల్లాలోను 4,000 చొప్పున రాష్ట్రం అంతటా 1,00,000 నివేశనస్థలములను సంపాదించడం; 20 లేక 30 ఇళ్లుగల కాలనీలను, ఒక్కొక్క జిల్లాలో నాల్గింటినిస్థాపించడం ; సుమారు 400 బావులను త్రవ్వించడం.

1949-50 లో హరిజనోద్ధరణ శాఖవారుచేసిన పనులు ఏమిటంటే :

191 మందికి ఇళ్లు కట్టుకోడానికి స్థలములు మంజూరు చేయబడినవి. ఈ శాఖ స్థాపింపబడినప్పటినుంచి 1949-50 అంతానికి, ఇలా ఇవ్వబడిన స్థలములు 49,208.

93 హరిజన్ స్కూళ్లు కొత్తగా స్థాపింపబడినవి. 1949-50 అంతానికి రాష్ట్రంలోవున్న హరిజన్ స్కూళ్లు మొత్తం 1,290. ఈ స్కూళ్ళలో మొత్తం 93,744 (65,985 బాలురు, 32,759 బాలికలు) హరిజన్ బాలబాలికలు చదువుకున్నారు. అన్ని స్కూళ్లలోను, మధ్యాహ్నంపూట బాలబాలికలకు ఉచితంగా అన్నం పెట్టబడింది. ఇలా, అన్నవసతి పొందినవారు 87,339 మంది. దీనికి అయిన ఖర్చు రు. 12,52,497.

మిడిల్ స్కూళ్ళలోను, హైస్కూళ్లలోను ఆర్ట్సు కాలేజిలలోను చదువుకొనేవారికి ఇచ్చినవి కాక, వృత్తి విద్యల కాలేజిలలో చదువు తునే 156 మంది హరిజన్ విద్యార్థులకు విద్యార్థి వేతనములు మొత్తం రు. 73,241 ఇవ్వబడినవి.

# గ్రామీణ బ్రాడ్‌కాస్టింగ్

రేడియో ప్రోగ్రాములను గ్రామస్థులకు వినిపించడానికి గ్రామా లలో రేడియో సెట్లను ఏర్పాటు చేయించడానికి, వాటిని తనిఖీ చేయ డానికి, చెడిపోయినవాటిని బాగుచేయించడానికి, మదరాసు రాష్ట్రంలో యీ శాఖ ఏర్పాటు చేయబడినది.

1951 మార్చి 1 నాటికి రాష్ట్రంలో మొత్తం 1,614 సెట్లు పని చేస్తున్నాయి,

తెలుగు జిల్లాలలోని పంచాయితీల అధీనంలో వున్నవాటివివరాలు ఇవి : మొత్తం : 576.

శ్రీకాకుళం, 16; విశాఖపట్టణం, 20; తూర్పుగోదావరి, 89; పడమటిగోదావరి, 82; కృష్ణ, 66; గుంటూరు, 110; నెల్లూరు, 49; చిత్తూరు, 24; కడప, 17; కర్నూలు, 32; బళ్ళారి, 36; అనంత పురం, 35.

తెలుగుజిల్లాలలో మునిసిపాలిటీల అధీనంలోవున్న సెట్ల వివరా లివి : ఆదోని, 1; అనకాపల్లి, 2; అనంతపూర్, 3; బళ్లారి, 5; విజయ వాడ, 7; భీమవరం, 4; భీమునిపట్టణం, 1; శ్రీకాకుళం, 3; కాకి నాడ, 4; కడప, 2; గుంటకల్, 1; గుడివాడ, 2; గుంటూరు, 2; మచిలీపట్టణం, 2; నంద్యాల, 4; నెల్లూరు, 4; నరసరావుపేట, 2; పాలకొలు, 3; పెద్దాపురం, 1; ప్రొద్దటూర్, 2; రాజమండ్రి, 4; తాడిపత్రి, 2; తెనాలి, 6; విజయనగరం, 2; విశాఖపట్టణం, 3; హిందుపూర్, 3; సాలూరు, 1; అమలాపురం, 1; ఏలూరు, 2; చీరాల 2; చిత్తూరు, 3; తిరుపతి, 2; వోస్పేట, 2; కర్నూలు, 1.

# మద్యనిషేధము

మదరాసు రాష్ట్రంలో, 1946 అక్టోబరు 1 వ తేదిన ఎనిమిదిజిల్లాలలో మద్యపాన నిషేధశాసనం అమలు జరుపబడింది. ఆ జిల్లాలు ఇవి : కోయంబత్తూరు, సేలం, ఉత్తరార్కాడు, అనంతపురం, కర్నూలు, కడప, బళ్లారి, చిత్తూరు.

1947 అక్టోబరు 1 వ తేదినుంచి మరొక ఎనిమిది, (గుంటూరు, మలబారు, నీలగిరి, నెల్లూరు, తంజావూరు, తిరుచిరాపల్లి, దక్షిణ కన్నడ, మధుర) జిల్లాలలో మద్యనిషేధ శాసనాన్ని అమలు జరిపారు.

1948 అక్టోబరు 1 తేదినుంచి, మదరాసు నగరం, తిరునెల్వేలి, రామనాథం, దక్షిణార్కాడు, చెంగల్పట్టు, కృష్ణా, పడమటి గోదావరి, తూర్పుగోదావరి, విశాఖపట్టణం జిల్లాలలో మద్యనిషేధం అమలుజరుపబడింది. అంటే, 1949 అక్టోబరు 1 తేదినుంచి, మదరాసురాష్ట్రంఅంతటా మద్యనిషేధం అమలు జరుపబడిందన్నమాట. ఈసంస్కారంవల్ల రాష్ట్ర ప్రభుత్వం తమ ఆదాయంలో ఏడాదికి దాదాపు 17 కోట్ల రూపాయలను కోల్పోయారు.

రాష్ట్రంలో ఎక్కడా మద్యనిషేధంలేని 1945-46 లో, మద్యపానీయాలమీద వేసినపన్నులవల్ల రాష్ట్రప్రభుత్వాదాయం, రూ. 16,81,74,000.

1946 లో మద్యనిషేధం అమలు జరపడానికి పూర్వం, రాష్ట్రంలో 10,382 కల్లుదుకాణాలు, 5894 సారాయిదుకాణాలు వుండేవి. 1945-46 లో రాష్ట్రంలోని త్రాగుబోతులు త్రాగిన సారాయి మొత్తం 39,37,489 గాలనులు.

# మోటారుకార్లు : బస్సులు

1950 అంతానికి మదరాసురాష్ట్రంలో మొత్తం 46,995 మోటారుబండ్లు వున్నాయి. వీటి వివరాలు ఇవి : మోటారుసైకిళ్లు, 4,473; టాక్సీలు, 793; బస్సులు, 7071; లారీలు, 11,261; కార్లు, ఇతరబండ్లు, 23,397. రాష్ట్రంలోని జిల్లాలన్నిటిలోకీ ఎక్కువ ప్రైవేటు కార్లు వున్న

జిల్లా, మదరాసునగరం (6,634) తక్కువకార్లు వున్న జిల్లా, రామనాథం (69).

గత 10 సంవత్సరాలలోను రాష్ట్రంలోని మోటారుబండ్ల సంఖ్య ఎలా పెరిగింది, యీ క్రింది అంకెలనుబట్టి తెలుస్తుంది:

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1941-42 | : | 19,239 | 1946-47 | : | 30,715 |
| 1942-43 | : | 17,685 | 1947 | : | 33,158 |
| 1943-44 | : | 17,240 | 1948 | : | 41,128 |
| 1944-45 | : | 18,046 | 1949 | : | 44,745 |
| 1945-46 | : | 18,653 | 1950 | : | 46,995 |

1950 లో 83,567 మంది డ్రైవర్లుగా పని చెయ్యడానికి లైసెన్సు అను పొందివున్నారు. వీరిలో 20,294 మంది బస్సులను నడపడానికి లైసెన్సు పొందినవారు. 26,841 మంది ప్రైవేటుకార్లను నడపడానికి జీతంమీద పని చెయ్యడానికి లైసెన్సులను పొందినవారు. 1950 అంతానికి, కండక్టర్లుగా పనిచెయ్యడానికి లైసెన్సులను పొందినవారు రాష్ట్రంలో మొత్తం 18,548 మంది ఉన్నారు.

మదరాసునగరంలో ప్రభుత్వంవారే బస్సులను నడిపించడం 1947 జనవరిలో ప్రారంభించారు. అప్పటినుంచి, 1949 డిసెంబరు 31 నాటికి, బస్సులమీద ప్రభుత్వంవారు మొత్తం పెట్టుబడి రూ. 54,00,000 పెట్టారు. 1952 జనవరి 1 తేది నాటికి మదరాసునగరంలో 322 బస్సులు వున్నాయి. వానిలో 245 బస్సులు రోడ్లమీద తిరుగుతూ వుంటాయి. తక్కినవానిలో 15 అవసరానికిగాను ఆసరాగా వుంటాయి. తక్కినవి రిపేరులో ఉంటాయి. వీనిలో 25 డీసెల్ బస్సులు. ఈ బస్సు సర్వీసులో, ప్రభుత్వంక్రింద 723 డ్రైవర్లు, 675 కండక్టర్లు, 100 ఇన్‌స్పెక్టర్లు, 649 మంది ఇతరులు పని చేస్తున్నారు.

## రోడ్లు

మదరాసు రాష్ట్రంలో 1951 మార్చి 31 నాటికి, 2039 మైళ్ళ జాతీయ రహదార్లు; 3,069 మైళ్ళ రాష్ట్రీయ రహదార్లు; 15,055 మైళ్ళ

పెద్దజిల్లా బోర్డు రోడ్లు వున్నాయి. వీటిని ఒకటోరకం రోడ్లు అంటారు. ఇవికాక, జిల్లాలలోని చిన్నరోడ్లు 7,968 మైళ్లు; గ్రామాలరోడ్లు, 8,822 మైళ్లు. వీటిని రెండోరకం రోడ్లు అంటారు. పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు అధీనంలోవున్న రోడ్లు, 756 మైళ్లు; మునిసిపాలిటీల అధీనంలోవున్న రోడ్లు, 3,723 మైళ్లు. రాష్ట్రంలోని మొత్తంరోడ్లు 36,953 మైళ్ళు.

రాష్ట్రంలో ప్రభుత్వం అధీనంలోవున్న రోడ్లు 15,187 మైళ్ళు. జిల్లాబోర్డుల అధీనంలో వున్నరోడ్లు, 22,171 మైళ్ళు. ఆంధ్రదేశంలోని రోడ్లలో ప్రభుత్వం అధీనంలోవున్నవి, 6,824 మైళ్ళు. జిల్లాబోర్డుల అధీనంలో వున్నవి 8,037 మైళ్లు.

జాతీయరహదార్లను ఇంకా 21 మైళ్లు వెయ్యాలనీ, రాష్ట్రీయ రహదార్లను ఇంకా 19 మైళ్ళూ, జిల్లాబోర్డుల అధీనంలోని పెద్దరోడ్లను ఇంకా 945 మైళ్ళూ, జిల్లాలలోని ఇతర చిన్నరోడ్లను ఇంకా 4,070 మైళ్ళూ, గ్రామాలకు ఇంకా 12,806 మైళ్ళు వెయ్యాలనీ ప్రభుత్వ సంకల్పం.

గ్రామాలకు రోడ్లు వెయ్యడం ప్రస్తుతం చాలాఅవసరం, ఏమంటే, బండ్లు వెళ్ళడానికి వీలైన రోడ్లులేని గ్రామాలు రాష్ట్రంలో దాదాపు 12,000 వున్నాయి.

# అడవులు

మదరాసురాష్ట్రంలో 1950 మార్చి 31 నాటికి 18,763 చ. మైళ్లు అడవులక్రింద ప్రత్యేకించబడింది. దీనిలో 15,374 చ. మైళ్ళు ప్రభుత్వానికి ప్రతిఫలంచేకూర్చే, మొదటితరగతి అడవి. దీని కాపలా, నిర్వహణ అంతా అటవీశాఖవారి చేతిలోవుంది. వేరే, 3,389 చ. మైళ్లు అడవి ఇతరశాఖలవారి అధీనంలో వుంది. దానిలో 1,060 చ. మైళ్ళు పంచాయితీల పరిపాలనలో వుంది. ఈ అడవికూడా 1951 నాటికి మొత్తం ప్రభుత్వం అధీనంలోకి వస్తుందని ఊహ.

1950 మార్చి 31 నాటికి రాష్ట్రంలో, వివిధజిల్లాలలోని పంచాయతీల ఆధీనంలోవున్న అడవి వివరాలు ఇవి: (అంకెలు చదరపుమైళ్లను తెలుపును)

విశాఖపట్టణం, 17; అనంతపురం, 443; బళ్లారి, 566; కర్నూలు 60; గుంటూరు, 99; నెల్లూరు, 394; ఉత్తరార్కాడు, 65; సేలం, 92; కడప, 190; చంగల్పట్టు, 97; మధుర, 15; తంజావూరు, 5.

1949-50 లో రాష్ట్రంలోని అడవులలో మేపడానికి అనుమతి ఇవ్వబడిన పశువులసంఖ్య; మహిషపశువులు, 2,29,289; గోపశువులు, 12,52,678; గొర్రెలు, 11,52,735; దీనివల్ల వచ్చిన ఆదాయం, రు. 6,51,037.

1949-50 లో రాష్ట్రంలోని అడవులలో మొత్తం 75,773 టన్నుల కలప లభించింది. దీనివల్ల వచ్చిన ఆదాయం రు. 1,05,65,977.

1950 మార్చి 31 నాటికి అటవీశాఖవారి అధీనంలో 101 ఏనుగులు వున్నాయి. వీటివిలువ రు. 8,12,150 అని అంచనా.

1949-50 లో 43,856 ఎకరాల అడవిలో, 2,74,879 టన్నుల వంట చెరకుకొరకు చెట్లు నరుకబడినవి.

ఇదే సంవత్సరంలో రాష్ట్రంలోని అడవులలో మొత్తం రు. 15,89,723 విలువగల వెదురుగడలు కొట్టబడినవి.

ఉత్తరార్కాడు, సేలం, కోయంబత్తూరు జిల్లాలలోని అడవులలో మంచి గంధపుచెట్లు ఎక్కువగా వున్నాయి. 1949-50 లో రాష్ట్రంలోని అడవులనుంచి 781 టన్నులు మంచిగంధపు చెక్కలు సేకరించబడినవి. 1948-49 లో సేకరించినదానిలో 181 టన్నులు మిగులు ఉన్నది. ఈమొత్తంలో 789 టన్నులు, రు. 26,70,727 లకు అమ్మబడింది. అంటే, దాదాపుగా ఒక టన్ను మంచి గంధపుచెక్కకు రు. 3,411 ధర కిట్టిందన్నమాట.

1949-50 లో అటవీశాఖవల్ల ప్రభుత్వానికి మొత్తం రు. 1,64,08,000 ఆదాయం వచ్చింది. ఈ శాఖకు అయిన ఖర్చు రు. 78,98,000.

# సహకారోద్యమము

భారతదేశంలో సహకారోద్యమానికి, 1904 లో ప్యాసయిన కో-ఆపరేటివ్ క్రెడిట్ సొసైటీస్ శాసనంతో పునాదిపడింది. ఈ శాసనం 1904 మార్చి 25 తేదిన అమలులోకి వచ్చింది.

ఈచట్టం ఉద్దేశం ఏమిటంటే, సామాన్యప్రజలలో పొదుపరితనాన్ని పెంపొందించడం; రైతులూ, కార్మికులూ, చేతివృత్తులవారూ, సామాన్యాదాయంగల యితరవ్యక్తులూ అన్యోన్యసహాయంచేసుకుని తమ యిబ్బందులను గడుపుకొనేటట్లు చెయ్యడం.

ఈచట్టం ప్యాసయిన తరువాత కొంతకాలంవరకు, దేశంలో కో-ఆపరేటివ్ సొసైటీల వ్యవస్థాపన ఎక్కువగా జరగలేదుగాని, 1910 నుంచీ ఈ సొసైటీలు చాలా ఎక్కువ అయాయి.

మదరాసు రాష్ట్రంలోకూడా కో-ఆపరేటివ్ వుద్యమం క్రమక్రమంగా చాలా అభివృద్ధిలోకి వచ్చింది. 1946-49 లలో యీ వుద్యమం మరీ బాగా అభివృద్ధిలోకి వచ్చింది.

1950 జూన్ 30 నాటికి మదరాసురాష్ట్రంలో మొత్తం 22,784 కో-ఆపరేటివ్ సొసైటీలు వున్నాయి. అంతకు పూర్వపు సంవత్సరంలో, 21,271 వున్నాయి. 1949-50 లో వున్న సొసైటీల సభ్యులసంఖ్య 31 లక్షల 22 వేల పైగావుంది. ఆ సొసైటీలన్నిటిలోను పెట్టుబడి పెట్టబడిన వాటాలమొత్తం రూ. 9,49,00,000.

## ప్రైమరీ సొసైటీలు :

1950 జూన్ 30 తేది నాటికి, మదరాసు రాష్ట్రంలో 15,348 ప్రైమరీ కో-ఆపరేటివ్ సొసైటీలు వున్నాయి. ఆ సంవత్సరంలో, యీ సొసైటీలు, 6,44,00,000 రూపాయలు అప్పులిచ్చాయి.

## కో-ఆపరేటివ్ బ్యాంకిలు :

1949-50 లో, మదరాసురాష్ట్రంలో 31 జిల్లా సెంట్రల్ కో-ఆపరేటివ్ బ్యాంకిలు వున్నాయి. 17,951 సొసైటీలు యీ బ్యాంకిలతో చేరివున్నాయి. బ్యాంకులన్నీ కూడా లాభంమీదనే పనిచేశాయి.

**ప్రైమరీ లాండ్ మార్టుగేజి బ్యాంకులు :**

భూముల తనఖామీద అప్పులిచ్చే ప్రైమరీ బ్యాంకులు 1949-50 లో మదరాసురాష్ట్రంలో 124 ఉన్నాయి. ఈ బ్యాంకులన్నింటి మొత్తం సభ్యత్వపుసంఖ్య, 1,22,874. ఆసంవత్సరంలో, యీబ్యాంకులు 78,82,005 రూపాయలకుపైగా అప్పులిచ్చాయి. ఈ బ్యాంకులన్నీ, మదరాసులోని సెంట్రల్ లాండ్ మార్టుగేజి బ్యాంకు పర్యవేక్షణలో పనిచేస్తాయి.

**అమ్మకపు సొసైటీలు :**

అవసరమైనవారికి తగిన హామీమీద అప్పులు యివ్వడమేకాక, సహకారపద్ధతిమీద సరకులను అమ్మే సొసైటీలు 1945-50 లో మదరాసురాష్ట్రంలో 279 పనిచేశాయి. ఈ సొసైటీలలో సభ్యత్వపు సంఖ్య మొత్తం 1,86,691. ఈ సొసైటిలు రాష్ట్రంలో ఎరువులను రైతులకు అమ్మడంవల్ల లాభం సంపాదించాయి.

**పండ్ల ఉత్పత్తిదారుల కో-ఆపరేటివ్ సొసైటీలు :**

ఇలాటి సంస్థలు, 1949-50 లో మదరాసు రాష్ట్రంలో 16 వున్నాయి. వీటిలో ముఖ్యమైనది, కడపజిల్లాలోని కోడూరులోవున్న సొసైటి. దీని తరువాత చెప్పదగినది, పాలకొల్లులోది. 1949-50 లో యీ సొసైటీలు 5,14,000 రూపాయల విలువగల పండ్లను అమ్మి రు. 27,648 లాభం సంపాదించినవి.

**చెరకు ఉత్పత్తిదారుల సొసైటీలు**

1949-50 లో మదరాసు రాష్ట్రంలో ఇలాటి సొసైటీలు 13 పని చేశాయి. చెరకు పెంచే రైతులకు అప్పు ఇవ్వడం, వారు ఉత్పత్తిచేసిన చెరకునుగాని, బెల్లాన్నిగాని టోకుగా అమ్మడం మొదలైనపనులను ఈ సొసైటీలు చేశాయి.

**పాల సప్లయి సొసైటీలు — యూనియనులు :**

1949-50 లో మదరాసు రాష్ట్రంలో పాలసప్లయి యూనియనులు 36, సొసైటీలు 535 వున్నాయి. యూనియనులు రు. 66,19,000

ఖరీదుగల పాలను అమ్మాయి. సొసైటీలన్నీ మొత్తం రు. 83,68,000 పాలను అమ్మాయి.

నేతపనివారి సొసైటీలు

1949-50 లో, మదరాసు రాష్ట్రంలో చేనేతపనివారి కో-ఆపరేటివ్ సొసైటీలు 941 వున్నాయి. వీటిలోవున్న సభ్యులు మొత్తం, 1,49,393. వీరందరిచేతిలోనూ ఉన్న మగ్గాలసంఖ్య, 1,34,653. 1949-50 లో వీరు నేసిన బట్టలవిలువ రు. 3,70,38,000. ఆ బట్టను అమ్మిన ధర, రు. 4,89,56,000.

సొసైటీలలో సభ్యులుగావున్న నేతపనివారందరికీ ఇచ్చిన కూలి మొత్తం, రు. 94,81,000.

మదరాసురాష్ట్ర చేనేతపనివారి కో-ఆపరేటివ్ సొసైటీకి లోబడి, ఈ ప్రైమరీ సొసైటీలన్నీ పనిచేస్తున్నాయి. వీటన్నిటికీ నూలు సప్లయి ఈరాష్ట్ర సొసైటియే చేసింది. వీరు నేసినబట్టలలో చాలావరకు రాష్ట్ర సొసైటి డిపోలలోనే అమ్మబడినవి.

టోకు వ్యాపారపు కో-ఆపరేటివ్ స్టోర్సు :

1949-50 లో ఇలాటి స్టోర్సు 24 పనిచేశాయి. కంట్రోలుకు లోబడిన వస్తువులను, ఇతర సామగ్రిని చిల్లర స్టోరులకు పంచడం, ఇవి చేసేపని. అంతేకాక, టోకుగా ధాన్యసేకరణ, ఆహారసామగ్రిని నిలవ చెయ్యడం పంచడంకూడా ఈ స్టోర్సు సాగించాయి. ఈ స్టోర్సు అన్నిటిలోవున్న సభ్యులసంఖ్య, 12,615 ఇవన్నీ కలిపి, 1949-50 లో రు. 20,38,000 లాభం సంపాదించాయి.

ప్రైమరీ కో-ఆపరేటివ్ స్టోర్సు :

1949-50 లో మదరాసురాష్ట్రంలో 1843 కో-ఆపరేటివ్ స్టోర్సు చిల్లర అమ్మకాన్ని సాగించాయి. వీటికివున్న బ్రాంచీల సంఖ్య 1,843. ఈ స్టోర్సులలో 641 స్టోర్సు నగరాలలోను నగరాలతో తుల్యమైన పెద్ద ఊళ్ళలోనూ వున్నాయి. గ్రామాలలో 1,102 వున్నాయి. వీటిలో

1,019 స్టోర్సుకు, రేషనులను పంచిపెట్టడానికి లైసెన్సు ఇవ్వబడింది. ఆ స్టోర్సుయాజమాన్యంలో మొత్తం 2126 రేషనుషాపులు నెలకొల్పబడినవి.

**గృహ నిర్మాణము :**

1949-50 లో రాష్ట్రంలో 280 సహకారసంఘాలు, గృహ నిర్మాణంకోసం ఏర్పడినవి ఉన్నాయి.

# రేవులు

మదరాసు రాష్ట్రంలో 38 రేవులు వున్నాయి, వీటిలో మూడు, మదరాసు, విశాఖపట్టణం, కొచ్చిన్, పెద్దరేవులు. ఇవి కేంద్రప్రభుత్వం వారి నిర్వహణలో వున్నాయి. తక్కిన 35 రేవులూ, చిన్న రేవులక్రింద పరిగణింప బడుతున్నాయి. అవేమిటంటే : విశాఖపట్టణంజిల్లాలో : బారువ, కళింగపట్నం, భీమునిపట్నం, తూర్పుగోదావరిజిల్లాలో: కాకినాడ. కృష్ణాజిల్లాలో : మచిలీపట్నం. గుంటూరుజిల్లాలో : వాడరేవు. దక్షిణార్కాడు జిల్లాలో : కడలూర్, పోర్టోనోవో. తంజావూరు జిల్లాలో: తిరుమలవానల్, ట్రాంక్విబార్, నాగపట్టణం- తోప్పుదురై, అదిరాంపట్నం, అమ్మపట్నం. రామనాథంజిల్లాలో : దేవీపట్నం, తొండి, పంబన్, ధనుష్కోడి, కిలకరై. తిరునవ్వేలిజిల్లాలో : పొన్నాని మలబార్ జిల్లాలో : కోళికోడ్ (కాలికట్), బడగర, కళ్ళాయి, తెలిచ్చేరి, కన్ననూర్. అళిక్కల్. దక్షిణ కన్నడజిల్లాలో : కాసర్గోడ్, మెంగుళూర్, ముల్కి, మాల్పి, హంగర్‌కోట, కుందువూర్, బైందూర్, భత్కల్.

ఇవన్నీ కూడా తీరవ్యాపారానికి అనుకూలంగా వున్న వే.

1950-51 లో మదరాసు రాష్ట్రంలోని అన్ని రేవులకును వచ్చిన మొత్తం ఓడలసంఖ్య : 10,328.

**మదరాసు :**

మదరాసురేవు కేంద్రప్రభుత్వ పరిపాలనలోనేవున్నా, స్థానికంగా దీని పరిపాలనను నిర్వహించడానికి, పోర్టుట్రస్టు అనే పేరులో

ఒక ధర్మకర్తల బోర్డు నియమించబడింది, ఈ బోర్డులో ప్రభుత్వం నియమించిన సభ్యులూ : స్థానిక వ్యాపార, వాణిజ్య, పరిపాలనా సంస్థల తరఫున ఎన్నుకోబడిన సభ్యులూ వుంటారు.

1950-51 లో ఈ రేవుద్వారా జరిగిన ఎగమతి దిగుమతులు మొత్తం : 17,83,570 టన్నుల సరకులు.

విశాఖపట్టణం:

విశాఖపట్టణం హార్బరు నిర్మాణానికి స్కీము ఈస్టిండియా కంపెనీ రోజులలోనే వేయబడినా, 1925 దాకా దానిని కార్యరూపం లోకి తెచ్చే ప్రయత్నం జరగలేదు. 1933 లో హార్బరు ఓడలు నిలవడానికి తెరువబడింది. ఈ రేవు పరిపాలన కేంద్రప్రభుత్వంవారిచే నియమింపబడిన ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరు సాగిస్తాడు.

కొచ్చిన్ :

కొచ్చిన్‌కూడా ఇటీవలనే నిర్మింపబడిన హార్బరులలో ఒకటి. 1930 లో ఇది ఓడల రక్షణకు తెరువబడింది. మదరాసు రాష్ట్రపు దక్షిణజిల్లాలకు, కొచ్చిన్, తిరువాంకూరు సంస్థానాలకూ విదేశవ్యాపారానికి ఈ రేవు ఎక్కువగా ఉపయోగిస్తున్నది. యూరప్‌నుంచి ఆస్ట్రేలియాకు వెళ్లేఓడలు, కొచ్చిన్ రేవును తగిలి మరీ వెళ్లుతాయి. 1936 లో దీనిని పెద్ద రేవులలో ఒకటిగా నిర్ణయించి కేంద్రప్రభుత్వం వారు తమ పరిపాలనలోనికి తీసుకున్నారు.

కాకినాడ :

మదరాసు రాష్ట్రంలోని రేవులలో ముఖ్యమైనవాటిలో అయిదవ స్థానం కాకినాడరేవుది. పెద్ద పెద్ద ఓడలు రేవుకు ఆరు, ఏడుమైళ్లు దూరములో సముద్రంలోనే నిలబడతాయి. ఒడ్డునుంచి చిన్నలాంచిలు ఓడల వద్దకువచ్చి సరకును ఎత్తడం, ఒడ్డుకు తీసుకురావడం మొదలైనపని చేస్తాయి. ఇక్కడ నుంచి విస్తారంగా ఎగుమతి అయే సరకులు, వేరు శనగ, ఆముదపు గింజలు, ఇవన్నీ యూరపుకే వెడతాయి. అమెరికా నుంచి కిరసనాయిలూ, ఇంగ్లండునుంచి లోహాలూ ఇక్కడ దిగుమతి

అవుతాయి. ఈ రేవును పెద్దరేవుగా అభివృద్ధి చెయ్యాలని ఇటీవల జరిగిన సూచనపై, కేంద్రప్రభుత్వమువారు నియమించిన కమిటీవారు విచారణ జరిపారు. కాని, దీనికి 80 మైళ్ళలో ఉత్తరాన విశాఖపట్టణమూ, 270 మైళ్ళలో దక్షిణాన మదరాసు వున్నందున, ఈ రేవును అభివృద్ధిపరచడం మంచిది కాదని, ఆ కమిటీవారు శిఫార్సుచేశారు. దానిని ప్రభుత్వం వారు ఆమోదించారు.

# పరిశ్రమలు

ఇటీవల మదరాసు రాష్ట్రంలో పలువురు ఉత్సాహవంతులు, రాష్ట్ర పరిశ్రమలను చాలా అభివృద్ధిలోకి తీసుకురావడానికి విశేషకృషి చేస్తున్నారు.

మదరాసు రాష్ట్రంలోని ముఖ్యపరిశ్రమలను గురించి 1949-50 క్రిందివివరాలు చూడండి.

## బట్టలు, నూలుమిల్లులు :

మనరాష్ట్రంలో అత్యధిక సంఖ్యాకులకు పని కలిగించేవీ, అధిక సంఖ్యలోవున్నవీ బట్టమిల్లులూ, నూలుమిల్లులు. 1949 లో ఈ రాష్ట్రంలో ఇలాటి మిల్లులు 81 వున్నాయి, వీటిలో 18 ఫాక్టరిలు. మేజోళ్లు బనీనులు మొదలైనవి తయారుచేసేవి. మిగతావి నూలు, బట్టలు తయారు చేసేవి. వీటిలో 45 నూలు తయారుచేసేవే.

## చేనేత పరిశ్రమ :

మదరాసు రాష్ట్రంలో సుమారు 4,81,000 చేనేత మగ్గము లున్నవి. వీనివల్ల సుమారు 12,03,000 మంది చేనేత పనివారికి పని దొరుకు తున్నది. వీరిమీద ఆధారపడి జీవించేవారితో మొత్తం 25,00,000 మంది ప్రజలు చేనేతపరిశ్రమమీద ఆధారపడివున్నారు. చేనేత పరిశ్రమలో తక్కిన రాష్ట్రాలన్నిటికన్న మొదటిస్థానం మదరాసుదే.

మదరాసు రాష్ట్రంలోని పంచదార ఫాక్టరీలు

| | |
|---|---|
| 1931—32 | 2 |
| 1941—42 | 11 |
| 1942—43 | 10 |
| 1943—44 | 12 |
| 1944—45 | 11 |
| 1945—46 | 11 |
| 1949—50 | 12 |
| 1951— | 14 |

ఈ మిల్లులు ఉన్నస్థల : అనకాపల్లి, ఏటికొప్పాక, బొబ్బిలి, సీతానగరం, [విశాఖపట్నం జిల్లా] ; వుయ్యూరు [కృష్ణాజిల్లా] ; కిర్లంపూడి, సామర్లకోట [తూర్పుగోదావరిజిల్లా] ; నెల్లికుప్పం [దక్షిణార్కాడు జిల్లా] ; హాస్పేట [బళ్లారిజిల్లా] ; పొదనూరు [కోయంబత్తూరుజిల్లా] ; తాచనల్లూరు [తిరునల్వేలిజిల్లా].

మదరాసు రాష్ట్రంలో చెరుకుపంటవేసిన పొలాలలో సగటున ఒక ఎకరానికి 25 టన్నుల చెరకు పండుతుందని అంచనా. ఉత్తర ఇండియాలో ఎకరానికి 15 టన్నులు మాత్రమే పండుతుంది.

రాష్ట్రంలో 1949-50 లో వున్న 12 పంచదార ఫాక్టరీలలోను 65,000 టన్నుల పంచదార మాత్రమే తయారయింది. రాష్ట్రంలోని ప్రజలు వాడకంచేస్తున్న పంచదార 1949 నాటికి ఏడాదికి 1,20,000 టన్నులవరకు పెరిగింది.

పెంకులు

1949-50 లో పెంకులు పరిశ్రమ బాగానే వృద్ధిపొందింది. రాష్ట్రంలో 89 పెంకుల ఫాక్టరీలు వున్నాయి. సరకు కావలసినంతగా ఉత్పత్తి అవలేదు. 63,00,000 రూపాయల విలువగల 3,43,00,000 పెంకులు విదేశాలకు ఎగుమతి చేయబడినవి.

సిమెంటు :

మదరాసు రాష్ట్రంలో అయిదు సిమెంటు ఫ్యాక్టరీలు ఉన్నాయి. అవి : మదుకరై ; డాల్మియా ; ఇండియా సిమెంట్స్ ; ఆంధ్ర సిమెంటు కంపెనీ (విజయవాడ) ; కృష్ణా సిమెంటు వర్క్స్ (తాడేపల్లి). వానిలో ఇండియా సిమెంట్సు ఫ్యాక్టరీ కొత్తగా 1949 లో స్థాపింపబడినది. ఈ ఫ్యాక్టరీలలో గతమూడు సంవత్సరాలలోను ఉత్పత్తి అయిన సిమెంటు వివరాలివి : 1947-48, 2,89,979 టన్నులు : 1948-49, 3,65,785 టన్నులు ; 1949-50, 4,70,864.

జనపనార :

1949-50 లో మదరాసు రాష్ట్రంలో నాలుగు జనపనార మిల్లులు వున్నాయి. గోనెసంచుల అవసరం ఏమీ తగ్గనందున యీ మిల్లులన్నీ కూడా లాభసాటి వ్యాపారాన్నే సాగించాయి. 26,41,000 రూపాయల విలువగల జనపనార ఎగుమతి చేయబడింది.

తోళ్ళ వ్యాపారం :

భారతదేశంనుంచి విదేశాలకు వూనిన తోళ్ళను అత్యధికంగా ఎగుమతిచేసే ప్రాంతాలలో మదరాసు రాష్ట్రం ఒకటి. రాష్ట్రంలో తోళ్ళువూనే ఫ్యాక్టరీలు మొత్తం 212 వున్నాయి. 1949-50 లో ఈ రాష్ట్రంనుంచి అన్నిరకముల తోళ్ళు మొత్తం 18,52,15,000 రూపాయల విలువ గలవి ఎగుమతి చేయబడినవి.

అగ్గిపెట్టెలు :

మదరాసు రాష్ట్రంలో అగ్గిపుల్లలు తయారు 1949 లో, అంతకు పూర్వపు సంవత్సరంకంటె ఎక్కువైంది. రాష్ట్రంలోవున్న అగ్గి పెట్టెల ఫ్యాక్టరీలలో 76 ఫ్యాక్టరీలు ఒక్క రామనాథం జిల్లాలోనే వున్నాయి. మదరాసులో ఒకటివుంది. అది 1949 లో మొత్తం 97,550 పెద్ద పెట్టెలును (ఒక్కొక్క దానిలో అగ్గిపుల్లలుగల 60 గ్రోసుల అగ్గిపెట్టెలు గలవి) ఉత్పత్తి చేసింది.

సబ్బు పరిశ్రమ :

1917 లో మదరాసు రాష్ట్రంలో, ప్రభుత్వంవారిచే కాలికట్‌లో స్థాపించబడిన కేరళ సోప్ ఇన్‌స్టిట్యూట్ తప్ప వేరే సబ్బుల ఫాక్టరీ ఏదీ పెద్దదిలేదు. గృహపరిశ్రమక్రియగా సబ్బులను తయారు చేయడం జరుగుతున్నది. కాని, అది అంత లాభదాయకం కానందువల్ల ఎక్కువమంది సబ్బులను తయారు చెయ్యడానికి పూనుకోడంలేదు. సబ్బులకు గిరాకీమాత్రం హెచ్చుగావుంది.

1949-50 లో ఈ ఫాక్టరీ తయారుచేసిన సబ్బులు రూ. 6,97,655 విలువగలవి అమ్మకమైనవి. తయారుచేసిన సబ్బులు మొత్తం 314 టన్నులు ప్రత్యేకవ్యక్తులకు స్థాపించిన ఫాక్టరీలలో మొత్తం 1,90,000 టన్నుల సబ్బులు తయారు చేయబడినవి.

చేపనూనె తియ్యడం :

కాలికట్‌లో మదరాసు ప్రభుత్వంవారు స్థాపించిన గవర్న్మెంట్ ఆయిల్ ఫాక్టరీలో, 1949-50 లో మొత్తం 1,29,330 పానుల షార్కు లివరు ఆయిల్ తియ్యబడింది. అంతకు ముందుసంవత్సరంలో తీసిన నూనెతో 1949-50 లో మొత్తం 1,26,834 పౌనులనూనె, రు. 2,30,278 విలువగలది అమ్ముడైంది.

గాజు పరిశ్రమ :

1949-50 లో మదరాసు రాష్ట్రంలో, అంతకు పూర్వం వున్న ఏడుకాక, కొత్తగా మరొక గాజు ఫాక్టరీ స్థాపింపబడినవి. కృష్ణా జిల్లాలో, చిలకలపూడిలో స్థాపింపబడినఫాక్టరీ కంటి జోళ్ళకు కావలసిన అద్దము తయారు చేస్తున్నది. ఇలాటి ఫాక్టరీ, దక్షిణ ఇండియాలో మరొకటి లేదు.

పింగాణీ పరిశ్రమ :

1948 అక్టోబరు 12 న గూడూరులో ప్రభుత్వం పింగాణీ ఫాక్టరీని స్థాపించింది. దీని నిర్మాణానికి రూ. 11,60,000 అయింది. ప్రస్తుతం ఇక్కడ భోజనం చెయ్యడానికి పనికివచ్చే పింగాణి పాత్రలు తయారు

చెయ్యబడుతున్నవి. 1949-50 లో ఈ ఫాక్టరీలో రు. 76,448 విలువ గల పాత్రలు తయారు చెయ్యబడినవి. ఆదాయంపోగా, యీ ఫాక్టరీ నిర్వహణకు 1949-50 లో ప్రభుత్వానికి రు. 60,000 నష్టం వచ్చింది.

## పిప్పరమెంట్ల తయారు :

యుద్ధకాలంలో విదేశాలనుంచి పిప్పరమెంట్లు దిగుమతి అవడం పూర్తిగా తగ్గిపోయింది. దేశీయపరిశ్రమలకు మంచిఅవకాశం కుదిరింది. ఆంధ్రుల యాజమాన్యాన, ఆంధ్రుల పెట్టుబడితో పిప్పరమెంట్ల ఫాక్టరీ స్థాపన, 1948 లో జరిగింది. దాని పేరు, కె. సి. పి. కన్ఫెక్షనరీ. దీనిని స్థాపించినవారు, చల్లపల్లి రాజాగారి సోదరులైన శ్రీ రాజా యార్లగడ్డ రామకృష్ణప్రసాద్ గారు. స్థాపించిన తొమ్మిది సంవత్సరాలలో, ఈ సంస్థను వీరు చాలా అభివృద్ధికి తీసుకువచ్చారు. వీరు తయారుచేసిన అనేక రకాల తీపివస్తువులు 'సావరిన్ స్వీట్స్' అనే మార్కుతో అమ్మబడుతున్నాయి.

## కాగితము :

మదరాసు రాష్ట్రంలో ఒకే ఒక కాగితాల మిల్లు వుంది. అది రాజమండ్రిలోని ఆంధ్ర పేపర్ మిల్స్-దీనిని ప్రైవేటు వ్యక్తులనుంచి రాష్ట్రప్రభుత్వంవారు రు. 25 లక్షలకు కొని, తామే నడుపుతున్నారు. ఈ మిల్లు 1949-50 లో 784 టన్నుల కాగితమును ఉత్పత్తి చేసింది. కాగితపు విలువ రు. 3,91,000. మదరాసు, కోయంబత్తూరు, మధుర, పాలంకోట, సేలం నగరాలలో సెంట్రల్ జెయిళ్ళలో చేతితో కాగితం తయారుచేసే కేంద్రాలు స్థాపింపబడినవి.

## వనస్పతి నూనె :

వనస్పతి నూనె తయారుచేసే ఫాక్టరీలు మదరాసు రాష్ట్రంలో మూడు వున్నాయి. ఈ మూడిటిలోను కలిపి రోజుకు 45 టన్నుల నూనె తయారుచేయబడుతున్నది. మరొక ఆరు ఫాక్టరీలు నిర్మాణంలో వున్నాయి.

**అభ్రకము :**

1949-50 లో మదరాసు రాష్ట్రంలో 3,443 టన్నుల అభ్రకము ఉత్పత్తి చేయబడింది. దీనిలో 3,379 టన్నులు నెల్లూరు జిల్లాలోను, 64 టన్నులు నీలగిరి జిల్లాలోను త్రవ్వబడింది. రు. 25,88,496 విలువగల అభ్రకపు గడ్డలు, రు. 1,21,26,432 విలువగల అభ్రకపు ముంపులు, యీరాష్ట్రంనుంచి ఎగుమతి చేయబడినవి.

సినిమా :

1939 లో రెండవప్రపంచయుద్ధం రాకపూర్వం సినిమాపరిశ్రమ చాలా గందరగోళంగా వుండేది. సమర్థులతోపాటు, అసమర్థులుకూడా ఈ పరిశ్రమలో ప్రవేశించి పరిశ్రమనడకను పాడుచెయ్యడమేకాక, తాము కూడా విశేషించి నష్టపడ్డారు. యుద్ధంవచ్చిన తరువాత, రాఫిలిం ధర పెరగడమూ, కంట్రోలు ఏర్పడడమూ, వీటన్నిటివల్లా తోచిన వారంతా ఈ పరిశ్రమలో దిగడానికి వీలులేకపోయింది. పైగా, సరిగా పరిశ్రమను నిర్వహించలేని వారు బయటికి జారారు. యుద్ధకాలంలో తట్టుకుని నిలబడ్డ కంపెనీలు చాలాకొద్ది. యుద్ధం అయిపోయిన తరువాత కంట్రోలుపోగానే, మళ్లీ ఫిలిం కంపెనీలు చాలా నెలకొన్నాయి. కాని, స్టూడియోలు ఎక్కువగా లేనందున, అందరూ త్వరత్వరగా ఫిలిములను బయటికి తీసుకురాలేకుండా వున్నారు. తెలుగువారి యాజమాన్యాన ప్రస్తుతం రెండు స్టూడియోలు మదరాసులో వున్నాయి. వానిలో వాహినీ పిక్చర్సువారి స్టూడియో మూడు సంవత్సరముల పూర్వం ఆధునిక యంత్రములతో స్థాపించబడినది.

ఇప్పటివరకూ, దెబ్బతినకుండా నిలిచి ఫిలింనిర్మాణాన్ని సాగిస్తున్న తెలుగు పిలిం కంపెనీలలో ముఖ్యమైనవాటి వివరాలు ప్రక్క పేజీలలో ఇవ్వబడినవి.

జగదీశ్ ఫిలిమ్సు; స్థాపన, 1939. నిర్వాహకులు: వై. వి. రావు గారు. తీసినచిత్రాలు ; మళ్ళీపెళ్ళి, విశ్వమోహిని, సత్యభామ, తాసిల్దార్, లవంగి (తమిళం.)

రాజరాజేశ్వరి ఫిలింకంపెనీ: స్థాపన, 1939. నిర్వాహకులు: కడారి నాగభూషణంగారు, పసుపులేటి కన్నాంబగారు. మంచి కట్టుదిట్టమైన ఏర్పాట్లతో సాగుతున్న తెలుగు సినిమా కంపెనీలలో ఇది ఒకటి. తీసిన చిత్రాలు: తల్లిప్రేమ, సుమతి, పాదుక, హరిశ్చంద్ర, నవజీవనం, (తమిళం) సౌదామిని.

రోహిణి పిక్చర్సు: స్థాపన, 1937. యజమానులు: హెచ్. ఎం. రెడ్డిగారు. తీసిన ఫిలుములు, గృహలక్ష్మి, తెనాలిరామకృష్ణ, ఘరానాదొంగ, జస్టిస్ (హిందీ), నిర్దోషి.

వాహినీపిక్చర్స్ లిమిటెడ్: మొదట్లో రోహిణీపిక్చర్స్ కంపెనీని హెచ్. ఎం. రెడ్డిగారితో కలసి స్థాపించిన బి. ఎన్. రెడ్డిగారు, 1939 లో రోహిణీ. పిక్చర్సునుంచి విడిపోయి, ఈ కంపెనీని స్థాపించారు. కంపెనీలో ప్రధానవ్యక్తి బి. ఎన్. రెడ్డిగారు. కె వి. రెడ్డి, వి. నాగయ్య; బ్రిజ్ మోహన్ దాస్, సముద్రాల రాఘవాచారిగార్ల సహకారంతో, ఈ కంపెనీ ఉత్తమచిత్రాలను తయారుచేసింది. తీసిన చిత్రాలు: వందేమాతరం, సుమంగళి, దేవత, పోతన, స్వర్గసీమ, వేమన, గుణసుందరికథ, మల్లీశ్వరి.

శోభనాచల పిక్చర్సు: 1937 లో స్థాపించబడిన జయా పిక్చర్స్ అనేసంస్థ 1944 లో శోభనాచల పిక్చర్స్ అని మార్చబడింది. నిర్వాహకులు మీర్జాపురం జమీందారు. వీరికి సొంత స్టుడియో వుంది. (శోభనాచల స్టూడియోస్). ఇక్కడ తెలుగుచిత్రాలేకాక, ఇతర కంపెనీల తమిళ చిత్రాలుకూడా తయారవుతున్నవి.

సారథి ఫిలిమ్సు లిమిటెడ్: 1939 లో, శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారిచే స్థాపింపబడింది. ఉత్తమచిత్రాలను తయారుచేసే సంస్థలలో ఒకటిగా పేరుపొందింది. ఇప్పటివరకు ఈ కంపెనీ తీసినచిత్రాలు: మాలపిల్ల, రైతుబిడ్డ, పత్ని, పంతులమ్మ, మాయలోకం, గృహప్రవేశం, అగ్నిపరీక్ష; వీటిలో ఒక్క మాయలోకం తప్ప మిగతావన్నీ సాంఘిక చిత్రాలే. ఈ కంపెనీ డైరెక్టర్లబోర్డు అధ్యక్షులు, చల్లపల్లి రాజాగారు, మేనేజింగు డైరెక్టర్. శ్రీరాజా యార్లగడ్డ రామకృష్ణ ప్రసాద్ గారు.

విజయా ప్రొడక్షన్స్: 1949 లో శ్రీ బి. నాగిరెడ్డి, శ్రీ చక్రపాణి గార్ల సహకారంతో స్థాపించబడినది. వీరు తమ నిర్వాహణలో షావుకారు, పాతాళభైరవి, పెళ్ళిచేసిచూడు అనే చిత్రాల్ని తయారుచేశారు,

## కార్మిక బలం

1949 అంతానికి మదరాసు రాష్ట్రంలోని ఫాక్టరీలలో పనిచేస్తున్న వారిసంఖ్య, 3,23,950. 1948 అంతానికి, ఫాక్టరీలలో పనిచేస్తున్న వారి సంఖ్య, 2,88,722 మంది. 1947 అంతానికి 2,76,586. 1949 అంతానికి రాష్ట్రంలోని బట్టలమిల్లులలో పనిచేస్తున్నవారిసంఖ్య 91,850. ఇంత ఎక్కువ మంది కార్మికులు మరే పరిశ్రమలోను లేరు.

1950 ఏప్రిల్ 1 నాటికి మదరాసురాష్ట్రంలో, కార్మికుల యూనియనులు, రిజిస్టరు చేయబడినవి, 593 వున్నాయి. అదే సంవత్సరంలో 174 యూనియన్లు కొత్తగా రిజిస్టరు చేయబడినవి. 187 యూనియన్లు రిజిస్టరునుంచి తొలగించబడినవి 1951 మార్చి 31 నాటికి మదరాసు రాష్ట్రంలోవున్న కార్మికుల యూనియనులసంఖ్య, రిజిస్టరుచేయబడినవి, 580.

ఈ యూనియనులన్నిటిలోను సభ్యులుగావున్న కార్మికుల సంఖ్య, 1951 మార్చి 31 నాటికి, 1,74,608. ఆసంవత్సరపు ఆరంభంనాటికి, యీ కార్మికులసంఖ్య 3,16,274

## ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజెస్

యుద్ధకాలంలో సైనికులుగాను, సైన్యపు ఇతరశాఖలలోను పనిచేసి ఇప్పుడు నిరుద్యోగులుగా వున్నవారికి ఉద్యోగాలకు చూపించడానికీ, వారిని ఏవైనా వృత్తులలో ప్రవేశపెట్టడానికి కేంద్రప్రభుత్వ కార్మికశాఖ మంత్రివర్గంవారు ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజెస్‌కు దేశమంతటా స్థాపించారు, మదరాసురాష్ట్ర ప్రాంతానికంతకూ ప్రధాన ఎక్స్చేంజి మదరాసు నగరంలో వుంది. సబ్ రీజియనల్ ఎక్స్చేంజి ఆఫీసులు, విశాఖపట్టణం, బెజవాడ, అనంతపురం, మదరాసు, నెల్లూరు, కోయంబత్తూరు,.

కాలికట్ తిరుచినాపల్లి, మధుర నగరాలలో వున్నాయి. ఇవికాక, జిల్లాఆఫీసులు ప్రతిజిల్లా కేంద్రస్థానంలోను, ఒక్క నీలగిరితప్ప, ఒక్కొక్కటి వున్నాయి. ఉద్యోగంలేకుండావున్న మాజీ సైనికోద్యోగులు యీ ఆఫీసులలో తమ పేర్లను రిజిస్టరుచేసుకుంటే, వీరికి తగిన ఉద్యోగాన్ని సంపాదించి పెట్టడానికి యీ ఆఫీసులు ప్రయత్నంచేస్తాయి. యుద్ధంలో పనిచేసి తిరిగివచ్చిన వారికేగాక ఉద్యోగం కావలసిన వారందరూకూడా యీ ఆఫీసులద్వారా ఉద్యోగాలు పొందవచ్చును.

## ఫాక్టరీలు

1950 సంవత్సరాంతలో, మదరాసు రాష్ట్రంలో 5,598 ఫాక్టరీలు వున్నాయి. వీటిలో పనిచేస్తున్న కార్మికుల సంఖ్య, 3,23,950. వీటిలో 6,133 ప్రమాదాలు జరిగినట్లునూ, ఆ ప్రమాదాలవల్ల 44 మంది చనిపోయినట్లునూ తెలుస్తున్నది.

1949 సంవత్సరం ప్రారంభంలో, రాష్ట్రంలో 4,167 ఫాక్టరీలు వున్నాయి.

ప్రభుత్వ అధినంలోను, స్థానికసంస్థల అధీనంలోవున్న ఫాక్టరీల సంఖ్య: 122. వీటిలో పనిచేసినవారిసంఖ్య: 28,863.

ఇతర ఫాక్టరీలలో ముఖ్యమైనవాటిలో పనిచేసినవారిసంఖ్య వివరాలు ఇవి :

బట్టల మిల్లులు, 91,850 ; మోటారు బండ్ల నిర్మాణం, 8,181 ; రైల్వే కర్మాగారాలు, 14,832 ; ఓడల నిర్మాణం, 3,800 ; ఇటుకలు పెంకులు తయారుచెయ్యడం, 10,187, తోళ్ళను పూనడం, 9,417 బియ్యం మిల్లులు, 18,137 ; అగ్గిపెట్టెలు, 7,088.

రాష్ట్రంలోని వివిధ ఫాక్టరీలలలో జరిగిన సమ్మెల వివరాలు ఇవి:

| సంవత్సరం : | సమ్మెలసంఖ్య : |
|---|---|
| 1946 | 152 |
| 1947 | 164 |

| | |
|---|---|
| 1948 | 147 |
| 1949 | 126 |
| 1950 | 123 |

# న్యాయ రక్షణ

1948 సంవత్సరంలో మదరాసు రాష్ట్రంలో నేరాలసంఖ్య కొంచెం ఎక్కువైంది. అల్లరులూ అశాంతీ ఎక్కువగానే కనబడ్డాయి.

## న్యాయవిచారణ :

న్యాయ విచారణకు మదరాసు రాష్ట్రంలో 1948 లో పనిచేసిన న్యాయాధిపతుల సంఖ్య : పర్మనెంటు హైకోర్టు జడ్జీలు 12 ; తాత్కాలిక అదనపు హైకోర్టు జడ్జి, 1 సెషన్సు జడ్జీలు, 31 శాశ్వత అదనపు సెషన్సు జడ్జి, 1, ఏజెన్సీ జడ్జీలు, 3; అదనపు ఏజెన్సీ జడ్జీలు 3, సబ్ జడ్జీలు, 37 ; తాత్కాలిక సబ్ జడ్జీలు, 22; జిల్లా మేజిస్ట్రేటులు, 24 ; అడిషనల్ జిల్లా మేజిస్ట్రేట్లు, 16 ; ప్రెసిడెన్సీ మేజిస్ట్రేట్లు, 6 ; సబ్ డివిజనల్ మేజిస్ట్రేట్లు, 95 ; సబ్ మేజిస్ట్రేట్లు 551 ; స్పెషల్ మేజిస్ట్రేట్లు, 59 ; ఆనరరీ మేజిస్ట్రేట్లు, 33 ; బెంచికోర్టులు- 198 ; గ్రామ మేజిస్ట్రేటు కోర్టులు, 735 ; పంచాయితీ కోర్టులు, 2,329.

1948 లో వివిధ కోర్టులలో చెప్పబడిన శిక్షల వివరాలు : మరణశిక్షలు , 77 ; ద్వీపాంతరవాసం, 294 ; కఠిన శిక్షలు, 65,167 సాధారణ శిక్షలు, 13,536 ; జరిమానాలు, 7,02,841.

## జైళ్లు :

1950 లో మదరాసురాష్ట్రంలో 13 సెంట్రల్ జైళ్ళు, రెండు జిల్లా స్పెషల్ జైళ్ళు, 290 సబ్-జైళ్లు వున్నాయి.

సంవత్సరారంభంలో జైళ్లలో వున్నవారిసంఖ్య 26,491 ఈ సవత్సరంలో జైలుకువచ్చినవారు, 3,21,520 విడుదలపొందినవారు. 3,22,069; సంవత్సరాంతంలో జైలులోవున్నవారు, 25,942.

సివిల్ కోర్టులు :

13 మంది హైకోర్టు జడ్జిలు, 26 మంది జిల్లా జడ్జిలు. 37 మంది సబ్ జడ్జిలు, 140 మంది జిల్లా మునసబులు, 2,639 పంచాయతీ కోర్టులూ, సివిల్ దావాలను విచారించారు.

అదే సంవత్సరంలో, రాష్ట్రంలోని కోర్టు లన్నిటిలోను వెయ్య బడిన దావాల సంఖ్య, 2,46,696 అంతకుపూర్వపు సంవత్సరంలో వెయ్యబడిన దావాల సంఖ్య, 2,19,162.

1948 లో కొత్తగా 239 మంది అడ్వొకేట్లు వృత్తిలో ప్రవే శించారు.

## పోలీసు

1950 అంతానికి మదరాసు రాష్ట్రంలోగల పోలీసు సిబ్బంది వివరాలు :

కానిస్టబిల్సు, 37,884; హెడ్ కానిస్టబిల్సు, 5,187: సబ్ ఇన్‌స్పెక్టర్లు, 1982 ఇన్‌స్పెక్టర్లు, 372 డిప్యూటీ సూపరింటెండెంట్సు, 143 డిస్ట్రిక్ట్ సూపరంటెండెంట్సు, 45 డిప్యూటీ ఇన్‌స్పెక్టర్సు జనరల్, 7; ఇన్‌స్పెక్టర్ జనరల్, ఒకడు.

పోలీసువారు చర్యతీసుకున్న నేరాలు 1945 లో 55,738, 1946 లో 63,781, 1947 లో 69,000; 1948 లో 78,635; 1949 లో 77,717; 1950 లో 82,348.

## నేరములు చేయువారి సెటిల్మెంట్లు

కుటుంబపోషణకు నేరములు చెయ్యడమే వృత్తిగాగలవారని అనుమానమున్న కొన్ని కుటుంబాలను ఒకొక్క చోట మూకుమ్మడిగా ఏర్పరచి, వారికి వృత్తిపనులు చూపించి, విద్యాసౌకర్యములను కలిగించి, వారి

ప్రవర్తనను బాగుచేసే వుద్దేశంతో ఏర్పరచిన సెటిల్‌మెంట్ మదరాసు రాష్ట్రంలో నాలుగు వున్నాయి. అవి :

| | | |
|---|---|---|
| అజీజ్ నగర్ | : | మధుర జిల్లా |
| సిద్ధాపురం | : | కర్నూలు జిల్లా |
| సీతానగరం | : | తూర్పుగోదావరిజిల్లా |
| స్టూవర్టుపురం | : | గుంటూరుజిల్లా |

1951 మార్చి 31 నాటికి అజీజ్ నగర్ సెటిల్మెంటులో 1242 మంది, సిద్ధాపురంలో 651 మంది, సీతానగరంలో 235 మంది, స్టూవర్టు పురములో 2,120 మంది జనాభా వున్నారు.

అజీజ్ నగర్ సెటిల్మెంటువారు 600 ఎకరాలనూ, సిద్ధాపురం వారు 584 ఎకరాలనూ, సీతానగరంవారు 169 ఎకరాలనూ, స్టూవర్టుపురం వారు 870 ఎకరాలనూ సేద్యంచేస్తున్నారు.

# పశువైద్యం

1949-50 అంతానికి మదరాసు రాష్ట్రంలో 147 పశువైద్యశాలలు వున్నాయి. అసలు రాష్ట్రంలోవున్న పశువైద్యశాల లన్నిటిలోనూ 144 ప్రభుత్వంవారిచే పెట్టబడినవి. మూడు ప్రైవేటుగా స్థాపింపబడినవి.

1950 మార్చి 31 వ తేదినాటికి రాష్ట్రంలో పనిచేస్తున్న వెటరినరీ అసిస్టెంట్ సర్జనులు 423 మంది, గ్రామాలలో సంచారంచేసి పశువులకు వైద్యంచేసే టూరింగ్ పశువైద్యుల సంఖ్య 167.

రాష్ట్రంలో పశువైద్యశాలలలో, ఈశాఖవారు మొత్తం 1395 ఆంబోతులను వుంచారు. రాష్ట్రంలో మొత్తం, 3,52,818 పశువులకు చికిత్స చేయబడినది.

# ప్రజోపయోగసంస్థలు

అనేకవిధాల ప్రజలకు సేవచేస్తూవున్న సంస్థలలో, మదరాసు రాష్ట్రంలోని ముఖ్యమైన సంస్థలలో కొన్నిటి వివరాలు యీ క్రింద ఇవ్వబడినవి :

## అవ్వై హోం, అడయార్ :

అనాథబాలికలకు, యువతులకు రక్షణనివ్వడానికి స్థాపింప బడినది. ఒక అనాథాలయం, ఒక యువతీ విద్యాలయం, బీదబాలికలకు ఒక హాస్టల్, ఒక వృత్తి బోధనాలయం, యీ సంస్థచే నిర్వహింపబడు తున్నది. ప్రజల విరాళాలచేత నిర్వహింపబడుతూ, యీ సంస్థ అనాథ లకు గొప్పసేవ చేస్తున్నది.

## ఆంధ్రమహిళాసభ, లజ్, మైలాపూర్, మదరాసు :

జాతి, మత, కులభేదాలకు పాటించకుండా, స్త్రీలసేవ చెయ్య డానికి కృషిచేస్తున్న సంస్థ. ఈ సభలో, స్త్రీలకు క్లబ్ మాత్రమేగాక, విద్యాబోధన, వృత్తివిద్యల శిక్షణ యివ్వడానికి వివిధశాఖలు ఉన్నాయి. మహిళా విద్యాలయంలో హిందీ పరీక్షలకు, బెనారస్ యూనివర్సిటీ పరీక్షలకు బోధనచెయ్యబడుతుంది. కళాకేంద్రంలో, సంగీతం, నాట్యం మొదలగు లలితకళలు నేర్పబడుతవి; అంతేగాక, జీవనోపాధిలేని యువతులకు వృత్తి విద్యలు నేర్పబడుతవి. ఈ సంస్థలలో చదువుకొనే మహిళలు వుండడానికి హాస్టలుకూడా, యీ సభలోనేవుంది. అతిస్వల్ప రూపంలో ప్రారంభమై యీసభ నేడు మహిళకు అత్యంతసేవ చేస్తు న్నది. ఈ వృద్ధికి కారకులు, శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు.

## గ్రుడ్డి, చెవిటి, మూగవారికి స్కూలు, కెతెడ్రల్, మదరాసు :

గ్రుడ్డి, మూగి - చెవిటి బాలబాలికలకు విద్యాబోధన, వృత్తి విద్యల శిక్షణ యివ్వడానికి 1926 లో స్థాపింపబడినది. ప్రస్తుతం సుమారు 250 మంది బాలబాలికలు యీ సంస్థలో సహాయం పొందు తున్నారు. ఈ బాలబాలికలు ఇంగ్లీషు తమిళ భాషలు మాత్రమే నేర్ప బడుతున్నవి.

## భారత్ స్కౌట్ అండ్ గైడ్స్ :

స్కౌటు ఉద్యమం ప్రారంభమైన రోజులలో, ఇండియాలో యీ వుద్యమంలో యూరపియను బాలురు, ఆంగ్లో-ఇండియన్ బాలురు మాత్రమే చేర్చుకొనబడేవారు. 1919 లో డాక్టరు అనిబిసెంట్ భారతీయ

యువకులకోరకు ప్రత్యేకం ఒక స్కౌటు సంస్థను స్థాపించింది. దీనికి పోటీగా, అప్పుడు మదరాసు గవర్నరుగావున్న పెంట్లండ్ ప్రభువు మరొక స్కౌటుసంస్థను స్థాపించారు. 1921 లో యీ రెండు సంస్థలు కలసి పోయాయి.

ఈ ఉద్యమం ఆశయం ఏమిటంటే బాలురకు సంఘసేవ. పౌరస్వత్వము, క్రమశిక్షణ, విధినిర్వహణ, సత్ప్రవర్తన మొదలైన సుగుణాలను నేర్పడం. ఇది దేశమంతటావున్న వుద్యమం. మన రాష్ట్రంలోని అనేక నగరాలలో దీనికి బ్రాంచీలు వున్నాయి, సాధారణంగా హైస్కూళ్ళన్నిటిలోనూ బాలురు యీ సంస్థలో సభ్యులుగా వున్నారు. అనేక పట్టణాలలో, సభలు సమావేశాలు, ఉత్సవాలు జరుగుతున్నపుడు, సమ్మర్దం లేకుండా నరటంలోను, వారికి అనేకవిధాల సహాయ పడటంలోను స్కౌట్ బాలురు ఎంతో సహాయ పడుతున్నారు.

## హిందూస్తాన్ స్కౌట్ అసోసియేషన్, మైలాపూర్, మదరాసు :

భారతీయులకు స్కౌట్ ఉద్యమంలో మొదట ప్రవేశం ఇవ్వనందున, భారతీయ బాలుర్కు స్కౌటు ఉద్యమంలాంటి శిక్షణనిచ్చే ఉద్దేశంతో, 1918 లో పండిత మదనమోహన మాలవీయ, పండిత హృదయనాథ కుంజ్రూ, పండిత శ్రీరాం వాజపేయగార్లు సేవాసమితి బాయ్ స్కౌట్స్ అసోసియేషన్‌ను అలహాబాదులో స్థాపించారు. దీనికి బ్రాంచి 1923 లో మదరాసులో స్థాపించబడింది. 1937 లో హిందూస్తాన్ స్కౌట్ అసోసియేషన్ అనే పేరుతో ఈ సంస్థ బొంబాయిలోని మరొక సంస్థతో కలిసి, దేశీయసంస్థగా మారిపోయింది. ఇప్పుడు, దేశ స్వాతంత్ర్యం వచ్చింది కనుక ఈ సంస్థనూ, బాయ్ స్కౌట్ అసోసియేషనునూ కలిపి ఒకే సంస్థగా చెయ్యడానికి జరిగిన ప్రయత్నాలు ఫలించి; ఈ రెండు సంస్థలూ కలియుడం 1950 డిసెంబరు 23 న జరిగింది. ఈ రెండూ కలిసిన సంస్థకు భారత్ స్కౌట్ అండ్ గైడ్స్ అని పేరు.

## మదరాసు విజిలెన్సు అసోసియేషన్, మైలాపూర్ మదరాసు :

గతిలేక వ్యభిచారపిశాచానికి లోబడిపోయిన యువతులను రక్షించి వారికి ఏవైనా ఉద్యోగాలు చూపించడం, వివాహంచేయడం మొదలైన సంఘసేవాశయముతో, 1925 లో స్థాపింపబడిన సంస్థ. ఈ సంస్థకు మదరాసునగరంలో నాలుగు, రాష్ట్రంలోని 48 పట్టణాలలో బ్రాంచీలు వున్నాయి. ఈ సంస్థలద్వారా 1931 నుంచి 1947 లోపల సుమారు 2700 మంది యువతులు సన్మార్గంలో పెట్టబడినారు.

## శ్రీరామకృష్ణ మఠం, మైలాపూర్, మదరాసు :

మహర్షి శ్రీ రామకృష్ణ పరమహంస పేరిట స్థాపింపబడి, దేశం అంతటా బ్రాంచీలుగల మఠం. మదరాసులోని మఠం, 1897 లో స్థాపింపబడింది. వేదాంతబోధ, శాస్త్ర, కళా. పరిశ్రమలలో శిక్షణ వేదాంత, మతగ్రంథముల ప్రచురణ, ఈతిబాధలవల్ల యిబ్బందిపడే ప్రజలకు సహాయం చెయ్యడం, యీ మఠం ఆశయాలు. మదరాసునగరంలో యీమఠం ఒక కాలేజిని, ఒక హైస్కూలును, బాలికలకు శ్రీ శారదా విద్యాలయాన్ని, విద్యార్థుల వసతిగృహాన్ని, ఒక వృత్తిబోధనశాలను, నిర్వహిస్తున్నది, ఈ మఠం నిర్వహణ అంతా ఉదారుల విరాళాలవల్లనే జరుగుతున్నది.

## సేవాసమాజం, నుంగంబాకం, మదరాసు :

మదరాసు రాష్ట్రంలోని బీదలకు సహాయం చెయ్యడానికి గిల్డ్ ఆవ్ సర్వీసు అనే పేరుతో 1923 లో స్థాపింపబడింది. మొదటిలో యీ సంస్థ నిర్వహణ ఆంగ్లేయులే చేసేవారు. ప్రస్తుతం, అన్నిజాతులకూ కులాలకూ చెందిన 450 మంది సభ్యులు వున్నారు, ఈ సంస్థకు రాష్ట్రంలోని అన్ని జిల్లాలలోను బ్రాంచిలు వున్నాయి. దీనిని అభివృద్ధికి తేవడంలో 1946-48 లలో మదరాసు గవర్నరుగావున్న సర్ ఆర్చిబాల్డ్ నై భార్య లేడీ నై చాలా కృషిచేశారు. బీదస్త్రీలకు వివిధ సహాయాలను చెయ్యడంలో యీ సంస్థ చాలా ప్రశంసనీయమైన పని చేస్తున్నది.

# జమీందారుల రద్దు

మదరాసు రాష్ట్రంలో మొత్తం 2810 జమీన్ ఎస్టేట్లుగా, దాదాపు 3,500 జమీందారీలుగా పరిగణింపబడే గ్రామాలువున్నాయి. వీటిని నేరుగా గవర్నమెంటు అధీనంలోకి తీసుకోడానికి మదరాసు జమీందారీల రద్దు శాసనం అమలు జరుపబడింది, ఈ చట్టప్రకారం జమీందార్లకూ ఇనాందార్లకూ సుమారు రు 15,75,00,000 లను నష్టపరిహారంగా ఇచ్చి జమీందారీ, ఇనాందారీ గ్రామాలను ప్రభుత్వం స్వాధీనంచేసుకోవడం 1949 లో ప్రారంభమైంది.

ఈ చట్టం 1948 లో శాసనసభలో ప్రవేశపెట్టబడింది. 1948 నవంబరులో ప్యాసయింది, 1949 ఏప్రిల్ 2 తేదిన గవర్నరు జనరల్ ఆమోదాన్ని పొంది అమలులోకి వచ్చింది.

ఈ చట్టాన్ని అనుసరించి, 1949 సెప్టెంబరు 7 తేదిన 33 జమీందారీలను గవర్నమెంటు స్వాధీనపరచుకున్నారు.

1949 సెప్టెంబరు 7 తేదీన గవర్నమెంటు స్వాధీనపరచుకున్న జమీందారీల వివరాలు ఇవి :

1 విజయనగరం ; 2 బొబ్బిలి ; 3 పిఠాపురం ; (పోలవరం, పట్టిసం జమీందారీలతో సహా) ; 4 కపిలేశ్వరం , 5 కేశనకుర్రు ; 6 వెంకటగిరి (కాళహస్తి తాలూకాలోను, ఒంగోలు తాలూకాలోను, ఏలూరుతాలూకాలోను వున్న యీ జమీందారీ గ్రామాలతోసహా); 7 రామనాథం ; 8 కొత్తగుడి ; 9 ఒరట్టూర్ కర్గుడి ; 10 శృంగేరిమఠపు గ్రామం (రామనాథం జమీందారీలో ఒకభాగం) ; 11 శివగంగ ; 12 దేవకోట ; 13 కొంతంగి ; 14 ఓక్కూరు పెరవలి ; 15 గోవింద ప ంగళం ; 16 తిరుతెర్వెలై ; 17 దక్షిణ వల్లూరు, పార్ట్ 1 (బందరు తాలూకాలో 11 గ్రామాలు, విజయవాడతాలూకాలోని 5 గ్రామాలు, ఏలూరుతాలుకాలో తొమ్మిది గ్రామాలు) ; 18 దేవరకోట (చల్లపల్లి); 19 కృష్ణాపురం ; 20 జల్లిపర్రు ; 21 చిట్టిగూడూర్ మూడోవంతు ; 22 దేవరపల్లి ; 23 గూడూరుపార్ట్ 1; 24 గూడూరు పార్ట్ 1-ఎ; 25 కృత్తివెన్ను, పెద గొల్లపాలెం ; 26 కోమలపూడి , 27 మంజులూరు ; 18 పినగుదురులంక ; 29 గొల్లపాలెం ; 30 సుల్తాన్ నగరం గొల్ల

పాలెం ; 31 మునగాల ; 32 లింగగిరి ; 33 చింతలపాటివంతు, ముక్త్యాల.

ఈ జమీందారీ లన్నిటిలోను భూమి మొత్తం 50,97,820 ఎకరాలు

1950 ఆగస్టు 15 తేదిన విశాఖపట్టణం జిల్లాలోని మందసా జమీందారీ, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, నెల్లూరు, రామనాథం జిల్లాలలోని తక్కిన జమీందారీలు, చిత్తూరు జిల్లాలోని చిన్న జమీందారీలు మొత్తం, 9,421 చ. మైళ్ళ వైశాల్యంగలవి, ప్రభుత్వంచే స్వాధీనపరచుకో బడినవి. ఈ జమీందారీలలో రైతులు చెల్లించే పన్నులు మొత్తం రు. 44,54,210. జమీందారీలకు ఇవ్వవలసిన మొదటి నష్టపరిహారం రు. 97,43,037.

1950 సెప్టెంబరు 8 తేదిన, చిత్తూరుజిల్లాలోని ఈ క్రింది జమీందారీలు ప్రభుత్వంచే స్వాధీనపరచుకో బడినవి.

1 తిరుమల తిరుపతి దేవస్థానం జమీందారి ; 2 కంగుంది కుప్పం జమీందారీ ; 3 కార్వేటినగర్ ; 4 కాళహస్తి.

1951 జనవరి 4 తేదిన రాష్ట్రంలోని 770 జమీందారీ ఎస్టేట్లను ప్రభుత్వము స్వాధీనపరచుకున్నది. జిల్లాలవారిగా: ఆ జమీందారీ ఎస్టేట్ల సంఖ్యలు ఇవి :

చంగల్పట్, 333 ; మదరాసు, 5 ; దక్షిణార్కాడు, 5 ; ఉత్తరార్కాడు, 67 ; మధుర, 34 ; కోయంబత్తూరు, 9 ; తిరునెల్వేలి, 70 ; తంజావూరు, తిరుచినాపల్లి, 55 ; రామనాథపురం, 12 ; కృష్ణ, 2 ; తూర్పుగోదావరి, 1 ; నెల్లూరు, 25 ; గుంటూరు, 14 ; చిత్తూరు, 44.

1951 జనవరి 12 తేదిన పరచుకున్న జమీందారీ ఎస్టేట్లు మొత్తం: 476. జిల్లాలవారిగా వాటిసంఖ్యలు ఇవి : విశాఖపట్టణం, 38 ; శ్రీకాకుళం, 148 ; సేలంజిల్లా, 289.

# జిల్లాలు

## ౧

మనరాష్ట్రంలో మొత్తం 26 జిల్లాలు వున్నాయి. వీటిలో మదరాసు నగరం ఒక్కటే, 52 చ. మైళ్ళ వైశాల్యంతో, ఒక జిల్లాగా ఏర్పాటు చేయబడింది. మిగతావన్నీ తాలూకాలు, గ్రామాలుగల జిల్లాలే. జిల్లాలన్నిటిలోకీ వైశాల్యంలో పెద్దది నెల్లూరు; చిన్నది, నీలగిరి. తెలుగు జిల్లాలలో వైశాల్యంలో చిన్నది, పడమటి గోదావరి.

మదరాసుకాక, మిగతా 25 జిల్లాలలోను 11 జిల్లాలు ఫక్తు తెలుగు జిల్లాలు. వీటి మొత్తం వైశాల్యం, 67,025 చ. మైళ్ళు. కేవలం భూమి పన్ను, నీటితీరువపన్నువల్ల, యీ తెలుగు జిల్లాలనుంచి 1949–50 లో రాష్ట్ర ప్రభుత్వానికి వచ్చిన ఆదాయం రు. 4,52,14,285. ఈ తెలుగు జిల్లాలు ఏవంటే, అనంతపురం, కడప, కర్నూలు, కృష్ణ, గుంటూరు, చిత్తూరు, తూర్పుగోదావరి, నెల్లూరు, పడమటి గోదావరి, బళ్ళారి, విశాఖపట్టణం.

ఇవికాక మిగతా 13 జిల్లాల వైశాల్యం మొత్తం 59,111 చ. మైళ్ళు. ఈ జిల్లాలలో ప్రభుత్వానికి భూమిపన్ను, నీటి తీరువ పన్ను ఆదాయం 1949–50 లో రూ. 5,07,50,877.

## అనంతపురం

వైశాల్యం; 6,734 చ. మైళ్లు. జనాభా, 13,60,727. పురుషులు, 7,01,987, స్త్రీలు 6,58,740.

జిల్లాలో భూమి 43,11,447 ఎకరాలు. దీనిలో అడవి, 4,52,794 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 3,55,716 ఎకరాలు, వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 4,77,254 ఎకరాలు. 1949–50 లో పంటవేసిన భూమి, 21,05,494 ఎకరాలు. రాకలు నీటి తీరువ పొందిన భూమి, 2,31,003 ఎకరాలు. రెండుసార్లు పంటవేసిన భూమి 90,649 ఎకరాలు అది కలిపితే, వ్యవసాయం జరిగిన అసలుభూమి, 21,96,143 ఎకరాలు. జిల్లాలో 14,8,314 ఎకరాలలో వరి, 3,20,108 ఎకరాలలో జొన్నలు, 1,78,994 ఎకరాలలో సజ్జలు, 94,065 ఎకరాలలో రాగులు, 3,08,070 ఎకరాలలో కొర్రలు

పంట వేయబడినవి, 3,25,121 ఎకరాలలో అపరదినుసులు, 12,994 ఎకరాలలో మిరపకాయలు, 4,31,808 ఎకరాలలో వేరుశనగ, 38,633 ఎకరాలలో నువ్వులు, 2,596 ఎకరాలలో పొగాకు పంట వేయబడినవి. జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువపన్ను, ప్రభుత్వాదాయం. రూ. 17,43,556.

తాలూకాలు తొమ్మిది: అనంతపురం, మడకశిర, కదిరి, గుత్తి, హిందూపురం, పెనుకొండ, కల్యాణదుర్గం, ధర్మవరం, తాడిపత్రి.

జిల్లా కేంద్రనగరం: అనంతపురం.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్: కె. వి. వేమారెడ్డి.

## ఉత్తరార్కాడు

వైశాల్యం: 14,67 చ. మైళ్లు; జనాభా, 28,62,155. పురుషులు, 14,30,909; స్త్రీలు, 14,31,246.

జిల్లాలో భూమి 29,74,637 ఎకరాలు, దీనిలో అడివి 7,68,182 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 2,68,465 ఎకరాలు, వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 1,54,866 ఎకరాలు. 1949-50 లో పంటవేసిన భూమి, 11,68,007 ఎకరాలు. దీనిలో నీటితీరువపొందిన భూమి, 35,88,161 ఎకరాలు. రెండుసార్లు పంట వేసినభూమి, 2,25,676 ఎకరాలు. ఇది కలిపితే మొత్తం పంటవేసిన భూమి, 13,93,683 ఎకరాలు.

జిల్లాలో 4,29,698 ఎకరాలలోవరి, 95,894 ఎకరాలలో జొన్నలు, 95,205 ఎకరాలలో రాగులు, 93666 ఎకరాలలో అపర దినుసులు, 2,78,877 ఎకరాలలో వేరుశనగ పంటలు వెయ్యబడినవి.

జిల్లా మొత్తంమీద భూమి పన్ను, నీటి తీరువపన్ను ప్రభుత్వాదాయం, రూ. 24,74,755. ఇదికాక, ఎస్టేటు పేష్కష్‌లవల్ల ఆదాయం, రూ. 47,937.

జిల్లాలో తాలూకాలు పది; కేంద్ర నగరం, వెల్లూరు.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్: ఎస్. రామచంద్రా రెడ్డి.

## కడప

వైశాల్యం : 5,933 చ. మైళ్ళు. జనాభా, 11,61,713 ; పురుషులు, 5,94,933 ; స్త్రీలు, 5,66,790.

జిల్లాలో భూమి 37,98,169 ఎకరాలు. దీనిలో అడవి, 11,56,865 ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది 1,71,243 ఎకరాలు, వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 6,43,240 ఎకరాలు. 1949-50 లో పంటవేసిన భూమి, 10,38,851 ఎకరాలు. దీనిలో నీటి తీరువపొందినభూమి, 2,75,377 ఎకరాలు. రెండుసార్లుపంటవేసిన భూమి, 89,787 ఎకరాలు. ఇది కలిపితే, మొత్తం వ్యవసాయం జరిగిన భూమి, 11,28,638 ఎకరాలు.

జిల్లాలో భూమి 1,37,897 ఎకరాలలో వరి, 2,58,565 ఎకరాలలో జొన్నలు, 97,793 ఎకరాలలో సజ్జలు, 50,549 ఎకరాలలో రాగులు, 104,439 ఎకరాలలో కొఱ్ఱలు, 63,023 ఎకరాలలో అపరదినుసులు, 2,36,924 ఎకరాలలో వేరుశనగ పంటలు వేయబడినవి.

జిల్లా మొత్తమీద భూమిపన్ను, నీటి తీరువపన్ను ప్రభుత్వాదాయం , రు. 17,44,555.

తాలూకాలు ఎనిమిది : కడప, ప్రొద్దుటూరు, రాజంపేట, జమ్ములమడుగు, పులివెందల, బద్వేల్, రాయచోటి, సిద్ధవటం.

జిల్లా కేంద్రనగరం : కడప.

జిల్లాబోర్డు ప్రెసిడెంటు : టి. పుల్లారెడ్డి.

## కర్నూలు

వైశాల్యం : 7,793 చ. మైళ్లు; జనాభా, 12,64,154; పురుషులు 6,41,006 ; స్త్రీలు, 6,23,148.

జిల్లాలో భూమి 50,03,244 ఎకరాలు, దీనిలో అడవి 16,60,142 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 2,95,877. ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 6,49,716 ఎకరాలు,

1949-50 లో పంటవేసిన భూమి 20,77,529 ఎకరాలు. దీనిలో నీటి తీరువపొందిన భూమి, 1,20,004 ఎకరాలు. రెండుసార్లు పంటవేసిన భూమి, 65,391 ఎకరాలు. ఇదికలిపితే మొత్తం వ్యవసాయం జరిగిన భూమి. 21,42,920 ఎకరాలు.

జిల్లాలలో 1,02,031 ఎకరాలలో వరి; 5,56,729 ఎకరాలలో జొన్నలు, 66,479 ఎకరాలలో సజ్జలు; 18,547 ఎకరాలలో రాగులు; 3,97,405 ఎకరాలలో కొర్రలు; 1,99,826 ఎకరాలలో అపర దినుసులు, 3,94,498 ఎకరాలలో వేరుశెనగ, 29,419 ఎకరాలలో ఆముదము; 38,250 ఎకరాలలో మిరప పంటలు వేయబడినవి.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటితీరువపన్ను ప్రభుత్వాదాయం రూ. 29,15,000,

తాలూకాలు పది; కర్నూలు, ద్రోణాచలం, నంద్యాల, పత్తికొండ, నందికొట్కూరు, సిరువెళ్ళ, కంబం, మార్కాపురం, కోయిలకుంట్ల, బంగనపల్లి.

జిల్లా కేంద్రనగరం: కర్నూలు.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్ : బి. వి, సుబ్బారెడ్డి.

## కృష్ణ

వైశాల్య : 3,469 చ. మైళ్లు; జనాభా, 17,79,760; పురుషులు 9,04,715; స్త్రీలు, 8,75,045,

జిల్లాలో భూమి 22,19,847 ఎకరాలు. దీనిలో అడవి 1,25,550 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది, 3,07,150 ఎకరాలు, వ్యవసాయం చెయ్యకుండా వున్న బీడు 2,50,947 ఎకరాలు. 1949-50 లో పంటవేసిన భూమి 12,40,951 ఎకరాలు. దీనిలో నీటితీరువ పొందిన భూమి, 7,31,109 ఎకరాలు. రెండుసార్లు పంటవేసిన భూమి, 1,21,944 ఎకరాలు. ఇదికలిపితే మొత్తం వ్యవసాయం జరిగిన భూమి 24,62,895 ఎకరాలు.

జిల్లాలో 6,95,232 ఎకరాలలో వరి. 2,11,697 ఎకరాలలో జొన్నలు, 14,296 ఎకరాలలో సజ్జలు, 1,91,831 ఎకరాలలో అపర దినుసులు, 10,042 ఎకరాలలో మిరపకాయలు, 1,22,844 ఎకరాలలో వేరుశెనగ, పంటలు వేయబడినవి.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువపన్ను ప్రభుత్వాదాయం, రూ, 55,69,266. ఇదికాక ఎస్టేట్ సెస్సువల్ల వచ్చినది, రూ. 1,11,189,

తాలూకాలు తొమ్మిది: బందరు, విజయవాడ, నూజివీడు, నందిగామ, కైకలూర్, గుడివాడ, దివి, గన్నవరం, తిరువూరు.

జిల్లా కేంద్రనగరం; మచిలీపట్టణం.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్: కొకాని వెంకటరత్నం.

## కోయంబత్తూరు

వైశాల్యం: 7,121 చ. మైళ్లు, జనాభా, 32,94,849; పురుషులు, 16,56,181; స్త్రీలు, 16,38,668.

జిల్లాలో భూమి 45,51,876 ఎకరాలు, దీనిలో అడవి, 14,43,347 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 3,05,830 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 7,03,277 ఎకరాలు. దీనిలో నీటితీరువపొందినభూమి, 4,98,309 ఎకరాలు. రెండుసార్లు పంటవేసిన భూమి, 3,89,087 ఎకరాలు. ఇది కలిపితే మొత్తం పంట వేసిన భూమి, 20,75,147 ఎకరాలు.

జిల్లాలో 1,37,030 ఎకరాలలోవరి, 4,60,993 ఎకరాలలో జొన్నలు, 2,75 011 ఎకరాలలో సజ్జలు, 1,31,731 ఎకరాలలో రాగులు, 26,455 ఎకరాలలో కొర్రలు, 2,48,187 ఎకరాలలో అపర దినుసులు; 15,461 ఎకరాలలో చెరకు, 2,57,032 ఎకరాలలో వేరుశెనగ, 56,771 ఎకరాలలో నువ్వులు, 23,227 ఎకరాలలో పొగాకు పంట వేయబడింది.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటితీరువపన్ను మొత్తప్రభుత్వాదాయం, రూ. 44,830, ఇదికాక ఎస్టేట్ పేష్కుష్‌వల్ల వచ్చినది 22,769

తాలూకాలు పది : జిల్లా కేంద్రనగరం, కోయంబత్తూరు.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్ : వి. కె. పళనిస్వామి గౌండర్,

## గుంటూరు

వైశాల్యం : 5,795 చ. మైళ్ళు; జనాభా, 2542,244; పురుషులు, 12,87,424; స్త్రీలు, 12,54,820.

జిల్లాలో భూమి, 36,89,980 ఎకరాలు. దీనిలో అడవి, 4,68,862 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది, 3,75,095, ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 1,19,395 ఎకరాలు, 1949-50 లో పంటవేసిన భూమి, 21,84,856 ఎకరాలు. దీనిలో నీటి తీరువపొందిన భూమి, 4,52,000 ఎకరాలు. రెండవపంటవేసిన భూమి, 2,44,412 ఎకరాలు. దీనితో కలిసి మొత్తం పంటవేసిన భూమి, 24,29,268 ఎకరాలు.

జిల్లాలో. 4,77,373 ఎకరాలు వరి; 4,59,229 ఎకరాలలో జొన్నలు; 1,65,176 ఎకరాలలో సజ్జలు; 12,056 ఎకరాలలో రాగులు; 61,602 ఎకరాలలో కొర్రలు; 1,75,517 ఎకరాలలో అపరదినుసులు; 40,657 ఎకరాలలో మిరపకాయలు; 1,77,034 ఎకరాలలో వేరుశనగ; 26,453 ఎకరాలలో అముదము, 1,85,504 ఎకరాలలో పొగాకువేయబడినది.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువపన్ను, ప్రభుత్వాదాయం. రూ. 79,83,718.

తాలూకాలు తొమ్మిది : గుంటూరు, ఒంగోలు, బాపట్ల, తెనాలి, రేపల్లి, సరసరావుపేట, పల్నాడు, వినుకొండ, సత్తెనపల్లి.

జిల్లా కేంద్రనగరం : గుంటూరు.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్ : నల్లూరి రాజయ్య .

## చంగల్పట్టు

వైశాల్యం, 3,074 చ. మైళ్లు: జనాభా, 18,39,896; పురుషులు, 9,33,407; స్త్రీలు, 9,06,489.

జిల్లాలో భూమి, 19,53,079 ఎకరాలు. దీనిలో అడవి 1,20,834 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 2,12,937 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 83,578 ఎకరాలు. 1949-50 లో పంటవేసిన భూమి, 6,91,203 ఎకరాలు. దీనిలో నీటి తీరువ పొందిన భూమి, 4,23,936 ఎకరాలు. రెండవపంట వేసిన భూమి, 1,47,715 ఎకరాలు, దీనితోకలిపి మొత్తం పంటవేసినభూమి, 8,38,918 ఎకరాలు.

జిల్లాలో 5,50,587 ఎకరాలలో వరి; 92,693 ఎకరాలలో రాగులు; 12,466 ఎకరాలలో అపరదినుసులు; 40,713 ఎకరాలలో వేరుశనగ పంట వేయబడింది.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటితీరువ పన్నువల్ల ప్రభుత్వాదాయం, రూ. 19,56,322. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది, రూ. 54,214.

తాలూకాలు ఏడు. జిల్లా కేంద్రనగరం చంగల్పట్టు.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్ : వి. కె. రామస్వామి మొదలియార్.

## చిత్తూరు

వైశాల్యం, 5,951 చ. మైళ్లు; జనాభా, 18,08,725; పురుషులు, 9,24,341; స్త్రీలు, 8,84,384.

జిల్లాలో భూమి, 37,74,290 ఎకరాలు. దీనిలో అడవి, 5,23,755 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 14.58,266 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 6,22,268 ఎకరాలు. 1949-50 లో పంటవేసినభూమి 7,39,396 దీనిలో నీటితీరువ పొందిన

భూమి. ,14,790 ఎకరాలు. రెండవపంట వేసిన భూమి, 2,04,355 ఎకరాలు. దీనితో కలిపి మొత్తం పంట వేసినభూమి, 9,43,661 ఎకరాలు, జిల్లాలో 2,50,636 ఎకరాలలో వరి; 33,864 ఎకరాలలో జొన్నలు, 1,38,873 ఎకరాలలో సజ్జలు; 1,41,704 ఎకరాలలో రాగులు; 38,104 ఎకరాలలో అపరదినుసులు; 2,23,363 ఎకరాలలో వేరుశనగ పంట వేయబడినవి.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం రూ. 9,10,294. ఇదికాక ఎస్టేట్ పేష్కుష్‌వల్ల వచ్చినది, రూ. 8,143.

తాలూకాలు తొమ్మిది: చిత్తూరు, మదనపల్లి, వాయల్పాడు, కాళహస్తి, పుత్తూరు, పుంగనూరు, తిరుత్తణి, పలమనేరు, చంద్రగిరి.

జిల్లా కేంద్రనగరం: చిత్తూరు.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్: ఎన్. పి. చెంగల్రాయనాయుడు.

## తంజావూరు

వైశాల్యం, 3,738 చ. మైళ్లు; జనాభా, 29,79,754; పురుషులు, 14,68,904; స్త్రీలు, 14,60,734,

జిల్లాలో భూమి, 23,97,981 ఎకరాలు. దీనిలో అడవి 30,390 ఎకరాలుపోగా, వ్యవసాయానికిరానిది, 3,54,706 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 1,19,245 ఎకరాలు, 1949-50 లో పంట వేసిన భూమి, 14,02,488 ఎకరాలు. దీనిలో నీటితీరువపొందిన భూమి, 12,04,615 ఎకరాలు. రెండవ పంటవేసిన భూమి, 2,73,476 ఎకరాలు. దీనితోకలిపి, మొత్తం పంటవేసిన భూమి, 16,75,959 ఎకరాలు. జిల్లాలో 13,50,105 ఎకరాలలో వరి, 12,090 ఎకరాలలో రాగులు, 1,04,378 ఎకరాలలో అపరదినుసులు, 43,034 ఎకరాలలో వేరుశనగ, పంటలు వేయబడినవి.

జిల్లా మొత్తంమీద, భూమిపన్ను, నీటితీరువ పన్నులవల్ల ప్రభుత్వాదాయం, రూ. 1,09,46,139. ఇదికాక ఎస్టేట్ పేష్కష్ వల్ల వచ్చినది, రూ. 63,909.

తాలూకాలు పదకొండు. జిల్లా కేంద్రనగరం, తంజావూరు.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్ : వి. నాడి ముత్తుపిళ్ళై.

## తిరుచిరాపల్లి

వైశాల్యం, 5,514 చ. మైళ్లు; జనాభా, 29,42,225; పురుషులు 14,60,734; స్త్రీలు, 14,81,491.

జిల్లాలో భూమి, 34,90,620 ఎకరాలు. దీనిలో అడవి, 1,68,359 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది, 2,42,451 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 3,17,863 ఎకరాలు. 1949-50 లో పంటవేసిన భూమి, 16,03,414 ఎకరాలు. దీనిలో నీటితీరువపొందిన భూమి, 4,35,234 ఎకరాలు. రెండవపంట వేసిన భూమి, 1,87,006 ఎకరాలు, మొత్తం పంటవేసిన భూమి 17,90420 ఎకరాలు.

జిల్లాలో 4,70,901 ఎకరాలలో వరి, 2,91,569 ఎకరాలలో జొన్నలు, 2,16,637 ఎకరాలలో సజ్జలు, 1,03,327 ఎకరాలలో అపరదినుసులు, 1.95,880 ఎకరాలలో వేరుశనగ, 1,03,327 ఎకరాలలో నువ్వులు, పంటవేయబడినవి. జిల్లా మొత్తంమీద, భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం, రూ. 49,30,732. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది. రూ. 55,863.

తాలూకాలు ఎనిమిది: జిల్లా కేంద్రనగరం, తిరుచినాపల్లి.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్ : పి. బి. క. రాజచిదంబరం రెడ్డియార్.

## తిరునెల్వేలి

వైశాల్యం, 4,342 చ. మైళ్లు; జనాభా, 24,47,949; పురుషులు, 11,89,232; స్త్రీలు, 12,58,717.

జిల్లాలో భూమి, 27,76,422 ఎకరాలు. దీనిలో అడవి, 3,04,024 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 1,42,238 ఎకరాలు వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 3,30,210 ఎకరాలు. 1949-50 లో పంటవేసిన భూమి, 9,68,462 ఎకరాలు. దీనిలో నీటితీరువపొందిన భూమి, 3,03,351 ఎకరాలు. రెండవపంటవేసిన భూమి, 1,77,690 ఎకరాలు. దీనితో కలిపి మొత్తం పంటవేసిన భూమి, 11,46,152 ఎకరాలు, జిల్లాలో 2,92,770 ఎకరాలలో ఎకరాలలో వరి, 77,117 ఎకరాలలో జొన్నలు 1,34,359 ఎకరాలలో సజ్జలు, 23,220 ఎకరాణలో రాగులు, 80,816 ఎకరాలలో అపర దినుసులు, 35,466 ఎకరాలలో నువ్వులు పంటవేయబడినవి.

జిల్లా మొత్తంమీద భూమి పన్ను, నీటితీరువ పన్నువల్ల ప్రభుత్వాదాయం రూ. 38,16,789 ఇదికాక, ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది రూ. 1,38,174.

తాలూకాలు ఏడు: జిల్లాకేంద్రనగరం, తిరునెల్వేలి (తిన్నెవెల్లి)

కలెక్టర్ : ఆర్. ఎస్. సుబ్బయ్యపిళ్లె.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్ : డి. ఎస్. ఆదిమూలం.

## తూర్పుగోదావరిజిల్లా

వైశాల్యం, 6,322 చ. మైళ్లు. జనాభా, 24,06,352. వీరిలో పురుషులు, 12,02,830; స్త్రీలు, 12,03,522.

జిల్లాలో 3,575 చ. మైళ్ల ప్రదేశం ఏజన్సీ. దీనిలో జనాభా 2,71,569 మందిలోనూ 4,36,213 మంది పురుషులు; 1,35,356 మంది స్త్రీలు.

జిల్లాలో భూమి, 36,39,741 ఎకరాలు. దీనిలో అడవి 8,64,855 ఎకరాలుపోగా, 7,54,544 ఎకరాలు వ్యవసాయానికి రానిది. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 4,04,463 ఎకరాలు. 1949-50 లో పంటవేసిన భూమి 10,18,225 ఎకరాలు. దీనిలో

నీటితీరువపొందిన భూమి. 5,72,355 ఎకరాలు. రెండవపంటవేసిన భూమి, 3,26,264 ఎకరాలు. దీనితో కలిపి మొత్తం పంటవేసిన భూమి, 13,44,489 ఎకరాలు. జిల్లాలో 7.18,205 ఎకరాలలో వరి 71,268 ఎకరాలలో జొన్నలు, 45,521 ఎకరాలలో సజ్జలు, 15,722 ఎకరాలలో రాగులు 1,63,137 ఎకరాలలో అపరదినుసులు, 20,749 ఎకరాలలో మిరప, 76,804 ఎకరాలలో నువ్వులు పంటవేయబడినవి.

జిల్లా మొత్తంమీద, భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం, రూ. 71,37,823 ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది, రూ. 4,78,357.

తాలూకాలు పన్నెండు: రామచంద్రపురం, రాజమండ్రి, కాకినాడ, తుని, రాజోలు, పెద్దాపురం, అమలాపురం, భద్రాచలం. నూగూరు, యల్లవరం, చోడవరం, పిఠాపురం.

జిల్లా కేంద్రనగరం: కాకినాడ; జిల్లాకోర్టు మాత్రం, రాజమండ్రిలోవుంది.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్: మూరిన నరసన్న.

## దక్షిణకన్నడ

వైశాల్యం 4,045 చ. మైళ్లు; జనభా 17,46,118: పురుషులు 8,40,540; స్త్రీలు, 9,05,578.

జిల్లాలో భూమి, 25,65,299 ఎకరాలు. దీనిలో అడవి, 5,15,101 ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది, 3,23,122 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 1,96,949 ఎకరాలు. 1949-50 లో పంటవేసిన భూమి, 5,74,192 ఎకరాలు. రెండవపంట వేసినభూమి, 1,95,889 ఎకరాలు. దీనితోకలిపి మొత్తం పంటవేసిన భూమి, 7,70,081 ఎకరాలు.

జిల్లాలో 5,41,154 ఎకరాలలో వరి, 44,866 ఎకరాలలో అపర దినుసులును, 13,300 ఎకరాలలో మిరియాలు, 899 ఎకరాలలో అల్లం, పంటలు వేయబడినవి.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువ పన్నువల్ల ప్రభుత్వాదాయం రు. 36,13,091.

తాలూకాలు ఆరు. జిలా కేంద్రనగరం, మెంగళూర్.

జిలాబోర్డు ప్రెసిడెంట్ : బి. మంజయ్యాహెగ్డే.

## దక్షిణార్కాడు

వైశాల్యం, 4,025 చ. మైళ్లు; జనాభా, 27,66,468; పురుషులు, 13,86,477; స్త్రీలు, 13,7,9991.

జిల్లాలో భూమి, 26,93,024 ఎకరాలు. దీనిలో అడవి 1,58,618 ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది 3,79,515 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 1,66,983 ఎకరాలు. 1949-50 లో పండవేసిన భూమి, 13,80,399 ఎకరాలు. దీనిలో నీటి తీరువపొందినభూమి, 4,84,741 ఎకరాలు. రెండవపంటవేసిన భూమి, 1,94,098 ఎకరాలు. దీనితోకలిపి మొత్తం పంటవేసినభూమి, 15,74,498 ఎకరాలు.

జిల్లాలో 5,34,976 ఎకరాలలో వరి, 1,17,537 ఎకరాలలో జొన్నలు, 1,25,305 ఎకరాలలో సజ్జలు, 77,466 ఎకరాలలో రాగులు 36,227 ఎకరాలలో అపరదినుసులు, 3,52,936 ఎకరాలలో వేరుశనగ, 36,496 ఎకరాలలో నువ్వులుపంట వేయబడినవి.

జిల్లా మొత్తంమీద, భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం, రు. 47,69,987. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది. రు. రు. 3771.

తాలూకాలు ఎనిమిది : జిల్లా కేంద్రనగరం, కడలూర్.

జిలాబోరు ప్రెసిడెంట్ : పి. ఆర్. శ్రీనివాస పడయాచి.

## నీలగిరి

వైశాల్యం, 985 చ, మైళ్లు. జనాభా, 3,12, 172 ; పురుషులు, 1,64.834 ; స్త్రీలు, 1,47,341.

జిల్లాలో భూమి, 6,28,942 ఎకరాలు. దీనిలో అడవి, 3,46,371 ఎకరాలు పోగా వ్యవసాయానికి రానిది, 13,305 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 68,349 ఎకరాలు. 1949-50 లో పంటవేసిన భూమి, 99,649 ఎకరాలు.

జిల్లాలో 6,881 ఎకరాలలో వరి, 3,837 ఎకరాలలో రాగులు, 565 ఎకరాలలో అపరదినుసులు, 2,260 ఎకరాలలో సుగంధద్రవ్యములు, 18,273 ఎకరాలలో బంగాళాదుంపలు. పంటవేయబడినవి.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం రు. 2,55,224.

తాలూకాలు : కూనూర్, ఉదకమండలం, గూడలూర్ జిల్లా కేంద్రనగరం, ఉదకమండలం.

జిల్లాబోర్డ్ ప్రెసిడెంట్ ; ఎన్. ఎం. లింగం.

## నెల్లూరు

వైశాల్యం, 7,942 చ. మైళ్లు ; జనాభా, 17,93,774 ; పురుషులు 9,03,432 ; స్త్రీలు, 8,90,432.

జిల్లాలోభూమి, 50,87,200 ఎకరాలు. దీనిలో అడవి, 4,73,222 ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది 17,50,640 ఎకరాలు. వ్యవసాయంచెయ్యకుండా వున్న బీడు, 18,094 ఎకరాలు. 1949-50 లో పంటవేసిన భూమి, 13,45,758 ఎకరాలు.

దీనిలో నీటి తీరువ పొందిన భూమి, 5,61,803 ఎకరాలు.

రెండవపంట వేసినభూమి, 1.70,531 ఎకరాలు. దీనితో కలిపి మొత్తం పంటవేసినభూమి, 15,17,289 ఎకరాలు.

జిల్లాలో 4,31,981 ఎకరాలలో వరి, 3,54,729 ఎకరాలలో జొన్నలు, 1,17,179 ఎకరాలలో సజ్జలు, 83,090 ఎకరాలలో రాగులు, 1,28,407 ఎకరాలలో అపరదినుసులు, 14,317 ఎకరాలలో మిరపకాయలు, 20,071 ఎకరాలలో వేరుశనగ పంట వేయబడినవి.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను నీటితీరువ పన్నులవల్ల ప్రభుత్వాదాయం 35,33,183. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది, రు. 19,054.

తాలూకాలు తొమ్మిది ; నెల్లూరు, కోవూరు, కావలి, గూడూరు ఉదయగిరి, కనిగిరి, రాపూరు, ఆత్మకూరు, కందుకూరు.

జిల్లాకేంద్రనగరం: నెల్లూరు.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్ : ఎస్. చెంచురామనాయుడు.

## పడమటి గోదావరి

వైశాల్యం, 2,434 చ. మైళ్లు ; జనాభా, 16,97,892 ; పురుషులు, 8,51,012 ; స్త్రీలు, 8,46,880.

జిల్లాలో భూమి, 19,25,887 ఎకరాలు. దీనిలో అడవి, 1,16,485 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది, 1,79,836 ఎకరాలు. వ్యవసాయం చెయ్యని బీడు 2,15,591 ఎకరాలు. 1949-50 లో పంటవేసినభూమి, 9,01,879 ఎకరాలు. దీనిలో నీటితీరువ పొందిన భూమి, 8,38,184 ఎకరాలు. రెండవపంట వేసిన భూమి, 2,43,058 ఎకరాలు. దీనితోకలిపి మొత్తం పంటవేసిన భూమి, 11,44,937 ఎకరాలు.

జిల్లాలో 7,85,844 ఎకరాలలో వరి, 47,957 ఎకరాలలో జొన్నలు, 77,445 ఎకరాలలో అపరదినుసులు, 12,090 ఎకరాలలో మిరపకాయలు, 14,424 ఎకరాలలో వేరుశనగ, 75,589 ఎకరాలలో నువ్వులు, పంట వేయబడినవి.

జిలా మొత్తంమీద భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం, రు' 65,31,181. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది, రు. 1,09,811.

తాలూకాలు ఎనిమిది : ఏలూరు, తాడేపల్లిగూడెం, భీమవరం, పోలవరం, నర్సాపురం, కొవ్వూరు, చింతలపూడి, తణుకు

జిలా కేంద్రనగరం: ఏలూరు.

జిల్లా బోర్డు ప్రెసిడెంట్ : మాగంటి సీతారామదాస్.

## బళ్ళారి

వైశాల్యం, 5,882 చ. మైళ్లు. జనాభా, 12,40,988. పురుషులు, 6,31,706 ; స్త్రీలు, 6,09,282.

జిల్లాలో భూమి 36,80,447 ఎకరాలు. దీనిలో అడవి, 3,65,215 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 2,01,529 ఎకరాలు. వ్యవసాయం చెయ్యనివీడు, 2,51,810 ఎకరాలు. 1949-50 లో పంట వేసిన భూమి, 23,69,040 ఎకరాలు. దీనిలో నీటితీరువ పొందిన భూమి, 65,125 ఎకరాలు. రెండవపంట వేసిన భూమి, 1,40,940 ఎకరాలు. దీనితో మొత్తం పంటవేసినభూమి, 25,90,980 ఎకరాలు.

జిల్లాలో 36,356 ఎకరాలలో వరి, 6,99,523 ఎకరాలలో జొన్నలు 1,19,647 ఎకరాలలో సజ్జలు, 23,110 ఎకరాలలో రాగులు, 4,22,352 ఎకరాలలో కొర్రలు, 1,97,915 ఎకరాలలో అపరదినుసులు, 3,05,717 ఎకరాలలో వేరుశనగ. 14,415 ఎకరాలలో నువ్వులు పంట వేయబడినవి.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను. నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం రు. 26,17,156.

తాలూకాలు పది ; బళ్ళారి, సిరుగుప్ప, రాయదుర్గం, హొస్పేట, కుడ్లిగి, ఆదోని, హడగలి, హర్పనావల్లి, ఆలూరు, సాందూర్.

జిల్లా కేంద్రనగరం : బళ్లారి.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్ : వై. మహాబలేశ్వరప్ప.

## మదరాసు

వైశాల్యం, 52 చ. మైళ్లు ; జనాభా, (1951) 14,29,985 ; వీరిలో పురుషులు, 7,47,135 ; స్త్రీలు 6,82,850.

జిల్లాలోని భూమిలో వ్యవసాయానికి పనికివచ్చేభూమి ఏమీలేదు. అక్కడక్కడ మల్లెకట్టి, చోళ్లు రాగులు పండించే భూమి స్వల్పం. దీనివల్ల వచ్చే ఆదాయం 1949-50 లో రు. 1,90,868.

## మ ధు ర

వైశాల్యం, 4,883 చ. మైళ్లు ; జనాభా, 28,84,994 ; పురుషులు, 14,34,022 ; స్త్రీలు, 14,50,972.

జిల్లాలో భూమి, 31,15,718 ఎకరాలు. దీనిలో అడవి, 3,94,145 ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది, 2,03,312 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 1,36,463 ఎకరాలు. 1949-50 లో పంటవేసినభూమి 11,69,243 ఎకరాలు. దీనిలో నీటి తీరువ పొందినభూమి, 5,14,476 ఎకరాలు,

రెండవపంటవేసినభూమి, 19,9734 ఎకరాలు. దీనితో కలిపి మొత్తం పంటవేసినభూమి, 13,68,977 ఎకరాలు.

జిల్లాలో 3,39,902 ఎకరాలలో వరి, 3,32,752 ఎకరాలలో జొన్నలు, 44,449 ఎకరాలలో సజ్జలు, 47,144 ఎకరాలలో రాగులు, 86,095 ఎకరాలలో అపరదినుసులు, 1,28,901 ఎకరాలలో వేరుశనగ 29,581 ఎకరాలలో నువ్వులు పంటవేయబడినవి.

జిల్లా మొత్తంమీద, భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం రు. 39,21,684, ఇదికాక ఎస్టేట్ పేష్కుష్‌వల్ల వచ్చినది, రు. 58,652.

తాలూకాలు ఏడు. జిల్లాకేంద్రనగరం, మధుర.

జిల్లా బోర్డు ప్రెసిడెంట్ : ఎస్. ఆర్. త్యాగరాజన్.

## మ ల బా రు

వైశాల్యం, 5,790 చ. మైళ్లు. జనాభా, 47,58,886 ; పురుషులు, 23,19,051, స్త్రీలు, 24,39,835.

జిల్లాలో భూమి, 37,13,011 ఎకరాలు. దీనిలో అడవి, 6,16, 842 యెకరాలు పోగా, వ్యవసాయానికి రానిది, 2,35,740 యెకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 5,61,466 యెకరాలు. 1949-50 లో పంటవేసిన భూమి, 15,79,654 యెకరాలు.

రెండవపంటవేసినభూమి, 2,76,899 యెకరాలు. దీనితో కలిపి మొత్తం పంటవేసినభూమి, 18,56,453 యెకరాలు. జిల్లాలో 8,35,583 యెకరాలలో వరి, 28,250 యెకరాలలో అపరదినుసులు, 55,151 యెకరాలలో మిరియాలు, 9,432 యెకరాలలో అల్లం, 22,517 యెకరాలలో ఇతర సుగంధ ద్రవ్యములు పంటవేయబడినవి.

జిల్లా మొత్తంమీద, భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం, రు. 59,52,309.

తాలూకాలు పది ; జిల్లా కేంద్రనగరం, కాలికట్.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్ : ఏం. ఎ. ముకుందన్.

## రా మ నా థ ం

వైశాల్యం, 4,854 చ. మైళ్లు ; జనాభా, 20,78,750 ; పురుషులు, 9,96,582 ; స్త్రీలు; 10,82,868.

జిల్లాలో భూమి 30,88,090 యెకరాలు. దీనిలో అడవి 99,116 యెకరాలు పోగా, వ్యవసాయానికి రానిది, 2,77,564 యెకరాలు, వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 6,06,240 యెకరాలు. 1949-50 లో పంటవేసినభూమి 9,60,342 యెకరాలు. దీనిలో నీటితీరువపొందినభూమి, 3,65,750 యెకరాలు. రెండవపంటవేసిన భూమి, 20,981 యెకరాలు, దీనితో కలిపి మొత్తం పంటవేసిన భూమి, 9,81,322 యెకరాలు. జిల్లాలో 3,31,499 యెకరాలలో వరి, 52,505 యెకరాలలో జొన్నలు, 85,172 యెకరాలు సజ్జలు, 70,062 యెకరాలలో రాగులు, 26,807 యెకరాలలో అపరదినుసులు 14,546 యెకరాలలో మిరపకాయలు, 58,696 యెకరాలలో వేరుశనగ, పంటలు వేయబడినవి.

జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం, రు. 15,34,200. ఇదికాక ఎస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది. రు. 2,70,767.

తాలూకాలుతొమ్మిది. జిల్లాకేంద్రనగరం. రామనాధం(రామ్నాడ్)

జిల్లాబోర్డు ప్రెసిడెంట్ : ఎ. ఓ. ఏస్. పి. ఉదయప్ప.

## విశాఖపట్టణం

వైశాల్యం : 9,107 చ. మైళ్ళు. జనాభా, 20,71,671 వీరిలో పురుషులు 10,131,43 స్త్రీలు, 10,48,518.

జిల్లాలోభూమి, 26,31,505 యెకరాలు. దీనిలో అడవి 10,76,969 యెకరాలుపోగా, వ్యవసాయానికి రానిది, 1,95,837 యెకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 89,056 ఎకరాలు. 1949-50 లో పంటవేసినభూమి 5,92,626 ఎకరాలు. దీనిలో నీటితీరువపొందిన భూమి, 3,17,050 ఎకరాలు. రెండవపంట వేసినభూమి, 4,30,542 ఎకరాలు. దీనితో కలిపి మొత్తం పంటవేసినభూమి, 10,23,168 ఎకరాలు. జిల్లాలో 3,00.425 ఎకరాలలో వరి, 37,980 ఎకరాలలో జొన్నలు, 1,64,170 ఎకరాలలో సజ్జలు, 91,175 ఎకరాలలో రాగులు, 1,26,563 ఎకరాలలో అపరదినుసులు, 30,398 ఎకరాలలో చెరకు, 85,074 ఎకరాలలో వేరుశనగ, 72,848 ఎకరాలలో మవ్వులు పంటవేయబడినవి.

జిల్లామొత్తంమీద భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం, రు. 25,28,653. ఇదికాక ఎస్టేట్‌పేష్కష్‌వల్ల వచ్చినది, రు. 1,89,869.

తాలూకాలు తొమ్మిది : గోలుకొండ, సర్వసిద్ధి, వీరవల్లి, అనకాపల్లి, విశాఖపట్టణం, శృంగవరపుకోట, విజయనగరం, భీమునిపట్టణం, గూడెంతాలూకాలు.

జిల్లా కేంద్రనగరం: విశాఖపట్టణం.

కలెక్టర్ : వి. కె. రావు.

జిల్లాబోర్డు ప్రెసిడెంటు : జి. ఓ. అప్పారావు.

## శ్రీ కా కు ళం

జనాభా 21,95,847 ; వీరిలో పురుషులు 10,26,688 స్త్రీలు, 10,79,159.

ఇది 1950 జులై లో ప్రత్యేకంగా జిల్లాగా ఏర్పాటు చేయబడింది. అంతకుపూర్వం విశాఖపట్టణం జిల్లాలో ఒక భాగంగా వుండేది.

జిల్లాలో భూమి 24,83,968 ఎకరాలు ; దీనిలో అడవి 5,40,333 ఎకరాలు వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 3 08,237 ఎకరాలు. 1919-50 లో పంటవేసిన భూమి 8,30,907 ఎకరాలు. దీనిలో నీటివసతిపొందిన భూమి 5,26,137 ఎకరాలు. రెండవపంట వేసినభూమి 2,65,955 ఎకరాలు. దీనితో కలిపి మొత్తం పంటపండిన భూమి 1,0,96,862 ఎకరాలు. జిల్లాలో 5,02,006 ఎకరాలలో వరి, 13,868 ఎకరాలలో జొన్నలు, 30,601 ఎకరాలలో సజ్జలు, 1,05,241 ఎకరాలలో రాగులు, 1,49,469 ఎకరాలలో అపర దినుసులు, 20,569 ఎకరాలలో చెరకు, 83,068 ఎకరాలలో వేరుశనగ 31,932 ఎకరాలలో నువ్వులు పంటవేయబడినవి.

తాలూకాలు, పది : ఇచ్ఛాపురం, సోంపేట, టెక్కలి, నరసన్నపేట, పాతపట్నం, శ్రీకాకుళం, పాలకొండ, పార్వతీపురం, బొబ్బిలి, సాలూరు.

జిల్లాకేంద్రనగరం : శ్రీకాకుళం.

జిల్లాబోర్డు ప్రెసిడెంటు : రొక్కం లక్ష్మీనరసింహం.

## సే లం

వైశాల్యం 7073 చ. మైళ్లు ; జనాభా, 33,74,284 ; పురుషులు, 16,92,639 ; స్త్రీలు, 16,81,645.

జిల్లాలో భూమి, 44,76,668 ఎకరాలు. దీనిలో అడవి, 10,23,378 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది, 4,34,700 ఎక

రాలు, వ్యవసాయం చెయ్యకుండావున్నవీడు, 4,81,795 యెకరాలు. 1949-50 లో పంటవేసిన భూమి 15,78,146 యెకరాలు. దీనిలో నీటి తీరువపొందిన భూమి, 2,55,857 యెకరాలు. రెండవపంటవేసిన భూమి, 2,48,584 యెకరాలు. దీనితో కలిపి మొత్తం పంటవేసిన భూమి18,26,739 యెకరాలు.

జిల్లాలో 1,91,460 యెకరాలలో వరి, 2.49,574 యెకరాలలో జొన్నలు, 2,14,180యెకరాలలో సజ్జలు, 2,63,703 యెకరాలలో రాగులు, 2,63,478 యెకరాలలో అపరదినుసులు, 9,454 యెకరాలలో మిరపకాయలు, 2,00,213 యెకరాలలో వేరుశనగ, 66,987 యెకరాలలో నువ్వులు పంటలు వేయబడినవి.

జిల్లామొత్తంమీద, భూమిపన్ను, నీటి తీరువపన్నులవల్ల ప్రభుత్వాదాయం, రు. 39,04,927. ఇదిగాక, యెస్టేట్ పేష్కష్‌వల్ల వచ్చినది, రు. 3,54,477.

తాలూకాలు తొమ్మిది జిల్లాకేంద్రనగరం, సేలం.

జిల్లాబోర్డు ప్రెసిడెంట్ : కె. ఎస్. సుబ్రహ్మణ్యం.

# స్థానిక సంస్థలు

1951 లో మదరాసు రాష్ట్రంలో 25 జిల్లాబోర్డులూ, 98 మునిసిపల్ కౌన్సిళ్లూ, 485 పెద్ద పంచాయితీలు, 8,074 చిన్న పంచాయితీలు ఉన్నాయి.

## జిల్లా బోర్డులు

1949-50 లో రాష్ట్రంలోని 24 జిల్లాబోర్డులకు, ప్రభుత్వపు గ్రాంటులతో సహా వచ్చిన ఆదాయం రు.7,36,35,000 ఈ జిల్లాబోర్డులన్నీ, ఆ సంవత్సరంలో తమ పరిపాలనకు మొత్తం రు. 7,30,00,000 ఖర్చుపెట్టాయి. 1949-50 లో రాష్ట్రంలోని జిల్లాబోర్డులన్నీ మొత్తం 525 సెకండరీస్కూళ్ళనూ, 16,384 యెలిమెంటరీస్కూళ్ళనూ, నడి

న్నాయి, ఈ ఎలిమెంటరీ స్కూళ్ళలో 12,890 మగపిల్లలవీ, 2,121 ఆడపిల్లలవి. ఆ సంవత్సరంలో, సెకండరీస్కూళ్ళలో చదువుతున్నవారి సంఖ్య, 1,36,159. ఎలిమెంటరీస్కూళ్ళలో చదువుతున్నవారు 15,07,040. ఈ స్కూళ్ళను నడపడానికి జిల్లాబోర్డులకు మొత్తం రు. 3,97,8[illegible],000 ఖర్చుఅయింది, దీనిలో రు. 1,43,47,000 గవర్నమెంటు వారు ఇచ్చారు.

1949-50 లో జిల్లాబోర్డుల అజమాయిషీ క్రిందవున్న రోడ్ల మొత్తం పొడవు, 25,338 మైళ్లు. వీటి నిర్వహణకు 1,80,48,000 రూపాయలు ఖర్చు అయింది.

గుంటూరు జిల్లాబోర్డువారి సొంతమైన రేపల్లి-తెనాలి రైలుదారి వల్ల ఆ బోర్డుకు రు. 85,000 నికరఆదాయం వచ్చింది. రైలుదారిని కొనడానికి జిల్లాబోర్డు పెట్టిన పెట్టుబడిమీద నూటికి 5.4 వంతులవడ్డీ కిట్టించున్నమాట. ఈ రైలువారి పొడవు 21 మైళ్ళు.

తిన్నెవెల్లి-కోయంబత్తూరు జిల్లాబోర్డులు రెండూ కలిసి ఉమ్మడిగా కొన్న, 38 మైళ్లపొడవుగల తిన్నెవెల్లి-తిరుచెందూరు రైలుదారివల్ల ఆ బోర్డుకు రు. 2,72,000 నికరాదాయం వచ్చింది. ఇది పెట్టుబడిమీద నూటికి 9.9 వంతుల చేసె వడ్డీ అని అంచనా.

1949-50 లో రాష్ట్రంలోని జిల్లాబోర్డుల ఆధ్వర్యాన 66 హాస్పిటళ్లు, 752 డిస్పెన్సరీలు, 401 ఆయుర్వేద, యునాని వైద్యశాలలు నడుపబడినవి. వీటి నిర్వహణకు 55,61,000 రూపాయలు ఖర్చయింది.

రాష్ట్రంలోని జిల్లాలలో తిరునెల్వేలి, బళ్ళారిజిలాబోర్డులకు తప్ప, తక్కినవాటి అధ్యక్షులు కాంగ్రెస్‌వారే.

ఆంధ్రదేశంలోని జిల్లాబోర్డులన్నిటి సభ్యులసంఖ్య మొత్తం 478. ఈ స్థానాలకు పోటీచేసినవారిలో, కాంగ్రెసువారు 366 స్థానాలను గెలుచుకున్నారు. వీరిలో 173 మంది పోటీలేకుండా ఎన్నిక అయారు. మిగతా స్థానాలకు 103 మంది స్వతంత్రులూ, ఏడుగురు, సోషలిస్టులూ, ఇద్దరు కమ్యూనిస్టులూ ఎన్నిక అయారు.

## మునిసిపాలిటీలు

మదారాసు రాష్ట్రంలోని మునిసిపాలిటీల సంఖ్య 98 వాటిలో తెలుగు జిల్లాలలో వున్నవి 37. తెలుగుదేశంలోని వాటి వివరాలు యీ క్రింద ఇవ్వబడినవి.

| పేరు | చైర్మను |
|---|---|
| అనకాపల్లి | దాడి భోగలింగం |
| అనంతపురం | పప్పూరి రామాచార్యులు |
| అమలాపురం | కె. సూర్యనారాయణ |
| ఆదోని | ఆర్. సుబ్బయ్య |
| ఏలూరు | శీర్ల బ్రహ్మయ్య |
| ఒంగోలు | ధారా గోపాలశాస్త్రి |
| కడప | ప్రల్లకూర శేషయ్య శ్రేష్ఠి |
| కర్నూలు | ఎం. మహబూబ్ ఆలిఖాన్ |
| కాకినాడ | డాక్టర్ వై. సీతాపతిరావు |
| గుంటకల్ | పి. సి. తిమ్మారెడ్డి |
| గుంటూరు | సి. హెచ్. హనుమయ్య |
| గుడివాడ | కోగంటి వెంకటరత్నం |
| గూడూరు | |
| చికాకోల్ | డాక్టర్ జి. వెంకటరావునాయుడు |
| చిత్తూరు | సి. రఘుపతిచెట్టి |
| చీరాల | అన్నదాత నాగేంద్రుడు |
| తాడిపత్రి | సి. గోవిందప్ప |
| తిరుపతి | సి. ఎస్. రామయ్య శెట్టి |
| తెనాలి | ఎస్. వెంకటరావు |
| నంద్యాల | దేశాయి సుబ్బరావు |
| నరసరావుపేట | నాగసరపు కృష్ణమూర్తి |

| | |
|---|---|
| నెల్లూరు | ఆనం చెంచుసుబ్బారెడ్డి |
| పాలకొల్లు | ఏ. పి. గోపాలం |
| పెద్దాపురం | ముప్పన పెదవీరభద్రరావు |
| ప్రొద్దుటూరు | పి. ఎర్రమునిరెడ్డి |
| బళ్ళారి | పుండ్లూర్ గంగప్పచౌదరి |
| బాపట్ల | |
| బెజవాడ | డాక్టర్ తెన్నేటి చలపతిరావు |
| భీమవరం | జి. వెంకయ్యనాయుడు |
| భీమునిపట్టణం | కలిగొట సత్యనారాయణనాయుడు |
| మచిలీపట్టణం | డాక్టర్ పోతరాజు శోభనాచలపతిరావు |
| రాజమండ్రి | డాక్టర్ ఎ. వి. నాగేశ్వరరావు |
| విజయనగరం | భొట్టు సీతారామస్వామి |
| విశాఖపట్టణం | ఎ. వి. భానోజిరావు |
| సాలూరు | |
| హోస్పేట | పి. నాగలింగయ్య |
| హిందూపూర్ | కట్టా వెంకట శేషయ్యశెట్టి |

# మదరాసునగరం

1640 ఫిబ్రవరి 20 వ తేదిన, డే, కోగన్ అనే ఇద్దరు ఇంగ్లీషు వర్తకులు, ఈస్టిండియా కంపెనీ తరపున మదరాసు రేవుకువచ్చి అక్కడ ఫ్యాక్టరీని స్థాపించారు. అప్పుడు మదరాసురేవు ఉన్న ప్రాంతమంతా, చంద్రగిరి రాజాకు లోబడిన దామర్ల వెంకటపతినాయకుని అధికారములోవుంది. మదరాసు పట్టణాన్ని, ఇంగ్లీషువారికి, రెండు సంవత్సరాలకు కౌలుకు ఇస్తూ, వెంకటపతినాయకుడు ఇచ్చిన గ్రాంటు. 1639 ఆగష్టులో ఇవ్వబడింది. ఈ పట్టణానికి తన తండ్రి చెన్నప్ప నాయకుని పేర చెన్నపట్టణం అని పేరు పెట్టవలసిందని వెంకటపతి నాయకుడు, తను ఇచ్చిన గ్రాంటులో వ్రాశాడు.

ఇంగ్లీషువారు ఇక్కడ ఒక కోటకట్టి దానికి ఫోర్టుసెంట్ జార్జి అని పేరు పెట్టారు. క్రమేపీ దక్షిణదేశంలో ప్రబలుతూవచ్చిన ఇంగ్లీషు వారికి మదరాసు కేంద్రస్థానం అయింది.

1652 లో ఫోర్టు సెంట్ జార్జికి, ఈస్టిండియా కంపెనీవారు ఒక ప్రెసిడెంటును నియమించి, అతని అధికారంలోవున్న ప్రాంతాన్ని ప్రెసిడెన్సీ అని పిలువసాగారు. 1661 లో ఈ ప్రెసిడెంటుకు గవర్నరు అనే వ్యవహార నామం ఇవ్వబడింది. క్రమంగా మదరాసు నగరం పెరిగి, సమీపంలోవున్న మైలాపూర్, ఎగ్మూరు, తిరువళ్ళిక్కేణి చింతాద్రిపేట, పురశువాకం మొదలైన ప్రాంతాలన్నిటినీ దానిలో కలుపుకొన్నది. ప్రస్తుతం మదరాసు నగరం, భారతదేశం లోనికల్లా ఒక పెద్ద రాష్ట్రానికి రాజధానిగా వుంది.

భారతదేశంలోని పట్టణాలన్నిటిలోకీ ఎక్కువ వైశాల్యంగల పట్టణం మదరాసే. ఇటీవల క్రొత్తగా నగరంలో చేర్చబడిన పరిసర ప్రాంతాలతో కలిసి, ఈ నగరపు వైశాల్యం, 52 చదరపు మైళ్ళు.

1951 లో తీసిన జనాభా లెక్కల ప్రకారం 14,29,985 మంది ప్రజలు నగరంలోవున్నారు. పురుషులు 7,47,135 స్త్రీలు : 6,82,850. 1944 లో తీసిన జనాభా లెక్కలప్రకారం, నగరంలో 87,888 ఇళ్ళు వున్నాయనీ, జనాభా 7,77,481 అనీ తేలింది. కాని, 1943 తరువాత పొరుగూళ్ళ నుంచి విశేషంగా జనులువచ్చి మదరాసులో స్థావరం ఏర్పరచుకోవడంవల్లనూ 1944 నుంచి మదరాసులో అదనంగా పుట్టినవారివల్లనూ 1944 లో మదరాసు నగరంలో చేరని పరిసర ప్రదేశాలను 1946 లో మదరాసులో కలపినందువనూ మదరాసు జనాభా చాలా పెరిగింది.

మదరాసునగర పరిపాలనను కార్పొరేషను సాగిస్తున్నది. ఇక్కడ నగరపరిపాలనకు కార్పొరేషనుస్థాపించడం 688 లో జరిగింది. ఆ సంవత్సరం, సెప్టెంబరు 28 వ తేదీన మొట్టమొదటి

కార్పొరేషను నగరపరిపాలన బాధ్యత వహించింది. మొట్టమొదటి మేయరు మిస్టర్ డ్యానియల్ హిగ్గిన్సన్.

ప్రస్తుతం అమలులోవున్న 1919 మునిసిపల్ ఆక్టుప్రకారం మద్రాసు కార్పొరేషనుకు 85 మంది సభ్యులు ఎన్నుకోబడుతారు. కౌన్సిలర్లు సభ్యులుగా ఎన్నుకోబడతారు. కౌన్సిలర్లు సభ్యులుగావుండే పరిమితి మూడు సంవత్సరాలు. వీరుకాక ముగ్గురు సభ్యులు నామినేటు చేయబడినవారు వుంటారు. ఈ సభ్యులు ఒక మేయరును, డిప్యూటి మేయరును సంవత్సరాని కొకసారి ఎన్నుకుంటారు. కౌన్సిలు నిర్ణయించిన విధానాలను అమలుపరచడానికి, ప్రభుత్వం నియమించిన కమిషనరు పరిపాలనా వ్యవహర్తగా వుంటాడు.

ఈ కార్పొరేషను ఆధ్వర్యాన మదరాసు నగరంలో, 27 శిశు రక్షణ, ప్రసూతి సహాయ కేంద్రాలు వున్నాయి. 174 ఎలిమెంటరీ స్కూళ్ళు కార్పొరేషను ఆధ్వర్యాన మదరాసులో నడుపబడుతున్నాయి.

## 1951-52

మేయరు : టి. హెచ్. శిబ్గతుల్లా
డిప్యూటి మేయరు : శ్రీమతి అహల్య సంతానం
కమిషనర్ : రావుసాహెబ్ చళ్ళగిరి నరసింహం, ఎం.ఏ.బి.ఎల్
డిప్యూటి కమిషనర్ : ఎస్. శంకరన్, ఎం.ఏ., ఎల్.టి.

# రాష్ట్ర రాజకీయాలు

మదరాసురాష్ట్ర పరిపాలన 1937 వరకూ, ద్వంద్వప్రభుత్వ విధాన ప్రకారం జరిగింది. 1937 లో 1935 ఇండియాచట్టం అమలులోకి వచ్చింది. 1937 ఆరంభంలో జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు పక్షం అత్యధికబలాన్ని సంపాదించింది. కాని, 1935 చట్టంప్రకారం గవర్నరులకుగల ప్రత్యేకాధికారాలపట్ల ప్రతికూలాభిప్రాయాన్ని

ప్రకటిస్తూ, దేశంలో కాంగ్రెసు అధికసంఖ్యలో శాసనసభలకు ఎన్నుకోబడిన రాష్ట్రాలలో ఎక్కడాకూడా కాంగ్రెసువారు పదవులను స్వీకరించలేరు. తరువాత, సాధారణ పరిస్థితులలో గవర్నరులు తమ ప్రత్యేకాధికారాలను వినియోగించరనే హామీ బ్రిటిషు ప్రభుత్వం నుంచి పొంది, వివిధరాష్ట్రాలలో కాంగ్రెసు పక్షంవారు మంత్రివర్గాలను స్థాపించారు. మద్రాసు రాష్ట్రంలో శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారిగారి నాయకత్వాన మంత్రిమండలి, 1937 జూలైలో ఏర్పాటయింది. ఈ మంత్రిమండలిలో సభ్యులు: ప్రధానమంత్రి, సి. రాజగోపాలాచారి; రెవిన్యూమంత్రి, టంగుటూరి ప్రకాశం; కార్మిక మంత్రి, వి. వి. గిరి; స్థానిక పరిపాలన మంత్రి, బెజవాడ గోపాలరెడ్డి; ఆరోగ్యమంత్రి, డాక్టర్ టి. ఎస్. ఎస్. రాజన్; జైళ్లమంత్రి, కె. రామన్‌మీనన్; పబ్లిక్‌వర్క్సు మంత్రి, యాకుబ్ హసన్; న్యాయశాఖా మంత్రి, డాక్టర్ పి. సుబ్బరాయన్; ఎక్సైజుమంత్రి, వి. ఐ. మునుస్వామిపిళ్లై; ప్రచురణశాఖా మంత్రి ఎస్. రామనాథన్. మంత్రివర్గం ఏర్పాటయిన కొంతకాలానికి, జైళ్లశాఖా మంత్రి, కె. రామన్‌మీనన్ చనిపోయారు. అప్పుడు జైళ్లశాఖను న్యాయశాఖా మంత్రి డాక్టర్ సుబ్బరాయన్‌కు యిచ్చి, వారి అజమాయిషీలోవున్న విద్యాశాఖను. అప్పటివరకు పార మెంటరీ సెక్రటరీగావున్న సి. జె. వార్కీ గారిని మంత్రిగా నియమించడం జరిగింది.

ఈ మంత్రిమండలి పనిచేస్తూవుండగా, 1939 లో రెండవ ప్రపంచయుద్ధం ఆరంభమైంది కాంగ్రెసు మంత్రివర్గాలతోను, భారత దేశ ప్రజలతోను సంప్రతించకుండానే, భారతదేశం జర్మనీకి ప్రతికూలంగా యుద్ధంలో పాల్గొంటున్నట్లు రాజప్రతినిధి ప్రకటించినారనే కారణంచేత దేశంలోని కాంగ్రెసు మంత్రివర్గాలన్నీ రాజీనామా యిచ్చాయి. మదరాసు మంత్రివర్గం 1939 అక్టోబరులో రాజీనామా యిచ్చింది. రాష్ట్రపరిపాలనను గవర్నరు ఐ. సి. ఎస్. ఉద్యోగులను సలహాదారులుగా నియమించుకొని నిర్వహించడం ప్రారంభించాడు.

మళ్లీ 1946 మే మాసంవరకూ, కొత్తగా ఎన్నికలు జరిగి ప్రజా ప్రభుత్వం ఏర్పడినదాకా, రాష్ట్రపరిపాలన గవర్నరు సలహాదారులే నిర్వహించారు. కాంగ్రెసు మంత్రివర్గం, 1938 లో పెట్టిన మధ్య నిషేధశాసనాన్ని 1943 లో సలహాదారుల ప్రభుత్వం రద్దుచేసింది.

1940 లో యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసినందుకు, దేశంలోని అన్ని ప్రాంతాలలో లాగనే మదరాసు రాష్ట్రంలోకూడా కాంగ్రెసు నాయకులు నిర్బంధంలో వుంచబడినారు. తరువాత మళ్లీ, 1942 లో కాంగ్రెసు నాయకులూ, అల్లరులలో పాల్గొన్నారనే నేరంమీద అనేకమంది కాంగ్రెసువారూ జైళ్లకు పంపబడినారు.

1945 లో రెండవ ప్రపంచయుద్ధ ముగియడంతోనే కాంగ్రెసు నాయకులను విడుదల చెయ్యడం జరిగింది. దేశమంతటా ప్రజా ప్రభుత్వాలను ఏర్పాటు చెయ్యడానికి ప్రయత్నాలు జరిగాయి. డిసెంబరు మొదలు ఏప్రిల్ వరకూ, దేశంలోని వివిధరాష్ట్రాలలో ఎన్నికలు జరిగాయి. మదరాసు రాష్ట్రంలో ఎన్నికలు, 1946 ఏప్రిల్ మాసం మధ్యలో ముగిసాయి. కాంగ్రెసుపక్షం అత్యధికబలంతో నెగ్గింది.

రాష్ట్రంలో మంత్రిమండలిని ఏర్పాటుచెయ్యడంలో, రాష్ట్ర శాసన సభలోని కాంగ్రెసు సభ్యులలో అభిప్రాయ భేదాలు కలిగాయి. దానికితోడు, కాంగ్రెసు పార్లమెంటరీబోర్డువారు యీ విషయంలో జోక్యం కలిగించుకొని, శాసనసభ కాంగ్రెసుపార్టీ నాయకుని ఎన్నిక తాము సూచించిన ప్రకారమే జరగాలన్నారు. ఈ సూచనకు శాసన సభ కాంగ్రెసు సభ్యులు అంగీకరించక, తమ యిష్టం వచ్చిన నాయకుణ్ణే ఎన్నుకుంటామన్నారు. అయితే, యీ ఎన్నిక ఏకగ్రీవంగా జరగలేదు. పార్టీనాయకత్వానికి టంగుటూరి ప్రకాశంగారు, సి. ఎన్. ముతురంగ మొదలియార్‌గారు అభ్యర్థులుగా నిలిచారు. అధికసంఖ్యాకులు ప్రకాశంగారి పక్షాన ఓటు చేసినందున, ప్రకాశంగారు నాయకులుగా ఎన్నుకొబడినారు. కాంగ్రెసు పార్టీకి శాసనసభలో అధిక సంఖ్య వున్నందుననూ, యీపార్టీకి నాయకులుగా ప్రకాశంగారు

ఎన్నుకోబడినందుననూ, మంత్రిమండలిని ఏర్పాటు చెయ్యవలసిందని గవర్నరు ప్రకాశంగారిని కోరారు. ప్రకాశంగారు 1946 మే నెలలో మంత్రి మండలిని ఏర్పాటుచేశారు. ఆ మంత్రిమండలి సభ్యులు: ప్రధాన మంత్రి, టంగుటూరు ప్రకాశం; రెవిన్యూమంత్రి, కె. ఆర్, కంత్; కార్మికమంత్రి, వి. వి. గిరి; పబ్లిక్ వర్క్సు మంత్రి, ఎం. భక్తవత్సలం; ఆరోగ్యమంత్రి, శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతి; న్యాయమంత్రి, కె. భాష్యం; హిందూ ధర్మాదాయాలమంత్రి, కె. కోటిరెడ్డి; స్థానిక పరిపాలన మంత్రి, డానియల్ థామస్; వ్యవసాయమంత్రి, పి. యస్. కుమారస్వామిరాజా; విద్యామంత్రి, టి. ఎస్. అవినాశలింగం చెట్టియార్; ఆహారమంత్రి, ఆర్, రాఘవమీనన్; ప్రచురణశాఖా మంత్రి, వి. కూర్మయ్య; అడవులశాఖామంత్రి, బిక్కిని వీరాస్వామి.

కొంతకాలం తరువాత, అనారోగ్య కారణాలచేత, బిక్కిని వీరాస్వామిగారు తమ మంత్రిపదవికి రాజీనామా నిచ్చినందున, వారి స్థానే అడవుల మంత్రిగా బిక్కిని వెంకటరత్నంగారు నియమింపబడినారు.

ప్రకాశం మంత్రిమండలి పదవిని స్వీకరించినప్పుడు, రాష్ట్రంలో ఆహారసమస్య చాలా విషమస్థితిలో వుంది. ఈ మంత్రిమండలి సమయానుకూలంగా వ్యవహరించి ఆహారసమస్య విషమించకుండా, తిండి లేక ఒక్క మనిషికూడా రాష్ట్రంలో చావకుండా చేసింది.

1946 అక్టోబరున ప్రకాశం మంత్రివర్గం, రాష్ట్రంలో ఎనిమిది (సేలం, ఉత్తరార్కాడు, కోయంబత్తూరు, చిత్తూరు, బళ్లారి, అనంతపురం, కడప, కర్నూలు) జిల్లాలలో మద్యనిషేధాన్ని ప్రవేశపెట్టారు.

కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పాటుచేసిన తరువాత, మన రాష్ట్ర చరిత్రలో జరిగిన ముఖ్య సంఘటనలలో ఒకటి ఏమిటంటే, చెన్నపట్టణంలోని మౌంటురోడ్‌లోవున్న 'గవర్నమెంటుహౌసు' భవనాన్ని, దాని చుట్టూవున్న ప్రదేశాన్ని, ఆ ఆవరణలలోవున్న ఇతర భవనాలతోసహా, మొత్తం 110 ఎకరాల ఆవరణను, గవర్నరు మంత్రి

సాంఘికీ అప్పగించి వెయ్యడం. ఇది 1947 జనవరి 29 తేదీన జరిగింది.

ఇంతకుపూర్వం, ఈ భవనంలో గవర్నరూ, ఆయనపరివారమూ కాపురంవుండేవారు. ఇదిగాక, గిండీలో (మదరాసు 15 మైళ్లలో) మరొక్క భవనంకూడా గవర్నరుకువుండి, గవర్నరూ, ఆయన పరివారమూ, అక్కడే కాపురంవుంటారు. మౌంటురోడ్డులోని 'గవర్నమెంటుహౌసు' లో ప్రధానమంత్రికీ, శాసనసభ్యులకు వసతులు యివ్వడానికి ఏర్పాట్లు చేయబడినది.

ప్రకాశం మంత్రివర్గం పట్టుమని ఒక ఏడాదికూడా అధికారంలో వుండకుండానే, ప్రకాశంగారి నాయకత్వంమీద తమకు విశ్వాసం లేదని, కాంగ్రెసు పార్టీకి చెందిన శాసనసభ్యులు ప్రకటించారు. ఈ విషయంలో అఖిలభారత కాంగ్రెసు కార్యదర్శి శంకరరావ్ దేవ్, కాంగ్రెసు అధ్యక్షుడు ఆచార్య కృపలానీగార్లు మదరాసు వచ్చారు. ప్రకాశంగారిమీద విశ్వాసంలేదని చెప్పినవారిని సంప్రతించి కారణాలడిగారు. చివరకు కాంగ్రెసు అధ్యక్షుడు "ప్రకాశం నాయకత్వం పట్ల విశ్వాసం లేదన్నవారు యెందుకు అలా అంటున్నారో నాకు బోధపడలేదు. కాంగ్రెసు కార్యక్రమాన్ని వ్యతిరేకించి చేసిన దేమీ లేదు" అన్నాడు.

ఏమయినా అధిక సంఖ్యాకులకు యిష్టంలేనప్పుడు ప్రకాశంగారు నాయకుడిగా వుండటం మంచిదికాదన్నారు. ఆ సూచనను అనుసరించి, లెజిస్లేటివ్ కౌన్సిలులోను, లెజిస్లేటివ్ అసెంబ్లీలోనువున్న కాంగ్రెసు సభ్యుల సమావేశం, 1947 మార్చి 21 తేదీన జరిగింది. ఈ సమావేశంలో, పార్టీ నాయకత్వానికి ప్రకాశంగారు, ఓ. పి. రామస్వామిరెడ్డియార్ గారూ అభ్యర్థులుగా నిలచారు. రామస్వామి రెడ్డియార్ గారికి 116 ఓట్లూ ప్రకాశంగారికి 73 ఓట్లూ వచ్చాయి. రెడ్డియార్ గారు నాయకులుగా ఎన్నుకోబడినట్లు ఎన్నిక జరిపించిన

ఆచార్యకృపలానీ ప్రకటించారు, ప్రకాశంగారు, ప్రధాన మంత్రి పదవికి రాజీనామా ఇచ్చారు.

1947 మార్చి 23 తేదిన ఓమండూర్ పెద రామస్వామిరెడ్డియార్ మంత్రిమండలిని ఏర్పాటు చేశారు.

1947 అక్టోబరులో మద్య నిషేధం మరొక ఎనిమిది (గుంటూరు, మలబారు, నీలగిరి, నెల్లూరు, తంజావూరు, తిరుచిరాపల్లి, దక్షిణకన్నడ, మధుర) జిల్లాలలో అమలు జరుపబడింది.

1948 అక్టోబరులో, రాష్ట్రంలోని మిగతా (మదరాసు నగరం, తిరునెల్వేలి, రామనాథం, దక్షిణార్కాడు, చెంగల్పట్, కృష్ణా, పడమటిగోదావరి, తూర్పుగోదావరి, విశాఖపట్టణం) జిల్లాలలో మద్యనిషేధం అమలు జరుపబడింది.

స్వదేశ సంస్థానాలుగావున్న బంగనపల్లి, పుదుకోట మదరాసు రాష్ట్రంలో కలిసిపోవడం 1948 లో జరిగిన ముఖ్యసంఘటాలలో ఒకటి. 1948 ఫిబ్రవరి 20 న బంగనపల్లి, మార్చి 3 తేదిన పుదుకోట మదరాసు రాష్ట్రంలో కలియడంవల్ల రాష్ట్రవైశాల్యం దాదాపు 3,500 చ. మైళ్ళ పెరిగింది.

రాష్ట్రంలో న్యాయశాఖను పరిపాలనాశాఖనుంచి వేరుచెయ్యాలనే కాంగ్రెసుసూత్రం 1949 అక్టోబరు 2 తేదిన అమలు జరుపబడింది. ప్రప్రథమంలో, యీ సూత్రం చెంగల్పట్, ఉత్తరార్కాడు జిల్లాలలో అమలులోకి తేబడింది. 1950 జనవరి 26 తేదిన అనంతపురం, బళ్ళారి, చిత్తూరు, తిరునెల్వేలి జిల్లాలలోను, 1950 ఆగస్టు 15 తేదిన రామనాథం, దక్షిణార్కాడు, కడప, కర్నూలు, విశాఖపట్టణం జిల్లాలలోను, యీ పద్ధతి అమలు జరుపబడింది.

## నాయకుని యెన్నిక

శాసనసభ కాంగ్రెసుపక్ష నాయకుని ఎన్నిక ప్రతిసంవత్సరమూ జరుగవలసింది కనుక, 1948 సంవత్సరానికి ఎన్నిక 1948 మార్చి 26 తేదిన జరిగింది. లెజిస్లేటివ్ అసెంబ్లీలోను, కౌన్సిలులోనువున్న మొత్తం

కాంగ్రెసు పక్ష సభ్యులు 201 మందికి, 197 మంది సభ్యులు యీ ఎన్నిక సమావేశానికి హాజరయారు. రానివారు నలుగురు ఎవరంటె; అసెంబ్లీ స్పీకరు జె. శివషణ్ముగంపిళ్ళె, కౌన్సిలు ప్రెసిడెంటు ఆర్. రామకృష్ణ రాజులుంగార్లు, డాక్టర్ శామ్యూయెల్, శ్రీ ముత్తురామలింగదేవర్.

పార్టీనాయకపదవి ఎన్నికకు ప్రధానమంత్రిగావున్న ఓమండూర్ పి. రామస్వామిరెడ్డియార్, మాజీప్రధాని టంగుటూరి ప్రకాశంపంతులు గార్లు పోటీచేశారు. శ్రీ రామస్వామిరెడ్డియార్‌కు 112 వోట్లు శ్రీ ప్రకాశం పంతులుకి 84 వోట్లు వచ్చినవి. రెడ్డియార్ గెలిచినందున రాష్ట్రప్రభుత్వ ప్రధానపదవి ఆయనకే దక్కినది.

ఎన్నిక జరిగిన తరువాత, ఏప్రిల్ 3 తేదిన హోంమంత్రి డాక్టర్ పి. సుబ్బరాయన్ రాజినామా ఇచ్చారు. వీరి రాజినామా ఏప్రిల్ 6 తేది మధ్యాహ్నం అంగీకరింపబడినట్లు గజెట్ ప్రకటన జరిగింది. తత్ఫలితంగా మంత్రిమండలిలో మార్పులు జరిగాయి. మద్యనిషేధ మంత్రి డానియెల్ థామస్ 1948 జూన్ 15 తేదిన చనిపోయారు. వారి స్థానంలో డాక్టర్ ఎస్ గురుపాదం, జూలై 2 తేదిన నియమింపబడినారు,

1949 మార్చి 31 వరకూ యీ క్రింది మండలి అధికారంలో వుంది.

ప్రధానమంత్రి, ఓమండూర్ పి. రామస్వామి రెడియార్; ఆహార మంత్రి, డాక్టర్ టి. ఎస్. ఎస్. రాజన్; పబ్లిక్‌వర్క్సుమంత్రి. ఎం. భక్తవత్సలం; ఆర్థికమంత్రి, బి. గోపాల రెడ్డి; మద్యనిషేధం, ఎస్. గురుపాదం; రెవిన్యూమంత్రి, హెచ్. సీతారామరెడ్డి; స్థానిక పరిపాలన మంత్రి, కె. చంద్రమౌళి; విద్యామంత్రి, టి. ఎస్. అవినాశలింగం చెట్టియార్; వ్యవసాయమంత్రి; కె. మాధవమీనన్; ఆరోగ్యమంత్రి; ఎ. బి. షెట్టి, గ్రామోద్ధరణ మంత్రి; వేముల కూర్మయ్య;

1949 మార్చి 31 తేదీన శాసనసభ కాంగ్రెసు పక్షనాయకుని ఎన్నిక జరిగింది. ఇంతవరకూ నాయకులుగావున్న ఓ. పి. రామస్వామి రెడియార్ ఎన్నికనుంచి విరమించుకున్నారు. డాక్టర్ పి. ఎస్. కుమార

స్వామి రాజా గారికి 105 ఓట్లు, సుబ్బరాయన్ గారికి 89 ఓట్లు వచ్చినవి. కుమారస్వామి రాజాగారు నాయకులుగా ఎన్నుకోబడినందున, రాష్ట్రానికి నూతన మంత్రి వర్గాన్ని ఏర్పాటు చేయవలసిందని వారిని గవర్నరు కోరారు. కుమారస్వామి రాజాగారు 1949 ఏప్రిల్ 6 తేదీన పదిమంది మంత్రులుగల తన మంత్రి మండలిని ఏర్పాటుచేశారు. ఆ మంత్రిమండలి వివరాలివి ;

ప్రధానమంత్రి : పి. ఎస్. కుమారస్వామి రాజా ; ఆహారమంత్రి : డాక్టర్ టి. ఎస్. ఎ. రాజన్ ; పబ్లిక్ వర్క్సుమంత్రి : ఎం. భక్తవత్సలం ; ఆర్థికమంత్రి : బెజవాడ గోపాలరెడ్డి ; న్యాయమంత్రి : కె. మాధవ మీనన్ ; రెవిన్యూమంత్రి : హెచ్. సీతారామరెడ్డి ; విద్యామంత్రి : ఎ. బి. షెట్టి ; స్థానిక స్వపరిపాలనమంత్రి : కళ్లూరు చంద్రమౌళి ; గ్రామోద్ధరణ మంత్రి : డి. పరమేశ్వరన్ ; మద్యనిషేధమంత్రి : నీలం సంజీవరెడ్డి.

1949 జూన్ 2 జె. ఎల్. పి. రోచిక్కోరియా ఆహారశాఖా మంత్రిగా నియమింపబడినారు. అప్పటివరకు ఆహారశాఖామంత్రిగావున్న డాక్టరు టి. ఎస్. ఎస్. రాజన్ ఆరోగ్యమంత్రిగాను, ఆరోగ్యమంత్రిగావున్న ఎ. బి. షెట్టి వ్యవసాయ మంత్రిగాను నియమింపబడినారు.

రాష్ట్ర శాసనసభలోని కాంగ్రెసుపక్ష నాయకుని ఎన్నిక ఏడాదికొకసారికాక, శాసనసభ ఎన్ని సంవత్సరాలు మళ్ళీ ఎన్నికలవరకు అమలులోవుంటుందో అన్ని సంవత్సరాలకొకేసారి జరుగాలని 1949 అక్టోబరు 7 న కాంగ్రెసు వర్కింగు కమిటీ చేసిన సూచనను, రాష్ట్ర శాసన సభ కాంగ్రెసు పక్షం 1949 నవంబరు 18 తేదిన అంగీకరించింది.

1950 ఫిబ్రవరి 27 తేదినుంచి, అసెంబ్లీ కాంగ్రెసు సభ్యులు 14 మంది, టంగుటూరి ప్రకాశంగారి నాయకత్వాన, తాము ప్రభుత్వపక్షం వైపు సభలో కూర్చోననీ, ప్రభుత్వపక్షానికి ప్రతికూలంగా కూచోదలచామనీ, అలా ఏర్పాటు చెయ్యవలసిందనీ స్పీకరును కోరారు. ఆ మరునాటినుంచీ ఆ ఏర్పాటు చేయబడింది.

## మంత్రులపై ఆరోపణలు

1950 నవంబరు 23 న, మంత్రులమీద కొన్ని ఆరోపణలుచేస్తూ, టంగుటూరు ప్రకాశంగారు రాష్ట్రశాసనసభలో ఒక ప్రతిపాదనను చేశారు. ఈ ఆరోపణలు ఓ. గోపాలరెడ్డి, కె. చంద్రమౌళి. ఎం భక్తవత్సలం, ఏ. బి. షెట్టి, హెచ్. సీతారామరెడి, మాజీమంత్రి. వి. కూర్మయ్యగార్లమీద. ఈ ప్రతిపాదనమీద డిసెంబరు 6, 7. 9, 14, 15 ల నాడు చర్చలు జరిగినవి. చివరకు డిసెంబరు 15 న ప్రతిపాదన వీగిపోయింది.

అనారోగ్యం కారణంగా, తమమంత్రిపదవికి డాక్టర్ టి. ఏస్. ఏస్. రాజన్, 1951 సెప్టెంబరు 14 న రాజీనామా ఇచ్చారు. ఆరోగ్యశాఖమంత్రిగా 1951 సెప్టెంబరు 26 న కళా వెంకటరావుగారు నియమింపబడినారు. మద్యనిషేధము, అడవులు, గృహనిర్మాణ శాఖలుకూడా వీరికి ఇవ్వబడినవి.

## కమ్యూనల్ జి. ఓ.

రాష్ట్రప్రభుత్వ ఉద్యోగాలలోనూ, ప్రభుత్వ యాజమాన్యంలో నిర్వహింపబడే కాలేజిలలో వ్యక్తులకు ప్రవేశత ఇవ్వడంలో కులాల నిష్పత్తి అవలంబించబడేది. అదేమిటంటే, ప్రతి 14 స్థానాలలోనూ 6 స్థానాలు బ్రాహ్మణేతర హిందువులకు, 2 స్థానాలు బ్రాహ్మణులకు, 2 స్థానాలు హరిజనులకు, 1 స్థానం క్రైస్తవులకు, 1 స్థానం ముస్లిములకు, 2 స్థానాలు హిందువులలో నిమ్నజాతులకు. దీనికి కమ్యూనల్ జి. ఓ. అని వాడుక.

నూతన రాజ్యాంగంలో భారతదేశపు ప్రజలందరికీ సమానహక్కులు ఇవ్వబడినవి కనుక, కులాలవారీగా యీ నిష్పత్తిలో ప్రవేశత యివ్వడం, ఒక కులానికీ మరొక కులానికీమధ్య భేదం చూపడం అవుతున్నదని, యీ ఉత్తరువును రద్దుచేయవలసిందనీ, మదరాసు హైకోర్టులో 1950 జూలై 10 తేదీన పిటీషను వేయబడింది. ఆ ఉత్తరువు సక్రమమైనది కాదని, దానిని అమలు జరుపడానికి వీలులేదని మదరాసు హైకోర్టు

1950 జూలై 27 న తీర్పు ఇచ్చింది. ఈ తీర్పుపై మదరాసు ప్రభుత్వం, సుప్రీంకోర్టుకు అపీలుచేసింది. సుప్రీంకోర్టు 1951 మార్చి 16 న యీ అప్పీలును నిరాకరించి, హైకోర్టు ఉత్తరువును ఖాయపరచింది.

సుప్రీంకోర్టు ఉత్తరువువల్ల, రాష్ట్రప్రభుత్వం ఉద్యోగాలను ఇవ్వడంలో కమ్యూనల్ జి. ఓ. కు ప్రత్యామ్నాయంగా, యీ క్రింది పద్ధతి అవలంబించబడుతుందని 1951 సెప్టెంబరు 29 న ప్రకటించారు.

ప్రభుత్వశాఖలలోని ప్రతి 20 ఉద్యోగాలలోను 3 స్థానాలు షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు జాతులవారికి ఇవ్వబడుతవి. 5 స్థానాలు వెనుకబడిన కులాల వారికి ఇవ్వబడుతవి. తక్కిన 12 స్థానాలకు, అన్ని కులాలవారిలోనుంచిఎక్కువ ప్రతిభగలవారు, పరీక్షింపబడిన తరువాత, నియమించ బడుతారు.

## ప్రజాపార్టీ స్థాపన

ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు అధ్యక్షపదవికి ఎన్నికలు 1951 ఏప్రిల్ 11 తేదిన విజయవాడలో జరిగినవి మాజీ అధ్యక్షులు శ్రీ ఎన్. జి. రంగ మదరాసు మద్యనిషేధశాఖ మంత్రి నీలం సంజీవరెడ్డిగార్లు పోటీచేశారు. సంజీవరెడ్డిగారికి 87 ఓట్లున్నూ, రంగాగారికి 82 ఓట్లున్నూ వచ్చినవి. సంజీవరెడ్డి గారు అధ్యక్షులయ్యారు.

ఎన్నికలలో ఓడిపోగానే, రంగాగారు తాము నూతనరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులతో సహకారం చెయ్యజాలమనీ, కాంగ్రెసు సంస్థనుంచే తొలగిపోతామనీ ప్రకటనచేశారు.

ఆ మరునాడు శ్రీ టంగుటూరి ప్రకాశం నాయకత్వాన ప్రజా పార్టీ స్థాపించబడింది. రంగాగారున్నూ రాష్ట్రకాంగ్రెసు సభ్యత్వానికి రాజినామా యిచ్చిన దాదాపు 50 మందిన్నీ యీ పార్టీలో చేరిపోయారు.

తరువాత రాష్ట్రంలో ఎన్నికలు జరిగాయి. ఎన్నికలు పూర్తి అయేనాటికి యీ క్రింది మంత్రిమండలి రాష్ట్రంలో అధికారం వుంది.

ప్రధాని, పి. ఎస్. కుమారస్వామిరాజా ; ఆరోగ్యము, కళా వెంకట్రావు ; పబ్లిక్ వర్క్సు మంత్రి ఎం. భక్తవత్సలం ; ఆర్థికమంత్రి, బెజవాడ గోపాలరెడ్డి ; న్యాయమంత్రి కె. మాధవమీనన్ ; రెవెన్యూ మంత్రి, హెచ్. సీతారామరెడ్డి ; వ్యవసాయము, ఏ. బి. షెట్టి ; స్థానిక స్వపరిపాలనమంత్రి, కల్లూరి చంద్రమౌళి ; గ్రామోద్ధరణమంత్రి, బి. పరమేశ్వరన్ ; పరిశ్రమల మంత్రి, సి. పెరుమాళ్లస్వామి రెడ్డియార్ ; ఆహారమంత్రి, జె. ఎల్. పి. రోచివిక్టోరియా.

ఎన్నికలలో పి. ఎస్. కుమారస్వామిరాజా, కళా వెంకట్రావు. ఎ. భక్తవత్సలం, బెజవాడ గోపాలరెడ్డి, కె. మాధవమీనన్, కల్లూరి చంద్రమౌళిగార్లు ఓడిపోయారు.

కొందరు మంత్రులు ఎన్నికలలో ఓడిపోయినందున, ఓడిపోయిన వారు మంత్రులుగా వుండరాదనీ, (ఒక్క ముఖ్యమంత్రి తప్ప) తక్కిన వారంతా రాజీనామా ఇవ్వాలనీ కాంగ్రెసు వర్కింగుకమిటీ నిశ్చయించింది. ఆప్రకారం, మంత్రిమండలి 1952 ఫిబ్రవరి 8 న రాజీనామా ఇచ్చింది. కొత్తమంత్రిమండలి ఏర్పడేదాకా మంత్రిత్వాన్ని నిర్వహించడానికి, పూర్వపు ముఖ్యమంత్రి కుమారస్వామిరాజాగారిని ముఖ్యమంత్రిగానూ, ఎన్నికలలో ఓటమిపొందని అయిదుగురు ఇతరులను మంత్రులుగానూ గవర్నరు నియమించారు. ఆ అయిదుగురు ఎవరంటే : హెచ్. సీతారామరెడ్డి, ఏ. బి. షెట్టి, జె. ఎల్. పి. రోచివిక్టోరియా, సి. పెరుమాళ్లుస్వామిరెడ్డి, బి. పరమేశ్వరన్.

1948 సెప్టెంబరు 7 నుంచి రాష్ట్రానికి గవర్నరుగా వున్న భావనగర్ మహారాజా, 1952 మార్చి 12 తేదిన, తమపదవినుంచి విరమించారు. వారిస్థానంలో శ్రీ శ్రీ ప్రకాశ రాష్ట్ర గవర్నరుగా పదవి స్వీకరించారు.

శ్రీ శ్రీ ప్రకాశ గవర్నరు పదవిస్వీకరించే సరికి రాయలసీమలో దుర్భర క్షామపరిస్థితులు నెలకొనివున్నాయి. ప్రజలు తినడానికి తిండి, త్రాగడానికి నీరు, చెయ్యడానికి పనిలేక అలమటిస్తున్నారు. అలాటి పరిస్థితులలో, పదవీ స్వీకారం చేసిన పదిరోజులలోనే గవర్నరు,

రాయలసీమలో పర్యటించి పరిస్థితులను స్వయంగా చూసి, కేంద్రప్రభుత్వానికి సలహా యిచ్చి, మిలిటరీ ఇంజనీర్లను రాయలసీమకు పంపి అక్కడ బావులను త్రవ్వడానికీ ఉన్న బావులలోని మట్టి తోడించి వాటిలో నీరు పూరేటట్టు చెయ్యడానికి సహాయం చేయించారు. ఈ పని వల్ల, రాయలసీమ ప్రజలు కొంతవరకు తెప్పరిల్లుకో గలిగారు. ఇంతలో, మే నెలలో బాగా వర్షాలుపడి ప్రజలు బాధలను మరికొంత తగ్గించాయి.

## రాష్ట్రముఖ్యమంత్రిత్వం

రాష్ట్ర శాసనసభలో అత్యధిక సంఖ్యలో సభ్యులుగల పార్టీ కాంగ్రెసు. అయితే, ఆ సంఖ్య 152 మాత్రమే. మంత్రమండలిని కాంగ్రెసు పార్టీ ఏర్పాటుచేస్తే, ప్రతికూల పక్షం బలమే ఎక్కువగా వుండి, మంత్రమండలి నిలబడే అవకాశం కనబడలేదు. పైగా, కాంగ్రెసు పార్టీ సభ్యులలో, ప్రఖ్యాతిపొందిన పెద్దనాయకుడు ఎవరూలేరు.

ఈ లోపల ప్రజాపార్టీ నాయకులు టంగుటూరి ప్రకాశంగారి నాయకత్వాన, ప్రజాపార్టీ కమ్యూనిస్టు పార్టీల సభ్యులూ, కొంతమంది స్వతంత్ర సభ్యులూకలసి సమావేశమై, యునైటెడ్ డెమొక్రాటిక్ ఫ్రంట్ అనే పేరుతో, ఉమ్మడిగా రాష్ట్రపరిపాలన సాగించడానికి నిర్ణయించారు. ఈ ఫ్రంట్ బలం, 162.

అనారోగ్యకారణంచేత, కేంద్రప్రభుత్వమంత్రి పదవి నుంచి విరమించినామని ప్రకటన చేసినప్పటికీ, మదరాసు రాష్ట్ర రాజకీయాలు విపరీతస్థితిలో వున్నాయి. గనుక, కాంగ్రెసు నాయకత్వం వహించమని కాంగ్రెసు సభ్యులు కోరినందున, వారికోర్కెకు సుముఖతచూపి రాష్ట్రశాసన సభలోని కాంగ్రెసు పార్టీకి నాయకుడుగా శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి, 1952 మార్చి 31 న ఎన్నుకోబడినారు. ఆ ఎన్నికకు ముందురోజు, వారిని లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులుగా గవర్నర్ నామినేట్ చెయ్యడంకూడా జరిగింది.

కాంగ్రెసుపార్టీ నాయకులైన రాజగోపాలాచారి గారిని రాష్ట్రంలో మంత్రిమండలిని ఏర్పాటు చెయ్యమని గవర్నరు కోరారు. రాజగోపాలాచారిగారు తమతోసహా 15 మంది మంత్రులుగల మంత్రి మండలిని 1952 ఏప్రెల్ 9 తేదీన ఏర్పాటుచేశారు. ఆమంత్రి మండలిని గవర్నరు ఆమోదం తెలుపగా, పదవీ స్వీకరణ ఏప్రిల్ 10 తేదీన జరిగింది.

రాజగోపాలాచారిగారు పరిపాలనా బాధ్యత వహించిన కొద్ది రోజులలోనే చేసిన ముఖ్యమైన పనులు ఏమిటంటే:

రాజకీయ బాధితులకు భూమిని గ్రాంటుచేసే పద్ధతికి స్వస్తి చెప్పడం; 300 రూపాయలలోపు జీతంతీసుకొనే నాన్‌గెజెటెడ్ గవర్నమెంటు ఉద్యోగుల బిడ్డలకు మూడవఫారందాకా జీతాలు లేకుండా చదువు చెప్పించడానికి నిర్ణయించడం. రాష్ట్రశాసన సభ సభ్యులసంఖ్య ఎక్కువైనందున పాత అసెంబ్లీ భవనం చాలదు కనుక, మౌంట్‌రోడ్‌లోని గవర్నమెంట్ హౌసు ఎస్టేట్‌లో కొత్తభవనం నిర్మింపబడింది. ఈభవనానికి ప్రారంభోత్సవం 1952 మే 2 తేదీన, గవర్నరు శ్రీ ప్రకాశ జరిపారు.

కొత్త సభ్యులంతా, మే 3 తేదిన సభ్యత్వ ప్రమాణాలను చేశారు. ఎన్నికల తరువాత జరిగిన మొట్టమొదటి శాసనసభ సమావేశం అదే.

# ఎన్నికలు

ఇండియా ప్రజారాజ్యం అయిన తరువాత, మొట్టమొదటిసారి ఎన్నికలు, ఇండియాలోని అన్నిరాష్ట్రాలతోపాటు, మదరాసు రాష్ట్రంలోకూడా 1952 జనవరిలో జరిగాయి. అంతకుపూర్వం ఎన్నిక 1946 లో జరిగాయి. అప్పుడు ఓటుచేసే హక్కు విద్యావంతులైన వయోజనులకు మాత్రమే వుండేది. కాని, 1952 జనవరి 2 తేదినుంచి

26 తేదీ లోపల జరిగిన ఎన్నికలలో, వయోజనులందరికీ ఇతర అర్హలతో నిమిత్తంలేకుండా ఓటుచేసే హక్కు ఇవ్వబడింది. ఈ విధానంవల్ల రాష్ట్రంలోని జనాభా 5,69,52,332 మందిలోనూ, 2,68,58,006 మంది వయోజనులు (స్త్రీలు, పురుషులూ కలిపి) ఎన్నికలలో ఓటు చెయ్యడానికి అర్హత పొందారు.

పార్లమెంటు సభ్యులను ఎన్నుకోవడానికి 1,99,28,519 ఓట్లు వేయబడినవి. రాష్ట్రశాసనసభ సభ్యులను ఎన్నుకోవడంలో 1,99,74,801 ఓట్లు వేయబడినవి.

ఆగగా నియోజకవర్గాలు, పోలైన ఓట్లు మొదలైన వివరాలు యీ క్రింద ఇవ్వబడినవి.

## పార్లమెంటుకి ఎన్నికలు

మదరాసురాష్ట్రంనుంచి పార్లమెంటుకి ఎన్నుకోబడే సభ్యుల సంఖ్య 75. రాష్ట్రంలో జరిగిన ఎన్నికలలో, ఈ 75 స్థానాలలోనూ, కోయంబత్తూరు నియోజకవర్గంనుంచి టి. ఎ. రామలింగం చెట్టియార్, విశాఖపట్టణం షెడ్యూల్డు ట్రైబ్స్ రిజర్వ్‌డ్ స్థానంనుంచి గాం మల్లు దొరగార్లు పోటీ లేకుండా ఎన్నుకోబడినారు. తక్కిన 73 స్థానాలకూ 291 మంది అభ్యర్థులు పోటీ చేశారు. వారిలో 73 మంది కాంగ్రెసు పార్టీవారు 20 సోషలిస్టులు, 31 ప్రజాపార్టీసభ్యులు, 16 కమ్యూనిస్టులు, 9 షెడ్యూల్డ్ కాస్ట్ ఫెడరేషన్ సభ్యులు, 2 రామరాజ్య పరిషత్తు సభ్యులు, 19 కృషీకలోక్, 2 హిందూమహాసభ, 5 ఫార్వర్డ్ బ్లాక్ మార్క్సిస్టులు, 1 ఫార్వర్డ్‌బ్లాక్ (రూయికర్) సభ్యుడు, 13 మంది ఇతరపార్టీలవారు, 100 మంది స్వతంత్రులు వున్నారు.

ఎన్నికలలో గెలిచినవారు: కాంగ్రెస్, 35; సోషలిస్టులు, 2; ప్రజా పార్టీ, 6; కమ్యూనిస్టు, 8; స్వతంత్రులు, 15; తమిళనాడు శ్రమజీవులు 4; కామన్ వీల్ పార్టీ, 3; ముస్లింలీగ్, 1; ఫార్వర్డ్ బ్లాక్ మార్క్సిస్టు, 1.

ఎన్నికలతరువాత, కాంగ్రెసు సభ్యులు టి. ఎ. రామలింగం చెట్టి యార్ చనిపోయారు. అరుపుకోటనుంచి ఎన్నుకోబడిన పార్వర్డ్ బ్లాక్ మార్క్సిస్టు సభ్యుడు యు. ముత్తురామలింగదేవర్ తమ సభ్యత్వానికి రాజీనామా యిచ్చారు. ఆ రెండు స్థానాలకూ మళ్ళీ ఎన్నిక జరగాలి.

ఆంధ్రదేశంలోని పార్లమెంటరీ నియోజకవర్గాలలో, దేనిలో ఎంత మంది ఓటర్లు ఉన్నదీ, వివరాలు ఇవి :

పాతపట్నం-3,36,668, శ్రీకాకుళం-3,67,310, పార్వతీపురం-3,58,275, విజయనగరం-3,74,684, విశాఖపట్టణం (2)-7,07,707, కాకినాడ-3,46,037, రాజమండ్రి (2)-7,41,484, ఏలూరు (2)-6,89,258, మచిలీపట్టణం- 3,32,762, గుడివాడ- 3,51,988, విజయవాడ-3,67,722, తెనాలి- 3,41,801, గుంటూరు- 3,64,562, నర్సారావుపేట-3,66,313 ఒంగోలు, (2)-7,34,287, నెల్లూరు- 3,52,385, నంద్యాల -3,80,071, కర్నూలు- 3,54,755,- బళ్ళారి- 3,45,553, అనంతపురం- 3,64,429, పెనుకొండ- 3,52,629, కడప - 3,68,052, చిత్తూరు (2)7,17,441, తిరుపతి- 3,74,862, మదరాసు - 3,69,299, తిరువళ్లూరు (2) - 7,03,661.

## రాష్ట్రశాసన సభకు ఎన్నికలు

రాష్ట్రశాసనసభకు ఎన్నుకోబడవలసిన సభ్యులు 375 మంది. అయితే, 374 మంది ఎన్నికమాత్రమే జనవరినెలలో జరిగింది. కాకినాడ నియోజకవర్గంలో అభ్యర్థుల నామినేషను జరిగినతరువాత ఒక అభ్యర్థి మరణించినందున, ఆ ఎన్నిక జరుగలేదు. తక్కిన 374 స్థానాల ఎన్నికలలోనూ, చిత్తూరు రిజర్వ్డ్ స్థానంనుంచి హరిజన్ అభ్యర్థి శ్రీ శృంగారం, కంగాయంనుంచి శ్రీ. కె. సుబ్బరాయగౌండర్ గార్లు పోటీ లేకుండా ఎన్నుకోబడినారు. తక్కిన 372 స్థానాలకూ ఎన్నికలలో మొత్తం 1675 మంది అభ్యర్థులు పోటీచేశారు. ఆ అభ్యర్థుల పార్టీ వివరాలు ఇవి: కాంగ్రెస్, 367; సోషలిస్టు, 164; ప్రజాపార్టీ, 147; కమ్యూనిస్టు, 131; షెడ్యూల్డు కాస్ట్సు ఫెడరేషన్, 38; జనసంఘం, 4; రామరాజ్య పరిషత్, 1; కృషికార్ లోక్ పార్టీ, 63; హిందూమహాసభ, 9;

ఫార్వర్డ్ బ్లాక్ మార్క్సిస్టు, 6; ఫార్వర్డ్ బ్లాక్ రూయికర్, 5; రివల్యూషనరీ కమ్యూనిస్టుపార్టీ, 1; స్వతంత్రులు, 670; ఇతరపార్టీలు, 69.

వివిధపార్టీల అభ్యర్థులకు వచ్చిన మొత్తం ఓట్ల వివరాలివి:

కాంగ్రెస్, 70,00,203; సోషలిస్టు, 13,12,077; ప్రజాపార్టీ, 17,60,724; కమ్యూనిస్టు, 25,91,923; షెడ్యూల్డు కాస్ట్సు ఫెడరేషన్ 3,48,226; జనసంఘం, 20,082; రామరాజ్య పరిషత్, 114; హిందూ మహా సభ, 24,617; కృషికర్ లోక్ పార్టీ, 6,29,894; ఫార్వర్డ్ బ్లాక్ మార్క్సిస్టు, 1,38,203; ఫార్వర్డ్ బ్లాక్ రూయికర్, 15,438; రివల్యూషనరీ కమ్యూనిస్టుపార్టీ,! 2,199; స్వతంత్రులు, 48,39,743; ఇతరపార్టీలు, 12,91,3583 మొత్తం పోలైన ఓట్లు, 1,99,74,801.

ఆంధ్రదేశంలోని వివిధనియోజకవర్గాలలో ఓటర్లసంఖ్య వివరాలు యీ క్రింద యివ్వబడినవి. నియోజకవర్గం పేరుప్రక్కన బ్రాకెట్లలో వున్న సంఖ్య, ఆ నియోజకవర్గంనుంచి ఇద్దరు సభ్యులను ఎన్నుకోవాలని తెలియ జేస్తుంది. బ్రాకెట్లలో సంఖ్యలేని నియోజకవర్గాలనుంచి ఒక్కొక్క సభ్యుణ్ణి మాత్రమే ఎన్నుకోవాలి.

## శ్రీకాకుళం జిల్లా (15)

పాతపట్నం (2) - 1,46,470 ; టెక్కలి- 61,196 ; సోంపేట- 65,853 ; ఇచ్ఛాపురం - 63,149 : శ్రీకాకుళం - 1,40,359; హొంజరం - 82,667 ; పాలకొండ 66,547 ; నగసారావుపేట 77,737 ; సాలూరు - 79,244 ; చీపురుపల్లి - 1,52,998 బొబ్బిలి - 47,472 ; పార్వతీపురం - 78,561.

## విశాఖపట్నం జిల్లా (14)

విజయనగరం (2) - 1,46,158 భీమునిపట్నం - 66,942 అంమండ - 85,733 శృంగవరపుకోట - 76,151 చోడవరం - 67,363 మాడ్గుల - 79,332 విశాఖపట్నం - 68,284 పరవాడ - 60,780 అనకాపల్లి - 74,650 యలమంచి - 75,984 గోలుకొండ (2) - 1,41,984 పాయకరావుపేట - 68,155 తుని - 76,175.

## తూర్పుగోదావరి జిల్లా (16)

పిఠాపురం - 73,335 కాకినాడ (2) 1,42,309 రామచంద్రపురం - 63,049 అనపర్తి - 63,049 భద్రాచలం - 1,54,004 పెద్దాపురం - 54,665, బూరుగుపూడి - 70,532 రాజమండ్రి - 70,566 పామర్రు 65,726 అమలాపురం (2) - 1,64,215 రాజోలు (2) - 1,61,776.

## పశ్చిమ గోదావరి జిల్లా (12)

చింతలపూడి - 71,734 ఏలూరు - 71,289 తాడేపల్లిగూడెం 1 62,622 అలంపురం - 63,043 నరసాపుర (2) - 1,47,913 తణుకు - 61,557 పెనుగొండ 76,513 కొవ్వూరు (2) - 1,34,587 ఉండి - 62,189 భీమవరం - 65,063.

## కృష్ణా జిల్లా (12)

దివి (2) - 1,24,620 బందరు 80,890 కంకిపాడు 63,470 ; నూజివీడి - 69,991 గుడివాడ 1,57,417 ; కైకలూరు - 61,110 విజయవాడ - 72,087, జగ్గయ్యపేట 70,714 ; కంచకచర్ల 60,692, తిరువూరు 78,794.

## గుంటూరు జిల్లా (18)

మంగళగిరి 85,435, దుగ్గిరాల 58,862 తెనాలి - 62,455, అమృతలూరు 64,219 రేపల్లె - 71,067, బాపట్ల 85,198, సత్తెనపల్లి - 64,122, గుంటూరు 76,636, ప్రత్తిపాడు 76,879, పొన్నూరు, 73,206, చీరాల - 73,719, వినుకొండ 65,241, పల్నాడు - 66,235, జెల్లంకొండ - 79,512, నరసారావుపేట - 79,392, చిలకలూరిపేట - 75,933, ఒంగోలు - (2) 1,62,288.

## నెల్లూరు జిల్లా (13)

కోవూరు - 69,817, ఆత్మకూరు - 59,021, కావలి - 76,778, ఉదయగిరి 69,817, కనిగిరి - 82,008 కందుకూరు (2) 1,41,634,

దర్శి - 72,924, గూడూరు - 78,942, వెంకటగిరి - 92,087, రాపూరు - 68,149 నెల్లూరు (2) - 1,23,207.

## కర్నూలు జిల్లా (8)

మార్కాపురం - 70,623, కంభం 85,794, నంద్యాల - 75,675, కోయిలకుంట్ల - 76,096, నందికొట్కూరు - 70,983, కర్నూలు (2) - 1,51,490 డోన్ - 78,264.

## బళ్ళారి జిల్లా (8)

ఆదోని (2) - 1,38,769 శిరుగుప్ప - 64,496 బళ్లారి - 75,016 రాయదుర్గం 56,346, హొస్పేట - 68,840 కుడ్లిగి-63,278; హర్పనహళ్ళి - 72,073.

## అనంతపురం జిల్లా (9)

కల్యాణదుర్గం (2) - 1,48,629, తాడిపత్రి - 69,367 అనంతపురం - 68,169, పెనుకొండ - 68,796 హిందూపూర్ - 72,706, మడకశిర - 72,464 కదిరి - 72,868 ధర్మవరం - 65-795.

## కడప జిల్లా (8)

కడప - 31,720, బద్వేల్ - 66,027 ప్రొద్దుటూరు - 68,162, కమలాపురం - 74,303 జమ్ములమడ్గు - 77,840 : రాజంపేట (2) - 1,30,828 ; రాయచోటి - 84,877.

## చిత్తూరు జిల్లా (12)

ఘట్టు - 61,383 ; మదనపల్లి - 65,666 పుంగనూరు - 79,675 ; పీలేరు - 60,693 ; పలమనీరు - 77,386 ; చిత్తూరు (2) - 1,61,933 ; తిరుత్తణి (2) - 1,46,079 పుత్తూరు - 83,392 ; కాళహస్తి - 67,102 చంద్రగిరి - 78,289.

## మదరాసు నగరం (8)

హార్బర్ - 83,559 : వెయ్యిదీపాలు (2) - 1,40,070 ; తిరువళ్లిక్కేణి - 71,59* ; మైలాపూరు - 74,076 ; చాకలిపేట - 77,709 ; చూళై - 66,189 పెరంబూర్ - 62,088.

## నియోజకవర్గాల పరిమితులు

ఆంధ్రదేశంలోని శాసన సభా నియోజకవర్గాలు, ఏఏ ప్రాంతాలకు వర్తిస్తవో, వివరాలు యీ క్రింద ఇవ్వబడినవి.

### శ్రీ కా కు ళ ం జిల్లా

సాలూరు :— సాలూరు తాలూకా.

చీపురుపల్లి :— బొబ్బిలి, బుర్జ, బలిజపేట ఫిర్కాలు పోను మిగిలిన బొబ్బిలి తా॥ చీపురపల్లి తా॥ చీపురపల్లి గర్భాం, పొందూరు ఫిర్కాలు.

బొబ్బిలి:— బొబ్బిలి తా॥ బొబ్బిలి, బుర్జ, బలిజపేట ఫిర్కాలు.

పార్వతీపురం :— కురుపాం, గుమ్మలక్ష్మీపురం మండెంఖిల్లు ఫిర్కాలు మినహా పార్వతీపురం తా॥

శ్రీకాకుళం :— నగరి కటకం ఫిర్కాలు మినహా శ్రీకాకుళం తా॥ చీపురుపల్లి తాలూకా షేర్ మహమ్మద్ పురం, కుప్పిలి, రణస్థలం ఫిర్కాలు.

హరిజరం :— హంజరం, ఉరుకూరు కొట్టిసం ఫిర్కాలు.

పాలకొండ :— హరింజరం, ఉరుకూరు, కొట్టిసం ఫిర్కాలు పోను మిగులు పాలకొండ తా॥

నరసన్నపేట :— నరసన్నపేట తాలూకా.

పాతపట్నం :— శ్రీకాకుళం తా॥ నగరి కటకం ఫిర్కా, పాతపట్నం తా॥ పార్వతీపురం తా॥ కురుపాం గుమ్మలక్ష్మీపురం, మొండెంఖిల్లు ఫిర్కాలు.

టెక్కలి :— పలాసాఫిర్కా, సోంపేట నియోజకవర్గములో చేర్చిన బ్రాహ్మణేతర్ల ఫిర్కా గ్రామములు మినహా మిగిలిన టెక్కలి తాలూకా.

సోంపేట :— కొల్లూరుఫిర్కా, ఇచ్ఛాపురం ని॥ లో చేర్చిన సోంపేట తాలూకా గ్రామములు మినహా సోంపేట తా॥ పలాసాఫిర్కా, టెక్కలి తా॥ బ్రాహ్మణేతర్ల ఫిర్కాలోని పరసాంబ, కొలిబుగ్గ, నరిసిపురం, చిన్నబడాం, గోపాలపురం, గరుడఖండి, కృష్ణపురం, సరియాపల్లి, పాత జగదావుపురం, లక్ష్మీపురం, నీలిభద్ర, కొసపురం, పెద్ద నారాయణపురం, కొత్త అగ్రహారం. ఉంద్రకుడియా, జడ్యాడ, అమలకుడియ, పూర్ణభద్ర వీరభద్రాపురం, పనుకూరు, కొత్త జగదేవపురం, అంతగిరి, వెంటూపురం, పెద్దబాడం, అంతరకుడ్డ, కవిటి, పెద్దబానపురం, పెద్దినాయుడు పేటపాత్రుని వలసగ్రామములున్నా, బ్రాహ్మణేతర్ల, పందశశానం పంచాయతీలు.

ఇచ్ఛాపురం :— ఇచ్ఛాపురం తా॥ కొల్లూరు ఫిర్కా, సోంపేట ఫిర్కాలోని కంచిలి, సామంత రామచంద్రపురం పురుషోత్తపురం, తాలతంపర, మండపల్లి, నారాయణపురం, అమ్మవారి పుట్టుగ, పాత్రపాడ, మొగలికొత్తూరు, జింకిభద్ర, జలంత్రికోట, చోత్రాయిపురం, మధుపురం, మాణిక్యపురం, నవ్వాఘుడపూర్ణగడ, కొక్కలపుట్టుగ, కట్టం, బుసికుడ్డ, ఇసుకలపాలెం గ్రామములు సోంపేట పంచాయతీ.

## విశాఖపట్నం జిల్లా

విజయనగరం :— విజయనగరం తాలూకా.

భీమునిపట్నం :— భీమునిపట్నం భీమునిపట్నం, తా॥ భోగాపురం పూసపాటి రేగ ఫిర్కాలు.

అలమండ :— భీమునిట్నం తా॥ డెంకాడ, రేవిడి ఫిర్కాలు, శృంగవరపుకోట తా॥ అలమండ కొట్టం ఫిర్కాలు.

శృంగారవరపుకోట :— శృంగారవరపుకోట తా (అలమండ కొట్టం పిర్కాలు విశాఖపట్నం ని॥ లో కలిపిన కొత్త వలస గ్రామములు మినహా),

చోడవరం :— వీరవల్లి తా॥ లోని కస్బ జగన్నాధపురం, గవర వరం, చాదువాడ, చోడవరం, గౌరిపట్నం, వడ్డాది, రాజాం, గాప ఫిర్కాలు

మాడుగోలు :— వీరవల్లి తా॥ దేవరపల్లి, మేడిచర్ల, తెమును పూడి, బీడికాడ, మాడుగోలు, మాడ్గోలు, ఏజన్సీ, కొత్తపాడు, కింతలి, నెడివాడ ఫిర్కాలు.

విశాఖపట్నం :— పెందుర్తి, మధురవాడ ఫిర్కా విశాఖపట్నం మునిసిపాలిటీ శృంగవరపుకోట తాలూకా కొత్తవలస ఫిర్కాలోని దెందేరు, చింతలపాలెం, గంతపాలెం గ్రామములుచేరి.

పరవాడ :— అనకాపల్లి తా పరవాడ సుబ్బవరం పిర్కాలు, విశాఖపట్నం తా కణితి ఫిర్కా

అనకాపల్లి :—తాళ్ళపాలెం, అనకాపల్లి పిర్కాలు

యలమంచి :— నక్కపల్లి, పాయకౌరావు పిర్కాలు పోను మిగులుసర్వసిద్ధి తా॥

పాయకౌరావుపేట, పాయకౌరావుపేట నక్కపల్లిఫిర్కాలు గోలుకొండ నియోజకవర్గంలో చేర్చిన గ్రామములు పోగా మిగులు జలూరు ఫిర్కా

గోలుకొండ :— గూడెం తాలూకాయున్నా, గోలుకొండ తాలూకా జల్లూరు ఫిర్కాలోని నరసపట్నం, ధర్మసాగరం, దుగ్గాడ, హారెప్ప అగ్రహారం, వైరఘుడసీతమ్మ అగ్రహారం, గంగవరం కొండల గ్రహారం, నారాయణగజపతిరాజ్ అగ్రహారం, గంగవరం కొండలగ్ర హారం, భీమబోయినపాలెం, సేక్‌పాలెం, వెంకన్నపాలెం గంగవరం 2, తమరాం, రాచపల్లి గ్రామములు, బయ్యవరం, గిడుతూరు, మాకీవర పాలెం పంచాయతీలు.

## కృష్ణా జిల్లా

జగ్గయ్యపేట :— జగ్గయ్యపేట సబ్ తాలూకా నందిగామ ఫిర్కా

విజయవాడ :— విజయవాడ ఫిర్కా

కంచికచర్ల : నందిగామ తాలూకా కంచర్ల, పెనుగంచి ప్రోలు ఫిర్కాలు, విజయవాడ తాలూకా కొండపల్లి ఫిర్కా

తిరువూరు :— తిరువూరు తాలూకా విజయవాడతాలూకాలోని మైలవరం ఫిర్కా.

కంకిపాడు :— కంకిపాడు, వల్లూరుఫిర్కాలు, గన్నవరం తా కపిలేశ్వరపురం ఫిర్కా.

నూజివీడు :— నూజివీడు తాలూకా, గన్నవరం తా వీరవల్లి ఫిర్కా.

గుడివాడ :— గుడివాడతాలూకా గన్నవరం, ఉయ్యూరు ఫిర్కాలు.

కైకలూరు :— కైకలూరు తాలూకా.

దివి :— దివితాలూకా, బందరు తా॥ గూడూరు ఫిర్కా.

బందరు :—గూడూరు ఫిర్కా పోగా మిగులు బందరు తాలూకా యావత్తు.

## నెల్లూరు జిల్లా

గూడూరు :— గూడూరు, వెంకటగిరి, సూళ్ళూరుపేట తాలూకాలు.

రాపూరు :— రాపూరు తాలూకా, ఆత్మకూరు తా॥ కలువాయ విరుపూరు ఫిర్కాలు.

నెల్లూరు :— నెల్లూరు తాలూకా

కోవూరు :— అల్లూరు ఫిర్కా మినహా కోవూరు తాలూకా.

ఆత్మకూరు :— కలువాయి, విరుపూరు ఫిర్కాలు పోగా మిగులు ఆత్మకూరు తా॥, కావలి తా॥ చిన అనలూరు ఫిర్కా.

కావలి : కోవూరు తా॥ అల్లూరు ఫిర్కా, చినఅనలూరు ఫిర్కా పోను కావలి తాలూకా.

ఉదయగిరి :— ఉదయగిరి తాలూకా

కనిగిరి :—కనిగిరి తాలూకా

కందుకూరు : కొండపి, సింగరాయకొండ ఫిర్కాలు, మినహా కందుకూరు తాలూకా

పొదిలి : — కొండపి, సింగరాయకొండ ఫిర్కాలు, తరుపాడు ఫిర్కా మినహా పొదిలితాలూకా

దరిశి :—దర్శితాలూకా, పొదిలి తాలూకాలోని తర్లుపాడు ఫిర్కా

## కర్నూలు జిల్లా

మార్కాపురం : మార్కాపురం తాలూకా

కంభం :— కంభంతాలూకా

నంద్యాల :— నంద్యాల తాలూకా శిర్వేల్ తాలూకాలోని శిర్వేలు, గోస్పాడు ఫిర్కాలు

కోయిలకుంట్ల :— కోయిలకుంట్ల తాలూకా, శిర్వేలు తాలూకా రుద్రవరం. చాగలమర్రి, ఆళ్ళగడ్డ పిర్కాలు

దోన్ :— దోన్ తాలూకా, బనగానపల్లి సబ్ తాలూకా

నందికొట్కూరు :— నందికొట్కూరు తాలూకా

కర్నూలు :— కర్నూలు, పత్తికొండ తాలూకా

## కడప జిల్లా

రాజంపేట :— రాజంపేట తాలూకా సిద్దవటం, ఒంటిమిట్ట, కోడూరు ఫిర్కాలు

రాయచోటి : రాయచోటి తాలూకా (లక్కిరెడ్డిపల్లి మినహా)

కడప :— కడప తాలూకా, లక్కిరెడ్డిపల్లి ఫిర్కా

బద్వేలు :— బద్వేలు తాలూకా సిద్ధవటం తాలూకాలోని ఓబెలం ఫిర్కా

ప్రొద్దుటూరు :— ప్రొద్దుటూరు తాలూకా

కమలాపురం :— కమలాపురం తాలూకా, పులివెండ్ల తా॥ పులివెండ్ల, వేముల, లింగాల ఫిర్కాలు

జమ్మలమడుగు :— జమ్మలమడుగు తాలూకా, పులివెండ్ల తా॥ తొండూరు, సింహాద్రిపురం ఫిర్కాలు

## అనంతపురం జిల్లా

పెనుగొండ :— పెనుగొండ తాలూకా, కదిరి తా॥లోని గుంజేపల్లి ఫిర్కా కలిసి.

హిందూపురం :— పరిగిఫిర్కా మినహా హిందూపురం తా॥యున్నూ కదిరి తా॥ మహమ్మదాబాద్ ఫిర్కాయున్నూ.

మడకశిర :— మడకశిర తా॥ పరిగిఫిర్కా

కదిరి :— కదిరి తా॥ (గుంజపల్లి మహమ్మదాబాద్ ఫిర్కాలు మినహా

ధర్మవరం :— తా॥ అనంతపురం తా॥ లోని బుక్కచర్ల ఫిర్కా.

కల్యాణదుర్గం } కల్యాణదుర్గం తా॥ బుక్కచర్ల ఫిర్కా మినహా
అనంతపురం } అనంతపురం తా॥ గుత్తి తా॥లోని పామిడి, నాగసముద్రం ఫిర్కాలు.

తాడిపత్రి :— తాడిపత్రి తా॥

గుత్తి :— పామిడి, నాగసముద్రం ఫిర్కాలు పోగా మిగులు గుత్తి తా॥ యావత్తు.

## బళ్లారి జిల్లా

ఆదోని :— కొత్తాళ్ల, కోసిగి ఫిర్కాలు మినహా ఆలూరు, ఆదోని తా॥

శిరుగుప్ప :— శిరుగుప్ప తా॥ ఆదోని తా॥లోని కొతాళం, కోసిగి ఫిర్కాలు

బళ్ళారి :— బళ్లారి తా॥

రాయదుర్గం :— రాయదుర్గం తా॥

హోస్పేట :— హోస్పేట, సాంతూరు తా॥

కుడ్లిగి :— కుడ్లిగి తా॥ హర్పనహల్లి తా॥ చిగతేరి ఫిర్కా హర్పనహల్లి ని తా॥ చేరిన హడగల్లి తా॥ ఇట్టిగిఫిర్కా గ్రామములు పోగా మిగిలిన ఇట్టిగిఫిర్కా

హర్పనహల్లి :— ఇట్టిగ ఫిర్కాలోని హంపసాగర. ఎనిగి, బన్నికల్, ఎనిగిబసపూర్, జి. కొడిహల్లి, కొడ్లబల్, బైలసిగిదేరి, హగరి, బొమ్మనహల్లి, చింత్రపల్లి గ్రామములున్నా హడిగల్లి తాంబ్రహల్లి ఫిర్కాలు, హర్పనహల్లి తా॥ హర్పనహల్లి, అరిశకేర్, తెలిగిఫిర్కాలు

## చిత్తూరు జిల్లా

ఘట్టు :— మదనపల్లి తా॥ తంబళ్లపల్లి, బురకాయలకోట, పెదతిప్ప సముద్రము, ఘట్టు ఫిర్కాలు.

మదనపల్లి :— మదనపల్లి పడమర, మదనపల్లి తూర్పు ఫిర్కాలు, వాయలపాడు తా॥ వాయలపాడు, కదిరాయచెర్వు ఫిర్కాలు.

పుంగనూరు :— పుంగనూరు తా॥

పీలేరు :— పీలేరు, మేడికుర్తి గర్నమిట్ట ఎర్రవారిపాలెం ఫిర్కాలు.

పలమనేరు :— పలమనేరు తా॥

చిత్తూరు :— చిత్తూరు తా॥

తిరుత్తణి :— పుత్తూరు తా॥ నగరి ఫిర్కా తిరుత్తణి, కనకమ్మ సత్రం ఫిర్కాలు.

పళ్లిపట్టు :— పళ్లిపట్టు, ఎరుంబి, రామకృష్ణరాజుపేట ఫిర్కాలు.
కాళహస్తి :— నగరిఫిర్కా మినహా కాళహస్తి, పుత్తూరు తా
చంద్రగిరి :— చంద్రగిరి తా॥

## మ ద రా సు న గ ర ం

చాకలిపేట :— కొత్తచాకలిపేట, రాయపురం, శింగార తోటం, సంజీవరాయన్ పేట, కొరుకుపేట.

హార్బర్ : పెద్దనాయకన్ పేట, ఏడుబావులు, అమ్మన్‌కోయిల్, ముత్యాలపేట, హార్బర్, కబాలేశ్వర్, కొత్వాల్ బజార్, సౌకార్ పేట, ట్రెవిలిన్ బేశిన్, ఫోర్టుఏరియా వార్డులు.

చూళై :— బేసిన్ బ్రిడ్జి, చూళై, పులియన్‌తోపు, కొసపేట, పెరంబూరు, సెంబియం, అయినావరం, పురశువాక్కం, వ్యాసర్‌పాడి.

ఫ్లాజండ్ లైట్సు :— తేనాంపేట, రాయపేట, ఫ్లాజండ్ లైట్సు కొడంబాక్కం, నుంగంబాక్కం, కీల్పాక్.

ఎగ్మూర్ :— ఎడపాలెం, పార్కుటవున్, పెరియమెట్ వేపేరి, చింతాద్రిపేట, పుదుపాక్కం వార్డులు.

తిరువల్లిక్కేణి :— నేపియర్‌పార్కు, తిరువత్తీశ్వరన్ పేట. ఛీపాక్, తిరువళిక్కేణి, జాంబజార్, మాతాసాహెబ్ పేట,

మైలాపూర్ :— ఉత్తర మైలాపూర్, దక్షిణ మైలాపూర్, అడయార్, గిండీ: సైదాపేట, త్యాగరాయనగర్ ఉత్తరం, త్యాగ నగర్ దక్షిణం వర్డులు.

## తూర్పు గోదావరి జిల్లా

భద్రాచలం :— నూగూరు, భద్రాచలం, చోడవరం, ఎల్లవరం తా॥లు రాజమండ్రి తా॥ గోకవరం తా॥ ఫిర్కా, పెద్దాపురం తా॥ ఏలేశ్వరం, ప్రత్తిపాడు పిర్కాలు.

తుని :— తుని తా॥, పెద్దాపురం తా॥ రాతులపాడు పిర్కా.

పిఠాపురం :— పిఠాపురం తా॥

పెద్దాపురం :— జగ్గంపేట, పెద్దాపురం ఫిర్కాలు

జరుగుపూడి :— పెద్దాపురం తా॥ రంగంపేట ఫిర్కా, బురుగుపూడి, రఘుదేవపురం, రాజానగరం ఫిర్కాలు (రాజమండ్రి తా॥)

రాజమండ్రి :— శ్రీ కృష్ణాపట్నం, భూపాలపట్నం, జి. ఎర్రంపాలెం, కొండ గుంటూరు పంచాయతీలుపోగా మిగులు రాజమండ్రి ఫిర్కా యావత్తూ

కాకినాడ :— యండమూరు ఫిర్కా పోగా మిగులు కాకినాడ తాలూకా.

రామచంద్రాపురం :— యండమూరు ఫిర్కా, రామచంద్రాపురం తా॥ రామచంద్రాపురం, వెంకటాయపాలెం ఫిర్కాలు.

అనపర్తి :— రాజమండ్రి ఫిర్కాలోని శ్రీ కృష్ణపట్నం, భూపాలపట్నం, జి. ఎర్రంపాలెం, కొండ గుంటూరు పంచాయతీలు, అనపర్తి, సోమేశ్వరం ఫిర్కాలు, మండపేట ఫిర్కాలోని కేశవరం, ద్వారపూడి (మేర్నిపాడుతో చేరి) పాలతోడు, ఇప్పనపాడు, అర్తమూరు పంచాయతీలు, మేడపాడు, చినద్వారపూడి గ్రామములు.

పామర్రు :— అనపర్తి ని॥లో చేర్చిన గ్రామములుపోగా మిగులు మండపేట ఫిర్కా, అలమూరు, పామర్రు ఫిర్కాలు.

అమలాపురం :— అమలాపురం తా॥

రాజోలు :— రాజోలు తా॥

## పశ్చిమ గోదావరి జిల్లా

చింతలపూడి :— చింతలపూడి తా॥ ఏలూరు తా॥ దెందులూరు ఫిర్కా.

ఏలూరు :— ఏలూరు; పెదపాడు ఫిర్కాలు

తాడేపల్లి గూడెం :— తాడేపల్లిగూడెం ఫిర్కా, ఉంగుటూరు ఫిర్కాలోని వల్లమాడు, గోపీనాధపట్నం, నాచుగుంట, ఉంగుటూరు గ్రామములు ఏలూరు తా॥ భీమడోలు ఫిర్కా

అలంపురం :— తాడేపల్లిగూడెం ని॥లో చేరిన తాడేపల్లి గూడెం ఫిర్కా ఉంగుటూరు ఫిర్కాలోని గ్రామములు, ఉండి నియోజక వర్గములో చేర్చిన గణపవరం ఫిర్కా గ్రామములుపోగా మిగిలిన తాడేపల్లి గూడెం తా॥

ఉండి :— ఉండి, ఆకివీడు ఫిర్కాలు, పెదపుల్లేరు, వాండ్రం, జక్కారం, కోపల్లె, వేంపాడు, చినమెరం గ్రామములు పోగా మిగులు బొండాడ ఫిర్కా గణపవరం, పిప్పర, వెంకట్రాగపురం, కొత్తపల్లి, అర్ధవరం, ముగ్గుల, కాకినాడ, కేశవరం గ్రామములు.

భీమవరం .— భీమవరం, వీరవాసరం ఫిర్కాలు, పెదపుల్లేరు, వాండ్రం, జక్కారం, కోపల్లె, వేంపాడు, చినమెరం గ్రామములు.

నరసాపురం :— నరసాపురం తా॥

తణుకు :— తణుకు, పెరవలి ఫిర్కాలు.

పెనుగొండ :— తణుకు, పెరవలి ఫిర్కాలుపోగా మిగులు తణుకు తా॥ యావత్తు.

కొవ్వూరు :— కొవ్వూరు, పోలవరం తా॥

## గుంటూరుజిల్లా

వినుకొండ :— వినుకొండ తా॥

పల్నాడు :— పిడుగురాళ్ల, కారెంపూడి ఫిర్కాలు మినహా పల్నాడు తా॥

బెల్లంకొండ :— పల్నాడు తా॥లోని పిడుగురాళ్ళ, కారెంపూడి ఫిర్కాలు సత్తెనపల్లి తా॥ బెల్లంకొండ, అచ్చంపేట ఫిర్కాలు.

నరసారావుపేట :— రొంపిచర్ల, నరసారావుపేట, నాదెళ్ల ఫిర్కాలు.

చిలకలూరిపేట :— నరసారావుపేట, తా॥ కొమ్మలపాడు, మారుటూరు, చిలుకలూరిపేట పిర్కాలు, ఒంగోలు తా॥ అద్దంకి ఫిర్కా లోని వల్లపల్లి, వలపర్ల, చినకొత్తపల్లి, ధర్మవరం, రామకూరు, బొల్లపల్లి [illegible], కొండమంజులూరు.

సత్తెనపల్లి :— సత్తెనపల్లి, పిరంగిపురం ఫిర్కాలు.

మంగళగిరి :— గుంటూరు తా॥ తాడికొండ, మంగళగిరి ఫిర్కాలు (మంగళగిరి ఫిర్కాలోని చినకాకాని, చినవడ్లపూడి, ఇప్పటం, కంతేరు, కాజ, నిడమర్రు, నూతక్కి, పెదవడ్లపూడి, రామచంద్రాపురం గ్రామములు మినహా) సత్తెనపల్లి తా॥ పెదకూరపాడు ఫిర్కా.

గుంటూరు :— గుంటూరుఫిర్కా

ప్రత్తిపాడు :— పెదకాకాని, ప్రత్తిపాడు ఫిర్కాలు, మంగళగిరి నియోజకవర్గంలో మినహాయించిన మంగళగిరిఫిర్కా గ్రామములు.

దుగ్గిరాల :— తెనాలి తా॥ దుగ్గిరాల కొల్లిపర ఫిర్కాలు తెనాలిఫిర్కాలోని నందివెలుగు, గుడివాడ, కొప్పలి, కంచర్లపాలెం, కటివరం, నెలపాడు, బుర్రిపాలెం గ్రామములు

తెనాలి :— చేబ్రోలు ఫిర్కా, దుగ్గిరాల నియోజకవర్గములో చేర్చిన గ్రామములుపోగా మిగులు తెనాలిఫిర్కా

అమృతలూరు :— అమృతలూరు, వేమూరు, కొల్లూరు ఫిర్కాలు,

రేపల్లె:-కూచినపూడి, పెదమెట్లరాడి ఫిర్కాలు మినహా రేపల్లె తా॥

బాపట్ల :— బాపట్ల, యాజలిఫిర్కాలు, పరచూరు ఫిర్కాలోని గొల్లపూడి, అగ్రహారం, వీరనపాలెం, రామనాయపాలెం, చెరుకూరు తుంకలమర్రు గ్రామములు, రేపల్లె తాలూకా కూచినరాడి ఫిర్కాలు

పొన్నూరు :— కాకుమాను, పొన్నూరు ఫిర్కాలు, బాపట్ల నియోజకవర్గంలోచేరిన గ్రామాలుపోగా మిగులు పరచూరుఫిర్కా

చీరాల :— చీరాల, సంతరావూరు ఫిర్కాలు (బాపట్ల తా॥)

ఒంగోలు :— అద్దంకిఫిర్కాలోని వల్లపల్లి, వంపర్ల, చినకొత్తపల్లి, ధర్మవరం, రామకూరు, బొల్లపల్లి, కలవకూరు, కొండ ముంజులూరు గ్రామములుపోగా మిగులు ఒంగోలు తా॥ యావత్తు.

# మదరాసు గవర్నర్లు

1858 లో భారతదేశంలో ఈస్టిండియా కంపెనీవారి పరిపాలనలో వున్న భాగాలన్నిటి పరిపాలనను బ్రిటిషు ప్రభుత్వం స్వాధీనపరచుకున్నది. అప్పటినుంచి మదరాసుకు గరవర్నర్లుగా వున్నవారు :

సర్ ఛార్లెస్ ట్రెవెల్యాన్ 1859; విలియం ఏంబ్రోస్ మోర్ హెడ్ 1860; సర్ విలియం థామస్ డెనిసన్ 1861; ఎడ్వర్డ్ మాల్టబీ 1863; నేపియర్ ప్రభువు 1866; హోబర్ట్ ప్రభువు 1872; బకింగ్ హాం ప్రభువు 1875; ఎల్ఫిన్‌స్టన్ గ్రాంట్ డఫ్ 1881; రాబర్ట్ బర్క్ 1886; వెన్‌లాక్ ప్రభువు 1891; సర్ ఆర్థర్ హావెలక్ 1896; ఎంప్టిల్ ప్రభువు 1900; సర్ ఆర్థర్ లాలీ 1906; పెంట్లండ్ ప్రభువు 1912; విల్లింగ్డన్ ప్రభువు 1919; గోషెన్ ప్రభువు 1924; సర్ నార్మన్ మార్జ్ బాంక్స్ 1929; సర్ జార్జి స్టాన్లే 1929; ఎర్స్కిన్ ప్రభువు 1934; సర్ ఆర్థర్ హోప్ 1940; సర్ ఆర్చిబాల్డ్ నై 1945; భావనగర్ మహారాజు 1948; శ్రీ శ్రీ ప్రకాశ, 1952.

1934 లో సర్ జార్జి స్టాన్లే వెళ్ళిపోయి, ఎర్స్కిన్ ప్రభువు వచ్చే లోగా ఆరునెలల కాలం సర్ మహమ్మద్ ఉస్మాన్ సాహెబ్ బహదూరున్నూ, 1936 లో ఎర్స్కిన్ ప్రభువు సెలవులో వెళ్ళినప్పుడు సుమారు నాలుగు మాసములు సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడున్నూ ఆక్టింగ్ గవర్నర్లుగా వున్నారు. స్వరాజ్యానికి పూర్వం మదరాసుకు గవర్నర్లుగా వున్న దేశీయులు వీ-ద్దరే.

## రాష్ట్ర ప్రధానమంత్రులు

మాంటెగు-ఛెమ్సుఫర్డ్ సంస్కరణలు ప్రవేశపెట్టి నప్పటి నుంచీ 1935 ఇండియా చట్టము అమలులోకి వచ్చేవరకు రాష్ట్రప్రభుత్వంలో ఛీఫ్ మినిస్టర్లుగా వున్నవారును, 1937 లో 1935 ఇండియాచట్టం అమలులోకి వచ్చినతరువాత ప్రధానమంత్రులుగా వున్నవారును, ఎంతెంతకాలం పరిపాలన సాగించినదీ ప్రక్క పేజీలోని పట్టీవలన తెలుసుకో వచ్చును.

| ప్రధానమంత్రి : | పార్టీ : | పదవినిర్వహణ : |
|---|---|---|
| పానగల్ రాజా | జస్టిస్ | 1921-26 |
| డాక్టర్ పి. సుబ్బరాయన్ | జస్టిస్ | 1926-30 |
| బి. మునిస్వామినాయుడు | జస్టిస్ | 1930-32 |
| బొబ్బిలిరాజా | జస్టిస్ | 1932-37 |
| సర్ కె. వి. రెడ్డినాయుడు | జస్టిస్ | 1937 |
| సి. రాజగోపాలాచారి | కాంగ్రెసు | 1937-39 |
| టంగుటూరి ప్రకాశం | కాంగ్రెసు | 1946-47 |
| ఓ. పి. రామస్వామి రెడ్డియార్ | కాంగ్రెసు | 1947-49 |
| పి. ఎస్. కుమారస్వామిరాజా | కాంగ్రెసు | 1949-52 |
| సి. రాజగోపాలాచారి | కాంగ్రెసు | 1952 ఏప్రిల్ 10 నుంచి |

ప్రజా ప్రతినిధుల పేరుతో, మొట్ట మొదట- అనధికారవర్గాలలో నుంచి మంత్రుల నియామకం మదరాసు రాష్ట్రంలో 1920 డిసెంబరు 17 తేదిన జరిగింది. ఆనాడు మంత్రులుగా ప్రమాణం స్వీకరించినవారు సుబ్బరాయలురెడ్డియార్, పానగల్ రాజా, సర్ కె. వి. రెడ్డినాయుడు.

1921 జనవరి 15 తేదిన మదరాసు రాష్ట్రంలో మొట్టమొదటి శాసన సభ ప్రారంభమైంది.

గత 30 సంవత్సరాలలోను 1939 అక్టోబరు నుంచి 1949 మే నెల వరకు అంటే 6½ సంవత్సరాలు రాష్ట్రపరిపాలన గవర్నరు సలహాదార్ల ద్వారా జరిగినది.

గవర్నరు : హిజ్ ఎక్సెలెన్సీ శ్రీ శ్రీ ప్రకాశ.

పదవీ స్వీకారం : 1952 మార్చి 12.

జీతం : రు. 5,500 (ఇన్‌కమ్‌టాక్సుపోను, 3,000).

జీతంకాక, అతిథులకు విందు మొదలైనవి చెయ్యడానికి రు. 23,000 గవర్నరుకు అలవెన్సు ఇవ్వబడుతుంది.

సెక్రటరీ : హెచ్. సాంబమూర్తి
మిలిటరీ అసిస్టెంట్ : మేజర్ రాజకుమార్ భగవాన్‌దాస్
సర్జన్ : డబ్ల్యు. అచ్చయ్య నాయుడు
అంగరక్షకులు : కెప్టెన్ కె. టి. బాపయ్య
కెప్టెన్ కందస్వామి మణి
గౌరవ లెఫ్టినెంటు పి. నారాయణస్వామి

## మంత్రిమండలి : పదవీస్వీకారం : 10 ఏప్రిల్ 1952

ముఖ్య మంత్రి పబ్లిక్, పోలీసు శాఖలు : చక్రవర్తి రాజగోపాలాచారి.

ఆరోగ్య మంత్రి : ఏ. బి. షెట్టి

ఆర్థిక, మంత్రి ఆహారశాఖ, ఎన్నికలు : పి. సుబ్రమణ్యం

మతాదాయ, రిజిస్ట్రేషన్ మంత్రి : కత్తె వెంకటస్వామి నాయుడు

పబ్లిక్ వర్క్సుమంత్రి : ఎన్. రంగారెడ్డి

విద్యా మంత్రి ప్రచురణ, హరిజ నాభ్యుదయ శాఖలు : డాక్టర్ మల్లవరపు వెంకట కృష్ణారావు

మద్యనిషేధ మంత్రి : వి. పి. పళనిస్వామి గౌండర్

పరిశ్రమల మంత్రి కార్మిక శాఖ, మోటారు రవాణా : డాక్టర్ యు. కృష్ణారావు.

వ్యవసాయ మంత్రి అడవులు : రాయదుర్గం నాగన్నగౌడ్ పశుగణాభివృద్ధి

స్థానిక పరిపాలన మంత్రి : నాయుకంటి శంకరరెడ్డి

రెవిన్యూ మంత్రి : ఎం. ఎ. మాణిక్యవేలు నాయకర్

న్యాయశాఖ మంత్రి : కె. పి. కుట్టి కృష్ణన్ నాయర్

ఇండ్ల అద్దెలకంట్రోలు మంత్రి : శ్రీ షణ్ముగ రాజేశ్వర్ సేతుపతి

గ్రామాభివృద్ధి, వాణిజ్యపన్నులు మంత్రి : బులుసు ప్రభాకర పట్టాభి రామారావు.

సహకార, గృహ నిర్మాణం మంత్రి : డి. సంజీవయ్య

ఆహారమంత్రికి పార్లమెంటరీ సెక్రటరీగాను, గవర్నమెంటు ఛీఫ్ విప్‌గాను కె. రాజారాం నాయుడుగారు నియమింప బడినారు. వీరికి జీతం నెలకు రు. 500 ; అలవెన్సురు. 250.

మంత్రుల జీతాలు : 1946 లో ప్రకాశం మంత్రిమండిలి ఏర్పాటయినప్పుడు, మంత్రుల జీతాలు ఒక్కొక్కరికి వెయ్యిరూపాయలుగా ఏర్పాటుచెయ్యబడినవి. 1947 మార్చిలో ఓమండూర్ పి. రామస్వామి రెడ్డియార్ మంత్రిమండలి ఏర్పాటయినతరువాత, మంత్రుల జీతాలు ఒక్కొక్కరికి 850 రూపాయలుగా నిర్ణయింపబడినవి. మళ్ళీ, 1949 ఏప్రిల్ లో పి. ఎస్. కుమారస్వామి రాజా మంత్రిమండలి ఏర్పాటయిన తరువాత మంత్రుల జీతాలు యీ క్రిందివిధంగా నిర్ణయింపబడినవి.

జీతం, నెలకు రు. 1000.

కారు, ఇంటి అద్దె ; అలవెన్సులు నెలకు రు. 500.

## మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిల్

చైర్మను : డాక్టర్ పి. వి. చెరియన్
డిప్యూటీ చైర్మను : అల్లా పిచ్చై
సెక్రటరీ : ఆర్. ఎ. కృష్ణయ్యర్

## సభ్యులు

మొత్తం సభ్యులు 72. సభ్యుల పేర్లు నియోజక వర్గములవారీగా యీక్రింద ఇవ్వబడినవి.

అసెంబ్లీనుంచి ఎన్నుకోబడినవారు, 24 : ఎ. ఎం. అల్లాపిచ్చై వి. చక్కరై చెట్టి ; చంద్ర రాజేశ్వరరావు ; గురునందనరావు ; టి. జి. కృష్ణమూర్తి ; మద్ది సుదర్శనం ; ఎన్. రంగారెడ్డి ; వి. రామ కృష్ణ ; శివజ్ఞాన గ్రామణి ; సయ్యద్ మహబూబ్ ; టంగుటూరి

ప్రకాశం ; ఆర్. కె. షణ్ముఖం చెట్టి ; ఎస్. బి. ఆదిత్యన్ ; ఎం. పి. గోవింద మీనన్ ; నల్లసేనాపతి సర్కరై మన్రాడియర్ ; టి. జె. ఎం. విల్సన్ ; కె. పి. యజ్ఞేశ్వరశర్మ ; ఎం. ఎతిరాజులు ; బి. వి. సుబ్రమణ్యం ; పి. ఆర్. వి. రంగరావు ; ఆర్. గోవిందరాజులు నాయుడు ; ఎస్. మంజుభాషిణి ; ఎన్. అన్నామలై పిళ్ళై ; ఎ. సుబ్రమణ్యం.

ఉత్తర మదరాసు గ్రాడ్యుయేట్సు నియోజకవర్గం : (2) డాక్టర్ ఎం. వి. కృష్ణారావు, శ్రీమతి జాస్తి సీతామహాలక్ష్మి.

ఉత్తర మదరాసు ఉపాధ్యాయుల నియోజక వర్గం ; (2) దామెర్ల వెంకటరావు ; సింగరాజు రామకృష్ణయ్య.

దక్షిణ మదరాసు గ్రాడ్యుయేట్సు నియోజకవర్గం : (4) డాక్టర్ ఎ. లక్ష్మణస్వామి మొదలియార్ ; డాక్టర్ పి. వి. చెరియన్ ; కె. బాలసుబ్రాహ్మణ్య అయ్యర్ ; కె. భాష్యం.

దక్షిణ మదరాసు ఉపాధ్యాయుల నియోజకవర్గం : (4) వి. ఆర్. రంగనాథ మొదలియార్ ; అలెగ్జాండర్ జ్ఞానముత్తు ; జి. కృష్ణమూర్తి ; ఇ. హెచ్ పరమేశ్వరన్.

స్థానిక సంస్థల తరఫున ఎన్నుకోబడినవారు, 24 : ఆ నియోజక వర్గములవారీగా పేర్లు ఇవి :

శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పు గోదావరి జిల్లాల నియోజక వర్గం : 3 : రిమ్మలపూడి వెంకట సుబ్బారావు చౌదరి ; కుడుపూడి సూర్యనారాయణ ; పుల్లెల సీతారామయ్య.

పశ్చిమ గోదావరి, కృష్ణ, గుంటూరు జిలాల నియోజకవర్గం : 3 : మాగంటి సీతారామదాస్ ; ముళ్ళపూడి హరిశ్చంద్ర ప్రసాద్ ; నల్లపాటి వెంకటేశ్వర్లు.

నెల్లూరు, చిత్తూరు జిల్లాల నియోజకవర్గం : 2 : ఆర్. నాథముని రెడ్డియార్, సుంకు చెంగల్వరాయచెట్టి.

బళ్ళారి, అనంతపురం, కర్నూలు, కడప జిల్లాల నియోజకవర్గం : 2 : గోపవరం వెంకట రెడ్డి ; వై. మహాబలేశ్వరప్ప.

మదరాసు, చంగల్పట్, ఉత్తరార్కాటు జిల్లాల నియోజక వర్గం : 3 : సి. పెరుమాళ్లుస్వామి రెడ్డియార్ ; డాక్టర్ సి. నాథముని నాయుడు ; టి. పురుషోత్తం.

దక్షిణార్కాడు, తంజావూరు, తిరుచినాపల్లి జిల్లాల నియోజక వర్గం : 3 : ఎ. సోమసుదరం ; పి. మరుదవనం పిళ్ళె ; అబ్దుల్ సలాం.

మధుర, రామనాథపురం, తిరునెల్వేలి జిల్లాల నియోజకవర్గం : 3 : ఎస్. ఓ. ఎస్. పి. ఒడయప్ప, పి. శివసుబ్రమణ్య నాడార్ ; టి. ఎస్. శంకరనారాయణ పిళ్ళె.

సేలం, కోయంబత్తూరు, నీలగిరి జిల్లాల నియోజకవర్గం : 3 : రంగస్వామి నాయుడు ; కె. ఎన్. పళనిస్వామి గౌండర్ ; పి. బి. కె. త్యాగరాజరెడ్డియార్.

పశ్చిమతీరం (మలబార్, దక్షిణ కన్నడ జిల్లాల నియోజకవర్గం : 2|: నరసప్పయ్య ; కుణిపోకర్.

గవర్నరుచే, నామినేట్ చేయబడినవారు : 12 :

చక్రవర్తి రాజగోపాలాచారి ; మహమ్మద్ ఉస్మాన్ ; వి. భాష్యం అయ్యంగార్ ; ఓ. పి. రామస్వామి రెడ్డియార్ ; డాక్టర్ (శ్రీమతి) ఎస్. ముత్తు లక్ష్మిరెడ్డి ; టి. ఎం. శైవ శిఖామణి ఆచార్య ; శ్రీమతి ఆర్. ఎస్. సుబ్బలక్ష్మి అమ్మాళ్ ; పి. ఎన్. మార్తాండం పిళ్ళె ; జి. వెంకటాచలం ; శ్రీమతి ఎం ఎస్. క్లబ్‌వాలా ; మోటూరి సత్యనారాయణ ; నరసింహదేవర సత్యనారాయణ.

## మదరాసు లెజిస్లేటివ్ అసెంబ్లి

మొత్తం సభ్యులు—376

ఎన్నుకోబడినవారు—375

ఆంగ్లో ఇండియనుల తరఫున

గవర్నరుచే నామినేట్ చేయబడిన సభ్యుడు—1

స్పీకర్ : జె. శివషణ్ముగం పిళ్ళై
డిప్యూటి స్పీకర్ : వి. భక్తవత్సలు నాయుడు.
సెక్రటరి : ఆర్. వి. కృష్ణయ్యర్
డిప్యూటి సెక్రటరి ఎం. సూర్యారావు

(సభ్యుల పేర్లు, జిల్లాల వారిగా యీ క్రింద ఇవ్వబడినవి. తెలుగు జిల్లాల సభు ల పేర్లుతోపాటు, వారు ఎన్నిక అయిన నియోజకవర్గం పేరు కూడా ప్రక్కనే ఇవ్వబడినవి.)

నామినేటెడ్ ఆంగ్లో ఇండియన్ : డబ్ల్యు. జె. ఫెర్నాండెజ్.

### అనంతపురం

కాంగ్రెసు, 4 ; ప్రజాపార్టి, 2 ; కమ్యూనిస్టు, 1 ; స్వతంత్రులు, 2.

కాంగ్రెసు ; ఎస్. నారాయణప్ప, కల్యాణదుర్గం ; కె. శాంతప్ప కల్యాణదుర్గం, రిజర్వ్‌డ్ ; జి. శివశంకరరెడ్డి, హిందూపూర్ ; కె. వి. వేమారెడ్డి, కదిరి.

ప్రజాపార్టి : సి. సుబ్బరాయుడు, తాడిపత్రి ; కాసెట్టి శ్రీనివాసులు, ధర్మవరం.

కమ్యూనిస్టు : టి. నాగిరెడ్డి, అనంతపురం.

స్వతంత్రులు : ఆర్. సిద్దన్నగౌడ్, మడకశిర ; లక్ష్మీనారాయణ రెడ్డి, పెనుకొండ.

### కడప

కాంగ్రెసు, 3 ; ప్రజాపార్టి ,2 ;కమ్యూనిస్టు, 2 స్వతంత్ర, 1.

కాంగ్రెసు : కె. బాలనారాయణరెడ్డి, ప్రొద్దటూరు ; కె. కోటి రెడ్డి, కడప ; పి. వెంకటసుబ్బయ్య, రాజంపేట, రిజర్వ్‌డ్.

ప్రజాపార్టి : వై. ఆదినారాయణరెడ్డి, రాయచోటి ; కె. రామయ్య, జమ్మలమడుగు,

కమ్యూనిస్టు : పి. నరసింహారెడ్డి, రాజంపేట ; ఎన్. శివరామరెడ్డి, కమలాపురం.

స్వతంత్ర : వి. చిదానందం, బద్వేల్.

### కర్నూలు

కాంగ్రెసు, 3 ; కమ్యూనిస్టు, 1; సోషలిస్టు, 1 ; స్వతంత్రులు 2. కృషికార్ లోక్ పార్టి, 1.

కాంగ్రెసు : పిడతల రంగారెడి, కంభం ; డి. సంజీవయ్య, కర్నూలు, రిజర్వ్‌డ్ ; ఎన్. శంకరరెడ్డి, కర్నూలు.

కమ్యూనిస్టు : సి. పుల్లారెడ్డి, నందికొట్కూర్.

సోషలిస్టు : ఎం. వెంకటసుబ్బారెడ్డి, కోయిల్‌కుంట్ల.

స్వతంత్రులు : ఎం. సుబ్బారెడ్డి, నంద్యాల ; కె. వెంకటశెట్టి, ద్రోణాచలం.

కృషికార్ లోక్ : ఎన్. వెంకటయ్య, మార్కాపురం.

### కృష్ణ

కాంగ్రెసు : 2 : కమ్యూనిస్టు, 10

కాంగ్రెసు : రాజా మేకా రంగయ్య అప్పారావు బహదుర్, నూజవీడు ; అడుసుమిల్లి వెంకటసుబ్రహ్మణ్యం, కైకలూర్.

కమ్యూనిస్టు : జి. ఆంజనేయులు, బందరు ; జి. బాపనయ్య, దివి, రిజర్వ్‌డ్ ; చంద్ర రామలింగయ్య, దివి ; ఎం. లక్ష్మణస్వామి, కంకిపాడు ; టి. పోతరాజు, విజయవాడ ; కొట్టగడ్డ రాజగోపాలరావు, గుడివాడ; జి. రామారావు, గుడివాడ, రిజర్వ్‌డ్ ; పి. రామారావు, తిరువూరు ; వి. రామారావు, కంచికచెర్ల ; పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, జగ్గయ్యపేట.

### గుంటూరు

కాంగ్రెసు, 3; ప్రజాపార్టి, 3; కమ్యూనిస్టు, 10; స్వతంత్రులు, 2.

కాంగ్రెసు : శ్రీమతి తమ్మా కోటమ్మ రెడ్డి, ప్రత్తిపాడు ; ఎ. రామిరెడ్డి, దుగ్గిరాల ; అలపాటి వెంకటరామయ్య, తెనాలి.

ప్రజాపార్టి : ప్రగడ కోటయ్య, చీరాల ; నడింపల్లి వెంకటలక్ష్మి నరసింహారావు, గుంటూరు; నల్లపాటి వెంకటరామయ్య, నరసారావుపేట.

కమ్యూనిస్టు : జి. జోసెఫ్, అమృతలూర్ ; డి. లక్ష్మయ్య, మంగళగిరి ; కె. మాలకొండయ్య. ఒంగోలు, రిజర్వ్డ్ ; ఎం. నారాయణ స్వామి, ఒంగోలు ; కె. రంగారావు, చిలకలూరిపేట ; వి. శ్రీకృష్ణ, బాపట్ల ; కె. సుబ్బారెడ్డి, పల్నాడు ; కె. వెంకయ్య, పొన్నూరు ; పి. వెంకటశివయ్య, వినుకొండ ; ఎం. హనుమంతరావు, రేపల్లె.

స్వతంత్రులు : ఎం. బాపయ్యచౌదరి, బెల్లంకొండ ; వావిలాల గోపాలకృష్ణయ్య, సత్తెనపల్లి.

చిత్తూరు

కాంగ్రెసు, 7 ; ప్రజాపార్టీ, 1; కమ్యూనిస్టు, 1; కృషికార్ లోక్ పార్టీ, 2 ; స్వతంత్ర, 1.

కాంగ్రెసు : ఆదికేశవులు నాయుడు, చంద్రగిరి ; ఎ. బలరామ రెడ్డి, కాళహస్తి ; బి. కృష్ణమూర్తిరావు, పుంగనూర్ ; డి. రామబ్రహ్మం, పలమనేర్ ; కిడాంబి వరదాచారి, తిరుత్తణి , టి. ఎన్. వెంకటసుబ్బా రెడి, ఘట్టు ; ఎం. దురై కణ్ణు, తిరుత్తణి ; రిజర్వ్డ్.

ప్రజాపార్టీ : కుమారస్వామి రాజాబహదూర్, కార్వేటినగరం జమీందారు, పుత్తూరు.

కమ్యూనిస్టు : డి. సీతారామయ్య, మదనపల్లి.

కృషికార్ లోక్ పార్టీ : శృంగారం, చిత్తూర్ రిజర్వ్డ్ ; పి. తిమ్మారెడ్డి, పైలేరు.

స్వతంత్ర : పి. చిన్నమరెడ్డి, చిత్తూరు.

తూర్పు గోదావరి

కాంగ్రెసు, 4 ; ప్రజాపార్టీ, 4 ; కమ్యూనిస్టు 5 ; కృషికార్ లోక్ పార్టీ, 1 ; షెడ్యూల్డుకాస్టు ఫెడరేషన్, 1 ; స్వతంత్ర, 1.

కాంగ్రెసు : రాజావత్సవాయ వెంకట కృష్ణంరాజు బహదూర్, తుని ; ఎస్. బి. పి. పట్టాభిరామారావు, రామచంద్రపురం ; తోట రామస్వామి, [illegible]పురం ; పి. సత్యనారాయణ రెడ్డి, అనపర్తి.

ప్రజాపార్టీ : కె. బాపన్నదొర, భద్రాచలం ; రిజర్వ్డ్ ; వై. వి. కృష్ణారావు, భద్రాచలం ; కె. రాజగోపాల నరసరాజు రామచంద్ర పురం ; నడింపల్లి రామభద్రరాజు, అమలాపురం.

కమ్యూనిస్టు : జి. నాగేశ్వరరావు, రాజోలు ; సి. ప్రభాకర చౌదురి, రాజమండ్రి; సి. వెంకటకృష్ణరావు, కాకినాడ; ఆర్. వెంకట జగ్గారావు, పిఠాపురం ; అల్లూరి వెంకటరామరాజు, రాజోలు, రిజర్వ్డ్.

కృషికర్ లోక్ పార్టీ ; ఎన్.వి. రామారావు, బూరుగుపూడి.

షెడ్యూల్డ్ కాస్టు ఫెడరేషన్ : బొజ్జా అప్పలస్వామి, అమలాపురం, రిజర్వ్డ్.

స్వతంత్ర : సాకా వెంకటరావు, కాకినాడ, రిజర్వ్డ్.

నెల్లూరు

కాంగ్రెసు, 5; ప్రజాపార్టీ, 2; కమ్యూనిస్టు, 3; స్వతంత్రులు, 3

కాంగ్రెసు : ఎన్. చెంచురామనాయుడు, కందుకూరు; డి. దశరథరామయ్యనాయుడు, రాపూరు; పి. గోపాలకృష్ణరెడ్డి, గూడూరు; కె. షణ్ముగం, కందుకూరు, రిజర్వ్డ్; పి. వెంకటస్వామిరెడ్డి, వెంకటరెడ్డి.

ప్రజాపార్టీ : బత్తిని రామకృష్ణారెడ్డి, కావలి; పి. రామయ్య చౌదరి, ఉదయగిరి.

కమ్యూనిస్టు : ఎస్. కాశిరెడ్డి, దర్శి; బి. శంకరయ్య, కోవూరు; జి. యల్లమందరెడ్డి, కనిగిరి.

స్వతంత్రులు ; జి. సి. కొండయ్య, ఆత్మకూరు; కె. కృష్ణారావు, నెల్లూరు; ఎస్. వేమయ్య, నెల్లూరు రిజర్వ్డ్.

పడమటి గోదావరి

కాంగ్రెసు, 2; ప్రజాపార్టీ, 5; కమ్యూనిస్టు 5.

కాంగ్రెసు : సి. హెచ్. ఎన్. ఆర్. వి. పి. మూర్తిరాజు, తాడేపల్లి గూడెం; డి. నారాయణరాజు, ఉండి.

ప్రజాపార్టీ : డి. బసివిరెడ్డి, పెనుకొండ; సి.హెచ్. ఇంద్రయ్య, తణుకు; ఎం. రాజేశ్వరరావు, కొవ్వూరు రిజర్వుడ్; భూపతిరాజు సుబ్బ తాతరాజు, భీమవరం; పసల సూర్యచంద్రరావు, అలంపురం.

కమ్యూనిస్టు : ఎం. కూనే రావు, చింతలపూడి. బి. లక్ష్మీనరస రాజు నరసాపురం; పి. శ్యామసుందరరావు, నరసాపురం, రిజర్వుడ్; పి. ఎస్. రామచంద్రరావు, కొవ్వూరు. జి. సత్యనారాయణ, ఏలూరు.

బళ్ళారి

కాంగ్రెసు : టి. మల్లయ్య, అదోని రిజర్వుడ్; జి. నరసింహం, రాయదుర్గ; ఆర్. నాగన్నగౌడ్, హొసపేట; ఎస్. పరమేశ్వరప్ప, సిరుగుప్ప హార్పనహళ్ళి.

కృషికార్ లోక్ పార్టీ : ముండ్లూర్ గంగప్ప, బళ్ళారి.

స్వతంత్రులు : కోట్ర బసవన గౌడ, కుడ్లిగి; హెచ్. రామలింగారెడ్డి, ఆదోని

విశాఖపట్టణం

ప్రజాపార్టీ, 1; కమ్యూనిస్టు, 2 సోషలిస్టు, 4; కృషికార్ లోక్ పార్టీ 5; స్వతంత్ర 2

ప్రజాపార్టీ : తెన్నేటి విశ్వనాథం, విశాఖపట్టణం.

కమ్యూనిస్టు: కె. గోవిందరావు, అనకాపల్లి; ఎం. వీరభద్రం, పారవద;

సోషలిస్టు : రాజా వూసపాటి విజయ రామగజపతి బహదూర్ విజయనగరం; జి. సూర్యనారాయణ, విజయనగరం, రిజర్వుడ్; కె. వి. ఎస్. పద్మనాభం, ఆలమండ; సి. వి. సోమయాజులు, శృంగవరపుకోట

కృషికార్ లోక్ పార్టీ : పి. బాపునాయుడు, యలమంచిలి; బి. గంగయ్యనాయుడు మాడుగుల; కె. రామమూర్తి, గోలుగొండ; కంకిపాటి వీరన్నపాడల్ గోలుగొండ రిజర్వుడ్; కె. వి. రామేశం, చోడవరం;

స్వతంత్రులు : కలిగొట్ల సూర్యనారాయణ, భీమునిపట్టణం ; ఉంజాసాగి సూర్యనారాయణరాజు, పాయకరావుపేట.

శ్రీకాకుళం

కాంగ్రెసు, 5; సోషలిస్టు, 1; కృషికార్ లోక్ పార్టీ, 6; స్వతంత్రులు 3

కాంగ్రెసు : దుర్గాప్రసాద్ వీరభద్రదేవ్ బహదూర్, పార్వతీపురం; పి. గున్నయ్య, చీపురపల్లి, రిజర్వుడ్; లుకలాపు లక్ష్మణదాస్, పాతపట్నం; పలవలస సంగంనాయుడు, పాలకొండ; హెచ్. సత్యనారాయణదొర, నరసన్నపేట;

సోషలిస్టు : బెండి వెంకటమూర్తినాయుడు, బొబ్బిలి ;

కృషికార్ లోక్ పార్టి : కిళ్ళి అప్పలనాయుడు, శ్రీకాకుళం; కావలి నారాయణ, శ్రీకాకుళం రిజర్వ్డ్; ఎ. నీలాద్రిరావు రెడ్డి, ఇచ్ఛాపురం; వి. పి. పుండరీకాక్షాచార్యులు, హంజారం; కె. వెంకటనారాయణదొర, సాలూరు: గౌతు లచ్చన్న, సోంపేట.

స్వతంత్రులు : టి. సి. అచ్చన్ననాయుడు, చీపురుపల్లి; ఆర్. లక్ష్మీనరసింహందొర, టెక్కలి; ఎం. పెంటన్నాయుడు, పాతపట్నం రిజర్వ్డ్.

మదరాసునగరం

కాంగ్రెసు, 4; సోషలిస్టు, 2; కమ్యూనిస్టు, 1; స్వతంత్ర 1,

కాంగ్రెసు : డాక్టర్ ఉడిపి కృష్ణారావు సి. రాజంరామస్వామి, మైలాపూర్; ఎ. ఎం. సంబంధ, తిరువళ్ళిక్కేణి; కె. వెంకటస్వామినాయుడు, వెప్పేరీపాలం.

సోషలిస్టు: ఎస్. సి. సి. ఆంతోనిపిళ్ళై, చూళై; ఎస్. పకీరిస్వామిపిళ్ళై, పెరంబూరు.

కమ్యూనిస్టు : పి. జీవానందం, చాకలపేట.

స్వతంత్ర : జె. శివషణ్ముగంపిళ్ళై వెప్పేరీపాలు, రిజర్వ్డ్.

ఉత్తరార్కాడు

కాంగ్రెసు 8: కామన్‌వీల్, 6; షెడ్యూల్డ్ కాస్ట్ ఫెడరేషన్, 1,

స్వతంత్రులు, 4.

కాంగ్రెసు: ఎ. టి. అరుణాచల మొదలియార్; హెచ్. ఎం. జగన్నాథం; ఎస్. ఖాదర్ షరీఫ్; ఎ. కె. మాసిలామణి చెట్టియార్; ఎస్. పంచాక్షరం; ఎ. రామచంద్ర రెడ్డియార్; ఎ. ఎం. రత్నస్వామి; ఆర్. తంగవేలు.

కామన్ వీల్: వి. ధర్మలింగ నాయకర్; ఎం. సుబ్రహ్మణ్యం నాయకర్; వి. కె. కన్నన్; ఎం. ఎ. మాణిక్యవేలు నాయకర్; ఎస్. సి. రామస్వామి కందర్; శ్యామసుందర గ ండర్;

షెడ్యూల్డ్ కాస్ట్ ఫెడరేషన్: డి. దశరథన్.

స్వతంత్రులు: జి. భక్తవత్సలు నాయుడు; ఎ. కె. హనుమంతరాయ గౌండర్. ఆర్. ఎ. నటరాజ ముదలియార్; ఇ. ఎల్. రాఘవ మొదలియార్.

## కోయంబత్తూరు

కాంగ్రెసు, 11; సోషలిస్టు, 1; స్వతంత్రులు, 3

కాంగ్రెసు: ఎస్. ఆర్. ఆరుముగం; వి. జి. మాణిక్యం; ఎస్. మానగురుస్వామి నాయుడు; సి. ఎస్. నల్లగౌండర్; బి. కె. నల్లస్వామి; వి. పి. పళనిస్వామి గౌండరు; పి. ఎస్. రంగస్వామి నాయుడు; ఎ. కె. సుబ్బరాయ గౌండరు; సి. సుబ్రహ్మణ్యం; పి. కె. తిరుమూర్తి విరూపాక్షయ్య.

సోషలిస్టు: కె. ఆర్. నల్లశివన్.

కమ్యూనిస్టు: కె. టి. రాజు

స్వతంత్రులు: కెంపె గౌండర్; ఎన్. కె. పళనిసామి; ఎ. సేనాపతి గౌండర్.

## చెంగల్పట్

కాంగ్రెస్, 6; ప్రజాపార్టీ, 6; స్వతంత్ర, 1;

కాంగ్రెసు: టి. పరమేశ్వరన్; ఎం. ఆర్. రామచంద్రన్; ... రామస్వామి మొదలియార్; ఓ. వెంకటసుబ్బారెడ్డి; ఎన్. రామకృష్ణ అయ్యర్) టి. పి. ఏళుమలై.

ప్రజాపార్టి : ఓ. చంగం పిళ్లే : ఎస్. దైవశిఖామణి ; ఎం. ధర్మ లింగం : గజపతి రెడ్డి ; వి. గోవిందస్వామి నాయుడు ; కె. వినాయగం.

స్వతంత్ర : టి. షణ్ముగం.

## తంజావూరు

కాంగ్రెసు, 9; కమ్యూనిస్టు, 6; స్వతంత్రులు, 4.

కాంగ్రెసు : ఎం. మరిముత్తు ; మహమ్మద్ సాలే మారకైర్ ; పి. ముత్తయ్యపిళ్లె; ముత్తుకుమారస్వామి ; వి. నాడిముత్తుపిళ్ళై ; జి ; నారాయణస్వామినాయుడు ; త్యాగరాజపిళ్ళై ; టి. ఆర్. వరదన్ ; ఎస్. వెంకట్రామయ్యర్.

కమ్యూనిసు : పి. వెంకటేశషోలగర్ ; సి. కందస్వామి ; ఎస్. రామలింగం ; ఎన్. శివరాజ్ ; ఎ. కె. సుబ్బయ్య ; వడివేలు.

స్వతంత్రులు : కె. ఆర్. సంబందం ; జి. సమియ కూరాయర్ ; ఎస్. స్వయంప్రకాశం ; ఎ. వేలు.

## తిరుచిరాపల్లి

కాంగ్రెసు, 5; తమిళనాడు శ్రమజీవులపార్టి, 5 ; కమ్యూనిస్టు, 2 ; స్వతంత్రులు, 7.

కాంగ్రెసు : ఆంతోనిపీటర్ ; ఆర్. ఎం. పళనియప్పన్ ; ఎన్. రాజగోపాల్ ; ఎ. రామస్వామిదేవర్; టి. వి. సన్నాసి.

తమిళనాడు శ్రమజీవుల పార్టి : ఎ. అయ్యారు ; వి. బాల కృష్ణన్ ; చిన్నయ్య ; పళనిముత్తు; కె. ఆర్. విశ్వనాథన్.

కమ్యూనిస్టు : డాక్టర్ జి. చిత్రాంబాళం ; ఎం. కళ్యాణ సుందరం.

స్వతంత్రులు : ఎం. మాణిక్యసుందరం ; ఎం. పళనియాండి ; ఎస్. పరమశివన్ ; పి. బి. కె. రాజచిదంబరం ; పి. రంగసామి రెడ్డియార్ ; ఎన్. రత్నగౌండర్ ; పి. తంగవేలు.

## తిరునెల్వేలి

కాంగ్రెసు, 13; ప్రజాపార్టి, 1; స్వతంత్రులు, 3.

కాంగ్రెసు : ఆరుముగం; వి. ఆరుముగం; ఎస్. చెల్లపాండ్యన్; చిన్నతంబిదేవర్; టి. గణపతి; కె. రామసామిదాస్, ఎం. జి. శంకర్; ఎస్. సోమయాజులు; ఐ. కె. సుబ్రమణ్యపిళ్లె. పి. ఊర్కావలన్; వేణుగోపాలకృష్ణస్వామి; జె. ఎల్. పి. రోచి విక్టోరియా; పి. శెల్వరాజు.

ప్రజాపార్టి : ఎస్. టి. ఆదిత్యన్.

స్వతంత్రులు : పి. చొక్కలింగం; కె. టి. కోసలరాం; ఆర్. ఎస్. కె. పాండ్యన్.

## దక్షిణకన్నడ

కాంగ్రెసు, 9; ప్రజాపార్టి, 2.

కాంగ్రెసు : టి. అనంతపాయ్; కె. ఈశ్వర; మంజయ్యషెట్టి; ఎం. ఎస్. మొగ్రాల్; ఎల్. సి. పాయిస్; ఎ. బి. షెట్టి; ఎస్. ఎస్. సువర్ణ; బి. వైకుంఠబలిగ; కె. వెంకటరమణ గౌడ్.

ప్రజాపార్టి : ఎస్. ఎస్. కొల్కెబెయిల్; ఎం. నారాయణ నంబియార్.

## దక్షిణార్కాడు

కాంగ్రెసు, 5; తమిళనాడు శ్రమజీవులపార్టి, 13; స్వతంత్ర, 1.

కాంగ్రెసు : ఎల్. ఆనందన్; ఎం. కందసామి పడయాచి; వి. కృష్ణస్వామి పడయాచి; ఎ.ఎస్. సహజానంద; జె. వాఘీశన్ పిళ్ళె.

తమిళనాడు శ్రమజీవులపార్టి : ఎం. వేణుగోపాల గౌండర్; ఎ. రత్నం; కె. అరంగనాథన్; వి. గోపాల గౌండర్; ఎ. గోవిందస్వామి నాయగర్; ఎం. జగన్నాథన్; కట్టిముత్తు; టి. డి. ముత్తుకుమారస్వామి నాయుడు; ఎ. ముత్తుస్వామి; వి. ఆర్. నాగరాజన్;

ఎన్. పరమశివన్ ; ఎస్. రాదాధాకృష్ణన్ ; ఎస్. ఎన్. రామసామి పడయాచి.

స్వతంత్ర : వి. టి. ఎలయపిళ్లై.

నీలగిరి

కాంగ్రెసు, 1 ; స్వతంత్ర, 1.

కాంగ్రెసు : కె. హెచ్, బొమ్మన్ ;

స్వతంత్ర : హెచ్. బి. అరిగౌడర్.

మధుర

కాంగ్రెసు, 12 ; కమ్యూనిస్టు, 2 ; ఫార్వర్డ్ బ్లాక్ మార్కిస్టు, 1 ; జస్టిస్ పార్టి, 1 ; స్వతంత్రులు, 2.

కాంగ్రెసు : అయ్యనార్ ; ఎస్. చిన్నకరుప్పదేవర్ ; సి. చిన్న స్వామి నాయుడు ; ఎం. ఎస్. మునిసామి పిళ్లై ; వి. ముత్తు ; బి. ఆర్. ఎం. ముత్తుదేవర్ ; కె. రాజారాం ; టి. కె. రామ ; డాక్టర్. శ్రీమతీ సౌందరం రామచంద్రన్ ; పి. శివప్రకాశం ; ఎ. ఎస్. సుబ్బ రాజా ; దినకరస్వామి దేవర్.

కమ్యూనిస్టు : వి. మదనగోపాల్ ; పి. రామమూర్తి

ఫార్వర్డ్‌బ్లాక్ మార్కిస్టు : మూకయ్యదేవర్

జస్టిస్ : పి. టి. రాజన్

స్వతంత్రులు : ఎం. పి. మంగళ గౌండర్ ; కె. ఎస్. లక్ష్మీపతీ నాయకర్.

మలబార్

కాంగ్రెసు, 4 ; ప్రజాపార్టి, 7 ; కమ్యూనిస్టు, 6 ; సోషలిస్టు 4 ; ముస్లింలీగు, 5 ; స్వతంత్రులు, 3.

కాంగ్రెసు : ఎ. అప్పు ; ఎన్. గోపాలమీనన్ ; కె. పి. కుట్టి కృష్ణనాయర్ ; ఇ. కె. శంకరవర్మరాజా.

ప్రజాపార్టి : ఓ. కోరాన్ ; ఎం. నారాయణ కురూప్ ; టి. సి. నారాయణ నంబియార్ ; పి. కుణిరామ కిడావ్ ; సి. కుణిరామ కురూప్ ; వి. శంకరనారాయణ మీనన్ ; కె. టి. శ్రీధరన్.

కమ్యూనిస్టు : కె. పి. గోపాలన్ ; సి. హెచ్. కనరాన్ ; కె. మాధవన్ నంబియార్ ; పి. కె. గోపాలన్, కృష్ణన్ ; ఆర్. కృష్ణన్ ఇ. టి. కుణన్.

సోషలిస్టు ; సి. వేలుక్కాన్ ; కె. బి. మీనన్ ; కె. మోయిదు ; పద్మప్రభ గౌండర్.

ముస్లింలీగు : పి. అహమ్మద్ కుట్టి ; కుణి మహ్మద్ షఫి ; ఎం. చదయన్ ; కె. ఎం. శీతి ; కె. ఉప్పి.

స్వతంత్రులు : వి. ఆర్. కృష్ణయ్యర్ ; కె. రామకృష్ణన్ , కె. సి. గోపాలన్ ఉన్ని.

రామనాథపురం

కాంగ్రెసు, 9 ; ఫార్వర్డ్ బ్లాక్ మార్క్సిస్టు, 2 ; స్వతంత్రులు, 4.

కాంగ్రెసు : ఎ. ఆర్. ఎ. ఆర్. ఎం. చొక్కలింగం చెట్టియార్, జి. గోవిందన్ ; ఎస్. జయరామ రెడ్డియార్ ; పి. ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ ; ఆర్. కృష్ణస్వామి నాయుడు ; ఎస్. రామస్వామి నాయుడు ; రాజా శ్రీ షణ్ముగ సుందర రాజేశ్వర సేతుపతి ; వి. స్వామినాథన్ ; వైకుంఠం.

ఫార్వర్డ్ బ్లాక్ మార్క్సిస్టు : మొట్టాయ కుడుంబన్ ; యు. ముత్తురామలింగదేవర్.

స్వతంత్రులు : పి. చెల్లదురై ; రాజా ఎం. ఎ. ముత్తయ్య చెట్టియార్ ; డి. కె. రాజు ; వి. వి. రామస్వామి.

సేలం

కాంగ్రెసు, 9 ; కమ్యూనిస్టు, 2 ; తమిళ నాడు శ్రమజీవులపార్టి ; స్వతంత్రులు, 9.

కాంగ్రెసు : అర్థనారీశ్వర గౌండర్ ; టి. ఎం. కాళియన్నన్ ; పి. లక్ష్మణకందర్ ; పి. ఎం. మునుస్వామి గౌండర్ ; ఎ. నంజప్ప ; ఎ. సాంబశివన్ ; కె. ఎస్. సుబ్రమణ్యం గౌండర్ ; డాక్టర్ పి. వరద రాజులు నాయుడు ; ఎం. పెరియాస్వామి.

కమ్యూనిస్టు : టి. ఎస్. అర్థనారి ; కె. వి. రామస్వామి.

తమిళనాడు శ్రమజీవులపార్టి : ఎస్. కందస్వామి గౌండర్

స్వతంత్రులు : ఎస్. ఆరుముగం ; ఎ. దొరస్వామి గౌండర్ ; పి. కందసామి గౌండర్ ; డి. కృష్ణమూర్తి గౌండర్ ; ఎం. మునిరెడ్డి ; పి. ఆర్. రాజగోపాల గౌండర్ ; ఆర్. రంగస్వామి గౌండర్ ; పి. రత్నస్వామి పిళ్లె ; ఎం. పి. సుబ్రమణ్యన్.

అసెంబ్లిలో వివిధ పార్టీల బలం :

కాంగ్రెసు, 152 ; సోషలిస్టులు, 13 ; కమ్యూనిస్టులు, 62 ; ప్రజాపార్టీ, 35 ; షెడ్యూల్డు కాస్ట్సు ఫెడరేషన్, 2 ; కృషిక్ లోక్ పార్టీ, 16 ; కామన్‌వీల్ పార్టీ, 6; తమిళనాడు శ్రమజీవులపార్టీ, 19 ; ముస్లింలీగు, 5 ; ఫార్వర్డుబ్లాక్ మార్క్సిస్టు, 3 ; జస్టిస్‌పార్టీ, 1 ; స్వతంత్రులు, 61.

ఆంధ్ర జిల్లాలనుంచి ఎన్నుకోబడిన సభ్యుల సంఖ్య, మదరాసు మినహాగా, మొత్తం 145. ఆ సభ్యుల పార్టీ వివరాలివి : కాంగ్రెసు 43 ; కమ్యూనిస్టు, 41 ; ప్రజాపార్టీ, 20 ; కృషిక్‌లోక్, 15 ; సోషలిస్టులు, 6 ; షెడ్యూల్డుకాస్ట్ ఫెడరేషన్, 1 ; స్వతంత్రులు, 19.

అసెంబ్లీలోని సభ్యులు 376 మందిలోనూ ముస్లిములు ఆర్గురు స్త్రీలు ఇద్దరే.

స్త్రీలలో ఒకరు ఆంధ్ర శ్రీమతి తమ్మాకోటమ్మరెడ్డి, గుంటూరు జిల్లా ప్రత్తిపాడు నుంచి ఎన్నిక అయారు. మరొకరు తమిళ స్త్రీ, డాక్టర్ సౌందరం రామచంద్రన్, మధుర జిల్లానుంచి ఎన్నుకోబడినారు.

శాసనసభ్యుల జీతాలు :

శాసనసభ్యులకు యిచ్చేడబ్బు రెండు సూత్రాలమీద ఆధారపడి వుంది.

నెలకు రు. 150 జీతం ; శాసనసభాసమావేశానికి హాజరైన ప్రతి రోజుకూ, రు. $12\frac{1}{2}$ అలవెన్సు. సభ్యుల స్వస్థానంనుంచి మదరాసుకు రావడానికి, రానుపోను రైలులో ఫస్టుక్లాసుకు అయ్యేఖర్చుకు ఒకటిన్నర రెట్లు ప్రయాణపుఖర్చు.

పై పద్ధతికి అంగీకరించని సభ్యులకు, సభాసమావేశానికి హాజరైన ప్రతిరోజుకూ రు. 20 అలవెన్సు : వారి స్వస్థానంనుంచి మదరాసు రావడానికి, రానుపోను రైలులో ఫస్టుక్లాసుకు అయ్యేఖర్చుకు 13/5 రెట్లు ప్రయాణపుఖర్చు.

## ప్రభుత్వశాఖల కార్యదర్శులు

| | |
|---|---|
| చీఫ్ సెక్రటరీ : | కె. రామునిమీనన్ |
| హోం : | ఓ. పుల్లారెడ్డి |
| పబ్లిక్ వర్క్సు : | టి. ఎం. ఎస్. మణి |
| డెవలప్ మెంట్ : | జె. ఎం. లోబో ప్రభు |
| ఆహారం, వ్యవసాయం : | ఆర్. ఎం సుందరం |
| శాసనం : | కె. వి. రాజగోపాలన్ |
| ఆర్థికశాఖ : | టి. ఎ. వర్ఘీస్ |
| రెవిన్యూ : | ఎస్. కె. చెట్టూర్ |
| ఫిర్కా డెవలప్ మెంట్ : | టి. కె. శంకరవడివేలు |
| విద్య : | కె. ఎం. ఉన్నితన్ |
| ఆరోగ్యం : | ఎస్. ఆర్. కైవార్ |
| స్థానిక పరిపాలన : | జె. శివానందం |

## రాష్ట్రంలో ప్రధానోద్యోగులు

| | |
|---|---|
| రెవిన్యూబోర్డు సభ్యులు | వి. ఎన్. కుద్వ<br>వి. ఎస్. హెజ్మాడి<br>డబ్ల్యు. ఆర్. ఎస్. సత్యనాథన్<br>టి. ఎస్. రాఘవన్ |
| డైరెక్టర్ ఆఫ్ ఇండస్ట్రీస్ : | ఎం. టి. రాజు |

| | |
|---|---|
| డైరక్టర్ ఆఫ్ అగ్రికల్చర్ : | ఎం. ఎస్. శివరామన్ |
| పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ : | టి. జి. సంజీవపిళ్లై |
| రిజిస్ట్రేషన్ ఇన్‌స్పెక్టర్ జనరల్ : | హెచ్. కృష్ణమూర్తి |
| డైరక్టర్ ఆఫ్ మెడికల్ సర్వీసెస్ : | డాక్టర్ పి. అరుణాచలం |
| ఛీఫ్ ఇంజనీర్ (ఇరిగేషన్) : | ఎ. ఆర్. వెంకటాచార్య |
| ఛీఫ్ ఇంజనీర్ (హైవేస్) : | కె. కె. నంబియార్ |
| డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ హెల్త్ : | డాక్టర్ కె. ఎస్. విశ్వనాథన్ |
| ఛీఫ్ కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్స్ : | ఎం. కేశవన్ ఉన్ని నాయర్ |
| డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ : | ఎస్. గోవిందరాజులు నాయుడు |
| ఇన్‌స్పెక్టరు ఆఫ్ లోకల్ బోర్డ్సు : | టి. ప్రభాకరరావునాయుడు |
| డైరక్టర్ ఆఫ్ పబ్లిసిటీ : | ఎస్. పార్థసారధి |
| జైళ్ళ ఇన్‌స్పెక్టర్ జనరల్ : | ఎస్. ఎ. అయ్యంగార్ |
| రిజిస్ట్రార్ ఆఫ్ కో ఆపరేటివ్ సొసైటిస్ | జె. సి. రయన్ |
| డైరక్టర్ ఆఫ్ ఎనిమల్ హాస్బెండరీ : | వి. ఆర్. రాజగోపాలన్ |
| లేబర్ కమిషనర్ . | సి. జి. రెడ్డి |
| సెంట్రల్ ఎక్సైజు కలెక్టరు : | ఒ. కృష్ణన్ |
| ఛీఫ్ ఇంజనీరు (ఎలక్ట్రిసిటీ) : | జి. సుందరం |
| ఆర్థిక సలహాదారు : | డాక్టరు బి. నటరాజన్ |
| మదరాసు పోలీసు కమిషనర్ : | జె. దేవసహాయం |
| ట్రాన్సుపోర్టు కమిషనర్ : | వి. హనుమంతరావునాయుడు |
| డైరక్టరు ఆఫ్ కంట్రోల్డ్ కమోడిటిస్ | వి. వి. సుబ్రమణ్యం |
| ఇన్‌కంటాక్సు కమిషనర్ : | కె. సి. ఖన్నా |
| అడ్వొకేట్ జనరల్ : | వి. కె. తిరువెంకటాచారి |
| డైరక్టరు ఆఫ్ ఫిషరీస్ : | కె. ఎన్. అనంతరామన్ |
| జనాభా సూపరింటెండెంట్ : | ఎస్. వెంకటేశ్వరన్ |
| నేషనల్ సేవింగ్సు ఆఫీసర్ : | ఎస్. ఎ. అయ్యాసామి చెట్టియార్ |

## హైకోర్టు

ప్రధాన న్యాయమూర్తి, పి. వి. రాజమన్నార్. తక్కిన జడ్జిలు: జస్టిస్ ప్రతిపాటి సత్యనారాయణరావు, జస్టిస్ పి. గోవింద మీనన్, జస్టిస్ ఎన్. పంచాపకేశశాస్త్రి, జస్టిస్ కె. సుబ్బారావు, జస్టిస్ పి. రాజగోపాలన్, జస్టిస్ చింతగుంట రాఘవరావు, జస్టిస్ ఇ. ఇ. మాక్, జస్టిస్ ఎ. ఎస్. పి. అయ్యర్, జస్టిస్ ఎన్. సోమసుందరం, జస్టిస్ పి. వి. బాలకృష్ణఅయ్యర్, జస్టిస్ పి. చంద్రారెడ్డి, జస్టిస్ డబ్ల్యు. ఎస్. కృష్ణస్వామి నాయుడు, జస్టిస్ బషీర్ అహమ్మద్ సయీద్.

దేశంలోని ఆర్థిక మాంద్యపరిస్థితుల కారణంగా ప్రధాన న్యాయమూర్తి తమజీతంలో నెలకు రూ. 750 లను 1950 జనవరినుంచి తగ్గించుకున్నారు. జస్టిస్ మాక్ తప్ప తక్కిన జడ్జీలు తమ జీతంలో నెలకు రూ. 500 తగ్గించుకున్నారు.

ప్రస్తుతం ప్రధాన న్యాయమూర్తి జీతం, నెలకు రూ. 4,250.
తక్కిన జడ్జీల జీతం, నెలకు రూ. 3,500.
జస్టిస్ మాక్ జీతం నెలకు రూ. 4,000.

## పబ్లిక్ సర్వీసెస్ కమిషన్

చైర్మన్ : దివాన్ బహదూర్ టి. ఎం. నారాయణస్వామిపిళ్లై.
మెంబర్లు : రావు బహదూర్ పి. జ్ఞానసుందరం మొదలియార్
పి. వి. నరసింహరాజు.

సెక్రటరి : కృష్ణస్వామిచెట్టి

## తిరుమల తిరుపతి దేవస్థానం కమిటీ

కె. వెంకటస్వామి నాయుడు, ఎం. ఎల్. సి. (ప్రెసిడెంట్); ఆర్. సూర్యారావు; వి. త్యాగరాజ ముదలియార్; ఎం. దొరైకణ్ణు, ఎం. రామానుజాచారియార్; ఎం. ఎల్. ఎ., గోపవరం

వెంకటరెడ్డి, ఎం. ఎల్. ఎ., మహంతు నారాయణ దాస్ జీ. కమిష నర్. సి. అన్నారావు.

## హిందూధర్మాదాయములు

1951 సెప్టెంబరు 30 తేదితో, రాష్ట్రంలోని హిందూధర్మాదాయముల బోర్డు రద్దు అయిపోయి, దానిబదులు రాష్ట్రంలోని ధర్మాదాయముల పరిపాలనకు, 1951 లో ప్యాసయిన చట్టం ప్రకారం ఒక కమిషనరు నియమింపబడినారు. ఈ కమిషనరు ప్రధాన కార్యాలయం మదరాసు నగరంలో వుంటుంది. ఈయనకు లోబడి, రాష్ట్రంలో ముగ్గురు డిప్యూటీ కమిషనర్లు, నియమింపబడినారు. వారి కార్యాలయములు, గుంటూరు, తంజావూరు, కోయంబత్తూరు జిల్లాలలో వున్నాయి. గుంటూరులో వుండే డిప్యూటీ కమిషనరుకు, శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పడమటిగోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, అనంతపురం, బళ్లారి, కడప, కర్నూలు జిల్లాలపైనను, వుండే డిప్యూటి కమిషనరుకు మదరాసు నగరం, చంగల్పట్టు, దక్షిణార్కాడు, సేలం, కోయంబత్తూరు, నీలగిరి, మలబారు, దక్షిణకన్నడ జిల్లాలపైనను, తంజావూరులోవుండే డిప్యూటీ కమిషనరుకు తంజావూరు, తిరుచిరాపల్లి, మధుర, రామనాథం, తిరునెల్వేలి జిల్లాలపైనను అధికారం వుంటుంది.

## జిల్లా కలెక్టర్లు

అనంతపురం : టి. కె. జాక్సన్
ఉత్తరార్కాడు : ఎస్. వి. సుగవనం
కడప : పి. సి. జేమ్స్
కర్నూలు : పి. వి. మాధవరావు.
కృష్ణ : కె. శ్రీనివాసన్
కోయంబత్తూరు : ఇ. పి. రాయప్ప
గుంటూరు : ఎ. కృష్ణస్వామి
చంగల్పట్ : ఆర్. కోటీశ్వరరావు నాయుడు

చిత్తూరు : సి. రామచంద్రన్
తంజావూరు : టి. కె. పళనియప్పన్
తిరుచిరాపల్లి : సి. జె. జాన్
తిరునెల్వేలి : ఆర్. ఎస్. సుబ్బయ్యపిళ్లె
తూర్పుగోదావరి : ఎస్. ఎస్. మణి
దక్షిణకన్నడ : ఎ. ఆర్. రాజరత్నం
దక్షిణార్కాడు : హెచ్. ఎస్. పాల్
నీలగిరి : హెచ్. సి. ఎం. మెక్లాలిన్
నెల్లూరు : పి. వి. చలపతి
పడమటి గోదావరి : జె. పి. ఎల్. గ్విన్
బళ్ళారి : డి. ఆర్. సుందరం
మదరాసు : సి. వివేకానందమూర్తి
మధుర : ఎన్. ఎస్. అరుణాచలం
మలబార్ : ఆర్. ప్రసాద్
రామనాథం : పి. పి. ఐ. వైద్యనాథన్
విశాఖపట్టణం : వి. కె. రావు
శ్రీకాకుళం : ఎన్. భగవాన్‌దాస్
సేలం : ఎ. దొరైరాజ్

## జిల్లాబోర్డు ప్రెసిడెంట్లు

అనంతపురం : కె. వి. వేమారెడ్డి
ఉత్తరార్కాడు : ఎన్. రామచంద్రారెడ్డి
కడప : టి. పుల్లారెడ్డి
కర్నూలు : బి. వి. సుబ్బారెడ్డి
కృష్ణ : కాకాని వెంకటరత్నం
కోయంబత్తూర్ : వి. కె. పళనిస్వామి గౌండర్
గుంటూరు : నల్లపాటి వెంకటేశ్వర్లు
చెంగల్పట్ : వి. కె. రామస్వామి మొదలియార్

చిత్తూరు : ఎన్. పి. చెంగల్రాయనాయుడు
తంజావూర్ : వి. నాడిముత్తుపిళ్ళై
తిరుచిరాపల్లి : పి. బి. కె. రాజచిదంబరం రెడ్డియార్
తిరునెల్వేలి : డి. ఎస్. ఆదిమూలం
తూర్పుగోదావరి : మారిన నరసన్న
దక్షిణకన్నడ : బి. మంజయ్య హెగ్డే
దక్షిణార్కాడు : పి. ఆర్. శ్రీనివాస పడయాచి
నీలగిరి : ఎన్. ఎం. లింగం
నెల్లూరు : ఎన్. చెంచురామనాయుడు
పడమటి గోదావరి : మాగంటి సీతారామదాస్
బళ్ళారి : వై. మహాబలేశ్వరప్ప
మధుర : ఎన్. ఆర్. త్యాగరాజన్
మలబార్ : ఎం. ఎ. ముకుందన్
రామనాథం : ఎస్. ఓ. ఎస్. పి. ఉదయప్ప
విశాఖపట్టణం : జి. బి. అప్పారావు
శ్రీకాకుళం : రొక్కం లక్ష్మీనరసింహం
సేలం : కె. ఎస్. సుబ్రహ్మణ్యం

## 'లా' విషయాలు

మన దేశంలో అమలులో ఉన్న 'లా' స్థూలంగానైనా ప్రతివ్యక్తీ తెలిసికొని ఉండాలి. ఇది చాలా ముఖ్యం. 'లా' తెలియక తప్పుచేశా నన్నంతమాత్రాన శిక్ష తప్పదు. ఇలాంటి సమాధానాన్ని ఏన్యాయస్థానమూ ఒప్పుకోదు. అందువల్ల సాంఘిక జీవనంలో జన సామాన్యము ముఖ్యంగా తెలుసుకోవలసిన కొన్ని యీ కింద సూచింపబడినవి.

### రసీదులు :

తెల్లవారిలేస్తే పడుకునేదాకా డబ్బు వ్యవహారాలతో నిమిత్తము లేకుండా ఎవడికీ జరగదు. ఒకరికిపైకం ఇచ్చినప్పుడుగాని ఇంకొకరినుండి పుచ్చుకున్నప్పుడుగాని రశీదులు వ్రాసుకొనడం ఉత్తమమైన పద్ధతి. జరిగిన

లావాదేవీలకు ఇవి సాక్ష్యంగా ఉండడంవల్ల, లేనిపోని తగాదులకు తావుం డదు. ఈ రశీదులు ఒక ప్రత్యేకమైన విధంగా ఉండాలనే నియమంలేదు. ఫలానావారు ఫలానా మొత్తం ఫలానా దానికిగాను ఇచ్చినారు గనుక ముట్టిందని వ్రాసి, సంతకంచేసి తారీకువేస్తే సరిపోతుంది. ఇరవై రూపాయ లకుమించని పక్షంలో ఏలాంటిస్టాంపును అంటించనక్కరలేదు. ఆమొత్తాన్ని మించినప్పుడు మాత్రం ఒకఅణా రెవెన్యూ చీటీని అంటించి ఆబిళ్ళమీద సంతకం చేయవలసివుంటుంది. ఈ చీటీని అంటించకపోతే ఆరశీదుకు విలువ ఉండదు.

## ప్రామిసరి నోట్లు

ఎవరో అదృష్టవంతులు తప్ప జనబాహుళ్యం అప్పులనిచ్చి పుచ్చుకో కుండా జీవయాత్ర సాగించలేదు. ఏ వ్యవహారమైనా నోటిమాటలోకంటె వ్రాతమూలంగా నిర్వహించుకుంటే ఉభయులకు శ్రేయస్కరం. అందువల్ల "ఫలానా తేదీన ఫలానా నేను ఫలానా వారిదగ్గర ఫలానా మొత్తాన్ని ఫలానా కారణంవల్ల పుచ్చుకున్నాను, కాబట్టి ఫలానా వడ్డీతో అయే అసలుఫాయి దాలను వారు కోరినప్పుడు వారికిగాని వారి ఆర్డరుకుగాని ఇవ్వగలవాడను" అని వ్రాసి చీటీఅంటించి దస్కతు చేయాలి. నోటు తాలూకు మొత్తం రు. 250 కి మించనట్లయితే ఒకఅణా రెవిన్యూస్టాంపు సరిపోతుంది. రు. 250 నుండి రు. 1000 వరకు రెండుఅణాల స్టాంపు ఆపైన ఎంత మొత్తానికైనా నాలుగణాల చీటీ అతికిస్తే చాలు. అడిగినప్పుడు కాకుండా మారకపు (ఎక్స్ఛేంజ్) బిల్లుల మాదిరి తీరుమానం చేయదలచిననోట్లకు రెండురూపా యల స్టాంపు వేయాలి. ప్రతినోటుమీద ఇద్దరైనా సాక్షిసంతకాలు ఉంటే మంచిది. నోటు వ్రాసినవ్యక్తి సాక్షుల ఎదుటనే సంతకంచేయాలి.

నోటు వ్రాయించుకున్నవారు వ్రాసినవారికి తెలియపరచి మరి ఎవరి కైనా నోటును ప్రతిఫలంకోసం ట్రాన్స్ఫర్ చేయవచ్చును. నోటువ్రాసిన తేది లగాయతు, మూడేండ్లలోపుగా ఆ తాలూకు మొత్తాన్ని వసూలుచేసు కోవటమో లేక దావా వేయటమో జరగకపోతే ఆ నోటు కాలదోషము పట్టిపోతుంది. ఈ గడవు దాటేలోపల నోటు వ్రాసినవారిచేత కొంతసొమ్ము చెల్లువేయించి వారిచేతనే నోటు వెనుకభాగంమీద ఆ విషయం వ్రాయిం చడమో లేక నోటును తిరిగి వ్రాయించుకోనడమో చేయవలసి ఉన్నది.

## చెక్కులు :

పెద్ద మొత్తాలను ఇనుప పెట్టెలలో పెట్టి పదిల పరచుకొనడము, ప్రామిసరి నోట్లమీద అప్పులివ్వడము వివేకమైన పనులు కావు. ఒకొక్కప్పుడు అసలుకే మోసం రావచ్చును. వడ్డీ తక్కువ అయినప్పటికి బ్యాంకిలలో వేసికొంటే మంచిది. బ్యాంకీలలో అక్కౌంటు ఉన్నట్లయితే చేతిలో ఎక్కువ రొక్కం ఉంచుకోవలసిన అగత్యం ఉండదు. ఇవ్వవలసినవారికి చెక్కు వ్రాసి ఇస్తే సరిపోతుంది. ఈ చెక్కులలో పుచ్చుకొనేవారి పేరు, ఇచ్చే మొత్తం, తారీఖు వ్రాసి బ్యాంకువారికి నమూనాగా ఇచ్చిన విధంగా సంతకం చేయాలి. ఇవి అన్యులచేతులలో పడకుండా ఉంటానికి క్రాస్ చేయవలసి ఉంటుంది. అంటే చెక్కుమీద ఎడమవైపు పైభాగాన ఒకదానిక్రింద ఒకటిగా రెండు ఏటవాలు గీతలుగీసి, ఆ గీతలమధ్య 'అండ్ కో' అని వ్రాయాలి. అప్పుడు ఈ చెక్కు తాలూకు మొత్తము బ్యాంకీలో అకౌంటు వున్న వారిపరంగా మాత్రమే ఇవ్వబడుతుంది. ఒకసారి చెక్కు పుట్టిన తరువాత ఎవరికైనా ట్రాన్స్ఫర్ చేయవచ్చును. ఆరుమాసాలలోపుగా సొమ్ము చేసుకోకపోతే చెక్కు రద్దు అవుతుంది. హుండీల విషయంకూడా ఇంతే. ఇవి వ్యాపారస్థులకు ఎంతో ఉపయుక్తంగా ఉంటాయి. పొరుగూళ్ళవారికి ఈ బ్యాంకి హుండీలద్వారా తక్కువ ఖర్చుతో ఎంత డబ్బునైనా సులభంగా పంపవచ్చును, చెక్కులపరంగా డబ్బు ఇచ్చినప్పుడు ఒకవేళ రశీదులు తీసికోకపోయినా ప్రమాదముండదు.

## ఎగ్రిమెంట్లు :

వ్యాపారంలోగాని మరి ఇతర వ్యవహారాలలోగాని అనుకున్న ఒడంబడికలను లిఖితపూర్వంగా నిర్ణయించుకుంటే ఉభయపార్టీలకు మంచిది. సాధ్యమయినంతవరకు ఈ అగ్రిమెంట్లను లాయర్లచేత వ్రాయించుకుంటే, న్యాయబద్ధంగాని అవకతవక షరతులకు అవకాశం ఉండదు. ప్రతిఫల శూన్యమైన కంట్రాక్టు అగ్రిమెంట్లు చెల్లవు. మోసంవల్ల, వత్తిడివల్ల, పొరబాటువల్ల ఏర్పడిన అగ్రిమెంట్లను రద్దు

చేసుకోవచ్చును. సాధారణపు ఒడంబడికలను రూపాయిన్నర స్టాంపు పేపరుమీద వ్రాసుకోవాలి.

**పవర్ ఆఫ్ అటర్నీ :**

ఒక ప్రత్యేక వ్యవహారాన్ని గాని లేక సర్వవిధ వ్యవహారాలను గాని తన తరఫున నిర్వహించడానికి ఒక వ్యక్తి మరొక వ్యక్తికి న్యాయబద్ధంగా అధికారం ఇవ్వవచ్చును. ఇది లిఖితపూర్వకంగా జరగాలి. వీటిని పవర్ ఆఫ్ అటర్నీ అంటారు. ఒక్క ప్రత్యేక విషయానికయితే స్పెషల్ పవర్, సర్వవిషయాలకైతే జనరల్ పవర్ పత్రాలను వ్రాయాలి. ఒకరి తరఫున దస్తావేజును రిజిష్టరు చేసేందుకు ఇచ్చే పవరును ముప్పావలా స్టాంపు పేపరుమీద వ్రాయాలి స్పెషల్ పవరుకు రూపాయిన్నర స్టాంపు ఉపయోగించాలి. జనరల్ పవరుకు పదకొండు రూపాయల పావలా స్టాంపు అవసరం. ఈ పత్రాలలో "ఫలానా నేను ఫలానావారికి నా తరఫున ఫలానా కార్యనిర్వహణకు అధికారం ఇచ్చుచున్నాను కాబట్టి అందరు తెలుసుకోవలసినది" అని వ్రాసి సంతకం చేసి తారీఖు వేయాలి. సాక్షుల సంతకాలుకూడ అవసరం. ఈ పవరు పత్రాలు రిజిష్టరు చేయిస్తే ఇంకా మంచిది.

**కౌళ్లు :**

తెలుగు దేశంలో సాధారణంగా కొద్దో గొప్పో భూవసతి లేని వాళ్లు అరుదు. స్వంతంగా వ్యవసాయం చేసుకునే వాళ్ళకంటే సాగుకు ఇతరులకిచ్చేవాళ్ళే అధికంగా ఉంటారు. అటువంటప్పుడు రైతువల్ల కౌలు వ్రాయించుకొనటము, రయితుకు భూస్వామి కబూలియత్ వ్రాసి ఇవ్వటము ఆచారంగా ఉంటున్నది. ఈ రెండు పత్రాలలోను విషయాలు ఒకే విధంగా ఉంటాయి. ఉభయపార్టీల పేర్లు, సాగుకు ఇచ్చిన పొలం విస్తీర్ణం రైతు చెల్లించవలసిన ధాన్యము లేక పైకము పరిమితికాలం మొదలైన షరతులను ఉదహరించాలి. సాక్షి సంతకాలుకూడ అవసరం. ఈ పత్రాలను ఉచితమైన స్టాంపును పెట్టి రిజిష్టరుచేస్తే మంచిది. సంవత్సరానికి మించిన కౌళ్ళ సందర్భంలో తప్పకుండా రిజిష్టరుచేయుట మవసరం.

ఇదేవిధంగా నివేశన స్థలాలనుగాని ఇండ్లనుగాని అద్దెకు పుచ్చుకున్నప్పుడు లీజు పత్రాలు వ్రాసుకొనటం శ్రేయస్కరమైన పద్ధతి. అద్దె మొత్తాన్నిబట్టి స్టాంపు కాగితంమీద వ్రాసి రిజిష్టరు చేయించుకోవాలి. ఎప్పటికప్పుడు అద్దె రశీదులను తీసుకొని భద్రపరచుకోవలసి ఉంటుంది.

## ఆస్తివిక్రయం :

చరాస్తులను విక్రయించినప్పుడు వ్రాతకోత అవసరం లేదు. ప్రతిఫలం పుచ్చుకుని స్వాధీనం చెయ్యగానే అన్ని హక్కులు కొన్నవాడికి సంక్రమించగలవు. కొనుక్కున్నవాళ్ళు రశీదులు పుచ్చుకొనడము ఉత్తమం. విలువైన వస్తువుల అమ్మకం లిఖితపూర్వకంగా జరిగితేనే మంచిది. స్థిరాస్తి అమ్మకం విషయంలో నూరు రూపాయలకు తక్కువగా ఉండేటట్లయితే పత్రాన్ని రిజిస్ట్రరుచేయ నక్కరలేదు, స్వాధీనం చేస్తే సరిపోతుంది. ఆస్తివిలువ అంతకు మించినట్లయితే దస్తావేజును వ్రాయించి రిజిష్టరు చేయించాలి. లేకపోతే చెల్లదు.

స్థిరచరాస్తులను కొనుక్కొనేటప్పుడు ప్రతిఫలం అప్పుడే చెల్లించి రిజిష్టరు చెయించుకోడానికి వీలుకానప్పుడు క్రయపు అగ్రిమెంటును వ్రాసుకుంటే మంచిది. ఆస్తి వివరాలను, ధరను, ఉభయుల పేర్లను ఇచ్చిన బయానాను, రిజిస్ట్రరుచేసే గడువును, ఆవిధంగా జరగకపోతే జరగవలసిన నిర్ణయాన్ని ఈ అగ్రిమెంటులో వ్రాసుకోవాలి. పెట్టుకున్న గడువు దాటిపోకమునుపే లాయరుచేత దస్తావేజును వ్రాయించి, రిజిస్ట్రారు సమక్షంలో పైకం చెల్లించి రిజిస్టరు చేయించితే మంచిది. ఆస్తి కొనుక్కునేముందు ఆ అమ్మేవాడికి ఆస్తిమీద సర్వహక్కులు కలవా లేవా అని విచారించాలి. పూర్వపు దస్తావేజులను పరిశీలించడమే గాక పన్నెండు సంవత్సరాలలోపుగా జరిగిన అన్యాక్రాంతలను ధృడపరిచే ఎన్కంబరెన్సు సర్టిఫికేటునుగూడ తెప్పించి చూచుకోవాలి. రిజిస్ట్రేషనుతోపాటు ఆస్తి స్వాధీనంకూడ జరిగేట్లు చూడాలి. విక్రయ సమయంలో అద్దెకు గాని కౌలుకుగాని పుచ్చుకున్న వారి స్వాధీనంలో

ఆస్తి ఉన్నట్లయితే వారిచేత కొన్నవారి హక్కులను లిఖితపూర్వకంగా ఒప్పందం చేయించాలి.

తాకట్లు :

ఆధారంలేకుండా సులభంగా అప్పుపుట్టదు కాబట్టి స్థిరచరాస్తుల తాకట్లు అమలులోకి వచ్చినాయి. వస్తువులను కుదువపెట్టినప్పుడు అందుకు సాక్ష్యంగా తాకట్టు పెట్టుకున్నవారి దగ్గరనుంచి పూర్తి వివరాలతో రసీదును పుచ్చుకోవాలి. స్థిరాస్తి తాకట్లు అనేక విధాలుగా ఉంటాయి. అన్ని విధాల తాకట్లలోను దస్తావేజులు రిజిష్టరు చేయించుకోవటం అవసరం. సామాన్యపు తాకట్టులో ఆస్తి తాకట్టు పెట్టినవాడి స్వాధీనంలోనే ఉంటుంది. తాకట్టు గడువులోపల అప్పును చెల్లించి తాకట్టును రద్దుచేయని పక్షంలో దావా వేయవలసి ఉంటుంది. స్వాధీనపు తనఖాలో ఆస్తిని అప్పు ఇచ్చినవాడికి స్వాధీనం చేయవలసి ఉంటుంది; గడువులోపుగా ఆ ఆస్తిమీద వచ్చే అయివేజువల్లగాని, రొక్కపూర్వకంగా గాని అప్పు అసలు ఫాయిదాలను చెల్లువేయగానే ఆస్తి తిరిగి స్వాధీనమవుతుంది. ఈ తాకట్టు దస్తావేజునుగూడ రిజిష్టరు చేయించాలి. మద్రాసులాంటి రాజధాని నగరాలలో మాత్రమే ఆస్తి తాలూకు టైటిల్ పత్రాలను తాకట్టు పెట్టి అప్పు తీసుకోవచ్చును. ఆస్తి ఎక్కడవున్నా పట్టింపులేదు. పత్రాలనుమాత్రం మద్రాసులో స్వాధీనంచేస్తే ఈవిధమైన తాకట్టును కరారు చేసుకోవచ్చును. ఒకే ఆస్తిమీద ఎన్ని తాకట్లయినా ఉండవచ్చును. అయితే తీర్మానం మాత్రం వరుస క్రమాన జరుగుతుంది. తరువాత తాకట్లు, ముందు తాకట్లకు లోబడి ఉంటాయి. పన్నెండేండ్లు దాటితే తాకట్లు కాలదోషం పట్టగలవు.

భాగస్తులు :

వ్యాపారంలో ఒక్కొక్కప్పుడు భాగస్తులను తీసుకోవలసిన అవసరం ఏర్పడుతుంది. అటువంటి సందర్భంలో ఎంతటి ఆప్తులైనా, స్నేహితులైనా వ్యవహారరీత్యా పార్టనరుషిప్ అగ్రిమెంటును వ్రాసి [illegible] చేయించుకుంటే అంత్యనిష్ఠూరం ఉండదు. అదిగాక రిజిష్టరు

చేయించకపోయినట్లయితే కొన్ని సాధక బాధకాలుంటాయి. ఈ భాగస్వాములు ఇతరులమీద కోర్టు వ్యవహారాలు జరపటానికి వీలుండదు. అపైన భాగస్వాముల మధ్యతగాదాలు వచ్చినప్పుడుకూడ అనేక అడ్డంకులు సంభవిస్తాయి. మైనర్లతో భాగస్వామికం ప్రమాదమైనది. ఒక వ్యవహారంకోసం ఏర్పడిన భాగస్వామికం ఆ వ్యవహారం పూర్తి కాగానే రద్దు అవుతుంది. కాల పరిమితి పెట్టుకున్న భాగస్వామికం గడువుదాటగానే రద్దవుతుంది. మిగతా భాగస్వామికాలలో ఏ ఒక భాగస్వామి అయినా తక్కినవారికి నోటీసు ఇచ్చి భాగస్వామికాన్ని రద్దుచేయవచ్చును. అందరు భాగస్వాముల సమ్మతిమీద ఏ విధమైన భాగస్వామికమైననూ విచ్ఛిన్నం కాగలదు. భాగస్వామికం అమలులో ఉన్నంతవరకు వ్యవహార నిర్వహణంలో ప్రతిభాగస్వామి చర్యకు తక్కిన భాగస్థులు బద్ధులవుతారు.

హామీలు :

ఒకరికిగాను మరొకరు హామీఇచ్చి బాధ్యత తీసికొనటం ప్రమాదకరమైన విషయం. ఎంతో జాగ్రత్తతో సంచరించాలి. హామీ ఇచ్చిన వాడికి అసలు బాధ్యస్తుడితోపాటు సమాన బాధ్యత ఉంటుంది. అసలు బాధ్యస్తుడిమీద ముందుగా చర్యతీసుకోమని కోరటానికి వీలుండదు. వ్యక్తిగతంగా గాని ఆస్తులతో గాని హామీ ఉండడం ప్రమాదకరం.

నష్టపరిహారాలు :

ప్రతి వ్యక్తికి స్వతస్సిద్ధంగా అనేక హక్కులుంటాయి. ఈ హక్కులు వ్యక్తిగతంగానైనా ఉండవచ్చును. స్వేచ్ఛ నరికట్టినప్పుడు గాని, శరీరానికో మనస్సుకో బాధ కలిగించునప్పుడుగాని, గౌరవప్రతిష్ఠలకు భంగం కలిగించినప్పుడుగాని, ఆస్తిపాస్తుల స్వాధీనానుభవాలను నిరోధించినప్పుడుగాని, అందుకు కారకులైనవారినుంచి కోర్టుల ద్వారా నష్టపరిహారములు పుచ్చుకోవచ్చును. చేసుకున్న ఒడంబడికలకు వ్యతిరేకంగా ప్రవర్తించినప్పుడుకూడ పరిహారాలు కోరవచ్చును. ఈ విషయంలో తెలియకపోవడం వల్లనైతేనేమి ఉపేక్షవల్ల నైతేనేమి

అనేకులు శ్రద్ధవహించక తమ హక్కులను నిలబెట్టుకోటానికి ప్రయత్నించరు. ఈ విషయానికి పాశ్చాత్యులు అధికమైన ప్రాధాన్యమిస్తారు. ఇది అందరూ గమనించి అనుసరించదగిన అంశం.

### నేరాలు :

క్రమ పరిపాలనకోసం కొన్నిచర్యలను ప్రభుత్వం నేరాలుగా పరిగణించి 'లా' ప్రకారం దండిస్తుంది. ప్రభుత్వనిర్వహణకు ప్రతిబంధకాలయినవి, దేశంలో శాంతికి భంగకరము లయినవి, నైతికంగా హేయములైనవి, ప్రజలకు దేహరీత్యాగాని మానసికంగాగాని బాధాకరములయినవి, ఆస్తిపాస్తుల పైగల హక్కులకు ప్రమాదకరము లయినవి మొదలైన కృత్యాలను నిషేధించడమయింది. వీటికొరకులను న్యాయస్థానాలు విచారణచేసి నేరం రుజువయిన పక్షంలో జుల్మానావల్లగాని, ఖైదులవల్లగాని లేక రెంటివల్లగాని, శిక్షిస్తాయి. నేరం చేసినవాళ్ళేగాక అందుకు సహాయకులు ప్రేరేపకులుకూడా దండించబడుతారు. రాజద్రోహం, నోట్లను తయారుచేయటం, అవినీతిపనులు, దొంగతనం, ఘాతపరచుట, హత్య, మాన నష్టం చేయటం మొదలైనవి ఈ తరగతి క్రిందికి వస్తాయి. ఇలాంటివి జరగకుండా చూచేందుకు పోలీసుశాఖ వారికేగాక ప్రజలకుకూడా కొంత అధికారం ఉన్నది. అయితే నేరస్తులను విచారణచేసి శిక్షించేఅధికారం ప్రభుత్వానికి మాత్రమే ఉంటుంది. ఈ బాధ్యతను ప్రజలు నిర్వహించటానికి ఎంత మాత్రమూ వీలులేదు. ఈ సందర్భములో నేరనిరూపణకోసం వ్యక్తులను పోలీసువారు హింసించటానికి హక్కులేదనే విషయంఅందరూ తెలుసుకోవలసి ఉన్నది.

### కోర్టు ధిక్కారము :

న్యాయస్థానాలను ధిక్కరించడం నేరమవుతుంది. కోర్టువారి ఆజ్ఞలను ఉత్తరవులను ఉల్లంఘించకూడదు. ఏస్థైనా కోర్టులో విచారణలో ఉన్న విషయాలను విమర్శించ గూడదు. న్యాయాధిపతులను అతికారరీత్యాతూలనాడగూడదు. ఆ విధంగా చేస్తే జుల్మానావల్లగాని

ఖైదులవల్లగాని దండించబడుతారు. పౌరుల హక్కులను కాపాడేవి న్యాయస్థానాలు, న్యాయమూర్తుల దృష్టిలో తారతమ్యాలకుగాని, ముఖమాటానికిగాని, ఆదరాభిమానాలకుగాని తావులేదు.

## బాధ్యతలు :

సంఘం మేలుకోసం ప్రజలు పౌరసత్వవిధులను నిర్వర్తించవలసి ఉంటుంది. నేరాలనుగురించి నేరస్తులనుగురించి తెలిసిన విషయాలను ప్రభుత్వోద్యోగులకు తెలియచేయాలి. కుటుంబంలో జనన మరణాలు సంభవించినప్పుడు, మశూచికాది అంటువ్యాధులు తటస్తించినపుడు అధికారులకు ఎరుక పరచాలి. సకాలంలో టీకాలు వేయించటం పరిసరాలలో మాలిన్యం చేయకుండా ఉండడం, గృహనిర్మాణ విషయాలలో ముందుగా అధికారుల అనుమతి పొందడం, చెల్లించవలసిన పన్నులను సకాలంలో చెల్లించడం మొదలైనవి పౌరసత్వపు విధులు. వీటిని ఉల్లంఘిస్తే శిక్షకు పాల్పడవలసి వస్తుంది.

తననుగాని తనవారికిగాని సంబంధించిన ఉత్తరాలను ఉచితంగాగాని, ఫలాపేక్షతోగాని గ్రామాంతరాలకు చేరవేయటం నేరమవుతుంది. కవర్లలో డబ్బును పంపటంకూడా అంతే. రిజిష్టరు చేయకుండా పంపిన వస్తువులుగాని, ఉత్తరాలుగాని పోయినప్పుడు పోష్టువాళ్లు నష్టానికి బాధ్యులుగారు. డబ్బును కవర్లలోపెట్టి పంపునప్పుడు ఇన్స్యూర్ చేయాలి, అధికారం పొందకుండా ఒకరి తపాలను మరొకరు తీసుకోకూడదు. రేడియోలు ఉన్నవాళ్లు లైసెన్సు రుసుములను సకాలంలో పోస్టాఫీసుకు చెల్లించకపోతే జుల్మానా పడుతుంది.

ఇవిగాక మనం ముఖ్యంగా గమనించవలసిన చట్ట నిబంధనలు ఇవి :—

మన రాష్ట్రప్రభుత్వం జారీచేసిన నూతన చట్టాల ప్రకారం మత్తుపదార్థాలు నిషేధించబడినవి. కల్లు, సారాయి, గంజాయి మొదలైన నిషావస్తువులను అమ్మటంగాని, కొనడంగాని, ఉంచుకొనడంగాని, రవాణా చేయడంగాని, సేవించడంగాని జరుపగూడదు. ఆ

విధంగా చేసినట్లయితే జుల్మానాకుగాని, ఖైదుకుగాని, పాలుబడ వలసివస్తుంది. వీటిని తయారుచేసే పరికరాలను ఉంచుకున్నప్పటికీ శిక్షార్హులు కాగలరు.

మదరాసు ప్రభుత్వపు షాపులు వగైరాలు చట్టంప్రకారం కొన్ని నిబంధనలను అనుసరించవలసి ఉంటుంది. షాపులు, దుకాణాలు, సినిమాలు, హోటళ్లు మొదలైనవి వారానికి తప్పనిసరిగా ఒకనాడు మూసి ఉంచాలి. వాటిలో పనిచేసే ప్రతిపనివాడికి వారానికి ఒక రోజున శెలవు ఉండాలి. రోజుకు పని ఎనిమిదిగంటలకు మించకూడదు. నాలుగేసి గంటల కొకసారి ఒకగంటసేపు విరామం ఇచ్చితీరాలి. పద్నాలుగేళ్లు నిండని పిల్లవాళ్లను పనికి నియోగించకూడదు. ఏడాది పనిచేసినవాళ్లకు జీతంతో సెలవులు యివ్వాలి. ఈ నిబంధనలను ధిక్కరిస్తే శిక్షకు పాత్రులవుతారు.

మదరాసు వసతిగృహముల చట్టప్రకారము ఇంటిఖామందు అద్దెకు ఉన్నవారిని నిష్కారణంగా వెళ్లగొట్టేందుకు వీలులేదు. అనుకొన్న తేదికి సక్రమంగా అద్దెయిచ్చినంతవరకు ఖాళీచేయమనడానికి వీలులేదు. ఇష్టంవచ్చినట్లు బాడుగను హెచ్చింపకూడదు. ఆవిధంగా పెంచితే రెంట్ కంట్రోల్ ఆఫీసరుకు పిటీషను పెట్టి క్రమమైన అద్దెను నిర్ణయించమని అద్దెకున్నవాళ్లు కోరవచ్చును. మునిసిపల్ పన్నునుబట్టి, 1940 వ సంవత్సరములో ఉన్న అద్దెనుబట్టి సక్రమమైన అద్దె నిర్ణయించడం జరుగుతుంది. ఇంటిఖామందు కొన్నిసందర్భాలలో అద్దెకువున్న వారిని అద్దెకంట్రోలర్ ద్వారా ఖాళీచెయ్యమని కోరవచ్చును. సక్రమంగా అద్దె ఇవ్వనప్పుడు, ఖామందు అనుమతిలేనిది ఇంటినిగాని ఇంటిలోని భాగాన్నిగాని ఇతరులకు అద్దెకిచ్చినప్పుడు అనుకున్న దానికి విరుద్ధంగా ఇంటిని వినియోగించినప్పుడు ఖామందు కాపురం ఉండేందుకు వేరే స్వంత ఇల్లు లేనప్పుడు అద్దెకువున్నవారిని వెళ్లగొట్ట వచ్చును. ఇల్లు ఖాళీకాగానే కంట్రోలరుకు వెంటనే తెలియచేయవలసి ఉంటుంది. [illegible]ంగా నడిచినవారు జుల్మానాకు పాత్రులవుతారు.

**విల్ నామా :**

మైనారిటీ వెళ్లి మతి తిన్నగావున్న ప్రతివ్యక్తి తనకు సంపూర్ణ హక్కున్న స్థిరచరాస్తులను తన తదనంతరం సంక్రమించవలసిన విధానాన్ని విల్ నామాద్వారా నిర్ణయించవచ్చును. ఆ వ్యక్తి జీవితకాలంలో విల్ నామా అమలులోకి రావటానికి వీలులేదు. అందువల్ల మరణించే లోపుగా ఎన్ని విల్ నామాలైనా ఒక్కొక్కడు వ్రాయవచ్చు. కాని తేదీనిబట్టి చివర వ్రాసిన మరణశాసనమే చెల్లుతుంది; ఈ పత్రాన్ని స్వయంగానైనా లేక మరొకరిచేతనైనా వ్రాయించి కనీసం ఇద్దరు సాక్షుల సమక్షంలో సంతకం చేయాలి. అప్పుడే సాక్షులుకూడా దస్కతులు పెట్టాలి. ఉత్తరోత్రా ఈవిల్ నామావల్ల లాభంపొందే వాళ్లు సాక్షులుగా ఉండేందుకు పనికిరారు. విల్ నామా పత్రాన్ని రిజిష్టరు చేయవలసిన అగత్యంలేదు. కాని చేస్తే మంచిది.

స్వార్జితమైన స్థిరచరాస్తులను అప్రతిబంధకమైన సర్వహక్కులూ ఉన్న వ్యక్తి తన ఇష్టంవచ్చిన వారికి ఉచితంగా ఇచ్చివేయవచ్చును. చరాస్తుల విషయంలో లిఖిత పూర్వకమైన పత్రం అవసరంలేదు. ఇచ్చివేస్తున్న ఉద్దేశాన్ని వెల్లడించి ఆస్తిని స్వాధీనపరిస్తే సరిపోతుంది. పత్రం వ్రాసుకుంటేమాత్రం రిజిష్టరు చేయించవలసి ఉంటుంది. స్థిరాస్తుల విషయంలో దానపత్రంవ్రాసి రిజిష్టరు చేయించి ఆస్తిని స్వాధీనం చేయాలి. మోసం, పొరబాటు మొదలైన కారణాలవల్ల తప్ప, ఇచ్చిన దానాన్ని సాధారణంగా ఉపసంహరించుకోటానికి వీలులేదు.

**భీమా :**

భీమాచేసుకునే ఆచారం దేశమంతటా వ్యాపించింది. భీమా అనేక విధాలు. జీవితభీమా, అగ్నిభీమా, మోటారుభీమా, మొదలైనవి అందరికీ ఎరిగినవే. భీమాచేస్తున్నప్పుడు పాలిసీఫారంలో అడిగిన అన్ని విషయాలను యదార్థంగాను, స్పష్టంగాను, దాచకుండాను తెలియచేయట మవసరం. అట్లా తెలియచెయ్యాకపోతే పాలిసీ పాకానికి వచ్చినప్పుడు ఇన్స్యూరెన్సు కంపెనీలు డబ్బు ఇచ్చేందుకు విరాక

ఈ సమిష్టి కుటుంబానికి చెందిన ఆస్తిలోని హక్కులు సమిష్టిగా ఉంటాయి. పుత్రపౌత్రాదులకు జన్మనుబట్టి ఆ ఆస్తిలోని హక్కు ఏర్పడుతుంది. వీరిసంఖ్య అధికమైనకొద్దీ వారివారి వాటా తగ్గుతూ ఉంటుంది. అదేవిధంగా వారిలో ఎవరైన గతించినప్పుడు గతించినవారివంతు మిగతా వారి ఆస్తిలో కలిసిపోతుంది. తండ్రి జీవితకాలంలోనే కొడుకులు కుటుంబాస్తిని పంపిణీచేయమని కోరవచ్చును. వ్యక్తిగతమైన సంపాదనలు కుటుంబాస్తిలో వాటంతటగా కలిసిపోవు.

విభాగాలయ్యేదాకా తండ్రి, తండ్రి లేనిపక్షంలో వారసులలో పెద్దవాడు, కుటుంబకర్తగా వ్యవహరిస్తాడు. కుటుంబానికి సంబంధించిన సక్రమమైన ఋణాలకోసం కుటుంబాస్తిని విక్రయించేందుకు తండ్రికి హక్కుంది. విభాగానంతరం కూడ తండ్రిచేసిన న్యాయబద్ధమైన అప్పులకు కొడుకులు వారి వాటాకు సంబంధించినంతవరకైనా బాధ్యులవుతారు. కుంటుబాస్తిని పంచుకొన్న వారసులు కుటుంబానికి చెందిన కొందరిని పోషించవలసి ఉంటుంది. ప్రస్తుతం కుటుంబ ఆస్తిలో తల్లికికూడ హక్కు ఏర్పడ్డది.

**పిత్రార్జితం :**

తండ్రి మరణానంతరం అతడి పిత్రీయ స్వార్జితాది యావదాస్తి కొడుకులకు, కొడుకులులేని పక్షంలో పౌత్రాదులకు సంక్రమిస్తుంది. పుత్రపౌత్రాదులు ఎవరూ లేనప్పుడు దౌహిత్రుడికి చెందుతుంది తల్లి స్త్రీధనపు ఆస్తి కుమార్తెలకు చెందుతుంది. సంతానం లేకుండా భర్తమరణిస్తె భార్య తనజీవిత పర్యంతం ఆస్తిని అనుభవించవచ్చు. ఆమె తదనంతరం భర్తవారసులకు సంక్రమిస్తుంది, భార్య ఈ ఆస్తిని అవసరమైన ప్రత్యేక కారణాలకు తప్ప అన్యాక్రాంతం చేయడానికి హక్కులేదు.

**దత్తత :**

సంతానంలేనప్పుడు పురుషుడు దత్తత చేసుకోవచ్చును. దత్తత చేసుకోకుండ భర్త మరణించినట్లయితే భర్త అనుమతించిన పక్షంలో భార్య దత్తత చేసుకోవచ్చును. భర్త అనుమతి దత్తతకోసం తీసుకోవలసి ఉంటుంది. దత్తపుత్రుడికి ఔరస పుత్రుడితో సమానమైన హక్కు లేర్పడు

రిస్తాయి. అందువల్ల అనేకులు నష్టపడుతున్నారు. పాలిసీని ఎవరికి సంక్రమించేటట్లు నిర్ణయించుకున్నారో వారి పేరును ఉదహరించి కంపెనీవాళ్లు గుర్తించేట్లు చూడాలి, లేకపోతే పాలిసీదారుని మరణానంతరం తగాదాలువచ్చి వారసత్వపు సర్టిఫికేట్ కోసం కోర్టుకు పోవలసివస్తుంది.

## హిందూలా :

హిందూలానుగురించిన అనేక విషయాలు పరంపరాగతంగా జనబాహుళ్యానికి తెలిసేఉంటాయి. వాటినిగురించి స్థూలంగా చెప్పటం కూడ కష్టమైనపని. సాధారణంగా అందరికి సంబంధించిన కొన్ని ముఖ్య అంశాలు ఇక్కడ చెప్పబడినవి. కాని ఈ విషయంలో ఎప్పటి కప్పుడు మార్పులు వస్తుంటాయి కాబట్టి అవసరమైనప్పుడు లాయర్ల సలహా తీసికొంటే మ[illegible] దిక ర స శక్తు [illegible]ంచిది.

స్త్రీ పురుషులకు పద్ధెనిమిదేండ్లు నిండేవరకు మైనారిటీ ఉంటుంది. కోర్టు ఆఫ్ వార్డ్స్ అధీనంలో వున్నవారు ఇరవై ఒక్క సంవత్సరం నిండితేనేగాని మేజరు కారు. మైనర్లకు గార్డియన్ తండ్రి. తండ్రి లేకపోతే తల్లి గార్డియనవుతుంది. భార్యకు భర్త గార్డియన్. కొన్ని ప్రత్యేక సందర్భాలలో ఈ అధికారాన్ని కోర్టులే చెలాయించుతాయి.

## సమిష్టి ఆస్తి :

సమిష్టికుటుంబము, కుటుంబ ఆస్తిఅనే సంస్థలు కేవలం హిందూ న్యాయవిధానానికి చెందినవి. ఒక్కొక్క మూలపురుషుడి సంతతి యావత్తూ సమిష్టికుటుంబంగా పరిగణించబడుతుంది. పుత్ర పౌత్రాదులు, వారిభార్యలు, అవివాహిత పుత్రికలు మొదలైనవారు దీనిలో సభ్యులు. కుటుంబం సమిష్టిగా ఉన్నదనటానికి ఉమ్మడిగా ఆస్తి పాస్తులు ఉండనవసరంలేదు. నివాస భోజనాది విషయాలలో ఉంటే కూడిక దీనికి ముఖ్య లక్షణం.

ఈ సమిష్టి కుటుంబానికి చెందిన ఆస్తిలోని హక్కులు సమిష్టిగా ఉంటాయి. పుత్రపౌత్రాదులకు జన్మనుబట్టి ఆ ఆస్తిలోని హక్కు ఏర్పడుతుంది. వీరిసంఖ్య అధికమైనకొద్దీ వారివారి వాటా తగ్గుతూ ఉంటుంది. అదేవిధంగా వారిలో ఎవరైన గతించినప్పుడు గతించినవారివంతు మిగతా వారి ఆస్తిలో కలిసిపోతుంది. తండ్రి జీవితకాలంలోనే కొడుకులు కుటుంబాస్తిని పంపిణీచేయమని కోసివచ్చును. వ్యక్తిగతమైన సంపాదనలు కుటుంబాస్తిలో వాటంతటగా కలిసిపోవు.

విభాగాలయ్యేదాకా తండ్రి, తండ్రి లేనిపక్షంలో వారసులలో పెద్దవాడు, కుటుంబకర్తగా వ్యవహరిస్తాడు. కుటుంబానికి సంబంధించిన సక్రమమైన ఋణాలకోసం కుటుంబాస్తిని విక్రయించేందుకు తండ్రికి హక్కుంది. విభాగానంతరం కూడ తండ్రిచేసిన న్యాయబద్ధమైన అప్పులకు కొడుకులు వారి వాటాకు సంబంధించినంతవరకైనా బాధ్యులవుతారు. కుంటుంబాస్తిని పంచుకొన్న వారసులు కుటుంబానికి చెందిన కొందరిని పోషించవలసి ఉంటుంది. ప్రస్తుతం కుటుంబ ఆస్తిలో తల్లికికూడ హక్కు ఏర్పడ్డది.

## పిత్రార్జితం :

తండ్రి మరణానంతరం అతడి పిత్రీయ స్వార్జితాది యావదాస్తి కొడుకులకు, కొడుకులులేని పక్షంలో పౌత్రాదులకు సంక్రమిస్తుంది. పుత్రపౌత్రాదులు ఎవరూ లేనప్పుడు దౌహిత్రుడికి చెందుతుంది తల్లి స్త్రీధనపు ఆస్తి కుమార్తెలకు చెందుతుంది. సంతానం లేకుండా భర్తమరణిస్తే భార్య తనజీవిత పర్యంతం ఆస్తిని అనుభవించవచ్చు. ఆమె తదనంతరం భర్తవారసులకు సంక్రమిస్తుంది, భార్య ఈ ఆస్తిని అవసరమైన ప్రత్యేక కారణాలకు తప్ప అన్యాక్రాంతం చేయడానికి హక్కులేదు.

## దత్తత :

సంతానంలేనప్పుడు పురుషుడు దత్తత చేసుకోవచ్చును. దత్తత చేసుకోకుండ భర్త మరణించినట్లయితే భర్త అనుమతించిన పక్షంలో భార్య దత్తత చేసుకోవచ్చును. భర్త అనుమతి దత్తతకోసం తీసుకోవలసి ఉంటుంది. దత్తపుత్రుడికి ఔరస పుత్రుడితో సమానమైన హక్కు లేర్పడు

తవి. జననకుటుంబంలో సర్వహక్కులూ అంతరిస్తాయి. తెలుగుదేశంలో కొన్నిచోట్ల ఇల్లరికం ఆచారం ఉన్న వర్గములలో ఇల్లటపు అల్లుడికికూడ కుటుంబ ఆస్తిలో హక్కు ఏర్పడుతుంది.

సలహా :

దేశంలో అమలులోవున్న న్యాయవిధానాన్ని సమగ్రంగా ఇక్కడ విశదీకరించడానికి అవకాశంలేదు. కాబట్టి కొన్ని ముఖ్యవిషయాలను మాత్రమే సూచించడంమైంది. సందర్భాన్నిబట్టి అవసరమైనప్పుడల్లా న్యాయవాదుల సలహాను తీసుకోటం మంచిది. కోర్టులచుట్టూ తిరిగేవారి సహాయంతో వ్యవహారాలను చక్కబెట్టుకోవాలని చూస్తే కోర్టులపాలు గాక తప్పదు. దీర్ఘరోగి సగంవైద్యుడే కావచ్చును. అంతమాత్రాన బ్రతుకాశించిన వారెవరూ అలాంటి వాడిచేత వైద్యం చేయించుకోరు. అదే విధంగా కోర్టువ్యవహారాలతో కొద్దోగొప్పో పరిచయంవున్న వ్యక్తులకు స్వంతవ్యవహారాలను వప్పగించకూడదు. అవకాశం దొరికినపుడల్లా లేనిపోని పేచీలు కల్పించి దానికి ఫలితంగా తయారయ్యే తగాదాలవల్ల జీవనోపాధిని సంపాదించేవాళ్లు ప్రతిగ్రామంలోను వుంటారు. వీళ్ళను సంప్రదించి వారి సలహాలను తీసుకోవడం కేవలం అవివేకమైనపని. పత్రాలను దస్తావేజులను వీరిచేత వ్రాయించినట్లయితే తెలిసిచేసేవి తెలియకచేసేవి అనేక అవకతవకలు ఏర్పడక తప్పదు. అంతేగాక ఒక్కొక్కప్పుడు ఇలాంటి వ్యక్తులు ఉభయ పార్టీలకు ఒకే విషయంలో స్వలాభంకోసం సలహాలను ఇచ్చి అనవసరపుచిక్కులను తెచ్చిపెడతారు. అందువల్ల వీలైనంతవరకు వీరితో ఏ ప్రమేయమూ పెట్టుకోకుండా వుండటం మంచిది.

## మధ్యవర్తిత్వం

పట్టుదలకోసం కోర్టులకు ఎక్కటంవల్ల ఏలాంటి లాభమూవుండదు. డబ్బుతో కూడుకుని వుండేది కోర్టు వ్యవహారం. సాధారణంగా అనేక సందర్భాలలో వ్యాజ్యాలు గెలిచినా ఓడినా పర్యవసానం ఒకటిగానే పరిణమిస్తుంది. సాధ్యమైనంతవరకు అంకురించిన తగాదాలను సంప్రదింపులతో అణచివేయటం శ్రేయస్కరం. ఈ విధంగా సమాధానం కుదరకపోతే యోగ్యులైన పెద్దమనుష్యులను మధ్యవర్తులుగా నియమించి పతి

ష్కారం చేసుకోవటం మంచిది. ఉభయపార్టీల అంగీకారంమీద మధ్యవర్తులు ఏ పరిష్కారాన్ని అయినా తీర్చవచ్చును. వారు లిఖితపూర్వకంగా ఇచ్చిన తీర్పును కోర్టులు ఆమోదించి డిక్రీ ఇవ్వగలవు. ఈ మధ్యవర్తిత్వానికి ఒప్పుకున్న రెండుపక్షాలవారు ఈ డిక్రీకి బద్ధులవుతారు. సంప్రదింపులవల్ల పరిష్కారంకాని సందర్భాల్లో తప్ప కోర్టులకు ఎక్కవలసిన అవసరం వుండకూడదు. 'లా' కు సంబంధించిన ప్రతివ్యవహారంలోను ఎప్పటికప్పుడు న్యాయవాదుల సలహాను పొందటం ఉచితమైన పద్ధతి.

**వివాహాలు :**

హిందూధర్మ శాస్త్రప్రకారం పురుషుడు ఎన్ని వివాహాలేనా చేసుకోవచ్చును. కానీ ఇటీవల మద్రాసు ప్రభుత్వంవారు ఆమోదించిన చట్టప్రకారం బహుపత్నీత్వం నిషేధించడమైనది. భార్య జీవించియుండగా మరొక స్త్రీని న్యాయబద్ధంగా పెండ్లాడటానికి వీలులేదు, రెండవ వివాహము చెల్లకపోగా భర్త శిక్షార్హుడు కాగలడు. వర్ణాంతర వివాహాలు చేసుకోలచినవారు రిజిష్టరు వివాహం చేసుకుంటే మంచిది. వితంతువులు న్యాయబద్ధంగా వివాహం చేసుకోవచ్చును. అట్టి సందర్భంలో మొదటిభర్త ఆస్తిలో ఆమెకున్న అన్నిహక్కులు అంతరిస్తాయి. హిందూ 'లా' లో విడాకులకు అవకాశం లేదు. భర్త సరిగా చూడక బాధలుపెట్టె సందర్భంలో భార్య వేరేఉండి మనోవర్తిని కోరవచ్చును. పైన చెప్పిన చట్టాన్ని అనుసరించి ఇకముందు విడాకులకు అవకాశం ఏర్పడినది. అవినీతి, అంటువ్యాధులు మొదలైన కారణాల వల్ల వివాహాన్ని రద్దుచేసికొనవచ్చును వివాహవిచ్ఛిన్నం కోర్టుద్వారా మాత్రమే జరగవలసియున్నది.

ప్రస్తుతంహిందూన్యాయవిధానం, దేశమంతటా ఒకే విధంగా అమలు జరుగడంలేదు. బంగాళా దేశంలో దాయభాగ విధానం, బొంబాయి మదరాసు రాష్ట్రాలలో మితాక్షరసూత్రం, ఇతర ప్రాంతాలలో మయూఖాది సూత్రాలు అనుసరణలో ఉన్నవి. భారతదేశం మొత్తంమీద హిందువులకు సంబంధించిన వరకూ ఒకేన్యాయ విధానం ఉండడం అవసరమని ప్రభుత్వం నిశ్చయించి 'హిందూ లా కోడ్' ఒక దానిని

ప్రముఖులైన వారిచేత తయారుచేయించింది. ఈ బిల్లును ఇప్పుడు మన పార్లమెంటు సమగ్రంగా విచారిస్తున్నది. పార్లమెంటు ఆమోదించిన తరువాత ఈ క్రొత్తచట్టం అమలులోకి రాగలదు. ఈ కోడ్ ప్రకారం ప్రస్తుతం అమలులోవున్న న్యాయవిధానం చాలవరకు మారిపోతుంది. సమిష్టి కుటుంబపు ఆస్తిలో పుత్ర పౌత్రాదులకు జన్మనుబట్టి హక్కు ఏర్పడినప్పటికి యావదాస్తిని తండ్రీ తన ఇష్టంవచ్చినట్లు వినియోగించటమే గాక విల్ నామాద్వారా సంక్రమింప చేయవచ్చును. తండ్రి బ్రతికి వున్నంతవరకు పుత్రాదులకు ఆస్తిలో హక్కు ఉండదు. భాగం పంచమని అడిగేందుకు వీలుపడదు తండ్రి మరణానంతరం విల్ నామా ఏదీ లేనియెడల ఆస్తిని సన్నిహిత వారసుల పంచుకుంటారు. కుమారులతో పాటు తల్లికి, కుమార్తెలకు కూడా ఆస్తిలో భాగం పంచి ఇవ్వాలసివ ఉంటుంది, ఏకపత్నీత్వానికి, విడాకులకు ముఖ్యస్థానం ఉంటుంది దత్తతలో ఇప్పుడున్న అవకతవకలు ఇక ఉండవు. మంచిచెడ్డలను గమనించక ప్రతి మార్పునూ ప్రతిఘటించేవారు ఈ కొత్త హిందూ లా కోడ్‌ను అనవసరమైన ఆవేశంతో తూలనాడినా ఇది సంఘానికి ఒక విధమైన ఐక్యతను తీసికొనివచ్చి ఉచితమైన హక్కులను అందరికీ ఏర్పరచి వ్యాజ్యాలను తగ్గింగలదని నిక్కచ్చిగా చెప్పవచ్చు.

# ఆంధ్ర రాష్ట్రం

మదరాసురాష్ట్రం భరతఖండంలో తక్కిన అన్ని రాష్ట్రాల లాగానే, ఎప్పటికప్పడు బ్రిటిషువారి ఆధీనంలోనికి వచ్చిన ప్రాంతాలతో, వారి సౌకర్యం ప్రకారం ఏర్పాటు చేయబడింది. అందుచేతనే, మదరాసు రాష్ట్రంలో తెలుగు జిల్లాలు, తమిళ జిల్లాలు, కన్నడ, మళయాల ప్రాంతాలు చేరి ఉన్నాయి. ప్రతిభాషా ప్రాంతానికి ప్రత్యేక ప్రభుత్వం వుంటేనేగాని, ఆ ప్రాంతం సర్వతోముఖంగా అభివృద్ధి పొందడానికి వీలు లేదనే విషయాన్ని నేడు ఇండియాలోని పరిపాలకవర్గాల వారూ, ప్రజా నాయకులుకూడా తెలుసుకున్నారు.

దాదాపు 71 వేల చదరపుమైళ్ళ వైశాల్యమూ, దాదాపు 1[illegible] రూపాయల ప్రభుత్వాదాయమూ, విస్తారమైన ఖనిజసంపదా

దాదాపు మూడుకోట్ల జనాభాగల తెలుగుజిల్లాలను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చెయ్యవలసిందనే ఆందోళన ఆంధ్రదేశంలో దాదాపు 40 సంవత్సరాలనుంచీ జరుగుతున్నది. ఇండియాలోని రాష్ట్రాలను భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా ఏర్పాటుచేసి ఆంధ్రజిల్లాలను ఒక ప్రత్యేక రాష్ట్రముగా ఏర్పాటు చేయవలసినదనే సూచన మొట్టమొదట 1910 లో గుంటూరులో యువజన సాహిత్య సంఘము (యంగ్మెన్సు లిటరరీ అసోసియేషను) వారు చేశారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణోద్యమానికి యిదే పునాది. తరువాత 1913 లో ఆంధ్రమహాసభ స్థాపింపబడినది. తరువాత అనేక సంఘములు, ఉద్యమములు దీనికి అనుబంధములుగా బయలుదేరాయి. 1916 లో కలకత్తా సమావేశములో అఖిలభారత కాంగ్రెసు మహాసభలో భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణ సిద్ధాంతము అంగీకరింపబడింది, కాంగ్రెసు రాష్ట్రాలలో ఆంధ్ర రాష్ట్రం ప్రత్యేక స్థానాన్ని పొందింది.

ఇది యిలా ఉంటుండగా మాంటేగు - ఛెమ్సుఫర్డు కమిటీవారు ఇండియాకు రాజ్యాంగ సంస్కరణలను ప్రతిపాదించడానికి పరిస్థితుల పరిశీలన నిమిత్తము ఇండియాకు వచ్చారు. అప్పుడు ఆంధ్రమహాసభ వారు ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ ఆ కమిటీకి ఒక నివేదికను సమర్పించారు. తరువాత 1919 గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టుపై కామన్సు సభలో చర్చలు జరుగుతూన్నప్పుడు ఆంధ్రమహాసభ వారు ఒక రాయబార వర్గాన్ని కూడా ఇంగ్లండు పంపిచారు. అదేసమయములో ఇండియాలోని కేంద్రశాసనసభ ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని ఆమోదిస్తూ ఒక తీర్మానము చేసింది. అయినప్పటికీ 1919 గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టులో ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరుగలేదు.

1922 లో కేంద్రశాసనసభ ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని ఆమోదిస్తూ మళ్ళీ తీర్మానముచేసింది. 1927-28 లో భారతదేశపు రాజ్యాంగ విధానాన్ని సంస్కరించడానికి ప్రయత్నాలు జరుగుతూన్నపుడు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణముకోసము పెద్ద కృషి జరిగింది. సైమను కమిషన్ వారు ఇండియా వచ్చినపుడు వారికి ఒక నివేదిక సమర్పించబడింది. 1927 లో

మదరాసు శాసనసభ కేంద్రశాసనసభలు ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ తీర్మానాలు చేశాయి. పండిత మోతీలాలు నెహ్రూ నివేదిక కూడా ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని ఆమోదించింది. ఐతే ఆంధ్ర దేశములో కాంగ్రెసు ఉద్యమము బలంగా ఉండటంవల్ల, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రము మరొక కాంగ్రెసు రాష్ట్రముగా పరిణమిస్తుందని ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సైమను కమిషనువారు అంగీకరించలేదు. అయితే ఒరిస్సా, సింధు అనే రెండు ప్రత్యేక రాష్ట్రలను ఏర్పాటుచేయుడానికి అంగీకరించారు. 1935 లో ఒరిస్సా రాష్ట్రం ఏర్పాటు చేయబడినప్పుడు గంజాం జిల్లాలోని ఆంధ్రులు అత్యధిక సంఖ్యలో ఉన్న ప్రాంతాలు, బరంపురం పట్టణం, ఒరిస్సా రాష్ట్రములో కలిపివేయబడినవి.

1937 లో కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడ్డప్పుడు ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయములో ఆంధ్రులకు కొంత ఆశాభావం కలిగింది. 1938 లో మదరాసు అసెంబ్లీ, కౌన్సిలు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రాన్ని కోరుతూ తీర్మానాలుచేశాయి. కాని అప్పుడూ రాష్ట్రనిర్మాణము జరుగలేదు. 1946 లో కౌన్సిలు ఆఫ్ స్టేట్ లో ఇదేవిధంగా తీర్మానం జరిగింది. కాని అప్పుడు కేంద్ర ప్రభుత్వము తరపున, ఈ విషయము కన్స్టిట్యుయెంటు అసెంబ్లీలో నిర్ణయింపబడుతుందనే హామీ ఇవ్వబడింది. 1947 లో మద్రాసు శాసన సభలు భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ తీర్మానాలు చేశాయి. నూతన రాజ్యాంగ విధానము అమలు జరిగేటప్పుడు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరుగుతుందని ఇండియా ప్రధాన మంత్రి పండిత జవహర్‌లాల్ నెహ్రూ హామీకూడా ఇచ్చారు, అయినప్పటికీ నూతన రాజ్యాంగ విధానపు ముసాయిదాలో ఆంధ్రరాష్ట్రము పేర్కొనబడలేదు.

1947 నవంబరులో రాజ్యాంగసభలో జరిగిన చర్చల ఫలితంగా ఎస్. కె. ధార్ (అధ్యక్షుడు); డాక్టర్ పన్నాలాల్, జగత్ నారాయణ లాల్ గార్లు సభ్యులుగాగల ఒక కమిషను, రాజ్యాంగసభ అధ్యక్షుడు నియమించారు. కొత్త రాష్ట్రాలను వేటినైనా ఏర్పాటు చెయ్యవచ్చునా, వాటి సరిహద్దులు ఎలా ఉండాలి, వాటి ఆర్థిక, పరిపాలనాస్థితులు

ఎలా వుంటాయి అనే విషయాలను సూచింపవలసిందని యీ కమిషనుకు-తాఖీదు యివ్వబడింది.

ఈ కమిషను 1948 జూలై 19 తేదిన ప్రథమంలో సమావేశమై నవంబరు 21 న ఆఖరు సమావేశం జరిపింది. ఆంధ్రదేశంలో విశాఖపట్టణం, మదరాసు, దక్షిణాన కాలికట్, మెంగుళూర్, కోయంబత్తూరు, బెంగుళూరు నగరాలలో సాక్షులను విచారించారు. మొత్తం, ఆంధ్ర, తమిళ, కన్నడ, మహారాష్ట్ర, కొంకణ సి. పి. బీరారు ప్రాంతాలలో 6,700 మంది సాక్షులను విచారించి, దాదాపు 1,000 మహజర్లు. అందుకొని, యీ కమిషను తమ నిర్ణయాన్ని డిసెంబరు 10 న రాజ్యాంగ సభ అధ్యక్షునికి సమర్పించారు. ఆ నివేదికలో వారు చెప్పినదేమంటే ఇండియాలో భాషా ప్రాంతలుగా రాష్ట్రాలను ఎన్నడూ ఏర్పరచరాదని.

1948 డిసెంబరు 18 తేదిన అఖిలభారత కాంగ్రెసు మహాసభ, భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణాన్ని గురించి ఏ. ఐ. సి. సి. కి నివేదికను తయారు చెయ్యవలసిందిగా కోరుతూ, డాక్టరు పట్టాభి సీతారామయ్య, పండితజవాహర్‌లాల్ నెహ్రూ, సర్దార్ పటేల్ గార్లను ఒక కమిటీగా నియమించింది.

నెహ్రూ-పటేలు-పట్టాభి కమిటి తమ నివేదికను కాంగ్రెసు వర్కింగుకమిటికి 1949 ఏప్రిల్ 6 న సమర్పించారు. వర్కింగుకమిటీ దానిని ఆమోదించింది. ఆ నివేదికప్రకారం, మదరాసు నగరం తమకు కావాలని ఆంధ్రులు కోరకుండా వున్నట్లయితే, ఆంధ్రరాష్ట్ర సరిహద్దుల విషయంలో పొరుగువారితో (అంటే, కర్నాటులతోను తమిళులతోను) ఆంధ్రులు ఒక ఒడంబడికకు వచ్చినట్లయితే ఆంధ్రరాష్ట్రం వీలైనంతత్వరలో ఏర్పాటు చెయ్యబడుతుంది.

నెహ్రూ-పటేలు-పట్టాభి సూత్రమును అంగీకరిస్తూ, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని ఆమోదిస్తూ 1949 నవంబరు 7 తేదీన తమిళనాడు కాంగ్రెసు కమిటీ తీర్మానం చేసింది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ 1949 నవంబరు 11 తేదీన విజయవాడలో సమావేశమై, పై సూత్రప్రకారం ఆంధ్రరాష్ట్ర నిర్మాణంచెయ్యవలసిందిగా ప్రభుత్వాన్ని

కోరుతూ తీర్మానం చేసింది. అయితే యీ కమిటీ మదరాసు నగరాన్ని కేంద్రప్రభుత్వాధీనంలో, ఛీఫ్ కమిషనర్ రాష్ట్రంగా ఏర్పాటు చెయ్యవలసిందని కోరింది.

మదరాసురాష్ట్రప్రభుత్వంవారు, నవంబరు 12 తేదీన నెహ్రూ-పటేలు-పట్టాభి సూత్రమును అంగీకరిస్తూ, ఆ ప్రకారం ఆంధ్రరాష్ట్ర నిర్మాణం చెయ్యవలసిందని కేంద్రప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానం చేశారు.

నవంబరు 16 తేదీన అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీ వారు సమావేశమై పై సూత్రప్రకారం, విశాఖపట్టణం, తూర్పు గోదావరి, పడమటి గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలను బళ్ళారి జిల్లాలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గ్ తాలూకాలను కలిపి ప్రత్యేకరాష్ట్రంగా వెంటనే ఏర్పాటు చెయ్యవలసిందనీ, యీ రాష్ట్రానికి సరిహద్దులను నిర్ణయించ డానికి ఒక కమిషనరును ఏర్పాటు చెయ్యవలసిందనీ కోరుతూ తీర్మానం చేశారు.

కేంద్రప్రభుత్వంవారు, యీ తీర్మానాన్ని అంగీకరించి, 1950 జనవరి 26 తేదీలోపల ప్రత్యేక రాష్ట్రాన్ని ఏర్పాటు చెయ్యడానికి వీలు అవుతుందా అనీ, రాష్ట్ర విభజన ఏర్పాట్లను చెయ్యడానికి ఒక సలహా సంఘాన్ని (విభజన కౌన్సిలును) ఏర్పాటు చేయవలసిందనీ, సరిహద్దులను నిర్ణయించడానికి కమిటీని నియమించడంలో సూచనలను చెయ్యవలసిందనీ మదరాసు ప్రభుత్వాన్ని అడిగారు.

మదరాసు మంత్రిమండలి 1949 డిసెంబరు 6 తేదీన సమావేశమై కేంద్రప్రభుత్వం చేసిన సూచనలను పరిశీలించి యీ క్రింది నిర్ణయాలను తెలియ పరచారు.

"ఆంధ్రరాష్ట్రాన్ని 1950 జనవరి 26 తేదిలోపల ఏర్పాటు చెయ్యడం సాధ్యంకాదు. 1950 ఏప్రిల్ 1 తేదిలోపల మాత్రం సాధ్యం అవుతుంది".

"ఆంధ్రరాష్ట్ర సరిహద్దులను నిర్ణయించడానికి ముగ్గురు సభ్యులు గల కమిటీని నియమించవచ్చును. వీరిలో ఒక సభ్యుడు హైకోర్టు జడ్జీగారి రిటైరయిన హైకోర్టు జడ్జీగాని అయివుండాలి, ముగ్గురు సభ్యులూకూడా, మదరాసు ఒరిస్సా రాష్ట్రాలకు చెందనివారై వుండాలి".

తరువాత, డిసెంబరు 7 తేదిన మదరాసు మంత్రిమండలి మళ్ళీ సమావేశమై రాష్ట్రవిభజన ఏర్పాటను నిర్ణయించడానికి యీ క్రింది సభ్యులతో ఒక కౌన్సిలును నియమించారు.

ప్రధాని పి. ఎస్. కుమారస్వామిరాజా (అధ్యక్షులు) పబ్లిక్ వర్క్సు మంత్రి ఎం. భక్తవత్సలం, విద్యామంత్రి కె. మాధవమీనన్, టి. టి. కృష్ణమాచారి, ఆర్థికమంత్రి బి. గోపాలరెడ్డి, మద్యనిషేధ మంత్రి నీలం సంజీవరెడ్డి, టంగుటూరి ప్రకాశం, కళా వెంకటరావు గార్లు.

ఈ కౌన్సిలుకు కార్యదర్శి ఎస్. వెంకటేశ్వరన్, ఐ.సి.ఎస్.

ఈ కమిటీ తమ నివేదికను 1950 జనవరి 3 తేదిన మంత్రి మండలికి సమర్పించారు. కమిటీ నివేదికపట్ల, కమిటీసభ్యులంతా, ఒక్క టంగుటూరి ప్రకాశంగారు తప్ప, ఏకాభిప్రాయన్ని వెలిబుచ్చారు. ప్రకాశంగారు ప్రత్యేకాభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

ఈ కమిటీలో అధిక సంఖ్యాకులు వెలిపుచ్చిన ఏకాభిప్రాయం ప్రకారం, ఆంధ్రరాష్ట్ర నిర్మాణం యీ క్రింద పద్ధతులలో జరగాలి.

విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పడమటి గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలను, బళ్ళారి జిల్లాలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గ్ తాలూకాలను కలిపి ప్రత్యేక ఆంధ్రరాష్ట్రంగా, 1950, జనవరి 26 తేదిలోపల, ఏర్పాటు చెయ్యాలి. బళ్ళారి జిల్లాలోని తక్కిన ఆరుతాలూకాలను మదరాసు రాష్ట్రంలోనే, ప్రత్యేక కర్ణాటక రాష్ట్రం ఏర్పడేవరకు, ఉంచాలి. ఆంధ్ర, మదరాసు రాష్ట్రాలమధ్య సరిహద్దుల విషయంలో

ఏవైనా భేదాభిప్రాయాలు వుంటే, యీ రెండు రాష్ట్రాల ప్రభుత్వాలు అన్యోన్య సమాలోచనవల్ల పరిష్కరించుకోవచ్చును.

ఆంధ్రరాష్ట్రానికి, విభజనవల్ల వచ్చేజమలు ఆరాష్ట్రానికివచ్చే అప్పులకన్న పదికోట్లరూపాయలు ఎక్కువగా వుంటాయి.

మదరాసు నగరంలోని ప్రభుత్వకార్యాలయాల భవనాలను మదరాసు రాష్ట్రమే తీసుకుంటున్నందున, ఆంధ్రరాష్ట్రానికి ఒక కోటి రూపాయలు యివ్వబడుతవి.

ఏడుగురు జడ్జిలతో ఆంధ్రరాష్ట్రానికి ఒక ప్రత్యేక హైకోర్టు ఏర్పాటుచేయబడుంది. ఈ హైకోర్టు ఆంధ్రదేశంలో ఏ నగరంలో పెట్టేదీ ఆంధ్రనాయకులు నిర్ణయిస్తారు.

ఆంధ్రరాష్ట్ర రాజధాని ఎక్కడ పెట్టవలసిందీ. 1950 జనవరి 26 తేదీలోగా ఆంధ్రనాయకులు నిర్ణయిస్తారు. ఆంధ్రరాష్ట్ర శాసనసభ, గవర్నరు, మంత్రిమండలి 1950 జనవరి 26 నాటికి ఆ నగరానికి వెళ్లిపోవాలి.

ఆంధ్రరాష్ట్ర శాసనసభలో 95 మంది సభ్యులు వుంటారు.

ఈ పైషరతులతో ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చెయ్యవచ్చునని మదరాసు మంత్రిమండలి 1950 జనవరి 4 తేదిని తీర్మానం చేసింది.

ప్రకాశంగారు ప్రత్యేకంగా వెలిబుచ్చిన అభిప్రాయాలు ఇవి:

1. ఆంధ్రరాష్ట్రానికి ప్రత్యేక రాజధాని నగరం ఏర్పడేదాకా ఆంధ్రప్రభుత్వకార్యాలయాలు చెన్నపట్టణంలోనే వుండాలి.

2. అప్పులకు పైబడిన జమగా ఆంధ్రరాష్ట్రానికి ఇచ్చే పదికోట్ల రూపాయలు చాలవు. ఆంధ్రరాష్ట్రానికి ఇంకా ఎక్కువ వంతు రావలసి వుంటుంది.

3. మదరాసు నగరాన్ని తమిళరాష్ట్రానికి ఇవ్వడమా, ప్రత్యేక కమిషనర్ రాష్ట్రంగా వుండడమా అనే విషయం స్పష్టంగా నిర్ణయించేవరకూ, మదరాసునగరంలోని భవనాల విలువను రెండురాష్ట్రాలకు పంచడం జరగకూడదు.

4. ఆంధ్ర రాష్ట్రప్రభుత్వంలో ఉద్యోగం చెయ్యడానికి, ఆంధ్రేతరులనుకూడా నియమించాలన్న నిర్బంధం వుండకూడదు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ 1950 జనవరి 4 తేదీన మదరాసులో సమావేశమై, ఆంధ్రరాష్ట్ర రాజధానిని శాశ్వతంగా రాయలసీమలో వుంచడానికి నిర్ణయించింది. రాజధాని నిర్మాణం జరిగేవరకూ ఆంధ్రరాష్ట్ర రాజధానిని మదరాసు నగరంలో వుంచుకొనేటట్లు చెయ్యవలసిందిగా కేంద్రప్రభుత్వాన్ని కోరింది.

చిట్టచివరకు, ఆంధ్రరాష్ట్రాన్ని 1950 జనవరి 26 తేదీలోగా ఏర్పాటు చెయ్యడానికి వీలులేదని కేంద్రప్రభుత్వం 1950 జనవరి 23 న మదరాసు ప్రభుత్వానికి తెలియపరచారు. దానికి కారణాలు ఏమిచెప్పారంటే : ఆంధ్రరాష్ట్ర ఆదాయం, వ్యయంకంటె రెండుకోట్లరూపాయలు తక్కువ వుంటుందట ; ఆంధ్రదేశపు హైకోర్టు ఎక్కడ వుండాలనే విషయం స్పష్టంగా తేల్చకపోవడమట ; ఆంధ్రేతర ఉద్యోగులు మాకు వద్దు అని ఆంధ్రనాయకులు చెప్పే మాటలవల్ల, ఆంధ్రరాష్ట్రలో పని చెయ్యవలసివచ్చే ఆంధ్రేతర ఉద్యోగులు మనస్ఫూర్తిగా ఉద్యోగాలు చెయ్యలేక పోవడం, దానివల్ల రాష్ట్రపరిపాలన బాగా జరక్కపోవడమూనట ; బళ్ళారిజిల్లాను గురించి విభేదాభిప్రాయాలట.

మళ్లీ 1951 ఆగస్టు, సెప్టెంబరు మాసాలలో ఆంధ్రరాష్ట్రోద్యమం విజృంభణపొందింది. ఆంధ్రరాష్ట్ర సంపాదనకు, ప్రభుత్వదృష్టిని పూర్తిగా యీ వుద్యమంవైపు త్రిప్పడానికి శ్రీస్వామి సీతారాంగారు (పూర్వాశ్రమంలో వీరిపేరు గొల్లపూడి సీతారామశాస్త్రి) 1951 ఆగస్టు 15 న ఉపవాసదీక్ష ప్రారంభించారు. వీరితోపాటు మరి ఆరుగురు 21 తేదిన నిరశనదీక్ష ప్రారంభించారు. వారిపేర్లు : శ్రీ సంపత్కుమార్, ఆర్. కె. రామలింగారెడ్డి ; జరుగుల మద్దులేటి ; నేతి చలపతి, తుమ్మల బసవయ్య, శ్రీమతి తుమ్మల దుర్గాంబగార్లు.

ఈ దీక్షతో ఆంధ్రదేశం అంతా నిద్రనుంచి మేల్కొని తన గతిని గురించి ఆలోచించింది. దేశమంతా అలజడి జరిగింది. ఆచార్య వినోబాభావే, రాష్ట్రపతిరాజేంద్ర ప్రసాద్‌తోను, ప్రధానమంత్రి నెహ్రూతోను ఉత్తరప్రత్యుత్తరాలు జరిపారు. పార్లమెంటులో ప్రశ్నలు వేయబడినవి.

ఆంధ్ర, తమిళ, కర్నాటక ప్రదేశ కాంగ్రెసులూ, మదరాసు ప్రభుత్వమూ, జె. వి. పి. నివేదికను ఆమోదిస్తూ ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి అంగీకరిస్తే భారత ప్రభుత్వం తదనుకూలచర్య జరుపుతుందని ప్రధానమంత్రి ప్రకటించారు. ఆంధ్రదేశ కాంగ్రెసు సెప్టెంబరు 14 తేదీన నెల్లూరులో సమావేశమై, జె. వి. పి. నివేదిక ప్రకారం ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి వెంటనే చర్య తీసుకోవలసినదిగా భారతప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానం చేసింది.

రాష్ట్రపతి రాజేంద్రప్రసాదు, ప్రధానమంత్రి నెహ్రూగార్లు ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సుముఖులుగావున్నారనీ, తదనుకూల చర్య వీలైనంత శీఘ్రకాలంలో ప్రారంభింపబడుతుందనీ ఆచార్య వినోబా భావే తెలియపరచగా, సెప్టెంబరు 20 తేదిన స్వామి సీతారాం, తక్కిన దీక్షాపరులు తమ నిరశన దీక్షను విరమించారు.

కాని, తరువాత మళ్లీ ప్రభుత్వం, యీ విషయంలో ఏమీ చర్య తీసుకోలేదు. ఇంతలో దేశమంతటా ఎన్నికలు జరగడం, కొత్త మంత్రివర్గాలు ఏర్పడడం జరిగింది. ఎంతకాలం అయినా, యీ విషయంలో ప్రభుత్వం ఏమీచర్య తీసుకోనందున, స్వామి సీతారాం, 1952 జూన్ నెలలో భీమవరంలో సత్యాగ్రహం ప్రారంభించారు.

## శ్రీబాగ్ ఒడంబడిక

ఆంధ్రదేశంలోని, దత్తమండలము జిల్లాలు లేదా రాయలసీమ అని వ్యవహరింపబడే బళ్లారి, అనంతపురము, చిత్తూరు, కడప, కర్నూలు జిల్లాలు ఆర్థికంగాను, పారిశ్రామికంగాను విద్యావిషయము

లోను చాలా వెనుకబడి ఉన్నవి. ఇంతకాలము రాష్ట్రపరిపాలన తమిళాంధ్రనాయకుల చేతులలో ఉమ్మడిగా ఉండటంవల్ల రాయల సీమ పరిస్థితులను చక్కపరచడానికి తగినకృషి జరుగలేదు. అందువల్ల రాయలసీమవారు ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరిగినప్పుడు తమ జిల్లాల అభివృద్ధికి మిగతా జిల్లాల ఆంధ్రులు తగినకృషి చేస్తారనే హామీ కావాలని కోరారు. ఈ విషయంలో రాయలసీమ, సర్కారు జిల్లాల నాయకులు మదరాసులోని శ్రీ దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి భవనం శ్రీబాగ్‌లో సమావేశమై 1937 నవంబరు 16 తేదీని ఒడంబడిక చేసుకున్నారు. దీనికే శ్రీ. ఎగ్ ఒడం బడిక అని పేరు. దీనిలోని ముఖ్యాంశములు ఇవి:

(1) రెండు విశ్వవిద్యాలయ కేంద్రాలు:- ఆంధ్రదేశంలో వైజ్ఞానిక కేంద్రాలను వ్యాపింపచేయడానికీ, వైజ్ఞానికంగాను, సామాజికంగానూ ఆంధ్రులలో పరస్పర సహకారం-అభివృద్ధి చెందటానికీ, ఆంధ్ర విశ్వవిద్యాలయపు ఆధ్వర్యం క్రింద వాల్తేరులో ఒకటి, రెండు కేంద్రాలను ఏర్పరచాలని ఈ కమిటీ (సంప్రదింపుల సంఘం) అభిప్రాయపడుతున్నది. కళాశాలలను స్థాపించే విషయంలో బోధించే శాస్త్రాలకు ఏ ప్రాంతం అనుకూలంగా వుంటుందో ఆ ప్రాంతంలో స్థాపించాలని కమిటీ అభిప్రాయపడుతున్నది.

(2) నీటిపారుదల:-రాయలసీమ, నెల్లూరు జిల్లాల ఆర్థిక, వ్యవసాయిక సంపదలు రాష్ట్రాజిల్లాల సంపదలతో సరితూగేట్లు చేసేందుకై కృష్ణా, తుంగభద్రా పెన్నానదుల ప్రాజెక్టుకు 10 సంవత్సరాలవరకూ యెక్కువ ప్రాధాన్యత ఇవ్వాలి. ఈ కాలపరిమితి అవసరమైతే పెంచాలి.

ఈ నదులనీటి పంపిణీలో రాయలసీమ నెలూరు జిల్లాల అవసరాలనే ముందు పరిగణించాలి. ఈ విధానం రాష్ట్రపరిపాలనలో ఇప్పటినుంచే అనుసరించాలి.

(3) శాసనసభ :-శాసనసభా స్థానాలు జిల్లాలవారిగా సమానంగా ఉండేట్లు చూడాలి.

(4) రాజధాని, హైకోర్టు : విశ్వకళాపరిషత్తు కార్యాలయం, రాజధాని, హైకోర్టులను మూడింటినీ వివిధ ప్రాంతాలలో నెలకొల్పటానికి అంగీకరించబడ్డది. పరిపాలనా ప్రాధాన్యతను ఒకే ప్రాంతంలో కేంద్రీకరించకుండా ఉండటమే దీని ఉద్దేశం. ఈ సూత్రాన్ని అనుసరించి విశ్వవిద్యాలయ కార్యాలయం ప్రస్తుతం ఉన్న చోటనే (వాల్తేరులో) ఉండటానికీ, హైకోర్టు, రాజధానులలో ఒకటి కోస్తా జిల్లాలలోనూ, ఒకటి రాయలసీమలోనూ ఉంచేందుకు అంగీకరించబడ్డది. అయితే ఏది ఎక్కడ ఉండాలనేది రాయలసీమవాసులే నిర్ణయిస్తారు.

(5) ఇరుపక్షాలు సమ్మతిస్తే ఈ అంశాల్లో మార్పులు చేసుకోవచ్చును.

## ఆంధ్రరాష్ట్రపు వివరాలు

1947 ఏప్రిల్ లో కన్స్టిట్యుయెంట్ అసెంబ్లికి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసువారు సమర్పించిన నివేదికలో, ఆంధ్రరాష్ట్రంలో యీ క్రింది ప్రాంతాలను చేర్చాలని కోరారు.

విశాఖపట్టణం జిల్లా, తూర్పుగోదావరి జిల్లా, పడమటి గోదావరి జిల్లా, కృష్ణా జిల్లా, గుంటూరు జిల్లా, నెల్లూరు జిల్లా, కర్నూలు జిల్లా కడప జిల్లా, చిత్తూరు జిల్లా, అనంతపురం జిల్లా, నెల్లూరు జిల్లా సరిహద్దునుంచి మదరాసు నగరంవరకువున్న చెంగల్పట్ జిల్లాలోని భాగం, బళ్లారి జిల్లాలోని రాయదుర్గ్, ఆదోని, ఆలూరు తాలూకాలు, ఉత్తరార్కాడు జిల్లాలోని తెలుగుప్రాంతాలు, సేలం జిల్లాలోని హొసూరు తాలూకా, మదరాసునగరం, బళ్లారి నగరం, ప్రస్తుతం ఒరిస్సారాష్ట్రంలో కలిపివేయ బడిన తెలుగు ప్రాంతాలు.

ఈ ప్రాంతా లన్నిటితోను ఆంధ్రరాష్ట్రాన్ని యేర్పాటుచేస్తే, రాష్ట్రపు వైశాల్యం 71,000 చ. మైళ్ళపైగా వుంటుంది. జనాభా దాదాపు రెండున్నర కోట్లు వుంటుంది.

ఈ పైప్రాంతాలేకాక, హైదరాబాదు సంస్థానంలో 41,502 చ. మైళ్ళ ఆంధ్రదేశమూ, మైసూరు సంస్థానంలో 6,000 చ. మైళ్ళ ఆంధ్ర దేశమూ, సెంట్రల్ ప్రావిన్సెసులో [బస్తర్ సంస్థానాన్ని కలుపుకొని] 3,800 చ. మైళ్ళ ఆంధ్రదేశమూ వుంది. ఈ ప్రాంతాలన్నిటిలోనూ వున్న ఆంధ్రులసంఖ్య, కోటికిపైగావుంటుంది. మదరాసు రాష్ట్రంలో వున్నవారుకాక, ఇతరరాష్ట్రాలలోవున్న ఆంధ్రుల సంఖ్య, 1931 జనాభా ప్రకారం ఇది; బొంబాయి 1,63,000; బెంగాల్, 13,206, అస్సాం, 30,776; బీహార్ ఒరిస్సాలు, 22,107; పుదుకోట సంస్థానం; 13,250: బర్మా, 1,60,640; ఈ సంఖ్య, యిప్పటికి చాలా ఎక్కువగానే పెరిగి ఉంటుంది.


# PRAPANCHADARSINI

**SINGLE COPY - - - Rs. 4**



*Printed at*
**JYOTHI PRINTERS**
7, Krishnappa Naicken
Agraharam Street, MADRAS 1
(Near Mint Ramar Kovil)

*Published by*
**KATHAMALA PRACHURANALU**
5, Veerabadran Street
MYLAPORE, MADRAS-4

July 1952

# ప్రముఖ వ్యక్తులు

అప్పారావు, విస్సా: జననం, మే 1 1884; ఎం. ఎ., ఎల్. టి. (1907); ఫిజిక్సు ప్రొఫెసర్‌గా రాజమండ్రి ఆర్ట్సు కాలేజిలోను, మదరాసు ప్రెసిడెన్సీ కాలేజిలోను, అనంతపురం సీడెడ్ డిస్ట్రిక్ట్సు కాలేజిలోను పనిచేశారు. రాజమండ్రి ఆర్ట్సు కాలేజి ప్రిన్సిపాల్, 1925; రాజమండ్రి గవర్నమెంటు ట్రెయినింగ్ కాలేజి ప్రిన్సిపాల్, 1936 - 38; ఆంధ్రయూనివర్శిటీ కాలేజి ప్రిన్సిపాల్, 1938-41; ఆంధ్ర యూనివర్శిటీ అకడమిక్ కౌన్సిల్, సెనేట్ సిండికేట్‌లలో సభ్యులుగా వున్నారు. రాజమండ్రిలో మదరాసు గానకళా పరిషత్తును స్థాపించి, సంగీతసాహిత్య గ్రంథాలను అపూర్వమైన వాటిని సేకరించి ప్రకటించారు. అడ్రసు: డాబా గార్డెన్సు, విశాఖపట్టణం.

అమృతకార్, రాజకుమారి; జననము, 1889 ఫిబ్రవరి; క్రైస్తవ మతావలంబి: సంఘసేవలో చాలాకాలం పనిచేశారు; గాంధిమహాత్మునికి కార్యదర్శిగా పనిచేశారు. 1942 లో అరెస్టుచేయబడి నిర్బంధంలో వుంచబడినారు. అఖిల భారత మహిళా సమావేశానికి అధ్యక్షురాలు, 1931-33; భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖా మంత్రి, 1947 ఆగస్టు 15 నుంచి. అడ్రసు: ఆరోగ్య మంత్రి, న్యూఢిల్లి.

అమ్మన్నరాజా, శ్రీమతిచోడగం; (పుట్టింటి పేరు గంథం వారు) జననం 1909 ఫిబ్రవరి 6; బి. ఏ. క్వీన్ మేరీస్ కాలేజి, మదరాసు; ఎం. ఎల్. ఏ. 1937; మళ్ళీ 1946; మదరాసు అసెంబ్లీ డెప్యూటీస్పీకరు 1946 - 52; అడ్రసు, 3-25, ఎడ్వర్డు ఎలియెట్ రోడ్, మైలాపూర్, మదరాసు.

అవధాని, డాక్టర్ ఎ. వి. (ఆకెళ్ళ వ్యాఘ్రావధాని) జననం 1905 జనవరి 10; ఎల్. ఎం. పి. 1927; మదరాసులో ప్రాక్టీసు

ప్రారంభం, 1928 ; ఆలిండియా మెడికల్ లైసెన్సియెట్స్ అసోసియేషన్ మదరాసు బ్రాంచికి జాయింటు సెక్రటరీ, 1940-45 ; మదరాసు ఫిలిం సెన్సార్ బోర్డ్ మెంబర్ 1949-51; మదరాసు జిల్లా ఆంధ్రకాంగ్రెసు సంఘ కోశాధిపతి, 1952 ; అడ్రసు ; 153 బ్రాడీస్ రోడ్ ; మైలాపూర్, మదరాసు.

అవినాషలింగం చెట్టియార్, టి.ఎస్. జననం. 5 మే 1903 (తిరుపూర్); పచ్చయప్ప కాలేజిలో బి. ఏ. 1923 లో ప్యాసయారు, బి. ఎల్. 1925 ; సత్యాగ్రహోద్యమంలో చేరి ప్రాక్టీసు వదలివేశారు. కోయంబత్తూరులో శ్రీ రామకృష్ణ మిషన్ విద్యాలయం స్థాపించారు. నాలుగుసార్లు జెయిలుకు వెళ్లారు. కేంద్ర శాసనభ సభ్యులు 1934 - 45. మదరాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యులు 1946 -52 ; విద్యా శాఖామంత్రి 1946-1948. అవివాహితులు ; తమిళ విజ్ఞాన సర్వస్వమును ప్రచురించడానికి తమిళవలార్చి కళగం (సారస్వతసంఘం) స్థాపించారు. పార్లమెంటు సభ్యులు 1952 నుంచి , అడ్రసు : శ్రీరామకృష్ణ విద్యాలయముపోస్టు, కోయంబత్తూరుజిల్లా.

అసఫ్ అలి : జననం. 1888 ; బారెట్లా; కాంగ్రెసు ఉద్యమంలో చాలాసార్లు జెయిలుకు వెళ్లారు. కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డు కార్యదర్శి. 1934 ; కేంద్రశాసన సభ సభ్యులు 1935-1936 : కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యులు. 1942 లో నిర్బంధింపబడి, 1945 మేలో విడుదల చేయబడినారు. కేంద్రప్రభుత్వ రైల్వేశాఖామంత్రి 1946-47. యునైటెడ్ స్టేట్సులో భారత రాయబారి, 1947 జనవరి- 1948 ఏప్రిల్ ; ఒరిస్సా గవర్నరు, 1949 జూన్ 21; 1952 జూన్; స్విడ్జర్లెండ్ లో ఇండియా రాయబారి, 1952 జూన్ నుంచి : అడ్రస్, బెర్న్.

అంబేద్కర్, డాక్టర్ భీమరావ్ రాంజి ; జననం, 1889 ; బారెట్లా ! పి. హెచ్. డి., ఎస్. సి. బొంబాయి సిడెన్‌హామ్స్ కాలేజీలో ప్రొఫెసర్, 1917 ; 1930-32 లో రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సుకు సభ్యులు ; నిమ్న

జాతుల నాయకుడు; 1942 జూలై నుంచి 1946 జూన్ వరకు వైస్రాయి ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు సభ్యులు; భారతప్రభుత్వ న్యాయ శాఖామంత్రి, 1947 ఆగస్టు 15 నుంచి, 1951 నవంబరు వరకు; 1952 లో బొంబాయినుంచి కౌన్సిల్ ఆఫ్ స్టేట్సుకు ఎన్నుకోబడినారు. అడ్రసు, బొంబాయి.

ఆజద్, మౌలానా అబుల్ కలాం; జననం 1889, మక్కాలో; బాల్యం అంతా అరేబియాలోనే గడిపి, కెయిరో అల్ అజార్ యూనివర్శిటీలో చదివారు. భారత దేశానికివచ్చి, కలకత్తాలో నివాసం ఏర్పరచుకున్నారు. అల్ హిలాల్ అనే ఉర్దూవారపత్రికను స్థాపించి, ఇస్లాం విజ్ఞానాన్ని ప్రచారం చేశారు. ఆ పత్రికను ప్రభుత్వ వారు నిలిపివేయించారు; అప్పుడు అల్ బలాఘ్ అనే పేరుతో మరొక పత్రికను స్థాపించారు. కాంగ్రెసులో చేరి 1921-22 లో జెయిలుకువెళ్ళారు. ఆ తరువాత చాలాసార్లు జెయిలుకు వెళ్ళారు. 1923 లోనూ, 1939 నుంచి 1946 వరకునూ కాంగ్రెసు అధ్యక్షులు; 1942 లో ప్రభుత్వంచే నిర్బంధం లో వుంచబడి 1947 జనవరి నుంచి కేంద్రప్రభుత్వ విద్యాశాఖా మంత్రి ఇస్లాం మతాన్ని గురించి అనేక గ్రంథాలు వ్రాశారు. అడ్రసు: విద్యాశాఖా మంత్రి, న్యూఢిల్లీ.

ఆనే, మాధవరావ్ శ్రీహరి; జననం, 29 ఆగస్టు 1880; నాగపూర్; ఉపాధ్యాయుడుగా జీవితం ప్రారంభించారు. ఇండియన్ హోం రూల్ లీగ్ లో చేరారు. కేంద్ర శాసనసభలో కాంగ్రెసు నేషనలిస్టుపార్టీ నాయకులుగా వున్నారు. 1931 లో కాంగ్రెసు డిక్టేటరు; వైస్రాయి కౌన్సిలు సభ్యులు, 1942-43; సిలోన్ లో ఇండియా ప్రభుత్వ ప్రతినిధి, 1943-47 బీహారు గవర్నరు, 1948 జనవరి 12 నుంచి. 1952 జూన్. అడ్రస్, నాగపూర్.

ఆరన్ రావు, అల్లాడి; జననం, 1906: బి. ఏ. ఆంధ్ర క్రిస్టియన్ కాలేజి, గుంటూరు, 1931; గవర్నమెంటు ఉద్యోగం చేస్తూ, సత్యాగ్రహోద్యమంలో ఉద్యోగం మానివేశారు. ఆంధ్రరాష్ట్ర క్రిస్టియన్ ఫెడరేషన్ ప్రధాన

కార్యదర్శిగా 12 ఏండ్లు పని చేశారు. మదరాసు అసెంబ్లీ సభ్యులు 1946-52; అడ్రసు, పొన్నూరు.

ఉపేంద్రశర్మ, మందలపర్తి; జననం, 1952 జూలై 1; ఎం. ఎ. (ఆంధ్ర యూనివర్శిటీ); గుంటూరు హిందూకాలేజీలో ప్రాచ్య భాషా శాఖ ప్రధానాధ్యాపకులు. భారత భాషా సమితి కార్యనిర్వాహక సభ్యులు; అఖిల భారత వైజ్ఞానిక మహాసభ సభ్యులు; అఖిలభారత గ్రంథాలయ మహాసంఘసభ్యులుఆంధ్రరాష్ట్రప్రాచ్య సారస్వత విజ్ఞాన పరిషత్తు అధ్యక్షులు. పుస్తక నిర్ణయ సంఘ సభ్యులు, ఆంధ్ర యూనివర్శిటీ; రచనలు : తిక్కన, ఆంధ్ర గద్య వాఙ్మయ చరిత్ర; వయోజన విద్య నాటిక; అడ్రసు; హిందూకాలేజీ, గుంటూరు.

ఉస్మాన్ : సర్ మహమ్మద్; జననం, 1884; బి. ఏ. మదరాసు క్రిస్టియన్ కాలేజి, 1921 లో మదరాసు లెజిస్లేటివ్ అసెంబ్లీకి సభ్యులుగా ఎన్నుకోబడినారు. మదరాస్ షరీపు, 1824 : సర్ బిరుదము, 1928 : కె. సి. ఐ. ఇ, 1933. మదరాసు ఆక్టింగు గవర్నరు, 1934. 1937 లో మదరాస్ లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులుగా నామినేట్ చేయబడినారు. వైస్రాయి కౌన్సిలు సభ్యులు, 1942-1946; మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు, 1952 ఏప్రిల్ నుంచి. అడ్రసు; తేనాంపేట, మద్రాసు.

కనకమ్మ, పొణకా; జననం, 1892; కాంగ్రెసు ఉద్యమంలోనూ, జమీన్ రైతు ఉద్యమంలోనూ పాల్గొన్న వీరనారి. అఖిల భారత కాంగ్రెసు కమిటీకి ఎన్నిక అయిన ప్రథమ ఆంధ్ర మహిళ, కొన్నాళ్లు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ఉపాధ్యక్షురాలు. పల్లెపాడు సత్యాగ్రహ శ్రమస్థాపకురాలు. గొప్ప విదుషి. రచయిత. 1923 లో కస్తూరి దేవి విద్యాలయం స్థాపించారు, 1944 లో ఈ విద్యాలయం హైస్కూలుగా మారింది. త్యాగానికీ, ధర్మానికీ, ప్రజా సేవకూ, ఆంధ్రయువతి మణులకు మార్గదర్శిని, ఆదర్శజీవి. అడ్రసు, కస్తూరి దేవి విద్యాలయం, నెల్లూరు.

పొల్గొని 1930 లో ఒక ఏడాది శిక్షపడ్డారు. 1931 లో తమిళ నాడు కాంగ్రెసు వర్కింగు కమిటి సభ్యులు ఆకమిటి కార్యదర్శి, 1935. 1936 లోను, మళ్ళీ 1946 లోను మదరాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు. 1942 లో నిర్బంధంలో వుంచబడి 1945 లో విడుదలచేయబడినారు. తమిళ నాడు కాంగ్రెసు అధ్యక్షులు 1939-52 ; ఆలిండియా కాంగ్రెసు వర్కింగు కమిటి సభ్యులు, 1948 నుంచి ; పార్లమెంటు సభ్యులు, 1952 నుంచి, అడ్రసు. 8 నరసింగ పురం వీధి, మౌంట్ రోడ్, మదరాసు.

కామేశ్వరరావు, జయంతి; జననం, 17 జులై 1917 ; బి. ఎస్. సి., ఇంజనీరింగ్ (బెనారెస్) : ఎ. ఎం. ఐ. ఇ., ఛార్టర్డ్ ఇంజనీర్ (1948) ; గవర్నమెంటులో ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంటులో జూనియర్ ఇంజనీర్ 1939-40 ; గవర్నమెంట్ స్కూల్ ఆఫ్ టెక్నాలజీలో లెక్చరర్, 1940-44 ; బెనారెస్ ఇంజనీర్స్ అసోసియేషన్ సెక్రటరి, 1948-48 ; డైరెక్టరు, శెట్టి అండ్ రావ్ (ఇంజనీర్స్) లిమిటెడ్, ఇండియన్ నేషనల్ ఇండస్ట్రీస్ లిమిటెడ్, ఇండియా సిరామిక్స్ లిమిటెడ్, దక్షిణ హింద్ లిమిటెడ్, ఇండస్ట్రియల్ ఎంటర్ ప్రైజెస్ లిమిటెడ్; నేషనల్ ఇంజనీర్ అను త్రైమాస ఆంగ్ల పత్రిక మేనేజింగ్ ఎడిటర్; అడ్రసు : 1 రాజాబహదర్ మొదలియార్ వీధి, త్యాగరాయనగర్, మదరాసు.

కాశీపతి, కపిల ; జననం, 14 సెప్టెంబర్ 1908 ; బి. ఏ. ఆంధ్ర క్రిస్టియన్ కాలేజి (గుంటూరు) ఎల్. ఎల్. బి. (బెనారెస్ హిందు యూనివర్శిటీ); విద్యార్థిగా వుండగానే వక్తృత్వపు పోటీలలో పాల్గొనేవారు. 1931 లో కాశీలో జరిగిన ఇంటర్-యూనివర్శిటీ వక్తృత్వపు పోటీలో సర్ రాస్ మసూద్ బంగారు పతకాన్ని గెలిచారు. సప్త మాంధ్రవిద్యార్థి మహాసభ (గుంటూరు, 1927) కు కార్యదర్శి. స్వరాజ్య, మదరాసు మెయిలు పత్రికలలో పనిచేశారు. 1939 లో ఆలిండియా రేడియోలో న్యూస్ ఎడిటర్ అయారు. 1947 లో, మదరాసు రాష్ట్రీయ బ్రాడ్‌కాస్టింగ్ ఆఫిసర్‌గా ఉన్నారు.

పాల్గొని 1930 లో ఒక ఏడాది శిక్షపడ్డారు. 1931 లో తమిళ నాడు కాంగ్రెసు వర్కింగు కమిటి సభ్యులు ఆకమిటీ కార్యదర్శి, 1935. 1936 లోను, మళ్ళీ 1946 లోను మదరాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు. 1942 లో నిర్బంధంలో వుంచబడి 1945 లో విడుదలచేయబడినారు. తమిళ నాడు కాంగ్రెసు అధ్యక్షులు 1939-52 ; ఆలిండియా కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులు, 1948 నుంచి ; పార్లమెంటు సభ్యులు, 1952 నుంచి, అడ్రసు. 8 నరసింగ పురం వీధి, మౌంట్ రోడ్, మదరాసు.

కామేశ్వరరావు, జయంతి; జననం, 17 జులై 1917 ; బి. ఎస్. సి., ఇంజనీరింగ్ (బెనారెస్) : ఎ. ఎం. ఐ. ఇ., ఛార్టర్డ్ ఇంజనీర్ (1948) ; గవర్నమెంటులో ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటులో జూనియర్ ఇంజనీర్ 1939-40 ; గవర్నమెంట్ స్కూల్ ఆఫ్ టెక్నాలజీలో లెక్చరర్, 1940-44 ; బెనారెస్ ఇంజనీర్స్ అసోసియేషన్ సెక్రటరి, 1948-48 ; డైరెక్టరు, శెట్టి అండ్ రావ్ (ఇంజనీర్స్) లిమిటెడ్, ఇండియన్ నేషనల్ ఇండస్ట్రీస్ లిమిటెడ్, ఇండియా సిరామిక్స్ లిమిటెడ్, దక్షిణ హిండ్ లిమిటెడ్, ఇండస్ట్రియల్ ఎంటర్ ప్రైజెస్ లిమిటెడ్; నేషనల్ ఇంజనీర్ అను త్రైమాస ఆంగ్ల పత్రిక మేనేజింగ్ ఎడిటర్; అడ్రసు : 1 రాజాబహాదర్ మొదలియార్ వీధి, త్యాగరాయనగర్, మదరాసు.

కాశీపతి, కపిల ; జననం, 14 సెప్టెంబర్ 1908 ; బి. ఏ. ఆంధ్ర క్రిస్టియన్ కాలేజి (గుంటూరు) ఎల్. ఎల్. బి. (బెనారెస్ హిందు యూనివర్శిటీ); విద్యార్థిగా వుండగానే వక్తృత్వపు పోటీలలో పాల్గొనేవారు. 1931 లో కాశీలో జరిగిన ఇంటర్-యూనివర్శిటీ వక్తృత్వపు పోటీలో సర్ రాస్ మసూద్ బంగారు పతకాన్ని గెలిచారు. సప్త మాంధ్రవిద్యార్థి మహాసభ (గుంటూరు, 1927) కు కార్యదర్శి. స్వరాజ్య, మదరాసు మెయిలు పత్రికలలో పనిచేశారు. 1939 లో ఆలిండియా రేడియోలో న్యూస్ ఎడిటర్ అయారు. 1947 లో, మదరాసు రాష్ట్రీయ బ్రాడ్ కాస్టింగ్ ఆఫీసర్‌గా ఉన్నారు.

1948 లో, ఇంగ్లండు, ఫ్రాన్సు, స్విట్జర్లెండు, ఇటలీ దేశాలకు వెళ్ళి వచ్చారు. తెలుగులోచాలా కథలు, పద్యములు, నాటికలు వ్రాశారు. అడ్రసు : ఆల్ ఇండియా రేడియో, న్యూఢిల్లీ.

కాశేశ్వరరావు, అయ్యదేవర ; జననం 1881 ; బి. ఎల్. మదరాస్ లాకాలేజి : 1906 నుంచి కాంగ్రెసు సభ్యులు ; వందే మాతరం, హోంరూల్ ఉద్యమములలో పనిచేసినారు. అనేక సార్లు బెజవాడ మునిసిపల్ కౌన్సిలు చైర్మను. మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు 1926-29 ; అసెంబ్లీకి సభ్యులుగా 1937 లో యెన్నుకోబడినారు ; కాంగ్రెసు పార్లమెంటరీ ఛీఫ్ విప్ ; మదరాసు ప్రభుత్వ ఛీఫ్ పార్లమెంటరి సెక్రటరీ, 1937-1939 ; మదరాసు శాసన సభ్యులుగా 1946-1952 ; అఖిల భారత కాంగ్రెసు సభ్యులు 1947-1951 ; 'ఫ్రెంచి స్వాతంత్ర్య, విజయం అమెరికా రాష్ట్రములయ్యె చైనా జాతీయోద్యమం, తురుష్క ప్రజాస్వామికం ఉపనిషత్సారములు, మొదలైన గ్రంథాలు వ్రాశారు. అడ్రసు : విజయవాడ.

కిద్వాయ్, రఫీ అహమద్ : జననం, 1894 ; 1921 లో లాయరు పరీక్షకు చదువుతూ సహాయనిరాకరణోద్యమంలో చదువు మానేశారు; యు. పి. రాష్ట్రీ కాంగ్రెసు సెక్రటరీగారు, ప్రెసిడెంటుగాను వున్నారు, 1922-26 ; 1922 లో ఒక ఏడాది శిక్ష అనుభవించారు. యు. పి. రాష్ట్రీ మంత్రి, 1937-39 ; కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యుడు, 1846 జూలై నుంచి 1942-45 లో నిర్బంధించిబడినారు. యు, పి. రాష్ట్రీహోంమంత్రి 1946-47 ; కేంద్ర ప్రభుత్వ పోస్టు, టెలిగ్రాఫ్ శాఖామంత్రి 1947 ఆగస్టు 15 నుంచి 1951 ; ఆహారమంత్రి 1952 మే 13 నుంచి ; అడ్రసు, న్యూఢిల్లీ.

కుటుంబరావు, కొడవటిగంటి; జననం 1909 అక్టోబరు 28 ; బి. ఏ. ఆంధ్రయూనివర్సిటీ (1929) యువ ఎడిటర్ (1935) ఆంధ్రవార పత్రిక (1940-42) బొంబాయి మెటల్ ఫ్యాక్టరీలో

(1942) నేషనల్ వార్ ఫ్రంట్, సిమ్లా, 1942) మెటల్ అండ్ స్టీల్ ఇన్‌స్పెక్టరేట్‌లో (1943-45) ఆంధ్ర పత్రిక సబ్-ఎడిటర్, 1948-1951 ; పేరుపొందిన కథకుడు, రచయిత. రచనలు . నీకేం కావాలి ; కులంలేని మనిషి, మారుపేర్లు, అరుణోదయం (నవలలు), చిన్నకథల సంపుటీలు ఏడు ; వీరాభిమన్యు, బాలనాగమ్మ చిత్రాలకు సంభాషణలు వ్రాశారు, 'తారుమారు' అనే చిత్రానికి కథ వ్రాశారు అడ్రసు; వాహిని స్టూడియోస్, కోడంబాకం.

కుమారస్వామి, గరిమెళ్ల; ప్రస్తుత వయస్సు 54 ; విశాఖ పట్టణంజిల్లా శ్రీకూర్మంలో జననం: బి. ఏ. వరకు చదివి, 1921 లో సహాయ నిరాకరణోద్యమంలో చేరి చదువు మానివేశారు. అప్పటినుంచి . కాంగ్రెసు ఉద్యమాల్లో పాల్గొంటూ, తొమ్మిదిసార్లు జెయిలుకు వెళ్ళారు. ఉత్తర విశాఖ కాంగ్రెసు అధ్యక్షులుగా కొంతకాలము, కార్యదర్శిగా ఆరుసార్లు పనిచేశారు. మదరాసు శాసనసభ సభ్యులు 1946-52; విశాఖ పట్టణం జిల్లా హాస్పిటల్ కమిటీ, రాజకీయ బాధితుల సంఘం, ఫిర్కా డెవలప్‌మెంట్ సంఘం మొదలైన చాలా సంఘాలలో సభ్యులు అడ్రసు: చికాకోల్.

కుమారస్వామి రాజా, పూసపాటి జగ్గరాజు; వయసు 53 ఏళ్లు; రామ్నాడు జిల్లా, రాజపాలెం వాసులు, రాష్ట్రేతర రాంధ్రులు, కాంగ్రెసు ఉద్యమంలో జెయిలుకు వెళ్ళారు. 1937 లో రాష్ట్ర శాసన సభ్యులుగా ఎన్నుకోబడినారు. మళ్ళీ 1946 లో శ్రీ విల్లిపుత్తూరు నియోజక వర్గంనుంచి ఎన్నుకోబడినారు. వ్యవసాయ శాఖామంత్రి 1946-47; రాష్ట్ర ప్రధాని 1949 మార్చి - 1952 ఏప్రిల్; అడ్రసు, రాజపాళయం.

కూర్మయ్య, వేముల; జననం, 1907, బి. ఏ., ఎల్. ఎల్. బి., బెనారెస్ యూనివర్శిటి; బందరు హరిజన నియోజకవర్గం తరపున 1936 లో మదరాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు. మళ్ళీ 1946 లో కూడా అదే

స్థానంలో ఎన్నిక. ప్రచురణశాఖా మంత్రి 1946-47; గ్రామోద్ధరణ శాఖామంత్రి 1947 మార్చినుంచి 1949 మార్చి వరకు; అడ్రెసు: విజయవాడ.

కృష్ణమాచారి, టి. టి. జననం, 26 నవంబర్ 1899; మదరాసు అసెంబ్లీ సభ్యులు, 1936-38; కేంద్రశాసన సభ సభ్యులు 1942-45; కన్స్టిట్యుయెంట్ అసెంబ్లీ సభ్యులు, 1946-50; పార్లమెంటు సభ్యులు, 1950-52; మళ్లీ, మదరాసు నియోజకవర్గం నుంచి పార్లమెంటుకు సభ్యులుగా 1952 లో ఎన్నుకోబడినారు. మదరాసు నగరంలోని పెద్ద వ్యాపారస్తులలో ఒకరు. ఇండియా ప్రభుత్వ పరిశ్రమల శాఖామంత్రి, 1952 మే 13 నుంచి, అడ్రసు, న్యూఢిల్లీ.

కృష్ణమూర్తి, వారణాశి; జననం 1912 జూలై 30 బి. ఏ. (ఆనర్సు) అన్నామలై యూనివర్సిటీ (1933) బి. కాం. బొంబాయి (1935); ఎల్. ఎల్. బి. (బొంబాయి) 1938.

1935 లో బొంబాయిలో బ్యాంకిలో ఆఫీసరుగా చేరి, అనేక రాష్ట్రాలలో 1942 వరకు పని చేశారు. భారత్ బ్యాంకిలో, 1943-44. ఆంధ్ర బ్యాంకి జనరల్ మేనేజరు, 1944 - 50. ఇండియన్ బ్యాంకర్సు ఇన్స్టిట్యూట్ లో అసోసియేటెడ్ మెంబరు, లండన్ బ్యాంకర్సు ఇన్స్టిట్యూట్ లో సభ్యులు. రిజర్వ్ బ్యాంకిలో డిప్యూటి చీఫ్ ఆఫీసరు, 1950 ఆగష్టు నుంచి, అడ్రసు: రిజర్వ్ బ్యాంక్, బొంబాయి.

కృష్ణమూర్తి, హనుమంతు. దివాన్ బహదూర్; జననం 1889 అక్టోబరు 26. బి. ఏ., కలకత్తా విద్యాసాగర్ కాలేజి. సర్ ఏ. పి. పాత్రోగారి అల్లుడు, 1923 లో రిజిస్ట్రేషన్ డిపార్టుమెంటులో చేరారు. 1942 లో ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషన్‌గా, ఆ శాఖలోని అత్యున్నత పదవిలో నియమింపబడినారు అడ్రస్-26 కమెండరిన్ చీఫ్ రోడ్, ఎగ్మూర్ మదరాసు.

కృష్ణమూర్తిశాస్త్రి, శ్రీపాద; జననం, 1866. కళాప్రపూర్ణ, మహామహోపాధ్యాయ, కవిసార్వభౌమ బిరుదాంకితులు. కర్ణ భారతం, కృష్ణరామాయణం మొదలైన మహాకావ్యములతో దాదాపు 150 పెద్దగ్రంథములను రచించారు. 1930 లో పాలకొల్లులో స్వర్ణాభిషేకమును, 1933 లో రాజమండ్రిలో కవి గండపెండేర బహుకృతిని, 1936 లో సాలూరులో గజారోహణ మహోత్సవమును, 1945 లో విజయవాడలో మణికిరీట బహూకృతిని పొందారు. 1950 లో మదరాసు ప్రభుత్వంవారిచే తెలుగు ఆస్థాన కవిగా నియమితులైనారు. అడ్రసు: రాజమండ్రి.

కృష్ణశాస్త్రి, దేవులపల్లి; జననం, 1897 (పిఠాపురం); బి. ఏ. (విజయనగరం) 1918; కాకినాడ మిషన్ స్కూలులోనూ పెద్దాపురం మిషన్ స్కూల్ లోనూ ఉద్యోగం, 1918-20; 1932 నుంచి 1944 వరకూ కాకినాడ పిఠాపురంరాజా కాలేజిలో లెక్చరర్; మధ్య కాలంలో సాహిత్య కృషి, కావ్యరచన, సభాగోష్ఠి; నవ్యసాహిత్య పరిషత్తు అధ్యక్షులు, 1942-43; ఆంధ్ర అభ్యుదయ రచయితల తృతీయమహాసభ అధ్యక్షులు, 1946; రచనలు: కన్నీరు, కృష్ణపక్షం, ప్రవాసం, ఊర్వశి, ఋగ్వీథి; అడ్రసు: కేరాఫ్ వాహిని పిక్చెర్సు, త్యాగరాయ నగర్.

కృష్ణారావు, గవిని వెంకట; జననం, 1914 నవంబరు 15; ఆంధ్ర యూనివర్సిటీ బి. ఏ. 1937; ఆంధ్రప్రభ సబ్-ఎడిటర్, 1941-42; మళ్లీ 1944-45; రాడికల్, 1946; ఆంధ్రజ్యోతి, 1947; రచనలు: సమరసింహ, చైత్రరథ, శివరాత్రి, వరూధిని, కావ్యగజత్తు, యుగసంధ్య, ఆదర్శ శిఖరాలు, జఘనసుందరి, సునీథ కీలుబొమ్మలు. విజయప్రభ సబ్ ఎడిటర్, 1950 మార్చి 1950 డిశంబర్. అడ్రసు, తెనాలి.

కృష్ణరావు, డాక్టర్ మల్లవరపు వెంకట; జననం. 1902, పశ్చిమ గోదావరి జిల్లా ఉండిలో; బి. ఎ. మదరాసు, 1922; ఎం. బి. బి.

ఎస్; స్వాతంత్ర్యోద్యమంలో జెయిలుకు వెళ్లారు. 17 సంవత్సరాలుగా ఆంధ్ర విశ్వకళాపరిషత్ సెనెట్ సభ్యులు, విశాఖపట్టణం రేవు కార్మికుల సంఘ అధ్యక్షులుగా కొన్నేళ్లు పనిచేశారు. ఆంధ్రరాష్ట్ర వైద్య మహాసభలకు 1946, 1948 లలో అధ్యక్షులు 1952 మార్చిలో ఉత్తర మదరాసు పట్టభద్రుల నియోజకవర్గంనుంచి మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎన్నుకోబడినారు; రాష్ట్రప్రభుత్వ విద్యాశాఖ మంత్రి 1952 ఏప్రిల్ 10 నుంచి, అడ్రస్, ఫోర్ట్ సెంట్ జార్జి, మదరాసు-1.

కృష్ణారావు, డాక్టరు యు., వయస్సు, 52 ఏళ్లు. ఎం. బి. బి. ఎస్., 1924 లో ప్రాక్టీసు ప్రారంభించారు. మదరాసు కార్పొరేషన్ సభ్యులు, 19 052. మేయరు, 1948; 1952 లో మదరాసు నగర హార్బరు నియోజకవర్గంనుంచి అసెంబ్లీకి ఎన్నుకోబడినారు. రాష్ట్రప్రభుత్వ పరిశ్రమల శాఖా మంత్రిగా 1952 ఏప్రిల్ 10 న నియమింపబడినారు. అడ్రస్ ఫోర్టుసెంట్ జార్జి, మదరాసు-1.

కేశవరావు, తేజోమూరుల జననం, 16 డిసెంబరు 1988 బందరు ఆంధ్రజాతీయ కళాశాలలోను, శాంతినికేతనంలోనూ చిత్రలేఖనను అభ్యసించారు. ఆంధ్ర చిత్రలేఖకులలో చెప్పదగిన వారిలో ఒకరు, 1934 లో లండనులో జరిగిన భారతీయ చిత్ర ప్రదర్శనలో వీరిబొమ్మలు ప్రదర్శింపబడి, ప్రసంశ పొందినవి. అడ్రసు: 24, వెంకట్రామ అయ్యరు వీధి, జార్జి టౌన్ మదరాసు.

కేసరి, డాక్టర్ కె. ఎన్. (కోట నరకేసరి): జననం, 1875 ఏప్రిల్ 26; కడు పేద కుటుంబంలో జన్మించి, స్వయ కృషివల్ల అత్యధిక ధనార్జన గావించి విద్యాదానం చేస్తున్న మహనీయ ఆంధ్రవ్యక్తి. జననం, ఒంగోలు తాలూకా ఇనమనమెళ్లూరు, పదవయేట చెన్నపట్టణానికివచ్చి, ఆయుర్వేద ఔషధాలను తయారుచేసి, భాగ్యవంతులయ్యారు, 'గృహలక్ష్మి' పత్రికను 1928 లో స్థాపించి నడుపుతున్నారు. చెన్నపట్టణంలో తెలుగు పిల్లలకు, తెలుగులో

చదువు నేర్పే స్కూలులేని పరిస్థితిని గమనించి, మైలాపూరు తెలుగుస్కూలును తమ యాజమాన్యంలోకి తీసుకొని, కేసరీస్కూలుగా మార్చి, దానికి లక్షరూపాయల పైగా విరాళం ఇచ్చి, విద్యాప్రదాతలైనారు, కేసరి కన్యా విద్యాలయం అనే పేరుతో, ఆడపిల్లలకు ప్రత్యేకంగా స్కూలు స్థాపించడానికి 1947 లో మరొక లక్షరూపాయలు విరాళమిచ్చారు. అడ్రసు : కేసరికుటీరం, రాయపేట, మదరాసు.

కేస్కారు, డాక్టరు బాలకృష్ణ విశ్వనాథ ; జననం, 1908 : కాశీ విద్యాపీఠంలో పట్టభద్రులై, అచ్చటనే ప్రొఫెసరుగా మూళ్ళేళ్లు పనిచేశారు. 1933 లో పారిస్ వెళ్లి అర్థిక శాస్త్రంలోడాక్టరేట్ పొందారు, 1921 -లోనే కాంగ్రెసు ఉద్యమంలో చేరారు, 1930, 1937 1941 లలో జైలుకి వెళ్ళారు. 1946 లో కొద్దికాలం కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా వున్నారు. 1948 ఫిబ్రవరిలో కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీకి సభ్యులుగా ఎన్నుకొనబడినారు. ఇండియా ప్రభుత్వ విదేశశాఖ డిప్యూటి మంత్రి, 1948-52 ; ఇన్ఫర్మేషన్ శాఖమంత్రి, 1952 మే 13 నుంచి ; అడ్రసు, న్యూడిల్లీ.

కోదండరామయ్య, పుసులూరి ; జననం, 1896 ; చిన్నతనం నుంచీ జాతియోద్యమంలో పాల్గొన్నారు. ఆంధ్రదేశంలో గ్రంధాలయోద్యమం, సంఘ సంస్కరణ, నిమ్నజాతి ఉద్ధరణ కార్యక్రమాలలో దీక్షతో పనిచేశారు. 1920 నుంచీ ఏజన్సీలలో కొండజాతులవారి ఉద్ధరణకు చాలా కృషి చేశారు. కాంగ్రెసు వుద్యమాలన్నిటి లోనూ జెయిలుకు వెళ్ళారు. ఇండియా పార్లమెంటు సభ్యులు 1950-52.

కోదండరామారావు, నాగులపల్లి జననం : 20 అగష్టు, 1905. బి. ఎస్. సి. కలకత్తా ; బి. ఎస్. సి. (ఆనర్స్) ఢిల్లీ ; ఎల్. ఎల్. బి. అలహాబాదు. 1934 లో హైదరాబాదులో న్యాయవాదిగా వృత్తి ప్రారంభం. 1938 లో సంస్థాన సత్యాగ్రహంలో అరెస్టు. 1939 లో విడుదల. సంస్థాన ఆంధ్ర మహాసభ కార్యదర్శి, 1940. హైదరాబాదులో తెలుగు విద్యాభివృద్ధికి విశేషంగా కృషి

చేశారు. హైదరాబాదు సంస్థాన కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు; అడ్రసు: హైదరాబాదు.

కోటయ్య, ప్రగడ; జననం, 26 జూలై 1912 మదరాసు రాష్ట్ర చేనేతపనివారల కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి; నాలుగు సంవత్సరములు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటి సభ్యులు. చేనేతవారి ఇబ్బందులను తొలగించడానికి, వారి పరిస్థితులను బాగుపరచడానికి కృషి చేస్తున్న ప్రముఖులలో ఒకరు. శీరాల నియోజకవర్గంనుంచి రాష్ట్ర అసెంబ్లీకి 1952 లో ఎన్నుకోబడినారు. అడ్రసు; చేనేత కార్యాలయం, నిడుబ్రోలు.

కోటిరెడ్డి, కె. జననం, 1887 అక్టోబరు. బి. ఏ., మదరాసు; బి. సి. ఎల్. (ఆక్స్‌ఫర్డ్), ఎల్. ఎల్. బి. (లండన్); కడపలో బారిష్టరుగా ప్రాక్టీసు ప్రారంభం. 1918; 1923 నుంచి 1935 వరకు మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు. మదరాసు అసెంబ్లీ సభ్యులు 1937-39; 1946-51; 1952 నుంచి. హిందూ దేవాలయ శాఖ మంత్రి 1946-47; అడ్రసు, కడప.

గిరి, వరహాగిరి వెంకట; జననం 1894 ఆగస్టు 10 వరహాగిరి జోగయ్యపంతులు గారి కుమారులు, డబ్లిన్ యూనివర్శిటీ బారిష్టర్, 1922 లో సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని జైలుకి వెళ్లారు. రైల్వే కార్మికుల యూనియనులను స్థాపించడంలో పాల్గొన్నారు. 1926 లో మదరాసులో జరిగిన ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అధ్యక్షులు; ఆల్ ఇండియా రైల్వే మెన్స్ ఫెడరేషన్ అధ్యక్షులు, 1927; ఈ ఫెడరేషన్‌కు ప్రధాన కార్యదర్శి, 1929-36; కార్మికుల ప్రతినిధిగా, రెండవ రౌండ్ టేబిలు కాన్ఫరెన్సులో పాల్గొన్నారు: కేంద్ర శాసన సభ సభ్యులు, 1934. మదరాసు శాసన సభ్యులు, 1937. మదరాసు కార్మిక, పరిశ్రమ శాఖా మంత్రి, 1937-1939. మళ్ళీ శాసన సభ సభ్యులు, 1946. కార్మిక పరిశ్రమ శాఖామంత్రి, 1946-1947. సిలోన్‌లో ఇండియా ప్రభుత్వ హైకమిషనర్ 1947-50 పార్లమెంటుకు పాతపట్నం నియోజకవర్గంనుంచి 1952 లో ఎన్నుకోబడినారు. ఇండియా ప్రభుత్వ

కార్మిక శాఖా మంత్రి 1952 మే 13 నుంచి. అడ్రసు, న్యూఢిల్లీ.

గురువులు, సాకేటి ; జననం, జూలై 15, 1901. ఉపాధ్యాయ వృత్తిని వదలివేసి 1921 లో కాంగ్రెసు ఉద్యమంలో చేరారు. జెయిలుకు వెళ్ళారు. గ్రామీణ హరిజన సంఘాలను స్థాపించారు. ఓ. ఎస్. రైల్వే సలహాసంఘ సభ్యులు. మదరాసు అసెంబ్లీసభ్యులు 1946-52. అడ్రసు : గార్ల పాడు, పాతపట్నం తాలూకా, శ్రీకాకుళ జిల్లా.

గోపాల కృష్ణయ్య వావిలాల; జననం, 1906; ఆంధ్రరాష్ట్ర రైతు సంఘ ఉపాధ్యక్షులు ; (1942-46) ఆంధ్రమహాసభ కార్య వర్గ సభ్యులు ; తెలంగాణా సహాయక సంఘ కార్యదర్శి (1947-48) ఆంధ్రదేశ కో-ఆపరేటివ్ యూనియన్ కార్యవర్గ సభ్యులు, 1845-48; జాతీయోద్యమంలో జైలుకు వెళ్ళారు; ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ సహాయ కార్యదర్శి ; ఎడిటర్ : విద్యార్థి (1926) జ్యోతి (1837) ; సహకారం 1945-49; గుంటూరుజిల్లా పత్రికా రచయితల సంఘాధ్యక్షులు, 1950-51; ఉత్తర విశాఖ కరవు విచారణసంఘ సభ్యులు 1944. రచనలు ; ఆంధ్రరాష్ట్రోం. సంస్థానాలు, తుంగభద్ర ప్రాజెక్టు, మద్రాసు మంత్రులు, ప్రభాతం, మన్యం, గ్రంథాలయ బిల్లు సత్తెన పల్లి నియోజక వర్గంనుంచి శాసన సభకు 1952 లో ఎన్నుకోబడి నారు. అడ్రసు : సత్తెనపల్లి.

గోపాలరావు, కల్లూరి: జననం. 27 డిసెంబరు 1908; బి. కాం. (బొంబాయి): 1929; సి. ఎ. ఐ. ఐ. బి., మొదట్లో ఇండియన్ బ్యాంకిలో అనేక హోదాలలో పనిచేసి, తరువాత బ్యాంక్ ఆఫ్ బరోడాలో చేరి, ఈ బ్యాంకి కోయంబత్తూరు బ్రాంచి మేనేజరుగా 1949 వరకు ఉన్నారు. 1949 నుంచి మదరాసు బ్రాంచి మేనేజరుగా వున్నారు. మదరాసు రోటరీక్లబ్ కార్యదర్శి 1949 నుంచి, అడ్రసు, బ్యాంక్ ఆఫ్ బరోడా, ఎర్రబాలు చెట్టి వీధి., మదరాసు-1.

✓ గోపాలరెడ్డి, బెజవాడ ; జననం, 1907 ఆగస్టు 5. శాంతినికే

తనంలో శిక్షాభవన పట్టాన్ని పొందారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని మూడు నెలలశిక్ష పడ్డారు. విడుదల అవగానే మళ్లీ విద్యార్థుల ఊరేగింపు జరిపి, ఆరునెలలు శిక్ష పడ్డారు. 1932 మేలో 18 నెలలు శిక్షపడి, 1933 జూన్‌లో విడుదల అయ్యారు. 1940 లోను 1942 లోను జైలుకు వెళ్ళారు. 1937 లో మదరాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. స్థానిక స్వపరిపాలన శాఖామంత్రి 1937-39. ఆంధ్ర యూనివర్శిటీ సిండికేట్ సభ్యులు 1944 నుంచి; 1946 లో శాసనసభకు మళ్లీ ఎన్నుకోబడినారు. ఆర్థిక శాఖామంత్రి 1947-52; ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ప్రో-ఛాన్సెలర్, 1951 నుంచి. అడ్రసు, బుచ్చిరెడ్డిపాలెం.

గోపాలస్వామి, కూర్మావేణు; జననం, 1903 డిసెంబర్ 19; బి. ఏ. మదరాసు; ఎం. ఎ. ఆక్స్‌ఫర్డ్; బారెట్లా; వీరి తండ్రి సర్ కె. వి. రెడ్డినాయుడుగారు దక్షిణాఫ్రికాలో ఇండియా ప్రభుత్వపు ఏజెంటుగా వున్నప్పుడు వారికి ప్రైవేట్ సెక్రటరీగా ఈయన పని చేశారు, 1930-31; మదరాస్ హైకోర్టు అడ్వకేటు 1933-42; ఆంధ్రవిశ్వకళాపరిషత్తు రిజిస్ట్రారుగా 1942 లో ఎన్నుకోబడి, అప్పటినుంచీ ఆ పదవిలోనే వున్నారు. ఆంధ్ర యూనివర్శిటీలా ప్రొఫెసర్, 1945; వీరి సతి శ్రీమతి శేషుబాయిగారును వీరును కలసి తెలుగులో చాలా కథలను, నాటికలను వ్రాశారు. అడ్రసు: ఆంధ్ర యూనివర్శిటీ కాంపస్, వాల్తేర్.

గోపాలస్వామి అయ్యంగార్; ఎన్. జననం, 1882 మార్చి 31; బి. ఎ., బి. ఎల్., 1905 లో మదరాసు రాష్ట్రంలో డిప్యూటీ కలెక్టరుగా ఉద్యోగం ప్రారంభం 1937 నాటికి రెవిన్యూబోర్డు మెంబరయి ఉద్యోగంనుంచి రిటైరయ్యారు. కాశ్మీరు ప్రధాని. 1937-43. కేంద్రప్రభుత్వ మంత్రి, 1947 సెప్టెంబరు నుంచీ, రైల్వే మంత్రి. 1949-52; రక్షణశాఖ మంత్రి, 1952 మే 13 నుంచి. అడ్రసు, న్యూఢిల్లీ.

గోపీచంద్, త్రిపురనేని, బి. ఏ. (ఆంధ్రయూనివర్శిటీ) బి.

ఎల్. (మదరాస్). ఆరు నెలలు మాత్రం లాయరుగా ప్రాక్టీసుచేసి, తరువాత సాహిత్యకృషిలో ప్రవేశించారు: కథారచనలోను, నవలా రచనలోను పేరుపొందారు. సినిమా కథా రచన, డైరెక్షను యిప్పుడు ప్రధాన కృషి. అడ్రసు : 11 సోమ సుందరంవీధి, త్యాగరాయనగర్, మదరాసు.

గోవిందరావు, బారు ; జననం, 1901 జులై 12 ; ఎం. ఎ. బి. ఎల్., వాణిజ్య విషయాలలో నిపుణులు. ఉత్తరదేశంలో అనేక వాణిజ్య సంస్థలలో పనిచేశారు. అనేక వాణిజ్యసంస్థలకు కార్యదర్శిగా వున్నారు. గుంటూరు జిల్లాలో రైతుల అప్పులను సమాధాన పరచడానికి ప్రభుత్వం నియమించిన బోర్డులో సభ్యులు, 1941-43 ; ధరల సలహా కమిటి, గుంటూరు, 1942-43; కేంద్ర, రాష్ట్ర శాసనసభల ఓటర్ల జాబితాల పరిశీలకులు, 1942, 1945 ; ఆంధ్ర మహాసభ స్థాయి సంఘ సభ్యులు; 1937 నుంచి 1946 వరకు ఆంధ్ర యూనివర్శిటీ అకడమిక్ కౌన్సిలులోనూ, సెనెట్‌లోనూ, పాఠ నిర్ణయ సమితిలోనూ సభ్యులు ; కాలేజి టీచర్ల అసోసియేషను స్థాపకులలో ఒకరు ; బర్మింగ్‌హాంలోని కామెర్స్ ఇన్స్టిట్యూట్ సభ్యులు, 1951. ఆర్థిక వాణిజ్య విషయాలను గురించి అనేక పత్రికలకు వ్యాసాలు వ్రాస్తూవుంటారు; 1935 నుంచి గుంటూరు హిందూ కాలేజిలో వాణిజ్య శాస్త్రాధ్యాపకులుగాను, వైస్ - ప్రిన్సిపాల్‌గాను వున్నారు. అడ్రసు : వైస్-ప్రిన్సిపాల్, హిందూ కాలేజి, గుంటూరు.

గోవిందాచార్యులు, ఆత్మకూరి, జననం. 1897, ఎఫ్. ఆర్. ఇ. ఎస్, (లండన్); 1917 నుంచీ దేశసేవా కార్యక్రమంలో పాల్గొంటున్నారు. 1920 నుంచి కాంగ్రెసువాదిగా, అన్ని ఉద్యమములలోను పాల్గొని అనేక సార్లు జెయిలుకు వెళ్లారు. 1922 నుంచి చాలఏండ్లు అఖిలభారత కాంగ్రెసు కమిటీలో సభ్యులుగ ఉన్నారు. సత్యాగ్రహి పత్రికా సంపాదకులు 1924-32. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గంలో చాలాకాలం సభ్యులు; చాలాకాలం పశ్చిమ గోదావరి జిల్లాబోర్డు సభ్యులు. రచనలు ; గాంధి మహాత్ముని

జీవితచరిత్ర, హిందూదేశ ఆర్థిక చరిత్ర, ఉత్తర రామాయణ కావ్యము, భారత రాజ్యాంగచరిత్ర. మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు ; సభ్యులు, 1946-52 ; అడ్రసు, ఏలూరు.

చక్రపాణి (ఆలూరి వెంకట సుబ్బారావు) ; జననం, 1908 ఆగస్టు 5 ; చందమామ, ఆంధ్ర జ్యోతి పత్రికల ఎడిటర్, 1945-48 ; రచనలు, త్రిలోచన కవి రాజు, బడదీదీ, దేవదాస్, మొద లైన అనువాదాలు ; తోకచుక్క, పాతమంగలి, భేతాళ కథలు ; 'ధర్మపత్ని' ఫిలింకు సంభాష ణలు, స్వర్గసీమకు కథ వ్రాశారు. విజయ ప్రొడక్షన్సు వారి షావుకారు, పాతాళ భైరవి, పెళ్ళిచేసి చూడు, చిత్రాల్ని బి. నాగిరెడ్డి గారితో కలిసి తయారు చేశారు. అడ్రసు : 37 అచారప్పన్ వీధి, మదరాసు.

చంద్రమౌళి, కల్లూరి ; స్కాట్లండువెళ్ళి, అక్కడ యూని వర్సిటీలో 1924 లో పట్టం పొందారు. వ్యవసాయం సమస్యల పట్ల అభిమానం ఎక్కువ. 1926 లో కాంగ్రెసులో చేరారు. 1937 లో ఎం. ఎల్. ఎ ; గుంటూరు జిల్లాబోర్డు అధ్యక్షులు, 1938-40 ; 1930, 1940, 1942 లలో కాం గ్రెసు ఉద్యమంలో జెయిలుకు వెళ్ళారు, 1946 లో మళ్ళీ ఎం. ఎల్. ఏ. స్థానిక పరిపాలన శాఖా మంత్రి, 1947-52 ; అడ్రసు, మోపర్రు, తెనాలి తాలూకా.

చామకూర్, ఎస్. ఎన్. (సత్య నారాయణ) ; జనవరి, 1904 ఏప్రిల్ 8 ; రాజమండ్రి. 1923 లో కీ. శే. దామెర్ల రామారావు గారివద్ద చిత్రకళను అభ్యసించారు. 1923 లో వెంబ్లీలో జరిగిన బ్రిటిష్ ఎంపైర్ ఎగ్జిబిషన్ కు ఇండి యానుంచి ఎన్నబడిన 16 చిత్రా లలో, 'ధ్యానబుద్ధ' అనే వీరి చిత్రం ఒకటి. 1928 లో బొం బాయిలోని సర్ జె. జె. స్కూల్ ఆఫ్ ఆర్ట్సులోచేరి, 1930 లో డిప్లొమా పొందారు. తరువాత వీరు సర్ ఎస్. వరదాచారి, సర్ అల్లాడి, శ్రీ సి. రాజగోపాలా చారి, మొదలైన నాయకుల పూర్తిసైజు చిత్రాలను వ్రాశారు. మదరాసులో, ఆర్ట్ ఎకడమీని స్థాపించారు. దక్షిణ భారత చిత్ర

కారుల సంఘమునకు 1948 నుంచి గౌరవకార్యదర్శి ; అడ్రసు : 19 అప్పర్ స్వామికోయిల్ వీధి, మైలాపూర్, మదరాసు.

చెన్నారెడ్డి, డాక్టర్ మర్రి ; వయస్సు, 32 ఏళ్లు ; హైదరాబాద్ రాజ్యంలోని సిరిపురం వాస్తవ్యులు ; 1941 లో వైద్యపట్టం పొందారు. 19 వ ఏట, అంటే 1935 లోనే ఖద్దరు ప్రచారం సాగించారు. 1941 లో హైదరాబాదులో ఆంధ్ర విద్యార్థి మహాసభను స్థాపించారు. జెయిలుకు వెళ్లారు. సంస్థాన కాంగ్రెసు సభ్యులు. ఎన్నికల తరువాత, 1952 లో హైదరాబాద్ ప్రభుత్వ ఆహారమంత్రిగా నియమింపబడినారు. అడ్రసు: హైదరాబాద్.

జయకర్, డాక్టర్ ముకుంద్ రామారావ్ ; ఎం. ఎ. ఎల్. ఎల్. డి. ప్రీవీకౌన్సిలర్ ; బారిష్టర్ ; బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు, 1923 ; ఆ కౌన్సిలులోనే స్వరాజ్యపార్టీ నాయకులు, 1923-25 ; కేంద్ర శాసనసభ్యులు, 1926-30 ; రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సుకి ప్రతినిధి, 1931 ; ఇండియా ఫెడరల్ కోర్టు జడ్జి, 1937-39 ; కన్స్టిట్యుయెంట్ అసెంబ్లీ సభ్యులు ; 1946-47 : అడ్రసు, వింటర్ రోడ్, మలబార్ హిల్, బొంబాయి.

జయప్రకాశ్ నారాయణ్ ; కాంగ్రెసు సోషలిస్టుపార్టీ స్థాపకులు ; 1922-30 లలో అమెరికాకు వెళ్ళి 5 యూనివర్శిటీలలో చదివి వచ్చారు. 1931 లో కాంగ్రెసు కార్మిక శాఖను నిర్వహించారు, 1942 లో జెయిలుకు వెళ్ళారు. 1946 లో కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులు ; సోషలిస్టుపార్టీని కాంగ్రెసునుంచి విడదీసి, దానికి ప్రధాన కార్యదర్శిగా వున్నారు.

జానకిరామ్, ఆచంట ; జననం 16 జూన్ 1903 ; భిషగ్రత్న ఆచంట లక్ష్మీపతిగారి కుమారులు, మదనపల్లి, అడయారులలోని థియొసాఫికల్ స్కూళ్ళలోను, విజయనగరంలోని మహారాజా రిసర్చ్ లేబరేటరీస్ లోను, బెంగుళూరు ఇండియన్ సైన్స్ ఇన్స్టిట్యూట్ లోను విద్యాభ్యాసం ;

1924-32 లలో కొన్ని మూలికలను గురించి రసాయనిక పరిశోధన చేశారు : 1938 నుంచి ఆల్ ఇండియా రేడియోలో పనిచేస్తున్నారు. 1943 మార్చినుంచి ఆల్ ఇండియా రేడియో తెలుగు ప్రోగ్రాముల పత్రిక 'వాణి' లో సహాయ సంపాదకులు ; కృష్ణా పత్రిక, భారతి, కిన్నెర పత్రికలకు తరచు వ్రాస్తూవుంటారు ; అడ్రసు : ఆల్ ఇండియా రేడియో, ఎగ్మూరు.

జోగినాయుడు, అల్లూరి ; జననం, 18 ఆగస్టు 1885 ; 1921 లో కాంగ్రెసు ఉద్యమంలో చేరారు. జెయిలుకు వెళ్లారు. విజయనగరం జిల్లాబోర్డు ప్రెసిడెంటు ; విజయనగరం కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంక్ కార్యదర్శిగా చాలాకాలం ఉన్నారు. మదరాసు అసెంబ్లీ సభ్యులు, 1946-52 ; అడ్రసు : ధర్మవరం. విశాఖపట్టణం జిల్లా.

డాల్మియా, సేఠ్ రామకృష్ణ ; జననం, 1893 ఏప్రిల్ 7; తమ 12 వ ఏట నెలకు 10 రూపాయల జీతంమీద జీవితం ప్రారంభించి, యీనాడు ఇండియాలోని కోటీశ్వరులలో ఒకరయారు. సుమారు 70 కంపెనీలు యీయన ఆధ్వర్యాన నడుస్తున్నవి. గోరక్షణ, హిందూ సనాతనధర్మం అంటే యీయనకు అభిమానం ఎక్కువ, అడ్రసు : డాల్మియా జైన్ నివాస్, న్యూఢిల్లీ.

తిరుమలరావు, మొసలికంటి ; (కాకినాడ) జననం, 1901 జనవరి 29 ; బి. ఏ. కు చదువుతూ కాంగ్రెసు ఉద్యమంలో చేరి 1921 లో చదువు మానివేశారు ; స్వరాజ్య (ఇంగ్లీషు) పత్రికలో పనిచేశారు; కేంద్రశాసన సభ్యులు 1937-41; కౌన్సిల్ ఆఫ్ స్టేట్ సభ్యులు, 1945-47; చాలాసార్లు జెయిలుకు వెళ్లారు. పార్లమెంటు సభ్యులు 1949-52. 1948 అక్టోబరులో కామన్‌వెల్తు పార్లమెంటరీ డెలిగేషనులో ప్రతినిధిగా ఇంగ్లండు, హాలెండు, బెల్జియం, ఐర్లెండు; పర్యటనము చేశారు. 1950 లో ఆహార ధాన్య సేకరణ సంఘాధ్యక్షులుగా, పని చేశారు. కేంద్ర ప్రభుత్వ ఆహార శాఖ డిప్యూటీ మంత్రి, 1950 ఆగస్టు 10 నుంచి, 1952 మే 13 వరకు; అడ్రసు, కాకినాడ.

దివాకర్, రంగనాథ రామచంద్ర; జననం, 1894; బి. ఏ. (పూనా) 1916; ఎం. ఏ. 1918. కొల్హాపూర్ రాజారాం కాలేజిలో ప్రొఫెసర్‌గా పనిచేశారు; 1911 లో సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. రెండు సంవత్సరాలు ఖైదు శిక్షపొందారు. కర్ణాటక రాష్ట్రకాంగ్రెసు కార్యదర్శి, 1926-29; అధ్యక్షులు, 1929-34; 1939 ఉప్పుసత్యాగ్రహంలోను, 1933 లోను, జెయిలుకు వెళ్ళారు. 1940-41 లో వ్యక్తి సత్యాగ్రహంలోను, 1942 ఉద్యమంలోను ఆరెస్టు చేయబడి 1945 ఆగస్టులో విడుదల చేయబడినారు. 1946 లో కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీకి ఎన్నుకోబడినారు. ప్రచురణశాఖ, బ్రాడ్ కాస్టింగ్ మంత్రి (మినిస్టర్ ఆఫ్ స్టేట్) 1948-52; బీహార్ గవర్నర్, 1952 జూన్ నుంచి; అడ్రసు, పాట్నా.

దుర్గాబాయి, శ్రీమతి గుమ్మడిదల; జననం, 1909 తమ పదమూడవ ఏటనే కాకినాడలో బాలికా హిందీ పాఠశాలను స్థాపించి, జయప్రదంగా నిర్వహించారు. 1930 లో మదరాసుకు వచ్చి, అప్పటినుంచి జాతీయోద్యమంలో పాల్గొన్నారు. 1930 లో ఉప్పుసత్యాగ్రహంలో జైలుకు, వెళ్ళి, అక్కడ ఇంగ్లీషు నేర్చుకోవడం ప్రారంభించారు. తరువాత 1932 లో కూడా జెయిలుకు వెళ్ళారు. స్వయంగా ఇంగ్లీషు చదువుకొని, బెనారెస్ మెట్రిక్యులేషన్ ప్యాసయారు. బెనారెస్ లోను, వాల్తేరులోను చదివి, తమ 30 వ ఏట ఎం. ఏ. డిగ్రీని పొందారు. తరువాత 'లా' చదివి ప్యాసయి, లాయరుగా ప్రాక్టీసు పెట్టారు. తెలుగు దేశమంతటా ప్రఖ్యాతిపొందిన ఆంధ్ర మహిళా సభ (మదరాసు), యీ సభచే నిర్వహింపబడుతున్న ఇతర సంస్థలు అన్నీ, వీరి కృషిఫలితాలు. పార్లమెంటు మెంబరు 1947-52. ప్లానింగ్ కమిషన్ మెంబరు, 1952 జూన్ నుంచి. అడ్రసు న్యూఢిల్లీ.

దేశముఖ్, చింతామణ్ ద్వారకనాథ్; జననం, 1896 జనవరి 14. 1919 లో ఐ. సి. ఎస్, లో చేరారు. ఆర్థికశాస్త్ర నిపుణులు; రిజర్వు బ్యాంక్ డిప్యూటి గవర్నర్, 1941-43; రిజర్వుబ్యాంక్ గవర్నరు 1943-49

ఇండియా ప్రభుత్వ ఆర్థిక మంత్రి 1950 నుంచి, అడ్రసు: న్యూఢిల్లీ.

ధర్మారావునాయుడు, తాపీ; ఆంధ్రవిశారద; జననం, 1888 సెప్టెంబరు 19; బి. ఏ, (మదరాసు); బరంపురంలో కళ్ళికోట కాలేజిలో లెక్చరర్, 1909; 1911 లో వేగుచుక్క గ్రంథమాల స్థాపించారు; మైనరు జమీందార్లకు చదువుచెప్పే న్యూయింగ్టన్ కాలేజిలో ట్యూటరుగాను, గార్డియన్‌గాను 1917 నుంచి 1926 వరకు పనిచేశారు. బొబ్బిలి రాజాగారికి ప్రైవేటు సెక్రటరీ, ఆక్టింగ్ దివాన్, 1929; మందసా రాజాగారికి ట్యూటర్, 1929-35; జనవాణి సంపాదకులు, 1936-39 కాగడా సంపాదకులు, 1939-42; నేషనల్ సర్వీస్ లేబరు ట్రిబ్యునల్ పబ్లిసిటీ ఆఫీసరు, 1934; బరంపురంలో ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజాన్ని స్థాపించారు; మదరాసు సాహితీసమితి మొదటి అధ్యక్షులు: అభ్యుదయ రచయితల సంఘ ప్రథమాధ్యక్షులు, అనేక గ్రంథాలు రచించారు, అనేక ఫిలిములకు కథలు వ్రాశారు. వీరికి 'ఆంధ్రవిశారద' బిరుదాన్ని శృంగేరి మఠాధిపతులిచ్చారు 'జనవాణి' వారపత్రిక సంపాదకులు. అడ్రసు: జనవాణి, తిరువళ్ళిక్కేణి, మదరాసు.

నరసింహమూర్తి, వేదుల: జననం 9 ఏప్రిల్ 1916: ఆంధ్రవిశ్వకళాపరిషత్ బి. ఏ. ఆనర్సు (గణిత శాస్త్రం) 1938 లో ప్రథమ తరగతిలో ఉత్తీర్ణులై, చేపూరి సన్యాసిరాజు స్వర్ణపతాకమును పొందినారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో 1938-41 లలో పరిశోధన చేశారు, ఆంధ్ర యూనివర్శిటీ కాలేజిలో గణితశాస్త్ర బోధకులు 1943-45; రిజర్వు బ్యాంకు (బొంబాయి) లో 1945 నుంచి 1947 అగస్టు వరకు స్టాటిస్టిక్సు రిసెర్చి సూపరింటెంటు; 1947 అగస్టునుంచి రిసెర్చి ఆఫీసరుగా పనిచేస్తున్నారు. అడ్రసు: స్టాటిస్టికల్ ఆఫీసర్, రిజర్వుబ్యాంక్ ఆఫ్ ఇండియా, బొంబాయి.

నరసింహరాజు, పి. ఎల్. జననం, 1884; విజయనగరం, విశాఖపట్టణం కాలేజిలలో చదివారు; వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని ఏడాది జైలుకు వెళ్లారు.

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కమిటీ, రాష్ట్ర కాంగ్రెసు వర్కింగు కమిటీ- అఖిలభారత కాంగ్రెసు కమిటీలలో సభ్యులుగా వున్నారు. విశాఖపట్టణంజిల్లా విద్యా సంఘ అధ్యక్షులు ; విశాఖపట్టణము తాలూకాబోర్డు ప్రెసిడెంట్, 1920-34; జిల్లాబోర్డు ప్రెసిడెంట్ 1937; ఇండియా రాజ్యాంగ పరిషత్తు సభ్యులు, 1947; మదరాసు అసెంబ్లీ సభ్యులు 1946-52 ; అడ్రసు : జొన్నవలస, విశాఖపట్టణం జిల్లా.

నాగప్ప, సర్దారు, జననం, 6 అక్టోబరు 1911 (కర్నూలు). 1931 లో స్కూలుపైనలు చదువుతూ, కాంగ్రెసు ఉద్యమంలో చేరి చదువు మానివేశారు. 1937 లో కాంగ్రెసు తరఫున కర్నూలు హరిజననియోజక వర్గంనుంచి మదరాసు శాసనసభకు సభ్యులుగా ఎన్నుకోబడినారు. 1938 లో కర్నూలుజిల్లా బోర్డుకు ఎన్నుకోబడినారు. 1940 లో వ్యక్తి సత్యాగ్రహంలో వీరు వీరి సతికూడా జైలుకు వెళ్లారు. 1942 లో క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంలో అరెస్టు చేయబడి, 1945 వరకు జైలులోవున్నారు. 1939-45 ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు. మదరాసు శాసనసభ సభ్యులు, 1946-52 ఇండియా రాజ్యాంగ పరిషత్తు సభ్యులు 1946-50. కర్నూలు హరిజన విద్యార్థి వసతిగృహాన్ని స్థాపించారు. అడ్రసు : ఫోర్టు కర్నూలు.

నాగభూషణం, పాతూరి; జననం. 1907 అగస్టు 11 : ఇంటర్మీడియెట్ (మదరాసు); లైబ్రరీ డిప్లొమా (ఆంధ్ర యూనివర్శిటీ); మదరాసు ప్రభుత్వంవారి వయోజన విద్యాబోధనలో శిక్షితులు; 1928 లో తెనాలితాలూకా పెదపాలెం లో శ్రీ మేళ్ళచెర్వు వెంకటేశ్వర్లు గారితో చేరి సేవాశ్రమం స్థాపించి పదేళ్లు జాతీయవిద్య, గ్రంథాలయాలు, హిందీ, ఖద్దరు, స్వదేశవస్తు ప్రచారమునకుకృషిచేశారు. 1938 నుంచి యిప్పటివరకు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యదర్శిగా వున్నారు. 1948 ఫిబ్రవరినుంచి దక్షిణభారత వయోజన విద్యా సంఘమునకు ఆంధ్ర ప్రాంతీయ కార్యదర్శి. గ్రంథాలయ సర్వస్వము సంపాదకులు. మదరాసు

రాష్ట్రగ్రంథాలయ కమిటీసభ్యులు: రచనలు: గ్రంథాలయములు-రిజిస్ట్రేషన్; గ్రంథాలయశాస్త్ర ప్రథమ పాఠములు; గ్రంథాలయ పట్టికలు. 1930-32లలో 9 నెలలు, మళ్లీ 6 నెలలు సత్యాగ్రహోద్యమంలో జెయిలుకు వెళ్లారు. అడ్రసు : పటమటలంక (వయా) బెజవాడ.

నాగభూషణం, హరి ; జననం, 1884 డిసంబరు 24 ; బి. ఏ. (బందరు) 1909 ; ఫస్టుగ్రేడ్ ప్లీడరీ పరీక్ష, 1913 ; 1914-1939 వరకు బందరులో ప్లీడరీ ప్రాక్టీసు. అనారోగ్య కారణంగా ప్రస్తుతం ప్రాక్టీసు మానివేశారు. పేరుపొందిన ఆంధ్ర సంగీత విద్వాంసులు. 'వాగ్గేయకార రత్న' మొదలైన బిరుదులు పొందారు. అడ్రసు ; మచిలీపట్టణం.

నాగన్నగౌడ్, రాయదుర్గం ; జననం, 1895 బళ్లారిలో 1915 లో అమెరికావెళ్ళి వ్యవసాయ శాస్త్రంలో పి. హెచ్. డి. డిగ్రీ పొందారు. 1936 లో కాంగ్రెసులో చేరారు. 1941 లో జెయిలుకు వెళ్లారు. బళ్లారి జిల్లా బోర్డు అధ్యక్షులు, 1938-46 ; హాస్పేట మునిసిపల్ చైర్మన్, 1929-31 ; కర్ణాటక రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు, 1940-41. హాస్పేట నియోజక వర్గంనుంచి రాష్ట్ర అసెంబ్లికి 1952 లో ఎన్నుకోబడినారు. వ్యవసాయ శాఖ మంత్రి, 1952 ఏప్రిల్ 10 నుంచి ; అడ్రసు, ఫోర్టుసెంట్ జార్జి, మదరాసు—1.

నాగయ్య, వుప్పల ; జననం, 1907 ఏప్రిల్ 17 ; మొదట్లో చిత్తూరుజిల్లాలో రెవిన్యూ డిపార్టుమెంటులో పనిచేశారు. తరువాత జిల్లాబోర్డులో చేశారు. 1934 వరకు ఉద్యోగంలో వున్నారు. నాట్యకళపట్ల అభిమానంతో ఉద్యోగం మానివేశారు. గృహలక్ష్మి, వందేమాతరం, సుమంగళి, విశ్వమోహిని, దేవత, పోతన భాగ్యలక్ష్మి, స్వర్గసీమ, త్యాగయ్య, వేమన, అశోక్ కుమార్, చెంచులక్ష్మి, మీరాబాయి, భక్తజనాబాయి, చక్రధారి, నవజీవనం, మనదేశం, బీదలపాట్లు ఫిలిములలో నటించి, సమర్థ నటుడుగా ప్రసిద్ధి పొందారు. త్యాగయ్య ఫిలిమును డైరక్టు

చేశారు. త్యాగబ్రహ్మగాన సభకు సెక్రటరీ; ఆంధ్రగాన కళా మండలికి వైస్ ప్రెసిడెంట్, అడ్రసు; 58 గోపతి నారాయణస్వామి చెట్టి రోడ్, త్యాగరాయనగర్, మదరాస్.

నాగిరెడ్డి, బొమ్మిరెడ్డి; జననం, 1912 డిసెంబరు 1; వాహిని ప్రొడక్షన్స్‌లో డైరెక్టరు. 1937 నుంచి; మేనేజింగ్ డైరక్టర్ 1948 నుంచి; విజయ ప్రొడక్షన్స్ మేనేజింగ్ డైరక్టర్, 1949 నుంచి; బి. ఎన్. కె. ప్రెస్ ప్రొప్రయిటర్; చందమామ పత్రిక ప్రచురణకర్త; ప్రస్తుతం వాహిని స్టూడియోస్‌ను కౌలుకు తీసుకొని నిర్వహిస్తున్నారు. వీరు చక్రపాణి కలసి షావుకార్ పాతాళభైరవి, పెళ్ళిచేసి చూడు, చిత్రాల్ని తయారు చేశారు. అడ్రసు: 3, రామస్వామి వీథి, త్యాగరాయనగర్, మదరాస్.

నారాయణరెడ్డి, కె. బి. జననం, 1994; బి. ఎ., బి. ఎల్., మదరాసు యూనివర్శిటీ; వ్యక్తిసత్యాగ్రహంలోనూ, 1941. ఉద్యమంలోనూ, పాల్గొన్నారు; అయిదు నెలలు శిక్ష, రెండేళ్లు నిర్బంధం అనుభవించారు. కడపజిల్లా బోర్డు వైస్-ప్రెసిడెంట్, 2932-35; మదరాస్ అసెంబ్లీ సభ్యులు, 2946-52. అడ్రసు: ప్రొద్దటూరు, కడప జిల్లా.

నిర్వికల్పానందస్వామి; జననం, 20 డిసెంబరు 1915; తమ పద్ధెనిమిదవ ఏటనే, (1933) లో భువనేశ్వరంలోని శ్రీ రామకృష్ణ మఠంలో తురియాశ్రమ స్వీకారార్థం చేరి, 1939 వరకు అక్కడనే వున్నారు. 1939 లో విశాఖపట్టణంలో, ఆంధ్ర దేశంలోని మొట్టమొదటి రామకృష్ణ మఠాన్ని స్థాపించడానికి ప్రయత్నం చేశారు. తరువాత 1942 వరకు వంగదేశంలోని రామకృష్ణ మఠ కేంద్రాలలో పనిచేశారు. 1942 నుంచి 1946 వరకు మదరాసులో వున్నారు. 1944 లో శ్రీరామకృష్ణ మఠం తరఫున శ్రీరామకృష్ణ ప్రభ అనే మాసపత్రికను స్థాపించి, దానికి ప్రథమ సంపాదకులుగా పని చేశారు, 1946 నుంచి 1948 వరకు విశాఖపట్టణంలో వుండి ప్రచార కార్యాన్ని చేసి, ప్రస్తుతం భువనేశ్వరంలో వున్నారు. వీరి,

సంస్కృత, ఇంగ్లీషు, తెలుగు, వంగ భాషలలో పండితులు; రచనలు: యోగవాసిష్ఠం, భగవద్గీత, తత్త్వశాస్త్ర చరిత్ర, అష్టాదశశ్లోక గీత, భక్తత్వము, ప్రపంచ మతములు, మొదలైనవి; శ్రీ పూర్ణానంద, శ్రీ వనమాలి అనే పేర్లతో తెలుగు పత్రికలలో వ్యాసాలు వాస్తూ వుంటారు; అడ్రసు: శ్రీ రామకృష్ణ మఠం, భువనేశ్వర్, ఒరిస్సా.

నిరీక్షణరావు, గోవాడ; జననం, నవంబరు 1915; మైనరుగా వుండగానే రాజకీయాలలోనూ, విద్యార్థి ఉద్యమాలలోనూ పాల్గొన్నారు. 1930 నుంచీ పత్రికలకు వ్యాసాలూ, కథలూ వ్రాస్తున్నారు. హైదరాబాదులో, సంఘమాన్య, ఆదిహిందు పత్రికలలోనూ, మదరాసులో వాహిని పత్రికలలోనూ పత్రికలలోనూ, పనిచేశారు. 1940 లో 18 నెలలు శిక్షపడ్డారు; 1948 జూలై నుంచి ఒక ఏడాది నిర్బంధంలో వుంచబడినారు. ఆంధ్ర మహాసభ కార్యవర్గ సభ్యుడు, 1951 జనవరినుంచి; బందరు మునిసిపల్ కౌన్సిల్ సభ్యులు; రచనలు: ఉక్కుమనిషి; కథాలోకం; పెళ్ళిఅంటే ఏమిటి? అడ్రసు: మలకాపట్నం, మచిలీపట్నం.

నియోగి, క్షితీశచంద్ర; జననం 1888; ఫెడరల్ కోర్టు అడ్వొకేటు; కేంద్ర శాసనసభ సభ్యులు, 1921 నుంచి 1947 వరకు; భారత ప్రభుత్వ వాణిజ్య శాఖామంత్రి; 1957 మంచి 1950 మే వరకు.

నెహ్రూ, పండిత జవహర్‌లాల్; జననం, 1889 నవంబరు 14; ఎం. ఎ., బారెట్లా; అలహాబాదు హైకోర్టులో అడ్వకేటుగా ప్రాక్టీసు చేశారు. హోంరూల్ లీగ్ సెక్రటరీ, 1918; ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటి మెంబరు, 1921 లో జైలు; 1922 లో విడుదల చేయబడి, మళ్ళీ జైలుకు పంపబడినారు; అఖిల భారత కాంగ్రెసు కార్యదర్శి, 1929; కాంగ్రెసు అధ్యక్షుడు, 1929-30; ఉప్పుసత్యాగ్రహంలో 1930 ఏప్రిల్ లో అరెస్టు చేయబడి, 1931 జనవరిలో విడుదల; కాంగ్రెసు అధ్యక్షుడు 1936-1937; 1940 లో మళ్లీ అరెస్టు. తొమ్మిదవసారి మళ్ళీ

1942 ఆగస్టులో అరెస్టు, 1945 జూన్ 15 న విడుదల; వైస్రాయి కౌన్సిలు మెంబరు, డిప్యూటి ప్రెసిడెంటు 1946 సెప్టెంబరు 2 నుంచి; స్వతంత్ర భారతదేశ ప్రధా మంత్రి 1947 ఆగస్టు నుంచి; అడ్రసు, న్యూఢిల్లీ.

పట్టాభిరామారావు, ఎస్. బి. పి. జననం, 30 డిసెంబర్ 1911; కపిలేశ్వరపురం జమీందారు; బి.ఎ. బి. ఎల్. నుంచి ఆంధ్ర విశ్వకళా పరిషత్ సెనెట్ సభ్యులుగను, 1944 నుంచి 1952 వరకు సిండికేట్ సభ్యులుగను వున్నారు. 1952 లో తూర్పుగోదావరి జిల్లా పామర్రు నియోజకవర్గం నుంచి రాష్ట్రశాసనకు ఎన్నుకో బడినారు రాష్ట్ర ప్రభుత్వ వాణిజ్యపన్నుల శాఖామంత్రిగా, 1952 ఏప్రిల్ 10 న నియమించబడినారు. అడ్రసు, ఫోర్ట్ సెంట్ జార్జి, మదరాసు—1.

పట్టాభిసీతారామయ్య, డాక్టర్ భోగరాజు; జననం, 1880 నవంబర్ 24; 1906 నుంచి 1916 వరకు డాక్టరుగా ప్రాక్టీసుచేసి, కాంగ్రెసు వుద్యమంలో ఎక్కువగా పాల్గొన్నారు. అదే సంవత్సరంలో, ఏ. ఐ. సి. సి, మెంబరుగా ఎన్నుకోబడినారు. 1917 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు నిర్మాణం విషయంలో ఎక్కువ కృషిచేసినారు. 1937 లో రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నుకోబడినారు. కొంతకాలం అఖిలభారత సంస్థాన ప్రజల కాంగ్రెసు అధ్యక్షులుగా వున్నారు. అఖిల భారత మోటారు యూనియన్ కాంగ్రెసు అధ్యక్షులు. చాలకాలం కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులుగా వున్నారు. చాలా సార్లు జైలుకు వెళ్ళారు. పార్లమెంటు సభ్యులు 1946-52; భారత కాంగ్రెసు అధ్యక్షులు, 1949; మధ్యప్రదేశ గవర్నర్; అడ్రసు, నాగపూర్.

పద్మావతిదేవి, కొమ్మూరి; జననం, 1908 జులై 7: శ్రీ కొమ్మూరి వెంకటరామయ్యగారితో వివాహం, 1922. శ్రీ బళ్ళారి రాఘవాచార్యులగారితో ప్రహ్లాదలో లీలావతి, రామదాసులో కమల, పాదుకలో కౌసల్య, హరిశ్చంద్రలో చంద్రమతి, చంద్రగుప్తలో ఛాయ, మురా, రామరాజులో ఆషాబీ, తప్పెవరిదిలో జానకి, సరిపడని సంగతులలో తార భూమి

కలను అనేకసార్లు 1930-46 మధ్యననిర్వహించి ప్రసిద్ధిపొందారు. ద్రౌపదిమానసంరక్షణము, రైతుబిడ్డ, సుమతి అనే తెలుగు చిత్రాలలో నటించారు. కథలు వ్రాస్తారు. 'పొగడదండ' అనే కథల సంపుటి అచ్చు అయింది: అడ్రసు: 15, నీలకంఠమెహాత వీధి, త్యాగరాయ నగర్, మదరాస్--17.

పరమేశ్వరన్, బి. నిమ్నజాతి ఉద్ధరణకు చాలా కృషిచేశారు. మదరాసు అసెంబ్లీకి 1946 లో ఎన్నుకోబడినారు; న్యాయశాఖ మంత్రికి పార్లమెంటరీ శెక్రటరీ, 1947-48; అఖిలభారత నిమ్నజాతి సంఘానికి ఉపాధ్యక్షులు; గ్రామోద్ధరణ శాఖ మంత్రి, 1948-52. మదరాస్ అసెంబ్లీ సభ్యులు, 1952 నుంచి.

పళ్ళంరాజు, మల్లిపూడి; జననం, 1899 ఏప్రిల్ 25; కోయంబత్తూరు వ్యవసాయ కళాశాలలో పట్టం పొందారు. 1938 లో గ్రామమునసబు ఉద్యోగానికి రాజీనామా యిచ్చి, రాజకీయాలలో ప్రవేశించారు. 1929 లో కాంగ్రెసు అభ్యర్థిగా, తూర్పుగోదావరి జిల్లాబోర్డు అధ్యక్షులుగా ఎన్నుకోబడినారు. స్వరాజ్యోద్యమంలో చాలాసార్లు జెయిలుకు వెళ్ళారు. రాష్ట్ర అసెంబ్లీ సభ్యులు, 1937-38; 1946-51. అడ్రసు, కాకినాడ.

పార్థసారధి నాయుడు, పిళ్ళారిసెట్టి, జననం, 1896 డిసెంబరు 96. వీరి పూర్వీకులు బందరులో చిరకాలంగా కలంకారీ రంగులవ్యాపారానికి నీలిమందు వ్యాపారానికీ దానధర్మాలకూ ప్రసిద్ది పొందినవారు. బందరులోని భద్రాచల శ్రీరాముల వారి దేవాలయానికి మేనేజింగ్ ట్రస్టీ; ఆంధ్ర ఇన్సూరన్సు కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్; ఆంధ్ర బ్యాంక్ డైరెక్టర్; శంకర్ ఫౌండ్రీ అండ్ మెషినరీ మాన్యుఫాక్చరింగ్ కంపెనీ, మదరాసు ఇండస్ట్రియల్ అండ్ ఇన్వెస్ట్మెంటు కార్పొరేషనులోను, వసంత్ సోప్ వర్క్సులోను డైరెక్టరు; అడ్రసు, మచిలీపట్టణం.

పుల్లారెడ్డి, తాతిరెడ్డి; జననం, ఏప్రిల్ 10, 1910; బి. ఏ., అన్నామలై యూనివర్శిటీ; బి. ఎల్. మదరాసు యూనివర్శిటీ; 1941 సత్యాగ్రహంలో జెయిలుకు వెళ్లారు.

కడప జిల్లా కాంగ్రెసు కమిటీ మెంబరు; కడప జిల్లాబోర్డు అధ్యక్షులు, 1949 నుంచి. అడ్రసు : కడప.

పెరుమాళ్ళుస్వామిరెడ్డి, సి. జననం, ఆగస్టు 20, 1890, హైదరాబాద్ సంస్థానంలో (తిరుమలగిరిలో): విద్యాభ్యాసం. నంద్యాలలోను, ఆదోనిలోను;మదరాసు పచ్చయప్ప కాలేజిలోను, 1925 లో కాంగ్రెసులో చేరారు; చాలాసార్లు జెయిలుకు వెళ్ళారు. ఉత్తరార్కాడు జిల్లా పోలూరు తాలూకా బోర్డుకు అయిదేళ్ళు ప్రెసిడెంటు; 1936 నుంచీ లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు; పరిశ్రమలశాఖమంత్రి, 1949-52; అడ్రసు, 17 దక్షిణ మాడ వీధి, నుంగంబాకం, మదరాసు.

ప్రకాశరావు, పురం; జననం : 1902 ఆగస్టు 9; విజయ నగరం కాలేజిలో చదువుతూ, 1921 లో కాంగ్రెసు ఆదేశానుసారం కాలేజిని వదలిపెట్టారు. తరువాత వ్యాపారంలో ప్రవేశించారు. 1935 లో మదరాసు ఎనేమెల్ వర్క్సునూ, 1945 లో మదరాసు మాచ్ వర్క్సునూ స్థాపించారు. 1946 లో మదరాసు గ్లాస్ వర్క్సును తమ యాజమాన్యంలోకి తీసుకొన్నారు. కెమికల్ ఇంజనీరింగ్ కార్పొరేషను డైరెక్టరు; అడ్రసు : హోంపార్క్, రాయపేట హైరోడ్, రాయపేట, మదరాస్.

ప్రకాశం, టంగుటూరి; జననం, ఆగస్టు 23, 1869; బారిస్టర్; 36 సంవత్సరాల నాడు, కాంగ్రెస్ ఆదేశానుసారం గొప్ప ప్రాక్టీసునువదలి సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. ప్రతి కాంగ్రెసు ఉద్యమంలోనూ జైలుకు వెళ్లారు. 'స్వరాజ్య' అనే ఆంగ్ల దినపత్రికను స్థాపించి, చాలా కాలం నడిపారు. కేంద్రశాసన సభ సభ్యులు, 1926-30; ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు, 1935 ; 1942-46; మదరాసు అసెంబ్లీకి 1937 లో ఎన్నుకోబడినారు ; రెవిన్యూ మంత్రి, 1937-39 , సభ్యులు 1946-52; మదరాసు ప్రధానమంత్రి,1947-48. మదరాసు లెజిస్లేటివ్

కౌన్సిలు సభ్యులు, 1952 నుంచి. అడ్రస్ : గవర్నమెంట్ హౌస్, మౌంట్ రోడ్, మదరాస్.

ప్రసాద్, పాండే సుందర నారాయణ జననం : 24 సెప్టెంబర్ 1910 (యలమంచిలి); బి. ఏ. (కాకినాడ); ఎం. ఏ. (బెనారెస్) ఆంధ్ర యూనివర్శిటీలో ఎకనమిక్స్ లెక్చరర్‌గాను, నాగపూర్ హిస్లాప్ కాలేజి; పూనావాడియా కాలేజిలలోను ఎకనమిక్స్ ప్రొఫెసర్‌గాను పని చేశారు. ప్రస్తుతం, రిజర్వ్‌బ్యాంక్ ఆఫ్ ఇండియాలో బాలెన్స్ ఆఫ్ పేమెంట్సు రిసెర్చి డైరక్టర్‌గా పనిచేస్తున్నారు. స్టెర్లింగ్ నిల్వ విషయమై బ్రిటిషు ప్రభుత్వంతో సంప్రతింపులకు ఇంగ్లండు వెళ్లిన (1948) ప్రతినిధి వర్గంలో సభ్యులు; ద్రవ్యోల్బణమును తగ్గించు విధానములను సూచించుటకే కేంద్ర ప్రభుత్వముచే 1948 లో ఆహ్వానింపబడిన నిపుణులలో ఒకరు; 1944 లో జయపూర్‌లో జరిగిన ఇండియన్ పొలిటికల్ సైన్సు కాన్ఫరెన్సు గౌరవ కార్యదర్శి; అమెరికా, ఇంగ్లండు కెనడా దేశాలలో రీసెర్చి సంస్థలను పరిశీలించడానికి సంచారం చేశారు. అడ్రస్: డైరక్టర్, రిజర్వ్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా, బొంబాయి.

బలదేవసింగ్, సర్దార్: పంజాబ్ శాసనసభలో అకాలీ పార్టీ నాయకులుగా వుండేవారు; ఆ రాష్ట్రానికి మంత్రిగాకూడా వున్నారు. భారత ప్రభుత్వ రక్షణశాఖా మంత్రి: 1946-52.

బలరామ కృష్ణయ్య, దుగ్గిరాల: జననం, 1905 జూలై 10; పంజాబు దురంతాలను వర్ణించే నాటకాలను ప్రదర్శించినందుకు 14 వ ఏటనే అరెస్టు చేయబడినారు; బుద్ధపురాణం అనే వీరి గ్రంథ రచనకు హర్షించి, ఆంధ్ర మహాసభవారు 1928 లో 'బాల నాఙ్మయ బ్రహ్మ' అనే బిరుదు నిచ్చారు; ఆంధ్రరాష్ట్ర హిందీ మహాసభ అధ్యక్షులు. 1930 లో ఏడాది 1931 లో ఏడాదీ, 1932 లో 9 నెలలు, 1942 నుంచీ 1944 వరకు జైలులో వున్నారు. ఆంధ్ర రాష్ట్రరాజకీయ మహాసభ అధ్య

క్షులు, 1940 1947; ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యదర్శి, 1947 - 50; అఖిల భారత కాంగ్రెస్ సంఘ సభ్యులు; అడ్రస్: సూర్యారావుపేట, విజయవాడ.

బసవరాజు, వల్లూరి ; జనవం, 5 మే 1914, గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలో; గిండి ఇంజనీరింగ్ కాలేజిలో డిప్లొమా పొంది, 1934 లో హైదరాబాదులో ఇంజనీరుగా ప్రైవేటు ప్రాక్టీసుపెట్టి, అనేక భవనాలను నిర్మించారు. 1944 వరకూ హైదరాబాద్ ఆంధ్ర మహాసభ సభ్యులు. 1946 లో సంస్థాన కాంగ్రెసులో చేరారు. 1950 జూనులో హైదరాబాద్ మంత్రిగా నియమింపబడినారు ; మళ్ళీ ఎన్నికల అనంతరం, 1952 మార్చిలో హైదరాబాదు ప్రభుత్వ నిర్మాణ శాఖామంత్రిగా నియమింపబడినారు. అడ్రస్ : హైదరాబాదు.

బంగారయ్య, శ్రీమతి భూపతి రాజు; జననం, 1910 ; శ్రీ భూపతి రాజు సుబ్బరాజుగారితో వివాహం, 1925 ; కాంగ్రెస్ ఉద్యమాలలో అనేకసారులు జెయిలుకు వెళ్లారు; మదరాస్ అసెంబ్లీ సభ్యురాలు, 1946-52. అడ్రస్. వేండ్ర, పశ్చిమ గోదావరి.

బాపినీడు, మాగంటి, జననం. 14 ఆగస్టు 1895 ; బి. ఎ. వరకూ కలకత్తాలలో చదివి, అమెరికాకు వెళ్ళి కార్నెల్ యూనివర్శిటిలో బి. ఎస్. సి. కాలిఫోర్నియా యూనివర్శిటీలో ఎం. ఎస్. సి. డిగ్రీలనుపొందారు. 1923 లో ఇండియాకు తిరిగివచ్చి, కాంగ్రెస్ ఉద్యమంలో జెయిలుకు వెళ్లారు. అమెరికా, హవాయీ, జపాన్, చైనా దేశాలలో సంచారంచేశారు. ఆంధ్ర యూనివర్శిటీ సెనేట్, అకడమిక్ కౌన్సిల్, సిండికేట్ లలో సభ్యులు. తెలుగుతల్లి, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము, బాపూజీ చిత్ర జీవితము ఆంధ్ర వీరాంగనలు, అనే తెలుగు పుస్తకాలనూ, ఈజ్ ఇట్ ఇండియన్, సక్సెస్ ఫుల్ సెక్రటరీ అనే ఇంగ్లీషు పుస్తకాలనూ వ్రాశారు. వీరు వ్రాసిన పిల్లల బొమ్మల భారతమునకు మదరాస్ ప్రభుత్వం బహుమతి నిచ్చింది. మదరాస్ ఇండస్ట్రీస్ అసోసియే

షనును స్థాపించి దానికి 1938 నుంచి కార్యదర్శిగా వున్నారు. అంధ్రదేశ హరిజన సేవక సంఘ కార్యదర్శి 1932-42. మదరాస్ అసెంబ్లీ సభ్యులు, 1937-38, 1946-52, ప్రచురణశాఖ మంత్రికి పార్లమెంటరి కార్యదర్శి 1937-39. రాష్ట్రి ఫిర్కా డెవలప్‌మెంట్, హరిజన అభివృద్ధి, విద్యా సలహా సంఘములలో సభ్యులు. మదరాసు ప్రభుత్వ కమ్యూనిటీ ప్రాజెక్టు ఆఫీసర్ ; అడ్రసు : 166, గాంధినగరం, మదరాసు. 20.

బాలసుందరరావు, డాక్టరు గారి ; జననం. 1913 మే 31. రాయపురం మెడికల్ స్కూల్‌లో డి. ఎం. ఎస్. 1939 ; ప్రాక్టీస్ ప్రారంభం 1939 నుంచి ; వీనస్ క్లినిక్ అండ్ నర్సింగుహోంను, అన్నిశాస్త్రీయ పరికరాలతోను స్థాపించారు. చాలా కథలు, 'అపోహ' అనే నాటకాన్ని వ్రాశారు, ప్రాగ్జ్యోతి స్టూడియో స్థాపకులలో ఒకరు. వైజయంతి ఫిలిమ్సు డైరెక్టరులలో ఒకరు. ఆంధ్రనాటక కళా పరిషత్తు జాయింట్ సెక్రటరి, 1942-43. 1949 నుంచీ గవర్నమెంట్ రాయపేట హాస్పిటల్‌లో ఆనరరీ అసిస్టెంట్ ఫిజిషన్ ; అడ్రసు : 172, రాయపేట హైరోడ్, మైలాపూర్, మదరాసు.

బొబ్బిలిరాజా, శ్రీరావు శ్వేతచలపతి రామకృష్ణరంగారావు బహదూర్ ; జననం, 20 ఫిబ్రవరి 1901 ; మదరాసు యూనివర్శిటి మెట్రిక్యులేషన్ 1918 లో ప్యాసయ్యారు. పట్టాభిషేకం 1920 ; కౌన్సిల్ ఆఫ్ స్టేట్ నామినేటెడ్ మెంబరు, 1925 ; మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు మెంబరు, 1931-37 ; 1931 లో రౌండ్ టేబిలు కాన్ఫరెన్సుకు వెళ్లి వచ్చారు ; 1932 నవంబరునుంచి 1931 మార్చివరకు మదరాసు రాష్ట్రి ప్రథమ మంత్రి. ఆంధ్రా యూనివర్శిటి ప్రో-ఛాన్సెలరుగా 1931 లో నియమింపబడినారు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో, నేషనల్ డిఫెన్సు కౌన్సిలులో మెంబరు ; కస్తూరిబా జాతీయ స్మారకనిధికి విరివిగా విరాళం వచ్చారు. బొబ్బిలిలో హాస్పిటలు, స్కూలు, శిశురక్షణ కేంద్రములను నిర్వహిస్తున్నారు. అడ్రసు: బొబ్బిలి.

బ్రహ్మయ్య, గొట్టిపాటి ; జననం, 1898 డిసెంబరు 3 ; కృష్ణ జిల్లాలోను, మదరాసు రాష్ట్రం లోనూ రైతు వుద్యమాలలో పాల్గొని, వాటిని బాగా సాగించారు ; 1918 నుంచీ రాజకీయాలలో పాల్గొంటున్నారు ; 1922, 1930, 1938 లలో తూర్పు కృష్ణ జిల్లా కాంగ్రెసు సంఘ అధ్యక్షులు ; హరిజనోద్యమాభివృద్ధి, రైతు జనక్షేమంకోసం కృషి చేశారు ; మొత్తం మూడు సార్లు, 5 ఏళ్ల 4 నెలలపాటు జైలులో వున్నారు ; ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి, 1937-40 ; రాష్ట్ర రైతు సంఘ ఉపాధ్యక్షులు, 1935-37 ; అడ్రసు, ఘంటసాల, కృష్ణాజిల్లా.

బ్రహ్మానందరెడ్డి, కాసుల ; జననం, జులై 28, 1909. బి. ఏ., బి. ఎల్., ఎ. ఐ. సి. సి. సభ్యుడు ; ఆంధ్ర యూనివర్శిటి సెనేట్ మెంబర్ ; 1941 వ్యక్తి సత్యాగ్రహంలో జైలుకు వెళ్లారు ; 1942 నుంచి 1944 డెటిన్యూ ; గుంటూరు జిల్లా బోర్డు ప్రెసిడెంటు, 1946 ; మదరాసు అసెంబ్లీ సభ్యులు, 1946-52 ; అడ్రస్ : నరసరావుపేట.

భక్తవత్సలం, ఎం. ; జననం, 1897 అక్టోబర్ 9. 1927 లో వకీలు వృత్తినుంచి విరమించారు. తమిళ రాష్ట్ర కాంగ్రెస్ కమిటిలో 1923 నుంచీ సభ్యులు. సత్యాగ్రహోద్యమంలో ఆరు నెలలు శిక్ష పడ్డారు. మదరాస్ కార్పొరేషను డిప్యూటి మేయరు, 1936. 1932 నుంచి ఆరేళ్లు చెంగల్పట్ జిల్లా బోర్డు సభ్యులుగానూ, ఉపాధ్యక్షులుగానూ, వున్నారు. 1937 లో మదరాస్ అసెంబ్లీ లో సభ్యులు. కాంగ్రెసు ప్రభుత్వంలో పార్లమెంటరీ సెక్రటరీ. 1942 లో అరెస్టయినారు. 1946 లో మళ్ళీ శాసనసభకు ఎన్నుకోబడినారు. ప్రస్తుతం అఖిలభారత కాంగ్రెస్ కమిటి : సభ్యులు ; పబ్లిక్ వర్క్సు, ప్రచురణశాఖల మంత్రి 1946-52 ; భారత దేవి పత్రిక మేనేజింగ్ ఎడిటర్.

భగవంతం, సూరి ; జననం, 1909 ; బి. ఎస్. సి., హైదరాబాద్ 1928 ; ఎం. ఎస్. సి. మదరాస్, 1932 వీరు 1933 లో ఆంధ్ర యూనివర్శిటిలో ఫిజిక్స్ రీడర్‌గా చేరారు. 1938 లో ప్రొఫెసర్ అయారు. 1941 నుంచీ

యూనివర్శిటికాలేజి, ప్రిన్సిపాల్‌గా ఉన్నారు. 1941 లో ఆంధ్ర యూనివర్శిటి, వీరికి ఆనరరీ డాక్టర్ ఆఫ్ సైన్సు డిగ్రీని ఇచ్చినది. 1946 లో ఇండియన్ సైన్సు కాంగ్రెస్‌లో ఫిజిక్స్‌శాఖకు వీరు అధ్యక్షులుగా వున్నారు. 1948 లో ఇండియా గవర్నమెంటు తరపున సైంటిఫిక్ లయిజాన్ ఆఫీసరుగా లండనులో చేరినారు. 1949 డిసెంబరునుంచి ఉస్మానియా యూనివర్సిటి ఫిజిక్సు రీసెర్చిశాఖకు డైరెక్టరుగా పని చేస్తున్నారు. అడ్రస్ : ఉస్మానియా యూనివర్సిటి, హైదరాబాద్.

భాస్కరరావు నాయుడు, తామరపాకం ; జననం. మే 10, 1896; బి. ఏ. మదరాస్ ప్రెసిడెన్సీకాలేజి లోను, ఆక్స్‌ఫర్డు యూనివర్శిటిలోను చదివారు. ఐ. సి. ఎస్. లో చేరి 1922 నుంచి 1930 వరకు సబ్ కలెక్టరుగాను, 1945 వరకు కలెక్టరుగాను పని చేశారు. ఇండియా ప్రభుత్వపు సేషనల్ సర్వీసు ట్రిబ్యునల్ చైర్మన్‌గాను, రీసెటిల్మెంటు ఎంప్లాయ్‌మెంటు డైరెక్టరుగాను 1945-46 లలో పనిచేసి, 1946 ఫిబ్రవరిలో ఐ. సి. ఎస్. నుంచి రిటైరయారు. 1946 మార్చిలో, బిర్లాబ్రదర్స్ కంపెనీలో చేరారు. తుంగభద్ర ఇండస్ట్రీస్, జయశ్రీ టీ గార్డెన్సు లిమిటెడ్‌లలో డైరెక్టరు. కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్ సభ్యులు, 1952 నుంచి ; అడ్రస్ : 28, నుంగంబాకం హైరోడ్, మదరాస్ 6.

మత్తయ్, డాక్టర్ జాన్, జననం, 1886 జనవరి 10. ఆక్స్‌ఫర్డు, లండన్, మదరాసు యూనివర్శిటిల గ్రాడ్యుయేట్. మదరాసు హైకోర్టు వకీలు, 1910-14. మదరాసు కో-ఆపరేటివ్ డిపార్టుమెంటు స్పెషల్ ఆఫీసర్, 1918-20. మదరాసు ప్రెసిడెన్సీ కాలేజిలో ఎకనమిక్సు ప్రొఫెసర్, 1920-29. మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ మెంబర్ 1922-25. ఇండియన్ టారిఫ్ బోర్డు ప్రెసిడెంటు 1931-34. డైరెక్టరు జనరల్ ఆఫ్ కమ్మర్షియల్ స్టాటిస్టిక్స్, 1935-40. గవర్నమెంటు సర్వీసులో నుంచి రిటైరయి టాటా కంపెనీలో 1940 లో చేరారు. 1944 లో టాటాకంపెనీ డైరెక్టర

రారు. ఇండియా ప్రభుత్వ ఆర్థిక శాఖా మంత్రి, 1947-50. అడ్రసు: బొంబాయి.

మవలంకర్, గణేశ వాసుదేవ్; జననం, 1888 నవంబర్ 26; 1913 లో వకీలు వృత్తి ప్రారంభం; విరమణ, 1921; గుజరాత్ రాష్ట్ర కాంగ్రెసు ప్రధానకార్యదర్శి, 1921-23; అలిండియా కాంగ్రెసు కమిటి ప్రధానకార్యదర్శి, 1921; 1930 లోను, 1933-1934 లోను, 1940 లోను, 1942 లోను జెయిలుకు వెళ్ళారు. సెంట్రల్ అసెంబ్లి స్పీకర్, 1946 జనవరి నుంచి 1947 ఆగష్టు వరకు; 1947 లో కన్టిట్యూయెంట్ అసెంబ్లి స్పీకరుగా ఎన్నుకోబడినారు. 1950 జనవరి నుంచి ఇండియా పార్లమెంటు స్పీకరు. అడ్రసు : న్యూఢిల్లీ.

మహాతబ్, హరకృష్ణ; జననం, 1900 జనవరి; 1921 లో సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. బీహార్-ఒరిస్సా లెజిస్లేటివ్ అసెంబ్లి సభ్యులు, 1924; ప్రజాతంత్ర అనే ఒరియా పత్రిక సంపాదకులు 1924-31; ఉత్కళ కాంగ్రెస్ కమిటి అధ్యక్షులు 1930; 1937; కాంగ్రెస్ వర్కింగు కమిటి మెంబరు, 1938-46; ఒరిస్సా ప్రధాన మంత్రి, 1946 - 50; ఇండియా ప్రభుత్వ పరిశ్రమ శాఖ మంత్రి, 1950-52; పార్లమెంటు మెంబరు, 1952 నుంచి. అడ్రసు: కటక్.

మహబూబ్ అలిబేగ్; జననం, 1894; బెజవాడలో అడ్వొకేట్ 1930 నుంచి 1936 వరకు బెజవాడ మునిసిపల్ కౌన్సిల్ చైర్మను ఉత్తర సర్కారుల ముస్లిం నియోజక వర్గం తరఫున మదరాసు కౌన్సిలు సభ్యులుగా వుండేవారు. 1937 లో పశ్చిమగోదావరి-కృష్ణా ముస్లిం నియోజకవర్గ తరఫున మదరాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు; మళ్ళీ 1946 లో ఎన్నుకోబడినారు; రాజ్యాంగ పరిషత్ సభ్యులు 1946 - 49; అడ్రసు: విజయవాడ.

ముఖర్జీ, డాక్టర్ శ్యామప్రసాద్; జననం, 1901 జూలై 6. బారెట్లా 1920 నుంచి 1947 వరకు బెంగాల్ శాసనసభ సభ్యుడు. కలకత్తా యూనివర్శిటి వైస్ ఛాన్సెలర్,

1934-38. బెంగాలు ప్రభుత్వ ఆర్థికశాఖా మంత్రి. 1941-42; అఖిలభారత హిందూ మహాసభకు చాలసార్లు అధ్యక్షుడు. ఇండియా ప్రభుత్వ పరిశ్రమశాఖా మంత్రి 1947 ఆగష్టు 15 నుంచి 1950 మే వరకు. అడ్రస్ : కలకత్తా.

ముత్తయ్య చెట్టియార్, సర్ ఎం, ఏ. చెట్టినాడురాజా. సర్ అన్నామలై చెట్టియార్ ప్రథమ పుత్రులు జననం, 1906. బి. ఏ. ప్రెసిడెన్సీ కాలేజి. మదరాస్ ప్రభుత్వ విద్యాశాఖా మంత్రి 1936-37 మదరాస్ అసెంబ్లి సభ్యులు 1946 నుంచి; అడ్రస్ : చెట్టినాడ్ హౌస్, అడయార్, మదరాస్.

మున్షి, కన్యాలాల్ మానెక్ లాల్; జననం, 1887 డిసెంబరు 29; బి.ఎ., ఎల్.ఎల్.బి., పేరు పొందిన లాయరు. యంగ్ ఇండియా, జాయింట్ ఎడిటర్, 1915; బొంబాయి హోం రూల్ లీగు సెక్రటరీ, 1919-20; బొంబాయి శాసనసభ సభ్యులు, 1927-46; 1930 ఉప్పుసత్యాగ్రహంలో ఆరునెలలు శిక్ష, 1932 లో రెండేళ్లు శిక్షపడ్డారు. బొంబాయి హోం మంత్రి 1937-39; 1940-41 లో నిర్బంధంలో ఉంచబడినారు. 1941 లో కాంగ్రెస్ నుంచి తొలగిపోయి, 1946 లో మళ్ళీ చేరారు. హైదరాబాదులో ఇండియా ప్రభుత్వపు ఏజెంటు జనరల్ 1947-49; ఇండియా ప్రభుత్వం ఆహారశాఖ మంత్రి 1950-52; ఉత్తర ప్రదేశ్ గవర్నర్, 1952 జూన్ నుంచి. అడ్రస్ : లక్నో.

మునుస్వామి పిళ్ళై, ఏ. వి. జననం, 1889 ఫిబ్రవరి 21; 1926 లో మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులుగా నామినేట్ చేయబడ్డారు. 1937 వరకు దానిలో సభ్యులుగానే వున్నారు. ఆల్ ఇండియా డిప్రెస్డ్ క్లాసెస్ కాంగ్రెస్ అధ్యక్షులు, 1932; 1937 కాంగ్రెస్ అభ్యర్థిగా, మదరాసు అసెంబ్లీకి సభ్యులుగా ఎన్నుకోబడినారు. వ్యవసాయ శాఖా మంత్రి, 1937-39; మళ్ళీ అసెంబ్లీ సభ్యులు 1946-52; అడ్రస్ : ఉదకమండలము.

మూర్తి, బి. ఎస్. (బయ్యా సూర్యనారాయణమూర్తి) జననం,

1906 అక్టోబర్ 29; బి.ఏ.బి.ఇ.డి. రాజమండ్రి ట్రెయినింగ్ కాలేజి; తొమ్మిదవ ఆంధ్ర విద్యార్థి సమావేశం ప్రధానకార్యదర్శి, 1930; కవి; కథకుడు; పత్రికారచయిత; పరిశ్రమశాఖ పార్లమెంటరీ సెక్రటరీ 1937-39; ఆంధ్రప్రభ అసిస్టెంట్ ఎడిటర్, 1944-46; రెండుసార్లు కాంగ్రెస్ ఉద్యమంలో జేయిలుకు వెళ్ళారు. మదరాస్ అసెంబ్లీకి సభ్యులు 1946-52; పరిశ్రమశాఖ పార్లమెంటరీ సెక్రటరీ, 1946-47. 'నవజీవన' సంపాదకులు; ఆంధ్రరాష్ట్ర హరిజన సేవాసంఘ అధ్యక్షులు; 1949 జూన్‌లో జినివాలో జరిగిన ప్రపంచ కార్మిక మహాసభకు భారతకార్మిక ప్రతినిధులలో ఒకరుగా వెళ్ళారు. ఆంధ్రరాష్ట్ర వ్యవసాయ కూలీ కాంగ్రెస్ అధ్యక్షులు పార్లమెంటు సభ్యులు, 1952 నుంచి. అడ్రస్ 2-20 రండాల్స్ రోడ్, వేపేరి, మదరాస్.

మెహాత, అశోక్; జననం, 1911 అక్టోబరు 24; బి. ఎ., 1930 నుంచి రాజకీయాలలో ప్రవేశం. సోషలిస్టుపార్టీ నాయకులు; ఆ పార్టీ స్థాపకులలో ఒకరు. నాలుగుసార్లు జయిలుకు వెళ్ళారు. సోషలిస్టుపార్టీ కార్యనిర్వాహకవర్గంలో గత 15 ఏండ్లనుంచీ సభ్యులు. అడ్రస్: 5, డాడీసెట్ రోడ్, బాబుల్‌నాథ్, బొంబాయి.

రంగ, ఆచార్య ఎన్. జి; (గోగినేని రంగనాయకులు). జననం, 1900 నవంబరు 7; ఇంగ్లండు వెళ్ళి ఆక్స్‌ఫర్డులో పట్టభద్రులై వచ్చారు. మదరాసు పచ్చయప్ప కాలేజిలో అర్థికశాస్త్ర ప్రధానాచార్యులు, 1927-30; కాంగ్రెస్, వర్కింగు కమిటి మెంబరు 1947-51; ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు, 1947-50; అఖిలభారతకిసాన్ కాంగ్రెస్, గ్రామీణ ప్రజలసమితి లకుకూడా అధ్యక్షులుగావున్నారు. నిడుబ్రోలులో రైతాంగ విద్యాలయాన్ని స్థాపించారు. గాంధిజీ బోధనలను ప్రచారం చెయ్యడంలో చాలా కృషిచేశారు. రైతు సమస్యలను గురించి చాలా గ్రంథాలు, వ్యాసాలు వ్రాశారు. కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు సభ్యులు, 1952 నుంచి; కృషిక్ లోక్‌పార్టీ సాపకులు. అడ్రసు, నిడుబ్రోలు.

రంగయ్యప్పారావు, మేకా, పుయ్యూరు కుమార రాజా; వయస్సు, 38 ఏళ్ళు; ఎం. ఎ., ఆంధ్రమహాసభకు 6 సంవత్సరాలు, ఆంధ్ర నాటక కళాపరిషత్తుకు 8 సంవత్సరాలు అధ్యక్షులు. ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు సెనెట్‌లో 11 సంవత్సరాలుగాను, సిండికేట్‌లో 9 సంవత్సరాలుగాను సభ్యులు. కృష్ణా జిల్లా నూజివీడు నియోజక వర్గంనుంచి అసెంబ్లీకి 1952 లో ఎన్నుకోబడినారు. అడ్రసు: నూజవీడు.

రంగారెడ్డి, ఎన్. జననం, 1896. కడప జిల్లా చిన్నిసెట్టిపల్లి బి. ఎ. 1918; బి. ఎల్. కడపలో న్యాయవాదిగా ప్రాక్టీసు చేశారు. కడప జిల్లా బోర్డు అధ్యక్షులు, 1927-30; లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు, 1946-52: 1952 లో అసెంబ్లీ సభ్యులచే లెజిస్లేటివ్ కౌన్సిలుకు ఎన్నుకోబడినారు. పబ్లిక్‌వర్క్సుశాఖా మంత్రిగా 1952 ఏప్రిల్ 10 నియమించబడినారు. అడ్రసు, ఫోర్ట్‌సెంట్ జార్జి, మదరాస్-1.

రఘురామయ్య, కొత్త; జననం, 1912. బి. ఏ., గుంటూరు; ఎం. ఎ. ఎల్. ఎల్. బి., లక్నో; 1933 లో ఇంగ్లండు వెళ్ళి, బారిష్టర్ అయి 1937 లో స్వదేశానికి వచ్చారు. నాలుగేళ్లపాటు ప్రాక్టీసుచేసి, 1941 లో జిల్లా మునసబుగా ఉద్యోగంలో చేరారు. 1947 లో ప్రభుత్వ న్యాయశాఖకు డిప్యూటీ సెక్రటరీ అయి, 1949 లో సెక్రటరీ అయి, 1951 లో రాజీనామా ఇచ్చి, కాంగ్రెస్ అభ్యర్థిగా తెనాలి నియోజక వర్గంనుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడినారు. అడ్రసు, తెనాలి.

రజనీకాంతరావు, బాలాంత్రపు; జననం, 1920 జనవరి 29; 1940 లో ఆంధ్ర యూనివర్శిటీ కాలేజి బి. ఏ., ఆనర్సు డిగ్రీ పొందారు. 1942 లో ఆల్ ఇండియా రేడియోలో చేరారు. 1944 నుంచీ ప్రోగ్రామ్సు అసిస్టెంటుగా వున్నారు. చాలాపాటలు, నాటకాలు స్వయంగా వ్రాసి, బ్రాడ్‌కాస్టు చేశారు. చాలా తెలుగు ఫిలిములకు పాటలను వ్రాశారు. అడ్రసు, ఆలిండియా రేడియో, విజయవాడ.

రమాకాంతరావు, దామర్ల ; జననం, 1913 జూన్ : ఎం. ఏ. (ఆంధ్ర యూనివర్సిటీ, 1935) ; జనవాణిలో సబ్-ఎడిటర్ 1936-37 ; తరువాత ఫౌగాకు వ్యాపారంలో ప్రవేశించారు, ఆంధ్ర దేశంలో, చేనేత పనివారి సంఘాన్ని చాలా ముందుకు తీసుకు వచ్చారు. మదరాసురాష్ట్రి చేనేత పనివారి కాంగ్రెసు అధ్యక్షుడు, 1942-48 ; మదరాసు రాష్ట్రి చేనేత సహకారసంఘ డైరక్టర్, 1939 నుంచి ; రాష్ట్రి ప్రభుత్వ నూలు సలహా సంఘంలో సభ్యుడు, 1942 ; రాష్ట్రి ప్రభుత్వ చేనేత పనివారి జీత నిర్ణయసంఘంలో సభ్యుడు, 1947. ఆలిండియా హాండ్‌లూమ్ బోర్డు మెంబరు 1949 నుంచి ; 'చేనేత, వార పత్రిక సంపాదకుడు ; అడ్రసు మంగళగిరి, గుంటూరు జిల్లా.

రణదివ్, బాలచంద్ర త్ర్యంబక్ ; జననం, 1904 డిసెంబర్ 19 ; 1928 నుంచి కమ్యూనిస్టు ఉద్యమంలో పాల్గొంటున్నారు. 1929 - 30 లో 1929 లో, 1934 లో జెయిలుకు వెళ్లారు. 1940 లో అరెస్టుచేయబడి రెండేళ్లు నిర్బంధంలో వుంచబడినారు. 1948-50 ఇండియాలోని కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి. అడ్రసు, రాజభవన్, శాండ్‌హార్‌స్ట్‌రోడ్, బొంబాయి-4.

రాఘవరావు, చింతగుంట ; జననం, 1896 జనవరి 15 ; ఎం. ఏ. 1916 బి. ఎల్., 1918 ; 1919 లో అడ్వొకేటుగా ప్రాక్టీసు పెట్టారు. 1934 నుంచి వరసగా అయిదుసార్లు మదరాస్ బార్ కౌన్సిలు మెంబరుగా ఎన్నుకోబడినారు. 1949 జనవరి 5 నుంచి మదరాస్ హైకోర్టుజడ్జి. అడ్రసు : హైకోర్టు, మదరాస్.

రాఘవరావు, న్యాయపతి. జననం 1905 ఏప్రిల్ 13 ; బి. ఏ. (విజయనగరం) ; 1921 లో అసహాయోద్యమంలో చేరి చదువు వదలివేశారు. 1931 వరకూ కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నారు. హిందూ పత్రిక సంపాదకవర్గంలో పని చేస్తూ 1945 లో పిల్లలకొరకు మొట్ట మొదటిగా 'బాల' పత్రికను స్థాపించి ప్రస్తుతం ఆపత్రికను నడుపుతున్నారు. పిల్లలకొరకు

నాటికలు, పాటలు వ్రాసి రేడియో పిల్లల ప్రోగ్రాములకు గత పదేళ్ళనుంచీ నడుపుతున్నారు. అడ్రస్ : 38, సల్లివన్ గార్డెన్ వీథి, మైలాపూర్, మద్రాస్-4.

రాఘవయ్య, వెన్నెలకంటి ; జననం . 1896 ; ప్లీడరు ; 1921 లో కాంగ్రెస్ ఉద్యమంలో చేరి చాలాసార్లు జైలుకు వెళ్ళారు. ఏనాదుల ఉద్ధరణ విషయంలో చాలా కృషిచేశారు. ఆదిమవాసులైన ఎరుకల, లంబాడీ, కొరవ, యానాది జాతివులకు ఉచిత భోజనవసతి గృహాములను స్థాపించారు. రాష్ట్రవ్యవసాయ కూలి సంఘమును స్థాపించారు. దక్షిణ భారత ఆదివాసీ సేవకసంఘ అధ్యక్షులు. ప్రధానిమంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి 1946-47 ; అడ్రస్, నెలూరు.

రాజగోపాలాచారి, చక్రవర్తి ; జననం 1879; 1900 లో, సేలంలో అడ్వొకేటుగా ప్రాక్టీస్ ఆరంభించి, సహాయ నిరాకరణోద్యమంలో చేరి, ప్రాక్టీస్ వదలివేశారు. 1921-25 లో కాంగ్రెస్ కార్యదర్శి ; చిరకాలం కాంగ్రెస్ వర్కింగు కమిటీలో సభ్యులు ; 1946 లో మళ్ళీ వర్కింగు కమిటి సభ్యులుగా నియమింపబడ్డారు. 1930-33, తమిళ్ నాడు రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు. 1929 నుంచి అనేకసార్లు జైలుకు వెళ్లారు. 1937 లో మదరాస్ అసెంబ్లీకి సభ్యులుగా ఎన్నుకోబడినారు ; మదరాస్ రాష్ట్ర ప్రధాని, 1937-39 ; కేంద్ర ప్రభుత్వ పరిశ్రమశాఖా సభ్యులు, 1946 సెప్టెంబరు 2 నుంచి 1947 ఆగస్టు 15 వరకు. పశ్చిమబెంగాల్ గవర్నర్ 1947 ఆగస్టు 15 నుంచి, 1948 జూన్ 21 వరకు : ఇండియా గవర్నర్ జనరల్, 1948 జూన్ 21 నుంచి 1950 జనవరి 26 వరకు : ఇండియా హోం మంత్రి, 1950-51 ; మదరాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్ లో నామినేటెడ్ సభ్యులు ; రాష్ట్ర ముఖ్య మంత్రి, 1952 ఏప్రిల్ 10 నుంచి. అడ్రెస్, బజుల్లా రోడ్, త్యాగరాయనగర్.

రాజమన్నార్. పాకలవెంకట; జననం, 1901 మే 10; బి. ఏ.

(1921) రాష్ట్రమంత్రివర్గానికి ప్రధాన స్థానంతో ప్యాసయారు, బి ఎల్. మదరాస్ యూనివర్శిటి. తెలుగులో అనేక నాటికలు వ్రాశారు. 1922 లో 'కళ' పత్రిక సంపాదకులు. మదరాస్ అడ్వొకేటు జనరల్, 1944-45; హైకోర్టు జడ్జి, 1945 నుంచి; ప్రధాన న్యాయమూర్తి, 1948 జనవరి నుంచి, అడ్రస్: విక్టోరియా క్రిసెంట్, ఎగ్మూరు మదరాస్.

రాజు, ఎం. టి. (మంతెన తిరుమలరాజు); జననం 1911 అక్టోబరు 5; బి. ఏ., ఆనర్స్ (లండన్); బారెట్లా; 1936 లో ఐ. సి. ఎస్. లో చేరారు. మదరాస్ రాష్ట్రంలో కొంతకాలం సబ్ కలెక్టరుగా వుండి, 1945-46 లో కేంద్ర ప్రభుత్వ లేబరు శాఖలో డిప్యూటీ సెక్రటరీగా వున్నారు. 1945 లో లండనులో జరిగిన బొగ్గు గనులు, భూమధ్య రవాణాకు సంబంధించిన అంతర్జాతీయ సభలలో ఇండియా ప్రభుత్వ ప్రతినిధిగా పాల్గొనిరి. 1947 లో మదరాస్ ప్రభుత్వ వ్యవసాయ శాఖ జాయింటు డైరక్టరు గాను, తరువాత పరిశ్రమల శాఖ డైరక్టరుగాను పనిచేశారు. హైదరాబాదులో ఇండియా ప్రభుత్వ ఏజెంటు జనరల్ సెక్రటరి 1947-48; మదరాస్ ప్రభుత్వ అభివృద్ధిశాఖ డెప్యూటీ సెక్రటరీ, సెక్రటరీ, 1949; మదరాస్ ప్రభుత్వ పరిశ్రమశాఖ డైరక్టరు, 1949 ఆగస్టు నుంచి; అడ్రసు: మేకేస్ గార్డెన్స్, కెతిడ్రల్, మదరాస్-6.

రాజేంద్ర ప్రసాద్, డాక్టర్. జననం, 1884 డిసెంబరు 8; ఎం. ఎ., ఎం. ఎల్. ఎల్. ఎల్. డి; 1920 దాకా ప్లీడరీ ప్రాక్టీసు చేశారు. చాలా సంవత్సరాలు బీహారు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు. గాంధిజీతో కలసి చంపారణ్య జిల్లాలో రైతుల స్వాతంత్రానికి పనిచేశారు. కాంగ్రెస్ మహాసభ అధ్యక్షులు, 1932, 1934, 1939, 1947; 1942 ఆగస్టు 9 తేదిన అరెస్టు చేయబడి 1945 జూన్ 15 న విడుదల పొందారు. కేంద్రప్రభుత్వ ఆహార శాఖా సభ్యులు 1946 సెప్టెంబరు 2 నుంచి; ఆహారమంత్రి 1947 ఆగస్టు 15 నుంచి, 1949 నవంబరు వరకు. రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షులు. 1946 నుంచి 1950

వరకు; భారతరాష్ట్రపతి (ప్రెసిడెంట్), 1950 జనవరి 26 నుంచి. అడ్రస్; రాష్ట్రపతి భవన్, న్యూఢిల్లీ.

రాధాకృష్ణ, డాక్టర్ సర్వేపల్లి; జననం; 1888 సెప్టెంబరు 5. కొంతకాలం మదరాస్ ప్రెసిడెన్సి కాలేజిలో వేదాంతాచార్యులు. కాశీ విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సెలరుగా ఉన్నారు. ఆక్స్‌ఫర్డు యూనివర్సిటీలో స్పాల్డింగు ప్రొఫెసర్ ఆఫ్ ఈస్టర్న్ రెలిజియెన్సు, 1936. బ్రిటిషు అకాడెమిలో సభ్యత్వాన్ని పొందిన ప్రథమ భారతీయులు. వేదాంత శాస్త్రంమీద అనేక గ్రంథాలు వ్రాశారు. ఆంధ్రమహాసభ అధ్యక్షులు, 1938. ప్రజాపరిషత్తు సభ్యులు, 1946-49; రష్యాలో ఇండియా రాయబారి 1949-52; ఇండియా వైస్-ప్రెసిడెంట్‌గా 1952 ఏప్రిల్ లో ఎన్నుకోబడినారు. అడ్రస్. 2; కింగ్ ఎడ్వర్డ్‌రోడ్, న్యూఢిల్లీ.

రామకృష్ణ, వెలగపూడి; జననం, 4 మార్చి 1896; ఎం. ఎ., బి. ఎస్. సి., ఎడింబరో, లండన్, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలలో; 1922 లో ఐ. సి. ఎస్. లో చేరి సబ్‌కలెక్టర్, కలెక్టర్, పరిశ్రమల శాఖ డైరెక్టర్, లేబర్ కమీషనర్, నేషనల్ సర్వీస్ లేబర్ ట్రిబ్యూనల్ చైర్మన్, రీసెటిల్మెంట్ అండ్ ఎంప్లాయిమెంట్ శాఖ డైరెక్టర్‌గాను ఉద్యోగాలను నిర్వహించి, మదరాసు ప్రభుత్వ డెవలప్ మెంట్ కమీషనర్‌గా వుండగా 1947 లో పదవినుంచి రిటైరయారు. కేంద్ర శాసన సభలో సభ్యులుగా నామినేట్ చేయబడినారు. 1952 లో మదరాసు అసెంబ్లీ సభ్యులచే కౌన్సిలు సభ్యులుగా ఎన్నుకోబడినారు. కృషికార్ లోక్ పార్టీ సభ్యులు; యూరప్, అమెరికా, జపాను దేశాలలో చాలాసార్లు సంచారం చేసి వచ్చారు. ఆంధ్ర సిమెంటు కంపెనీ, జయపూర్ సుగర్ కంపెనీ, జయపూర్ మైనింగ్ సిండికేట్, కావేరి సుగర్స్ అండ్ కెమికల్స్ కంపెనీలకు చైర్మన్; కె. సి. పి. లిమిటెడ్‌కు మేనేజింగ్ డైరెక్టర్; అడ్రస్: 55, పీటర్స్‌రోడ్, రాయపేట, మదరాసు-6.

రామకృష్ణప్రసాద్, శ్రీ రాజా యార్లగడ్డ; చల్లపల్లి రాజాగారి సోదరులు; జననం, 1919 డిసెంబర్ 11; బి. ఏ. ఆనర్స్, బి. ఎల్. మదరాసు; మేనేజింగ్ డైరెక్టర్, సారథి ఫిలిమ్సు లిమిటెడ్; డైరక్టర్, ఆంధ్ర సైంటిఫిక్ కంపెని; ది కె. సి. పి. కన్ఫెక్షనరీ లిమిటెడ్; అడ్రసు: చల్లపల్లి, కృష్ణాజిల్లా.

రామకృష్ణరాజు, అర్. బి. జననం, 1891 ఫిబ్రవరి 10; 1921 లో బి. ఎల్. పట్టాన్ని పొంది, చిత్తూరులో ప్రాక్టీసు ఆరంభించారు, 1926 నుంచి 1935 వరకు కార్వేటినగరం తాలూకా బోర్డు ప్రెసిడెంటుగాను, చిత్తూరు జిల్లాబోర్డు ఉపాధ్యక్షులుగాను వున్నారు. 1937 లో కాంగ్రెస్ అభ్యర్థిగా మదరాస్ అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు. 1940 వ్యక్తి సత్యాగ్రహంలో ఒక ఏడాది జెయిలు. 1942 ఉద్యమంలో 1944 వరకు నిర్బంధంలో వుంచబడినారు. 1946 లో మదరాసు కౌన్సిలు సభ్యులుగా ఎన్నుకోబడినారు. మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు అధ్యక్షులు 1946-52, అడ్రస్; చిత్తూరు.

రామకృష్ణరావు, బూర్గుల జననం, 13 మార్చి 1899. బొంబాయి విశ్వవిద్యాలయంలో న్యాయవాది పట్టాన్ని పొంది, 1924 లో హైదరాబాదుకు వచ్చి ప్రాక్టీస్ పెట్టపోగా ఖద్దరు కట్టుకున్నారనే కారణంచేత రెసిడెన్సీ కోర్టులో వీరికి అనుమతి లభించలేదు. ఏడాదిన్నర అనంతరం ప్రాక్టీసు ప్రారంభించారు. 1943 తరువాత మూడుసార్లు అరెస్టయారు. రెండుసార్లు శిక్ష లేకుండా విడుదల; మూడోసారి మూడు మాసాల ఖైదు. సంస్థాన కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు; హైదరాబాదు ప్రభుత్వ రెవిన్యూ విద్యాశాఖ మంత్రి 1950-52; ముఖ్య మంత్రి 1952 నుంచి; అడ్రస్: హైదరాబాద్. (దక్కను)

రామచంద్రమూర్తి, ఏలేశ్వరపు, జననం, 1914 జనవరి; ఎం. ఎ. (మదరాస్) 1935; ఇండియన్ బాంకర్స్ ఇన్‌స్టిట్యూటులో సర్టి